ఆయుర్వేద శిక్ష చతుర్థస్కంధము

# 4

# రసౌషధవిజ్ఞానము


సంపాదకులు:

ఆయుర్వేదోద్ధారక, భిషగ్రత్న,

డా॥ ఆచంట లక్ష్మీపతి, బి. ఏ., యమ్. బి., & సి. యమ్.






ప్రచురణ:

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1989

# ముందుమాట

ఆయుర్వేదో ధనుర్వేదో గాంధర్వశ్చేతి తే త్రయః
అర్థశాస్త్రం చతుర్థం తు విద్యా హ్యష్టాదశ స్మృతాః.

ఆయుర్వేదం అష్టాదశవిద్యలలో ఒక్కటి. అతిప్రాచీనమైనది. అశ్వనీదేవతలు దేవవైద్యులనీ, ఇంద్రాదులకు చికిత్సలు చేశారనీ పురాణాలు చెపుతున్నాయి. అమృతం అజరత్వమునూ, అమరత్వమునూ, ప్రసాదించే రసాయనం కదా! అది సముద్ర మథన సమయంలో ధన్వంతరిచే వెలికి తీసుకరాబడింది. సోమ యాగంలో సోమలత నుపయోగింపబడటం అందరెరిగినవిషయమే. చంద్రుడికి ఓషధీశుడనిపేరు. వెన్నెలచేత అనేకములైన ఓషధులు పరిపుష్టములై ప్రజోపయుక్తము అవుతున్నది. సంజీవని అనే ఓషధిని తెచ్చి హనుమంతుడు మూర్ఛితులైన వానరులకు ప్రాణ దానం చేశాడు. ఈవాడుకూడా కొందరు శల్యవైద్యులు పరంపరగా అకువసరుతో, విరిగిన ఎముకలను పరిచేసి మహోపకారం వల్పడం జగద్విదితమే.

ఆయుర్వేదవిద్య వేదకాలంనుంచి భారతీయుల ఆదరాభిమానాలతో బహుముఖంగా అభివృద్ధిచెందిన అమోఘ ప్రక్రియ అనడం నిస్సందేహం. పరదేశీయుల వైద్యవిధానం భారత దేశంలో చక్కగా పాతుకపోవడంవల్ల, పైగా ఆ విధానం స్వల్ప కాలంలో, తాత్కాలికమైనా, ఉపశమనం కూర్చడంవల్ల జన సామాన్యం దానిపై మోజు చూపడంవల్ల మన ఆయుర్వేదం అంతగా ముందుకురాలేక పోతున్నది.

ఈ స్థితిలో ఆయుర్వేద వైద్యవిధానమును ఉద్ధరించుటకు చేయదగిన ప్రయత్నాలలో అతిముఖ్యమైనది ప్రాచీనాయుర్వేద గ్రంథాల పునర్ముద్రణ. ఆ పుస్తకాల కోవకు చెందినగ్రంథం ఈ "రసౌషధవిజ్ఞానము", ఈ గ్రంథ సంపాదకులు డాక్టరు (స్వ)

అచంట లక్ష్మీపతిగారు ఆయుర్వేద అభివృద్ధికి అహర్నిశలు కృషి చేసిన మహనీయులు వారు.

భిషగ్రత్న లక్ష్మీపతిగారి సంపాదకత్వమున వెలువడిన ఈ అమూల్య గ్రంథములో రసము – దాని స్వరూప స్వభావములు, పుటాదులు వేయవలసిన విధానము, రోగములపై దాని ఉపయోగము విపులముగా చర్చింపబడినది. మరియు అనేక మూలికలు, లోహములు, రత్నములు వాటి భేదములు, నాణెము గుర్తించు విధానము శుద్ధిపరచురీతి తెలుపబడియున్నది.

పలురకముల రోగములను మాన్పగల భస్మములు, రసములు, రసాయనములు, లేహ్యములు తయారుచేయవలసిన విధానము ఈగ్రంథం చక్కగా వివరించి చెపుతుంది.

తి. తి. దేవస్థానంవారు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ఆయుర్వేద కళాశాలను స్థాపించి ఐదుసంవత్సరముల కోర్సు ప్రవేశ పెట్టటమేగాక రెండు ఆయుర్వేద చికిత్సా కేంద్రాలుకూడా నిర్వహిస్తున్నారు.

ఆయుర్వేద కళాశాలలో వైద్య విద్య నభ్యసించే విద్యార్థులకేకాక ఆరోగ్యాన్ని అభిలషించే జనసామాన్యమునకు గూడ ఎంతో ఉపకరిస్తుందని మా విశ్వాసం. ఈ గ్రంథమును తి. తి. దేవస్థానమువారు స్వీయ ప్రచురణగా స్వీకరించి పునర్ముద్రణ చేయగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సి. హెచ్. వేంకటపతిరాజు,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి

ముదివర్తి కొండమాచార్యులు,
Asst to the Controller of
Publications
20—9—89.

# పీఠిక

ఆయుర్వేదశిక్ష - ఔషధస్కంధమునందలి నాల్గవభాగము
రసౌషధ విజ్ఞానమనువిషయము ప్రథమభాగముయొక్క సంపాదకీయ
ప్రస్తావననుబట్టి పాఠక మహాశయులకు విదితమే గదా!

వ్యాధిసామాన్యమునకు జేయు చికిత్స 'దైవవ్యపాశ్రయము,
యుక్తివ్యపాశ్రయము, సత్త్వావజయము' అని మూడువిధములుగా నున్నది.
అందు చరకాదులచే నీత్రివిధ చికిత్సలలో మణిమంత్రాదిరూపము
దైవవ్యపాశ్రయముగా జెప్పబడి, తత్తత్ప్రకరణములందు ఆయావిధాన
ములు నిరూపింపబడినవి. అయితే, రసతంత్రప్రవర్తకులు "సాదైవీ"
త్యాదివాక్యములచే రసముతో జేయబడు చికిత్సయే దైవవ్యపాశ్రయ
చికిత్సయని తెలిపియున్నారు. అందుచే నీ విషయములో మతభేదము
గాన్పించుచున్నది. ఏది యెటులున్నను అనేకవ్యాధులలో రసౌషధ
ప్రయోగముచే రోగి యతిశీఘ్రముగా వ్యాధివిముక్తుడగుట తథ్యము.
ఈ విషయమునుగురించిన వివరము లీగ్రంథమునందలి యుపోద్ఘాత
ప్రకరణమునందు జూడనగును.

రసతంత్రప్రవర్తకులు తమచికిత్స కనేక ఖనిజములను గ్రహించి
యున్నారు. వీటిసమ్మేళనముతో తమచికిత్సాభాగమును విస్తరింప
జేసిరి. అయితే వీరలు కేవలము పాదరసమునకే ప్రాధాన్యత నిచ్చి
నట్లును, మిగిలిన ఖనిజములను ఆ రసముతో నయ్యది సర్వవ్యాధులందుప
యోగపడుట కనువగునటుల సంయోగపరచుటకు వానిని గ్రహించి
యున్నట్లును తత్తత్ప్రకరణములందలి "సూతబంధనకారకాః....,"
అను మున్నగు వాక్యములచే తెలియగలదు. కాని, అంతమాత్రమున
రసేతరఖనిజములకు స్వతంత్రప్రయోగార్హత లేదని తలంపరాదు.
అవియు సర్వవ్యాధులందు స్వతంత్రముగ ప్రయోగింపబడుచునే
యున్నవి. అయితే రసశాస్త్రమునం జెప్పుటజూచినను బాహుళ్యముగ

నయ్యెవి రసముతో మిశ్రము జేసి యుపయోగింపబడినట్లు దెలియుచున్నది గాని, వాటికి వ్యస్తప్రయోగములంతగా నున్నట్లు గానరాకున్నది. ఇందుచే నీ శాస్త్రమున పాదరసమే ప్రధానద్రవ్యమని వారిచే గ్రహింపబడినట్లు జెప్పవలసి వచ్చుచున్నది.

చరక సుశ్రుతాదులు తమతమ సంహితలలో ద్రవ్యవిభాగమును జేయునప్పుడు పార్థివవర్గములో నీ ఖనిజములను దెలిపియుండియు, వీనిని తమతమ చికిత్సాభాగములలో విరివిగా బ్రయోగింపక కేవలము వనస్పతులనే యేల స్వీకరించియున్నారో చెప్పుటకు వీలుగాకయున్నది. వీరియుపేక్షనుబట్టి యూహింపగా వారికి సమకాలమునందుగాని, పూర్వకాలమునందుగాని యీ ఖనిజద్రవ్యములతో జేయబడు చికిత్స ప్రత్యేకముగ వాడుకలో నొక తెగవారిచే నవలంబింపబడుచున్నట్లు తెలియగలదు. అటులగానిచో నంతప్రఖ్యాతమైన చికిత్సాశాస్త్రము యొక్క ప్రవర్తకులగు నాచరకాదులు తమగ్రంథములందు ఖనిజేతర ద్రవ్యములకంత ప్రాధాన్యతనొసంగి, యీ ఖనిజముల కచ్చటచ్చట మిగుల స్వల్పప్రయోగములను మాత్రమే దెలుపుచు నటుల తటస్థముగ నుండుటకు తగిన ప్రబలమైన హేత్వంతరము గానుపించకున్నది.

ఈ శాస్త్రము క్రీస్తుపూర్వమునందు ప్రవర్తింపజేయ బడినట్లుగా చారిత్రకవర్గమువారు దెలుపుచున్నారు. కాని కొన్ని ప్రమాణాంతరములచే నిద్యది క్రీస్తుకు పూర్వముననే బ్రవర్తింపజేయబడినట్లు జెప్పవలసియున్నది. ఈ శాస్త్రప్రవర్తకులొక లోహమును మరియొక లోహముగా బరిణమింపజేయుటకు వలయు పరిశోధనలు వేదకాలమునందే జేసియున్నట్లు ఈ క్రిందివచనములనుబట్టి స్పష్టమగుచున్నది. అందు వెండి బంగారముగా మార్చబడినట్లు సూచించు మంత్రమిట్లు దెలుపబడినది.

'తద్దుర్వర్ణం హిరణ్యమభవత్। తద్దుర్వర్ణస్య హిర
ణ్యస్యజన్మ। సద్వితీయ మతప్యత। సోఽతామ్యత్।

సప్రాజ్ గ్న్యాధత। ...తత్సువర్ణం హిరణ్యమభవత్।
...యఏవం సువర్ణస్య హిరణ్యస్య జన్మ వేద।
సువర్ణ ఆత్మనాభవతి। దుర్వర్ణోఽస్య భ్రాతృవ్యః॥”
(తై-బ్రా. అ 2 - ప్ర 2 - అను 4.)

మరియు, నీకాలమున ఖనిజములతో చేయుచికిత్సగూడా నీ క్రిందివాక్యము తెలుపుచున్నది.

“శీసం సరస్వతీభిషక్। సీసేన దుహ ఇంద్రియం॥”
(తై-బ్రా-అ 2. ప్ర 6. అను 11.)

అని వేదములలో గలదు.

చరకమునందును ఈ క్రిందిప్రయోగముచే రసౌషధచికిత్స ప్రచారములో నుండెనని తెలియగలరు.

(1) “పఞాత్యస్మై చోద్ధృత్య కనక రజత తామ్ర ప్రవాళ కాలాయస చూర్ణాష్టభాగ సంయుక్తం॥”
(చ-చి-అ. 1 - పా. 1-58.)

(2) “సమనశ్శిలాః। నేత్రాంజనం...... మణీనామౌషధీనాంచ మాంగల్యానాం విషస్యచ। ధారణా దగదానాంచ సేవనాన్న భవేజ్జ్వరః॥”
(చ-చి-అ 3-306, 309.)

(3) “వైడూర్యముక్తా మణిగైరికానాం మృచ్ఛంఖ హేమామలకోదకానాం। ...పానాచ్ఛమంగచ్ఛతి రక్తపిత్తం॥”
(చ-చి, అ 4-79.)

(4) “పంచమూలీ కషాయేణ సక్షీరేణ శిలాజతు। పిబే త్తస్య ప్రయోగేణ వాతగుల్మాత్ప్రముచ్యతే॥”
(చ-చి-అ 5-89.)

(5) "తేలీత ప్రయోగో రసేనజాత్యా॥ సమ
పరమః। సప్తదశ కుష్ఠఘాతీ మాక్షిక ధ
మాత్రేణ। శ్రేష్ఠం గంధక యోగాత్ సువర్ణమ
ప్రయోగాద్వా। సర్వవ్యాధి నిబర్హణమద్యాత్
రసంచ నిగృహీతం॥ వజ్రశిలాజతు సహితం స
వా యోగరాజేన సర్వవ్యాధి ప్రశమనః
త్కాంక్షీ నిగృహ్యనిత్యంచ॥"

(చ-చి. అ 7-70,

అని చరకమున రసగంధకాది ఖనిజముల ప్రయోగములు
వ్యాధులందు దెలుపబడినవి.

(1) "ఊషక సైంధవ శిలాజతు కాసీస ద్వయహిం
తుత్థకంచేతి। ఊషకాదిః...అశ్మరీ శర్కరా
కృచ్ఛ్రగుల్మ ప్రణాశనః॥"

(సు-సూ. అ 38-37,

(2) "అంజన రసాంజన నాగపుష్ప...అంజనాది
హేభ్యమ రక్తపిత్త నిబర్హణః॥"

(సు-సూ-అ 38-4

(3) "కాసీసం రోచనాంతుత్థం హరితాలం మనశి
...మాసాదూర్ధ్వం తతస్తేన కృష్ణ మా
ద్వ్రిణం॥" (సు-చి-అ 1-97

(4) "సౌరాష్ట్రీ గైరికం తుత్థం పుష్పకాసీస సైం
రోధ్రం రసాంజనం దార్వీం హరితాలం మనశి

....తచ్చూర్ణం క్షౌద్రసంయుక్తం ఉపదం శేషు
పూజితం॥''                                              (సు-చి-అ 19-41.)

(5) ''వైడూర్యం యత్ స్ఫాటికం వైద్రుమంచ మౌక్తం
శాంఖం రాజతం శాతకుంభం। చూర్ణం సూక్ష్మం
శర్కరా క్షౌద్రయుక్తం శుక్తింహాన్యా దంజనంచైత
దాశు॥''                                              (సు-ఉ-అ 10-16.)

(6) ''మండూర లోహాగ్నివిడంగ పథ్యా వ్యోషాంశకః
సర్వసమాన తాప్యః। .... పాండ్వామయంహాన్త్య
చిరేణఘోరం॥''                                              (సు-ఉ-అ 44-23.)

ఈ మున్నగు ఖనిజప్రయోగములు సుశ్రుతమునగూడ దెలుపబడి యున్నవి. ఇటుల చికిత్సావిషయములనుబట్టి చూడగా నీశాస్త్రము క్రీస్తుకు పూర్వముననే వ్యాప్తిలోనున్నట్లు విశదమగుచున్నది.

రసశాస్త్రప్రవర్తకులు. పాదరసమున కత్యంతప్రాముఖ్యత నొసంగియున్నట్లు ఇంతకుముందే జెప్పియున్నాము. రసము మిక్కిలి శక్తివంతమైనది. దీని ప్రభావమును శ్రీభగవద్గోవింద పాదులిట్లు దెలిపియున్నారు.

''పరమాత్మనీవ నియతం భవతి లయోయత్ర భవతి
సర్వసత్వానాం। ఏకోఽసౌరస రాజః శరీరమజరా
మరం కురుతే॥'                                              (ర-హృ.)

మరియు,

''మూర్ఛితో హరతి రుజం బంధన మనుభూయముక్తి
దోభవతి। అమరీ కరోతి సుమృతః కోఽన్యః కరు
ణాకరః సూతాత్॥''                                              (ర-హృ.)

మరియు, నిత్యనాథసిద్ధుడు—

"సిద్ధే రసే కరిష్యామి నిర్వ్యాధిత్వ మిదంజగత్"

అనియు,

"నిర్దారిద్ర్యమిదం జగత్"

అనియును దెలిపియున్నాడు. ఇటుల నీ రససిద్ధులు పాదరసముపైననేక పరిశోధనలు జేసి, తత్ప్రభావమును లోకమునకు పైవిధముగ దెల్లడించియున్నారు. ఇక నిట్టిరస సమ్మిశ్రితములైన యౌషధముల సహాయమున జేయబడు చికిత్సా ప్రభావమును గురించి వేరుగ జెప్పవలెనా?

ఈ రసౌషధవిజ్ఞానము మిక్కిలి విపులమైనది. ఈ శాస్త్రము నంతను మేము తిరిగి యాంధ్రమున వ్రాయుట యసమంజసమగును. కాని యందలి ముఖ్యసూత్రములను ఆయుర్వేదము నభ్యసించువారలకు సులభముగ బోధయగునటుల విమర్శించి యీ గ్రంథమున సమకూర్చియున్నాము. ఇయ్యది ఖనిజవర్గము, విషవర్గము, జాంతవవర్గము అను మూడు విభాగములతో గూడియున్నది.

అందు ఖనిజవర్గమున పాదరసముయొక్క సంస్కారములు కొంతవరకు విపులముగ చర్చింపబడినవి. మిగిలినవి రసవాదముకొరకు జెప్పబడినవిగాన యవ్వి యిందు విడువబడినవి. సర్వసామాన్యముగ వ్యాధులం దుపయోగింప దగియున్నవిగాన ఉపరసములకును, లోహ-ఉపలోహములకును, రత్న-ఉపరత్నములకును శోధనమారణములు మాత్రమే వర్ణింపబడినవి. మరియు నా ఖనిజద్రవ్యము జేరియున్నట్టియు, వ్యవహారములో ప్రసిద్ధికెక్కినట్టియు, నత్యంతఫలప్రదమగునట్టియు రసౌషధయోగములును, వాని నిర్మాణవిధానములును, అందందు స్వానుభూత విధానములును ప్రతిద్రవ్యముయొక్క కడపట జేర్చియున్నాము. ఈ యోగములు వైద్యవిద్యాభ్యాసకులకును, వైద్యాభ్యాసకులకును కూడ మిక్కిలి యుపయోగకరములుగా నుండునని మాయాశయము.

ఈ రసౌషధములయొక్కయు, ఇతరౌషధముల యొక్కయు సూచికను విషయసూచికతో జతపరచి యున్నాము. మరియు, రసౌషధనిర్మాణము నకును, వానిశోధన మారణాదిసంస్కారములకును అనేకములగు ఉపకరణము లవసరములుగాన, అవి ప్రస్తుతమెంతవరకు గావలసి యున్నవో వానిని తత్తత్ప్రకరణములందు వివరించియున్నాము. శాస్త్రమునందలి సాంకేతిక పదముల (పారిభాషిక పదముల) యొక్క వివరణముగూడా తత్తత్ప్రసంగములందు గావింపబడినది. మరియు, నవసరములని తలపబడునట్టి మానపరిభాషయు, మరికొన్ని యంత్ర పుటాదుల వివరణమును పరిశిష్ట ప్రకరణమున జేర్చియున్నాము.

విషవర్గమను రెండవభాగమున విషముయొక్క స్వరూపము, వాని యధిష్ఠానభేదములు, వానిమాత్రాపరిమితి, ప్రస్తుతము లభించునట్టి స్థావరవిషములయొక్కయు, జాంతవవిషములయొక్కయు ప్రత్యేకగుణ ములు, వీటికి శోధనను, మాత్రాధిక్యతచే గలుగు వికారములు, తత్తద్వి కారశమనోపాయములు మున్నగునవి వర్ణింపబడినవి.

మూడవభాగమగు జాంతవవర్గమున జాంతవద్రవ్య నిరూపణము, అందు హెచ్చుఉపయోగములోనున్న కస్తూరి, గోరోజనము, లాక్షు, మధు, మధూచ్ఛిష్టము, క్షీరవర్గము, క్షీరవికృతులగు దధితక్రనవనీత ఘృతవర్గములు, మూత్రవర్గము వీని నిరూపణము, గుణవర్ణనముఅను విషయములు చేర్చబడినవి. ఈ జాంతవములలో నింకను అనేకములు చెప్పబడియున్నను వాటికి సకృత్ప్రయోగములు మాత్రమే యుండుటం జేసి వానినెల్ల గ్రంథవిస్తరభీతిచే నిందుజేర్చక విడిచిపెట్టితిమి.

ఇటుల శాస్త్రసాంప్రదాయములకు విరుద్ధముగాక యథోక్త విధానమున నీ శాస్త్రమునందలి విషయములు ఎల్లరకును సులభముగ

తెలియునట్లు ఇందు వివరింప బ్రయత్నించితిమి. ఇట్టి గ్రంథము నాయుర్వేదము నభ్యసించువారలును, ఆయుర్వేదాభిమానులును సాదరమున స్వీకరించుదురని ఆశించుచున్నాము.

ఇది మా ప్రథమప్రయత్నమగుటచే ననేక లోపములుండవచ్చును. విజ్ఞులీవిషయములను సాదరముతో తెలిపినచో రెండవసారి వానినెల్ల కృతజ్ఞతతో సవరించుకొందును.

ఈ గ్రంథరచనకు మూలకారణభూతులును, అస్మద్గురువర్యులును, ప్రాణాచార్య, ఆయుర్వేదోద్ధారక, భిషగ్రత్నేత్యాది బిరుదాంకితులును, అగు శ్రీ శ్రీ శ్రీ ఆచంట లక్ష్మీపతి., బి. యే., యమ్. బి. సి. యమ్. మహాశయులకు నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుడు
ఇం॥ వేం॥ శర్మా.
గ్రంథకర్త.

# విషయసూచిక

## ఆయుర్వేదశిక్ష - ఔషధస్థానము.

## ద్వితీయసంపుటము. 4–వ భాగము

## రసౌషధ విజ్ఞానము

N. B, ఫుట్‌నోటులో వ్రాయబడిన విషయముగూడ మిగుల ముఖ్యమైనదగుటచే దానినిగూడ నీ విషయసూచికలో చేర్చియున్నాము. *F* అను గుర్తు ఫుట్‌నోటులోని విషయమని సూచించును.

| విషయము | పుట |
|---|---|
|  |

## 5-వ అధ్యాయము

## 6-వ అధ్యాయము

## 8-వ అధ్యాయము

రసౌషధ విజ్ఞానము

# ఔషధయోగసూచిక

## రసౌషధ యోగములు

## ఇతరౌషధయోగములు

రసౌషధ విజ్ఞానమునం దుదహరింపబడిన

# గ్రంథములపేర్లు—వాని సంకేతములు

| | | | |
|---|---|---|---|
| రసరత్నసముచ్చయము | ... | ... | ర-ర-స. |
| రసేంద్రసారసంగ్రహము | ... | ... | ర-సా-సం. |
| ఆయుర్వేదప్రకాశ | ... | ... | ఆ-ప్ర. |
| రసరత్నాకరము... | ... | ... | ర-రత్నాకర. |
| రసమంజరి | ... | ... | ర-మం. |
| ఆనందకందము | ... | ... | ఆ-కం. |
| భావప్రకాశ | ... | ... | భా-ప్ర. |
| రసపద్ధతి | ... | ... | ర-ప. |
| రసరత్నాకరము | ... | ... | ర-ర. |
| రసహృదయతంత్రము | ... | ... | ర-హృ. |
| రసకామధేను | ... | ... | ర-కా. |
| పారదసంహిత | ... | ... | పా-సం. |
| బసవరాజీయము | ... | ... | బ-ర. |
| వైద్యచింతామణి | ... | ... | వై-చిం. |
| రసయోగరత్నాకరము | ... | ... | ర-యో-ర. |
| ఆంధ్రవైద్యచింతామణి | ... | ... | ఆం-వై-చిం. |
| భైషజ్యరత్నావళి | ... | ... | భై-ర. |
| రసకామధేను | ... | ... | ర-కా-ధే. |
| రాజనిఘంటు | ... | ... | రా-ని. |
| రసప్రకాశసుధాకరము | ... | ... | ర-ప్ర-సు. |
| అష్టాంగహృదయ ఉత్తరస్థానము | ... | ... | అ-హృ-ఉ. |

శార్ఙ్గధరసంహిత ... ... శార్ఙ్గ-సం.

ఆయుర్వేదవిజ్ఞానము ... ... ఆ-వి.

యోగరత్నాకరము ... ... యో-ర.

ఆంధ్రఆయుర్వేద ఫార్మసీ ఔషధయోగములు. ఆం-ఆ-ఫా-ఔ-యో.

రససంకేతకలిక ... ... ర-సం-క.

అష్టాంగహృదయచికిత్సాస్థానము ... ... అ-హృ-చి.

శాలిగ్రామనిఘంటు ... ... శా-ని.

ధన్వన్తరినిఘంటు ... ... ధ-ని.

గదనిగ్రహము ... ... గ-ని.

సుశ్రుతసంహిత ... ... సు-సం.

రసేంద్రభాస్కరము ... ... ర-భా.

వాగ్భటఉత్తరస్థానము ... ... వా-ఉ.

రాజవల్లభనిఘంటు ... ... రా-వ.

నిఘంటు ఆదర్శము ... ... ని-ఆ.

అనుపానమంజరి ... ... అ-మం.

చరకసూత్రస్థానము ... .. చ-సూ.

చరకచికిత్సాస్థానము ... ... చ-చి.

సుశ్రుతచికిత్సాస్థానము ... ... సు-చి.

సుశ్రుతఉత్తరస్థానము ... ... సు-ఉ.

సుశ్రుతకల్పస్థానము ... ... సు-క.

బృందమాధవము ... ... బృంద.

చక్రదత్త ... ... చ-ద.

వైద్యమనోరమ ... ... వై-మ.

నిఘంటురత్నాకరము ... ... ని-ర.

శోఢలనిఘంటు ... ... శో-ని.

శివదత్తనిఘంటు ... ... శి-ద.

సుశ్రుతశారీరస్థానము ... ... సు-శా.

రాజమార్తాండము ... ... రా-మా.

వంగసేన ... ... వం-సే.

హారీతసంహిత ... ... హా-సం.

వైద్యజీవనము ... ... వై-జీ.

వాగ్భటశారీరస్థానము ... ... వా-శా.

వైద్యనిఘంటు ... ... వై-ని.

బృహద్యోగతరంగిణి ... ... బృ-యో.

వైద్యకశబ్దసింధు ... ... వై-శ-సిం.

చరకకల్పస్థానము ... ... చ-క.

సుశ్రుతసూత్రస్థానము ... ... సు-సూ.

ఆత్రేయసంహిత ... ... ఆ-సం.

వాగ్భటచికిత్సాస్థానము ... ... వా-చి.

బృందమాధవము ... ... బృం-మా.

వాగ్భటము ... ... వా.

రసజలనిధి ... ... ర-జ.

రసతరంగిణి ... ... ర-త.

అష్టాంగసంగ్రహసూత్రస్థానము ... ... అష్ట-సం-సూ.

కాశ్యపసంహిత సిద్ధిస్థానము ... ... కాశ్యప-సిద్ధి.

అష్టాంగహృదయసూత్రస్థానము ... ... అ-హృ-సూ.

పరిభాషాప్రదీపిక ... ... ప-ప్ర.

ద్రవ్యగుణసంగ్రహము ... ... ద్ర-గు-సం.

సర్వౌషధిగుణకల్పము ... ... స-గు-క.

# ఆయుర్వేద శిక్ష

## (A Text-book of Ayurveda)

ద్వితీయ సంపుటము

ఔషధస్థానము

4-వ భాగము

# రసౌషధవిజ్ఞానము

(ఖనిజవర్గము)

1-వ అధ్యాయము

## ఉపోద్ఘాతము

శ్లో॥ యద్గండమండలగల న్మధువారిబిందు
పాంపాలసాతినిభృతా లలితాలిమాలా ।
సద్గుంజితేన వినిహన్తి నవేంద్రనీల
శంకాం సవోగణపతిః శివమాతనోతు ॥

శ్లో॥ ఇందీవరీభవతి యచ్చరణారవింద
ద్వంద్వే పురందర పురస్సర దేవతానాం ।
వందారుతాకలయతాం సుకిరీటకోటిః
శ్రీశారదా భవతు సా భవపారదా వః ॥

శ్లో॥ ఆధివ్యాధి సమూహపాటనపటు ర్దారిద్ర్యవిద్రావణో
లోకద్విష్టజరాపరాక్రమహరః పాపౌఘ నిర్నాశకః ।

స్వేచ్ఛాహార విహారసౌఖ్యజననో దివ్యాష్టసిద్ధిప్రదః
శ్రీ శంభోః కరుణారసోరసవర స్తస్మైనమో మోభువి ॥

అనంతకళ్యాణ గుణప్రదమగు పాదరసమును బురస్కరించుకుని ప్రవర్తింపజేయబడినదియగుటచే నీ శాస్త్రము రసశాస్త్రమని చెప్పబడును. పాదరస మత్యంత రసాయన మగుటంజేసి దీనికి రసాయన శాస్త్రమని గూడ వ్యవహారము గలదు. ఈ రసాయన చికిత్సచే సిద్ధి బొందినవార లనేకులుగలరు. వారు సిద్ధులని వ్యవహరింపబడు చున్నారు.
(దర్శనములు 519-వ పుట చూడుము.)

## రససిద్ధులు

శ్లో॥ ఆదిమశ్చంద్రసేనశ్చ లంకేశశ్చ విశారదః।
కపాలీ మత్తమాండవ్యో భాస్కర శ్శూరసేనకః॥
రత్నఘోషశ్చ శంభుశ్చ సాత్వికో నరవాహనః।
ఇంద్రదో గోముఖశ్చైవ కలంబిర్వ్యాడి రేవచ॥
నాగార్జున స్సురానందో నాగబోధీయశోధనః।
ఖండః కాపాలికో బ్రహ్మ గోవిందో లంపకోహరిః
సప్తవింశతి సంఖ్యాకాః రససిద్ధి ప్రదాయకాః॥
ర-ర-స.

అట్టి సిద్ధులలో ఆదిముడు, చంద్రసేనుడు, లంకేశుడు, విశారదుడు, కపాలి, మత్తుడు, మాండవ్యుడు, భాస్కరుడు, శూరసేనుడు, రత్నఘోషుడు, శంభువు, సాత్వికుడు, నరవాహనుడు, ఇంద్రదుడు, గోముఖుడు, కలంబి, వ్యాడి, నాగార్జునుడు, సురానందుడు, నాగబోధి, యశోధనుడు, ఖండుడు, కాపాలికుడు, బ్రహ్మ, గోవిందుడు, లంపకుడు, హరి యనువారలు ముఖ్యులు. వీరలు రససిద్ధిని బడసి యీ శాస్త్రీయచికిత్స ననేకవిధములుగా విస్తరింపజేసిరి. ఈ చికిత్స మంత్ర

తంత్ర యంత్రాదులతో గూడినది యగుటంజేసి దైవ చికిత్సయని గూడ వ్యవహరింపబడుచున్నది. దీనియందు గ్రహింపబడిన ఖనిజము లనేకములు గలవు. అందు పాదరసము ప్రధానమైనది. ఇతరములగు ఖనిజములలో గొన్ని మహారసములు, ఉపరసములు, సాధారణ రసములు అని * కొందరిచేతను, కేవలము ఉపరసములని మరికొందరిచేతను † చేర్పఁబడినవి. మరికొన్ని ఖనిజములు రత్నములుగను, మరికొన్ని ధాతువులుగను జెప్పబడినవి. కొందరీ రత్నములలో గొన్నింటిని ప్రధానరత్నములుగను, కొన్నింటిని యుపరత్నములుగను, ధాతువులలో గొన్నింటిని ప్రధానధాతువులుగను, గొన్నింటిని యుపధాతువులుగను ‡ జెప్పియున్నారు.

ఇవి యెల్ల ప్రధానమగు రసనామక ద్రవ్యమునకు రసాయనత్వమును సిద్ధింపజేయుటకై యీ శాస్త్రమున గ్రహింపబడినవి. అట్లని వీటికి వ్యాధులందు ప్రయోగార్హత లేదని తలంపరాదు. ఇవియు రసమువలె సమస్త వ్యాధులం దుపయోగింపదగినవియే. ఇటుల రసాది ద్రవ్యోపకరణములచే జేయబడు నీ రస చికిత్స యితర చికిత్సలన్నింటిలో నుత్తమమైనదిగా దెలియదగినది.

---

* రస వాగ్భటుడు రసరత్న సముచ్చయమున నీ విధముగ చేర్పఁని యున్నాడు.

† మంథాన భైరవుడు ఆనంద కందమునందును, మాధవాచార్యుడు ఆయుర్వేద ప్రకాశయందును అటుల జెప్పియున్నారు. మరియు నీ మాధవాచార్యుడు రసవాగ్భటుని చే మహారసాదివర్గములలో చేర్పఁబడిన గొన్ని ఖనిజముల నుపధాతువులనుగా గ్రహించియున్నాడు.

‡ మంథాన భైరవుడును, మాధవాచార్యుడును అటుల నుపరత్నములను, ఉపధాతువులను జెప్పియున్నారు.

## రసౌషధమునకు శ్రేష్ఠత

శ్లో॥ సాధ్యేష్వభేషజం సర్వం ఈరితం తత్వవేదినా।
అసాధ్యేష్వపిదాతవ్యో రసోఽతః శ్రేష్ఠ ఉచ్యతే॥
ర-సా-సం.

అల్పమాత్రోపయోగిత్వా దరుచే రప్రసంగతః।
క్షిప్రమారోగ్యదాయిత్వా దౌషధేభ్యోఽధికోరసః॥
ర-సా-సం.

ముక్త్వైకంరసవైద్యంతు లాభం పూజాం చ కీర్తనం।
తృణకాష్ఠౌషధైర్వైద్యః కోలభేతవరాటికాం॥ ఆ-ప్ర.

మూలికాదులతో జేయబడిన యౌషధము కేవలము సాధ్యములగు వ్యాధులందే ప్రయోగింపదగును. అసాధ్యములగు వ్యాధులందు దీనికి ప్రయోగార్హతలేదు. అనగా నిష్ప్రయోజనమైనదని భావము. రసౌషధము సాధ్యములగు వ్యాధులందే గాకుండ నసాధ్యములగు వ్యాధులందును గూడ ప్రయోగింపదగియుండును. అనగా రసౌషధ మెట్టివ్యాధులందు ప్రయోగింపబడినను అయ్యది నిశ్చితమైన ప్రయోజనకారి యగునని భావము. మరియు, నీ రసౌషధము మూలికాదికృతమువలెగాక ప్రయోగమునందు మిక్కిలి స్వల్పపరిమితిని గలిగియుండును. ఆమ్లలవణకటు తిక్తకషాయ రసములవలెగాక దీనికి యరుచియందు ప్రసక్తియుండనేరదు. అనగా నాస్యమున కెట్టి వికారమును కలిగింపక యనాయాసముగ నాస్వాదింపదగియుండును. ఆస్వాదించినపిమ్మట మిక్కిలి యచిరకాలముననే సునిశ్చిత ఫలప్రదమగును. వరాటికాతుల్యమగు (గుడ్డిగవ్వంతైనను విలువలేని) తృణకాష్ఠాదికృతచికిత్సవలెగాక యీ రసచికిత్స యార్థికముగను, పారమార్థికముగను నుత్తమమైనది. కావున చికిత్సలకెల్ల నిట్టి గుణవిశిష్టమైన యీ రసచికిత్స తలమానికమని వేరుగ జెప్పవలెనా ?

## రసోపరసాదులకు శోధనాదుల ఆవశ్యకత

౫॥ ఏవం సర్వ ఉపరసాః ధాతవః ఉపధాతవో
రత్నాన్యుపరత్నాని విషోపవిషప్రభృత
యశ్చ శుద్ధాఃసన్తో మృతా అమృతావా
యథావచనం యోజ్యాః నాశుద్ధా ఇతి॥ ఆ-ప్ర.

ఇందుపయోగింపబడు ద్రవ్యములలో గొన్ని భూమియందును, గొన్ని జలమునందును, గొన్ని పర్వతములందును లభించునవి యగుటం జేసి, వానికట్టి సహవాసమువలన తత్తద్దోషములు సంక్రమించును. ఈ దోషములను యథావిధిగా దొలగించిననేగాని యవి యుపయోగార్హములుగా నేరవు. ఇంతియేగాకుండ నవి వికారప్రదములుగా గూడ నగును. అందుచే వాటినుపయోగించుటకు ముందుగా తత్తద్దోష నివృత్తికై చక్కగా శోధింపవలెను. కొన్ని యిటుల శోధించిన మాత్రాన ఉపయోగింపదగియుండును. మరికొన్ని శోధనమారణములు జేయబడిగాని యుపయోగింపదగియుండవు. మారణమనగా భస్మీకరణము. ఇందువలన నాయా ద్రవ్యములకు మిక్కిలి లఘుత్వమేర్పడి శారీరకధాతువులందు లీనమగునట్టి యతిసూక్ష్మపరిణామమును బొందినవి యగును. ఈ పరిణామము నిర్దుష్టముగ నైనదా, లేక దుష్టముగ నున్నదా యని నిర్దిష్ట భస్మపరీక్షాక్రమము* ననుసరించి పరీక్షించినపిమ్మటనే

---

* భస్మపరీక్ష—శ్లో॥ మృతం తరతియత్తోయే లోహం వారితరంహితత్ । అంగుష్ట తర్జనీ పృష్టం యత్త్రదే ఖాంతరే విశేత్॥ మృతలోహం తదుద్దిష్టం రేఖాపూర్ణాభిధానతః । గుడగుంజా సుఖస్పర్శ మధ్వాజ్యైః సహయోజితం॥ నాయాతి ప్రకృతిం ధ్మానా దపునర్భవ ముచ్యతే । తస్యోపరి గురుద్రవ్యం ధాన్యం చోపనయే ద్ధ్రువం॥ హంస

వాటిని యుపయోగించవలెను. అయ్యది దుష్టమైన పరిణామమైనచో శరీరమున కుపకారము చేయుటకు మారుగా నపకారమునే జేయునది యగును. కావున ఈ విషయమై వైద్యుడు మిక్కిలి బుద్ధికుశలత గలిగి యుండవలెను.

ఖనిజముల నిటుల పరిణమింపజేయుటకు గొన్ని సాధనము లవసరములైనవి. అవి పుటయంత్రములని చెప్పబడును. ఇవి యనేకవిధములుగా నుండును. వీటి వివరణము ప్రత్యేకముగ తత్తత్ప్రకరణముల గావింపబడును.

---

వర్తిర్వ్యతే వారిణ్యుత్తమం పరికీర్తితం । రౌప్యేణ సహాసంయుక్తం ధ్మాతం రౌప్యేణ చేల్లగేత్॥ తదా నిరుత్థ మిత్యుక్తం లోహం తదపునర్భవం॥ ర-ర-స. భస్మపరీక్ష:—వారితరము, రేఖాపూర్ణము, అపునర్భవము, ఉత్తమము, నిరుత్థము అని యైదువిధములు. మూతి వెడల్పుగనుండు ఒక కాచపాత్రను శుద్ధజలముచే పూరించి మృతలోహమును మిక్కిలి స్వల్పముగ నాజలముపై నుంచిన యది నీటిలో మునుగక పైననేయుండి యొకప్రక్కనుండి మరియొక ప్రక్కకు చలనముగలిగి యున్నచో నట్టిది వారితరభస్మమనబడును. మృతలోహమును కొద్దిగా నంగుష్ఠ తర్జన్యంగుళములతో గ్రహించి, తిరిగి విడిచిపెట్టి చూచినచో నాయంగుళములయొక్క రేఖలమధ్య నంటుకొనియున్న నయ్యది రేఖాపూర్ణ మనబడును. బెల్లము, గురివెందగింజ, గుగ్గిలము, తేనె, నెయ్యి అనునవి మిత్రపంచక మనబడును. ఈ మిత్రపంచకముతో సమానముగ మృతలోహమును జేర్చి మర్దించి, గోళముగాజేసి, దీని నొకమూవయందుంచి కోష్ఠీయంత్రమున నూదినచో నట్టి భస్మకు తిరిగి నిజస్వరూపము గలుగ

ఈ ఖనిజద్రవ్యము లిట్లుపయోగార్హతను జెంది, వ్యస్తముగను, సమస్తముగను నుపయోగింపబడుచుండును. వ్యస్తముగ ననగా విడి విడిగా నుపయోగింపబడునవి. సమస్తముగ ననగా రెండుగాని, మూడు గాని, యనేకముగాని ఖనిజములు గ్రహింపబడి, వాని నేకరూపమున సంయోగపరచి యుపయోగించుట. ఈ రసయోగములు సాధారణముగా రసగంధక మిశ్రితములుగనే యుండును. అందుచే నివి పక్వాపక్వ భేదముచే రెండువిధములుగ సిద్ధము జేయబడును. అందు పక్వౌషధములు అగ్ని సంయోగముచే జేయదగియుండును. ఇవియే వంటౌషధములనియు, సిందూరములనియు వ్యవహరింపబడుచుండును. అపక్వౌషధములు అగ్ని సంయోగములేక కేవలము మర్దన భావనాది సంస్కారములచే జేయదగి యుండును. ఇవి కజ్జల్యౌషధములని వ్యవహరింపబడుచుండును†.

---

కుండిన నయ్యది యపునర్భవ మనబడును. వారితరపరీక్ష యందువలె మృతలోహమును జలముపై వేసి దానిపై బరువుగనుండు నొక బియ్యపుగింజ నుంచినచో నప్పుడుగూడ నది నీటిలో మునుగక హంసవలె తేలి (ఒకటికంటె హెచ్చుగ గూడ బియ్యపు గింజలను మోయగల శక్తిని కొన్ని భస్మములు కలిగియుండును.) నీటిపై నొకప్రక్కనుండి మరియొక ప్రక్కకు ఆడుచున్న నయ్యది యుత్తమమనబడును. అపునర్భవ పరీక్షకు నిలిచిన లోహభస్మను వెండితో జేర్చి కోష్ఠీయంత్రమున నూదినచో నది వెండితో నంటికొనియుండిన యాభస్మ నిరుత్థమనబడును.

† శ్లో॥ ధాతుభి ర్గంధకాద్యైశ్చ నిర్ద్రవై ర్మర్దితో రసః । సుశ్లక్ష్ణః కజ్జలాభోఽసౌ కజ్జలీ త్యభిధీయతే॥ ర-ర-స. పాదరసమును ధాతువులతోను, గంధకాదులతోను జేర్చి

ఈ ద్వివిధౌషధ నిర్మాణమునకుగూడ గొన్ని యంత్రముల సహాయ మావశ్యకమైయున్నది. ఈ యంత్రములయొక్కయు, నౌషధనిర్మాణము యొక్కయు వివరణములు ప్రత్యేకముగ నాయా ప్రకరణములందు గావింపబడును.

మరియు, నీరసములయొక్క సిద్ధికి మరికొన్ని ద్రవ్యములుగూడ నీ శాస్త్రమున గ్రహింపబడియున్నవి. అవి విషములు, క్షారములు, జాంతవములు అని చెప్పబడును. ఇవిగూడ తత్తత్ప్రకరణమున ప్రత్యేక ముగ వివరింపబడును.

## రసశాస్త్ర విభాగములు

శ్లో॥ నిశ్రేయసేతువైద్యానాం వ్యాధితానాం హితాయచ।
వాదినాం కౌతుకార్థాయ వృద్ధానాం దేహసిద్ధయే॥
మంత్రిణాం మంత్రసిద్ధ్యర్థం విదితాశ్చర్యకారకం।
పంచఖండ మిదంశాస్త్రం సాధకానాం హితాయచ॥
రసఖండేతువైద్యానాం వ్యాధితానాం రసేంద్రకే।
వాదినాం వాదఖండేచ వృద్ధానాంచ రసాయనే।
మంత్రిణాం మంత్రఖండేచ రససిద్ధిః ప్రజాయతే॥

ర-రత్నాకర.

ఇట్టి యుత్తమములగు చికిత్సాంగములతోను, నియమములతోను గూడిన యీ రసశాస్త్రము రసఖండము, రసేంద్రఖండము, వాదిఖండము, రసాయనఖండము, మంత్రఖండము అని యైదుభాగములుగ విభజింప

---

ద్రవరహితముగా కాటుకవలె మర్దించినచో వయ్యదికజ్జలి యనబడును. ఈ కజ్జలి సహితముగ మర్దనభావనాది సంస్కారములతో నగ్ని సంయోగములేకయే నిర్మింపబడునట్టివి కజ్జల్యౌషధములు.

బడినది. అందు వైద్యుల శ్రేయస్సుకొఱకు వివిధములగు ఖనిజములు మహారస-ఉపరస-ధాతు-రత్న భేదముచే విభాగింపబడి, వీటికి ప్రత్యేక ముగ లక్షణములు, భేదములు, శోధన మారణసత్వపాతనాది ప్రక్రియా విశేషములు, ఈ ప్రక్రియా విశేషములకు వలయు యంత్రాద్యుపకరణ ములు మున్నగువానితో వర్ణింపబడినట్టి భాగము రసఖండమనబడును. ఈ రసఖండమున చెప్పబడిన ఖనిజములతో వ్యాధిపీడితులకు హిత మగునట్లు తత్తద్వ్యాధులం దుపయోగించునట్టి వివిధౌషధ నిర్మాణ విధులతో వర్ణింపబడినట్టిది రసేంద్రఖండమనబడును. వృద్ధులకు హిత మగునట్లు అనగా జరామరణములు లేకుండజేయుటకు అనువగునట్లు పై ద్రవ్యములతో నిర్మించిన రసాయనౌషధములతో వర్ణింపబడినట్టిది రసాయనఖండమనబడును. తామ్రము, వంగము మున్నగు లోహములను పాదరససహాయమున స్వర్ణాద్యుత్తమలోహములుగ బరిణమింపజేయుటకు వలయు రససంస్కారవిశేషములతో వర్ణింపబడినట్టిది వాదఖండమన బడును. ఈ ప్రక్రియావిశేషములన్నియు యథాశతుగ సిద్ధించుటకు వలయు మంత్రవిశేషములతో వర్ణింపబడినట్టిది మంత్రఖండమనబడును.

ఈ యైదుభాగములలో గడపటి రెండుభాగములందు జెప్పబడిన ప్రక్రియావిశేషములు మిగుల ప్రయాసభూయిష్ఠములగుటచేతను, అందుకు వలయు సాధనసంపత్తి లభ్యము గాకపోవుటచేతను నీ రెండింటినివిడచి, మొదటి మూడు విభాగములును విశేషముగ నవలంబింపదగియుండును.

## సంప్రదాయానుసరణమునకు ఆవశ్యకత

శ్లో॥ నక్రమేణ వినా శాస్త్రం నశాస్త్రేణ వినాక్రమః।
శాస్త్రం క్రమయుతం జ్ఞాత్వాయః కరోతి ససిద్ధిభాక్॥
నాసౌ సిద్ధి మవాప్నోతి యత్నకోటి శతైరపి।
తస్మాత్సర్వ ప్రయత్నేన శాస్త్రోక్తాం కారయేద్భిషక్॥
ర-రత్నాకర.

క్రమభిన్నముగ నేశాస్త్రము నుండనేరదు. శాస్త్రభిన్నముగ నే క్రమమును ఒప్పదు. కావున క్రమయుతమగు శాస్త్రమును జక్కగా దెలిసికొనవలెను. మరియు, శాస్త్రమర్యాదలను (సంప్రదాయములను) విడచి యనేకకోట్ల ప్రయత్నములు చేసినను రసనిర్మాణము సిద్ధింప నేరదు. కావున యెల్లప్పుడును శాస్త్రసాంప్రదాయముల ననుసరించుట యుక్తము.

---

## 2-వ అధ్యాయము

# రసము

### రసనామములు

శ్లో॥ రసేంద్రః పారదః సూతః సూతరాజశ్చ సూతకః।
శివబీజో రసస్సప్త నామాన్యేవం రసస్యతు॥

ర-సా-సం.

రసేంద్రము, పారదము, సూతము, సూతరాజ, సూతకము, శివ బీజము, రసము అను నీ యేడును రసనామములు,

### రసలక్షణము

శ్లో॥ అన్తస్సునీలో బహిరుజ్జ్వలో యో
మధ్యాహ్న సూర్యప్రతిమప్రకాశః।
శస్తోఽథధూమ్రః పరిపాండురశ్చ
చిత్రోనయోజ్యో రసకర్మసిద్ధ్యై॥ ర-మం.

అంతర్భాగమున నీలవర్ణమును, బహిర్భాగమున మిగుల ప్రకాశమును, మధ్యాహ్నకాలమునందలి సూర్యునివంటి కాంతిని గలిగినట్టి రసము ప్రశస్తమైనదియగును. ధూమ్రవర్ణమును, పాండురవర్ణమును, చిత్రవర్ణమును గలిగినట్టి రసము గ్రహింపదగినదికాదు.

## రసదోషములు - వికారములు

శ్లో॥ నాగో వంగో మలో వహ్ని శ్చాపల్యంచవిషం గిరిః।
అసహ్యాగ్నిర్మహాదోషాః నిసర్గా త్పారదేస్థితాః॥
ఆ.ప్ర.

నాగము (సీసము), వంగము (తగరము), మలము, వహ్ని, చాపల్యము, విషము, గిరి, అసహ్యాగ్ని యనునవి రసమునందు స్వభావము చే నేర్పడు మహాదోషములు.

శ్లో॥ జాడ్యగండౌ తనౌనాగాత్ కుష్ఠంవంగాద్రుజోమలాత్।
దాహోవహ్నే ర్వీర్యనాశశ్చాపల్యా న్మరణంవిషాత్॥
గిరేఃస్ఫోటో౽గ్న్యసహాతాద్దోషాన్మోహో౽భిజాయతే॥
ఆ.ప్ర.

ఈ మహాదోషములలో నాగదోషమువలన జడత్వము, గలగండ యును, వంగదోషమువలన కుష్ఠవ్యాధియు, మలదోషమువలన శూలయు, వహ్నిదోషమువలన దాహమును, చాపల్యదోషమువలన వీర్యనాశమును, విషదోషమువలన మరణమును, గిరిదోషమువలన విస్ఫోటమును, అసహ్యాగ్నిదోషమువలన మూర్ఛయు సంభవించును.

## దోషవిభాగము

శ్లో॥ విషంవహ్ని ర్మలశ్చేతి దోషా ముఖ్యతమాస్త్రయః।
రసేమరణసంతాప మూర్ఛానాం హేతవః క్రమాత్॥
యౌగికౌ నాగవంగాద్యౌ తౌ జాడ్యాధ్మానకుష్ఠదౌ।
ఔపాధికాః పునశ్చాన్యే కీర్తితా స్సప్తకంచుకాః॥
భూమిజో గిరిజో వార్జో ద్వౌచద్వౌ నాగవంగజౌ।
ద్వాదశై తే రసేదోషాః ప్రోక్తా రసవిశారదైః॥

భూమిజః కురుతే కుష్ఠం గిరిజో జాడ్యమేవచ।
వారిజో వాతసంఘాతం దోషాఢ్యం నాగవంగజౌ॥
ఆ.ప్ర.

పైని యుదహరింపబడిన దోషములలో విషము, వహ్ని, మలము అను నీమూడు దోషములు మిగుల ప్రధానములైనవి. ఇందు, విష దోషమువలన మరణము, వహ్నిదోషమువలన తాపము, మలదోషము వలన మూర్ఛయు గలుగును. మిగిలినవానిలో నాగవంగదోషములు రెండును యౌగికదోషములని చెప్పబడును. ఈ దోషములవలన జడత్వము, అధ్మానము, కుష్ఠము అను నీవ్యాధులు గలుగును. మరియు, భూమిజదోషము, గిరిజదోషము, వారిజదోషము, నాగదోషములు రెండు, వంగదోషములు రెండు అను నీ యేడుదోషములుగూడ రసము నందుండును. ఇవి యౌపాధికదోషములు, లేక కంచుకదోషములు అని వ్యవహరింపబడును. ఇటుల ప్రధానదోషములు మూడును, యౌగిక దోషములు రెండును, కంచుకదోషము లేడును గలసి మొత్తముమీద రసమునందు పదిరెండు దోషములుండునని యెరుంగవలెను. అందు భూమిజదోషము కుష్ఠవ్యాధిని, గిరిజదోషము జడత్వమును, వారిజదోషము వాతవ్యాధులను, నాగవంగదోషములు వివిధవ్యాధులను గలిగించును.

## రసశోధనముకు ఆవశ్యకత

శ్లో॥ అతోదోష నివృత్త్యర్థం రసః శోధ్యః ప్రయత్నతః।
శోధితో రసరాజస్తు సుధాతుల్య ఫలప్రదః॥
దోషహీనో యదాసూతః తదామృత్యు జరాపహః।
సాక్షాదమృత మప్యేష దోషయుక్తో రసోవిషం॥ అ.ప్ర.

రసము దోషములతో గూడియుండిన యది విషమువలె మరణమునకు హేతువగును. దోషవిహీనమగు రసము అమృతముతో సమాన

ముగనుండి జరామృత్యువుల గలుగకుండ జేయగలుగును. ఇట్టిరసము సాక్షాత్తు అమృతమనియే చెప్పదగినది. కావున నిట్టి గుణసంపాదనమునకై రసమును సర్వవిధముల శోధింపవలెను.

## రసశోధనము *

శ్లో॥ ఇష్టికా రజనీ చూర్ణైః షోడశాంశైః రసస్యతు।
మర్దయే త్తప్తఖల్వేహి జంబీరోత్థద్రవైర్దినం॥
కాంజికైః క్షాలయేత్పూతం నాగదోషం విముంచతి।
విశా లాంకోలచూర్ణేన వంగదోషం వినాశయేత్॥
రాజవృక్షో మలంహన్తి చిత్రకో వహ్నిదూషణం।
చాంచల్యం కృష్ణధత్తూర స్త్రిఫలా విషనాశనం॥

---

* పాదరసమునకు జేయు శోధనము, సామాన్యము, విశిష్టము అని రెండువిధములు, అందు నాగవంగాది దోషములను దొలగించుటకు జేయదగిన శోధనము సామాన్య శోధనమని యెరుంగవలెను. ఈశోధనము కేవలము మర్దన క్షాలనగాలన విధులతో జేయదగియున్నది. విశిష్టశోధనము రసమున నుత్కృష్ట గుణాపాదనమునకై జేయవలెను. ఇటుల జేయదగిన క్రియ సంస్కారనామముచే వ్యవహరింపబడును. ఈ సంస్కార క్రియలో గొంతభాగమువలన రసమున కత్యంత పరిశుద్ధతయు, అత్యంత గుణవర్ధకములగు బీజాదుల సమ్మేళనమునందు వానిని గ్రహించునట్టి శక్తియు నేర్పడును, మరి కొంతభాగమువలన రసమున కత్యంత ప్రభావ మేర్పడును.

కటుత్రయం గిరింహన్తి అసహ్యాగ్నిం త్రికంటకః।
ప్రతిదోషం కలాంశేన తత్రచూర్ణం సకన్యకం॥
సవస్త్రగాలితం ఖల్వే సూతం క్షిప్త్వాయథాక్రమం।
ప్రత్యేక ప్రత్యహం యత్నాత్ సప్తరాత్రం విమర్దయేత్।
ఉద్ధృత్యచారనాళేన మృద్భాండేక్షాలయేత్సుధీః।
సర్వదోష వినిర్ముక్తః సప్తకంచుక వర్జితః॥
జాయతే శుద్ధసూతోఽయం యోజయే ద్రసకర్మణి॥
అ. ప్ర.

యథోక్త పరిమితిగల * రసమును తప్తఖల్వమున † గ్రహించి,

---

* రసకర్మకు గ్రహింపవలసిన రసపరిమితి—శ్లో॥ శతం పలానాం పంచాశత్ పంచవింశతివా పునః। దశవా పంచవాదేవి నైతస్మా దూనమిష్యతే॥ ఆ-కం. బహు ప్రయాస సాధ్యత్వాత్ ఫలం స్వల్పంయతో భవేత్॥ అ-ప్ర.—రసకర్మకై నూరుపలముల రసమునుగాని, ఏబది పలముల రసమునుగాని, యిరువదియైదు పలముల రసమునుగాని, పదిపలముల రసమునుగాని, యైదుపలముల రసమునుగాని. గ్రహింపవలెను. ఇంతకు తక్కువ పరిమితిని గ్రహింపగూడదు. ఏలయనగా—ఈ రసకర్మ లన్నియు మిక్కిలి ప్రయాసముచే సాధింప దగినవి. అటుల ప్రయాసము జెందినను కడపటికి ఫలము మిక్కిలి స్వల్పముగానే లభించును. అనగా నుత్తమ ఫలము నిచ్చునట్టి రసముయొక్క పరిమితి ఈ రసకర్మల నన్నిటిని చేసినపిమ్మట మిక్కిలి స్వల్పమగు

యందు రసమునకు పదునారవభాగముండునట్లు ఇటుకరాయి చూర్ణ
మును, పసపు చూర్ణమును జేర్చవలెను. పిమ్మట నాఖల్వమువందు అందలి
ద్రవ్యములు మునుగునంతవరకు నిమ్మపండ్ల రసమునుబోసి జాగ్రత్తగా
నూరవలెను. ఇటుల నొక దినము అనగా ఇరువదినాలుగు గంటల
కాలము మర్దించిన పిమ్మట నాఖల్వమునందున్న ద్రవ్యములనెల్ల నొక
మూతివెడల్పుగల మృత్పాత్రలోనికి గ్రహించి, యందు నిండుగా ఉష్ణ

---

నని భావము. ఇందుచే రసకర్మలను జేయుటకు రసమును
మిక్కిలి హెచ్చు పరిమితిగనే గ్రహించుట యుక్తము.

† తప్తఖల్వము—శ్లో॥ అజాశకృ త్తుషాగ్నించ
ఖానయిత్వా భువిక్షి పేత్। తస్యోపరిస్థితం ఖల్వం తప్తఖల్వ
మిదం భవేత్॥ అ-ప్ర.—ఉపయోగింపబడు ఖల్వముయొక్క
దైర్ఘ్య వైశాల్యములకు దగినట్లు దైర్ఘ్య వైశాల్యములు
గలిగి, యొకయడుగులోతు గలిగిన గోతిని భూమిలోత్రవ్వి
అందు సగమువరకు ఎండిన మేకమలముచే పూరించవలెను.
పిమ్మట నీమలమున కుపరిభాగమును ఉముకచే పూరించి
యగ్నిని రగుల్పవలెను. నిప్పు బాగుగ నంటుకొనిన పిమ్మట
దానిపై ఖల్వమునుంచిన యట్టిది తప్తఖల్వమని చెప్ప
బడును. ఈ యంత్ర నిర్మాణమువలన రసమునకు మర్దన
క్రియకై కావలసినంత యుష్ణమే ఏర్పడునుగాని యంతకు
మించి యేర్పడుట కవకాశము లేదని గ్రహింపవలెను.
ఆనంద కందమున "లోహజేవాశిలోత్థేవాఖల్వే సూతం
వినిక్షిపేత్" । అని చెప్పబడి యుండుటచే నిట్టియంత్ర
నిర్మాణమునకు లోహముతో జేసిన ఖల్వమునుగాని, ప్రశస్త
మైన శిలతో జేసిన ఖల్వమునుగాని గ్రహించదగును.

కాంజికమును * బోయుచు, చేతితో నందలి ద్రవ్యములను రుద్దుచును క్షాళనము † చేయవలెను. ఇటుల క్షాళనము జేసినపిమ్మట నెండించి పరిశుద్ధమైన వస్త్రముచే వేరొకపాత్రలోనికి వడియగట్టవలెను. ఈ క్రియా విధానమువలన రసమునందుండు నాగదోషము పోవును. ఇక వంగదోష నివృత్తికై పైపరిమితి ననుసరించి చేదుపుచ్చకాయల చూర్ణమును; ఊడుగు విత్తుల చూర్ణమును జేర్చియు, మలదోషనివృత్తికై రేలపట్టచూర్ణమును, వహ్నిదోష నివృత్తికై చిత్రమూల చూర్ణమును, చాంచల్యదోషనివృ

---

* కాంజికము (పులిసీరు)—శ్లో॥ సంధితం ధాన్యమండాది కాంజికం కథ్యతే జనైః॥ భా-ప్ర. ధాన్యములు, గంజి మున్నగువాని నొకభాండముననుంచి యందు తగు మాత్రము జలముబోసి కొన్నిదినములు సంధానము జేయగా పులిసినట్టి ద్రవము కాంజికమని వ్యవహరింపబడును. దీనిని నిప్పుపై వెచ్చజేసిన యయ్యది యుష్ణకాంజిక మనబడును.

† రసక్షాళన విధానము—రసమును క్షాళనము జేయునప్పుడు మిక్కిలి జాగరూకత గలిగి యుండవలెను, లేనిచో నది భూగతమై వ్యర్థమగును. మృత్పాత్రలోనికి గ్రహింపబడిన ద్రవ్యమునంతను చేతితో చక్కగా రుద్దియా ద్రవమును మాత్రము మెల్లమెల్లగా వేరొక మూతివెడల్పు గల పాత్రలోనికి వంపుకొనవలెను. ఇటుల పలుమార్లు ఆ కాంజికమును పోయుచు, చేతితో రుద్దుచును అన్యపాత్రలోనికి వంపుకొనుచుండవలెను. ఇటుల నందలి రసేతర ద్రవ్యమంతయు ద్రవముతో గలిసి బయటకు వచ్చువరకును జేయవలెను. పిమ్మట నీ పాత్రను ఎండలో నుంచవలెను. ఇక అన్యపాత్రయందు వంపుకొనినట్టి ద్రవమును మెల్లమెల్లగా బయటకు

త్తికై నల్లయుమ్మెత్త బీజముల చూర్ణమును, విషదోషనివృత్తికై త్రిఫలా చూర్ణమును, గిరిదోషనివృత్తికై త్రికటుకచూర్ణమును, అసహ్యాగ్నిదోష నివృత్తికై గోక్షురచూర్ణమునుచేర్చి, పైవిధముగనే ప్రత్యేక ప్రత్యేకముగ కలబందరసముతో నొక్కొక్కదినము చొప్పున మర్దించుచు పై విధముగనే యుష్ణకాంజికములో క్షాలనము జేయవలెను. ఇటుల రసమున కుక్తవిధి ననుసరించి తత్తద్దోషనివృత్తికై ప్రత్యేక ప్రత్యేకముగా మర్దన క్షాళనములను జేసినచో నయ్యది కంచుకాది దోషరహితమై పరిశుద్ధమగును.

## రససంస్కారములు

శ్లో॥ స్యాత్స్వేదనం తదనుమర్దన మూర్ఛనంచస్యాదుత్థితిః పతనరోధ నియామనాని। సందీపనం గగనభక్షణ మాన మత్ర సంచారణం తదనుగర్భగతాద్రుతిశ్చ। బాహ్యద్రుతి స్సూతకజారణాస్స్యా ద్రాగ స్తథా సారణకర్మ పశ్చాత్। సంక్రామణం వేధవిధి శ్శరీరయోగ స్తథాష్టాదశధాత్రకర్మ। ఆ.ప్ర.

స్వేదనము, మర్దనము, మూర్ఛనము, ఉత్థాపనము, పాతనము, రోధము, నియామనము, దీపనము, అభ్రకభక్షణము, చారణము, గర్భద్రుతి జారణము, బాహ్యద్రుతిజారణము, గంధకజారణము, రాగము,

---

వంపుకొని తిరిగి యందు కాంజికమును జేర్చి పై విధముగనే పుద్దుచు దీనినిగూడ బయటకు నంపుకొనవలెను. ఇటుల పలుమార్లు చేయగా మొదటిపాత్రలో క్షాలనము జేయునపుడు ప్రక్కమార్గమున నేమైనరసము బయటకు బోయినచో నది యీపాత్రయందు లభ్యమగును. ఈపాత్రనుగూడ పై విధముగనే యెండలో బెట్టవలెను. ఇదియు రసక్షాలన విధానము.

సారణము, క్రామణము, లోహవేధము, శరీరయోగము (లేక) శరీర వేధము అనునవి పాదరసమునకు అత్యంత దోషవిశుద్ధి కొరకును, రసాయనాద్యుత్కృష్టగుణాపాదనమునకును జేయదగినట్టి సంస్కారములు పదునెనిమిది యని దెలియవలెను.

## స్వేదన విధానము *

శ్లో॥ త్ర్యూషణం లవణంరాజీ లశునం త్రిఫలార్ద్రకం।
మహాబలా నాగబలా మేఘనాదః పునర్నవా॥

---

* శ్లో॥ ఇత్యష్టౌ సూతసంస్కారాః సమాద్రవ్యే రసాయనే । శేషాఃద్రవ్యోపయోగిత్వాన్న తే వైద్యోపయోగినః॥ ర-ర-స. పదునెనిమిది రససంస్కారములలో మొదటి యెనిమిది స్వేదనాది దీపనాంతమువరకు గల సంస్కారములను జేసినచో రసమునకు రసాయన గుణమేర్పడుననియు, మిగిలినవి ద్రవ్యోపయోగమునకే యుపకరించుననియు జెప్పబడి యుండుటను బట్టి యీ గ్రంథమున యా యెనిమిది సంస్కారముల విధానమే వివరింపబడును. మరియు, నీ సంస్కారములకు పిమ్మట జెప్పబడిన జారణ సంస్కారము జేసినగాని, అనగా—శ్లో॥ అజారయంతః పవి హేమగంధం వాంఛంతి సూతాత్ఫల మప్యుదారం। క్షేత్రాదనుప్తాదివ సస్యజాతం కృషీవలాస్తే భిషజశ్చమందాః॥ అ-ప్ర.—క్షేత్రమునందు బీజావాపనముచేయకయే యందుండి ఫలము నపేక్షించి నటుల రసమునందు అభ్రకాదుల జారణము జేయకయే యందుండి రసాయనాద్యుత్తమ గుణముల నపేక్షించిన యా క్షేత్రరసములు రెండును సమానఫల

మేషశృంగీ చిత్రకశ్చ నవసారః సమం సమం।
రసస్య షోడశాంశేన సర్వంయుంజ్యాత్ పృథక్ పృథక్॥

---

ములనే యొసంగునవి యగును. అనగా నవి యెట్టిఫలమును నియ్యజాలవు. అని చెప్పబడి యుండుటనుబట్టి రసమున కుత్తమగుణము కలుగజాలదని తెలియుచున్నది. కావున పై వానితోబాటు అభ్రక-స్వర్ణ-గంధక జారణవిధానములు గూడ ఇందు వివరింప బడును.

ఈ స్వేదనాద్యష్ట సంస్కారములయొక్క లక్షణము లీక్రింద వివరింప బడును.

స్వేదనలక్షణము—శ్లో॥ క్షారామ్లై రౌషధై ర్వాపి డోలాయంత్రే స్థితస్యహి। పాచనం స్వేదనాఖ్యం స్యాన్మల శైథిల్యకారకం॥ ర-ర-స.—రసముయొక్క అంతర్భాగమున నిమిడియున్న దోషములకు శైథిల్యమును గలిగించుటకై అనగా—రసముతోనుండు సంబంధమునుండి విడునట్లు చేయుటకై డోలాయంత్రమున క్షారామ్లౌషధములతో రసమునుజేర్చి పాచనముజేయుట స్వేదన మనబడును. మర్దనలక్షణము—శ్లో॥ ఉదితై రౌషధైస్సార్థం సర్వామ్లైః కాంజికై రపి। పేషణం మర్దనాఖ్యం స్యాద్బహిర్మల వినాశనం॥ ర-ర-స.—రసమునకు బహిర్భాగమున నంటియున్న తత్తత్సని సంబంధమైన మలమును దొలగించుటకై దీనిని ఔషధద్రవ్యములతోజేర్చి, యమ్లద్రవములతోను, కాంజికములతోను ఖల్వయంత్రమున మర్దించుట మర్దన మన బడును. మూర్ఛన లక్షణము—శ్లో॥ మర్దనాదిష్ట భైషజ్యైః

ఏతత్సమ స్తంవ్య స్తంవా పూర్వాప్లే నైవ పేషయేత్।
ప్రలింపే త్తేన కల్కేన వస్త్రంచాంగులిమాత్రకం॥

---

నష్టపిష్టత్వకారకం। తన్మూర్ఛనంహి వంగాదిభుజకంచుకనాశనం॥ ర-ర-స.—రసమునకు జలగిరి భూసంబంధమైన దోషములను దొలగించుటకై మర్దన సంస్కారమునకు జెప్పబడిన ద్రవ్యములతో నష్టపిష్ట మగునట్లు జేయుట-అనగా రసము నా ద్రవ్యపిష్టమునందు లీనమగునట్లు మర్దించుట మూర్ఛన మనబడును. ఉత్థాపనలక్షణము—శ్లో॥ స్వేదపాతాది యోగేన స్వరూపాపాదనం హియత్। తదుత్థాపన మిత్యుక్తం మూర్ఛావ్యాపత్తి నాశనం॥ ర-ర-స.—రసమునకు మూర్ఛన సంస్కారముచే నేర్పడిన వ్యాపత్తును దొలగించుటకై స్వేదపాతాదియోగమున తిరిగి నిజరూపమును గలిగించునట్టిక్రియ యుత్థాపనము, లేక యూర్ధ్వపాతన మనబడును. పాతన లక్షణము—శ్లో॥ ఉక్తౌషధైర్మర్దిత పారదస్యయంత్రస్థిత స్యోర్ధ్వ మధశ్చతిర్యక్। నిర్యాతనం పాతనసంజ్ఞముక్తం వంగాహిసం పర్కజకంచుకఘ్నం॥ ర-ర-స.—ఉక్తౌషధములతో పాదరసమును మర్దించి, యూర్ధ్వాధస్తిర్యక్పాతన యంత్రములందుంచి, యూర్ధ్వాధస్తిర్యక్కులుగ దానిని తిరిగి యాకర్షించుటకై చేయుపాకము పాతనసంస్కార మనబడును. ఇందువలన రసమునందున్న వంగనాగ దోషములకు విముక్తి యేర్పడును. రోధన లక్షణము—శ్లో॥ జలసైంధవ యుక్తస్య రసస్యదినసత్రయం। స్థితిరాస్థాప నీకుంభే యాసారోధన ముచ్యతే॥ ర-ర-స.—

తన్మధ్యే నిక్షిపేత్సూతం బద్ధ్వాత త్రిదినంపచేత్।
డోలాయంత్రేఽమ్లసంయుక్తేజాయతే స్వేదితోరసః॥
ఆ.ప్ర.

త్రికటుకములు, సైంధవలవణము, ఆవాలు, వెల్లుల్లి, త్రిఫలములు, అల్లము, మహాబల, నాగబల, చిత్రికూర (భేదము), గలిజేరు, దుష్టపుతీగె (దీని యభావమున కర్కాటకశృంగిని గ్రహించవలెను), చిత్ర

---

ఒక కుండయందు జలమునుబోసి యందు సైంధవలవణమును గలిపి, రసము నీ ద్రవమునందు మునిగియుండునట్లు మూడుదినములుంచిన యయ్యది రోధనసంస్కార మనబడును. పాతన సంస్కారముచే నష్టమైన వీర్యమును తిరిగి యీ రోధన సంస్కారమువలన రసము సంపాదించుకొనగలుగును. నియమన లక్షణము—శ్లో॥ రోధనాల్లబ్ధవీర్యస్య చపలత్వ నివృత్తయే। క్రియతే పారదేస్వేదః ప్రోక్తం నియమనంహితత్॥ ర-ర-స.—రోధన సంస్కారమువలన తిరిగి సంపాదించిన వీర్యముగల రసమునకు చపలత్వమును నివారించుటకై స్వేదనము జేయుట నియమన సంస్కారమనబడును. దీపనలక్షణము—శ్లో॥ ధాతుపాషాణ మూలాద్యైః సంయుక్తో ఘటమధ్యగః। గ్రాసార్థం త్రిదినంస్వేదః దీపనం తన్మతంబుధైః॥ ర-ర-స. రసమునకు అభ్రకాదులను గ్రసించునట్టి బుభుక్షను గలిగించుటకై దానిని కాసీసము, పాషాణములు, ఓషధులు మున్నగువానితో జేర్చి స్వేదనవిధి ననుసరించి మూడుదినములు స్వేదనము జేసిన యయ్యది దీపన సంస్కార మనబడును.

మూలము, నవాసారము అను నీ ద్రవ్యముల నొక్కొక్కటి రసమునకు పదునారవభాగముండునట్లు గ్రహించి మెత్తగా చూర్ణించవలెను. పిమ్మట నీ ద్రవ్యచూర్ణములను ప్రత్యేక ప్రత్యేకముగ గాని, యన్నింటిని గలిపిగాని ఖల్వమునందుంచి యందు ధాన్యామ్లమును † కొంచెము

---

† ధాన్యామ్లము.—శ్లో॥ నానాధాన్యై ర్యథాప్రాప్తై స్తుషవర్జై ర్జలాన్వితైః। మృద్భాండం పూరితం రక్షేత్ యావదమ్లత్వ మాప్నుయాత్॥ తన్మధ్యే ఘునవాహ్యుండీ విష్ణుక్రాంతా పునర్నవా। మీనాక్షీచైవ సర్పాక్షీ సహదేవా శతావరీ॥ త్రిఫలాగిరికర్ణీచ హంసపాదీచ చిత్రకాః॥ సమూలకాండం పిష్ట్వాతు యథాలాభం వినిక్షిపేత్॥ పూర్వామ్ల భాండమధ్యేతు ధాన్యామ్ల కమిదంభవేత్। స్వేదనాదిషు సర్వత్ర రసరాజస్య యోజయేత్॥ ఆ-ప్ర.—యవలు, గోధుమలు, వడ్లు, చోళ్లు, కొర్రలు, పెసలు, కందులు, శనగలు, మినువులు, అలచందలు, నువ్వులు మున్నగు ధాన్యజాతులను లభ్యమగు నంతవరకు సంపాదించి వాటి పైపొట్టుపోవువరకు దంచి వీటి మొత్తమునకు నాలుగురెట్లు అధికముగా నుండునంత జలములోగలిపి దీని నంతను ఒక భాండమునందు జేర్చవలెను. పిమ్మట, తుంగముస్తలు, బ్రాహ్మి, బోడతరము, విష్ణుక్రాంత, గలిజేరు, పొన్నగంటికూర, జలబ్రహ్మి, సహదేవి, పిల్లిపీచర, త్రిఫలములు, నీలపుష్ప విష్ణుక్రాంత, హంసపాది, చిత్రమూలము ఈ ద్రవ్యములను సమూలముగ లభ్యమగు నంతవరకు సంపాదించి ముద్దగానూరి, దీనిని పై భాండమున జేర్చి,

కొంచెముగా బోయుచు నవనీతమువలె నగువరకు మర్దించవలెను. పిమ్మట నీపిష్టము నొక వస్త్రఖండమునకు అంగుళప్రమాణమున బూసి, దీని మధ్యభాగమున రసమునుంచి, డోలాయంత్రమున ‡ నా వస్త్రఖండమును బంధించవలెను. అటుల బంధించినపిమ్మట నా యంత్రమునందు ధాన్యామ్లమును ఆ వస్త్రబంధమునకు కొంచెము క్రిందుగా నుండు నంతవరకు బోసి, పిమ్మట నీ యంత్రమును పొయ్యిమీదనుంచి సన్నని మంటతో మూడుదినములు పాకము చేయవలెను. ఇందువలన ధాన్యామ్లమునుండి వచ్చు ఆవిరివలన రసమునకు స్వేదనసంస్కారమగును.

---

బాగుగా పులియు నంతవరకు సంధానము జేసి యుంచవలెను. ఇటుల సంధానము జేయబడినట్టిది ధాన్యామ్లమని వ్యవహరించబడును. దీనిని రసకర్మ లన్నింటిలోను ఉపయోగించవలెను.

‡ డోలాయంత్రము—శ్లో॥ ద్రవద్రవ్యేణ భాండస్య పూరితా ర్ధోదరస్య చ । ముఖస్యోభయతో ద్వార ద్వయం కృత్వా ప్రయత్నతః॥ తయోస్తు నిక్షిపేద్దండం తన్మధ్యే రసపోటకం । బధ్వాతు స్వేదయేదే తద్దోలా యంత్రమితి స్మృతం॥ ర-ర-స.—ఒక భాండమునకు కంఠమువద్ద నొకదాని కొకటి యెదురుగ నుండునట్లు రెండు రంధ్రములను జేసి వానియందొక సన్నని దండమును ప్రవేశపెట్టి దానికి మధ్యగనంటి వ్రేలాడియుండునట్లు పాదరసమును గట్టియుంచిన మూటను అమర్చవలెను. పిమ్మట నాభాండమున నీ మూటకు క్రిందుగా నుండునట్లును, భాండముయొక్క అర్ధభాగము నిండియుండునట్లును చెప్పబడిన ద్రవద్రవ్యమును బోసి పాకము జేసినట్టి యంత్రము డోలాయంత్ర మనబడును.

పిమ్మట స్వాంగశీతలమున ** ఆ యంత్రమునుండి వస్త్రబంధితమైన
మును జాగ్రత్తగ నొకపాత్రలోనికి గ్రహించి పూర్వము రసశో
ప్రసంగమున జెప్పబడినట్లు ఉష్ణకాంజికముతోగాని, ఉష్ణధాన్యా
ముతోగాని, యుష్ణ ఆరనాళముతో †† గాని చక్కగా క్షాళనము
వస్త్రగాళనము జేయవలెను. ఇటులనే ప్రతిసంస్కారమునకు
కడపట క్షాళనగాళనములను జేయుచుండవలెను.

## మర్దన విధానము

శ్లో॥ భిషగ్విమర్దయేచ్చూర్ణై ర్మిలిత్వా షోడశాంశతః।
సూతస్య గాలితైర్వస్త్రై ర్వక్ష్యమాణ ద్రవాదిభిః।

---

** స్వాంగశీతలము—శ్లో॥ వహ్నావస్థమేవ శీతం య
దుక్తం స్వాంగశీతలం॥ ర-ర-స.—స్వేదనాది పాకా
మున పొయ్యినుండి యగ్నిని దొలగించిన పిమ్మట, ర
సహితముగనె యాయాయంత్రములు యథాపూర్వము
బొయ్యిమీదనుండియే తమంతట తాము సంపూర్ణము
శీతలములైనచో నట్టి శీతలము స్వాంగశీతల మనబడును.

†† ఆరనాళము—శ్లో॥ ఆరనాలంతు గోధూమైః
మైస్సాన్నిస్తుషీకృతైః। పక్వైర్వా సంహితైస్తత్తు సౌవీ
సదృశంగుణైః॥ ర-ర-స.—పచ్చిగనుండు గోధుమలను
పొట్టు తొలగిపోవునట్లు దంచి శుభ్రపరచి యందు హెచ
పరిమితిగ నీళ్లుబోసి యుడికించవలెను. పిమ్మట దానినంత
ఒకభాండమునందుంచి పులియువరకు సంధానము చేం
వలెను. ఇటుల సిద్ధమైనది యారనాళమని చెప్పబడును.

గృహ ధూమేష్టికా చూర్ణం తథాదధి గుడాన్వితం।
లవణాసురిసంయుక్తం క్షిప్త్వాసూతం విమర్దయేత్॥ ఆ.ప్ర.

స్వేదనకర్మచే సంస్కృతమైన రసమును ఖల్వము * నందుంచి, యందు వస్త్రగాలితము చేయబడిన గృహధూమము (కరిదూపము),

---

* ఖల్వయంత్రము—శ్లో॥ ఖల్వయంత్రం ద్విధా ప్రోక్తం రసాది సుఖమర్దనే । షోడశాంగుల కోత్సేధా నవాంగుల సువిస్తరా॥ చతుర్వింశాంగులా దీర్ఘా ఘుర్షణీద్వాదశాంగులా । వింశత్యంగుల దీర్ఘావా స్యాదుత్సేధ దశాంగులా॥ ఖల్వప్రమాణం తజ్జేయంశ్రేష్ఠం స్యాద్రసమర్దనే । షోడశాంగుల విస్తారఃఖల్వోభవతివర్తులః॥ చతురంగుల నిమ్నంచ మధ్యేఽతిమసృణీకృతం । మర్దనీ నిబిడాధస్తాత్ సుగ్రహాచ శిఖోపరి॥ ఇదంహివర్తులం ఖల్వంమర్దనేఽతిసుఖప్రదం। అయసాకాంతలోహేన లోహఖల్వ మపీదృశం॥ ఆ-కం.

ఖల్వయంత్రము రసాదులను సుఖముగా మర్దించుటకై రెండువిధములుగా నుండును, అందు దీర్ఘముగా నుండునది యొకటియు, వర్తులముగా నుండునది యొకటియు అని తెలియవలెను. మరియు నిది తిరిగి శైలలోహభేదముచే రెండువిధములుగా నుండును. అనగా రాతిఖల్వము, లోహఖల్వము అని భావము. అందు రాతిఖల్వమును సాధారణ మర్దనమునకును, లోహఖల్వము రసమును అగ్ని సంయోగముతో మర్దించుటకును ఉపయోగింపదగి యుండును. దీర్ఘఖల్వముయొక్క ప్రమాణము... పదునారంగుళముల యెత్తును, తొమ్మిదియంగుళముల వైశా

ఇటుకరాయి, సైంధవలవణము, ఆవాలు వీటియొక్క చూర్ణములను, పెరుగును, బెల్లమును ఒక్కొక్కటి రసమునకు పదియారవభాగముండు నట్లు చేర్చుకొని మూడుదినములు చక్కగా మర్దించవలెను. ఈ మర్దన క్రియయందు పెరుగు బెల్లములయొక్క సంయోగముచే వంతయు నొక

---

ల్యమును, ఇరువదినాలు గంగుళముల దైర్ఘ్యమునుగలిగి, అందు పదిరెండంగుళముల దైర్ఘ్యముగల మర్దించునట్టి పాత్ర ముతోగూడినదిగా చేయబడినట్టి ఖల్వము శ్రేష్ఠమైనది. మరి యు, నిరువదియంగుళముల దైర్ఘ్యమును, పదియంగుళముల యెత్తును గలదిగ జేయబడినట్టిది గూడా శ్రేష్ఠమైనదియే. అయితే, "మునిమితై ర్నిమ్నస్తథై వాంగులైః పాల్యాం ద్వ్యంగులవిస్తరశ్చ మసృణోఽతీవ" అను ప్రమాణమునుబట్టి యీఖల్వములయొక్క లోతు ఏడంగుళములును, అంచులు రెండంగుళముల మందమునుగలిగి మిక్కిలి నునుపుగ నుండ వలెనని యిట గ్రహించవలెను. వర్తుల ఖల్వముయొక్క ప్రమాణము—పదునారంగుళముల వైశాల్యమును, నాలు గంగుళముల లోతును, అందు మిక్కిలి నునుపును గలదిగా జేయబడినట్టి వర్తులఖల్వముగూడ శ్రేష్ఠమైనది. ఇందుప యోగింపబడు పాత్రము చివరభాగమున చేతితో పట్టు కొనుట కనువుగను, అధోభాగమున అనగా నూరునట్టి భాగమున సమముగను, నునువుగను నుండునట్లు జేయబడ వలెను. లోహఖల్వములు—ఇవిగూడ పై విధముగనే ఉత్సేధ దైర్ఘ్యవైశాల్య నిమ్నములను గలిగి యుండు నట్లు జేయబడవలెను. ఇవి యగ్ని సంయోగముచే రస మును మర్దించుట కుపయోగించునవిగా నుండును.

ముద్దగానైనచో నా ముద్ద నూర్ధ్వపాతనయంత్రము * నందుంచి పాకము జేసి రసమును తిరిగి యాకర్షింపవలెను.

## మూర్ఛన విధానము

శ్లో॥ గృహకన్యామలంహన్తి త్రిఫలావహ్నినాశనీ।
చిత్రమూలం విషంహన్తి తస్మాదేభిః ప్రయత్నతః॥
మిశ్రితం మర్దయేత్సూతం సప్తవారాణి మూర్ఛయేత్।
ఇత్థం సమ్మూర్ఛితస్సూతో దోషశూన్యః ప్రజాయతే॥

ఆ-ప్ర.

రసమునందుండు మలదోషమును కలుబందయు, వహ్నిదోషమును త్రిఫలములును, విషదోషమును చిత్రమూలమును హరింపజేయ సమర్థములు గాన మర్దన సంస్కారము జేయబడిన రసము నీ ద్రవ్యములతో జేర్చి ఖల్వమునం దేడుదినములు † మర్దించవలెను. ఇటుల జేసిన, రసము ఆయాదోషములనుండి విముక్తమగును.

---

* ఊర్ధ్వపాతన యంత్రము—దీనినిగురించిన వివరములు పాతన సంస్కార ప్రసంగమున దెలియనగును.

† "సప్తవాసరాణి మూర్ఛయేదితిధాతువాదే, నరసేషు" ఆ-ప్ర. అను ప్రమాణము ననుసరించి యేడుదినములు మూర్ఛనము జేయుట ధాతువాదమునకేగాని, రసౌషధ నిర్మాణమునకు గాదని దెలియుచుండుటచే సామాన్య పరిభాష ననుసరించి మూడుదినములు మాత్రము చేయదగునని యిట గ్రహింపవలెను. అయితే యిట నొక్కొక్క ద్రవ్యముతో మూడుమూడు దినములు మూర్ఛనము జేయవలెనని తెలియవలెను. మరియు నిందుజెప్పబడిన ద్రవ్యములను రసమునకుపదియారవభాగముండునట్లు గ్రహింపవలెను.

## ఉత్థాపన విధానము

శ్లో॥ తత ఉత్థాపయేత్సూతం ఆతపేనింబుకార్దితం।
ఉత్థాపనావశిష్టంతు చూర్ణం పాతనయంత్రకే॥
ధృత్వాగ్నా వూర్ధ్వ భాండాప్తం సంగృహిత్వారదం
భిషక్॥ ఆ-ప్ర.

కుమార్యాది ద్రవ్యములందు మూర్ఛనము బొందిన రసమును (ఆ ద్రవ్యపిష్టమును) ఆ ఖల్వమునందుండగనే అందు జంబీర స్వరసమును బోసి, యా ఖల్వమును తీవ్రమైన ఎండలోనుంచి గాఢముగా మర్దించవలెను. ఇటుల జేసినచో నాపిష్టమునుండి శైథిల్యమును బొంది రసము బయటకు వచ్చును. ఈ రసమును వేరొక పాత్రలోనికి గ్రహించవలెను. రసమింకను ద్రవ్యపిష్టమున లీనమై శేషించియున్నట్లు దెలిసినచో నాపిష్టమును ఊర్ధ్వపాతన యంత్రము * నందుంచి పాకముజేసి యారసమును గ్రహించవలెను. ఈ విధముగా ద్రవ్యపిష్టమునందు లగ్నమైన రసమునందుండి బయటకు వచ్చునట్లు జేసినపిమ్మట నా రసమునకు యథోక్తవిధి ననుసరించి క్షాళన గాళనములను జేయవలెను†.

## పాతన సంస్కారము

గ॥ తచ్చత్రివిధం-ఊర్ధ్వాధస్తిర్యగ్భేదాత్॥ ఆ-ప్ర.

---

* ఊర్ధ్వపాతన యంత్రమునందు పాకముజేయు విధానమును, అందుండి రసమును గ్రహించు విధానమును పాతనసంస్కార వివరణమునందు జూడనగును.

† ఈ విధముగ మూర్ఛన సంస్కారమునకు బిమ్మట ప్రతితడవుకును ఉత్థాపనక్రియ జేయుచు క్షాళనాదికముల నాచరింపవలెను.

ఊర్ధ్వపాతనము, అధఃపాతనము, తిర్యగ్పాతనము అని పాతన సంస్కారము మూడువిధములుగా జేయదగియుండును.

## ఊర్ధ్వపాతన విధానము

శ్లో॥ భాగాస్త్రయో రసస్యార్క చూర్ణస్యైకోఽథనిం
బుకైః। ఏతత్సమ్మర్దయేత్తావద్యావదాయాతిపిండతాం॥
తత్పిండం తలభాండస్థ మూర్ధ్వభాండే జలంక్షిపేత్।
కృత్వాలవాలం కేనాపిదత్వా చార్ద్రింహి ప్లోతకం॥
సమ్ముద్రాగ్ని మధస్తస్య చతుర్యామం ప్రబోధయేత్।
యుక్త్యోర్ధ్వ భాండసంలగ్నం గృహ్ణీయాత్పారదంతతః॥
ఊర్ధ్వపాతన మిత్యుక్తం భిషగ్భిః సూతశోధనే॥

ఆ-ప్ర.

ఉత్థాపన సంస్కారము చేయబడిన పాదరసము మూడుభాగములు, తామ్రచూర్ణము ఒకభాగము ఈ రెండింటిని ఖల్వమునందుంచి, అందు జంబీర స్వరసమును కొంచెము కొంచెముగా విడుచుచు రస తామ్రములు రెండును ఒకదానితోనొకటి కలిసి ముద్దయగువరకును మర్దించవలెను. పిమ్మట నాముద్దను ఊర్ధ్వపాతనయంత్రము*నందలి యధోభాం

---

* పాతనయంత్రము—— శ్లో॥ ససూతభాండవివరమన్య ద్గిలతిభాండకం। తథాసంధిర్ద్వయోః కార్యః పాతనాత్రయయంత్రకే॥ ఆ-ప్ర. —— నిర్దిష్ట పరిమాణముగల రెండు భాండములను గ్రహించి, వీనిలో నొక భాండమున పాదరసమునుంచి, రెండవభాండముయొక్క ముఖము ఆ రసభాండముయొక్క ముఖములో ప్రవేశించి యుండునట్లమర్చి యీ రెండింటియొక్క సంధికి మృత్తికచే

సంధి లేపము జేసి యుంచిన యయ్యది పాతన యంత్ర మనబడును. ఈ యంత్రము ఊర్ధ్వపాతన-అధఃపాతన - తిర్యక్పాతన కర్మలు మూడింటికిని యుపయోగింప దగియుండును. అందు (1) రసమునుంచిన భాండము పొయ్యిమీద నుండునట్లుజేసి యంత్రమును నిలువుగనిలిపి యుంచిన యయ్యది యూర్ధ్వపాతన యంత్రమగును. "సమ్యుద్రాగ్ని మధస్తస్య" (ఆ-ప్ర) అను ప్రమాణము ననుసరించి ఇందు పాదరసమున్న భాండమున కధోభాగ మున అగ్నిని ప్రజ్వలింప జేయవలెను. (2) పై విధముగ సంధానము జేసిన భాండసంపుటములోని యూర్ధ్వభాండము యొక్క లోపలి యుపరిభాగమున రసపిష్టమునుబూసి, అధో భాండమున ద్రవద్రవ్యమునుబోసి (ఇందు భాండములకు సంధిబంధనము జేయుటకు పూర్వముననే పైనిజెప్పిన కర్మల రెండింటిని జేసి యుండవలెనని యిట దెలిసికొనవలెను), ఈ సంపుటముయొక్క నాలుగుభాగములలో మూడుభాగములు భూమిలో నుండునట్లు పాతియుంచిన యయ్యది యధఃపాతన యంత్ర మగును. "ఉపరిష్టా త్ప్రదేద త్తే" (ఆ-ప్ర) అను ప్రమాణము ననుసరించి యిందూర్ధ్వ భాండముయొక్క యుపరిభాగమున నగ్నిని ప్రజ్వలింప జేయవలెను. (3) పై విధముగ సంధానము జేసిన భాండసంపుటములో నొక భాండ మున రసపిష్టమునుంచి రెండవభాండమున ద్రవద్రవ్యమును బోసి (ఇందుగూడ భాండములకు సంధిబంధము జేయుటకు పూర్వముననే పైనిజెప్పిన కర్మల రెండింటిని జేయవలెనని యిట దెలిసికొనవలెను), రసపిష్ట ముంచిన భాండము

డముయొక్క లోపలనుంచి యంత్రముయొక్క సంధికి వహ్నిమృత్తిక †చే

పౌయ్యిమీాద నుండునట్లును, ద్రవద్రవ్యమును బోసిన భాండము ఒకప్రక్కగా పౌయ్యికి కొంచెము క్రిందుగావంగి యుండునట్లును అమర్చిన యయ్యది తిర్యక్పాతన యంత్రమగును. "రసాధో జ్వాలయే దగ్నిం" (ఆ-ప్ర) అను ప్రమాణము ననుసరించి యిందు రసమునుంచిన భాండమున కధోభాగమున నగ్నిని జ్వలింప జేయవలెను. ఈ యంత్రముల కుపయోగించు భాండములయొక్క ప్రమాణ మిట్టిదియని నిశ్చయించుటకు సాధ్యము గానేరదు. "యంత్రప్రమాణం వదనా ద్గురో ర్జ్ఞేయం విచక్షణైః । రసస్యమానానియమాత్ కథితుం నైవశక్యతే॥" (అ-ప్ర) అను వచనమును బట్టి సంస్కారము జేయబడు రసముయొక్క పరిమాణమనేక విధములుగానుండును అని తెలియుచుండుటచే నాభాండములయొక్క పరిమాణముగూడ రసముయొక్క యాయా భిన్నభిన్న పరిమాణముల ననుసరించియే యుండునని దెలియవలెను. కావున రసకర్మ జేయుకాలమున గ్రహింపబడిన రసముయొక్క ప్రమాణమునకు దగినట్లు భాండములయొక్క పరిమితిని గురుముఖమునుండి గ్రహింపవలెను.

† వహ్నిమృత్తిక—శ్లో॥ ఖటికాపటు కిట్టైశ్చమహిషీదుగ్ధ మర్దితైః । వహ్నిమృత్స్నా భవేద్ఘోర వహ్నితాప సహాఖలు॥ ర-ప.—సుద్దరాయి, సైంధవలవణము, మండూరపురాయి వీటిని సమాంశములుగ గ్రహించి, ఖల్వము

దృఢముగ సంధిలేపము ‡ జేయవలెను. పిమ్మట రసపి
సుంచిన భాండమును పొయ్యిమీదనుంచి, యూర్ధ్వభాండముల

నందు మెత్తగ చూర్ణించి, యందు కొంచెము కొంచెః
గేదెపాలను బోయుచు జిగురు వచ్చువరకు మర్దించవ
ఇటుల సిద్ధముజేయబడినట్టిది వహ్నిమృత్తిక యనబః
దీనితో సంధిలేపము జేసిన యెట్టి తీవ్రమైన యగ్నిత
నకును సంధి శిధిలీభూతముగా నేరదు.

‡ సంధిలేప విధానము —— భాండముల యొ
సంధి కనబడకుండునట్లు మొదట నా సంధికిచః
మృత్తికతో పలుచగ లేపనముజేసి, సరి జేయవ
పిమ్మట పలుచని వస్త్రఖండములను రెండంగుళ
వెడల్పును, భాండసంధియొక్క నిడివికి తగినంత నిడ
గలిగినవిగా కత్తిరించి, యాఖండముల కొకవైపు
త్రమే యామృత్తికను పలుచగపూసి యా సంధికి చ
యంటియుండునట్లు ఆ వస్త్రఖండములను చుట్టబెట్టవ
ఇటుల చుట్టబెట్టునపుడు మధ్యమధ్యబొడుపులు లేకుండః
బలముగలాగుచు చుట్టుచుండవలెను. మరియు, మృ
బూసిన వైపుననే యా వస్త్రఖండము భాండసంధ
యుండునట్లు దానిని చుట్టవలెను. పిమ్మట నటుల
యుంచిన వస్త్రఖండముయొక్క యుపరిభాగ మంః
తిరిగి యా మృత్తికచే పలుచగపూసి సరిజేయవలెను.
మూడుసారులుగాని, అయిదు సారులుగాని, యేడుసా

ుపరిభాగమున తడిగుడ్డతో గాని, బంకమన్నుతో గాని, మాషకల్క-
తో గాని విశాలముగను, లోతుగను నుండునట్లు పాళి (బోది)ని కట్టి
ందు శీతలజలమును || బోసి నాలుగు యామములు అగ్నిచే భాకము
చేవలెను, ఊర్ధ్వభాండముపై నున్న జలము వెచ్చపడినపు
డ్లు దానిని జాగ్రత్తగ బయటకు దొలగించుచు శీతలజలమును దిరిగి
యుంచుండవలెను. ఇటుల నియమిత కాలయవరకు పాకము జేసి

---

ని పై విధముగ మృల్లిప్త వస్త్రఖండములతో సంధిని
ధింపవలెను. ద్వితీయాది మృల్లిప్త వస్త్రఖండములను
ట్టబెట్టునప్పుడు పూర్వ వస్త్రఖండముయొక్క యగ్రభాగ
ులు కప్పబడి యుండునట్లు అనగా వీటి యగ్రములు మరి
ుకవైపున సంధించునట్లు చూడనలెను. ఇటుల నన్నిటిని
ట్టబెట్టిన పిమ్మట సామ్మృత్తికతో వాటికి యుపరిభాగమున
సరిగ నంతటనుబూసి సరిజేసి యెండించవలెను మూషా
ెటు హెచ్చుగా వస్త్రఖండములను చుట్టనలసి యున్నచో
ధ్యమధ్య నెండించుచు సంధిలేపమును పూర్తి జేయు
ెను. ఈ విధానము సర్వత్ర రసకర్మలోను. పుటకర్మ
ను అనుసరింపదగి యుండును.

|| శీతల జలమును బోయుటవలన శీతలస్పర్శచే నూర్ధ్వ
గమునకు వచ్చిన రసముక్కడనే యంటియుండును.
ులజేయనిచో నదితిరిగి యధోభాగమునకైన బోవును,
సంధిని విడఱ్చుకొని బయటకైనను బోవును. కావున
ము నటుల యూర్ధ్వభాగమున నుంచుటకై మధ్యమధ్య
ల జలమును బోయుచుండవలెను.

స్వాంగశీతలమున నూర్ధ్వభాండముయొక్క లోపలి యుపరిభాగమున ధూమరూపమున నంటియుండు రసమును మిగుల జాగరూకతతో గ్రహింపవలెను ¶.

---

¶ యంత్రమునుండి రసమును గ్రహించువిధానము—స్వాంగశీతలమున యంత్రముయొక్క సంధిబంధనమును జాగ్రత్తగావిప్పి, యూర్ధ్వభాండమును దీసికొని దానియొక్క ముఖము పైకియుండునట్లును, కొంచెము పటవాలుగ నొరిగి యుండునట్లును ఒక చుట్టకుదురుపై దానిని నిలబెట్టి యుంచవలెను. అప్పుడు చూచినచో భాండముయొక్క లోపలి భాగమంతయును విభూతిచే బూయబడినట్లు కానుపించును. పరిశుభ్రముగను మెత్తగను ఉండు వస్త్రఖండమును చిన్నబంతివలెచుట్టి దీనితో మెల్లమెల్లగా నా విభూతివంటి ద్రవ్యమును లోవైపునను ఆ భాండముయొక్క ముఖమునుండి క్రమక్రమముగా నడుగుభాగమువరకు తుడుచుచు రసముయొక్క సూక్ష్మరేణువులు దగ్గరగా జేరునట్లు జేయవలెను. పిమ్మట పరిశుద్ధముగను, వెడల్పుగను నుండు ఒకపాత్రపై పరిశుద్ధమైన వస్త్రమును నాలుగు మడతలుగా మడిచి యా పాత్రపై కప్పి దానిపై యా భాండమునందలి ద్రవ్యమును జాగ్రత్తగా జార విడువవలెను. పిమ్మట నా వస్త్రముయొక్క నాలుగు కొనలను ఒకటిగాగలిపి యెడమచేతితో దృఢముగ గ్రహించి కుడిచేతితో నందలి ద్రవ్యమునకు కొంచెముమీదుగా నా వస్త్రమును పట్టుకొని కుడివైపునకు మెల్లమెల్లగా బిగించి నొలిపెట్టుచుండవలెను. ఇటులజేసినచో నా వస్త్రమునుండి రసము గోపవిముక్తమై ధారగా నా పాత్రలోనికి జారును.

## అధఃపాతన విధానము

శ్లో॥ త్రిఫలాశిగ్రు శిఖిభి ర్లవణాసురిసంయుతైః।
సష్టపిష్టం రసంకృత్వా లేపయే దూర్ధ్వభాండకే॥
ఊర్ధ్వభాండోదరం లిప్త్వా అధోభాండే జలంక్షిపేత్।
సంధి లేపం ద్వయోఃకృత్వా తద్యంత్రంభువిపూరయేత్॥
ఉపరిష్టా త్పుటే దత్తే జలేపతతి పారదః।
అధఃపాతనమిత్యుక్తం సిద్ధాద్యైః సూతకర్మణి॥

ఆ-ప్ర.

త్రిఫలములు, ములగవిత్తులు, ఉత్తరేణుబీజములు, సైంధవలవణము, ఆవాలు అను ద్రవ్యములను ఊర్ధ్వపాతనముచే సంస్కరింపబడిన రసమునకు పదునారవభాగముండునట్లు గ్రహించి, మెత్తగ చూర్ణించి, వీటిని యీ రసముతో జేర్చి జంబీరస్వరసమును కొంచెము కొంచెముగా బోయుచు నష్టమగునరకును అనగా నా ద్రవ్యపిష్టములో లీనమగునంతవరకు మర్దించవలెను. పిమ్మట నీ పిష్టమును అధఃపాతన యంత్రములోని యూర్ధ్వభాండముయొక్క లోపలి యుపరిభాగమున బూసి యధోభాండమున జలమును బోసి, సంధిలేపముజేసి యంత్రమును క్తవిధానమున భూమిలో పాతియుంచి, యూర్ధ్వభాండముయొక్క యుపరిభాగమున పుటమును వేయవలెను. అనగా నిచ్చట కుక్కుటపుటము * ను వేయవలెను. లేక, రసప్రమాణము ననుసరించి

---

* కుక్కుటపుటము—శ్లో॥ పుటం భూమితలేయత్తద్వితస్తి ద్వితయోచ్ఛ్రియం। తావచ్చ తలవిస్తీర్ణం తత్స్యాత్కుక్కుటకంపుటం॥ ర-ర-స.—రెండడుగుల విస్తీర్ణముగల భూమితలముపై (నేలమీాద) రెండడుగులయెత్తున పిడకలనుజేర్చి పుటమువేసిన యయ్యది కుక్కుట పుటమన

యిరువది పిడకలతోగాని, అంతకు అధికసంఖ్యగల పిడకలతో గాని పుటమును వేయవలెను. ఇటుల జేసిన యధోభాండస్థజలమునందు రసముపడును†. స్వాంగశీతలమువ యంత్రమునువిప్పి జాగ్రత్తగ రసమును గ్రహించవలెను.

---

బడును. ఇట భాండముయొక్క యుపరితలముపై నిట్టిపుటము వేయవలెనని గ్రహింపవలెను.

† అధఃపాతన విధానమున యంత్రనిర్మాణ సాంప్రదాయము శాస్త్రమున నిట్లు దెలుప బడినది. "అధోభాండే జలంక్షిపేదితి వచనాత్ సంపుట పాత్రమధ్యే జలంప్రాప్యతే, తచ్చసంప్రదాయ విరుద్ధం, అతఃసంపూర్ణాంబుని పాత్రాంతరే భూమౌనిఖాతితే తస్యోపరి సంపుటం దద్యాత్. పశ్చాత్తస్య సంపుటస్య అధఃపాత్రస్య చ సంధిరోధః కార్యఇతి తాత్పర్యతో జ్ఞేయం।" (ఆ-ప్ర) అధఃపాతన యంత్రములో జలమును బోయుట శాస్త్రసాంప్రదాయమునకు విరుద్ధమగును. అందుచే వేరొక భాండమున (కొంచెము మూతి వెడల్పుగలిగి సంపుటముయొక్క యధోభాగము కొంచెము లోపలికి దిగుటకు వీలుగలిగి నట్టిది) నిండుగా నీళ్లుపోసి దానిపై సంపుటమునుంచి, సంధిబంధనము జేసి పిమ్మట పైనిజెప్పినట్లు భూమిలో పాతవలెనని యిటగ్రహించవలెను. ఈ విధముగ జేయుటవలన యంత్రమునందు జలము లేకపోయినను దాని నంటియున్న జలముయొక్క స్పర్శచే రసము ఊర్ధ్వపాతన యంత్రమునందువలె నధోభాండమున నంటుకొని యుండును. దీనిని గ్రహించు విధానము పైదాని యందువలెనే యని దెలియవలెను.

## తిర్యక్పాతన విధానము

శ్లో॥ ఘటే రసం వినిక్షిప్య సజలం ఘటమన్యకం। తిర్యఙ్ముఖం ద్వయోః కృత్వా తన్ముఖం రోధయేత్సుధీః॥ తత్రైవ చుల్ల్యాం సంస్థాప్య యత్నతస్తు తతోఽధికః। రసాధో జ్వాలయేదగ్నిం యావత్పాతో జలం విశేత్॥ తిర్యక్పాతన మిత్యుక్తం సిద్ధైర్నాగార్జునాదిభిః॥ ఆ-ప్ర.

అధఃపాతనకర్మచే సంస్కరింపబడిన రసమును పూర్వోక్తమగు తిర్యక్పాతనయంత్రమున నుంచి, అనగా పొయ్యిమీద నుంచవలసిన భాండములో నుంచి *, రెండవభాండమున జలమునుబోసి, వీటికి సంధానము జేసి, యథోక్తవిధిని యమర్చి; రసస్థభాండమున కధోభాగమున నగ్నిని జ్వలింపజేసి రస మన్యపాత్రస్థమైన జలమునందు బడువరకును అనగా నియమితకాలము పాకము చేయవలెను. స్వాంగశీతలమున యంత్రమును విప్పి అందు జలస్థమైన రసమును జాగ్రత్తగా గ్రహించవలెను†.

---

* తిర్యక్పాతనసంస్కారమునకు పూర్వము రసమునకెట్టి మర్దన విశేషమును ఇట నిర్దేశింపక పోయినను "ధాన్యాభ్రకం రసం తుల్యం మర్దయే దారనాలకైః। నష్టపిష్టేన తత్పాత్యం తిర్యగ్యంత్రే దృఢాగ్నినా॥" (ర-ర.) అనెడి నిత్యానాథసిద్ధుని వాక్యము ననుసరించి రసమునకు సమముగా ధాన్యాభ్రకమును జేర్చి యారనాళముతో నష్టపిష్ట మగువరకు మర్దించిన పిమ్మటనే యటుల యంత్రము నందుంచవలెనని గ్రహించవలెను.

† ఈ త్రివిధ పాతన కర్మలవలన గలుగు ప్రయోజన మిట్లు వర్ణింపబడినది. "మిశ్రితౌ చేన్నాగవంగౌ రసే

## రోధనవిధానము (లేక) బోధనవిధానము

శ్లో॥ ఏవం కదర్థితః సూతః షండత్వ మధిగచ్ఛతి।
తన్ముక్తయేఽస్యక్రియతే బోధనం కథ్యతేహితత్॥
విశ్వామిత్ర కపాలేవా కాచకూప్యా మథాపివా।
సృష్ట్యంబుజం * వినిక్షిప్యతత్ర తన్మజ్జనావధి।

---

విక్రయ హేతునా। తాభ్యాంస్యా త్కృత్రిమోదోషః తన్ముక్తిః పాతనాత్రయాత్॥'' (ఆ-ప్ర)—రసమునందు సహజముగా నాగవంగ దోషములుండును. అట్టి దోష యుక్తమగు రసమునందు వర్తకులు లాభముకొరకై తిరిగి నాగవంగ దళములను జేర్చిన (రసమునందు సీసపురేకులను తగరపు రేకులను జేర్చినచో సులభముగ నవి రసముతో గలిసి దానియొక్క బరువును వృద్ధిజేయును)చో పీటివలన కృత్రిమదోషము సంక్రమించును. ఈ పాతన కర్మలవలన నా దోషము నశించును.

* సృష్ట్యంబుజ మను పదమునకు సైంధవ లవణ యుక్త జలమనియును, మూత్రము, స్త్రీరజస్సు, శుక్రము అనియును భిన్నభిన్న మతముల యర్థము గానుపించుచున్నది. కాని, ''యుక్తంతు సృష్ట్యంబుజం అరుగ్ణాయాః షోడశ వార్షికాయాః స్త్రియః ఆర్తవం '' అని ఆయుర్వేద ప్రకాశ కర్తయగు శ్రీ మాధవాచార్యుడు జెప్పిన యర్థమే యుక్తముగా దోచుటవలన నిట పైవిధముగా నర్థము వ్రాయ బడినది.

పూరయే త్త్రిదినం భూమ్యాం రాజహస్త ప్రమాణతః॥
అనేన సూతరాజోఽయం షండభావం విముంచతి॥

ఆ-ప్ర.

స్వేదనాదిపాతనాంతకర్మలచే రసమునకు వీర్యము నశించును. తిరిగి నిజవీర్యమును బొందుటకై శోధనసంస్కారమును జేయవలెను. పరిశుభ్రమైన కొబ్బరిచిప్పలోగాని, గాజుపాత్రలోగాని యట్టి సంస్కృతరసమునుంచి, అందు నిర్వ్యాధియై షోడశవర్ష ప్రాయముగలిగిన స్త్రీయొక్క యార్తవమును ఆ రసము మునిగియుండునంత పరిమితిని జేర్చి యాపాత్రపై యుక్తిగా మూతచే మూసి దీనిని భూమిలో నొకటిం బావుమూరలోతున గొయ్యి త్రవ్వి యందు మూడుదినములు పాతియుంచవలెను. ఇందువలన పాదరసము తిరిగి లబ్ధనిజవీర్యముగును.

## నియమన విధానము

శ్లో॥ సర్పాక్షీ చించికావంధ్యా భృంగాబ్ద కనకాంబుభిః।
దినం సంస్వేదితః సూతః నియమాత్ స్థిరతాంవ్రజేత్॥

ఆ-ప్ర.

పొన్నగంటియాకు, చింతాకు, గొడ్డుఆగాకర వేరు, గుంటకలగర, తుంగముస్తలు, నల్ల ఉమ్మెత్తాకు వీటియొక్క స్వరసములతో ప్రత్యేకముగ ఒక్కొక్కదినము చొప్పున శోధనకర్మచే సంస్కరింపబడిన రసమునకు డోలాయంత్రవిధానమునననుసరించి స్వేదము జేసిన యయ్యది యీ నియమనసంస్కారముచే చాంచల్యరహితమై స్థిరత్వమును బొందును.

## దీపన విధానము

శ్లో॥ కాసీసం పంచలవణం రాజికామరిచానిచ।
ద్విశిగ్రుబీజమేకత్ర టంకణేన సమన్వితం॥
ఆలోడ్య కాంజికే దోలాయంత్రే పాచ్యోదినైస్త్రిభిః॥
దీపనం జాయతే సమ్యక్ సూతరాజస్యజారణే॥
ఆ-ప్ర.

నియామనకర్మచే సంస్కారింపబడిన రసమును డోలాయంత్రమున కట్టి, అన్నభేది, సాముద్రలవణము, సైంధవలవణము, సౌవర్చలవణము, బిడాలవణము, కాచలవణము, ఆవాలు, మిరియాలు, ఎర్రములగ బీజములు, తెల్లములగ బీజములు, వెలిగారము వీటిని యథాలాభముగ గ్రహించి కాంజికముతో నుద్దగానూరి దీనిని కాంజికములో గలిపి దీనినంతను ఆ యంత్రమున యథావిధిని పూరించి మూడుదినములు పాకము చేయవలెను. ఇటుల చేసిన రసమునకు అభ్రకాది జారణమునకై బలయుగ్రసనశక్తి యేర్పడును.

## అనువాసన విధానము *

శ్లో॥ దీపితం రసరాజంతు జంబీర రససంయుతం।
దినైకంధారయేద్ఘర్మే మృత్పాత్రే వా శిలోద్భవే॥
ఆ-ప్ర.

* ఈ యనువాసనము—రసరత్నాకరము, ఆయుర్వేద ప్రకాశమున్నగు గ్రంథములలో నధికముగ గానుపించుచున్నది. దీనితో మొత్తము పందొమ్మిది రససంస్కారము

దీపనకర్మచే సంస్కరింపబడిన రసమును ఒక మృణ్మయపాత్రము నందుగాని శిలాపాత్రమునందుగాని యుంచి యందు జంబీరస్వరసమును అయ్యది మునిగియుండునంత పరిమితిగ బోసి యొకదినము తీవ్రమైన ఎండలో నుంచిన రసమున కనువాసనమగును. ఈ సంస్కారమువలన రసమునకు అత్యధికమైన గ్రసనశక్తి కలుగును. †

---

లగుచున్నవి. ఇది నియమ భిన్నముగ గానుపించినను నిత్యనాథాదులవచన గౌరవమును బురస్కరించుకొని యీ సంస్కార విధానముగూడ నిట వివరింపబడినది.

‡ స్వేదనాది దీపనాంత సంస్కారములచే సంస్కరింపబడిన రసము సర్వదోష వినిర్ముక్తమగును. కాని యనువాసన కర్మనుగూడ జేసినగాని యా దోషములు పూర్తిగా నశించవనియు, దోషములు పూర్తిగ నశించినగాని రసమున కధిక గ్రసనశక్తియు, అధిక ప్రభావమును గలుగజాలవనియు దలచి యీ తొమ్మిదవ కర్మగూడ పై వానితో జేర్చి చెప్పియున్నట్లు దెలియుచున్నది. "స్వేదనాది నవకర్మ సంస్కృతః సప్తకంచుక వివర్జితో భవేత్ । అష్టమాంశ మవశిష్యతే యదా శుద్ధసూత ఇతి కథ్యతే బుధైః ॥ (ర-ర) స్వేదనాది నవకర్మలచే సంస్కరింపబడిన రసము తొలుత గ్రహింపబడిన పరిమితిలో నేడుభాగముల నట్టి కర్మలచే బోగొట్టుకొని, యెనిమిదవ భాగముతో నిలిచి యున్న యయ్యది సప్తకంచుక వివర్జితమై సంపూర్ణముగ శుద్ధమైనదని దెలియవలెను అని శ్రీనిత్యనాథుడు దెలిపి యున్నాడు.

## రసమునకు ముఖీకరణ విధానము ‡

శ్లో॥ సాస్యో రసః స్యాత్పటు శిగ్రుతుత్థైః సరాజికైః సోష
ణకైస్త్రిరాత్రం। పిష్టస్తతః స్విన్నతనుః సువర్ణముఖా
నయం ఖాదతి సర్వధాతూన్॥ ఆ-ప్ర.

సైంధవలవణము, ములగబీజములు, మయూరతుత్థము, ఆవాలు, త్రికటుకములు వీటిని ప్రత్యేకముగ నష్టవాసిత రసమునకు పదియారవ భాగముండునట్లు గ్రహించి మెత్తగా చూర్ణించి, యారసములో జేర్చి, ఖల్వమున కాంజికముతో మూడురాత్రులు (72 గంటలు) చక్కగా మర్దించి పిష్టముగా జేయవలెను. పిమ్మట దీనిని డోలాయంత్రమున కాంజికముతో స్వేదనము జేసి స్వాంగశీతలమున క్షాళనాదికములను జేసిన యారసమునకు ముఖమేర్పడును అనగా - సువర్ణాది ధాతువుల నవాయాసముగ భుజింపగల సామర్థ్య మేర్పడునని భావము.

## చారణావిధానము *

శ్లో॥ త్రుటిశోధితాన్వామృదితం సోష్ణఖల్వే అభ్రసత్వ హే
మాది। చరతిరసేంద్రః క్షితిఖగవేతసజంబీర బీజపూ
రామ్లైః॥ ఆ-ప్ర.

---

‡ ముఖీకరణము—జారణకర్మకు ముందుగ చారణ కర్మ చేయవలెను. ఈ చారణము "సముఖా నిర్ముఖాచేతి చారణా ద్వివిధాపునః" (ర-ర-స.) సముఖము నిర్ముఖము అని రెండు విధములుగా జేయబడును.

* చారణము—శ్లో॥ రసస్య జఠరే గ్రాసక్షేపణం చారణా మతా। ర-ర-స.—జారణము చేయదగిన ద్రవ్య

ముఖవంతమైన రసమును తప్త ఖల్వమునందుంచి, సంస్కరింప బడినట్టియు †, యథోక్త ప్రమాణమున

---

మును రసముయొక్క జఠరమునందు బ్రవేశపెట్టుట అనగా రసముచే నా ద్రవ్యమును దినిపించుట చారణ మనబడును. ఇది మూడువిధములుగా నుండును. "గ్రాసః పిష్టిగర్భః త్రిలక్షణాచారణా భవతి॥" (ర-హృ) అవి గ్రాసము, పిష్టి, గర్భము అని చెప్పబడును. అందు గ్రాస మనగా కేవలము అభ్రకమును రసముచే దినిపించుట గ్రాసచారణ మన బడును. హేమాదులను తినిపించుట పిష్టీ చారణ మన బడును. ఇటుల దినిపించిన ద్రవ్యములను రసస్వరూపమున బరిణమింపజేయుట గర్భచారణ మనబడును. ఈ గర్భ చారణమే జారణమని దెలియునగును. జారణ ప్రసంగమున దీని విధానము వివరింపబడును.

† అభ్రక సత్వాదులకు సంస్కారవిధానము—

శ్లో॥ ఘనసత్వంఖలు రవిణా రసాయనే ద్వం ద్వకంయోజ్యం। రక్తగణపాతభావితగిరి జతుమాక్షిక గైరిక దరదైః॥ర-హృ.

—అభ్రక సత్వమును రసాయనార్థమై రసమునందు జారణ చేయుటకు ముందు ఈ సత్వమునకు సమముగ తామ్రమును గలిపి, మూసలో కరిగించి రక్తవర్గ కషాయమున ఆవా పము జేయవలెను. పిమ్మట గోమూత్ర శిలాజతు, స్వర్ణ మాక్షికము, గైరికము, హింగుళము వీటి నభ్రకసత్వము నకు సమముగ నుండునట్లు ప్రత్యేకముగ గ్రహించి రక్తవర్గ కషాయముతో నూరి యాయభ్రకతామ్ర ద్వంద్వమునకు

పలుమార్లు లేపనము జేసి యెండించవలెను. పిమ్మట దానిని మూసలోనుంచి క్షోణీయంత్రమున నభ్రకసత్వము మిగులు వరకు నూదవలెను. ఈ విధముగ సంస్కరింపబడిన యభ్రక సత్వమును చారణార్థమై యుపయోగించ వలెను. స్వర్ణాదు లకు సంస్కారము—శ్లో॥ శుద్ధం స్వర్ణంచ రజతంచ బీజ మిత్యభిధీయతే। చతుఃషష్ట్యంశతో బీజప్రక్షేపో ముఖము చ్యతే॥ ఏవంకృతే రసో గ్రాసలోలుపో ముఖవాన్ భవేత్। కఠి నాన్యపి లోహానితీక్ష్ణో భవతి భక్షితుం। ఇయంహి సముఖా ప్రోక్తాచారణా ముఖచారిణా ర-ర-స.—సంస్కరింపబడిన స్వర్ణము, రజతమును బీజములని చెప్పబడును. శ్లో॥ బీజా నాం సంస్కారః కర్తవ్యః తాప్యసత్వ సంయోగాత్। యే నద్రవంతి గర్భే రసరాజస్యామ్లవర్గేణ. ఆ-ప్ర.— గ్రాసయోగ్య పరిమితిగల స్వర్ణమునుగాని, రజతమును గాని సమాంశముగ స్వర్ణమాక్షిక సత్వముతో జేర్చి జంబీ రము బీజపూరము మున్నగు నమ్లవర్గ స్వరసకషాయముల సహాయమున పక్వబీజములుగా జేయవలెను. అనగా—"సమ మాక్షిక కృతవాపం సమమాక్షిక సత్వసంయుతం హేమ। గర్భేద్రవతి చ జరతిచ॥" (ర-హృ) అని చెప్పబడుటచే స్వర్ణమునకు సమముగ స్వర్ణమాక్షిక చూర్ణమును జేర్చి యొక మూసయందేకముగా కరిగించి యాద్వంద్వమును రేకుగా సాగగొట్టి దీనికి సమాంశముగ స్వర్ణమాక్షిక సత్వ చూర్ణమును పై జంబీరాది స్వరస కషాయములచే నూరి కల్కముగా జేసి దీనిని యాద్వంద్వదళమునకు పలుమార్లు లేప నము జేసి యెండించి, మూసలోనుంచి స్వర్ణము మిగులు

‡ గ్రహింపబడినట్టియు నభ్రక సత్వమును || గాని, స్వర్ణాది లోహము

---

వరకు కొలిమిలో నూదవలెను. ఇటుల జేసిన స్వర్ణము మున్నగునవి పక్వబీజములని వ్యవహరింప బడును వీటిని రసమునందు చారణ జారణములు జేసినచో రసమునకు ముఖమును అనగా ఇతర కఠినలోహములను భక్షించు నట్టి శక్తియు. రసాయనత్వమును ఏర్పడును.

† చార్యద్రవ్య ప్రమాణము—శ్లో॥ చతుఃషష్ట్యం శకఃపూర్వో ద్వాత్రింశాంశో ద్వితీయకః । తృతీయః షోడశాంశస్తు చతుర్థోఽష్టాంశ ఏవచ॥ ఆ-ప్ర.—రసమునందు చారణము చేయదగిన గ్రాస ద్రవ్యముయొక్క మొదటి పరిమాణము రసములో నరువది నాల్గవవంతును, రెండవ పరిమాణము ముప్పది రెండవవంతును, మూడవ పరిమాణము పదియారవవంతును, నాల్గవ పరిమాణము ఎనిమిదవ వంతును ఉండవలెను. అనగా చార్యద్రవ్యమును అరువది నాల్గవభాగమునుండి ఆరంభించి, యెనిమిదవ భాగము వరకు చారణ జారణములను యథోక్త విధిని చేయుచు నా భాగముల నన్నిటిని పూర్తిచేయ వలెనని భావము.

|| అభ్రక సత్వపాతనము (లేక) నిష్కాసనము— శ్లో॥ చూర్ణీకృతంగగనపత్రమథారనాలే ధృత్వాదినైకమవశోష్య చ సూరణస్య । భావ్యం రసైస్తదను మూలరసైః కదల్యాః పాదాంశటంకణయుతం శఫరైః సమేతం॥ పిండీకృతంతు బహుధా మహిషీమలేన సంశోష్య కోష్ఠగత మాశుధమేద్ధఠాగ్నౌ। సత్వంపతత్యతిరసాయన జారణార్థం

యోగ్యంభ వేత్సకలలోహగుణాధికంచ॥ ఆ-ప్ర. పత్రాభ్రక మును మెత్తగా చూర్ణించి యొకదిన మారనాళమునందుంచి బాగుగా నెండించవలెను. పిమ్మట అడవి కందయొక్క రసమునందుంచి యొకదినము భావనజేసి యెండించవలెను. అటుపిమ్మట నరటిదుంప రసమునందుంచి యొకదినము భావనజేసి యెండించవలెను. బాగుగా నెండిన యీ యభ్రకచూర్ణమునకు నాల్గవవంతు వెలిగారమును, మత్స్యా ములను జేర్చి మెత్తగా నూరవలెను. పిమ్మట నీ పిష్టమును మహిషమలము (గేదెపేడ) తో జేర్చి బాగుగా కలియగలిపి (అందుక ప్రమాణాన్ గోలకాన్) అని చెప్పుటచే విష ముష్టికాయంత ప్రమాణమున ననేకములుగా ముద్దలను జేసి యెండించి, ఒక్కొక్కటిగా మూసయందుంచి కోష్ఠీయంత్ర (కొలిమి) మున గాఢముగ నూదినచో చిన్నచిన్న రవ్వ లుగా నభ్రకసత్వము పైకివచ్చును. అందలి కాచ కిట్ట ములను తొలగించి యారవ్వలను మాత్రము గ్రహించి దీని పరిమితికి సమానముగ మిత్రపంచకము (గుంజాబీజము, టంకణము, గుగ్గిలము, ఘృతము, మధు అనునవి జేరి మిత్ర పంచకమనబడును) ను జేర్చి ముద్దగానూరి, మూసయం దుంచి కొలిమిలో గాఢముగా నూదినచో నారవ్వలన్నియు గలిసి యొక లోహఖండమువలె నగును. పిమ్మట, "రసే జారణార్థంతు శోధయిత్వాజార్యం" అని చెప్పబడుటచే దానిని లోహమునకువలె శోధించి, యుక్తవిధానమున సంస్కరించి రసమునందు జారణము జేయవలెను.

లనుగాని వీటియొక్క సమ్మేళనక్రమము ¶ ననుసరించి కొంచెము కొంచెముగా జేర్చుచు, మర్దించుచు, కాసీస చూర్ణమును * గలిపిన యమ్లవేతసకషాయముతోను, జంబీర స్వరసముతోను, మాదీఫల రసముతోను నూరవలెను. ఈ విధముగ జేసినయెడల గ్రాసద్రవ్యములను రసములో చారణ చేర్పదును †.

---

¶ చార్యద్రవ్య సమ్మేళనక్రమము—శ్లో॥ ఆదౌ ఖల్వే మృదితాంపిష్టిం హేమ్నశ్చ తాం రసశ్చరతి। తారస్య తార కర్మణి దత్వా సూతే తతో గగనం॥ ర-హృ.—పూర్వోద్దిష్ట సంస్కార సంస్కృతమైన రసమును తప్తఖల్వమునం దుంచి సంస్కృతమైన స్వర్ణమునుగాని, రజతమునుగాని యథోక్తవిధిని చారణము జేయవలెను. వీనికి పిమ్మట నభ్రకసత్వమును చారణము జేయవలెను. మూలములో "అభ్రసత్వహేమాది" అని చెప్పబడియున్నను వీటిని యీపైని వివరించిన క్రమము ననుసరించియే రసము నందు సమ్మేళనము చేయవలెనని గ్రహింపవలెను.

* "అర్కభాజనే త్రిదినం పర్యుషిత మారనాలంగ గనాదిక జారణేశస్తం"॥ (ర-హృ) అను న్యాయము ననుసరించి కాసీసచూర్ణమును ఆయమ్లద్రవములలో గలిపి, దీనిని రాగిపాత్రలో మూడుదినము లూరబెట్టి. వడియగట్టిన పిమ్మట నీ ద్రవముతో నట్టి రసమును నూరవలెనని యిట దెలియవలెను.

† శ్లో॥ జారితః స్యాత్పునర్బీజం దత్వా చార్యం చ పూర్వవత్। జారయేచ్చ పునస్తద్వత్ ఏవం కుర్యా

## జారణ విధానము *

(స్వర్ణ-అభ్రక గర్భద్రావణాజారణ గంధకజారణవిధానములు)

శ్లో॥ పట్వామ్లక్షారగోమూత్ర స్నుహీక్షీరప్రలేపితే।
బహిశ్చబద్ధే వస్త్రేణభూర్జే గ్రాసని వేశితం॥

---

త్సనుంక్రమాత్ ॥ ర-ర.—ఉక్తపరిమాణ విభాగములలో నొక్కొక్క విభాగమునకును మధ్య మధ్య జారణాంతపాకములను అనగా నాలుగు విభాగములుగ విభజింపబడిన గ్రాస ద్రవ్యపరిమాణములలో ప్రతి విభాగమునకును వరుసగ చారణ-గర్భద్రావణ-జారణపాకములను జేయవలెను. ఇట్టి క్రమయుక్తమైన క్రియావిధానమువల్లనే గ్రాసద్రవ్యములకు రసమునందు చారణాదు లేర్పడును.

* జారణము—శ్లో॥ గ్రాసస్య చారణం గర్భే ద్రావణం జారణం తథా। ఇతి త్రిధూసా నిర్దిష్టా జారణావరవార్తికైః॥ ర-ర-స.—చారణము, గర్భద్రావణము, జారణము అని గ్రాసద్రవ్యమునకు జేయు జారణము మూడు విధములు. రసమునందు జారణముచేయబడు ద్రవ్యము గ్రాసమని చెప్పబడును. ఇందలి చారణక్రియ చారణా విధాన ప్రకరణమున వివరింపబడినది. మిగిలినవి రెండును ఇట వివరింపబడును. అయితే వీటియొక్క క్రియావిధానములలో గల పరస్పర సామ్యతనుబట్టి వాటికి విభేదము లేదని తోచగలదు. ఏలయన యీ క్రియావిధానమునందలి యుద్దేశ్యము పరిణామమై యున్నది. అనగా చారితద్రవ్య

మును రసరూపముగ బరిణమింపజేయుట యని భావము.
కాని, "గర్భద్రుత్యా రహితో గ్రాసః చీర్ణోఽపి నైకతాం
యాతి। ఏకీభావేనవినా నజీర్యతే తేనసా కార్యా"॥ (ర-హృ)
అని చెప్పబడినది. అనగా—గ్రాసద్రవ్యమునకు రసమునందు
చారణము జేసినంతమాత్రమున నది రసముతో నేకత్వమును
బొందనేరదు. కావున నిట్టి యేకత్వోపాదనమునకై ముందు
గా దానికి రసగర్భమున ద్రవరూపమును గలిగించవలెను అని
తెలియగలదు. కావున గర్భద్రావణ క్రియ ప్రత్యేకముగనే
జేయదగియుండును. పైనిచెప్పినట్లుగ ఈ రెండు క్రియల
కును వాటి విధానమున సామ్యత యుండుటనుబట్టి యవి
రెండును (గర్భద్రావణము - జారణము) ఈ జారణాప్రకరణ
మున వివరింపబడును. అందు గర్భద్రావణము—శ్లో॥ గ్రస్త
స్య ద్రావణం గర్భే గర్భద్రుతి రుదాహృతా॥ ర-ర-స.—
చారణము చేసిన ద్రవ్యమును రసగర్భమున ద్రవింపజేయు
నట్టి క్రియ గర్భద్రావణమని జెప్పబడును జారణము—
శ్లో॥ ద్రుతగ్రాస పరీణామః బిడయంత్రాదియోగతః। జారణే
త్యుచ్యతే॥ ర-ర-స.—రసగర్భమున ద్రవింపజేయబడిన
ద్రవ్యమునకు రసముతో బిడయంత్రాదిసహాయమున నైక్య
తను బొందించునట్టి క్రియ జారణమనబడును. బిడము—
శ్లో॥ క్షారైరమ్లైశ్చగంధాద్యై ర్మూత్రైశ్చ పటుభిస్తథా।
రసగ్రాసస్య జీర్ణార్థం తద్బిడం పరికీర్తితం॥ ర-ర-స.—
క్షారములు, అమ్లద్రవ్యరసములు, గంధకాదులు, మూత్ర
ములు, లవణములు వీనితో గ్రాసద్రవ్యమును రసమునందు

క్షారారనాల మూత్రేషు స్వేదయే త్త్రిదినం భిషక్।
క్రమేణానేన డోలాయాం జార్యం గ్రాస చతుష్టయం।
ఆ-ప్ర

---

జీర్ణింపజేయుటకు జేయబడు కల్కము బిడమని చెప్పబడును
రసమున కుత్తమరసాయనశక్తిని గలిగించుటకై చేయబడు
ఈ జారణ కర్మయందలి ప్రధానోద్దేశ్యము నెరవేరుటకు
అనగా గ్రాసద్రవ్యమును రసముతో నైక్యతబొందించుటకు
నాలుగువిధములగు గ్రాసపరిమాణ విభాగములకు పైని
జెప్పబడినట్టియు, నిట చెప్పబోవునట్టియు క్రియావిధానముల
ననుసరించి నాలుగు చారణములను, నాలుగు గర్భద్రావణ
ములను, నాలుగు జారణములను ప్రత్యేక ప్రత్యేకముగ
జేయవలెను. అయితే, శ్లో॥ వినాగంధేన యేమర్త్యాః
కుర్వతే ధాతుజారణం। న తేషుధా జాయతే సూతే జీర్యంతే
ధాతవోఽపిన॥ తస్మాద్గంధః పునర్జార్యః సూతే వహ్నివివృ
ద్ధయే। ర-కా. అని చెప్పబడుటచే గంధకము బీజగ్రహణ
శక్త్యుత్పాదకమును, బీజపాకసమర్థమును అగుటంబట్టి
గ్రాసద్రవ్యములయొక్క ప్రథమ పరిమాణ విభాగములను
చారణముచేయుటకు ముందును, ప్రతిజారణాంతమునందును
గంధకముతో రసమునకు జారణము జేయవలసియుండును.
ఇటుల రసమునకు జేయు జారణముల మొత్తము గంధక
ముతోజేరి ముప్పదిమూడు అని దెలియవలెను.

స్వర్ణ - అభ్రకములకు గర్భద్రావణ విధానము:—లవణవర్గ †
ద్రవ్యములను, క్షారవర్గ ‡ ద్రవ్యములను ఖల్వమునందుంచి, యందు
అమ్లరసవర్గ ** ద్రవ్య స్వరస కషాయములతోను, మూత్రవర్గము

---

† లవణవర్గము—శ్లో॥ లవణానిషడుచ్యంతే సాముద్రం
సైంధవం బిడం। సౌవర్చలం రోమకంచ చూలికా లవణం
తథా॥ ర-ర-స.—సముద్రలవణము, సైంధవలవణము,
బిడాలవణము, సౌవర్చలవణము, రోమకలవణము, చూలికా
లవణము అను నీ యారు లవణములును గలసి లవణవర్గమని
చెప్పబడును.

‡ క్షారవర్గము—శ్లో॥ క్షారత్రయం సమాఖ్యాతం
యవసర్జికటంకణం। పలాశముష్కకక్షారౌ యవక్షారస్సు
వర్చికా॥ తిలనాలోద్భవఃక్షారః సంయుక్తం క్షారపంచకం॥
ర-ర-స.—యవక్షారము,' సర్జక్షారము, టంకణక్షారము
అనునవి మూడును గలసి క్షారత్రయమనబడును. మోదుగ
చెట్టు క్షారము, మొక్కవుచెట్టు క్షారము, యవక్షారము,
సర్జక్షారము, నువ్వుచెట్టు క్షారము అను నీ యైదును గలసి
క్షారపంచకమనబడును. ఇందలి క్షారత్రయమునుగాని,
క్షారపంచకమునుగాని క్షారవర్గముగా గ్రహించవలెను.

** అమ్లవర్గము—శ్లో॥ అమ్లవేతస జంబీర నింబూకం
బీజ పూరకం। చాంగేరీ చణకామ్లంచ అమ్లికంకోల దాడి
మం॥ అంబష్టాతింతిడీకంచ నారంగం రసపత్రికా। కరమం
దం తథాచాన్య దమ్లవర్గః ప్రకీర్తితః॥ చణకామ్లశ్చ సర్వే
షాం ఏకఏవ ప్రశస్యతే। అమ్లవేతస మేకంవా సర్వేషా

తోను††, జెముడు పాలతోను ప్రత్యేకముగ నూరి, యొక బిళ్ళవలె జేసి దీనిని పరిశుద్ధమగు భుజపత్రియాకుపై యంటించి, దీని మధ్యభాగమున కొంచెము పల్లముగనుండునట్లు జేసి యందు చారితరసము నుంచవలెను. పిమ్మట నీ పత్రమును పరిశుద్ధముగను, దళసరిగను నుండు ఒక వస్త్ర ఖండముపైనుంచి దీనియొక్క నాలుగు కొనలను దగ్గరగాచేర్చి యా వస్త్రఖండములో మణిగియున్న భుజపత్రియాకున నూర్ధ్వమున నొక

---

ముత్తమోత్తమం॥ రసాదీనాం విశుద్ధ్యర్థం ద్రావణే జారణే హితం । కోలదాడిమ వృక్షామ్ల చుల్లికా చుక్రికారసం॥ పంచామ్లకం సముద్దిష్టం తచ్చోక్తం చామ్లపంచకం॥ ర-ర-స.—పుల్లప్రబ్బలి, నిమ్మపండు, గజనిమ్మపండు, మాదీఫలము, పులిచింత, సెనగపులుసు, చింతపండు, రేగుపండు, దానిమ్మపండు, అంబష్ట (పులిచింతభేదము), చింతాకు, నారింజపండు, చుక్కకూర, ఖాకపండు అనునవి యమ్లవర్గ మనబడును. వీనిలో రసశోధనమునకును, గ్రాసద్రావణమునకును, గ్రాసజారణమునకును సెనగపులుసు ఒక్కటియే శ్రేష్ఠమైన దనియు, పుల్లప్రబ్బలి మిక్కిలి శ్రేష్ఠమైనదనియు తెలియవలెను. మరియు, వీనిలో రేగుపండు, దానిమ్మపండు, చింతపండు, మాదీఫలము, పులిచింత యను నీ యైదునుగలసి యమ్లపంచకమని వ్యవహరించ బడును.

†† మూత్రవర్గము—శ్లో॥ మూత్రాణి హస్తికరభమహిషీ ఖరవాజినాం । గోజావీనాం......॥ ర-ర-స.—ఏనుగు, ఒంటె, గేదె, గాడిద, గుఱ్ఱము, ఆవు, మేక అను నీ జంతువులయొక్క మూత్రములు మూత్రవర్గ మనబడును.

సన్నని త్రాడుతో నావస్త్రఖండమును చుట్టి కట్టవలెను. అటుపిమ్మట నీ మూటను జాగ్రత్తగ డోలాయంత్రమున నమర్చి, యాయంత్ర భాండమున క్షారజలము ‡‡ ను, ఆరనాళమును, మూత్రవర్గమును ఉక్తపరిమితిని బూరించి, ప్రత్యేక ప్రత్యేకముగ మూడు దినములు స్వేదనము జేయవలెను. ఇటులనే ప్రతి గ్రాస పరిమాణగ్రస్త రసమునకును స్వేదనము జేయవలెను. ఇందువలన గ్రస్తద్రవ్యమునకు రసగర్భమున ద్రవరూపమేర్పడును *

## రసగర్భద్రావితస్వర్ణ - అభ్రకజారణ విధానము

శ్లో॥ తతః కచ్ఛపయంత్రేణ జ్వాలనే జారయేద్రసం।
ఊర్ధ్వాధశ్చాష్టమాంశేన బిడందత్వా క్రమేణతు॥
ఆ-ప్ర.

పూర్వోక్త క్రియచే గర్భమునందు ద్రవరూపమును బొంది యున్నట్టి స్వర్ణాభ్రకగ్రాసములతో గూడియున్న రసమును కచ్ఛప

---

‡‡ క్షారజలము—క్షారవర్గమున జెప్పబడిన క్షారములను మెత్తగా చూర్ణించి, జలమునందుగలిపి, యొకరాత్రి యూరబెట్టి, వడియగట్టిన జలము క్షారజలముగా గ్రహించ నగును.

* ఈ విధముగ స్వేదనము జేసినపిమ్మట స్వాంగశీతలమున నా యంత్రమునుండి రసమును జాగ్రత్తగా గ్రహించి యుష్ణకాంజికముతో క్షాళన విధానము ననుసరించి క్షాళనముజేసి యెండలో నారబెట్టవలెను.

తోను††, జెముడు పాలతోను ప్రత్యేకముగ నూరి, యొక బిళ్ళవలె జేసి దీనిని పరిశుద్ధమగు భుజపత్రియాకుపై యంటించి, దీని మధ్యభాగమున కొంచెము పల్లముగనుండునట్లు జేసి యందు పారితరసము నుంచవలెను. పిమ్మట నీ పత్రమును పరిశుద్ధముగను, దళసరిగను నుండు ఒక వస్త్ర ఖండముపైనుంచి దీనియొక్క నాలుగు కొనలను దగ్గరగాచేర్చి యా వస్త్రఖండములో నుణిగియున్న భుజపత్రియాకున కూర్ధ్వమున నొక

---

ము త్తమోత్తమం॥ రసాదీనాం విశుద్ధ్యర్థం ద్రావణే జారణే హితం । కోలదాడిమ వృక్షామ్లం చుల్లికా చుక్రికారసం॥ పంచామ్లకం సముద్దిష్టం తచ్చోక్తం చామ్లపంచకం॥ ర-ర-స.—పుల్లప్రబ్బలి, నిమ్మపండు, గజనిమ్మపండు, మాదీఫలము, పులిచింత, సెనగపులుసు, చింతపండు, రేగుపండు, దానిమ్మపండు, అంబష్ట (పులిచింతభేదము), చింతాకు, నారింజపండు, చుక్కకూర, వాకపండు అనునవి యమ్లవర్గ మనబడును. వీనిలో రసశోధనమునకును, గ్రాసద్రావణమునకును, గ్రాసజారణమునకును సెనగపులుసు ఒక్కటియే శ్రేష్ఠమైన దనియు, పుల్లప్రబ్బలి మిక్కిలి శ్రేష్ఠమైనదనియు దెలియవలెను. మరియు, వీనిలో రేగుపండు, దానిమ్మపండు, చింతపండు, మాదీఫలము, పులిచింత యను నీ యైదునుగలసి యమ్లపంచకమని వ్యవహరించ బడును.

†† మూత్రవర్గము—శ్లో॥ మూత్రాణి హస్తికరభమహిషీ ఖరవాజినాం । గోజాపీనాం......॥ ర-ర-స.—ఏనుగు, ఒంటె, గేదె, గాడిద, గుఱ్ఱము, ఆవు, మేక అను నీ జంతువులయొక్క మూత్రములు మూత్రవర్గ మనబడును.

సన్నని త్రాడుతో నావస్త్రఖండమును చుట్టి కట్టవలెను. అటుపిమ్మట నీ మూటను జాగ్రత్తగ డోలాయంత్రమున నమర్చి, యాయంత్ర భాండమున క్షారజలము ‡‡ ను, అరనాళమును, మూత్రవర్గమును ఉక్తపరిమితిని బూరించి, ప్రత్యేక ప్రత్యేకముగ మూడు దినములు స్వేదనము జేయవలెను. ఇటులనే ప్రతి గ్రాస పరిమాణగ్రస్త రసమునకును స్వేదనము జేయవలెను. ఇందువలన గ్రస్తద్రవ్యమునకు రసగర్భమున ద్రవరూపమేర్పడును *

## రసగర్భద్రావితస్వర్ణ - అభ్రకజారణ విధానము

శ్లో॥ తతః కచ్ఛపయంత్రేణ జ్వలనే జారయేద్రసం।
ఊర్ధ్వాధశ్చాష్టమాంశేన బిడందత్వా క్రమేణతు॥
అ-ప్ర.

పూర్వోక్త క్రియచే గర్భమునందు ద్రవరూపమును బొంది యున్నట్టి స్వర్ణాభ్రకగ్రాసములతో గూడియున్న రసమును కచ్ఛప

---

‡‡ క్షారజలము—క్షారవర్గమున జెప్పబడిన క్షారములను మెత్తగా చూర్ణించి, జలమునందుగలిపి, యొకరాత్రి యూరబెట్టి, వడియగట్టిన జలము క్షారజలముగా గ్రహించ నగును.

* ఈ విధముగ స్వేదనము జేసినపిమ్మట స్వాంగశీతలమున నా యంత్రమునుండి రసమును జాగ్రత్తగా గ్రహించి యుష్ణకాంజికముతో క్షాళన విధానము ననుసరించి క్షాళనము జేసి యెండలో నారబెట్ట వలెను.

నీరావియోగినీం తత్ర ఛిద్రే కాచవిలేపితాం।
మృణ్మూషాం స్థాపయేత్తస్యా మూర్ధ్వాధస్తుల్య
గంధకం॥ రసం నిక్షిప్య తస్యోర్ధ్వం శరావేణ
విముద్రయేత్। వన్యోపలాగ్నిం తస్యోర్ధ్వం
జ్వాలయేద్గురుమార్గతః॥ స్వాంగశీతం సముద్ధృత్య
పునస్తుర్యాంశగంధకం। దత్వాపూర్వక్రమేణైవ
జారయేత్ షడ్గుణం బలిం॥ ఆ-ప్ర.

---

ణము, స్వేదనాది దీపనాంత సంస్కారసంస్కృత రస
గంధక జారణము, సామాన్యవిధి శోధిత రసగంధక జార
ణము, హింగుళాకృష్ట రసగంధక జారణము అని నాలుగు
విధములుగా విభజింపవచ్చును. అందు స్వర్ణాభ్రక జారిత
రసమునకు జేయునట్టి గంధక జారణము బీజగ్రహణశక్తిని
గలిగించునదియు, బీజపాకమును జేయునదియు, రసాయన
శక్తిని వృద్ధిజేయునదియునై యుండును. మిగిలిన మూడు
విధములగు జారణములును, "గంధకజారణ రహితః సం
శుద్ధోఽపిరసః యోగేషు న యోజ్యః,గదహన్తృత్వ శక్త్య
నుదయాత్। అతఃస్వేదనాది దీపనాంతైః సంస్కారైః రసం
సంశోధ్య ప్రోక్తవిధినా గంధకేన సమ్మూర్ఛ్యమాత్రయా
పథ్యయోగేన సంసేవ్యో యావ దారోగ్యమితి॥" (ఆ-
ప్ర.) అను న్యాయము ననుసరించి కేవలము రోగహరణ
శక్త్యుత్పాదకములై యున్నవి. ఇటుల జారణము జేయ
దగు గంధకముయొక్క పరిమితి రసమునకు సమగుణము

మొదలు సహస్రగుణములవరకు గ్రహింపఁదగి యుండును. కాని వీటియన్నింటిలోను షడ్గుణ గంధకజారణము పైని జెప్పిన రెండు విధములగు ప్రయోగములకు జాలునని దెలియనగును. ఈ షడ్గుణ గంధక జారణముజేయుట కనేక యంత్రములు గలవు. కాని వాటిలో కచ్ఛపయంత్ర సహాయమునను, సికతాయంత్రసహాయమునను జేయుట సులభముగా నుండును. అయితే యిందలి కచ్ఛపయంత్రమునందు జారణము జేసినచో రసము గంధకముచే బంధింపబడక జారితమయ్యు యథా పూర్వస్వరూపముననే యుండును. సికతాయంత్రమున జేయబడు జారణ విధానమున రసము గంధకముతో మూర్ఛితమై బంధితమగును. అనగా చాంచల్యాది రహితమై సిందూర రూపమున స్థిరముగ నుండును. కావున గ్రాసద్రవ్యములకు పలుమార్లు చారణాది కర్మలను జేయవలసి యుండును గాన రసమును దాని నిజరూపమున నుంచుట యవసరముగా నుండును. అందుకు నిట పైని జెప్పిన కచ్ఛపయంత్ర సహాయమున షడ్గుణాంత జారణములుజేయుట యుక్తము. లేదా, యీ గ్రాసజారిత రసమునకు రసాయన సిద్ధికై భస్మత్వమును బొందించుటయే పరమావధిగాన యటుల ముందు జెప్పబోవు విధానమున భస్మరూపమును బొందించుటకు దగిన రూపమున (నిజరూపమున) నుంచుటకై గ్రాసజారణ కాలమునజేయు గంధకజారణముల నన్నింటిని కచ్ఛపయంత్రముననే జేసినజేయవచ్చును. లేక, కడపటి గంధకజారణమును విడచి మిగిలిన వానినెల్ల యీ కచ్ఛపయంత్రముననే జేసి, యంతిమ జారణమును మాత్రము,

ంత్రము * నంయుంచి, దీనికి యెనిమిదవవంతుండునట్లు సిద్ధము జేయ

---

* కచ్ఛపయంత్ర నిర్మాణవిధానము.—శ్లో॥ జలగర్భం దృఢంపాత్రం సువిశాలం సమాహరేత్ । తదన్తః ఖర్పరం దద్యాత్ సువిస్తీర్ణం సమం దృఢం॥ బిడం దత్వా తదుపరి క్షిపే ద్బీజభుజం రసం । ఉపరిష్టాద్బిడం దత్వా తతో లోహకటోరికాం॥ అయస్కాంతమయీం వాపి పిత్తలీ హత విగ్రహాం । ఉపరిష్టాదధోవక్త్రాం దత్వా సమ్యగ్విలేపయేత్॥ ఉపరిష్టా ద్వనోత్థాన్తై రంగారైః ఖర్పరం భవేత్॥

తా-సం.—విశాలమైన ముఖమును, ఉదరమును గలిగి దృఢముగనుండు ఒక భాండమున నిండుగా నీళ్లుపోసి యుంచవలెను. కొంచెము దీర్ఘముగనుండి విశాలమైన ముఖమును, పై భాండముయొక్క ముఖముద్వారా తదన్తస్థమైన జలములో మునిగియుండదగిన పృష్ఠమునుగలిగి దృఢముగనుండునట్టి యొక శరావమును ఆ భాండముపై నుంచవలెను. పిమ్మట నీ శరావమునందు బిడ మధ్యగతమైన గ్రాసగ్రస్త రసమునుంచి, దీనిపై ఇనుముతోగాని, అయస్కాంతముతోగాని, యిత్తడితోగాని చేయబడినట్టి చిప్పను బోర్లించి కప్పవలెను. దీనియొక్క సంధిని మృత్తికచే దృఢముగ లేపనముజేసి, యూర్ధ్వభాగమున యీ శరావమునందు బొగ్గునిప్పులను బూరించవలెను. లేక, పిడకలతో లఘువుగ పుటపాకమునైన జేయవలెను.

ిన బిడమును † గ్రహించి, దీనిచే పారసము నూర్ధ్వాధో భాగములగప్పి
ాగా రసమును బిడమధ్యమున నుండునట్లు జేసి, యగ్ని సహాయమున
కము జేయవలెను. ఇటుల గ్రాసద్రవ్యముల యొక్క ప్రతిపరిమాణ
ాగమునకును క్రమముగా జారణము జేయవలెను. ఇట్టి క్రియవల్ల
ాసద్రవ్యములకు రసముతో నైక్యత యేర్పడును.

## గంధక జారణ విధానము *

) శ్లో॥ ఆకంఠం కలశంభూమౌ నిఖాయ జలసంభృతం।
శరావ స్తన్ముఖే స్థాప్యో మధ్యే ఛిద్రసమన్వితః॥

---

† బిడనిర్మాణము—శ్లో॥ దగ్ధంశంఖం రవిక్షీరైః
ావితం శతధాతపే। తతఃపంచపుటైః పక్వంజారణే బిడము
త్తమం॥ ర-ప.—శంఖమును కాల్చి మెత్తగా చూర్ణించి,
యా చూర్ణము నొక శరావమునం దుంచి. అందు జిల్లేడు
ాలను నిండుగాపోసి, బాగుగా కలియగలిపి, యా శరా
ము నెండలో నా పాలు ఇగిరిపోవువరకు నుంచవలెను.
రిగి యా శరావములో జిల్లేడుపాలను బోయుచు, నెండలో
ండించుచూ నిటుల నూరుమార్లు భావన జేయవలెను.
మ్మట నా పిష్టమును బాగుగా నెండించి యగ్నిసంయోగ
మన లఘువుగా నైదుమారులు పుటపాకము జేయవలెను.
టుల సిద్ధమైనశంఖచూర్ణమును జారణకర్మకుత్తమమైన బిడ
ముగా గ్రహింపనగును. బిడనిర్మాణము క్షారామ్లాదిసంయో
ముున ననేకవిధములుగా జెప్పబడియున్నను అందు సులభసా
ధ్యమైన విధాన మొకటిమాత్రమే యిట నుదహరింపబడినది.

* ఈ జారణము—స్వర్ణాభ్రక జారిత రసగంధక జార

నీరావియోగినీం తత్ర ఛిద్రే కాచవిలేపితాం।
మృణ్మూషాం స్థాపయేత్తస్యా మూర్ధ్వాధస్తుల్య
గంధకం॥ రసం నిక్షిప్య తస్యోర్ధ్వం శరావేణ
విముద్రయేత్। వన్యోపలాగ్నిం తస్యోర్ధ్వం
జ్వాలయేద్గురుమార్గతః॥ స్వాంగశీతం సముద్ధృత్య
పునస్తుర్యాంశగంధకం। దత్వాపూర్వక్రమేణైవ
జారయేత్ షడ్గుణం బలిం॥ ఆ-ప్ర.

---

ణము, స్వేదనాది దీపనాంత సంస్కారసంస్కృత రస
గంధక జారణము, సామాన్యవిధి శోధిత రసగంధక జార
ణము, హింగుళాకృష్ట రసగంధక జారణము అని నాలుగు
విధములుగా విభజింపవచ్చును. అందు స్వర్ణాభ్రక జారిత
రసమునకు జేయునట్టి గంధక జారణము బీజగ్రహణశక్తిని
గలిగించునదియు, బీజపాకమును జేయునదియు, రసాయన
శక్తిని వృద్ధిజేయునదియునై యుండును. మిగిలిన మూడు
విధములగు జారణములును, "గంధకజారణ రహితః సం
శుద్ధోఽపిరసః యోగేషు న యోజ్యః, గదహన్తృత్వ శక్త్య
నుదయాత్। అతఃస్వేదనాది దీపనాంతైః సంస్కారైః రసం
సంశోధ్య ప్రోక్తవిధినా గంధకేన సమ్మూర్ఛ్యమాత్రయా
పథ్యయోగేన సంసేవ్యో యావ దారోగ్యమితి॥" (ఆ-
ప్ర.) అను న్యాయము ననుసరించి కేవలము రోగహరణ
శక్త్యుత్పాదకములై యున్నవి. ఇటుల జారణము జేయ
దగు గంధకముయొక్క పరిమితి రసమునకు సమగుణము

మొదలు సహస్రగుణములవరకు గ్రహింపదగి యుండును. కాని వీటియన్నింటిలోను షడ్గుణ గంధకజారణము పైని జెప్పిన రెండు విధములగు ప్రయోగములకు జాలునని దెలియనగును. ఈ షడ్గుణ గంధక జారణముజేయుట కనేక యంత్రములు గలవు. కాని వాటిలో కచ్ఛపయంత్ర సహాయ మునను, సికతాయంత్రసహాయమునను జేయుట సులభముగా నుండును. అయితే యిందలి కచ్ఛపయంత్రమునందు జార ణము జేసినచో రసము గంధకముచే బంధింపబడక జారిత మయ్యు యథా పూర్వస్వరూపముననే యుండును. సికతా యంత్రమున జేయబడు జారణ విధానమున రసము గంధక ముతో మూర్ఛితమై బంధితమగును. అనగా చాంచల్యాది రహి తమై సిందూర రూపమున స్థిరముగ నుండును. కావున గ్రాస ద్రవ్యములకు పలుమార్లు చారణాది కర్మలను జేయవలసి యుండును గాన రసమును దాని నిజరూపమున నుంచుట యవసరముగా నుండును. అందుకు నిట పైని జెప్పిన కచ్ఛప యంత్ర సహాయమున షడ్గుణాంత జారణములు జేయుట యుక్తము. లేదా, యీ గ్రాసజారిత రసమునకు రసాయన సిద్ధికై భస్మత్వమును బొందించుటయే పరమావధిగాన యటుల ముందు జెప్పబోవు విధానమున భస్మరూపమును బొందించుటకు దగిన రూపమున (నిజరూపమున) నుంచు టకై గ్రాసజారణ కాలమున జేయు గంధకజారణముల నన్నిం టిని కచ్ఛపయంత్రముననే జేసినజేయవచ్చును. లేక, కడపటి గంధకజారణమును విడచి మిగిలిన వానినెల్ల యీ కచ్ఛప యంత్రముననే జేసి, యంతిమ జారణమును మాత్రము,

(2) శ్లో॥ కూపీకోటర మాగతం రసగుణైః గంధై స్తులా
యాం విభుం విజ్ఞాయ జ్వలనే క్రమేణ సికతా
యంత్రే శనైః పాచయేత్। వారంవారమనేన
వృద్ధి విధినా గంధక్షయే సిద్ధయే సిందూరాన్య

---

సిందూరరూపమున మూర్ఛితమైయుండుటగూడ నొక విధ
మగు భస్మరూపమును బొందుటయేగాన సికతాయంత్ర
సహాయమున జేసినను జేయవచ్చును. కేవలము సికతా
యంత్రమున జేయబడు జారణమువలన మూర్ఛితమై సిం
దూరరూపముననుండు రసమును యోగములందు జేర్చుకొన
వలసి వచ్చినచో నారసమునకు పాతనయంత్ర సహాయమున
నిజరూపమును గలిగించి యటుల దానిని జేర్చుకొనవచ్చును.
లేక, యటుల సిందూరరూపముననే గూడ నాయాయోగ
ములందు జేర్చుకొనవచ్చును. అయితే పై విధముగ
గ్రహింపబడిన రసము జారితరసమని జెప్పబడుచున్నది.
రసమును గ్రహింపక సిందూరరూపముననే యుంచినచో
నయ్యది రససిందూరమని వ్యవహరింపబడుచున్నది. వ్యవ
హారములో ధారాళముగ నుపయోగింపబడుచున్నట్టి యేక
గుణ సిందూరము, ద్విగుణసిందూరము, షడ్గుణసిందూరము,
పూర్ణ చంద్రోదయము, మకరధ్వజ మున్నగున వన్నియు
గంధక మూర్ఛితములై, సిందూరరూపముననున్న రసములే
యగుచున్నవి. ఇట కచ్ఛపయంత్రమున జేయబడు జార
ణముపైని వివరించిన విధానమున జేయదగియుండును. ఇక
సికతాయంత్రమున జేయు విధానము వివరింపబడును.

దిశో౽నుభూయ భణితః కర్మక్రమో౽యం
మయా॥ ఆ-ప్ర.

(1) కచ్ఛపయంత్రసహాయమున జేయు గంధక జారణ విధానము—పూర్వోక్తవిధానమున హేమాభ్రజారితమైన రసమును ఒక మృణ్మయమూషయందుంచి, సమాంశముగ గ్రహింపబడిన శోధితగంధకముచే దాని యూర్ధ్వాధోభాగములందు కప్పవలెను. అనగా—గంధకములో సగభాగము తొలుత మూషయందు పరచి, దానిపై రసము నుంచి, మిగిలిన గంధకభాగము నా రసముపై కప్పవలెను. విశాలమగు ముఖమును ఉదరమును గల యొక భాండమును గ్రహించి, దీని కంఠమువరకు భూమిలో పాతియుంచి, దీనియొక్క ముఖమువరకు జలముతో బూరించవలెను. పిమ్మట దీని ముఖము కప్పునంత వైశాల్యముగల నొక శరావమును గ్రహించి, దీని మధ్యభాగమున రసగంధకముల నుంచిన మూషయొక్క సగభాగము ప్రవేశించుటకు తగినంత వైశాల్యముగల రంధ్రమును జేసి యందు పై మూషను ప్రవేశపెట్టి వాటి సంధియందు దృఢముగ బంకమన్నుతో లేపనము జేయవలెను. ఆ మూషయొక్క ముఖమునుగూడ వేరొక శరావముచే గప్పి యా సంధికిగూడ లేపనము జేయవలెను. ఈ విధమగు నిర్మాణమువలన మూష జలములో మునిగియుండుటనుబట్టి రసమునకుగూడ జలసంబంధ మేర్పడును. అందుచే రసమునకు గంధకముతో బంధన మేర్పడకపోవుటయు, అగ్నిని సహించుటయు నేర్పడును. ఇటుల యంత్రము నమర్చిన పిమ్మట నా శరావమును (జలభాండముయొక్క ముఖముపై నుంచిన శరావమును) బొగ్గునిప్పలచే బూరించి నియమితకాల మూదవలెను. లేక, పిడకలతో లఘుపుటములైన వేయవలెను. ఈ క్రియావిధానమువలన గంధకము రసమునందు జారితమగును. స్వాంగశీతలమున పై విధముగనే మరియొక సమభాగము గంధకమును జేర్చి, యథాపూర్వముగ సంధిలేపాదులను

జేసి, తిరిగి యగ్నిని ప్రజ్వలింపజేయవలెను. ఇటుల క్రమముగా షడ్గుణ గంధక జారణమును బూర్తిజేయవలెను. ఇదియే కచ్ఛపయంత్రసహాయమున జేయు గంధక జారణ విధానము.

(2) సికతాయంత్రసహాయమునజేయు గంధక జారణ విధానము*

---

* సికతాయంత్రమున జేయు జారణము అంతర్ధూమ బహిర్ధూమ భేదముచే రెండువిధములుగా జేయబడును. గంధకముయొక్క ధూమమును బయటకుబోకుండునట్లు జేసి పాకము జేయబడునట్టిది యంతర్ధూమ జారణమనియు, గంధకముయొక్క ధూమమును బయటకు బోవునట్లు జేసి పాకము జేయబడునట్టిది బహిర్ధూమ జారణమనియును దెలియవలెను. ఈయంతర్ధూమ పాకమున గంధకముయొక్క క్షయమును దెలిసికొనుటకుగాని తిరిగి గంధకమును జేర్చుటకు గాని సాధ్యముగానేరదు. కావున జారణము జేయదగిన గంధకపరిమితినంతను ఒకేసారి రసముతో జేర్చి, కజ్జలిజేసి, యాకూపికయందు నింపి జేయవలసి యుండును. ఇందలి పాకలక్షణముకూడ ప్రత్యక్షముగ దెలిసికొనుటకు శక్యముగానేరదు. కేవలము నియమితకాలము వరకు పాకము జేయవలసియుండును. అయితే కచ్ఛపయంత్రము నందువలె యిందు గంధకధూమమును గూడ బయటకు బోనియ్యక పాకము జేయబడునుగాన యిట్టి జారణము బహిర్ధూమ జారణముకంటె మిక్కిలి శ్రేష్ఠమైనదిగా దెలియవలెను. అనుభవమునుబట్టి ఒక తులము పరిమితిగల గంధకజారణమునకు మూడుగంటలకాలము చాలునని దెలిసి

—సికతాయంత్రము † నందు దృఢమగు కాచకూపికను ‡ లేక,

కొనబడినది. ఇక బహిర్ధూమపాకమున గంధకక్షయమును గాని, పాకలక్షణమునుగాని ప్రత్యక్షముగా దెలిసికొన వచ్చును. ఈ పాకము సులభమైనదనియే చెప్పవచ్చును.

† సికతాయంత్రము—శ్లో॥ భాండే వితస్తి గంభీరే మధ్యే నిహితకూపికే। కూపికా కంఠపర్యంతం వాలుకాభిశ్చ పూరితం॥ భేషజం కూపికాసంస్థం వహ్నినాయత్రపచ్యతే। వాలుకాయంత్రమేతద్ధి యత్రతత్ర బుధైః స్మృతం॥ పా-సం. —కొద్దిగ విశాలమైన ముఖముగలిగియు, పదిరెండంగుళముల లోతును (దైర్ఘ్యమును) గలిగియున్నట్టి మృద్భాండమును గ్రహించి, దీని మధ్యభాగమున నిలిచియుండునట్లు అందొక కాచకూపికనుంచి, దీని కంఠమువరకు కప్పియుండునట్లు ఆభాండము నిసుకచే బూరించవలెను. పిమ్మట నా కూపికయందు జారణౌషధమును బూరించి యగ్నిచే బాకము జేయబడునట్టిది సికతాయంత్రమనబడును. దీనికే వాలుకాయంత్రమని గూడ వ్యవహారము గలదు.

‡ కాచకూపిక—శ్లో॥ నాతిహ్రస్వాం కాచకూపీం నచాతిమహతీం దృఢాం। వాససాకర్దమాక్తేన పరివృత్య సమంతతః॥ సంలిప్య మృదువస్త్రైశ్చ శోషయే ద్భానురశ్మినా। నిధాయభేషజం తత్ర ముఖమాచ్ఛాదయేత్తతః॥ కఠిన్యా దృఢయావాపి పచేద్యంత్రే విధానతః। కవచీయంత్రమేతద్ధి రసాదిపచనే హితం॥ పా-సం.—ఎక్కువ పొట్టియు,

నెక్కువ పొడుగునుగానట్టి యొక గాజుకుప్పెనుగాని, వ్యవహారములో వాడుకొనబడునట్టియు, నెర్రని వర్ణముగలిగి నట్టియు, సన్ననిముఖము గలిగి గుండ్రముగనుండు నట్టియు, నలుబది తులముల ద్రవద్రవ్యమును భరింపగల యుదరమును గలిగినట్టియు నొక గాజు సీసానుగాని గ్రహించవలెను దీనిని పరిశుద్ధముగ గడిగి యెండబెట్టవలెను. ఈ సీసాయొక్క యధోభాగమున నుండు మధ్యభాగమునుండి ముఖభాగమువరకుగల పరిమాణమంత నిడివియు, రెండంగుళముల వెడల్పును గలిగి యుండునట్లు పలుచని వస్త్రఖండములను కత్తిరించి; యందొక్కొక్క వస్త్రఖండమును చదునైన బల్లపై పరచి, జిగురువచ్చునట్లు మెత్తగా నీళ్లతో నూరబడిన పుట్టమన్నును వాటి కొకవైపుననే పలుచగను, సమముగను, అంతట గప్పియుండునట్లును బూయవలెను. ఇటుల బూయబడిన వాటిలో నొక వస్త్రఖండమును దీసికొని దీనియొక్క యొక యగ్రభాగము సీసాయొక్కయడుగు మధ్యభాగమునందును రెండవ యగ్రభాగము సీసాయొక్క ముఖభాగమునందును అంటియుండునట్లు దానిని నిలువుగ సీసాకు అంటించవలెను. పిమ్మట మధ్యమధ్య ముడతలు లేకుండునట్లు అధోభాగమునుండి ముఖభాగమువరకు తడిచేతితో నదుముచు సవరించవలెను. ఇటుల జేసిన యీ వస్త్రఖండము సీసాకు దృఢముగ నంటుకొనును. ఇటులనే రెండవదానినిగూడ మొదటిదాని ప్రక్కనుండునట్లు పైవిధముగ నంటించవలెను. అయితే యీ ద్వితీయాది వస్త్రఖండముల నంటించునప్పుడు పూర్వస్థవస్త్రఖండముయొక్క

కవచీయంత్రమును సిద్ధముజేసి, యుక్తవిధానమున || నమర్చి, యా కూపికలో నొకభాగము గంధకమును బోసి, పిమ్మట నా యంత్రమును

నిలువుటంచుపై యుత్తరస్థవస్త్ర ఖండముయొక్క నిలువు టంచు మిక్కిలి సూక్ష్మముగా కప్పియుండునట్లు జూడవలెను. ఇటుల నా సీసానంతటను కప్పి మరియొకసారి తడిచేతితో సమగ్రముగా నదుముచు సవరించవలెను. పిమ్మట దీనిని యెండలో నెండించవలెను. ఇటుల జేసిన యయ్యది యొకకవచమని దెలియవలెను. ఈ విధముగా నేడుకవచముల నియ్యవలెను, అప్పుడు కాచకూపిక జారణపాకార్హమైనట్లుగా గుర్తించవలెను. అయితే యీ చెప్పబడిన విధానములో కూపికాముఖము తెరువబడియే యుండునుగాన యిట్టిది బహిర్ధూమపాకమునకే యోగ్యమైనదిగా నెంచవలెను. కవచమిచ్చుటకు పూర్వముననే కూపికయందు రసగంధక కజ్జలిని పూరించి, దీనిముఖము నొకగుండ్రని కుండపెంకుతో మూసి, సంధిలేపనముజేసి, యీబిళ్లగూడ కప్పబడియుండునట్లు మరికొంచెము దైర్ఘ్యముగల మృల్లేపిత వస్త్రఖండములతో పై విధానము ననుసరించి కవచమిచ్చి సిద్ధము జేసినచో నయ్యది యంతర్ధూమ పాకమునకు యోగ్యమైనది యగును. ఇట్లు రెండువిధములుగ సిద్ధముచేయబడినట్టివి కాచకూపికలనియు, కవచీయంత్రములనియు జెప్పబడును.

|| యంత్రమునందు కూపికానిక్షేపణ విధానము—

వాలుకాయంత్ర భాండముయొక్క యధోమధ్యభాగమున చిటికెనవ్రేలు దూరునంతటి బెజ్జమును జేసి, యాభాండము

బొయ్యిపై నుంచి క్రమాగ్నుల ¶ చే బాకము చేయవలెను. ఈ పాకము నందు గంధకము బాగుగా గరగినట్లు తెలిసికొని, రసభాగమునంతను

---

లోపల నా బెజ్జముపై రెండంగుళముల వైశాల్యముగలిగి గుండ్రముగనుండు ఒక కుండపెంకుతో కప్పవలెను. ఇటుల జేయుటవలన నత్యధికోష్ణ సంయోగముచే నాయంత్ర భాండము పాకమధ్యమున పగిలిపోకుండుటయు, కావలసి నంత యుష్ణ మాబెజ్జముద్వారా లోపలకు బ్రవేశించి యిసుకలో నన్నివైపులకు సమముగ వ్యాపించుటయు నేర్పడును. అందుచే బెజ్జము, పెంకును అవసరములని తెలియవలెను. ఆ పెంకుపై తొలుత నొక యంగుళము మందమున ఇసుకను సమముగ పరచి పెంకుకు నిదానముగనుండు నట్లా యిసుకపై కూపికను నిలబెట్టి, దీని కంఠమువరకు నాభాండమును తిరిగి యిసుకచే బూరించవలెను.

¶ క్రమాగ్నులు—సికతాయంత్రమున గంధక జారణము జేయునప్పుడు పాకలక్షణము కనుపించువరకు నగ్నిని చల్లార్పకూడదు. అనగా నియమిత కాలమువరకు అహోరాత్రము లగ్నిని బ్రజ్వలింపజేయుచునే యుండవలెనని భావము. ఈ యగ్నిని బ్రజ్వలింపజేయుటలోగల క్రమము నిట్లు దెలియవలెను. "నివేశ్యచుల్యాం దహనం మంద మధ్య ఖరంక్రమాత్। ప్రజ్వాల్యద్వాదశేయామం స్వాంగ శీతలముద్ధరేత్॥ (ర-మం) యంత్రమును పొయ్యిపై నుంచి యగ్నిని క్రమముగా మందము, మధ్యము, ఖరము అను నీ మూడు తరగతులుగా నియమితకాలములో విభజించి ప్రజ్వ

అందు జాగ్రత్తగా జేర్చవలెను. కొంతకాలమునకీ రసగంధకములు రెండును గలసి నల్లని వర్ణముతో పంకమువలె గానుపించును. ఈ సమయమున కమలాకృతిగ జ్వాల వచ్చునట్లు అగ్నిని హెచ్చించవలెను. ఇటుల కొంతకాలము పాకము జేయగా కూపికాముఖము * నందలి

---

లింపజేయవలెను. ఈ మంద మధ్య ఖరములే వరుసగా దీపాగ్ని, కమలాగ్ని, గాఢాగ్నియని వ్యవహరింపబడును. అందు గంధకము కరగి రసముతో బాగుగా కలియువరకు దీపాగ్నితోను, పిమ్మట గంధకక్షయమగువరకు కమలాగ్నితోను, అటుపిమ్మట పాకలక్షణము కానుపించువరకు గాఢాగ్నితోను పాకము జేయవలెను. రెండు కట్టెలయొక్క సంయోగముచే దీపమువలె కేవలము యంత్రముయొక్క అడుగు మధ్యభాగమున స్పృశించునట్టి జ్వాలతోగూడిన యగ్ని దీపాగ్ని యనబడును. అయిదారు కట్టెలయొక్క సంయోగముచే తామరపువ్వువంటి యాకృతిగలిగి యంత్రముయొక్క మధ్యభాగము చుట్టును స్పృశించునట్టిజ్వాలాసముదాయముతోగూడిన యగ్ని కమలాగ్ని యనబడును. అధికసంఖ్యగల కట్టెలయొక్క సంయోగముచే యంత్రముయొక్క ముఖమును స్పృశించునట్టి దీర్ఘమైన జ్వాలాసముదాయముతో గూడిన యగ్ని గాఢాగ్ని యనబడును. ఇటుల క్రమముతో ప్రజ్వలింపజేయబడునట్టి యగ్నులే క్రమాగ్నులని దెలియవలెను.

* కూపికాముఖమునందు జ్వాలాదర్శనము—అగ్నిసంయోగముచే గంధకము మండునట్టి స్వభావముగలదిగాన

జ్వాలాదర్శనమువల్లను, కూపికలో ప్రవేశపెట్టబడిన సన్నని లోహ
శలాక†కు అంటియుండు మిక్కిలి పలుచని పంకమువంటి ద్రవ్య
దర్శనమువల్లను గంధకక్షయమును తెలిసికొని తిరిగి మరియొక గంధక

---

ఘుట్టి పాకసమయమున కొంతకాలమైనపిమ్మట కూపిక
యందు స్వయముగా మండుట నారంభించును. కాని
గంధకము హెచ్చుపరిమితిలో నున్నప్పుడు కేవలము ధూ
మమే కూపికాముఖమునుండి వచ్చునుగాని, జ్వాల రానేరదు.
గంధకము క్షీణించుట నారంభించినప్పటినుండియు నది
జ్వలించుట ఏర్పడును. ఆ జ్వాలయే కూపీముఖమున గాను
పించును. దీనియందు గానుపించు భిన్నభిన్న వర్ణములను
బట్టి గంధకముయొక్క హెచ్చుతక్కువలను గుర్తింప
నగును. అనగా పీతరక్తహరితవర్ణము లాజ్వాలయందు
గానుపించినచో గంధకము కొంచెము హెచ్చుగా నున్న
ట్లును, శ్వేతవర్ణము మాత్రము గానుపించినచో గంధకము
మిక్కిలి తక్కువగానున్నట్లును దెలియవలెను.

† లోహశలాక—పాకసమయమున కూపికలో సన్నని
లోహశలాకను ప్రవేశపెట్టి, తిరిగి పైకిదీసి చూచినచో
దానికి మిక్కిలి తక్కువైన యార్ద్రితతో గూడి పలుచగ
పంకమువంటి ద్రవ్యము అంటుకొనియున్నట్లు కానుపించును.
దీనినిబట్టి గంధకక్షయమును గుర్తించవలెను. గంధకము
అధిక ప్రమాణముననున్నప్పుడు అపంకమువంటి ద్రవ్యము
మిక్కిలి చిక్కగా శలాకను అంటుకొనియున్నట్లు గాను
పించును. దీనినిబట్టి గంధకస్థితిని దెలియవలెను.

భాగమును మెల్ల మెల్లగా ‡ నా కూపికయందు జేర్చవలెను. ఈ సమయమున నగ్నిని కొద్దిగా తగ్గించి పాకము జేయవలెను. పిమ్మట కొంత కాలమునకు అగ్నిని హెచ్చించుచు, గంధకక్షయమును దెలిసికొనుచు మరియొక గంధకభాగమును జేర్చి యగ్నిని తగ్గించుచు నిటుల గంధకము యొక్క యారుభాగములను కూపికయందు జేర్చినపిమ్మట గంధకక్షయమును దెలసి, యప్పుడు గాఢాగ్నిచే పాకము జేయవలెను ||. ఇటుల పాకము జేయగా నిశ్శేషముగ గంధకమంతయు క్రమముగా రసమునందు జీర్ణమై రసమూర్ఛనమునకు హేతువగును. అనగా గంధకజారణముచే రసము సిందూర రూపమున మూర్ఛితమై కూపికయొక్క కంఠము

---

‡ గంధకముయొక్క ద్వితీయాది భాగములను జేర్చునప్పుడు కొంచెము కొంచెముగా జేర్చుట యుక్తముగా నుండును. ఏలయన - ఒక్కొక భాగమునే యొకేసారి జేర్చినచో నప్పటిస్థితిలోనుండు ఉష్ణాధిక్యతచే నాగంధకమంతయు నొకేసారి కరగి కూపీముఖమునుండి బయటకు పొంగిపోవును. కావున పైవిధముగ జేయుట యోగ్యమగును.

|| గంధకభాగము లింకను మిగిలియున్నప్పుడు త్వరపడి యగ్నిని గాఢముగా ప్రజ్వలింపజేయరాదు. గాఢాగ్ని సిందూరీకరణమునకు హేతువగును. అప్పుడు తిరిగి గంధక సమ్మేళనమునకు యోగ్యత లేకపోవును. జారణ సమయమున గంధకాంతమువరకు బాకముచేయగూడదు. కావున యగ్నిని అన్నింటికిని కడపటనే గాఢముగా బ్రజ్వలింపజేయవలెనని దెలియవలెను.

నందు లగ్నమగును. ఇట్టి పాకముయొక్క లక్షణమును ¶ దెలిసి, యగ్నిని చల్లార్చి, స్వాంగశీతలమైన యంత్రమునుండి కూపికను దీసికొని, యందలి మూర్ఛితరసము నుక్తవిధానమున

---

¶ సిందూరపాకలక్షణము——పాకానసానమున కూపికలో లోహశలాకను అడుగువరకు ప్రవేశపెట్టి, పైకితీసి చూచినచో కొంచెమైనను తడిలేక (నల్లని) బూడిదవంటి పొడిపదార్థ మాశలాకాగ్రభాగమున నంటుకొనియున్నట్లు కానుపించును. తగుమాత్రముగ స్వచ్ఛమైన ధూమమా కూపికాముఖమునుండి వచ్చుచుండును. వీటినిబట్టి గంధకభాగము పూర్తిగా క్షీణించిపోయినట్లు దెలియవలెను. ఈ లక్షణమును దృఢపరచుకొనుటకై యాశలాకను ఎఱ్ఱగా కాల్చి యొకసారి తిరిగి కూపికలో ప్రవేశపెట్టవలెను. అప్పుడు ఏవిధమగు జ్వాలయు కూపికలో కానుపించకపోయినచో గంధకము క్షీణించినట్లు నిశ్చయింపవలెను. మరియు, కూపికాముఖమునుండి లోపలివైపుకు నిదానముగ జూచినచో దాని యధోభాగము మధ్యాహ్నార్కసదృశముగ గానుపించును. దీనినిబట్టి గూడ గంధకరాహిత్యమును నిశ్చయింపవలెను. పిమ్మట కొంచెముకాలముపేక్షించి మరియొకసారి శలాకను ప్రవేశపెట్టి చూచినచో తెల్లని బూడిదవంటి పదార్థమంటుకొనియున్నట్లు గానుపించును. మరియు గంధకగంధ మేమాత్రమును లేకయుండును. ధూమముగూడ నిలిచిపోవును. అప్పుడు పాకము పూర్తియైనట్లు నిశ్చయించి యగ్నిని చల్లార్పవలెను.

* గ్రహించవలెను. అంతర్ధూమ విపాకమునగూడ రసము పై విధముగనే మూర్ఛితమై కూపీకంఠమున లగ్నమైయుండును. దీనినిగూడ పై విధముగనే గ్రహించవలెను. ఇదియే సికతాయంత్రసహాయమున జేయు గంధక జారణ విధానము †.

---

* కూపికనుండి సిందూరమును గ్రహించు విధానము—కూపికపైనున్న కవచమును పూర్తిగా తొలగించి, శుభ్రపరచి, దానియొక్క యడుగుభాగమును జాగ్రత్తగా పగులగొట్టి, యాభాగమును దూరముగా తొలగించవలెను. పిమ్మట కంఠలగ్నమైన సిందూరమును దీర్ఘముగను సన్నముగను నుండు కత్తివంటి సాధనముతో నా పగులగొట్టిన మార్గముద్వారా నిపుణముగ వేధించిన యయ్యది కూపిక నుండి పట్టువదల్చుకొని బయటకు జారును. అట్టి దానిని వేరొక పాత్రలోనికి గ్రహించవలెను.

† పైని వివరించిన విధానములో గంధకముయొక్క షడ్భాగములను ఒక్కొక్కటిగా జేర్చుకొనవలెనని జెప్పబడినది. కాని రసముతో గంధకభాగములన్నిటిని యొకే పర్యాయము జేర్చి, కజ్జలిజేసి, యుక్తవిధానమున పాకముజేసినను జేయవచ్చును. అయితే యొక్కొకభాగముసే జేర్చుచు పాకముజేసినప్పుడు క్రమజారణ మేర్పడుననియు, కజ్జలిగా జేసి పాకముజేసిన యట్టిక్రమ ముండనేరదనియు నిట దెలియవలెను. మరియు, గుణాపాదనమునకు క్రమపాకమే శ్రేష్ఠమైనది గాని, క్రమ భిన్నపాకము అట్లుగా నేరదు. కావున క్రమపాకముసే జేయుట హితము.

## ఉక్త సంగ్రహము

రసౌషధ నిర్మాణము, జ్వరాదివ్యాధిహరౌషధ-రసాయనౌషధ రూపమున రెండువిధములుగా నుండును. అందు, జ్వరాదిహరౌషధ నిర్మాణమునకు గ్రహింపబడునట్టి రసము స్వేదనాద్యష్ట సంస్కార సంస్కృతము, సామాన్యవిధి శోధితము, హింగుళాకృష్టము * అని

---

* హింగుళాకృష్టరసము—ఇంగిలీకమునుండి యాకర్షింపబడిన రసము హింగుళాకృష్ట రసమనబడును. ఇట్టి రసము శోధిత హింగుళమునుండి యూర్ధ్వపాతన యంత్ర సహాయమున నాకర్షింపబడియుండును. అయితే యనుభవములో నీక్రింద నుదహరించిన విధానమున రస మాకర్షింపబడుచున్నది. పదునైదు తులముల పరిమితిగల శుద్ధ హింగుళమును మెత్తగాచూర్ణించి, దీనికి ద్విగుణముగా హరిద్రా చూర్ణమును గ్రహించి యా రెంటిని బాగుగా కలియ గలిపి యుంచవలెను. పిమ్మట పరిశుద్ధమై ఒకటిన్నర యడుగు ప్రమాణముగలిగి నలుచదరముగనుండు వస్త్ర ఖండమును బల్లపై పరచి, దీనిమీద నా చూర్ణమునుంచి, దానిని యావస్త్రఖండముయొక్క నాలుగంచులయందు నొక్కొక్క యంగుళము విడచి మిగిలినభాగమంతయు నది పలుచగను. సమముగను వ్యాపించియుండునట్లు చేతితో నిపుణముగ సవరించవలెను. పిమ్మట నావస్త్రఖండమును ఒకవైపునుండి వత్తివలె బిగువుగ చుట్టి దానిని సన్నని త్రాటితో చుట్టుచు బంధించవలెను. ఇటుల బంధింపబడిన యావత్తిని మధ్యకు మడిచి యొక శరావమునందుంచి

మూడు విధములుగా నుండును. స్వేదనాది ప్రకరణమున వివరించిన సంస్కారవిధానమున సంస్కరింపబడినట్టి రసము మిగుల శ్రేష్ఠము. రసశోధన ప్రకరణమున వివరించిన విధానమున సిద్ధముజేయబడినట్టి

---

యందు ఎఱ్ఱని బొగ్గు నిప్పులను తగుమాత్రముగా పూరించవలెను. పిమ్మట నీ శరావమును గాలితగులని ప్రదేశము నందుంచి దీనికి మూడువైపుల మూడు పలుచని చిల్లపెంకులను దగ్గరగానుండునట్లు నేలపై నుంచవలెను. పిమ్మట తనముఖములో శరావము అణగియుండునంతటి వైశాల్యముగల ముఖమును, మిక్కిలి వైశాల్యముగల యుదరమును గలిగిన భాండమును గ్రహించి దాని నా శరావముపై బోర్లించి యా పెంకులపై నిలబడియుండునట్లు కప్పియుంచవలెను. భాండముయొక్క పృష్ఠముపై తడిగుడ్డను పరచవలెను. ఈగుడ్డ యారిపోయినచో తిరిగి తడిజేసి పరచుచుండవలెను. ఇట్లుల జేయుటవలన ఆపెంకుల సందునుండి తగు మాత్రము గాలి లోన ప్రవేశించి యందలి యగ్నికి సహాయము జేయుటయు, నందువలన యావత్తు క్రమముగా దగ్ధమగుటయు, నందుచే హింగుళాంతర్గతమైన రసము ధూమరూపమున యా భాండోదరమునందంతటను లగ్నమగుటయు నేర్పడును. స్వాంగశీతలమున నాభాండోదరమున నంటి యున్న ధూమరూపరసమును ఊర్ధ్వపాతన సంస్కారానంతరము యంత్రమునుండి గ్రహించిన రసమువలె గ్రహించి గాళనము జేయవలెను.

రసమును, హింగుళమునుండి గ్రహించినట్టి రసమును † ఔషధయోగము లందు జేర్చుటలో రెండవపక్షమునకే చెందినవి యగును. అందుచే నష్ట సంస్కార సంస్కృతమైన రసమునే యట్టి ప్రయోజనమునకు గ్రహించుట శ్రేయోదాయకము. రసాయనౌషధనిర్మాణమునకు స్వర్ణాభ్రక జారణాంతమువరకు గల సంస్కారములచే సంస్కృతమైన రసమునే గ్రహించవలెను. ఏలయనగా—"సజలదకలధౌత సాకహీనః స్పృశతి రసాయనతా మితి ప్రతిజ్ఞా।" (ఆ-ప్ర) రసమునకు రసాయనత్వము స్వర్ణాభ్రకజారణములను జేయనిదే కలుగనేరదు. కావున రసాయనౌషధములకు అటుల జారితమైన రసమును గ్రహించుట హితము. అయితే యీ ద్వివిధౌషధ నిర్మాణములో గ్రహింపబడునట్టి రసములకు ఆ యోగములందు జేర్చుటకు పూర్వము ప్రోక్తవిధిని గంధక జారణము జేయవలెనను నియమము నవశ్యముగ బాటింపవలెను. "గంధక జారణ రహితః సంశుద్ధోఽపి రసో యోగేషు న యోజ్యః, గదహర్తృత్వ శక్త్యనుదయాత్ ॥" (ఆ-ప్ర.) అనియు, "బీజీకృతైరభ్రకసత్వహేమ తారార్కకాంతైః పరిజారితో యః। హత స్తతః షడ్గుణగంధకేన సబీజబద్ధో విపులప్రభావః।" (ఆ-ప్ర.) అనియు రసాచార్యుల సిద్ధాంతము. అనగా రసౌషధ నిర్మాణమునకెట్టి రసమును గ్రహించినను దానికి గంధకజారణము జేయనిదే వ్యాధి హరణశక్తి కలుగనేరదు. ఇటులనే రసాయనత్వసిద్ధికై హేమాభ్రకములను రసమునందు జారణము జేసినను

---

† "యది కేవలం రోగఘ్నేచ్ఛా చేత్ స్వేదనాది దీపనాంతైః సంస్కారైః సంశోధ్య...సంసేవ్యః"॥ ఆ-ప్ర. అను వచనమునుబట్టి సంస్కార సంస్కృతరసమే ప్రథమ గ్రాహ్యమనియు, సామాన్యవిధి శోధితరసమును, హింగుళాకృష్ట రసమును రెండవపక్షముగ గ్రాహ్యములనియు రసాచార్యుల సమ్మతములని తెలియవలెను.

దీనికిగూడ గంధకజారణము చేయనిచో నట్టి ప్రభావము సిద్ధింపనేరదు. కావున రసమునందీ యీ రెండువిధములగు ప్రభావములను సంపాదించుటకై దానికి ముందుగా గంధకజారణ మవశ్యముగ చేయవలెనని తెలియవలెను.

## రస భస్మము

ఇది యూర్ధ్వభస్మ, తలభస్మ యని రెండువిధములుగా నుండును. అందు సికతాయంత్రమున పాకముజేయగా పాత్రయొక్క యూర్ధ్వతలమున లగ్నమగునట్టిది యూర్ధ్వభస్మ యనబడును. ఇది సిందూర రూపము, కర్పూర రూపము అని రెండువిధములుగా నుండును. ఇవి వరుసగా రససిందూరము, రసకర్పూరము అను నామములతో వ్యవహరింపబడును. ఈ రెండువిధములగు భస్మలును ఘనరూపముననే యనగా గడ్డగనే యుండును. "మూర్ఛిత్వాహరతిరుజం", (ర-హృ) అని చెప్పబడుటంజేసి ఈ రససిందూర రసకర్పూరములు రెండును కేవల మూర్ఛితరసములే గాన వ్యాధిహరణహేతుక ప్రయోజనమునే గలిగి యుండును. రసోపరసలోహాదులకువలె రసమున కుక్తవిధానమున మారణము జేయగా పాత్రయొక్క యధస్తలమున స్వచ్ఛమగు తెల్లని వర్ణముతో చూర్ణరూపమున నుండునట్టిది తలభస్మ యనబడును. "అమరీకరోతి సుమృతః." (ర-హృ.) అని చెప్పబడుటచే నీ మారితరసము రసాయన హేతుక ప్రయోజనమును గలిగియుండును. ఇట్టి తలభస్మను సిద్ధముజేయుటకు ముందుగా రసమునకు బద్ధత్వమును గలిగింపవలెనని రసశాస్త్ర సిద్ధాన్తము. రసమునకీ బద్ధత్వము హేమాభ్రక గంధక జారణములచే గలుగుచున్నది. ఇటుల బంధింపక, త్వరపడి రసమారణముజేసి యట్టి మారితరసమును సేవించినచో "అబద్ధసూతం తు హతం ప్రమాదాత్ కరోతి కుష్ఠం ప్రబలం నరాణాం." (ర-హృ-టీక.)— నయ్యది ప్రబలమైన కుష్ఠవ్యాధిని గలిగించును. ఇట కుష్ఠశబ్దమునకు

సమస్త త్వగ్రోగములని యర్థమును గ్రహించవలెను. కావున రసమారణము చేయుటకుముందు రసబంధన మవశ్యముగ చేయవలెనని తెలియవలెను. ఈ రసబంధనమునకు వలయు హేమాభ్రకాది జారణవిధానము జారణప్రకరణమునుండి తెలియనగును. ఇక నీ మూడువిధములగు రసభస్మల విధానము లిట నరుసగా వివరింపబడును.

## రససిందూర విధానము *

శ్లో॥ శుద్ధసూతంతు తత్తుల్య శుద్ధగంధక మేవహి।
తయోః కజ్జలికాంకుర్యాద్దిన మేకం విమర్దయేత్॥
మృత్కర్పటైర్విలిప్తాయాం కూప్యాంకజ్జలికాంక్షిపేత్।
వాలుకాయంత్రగాం యావ త్పచే ద్దినచతుష్టయం॥
గృహ్ణీయా దూర్ధ్వసంలగ్నం సిందూరసదృశంరసం॥
ఆ-ప్ర.

---

* రససిందూరము రసభస్మలలో నొక భేదమగుటచే నీ భస్మ ప్రసంగమున నిట దీని విధానమిట్లు దిఙ్మాత్రముగ జెప్పబడినది. గంధక జారణముచేతనే రసమునకు సిందూర భావమేర్పడును. అందుచే దీని పాకవిధానమందలి వివరములన్నియు గంధకజారణ ప్రసంగమున బూర్తిగ వర్ణింపబడినవి. కావున సికతాయంత్ర నిర్మాణము, కాచకూపికా నిర్మాణము, కాచకూపికా నిక్షేపణము, క్రమాగ్ని ప్రదానము, పాకలక్షణము, కూపికనుండి సిందూరమును గ్రహించువిధానము మున్నగు వానిని గంధక జారణ ప్రకరణమునుండి గ్రహింపవలెను.

సిందూరరూప ఊర్ధ్వభస్మవిధానము—పూర్వోక్త విధానమున శోధింపబడిన రసమును, శుద్ధిజేయబడిన (ముందు చెప్పబడబోవు విధానమున) గంధకమును సమాంశములు గ్రహించి, ఖల్వమున నొకదినము మర్దించి కజ్జలిజేయవలెను. పిమ్మట నీకజ్జలిని కాచకూపికయందుంచి సికతాయంత్రసహాయమున క్రమాగ్నులలో నాలుగుదినములు పాకము చేయవలెను. స్వాంగశీతలమున కూపికయొక్క యూర్ధ్వభాగమున లగ్నమైన సిందూరరూపరసభస్మము గ్రహించవలెను. ఈవిధముగ సిద్ధము చేయబడినది యూర్ధ్వరసభస్మ మనబడును.

## రససిందూర గుణములు

శ్లో॥ అపహరతి రోగబృందం దృఢయతి కాయం మహద్బలం కురుతే। శుక్రశతాని చ సూతే సిందూరాఖ్యో రసః పుంసాం। స్మరస్యాయుత్నాగదగహన దావానల శిఖా పరం వహ్నేస్తేజో బలరుచిరతావల్లి ముదిరః। అపిప్రౌఢస్త్రీణాం అతులబలహారీ నిధువనే రసః సిందూరాఖ్యః సకలరసరాజో విజయతే। ఆ-ప్ర.

రససిందూరమును మాత్రాపరిమితి * ననుసరించి తత్తద్వ్యాధ్యో

---

* రససిందూరమునకు మాత్రాపరిమితి—శ్లో॥ బంధూకపుష్పారుణ మీశజస్య భస్మప్రయోజ్యం సకలామయేషు। నిజానుపానై ర్మరణం జరాంచ నిహన్తివల్లః క్రమసేవనేన॥ ఆ-ప్ర.—రససిందూరమును మూడు గురుగింజల పరిమితిని సమస్తవ్యాధులయందును ఆయా వ్యాధుల కనుకూలమైన అనుపాన విశేషములతో సేవించవలెను.

జనముల కనువగు అనుపానవిశేషములతో † సేవింపవలెను. ఇయ్యది సమస్తమైన వ్యాధులను శమింపజేయును. జాఠరాగ్నిని వృద్ధిపరచును. రసాది ధాతువుల శక్తిని వృద్ధిజేసి శరీరమున కధిక బలమును గలిగించును. విశేషముగ శుక్రమును వృద్ధిజేసి కామోద్దీపనము గలిగించును.

## రసకర్పూర విధానము

శ్లో॥ శుద్ధసూతసమం కుర్యాత్ప్రత్యేకం గైరికం సుధీః।
ఇష్టికాంఖటికాం తద్వత్స్ఫటికాం సింధుజన్మ చ॥
వల్మీకం క్షారలవణం భాండరంజన మృత్తికాం।

---

† రససిందూరానుపానములు—శ్లో। వాతేసక్షౌద్ర పిప్పల్యపిచకఫరుజిత్ర్యూషణం సాగ్నిచూర్ణం పిత్తే సైలం సితేందు వ్రణవతి తు వరాగుగ్గులుశ్చారుశుద్ధః। చాతుర్జాతేన పుష్టౌ హరనయనఫలం శాల్మలీపుష్పవృన్తం కింవాకాంతా లలాటాభరణమపి రసేస్యాదనూపాన మేతత్॥ అ-ప్ర.—వాతవ్యాధులందు మధుసహితమైన పిప్పలి చూర్ణమును, కఫవ్యాధులందు త్రికటు చూర్ణమును, చిత్రమూలచూర్ణమును, పిత్తవ్యాధులందు ఏలకులు, చక్కెర, పచ్చకర్పూరము వీని యొక్క చూర్ణమును, వ్రణరోగములందు త్రిఫలములు, శోధిత గుగ్గిలము వీటియొక్క చూర్ణమును, ధాతుపుష్టికి చాతుర్జాతక చూర్ణమును, కొబ్బరినీళ్లు, బూరుగు పువ్వుల తొడిమెల చూర్ణమును, కుంకుమపువ్వు చూర్ణమును రససిందూర సేవనయందు అనుపానములుగా జేర్చుకొన వలెను.

సర్వాణ్యేతాని సంచూర్ణ్య వాససా పరిశోధయేత్॥
ఏభిశ్చూర్ణైర్యుతం సూతం యావద్యామం విమర్దయేత్।
తచ్చూర్ణ సహితం సూతం స్థాలీమధ్యే పరిక్షిపేత్॥
తస్యాస్థాల్యా ముఖేస్థాలీ మపరాంధారయేత్సమాం।
సవస్త్ర కుట్టితమృదా ముద్రయే దుభయోర్ముఖం॥
సంశోష్య ముద్రయేద్భూయో భూయః సంశోష్య ముద్రయేత్। సమ్యగ్విశోష్యముద్రాంతాం స్థాలీం ఛుల్ల్యాం నిరోధయేత్। అగ్నిం నిరన్తరం దద్యాత్ యావద్దిన చతుష్టయం। అంగారోపరి తద్యంత్రం రక్షేద్యత్నాదహర్నిశం। శనైరుద్ఘాటయే ద్యంత్రం ఊర్ధ్వ స్థాలీ గతం రసం। కర్పూరవత్సువిమలం గృహ్ణీయా ద్గుణవత్తరం। ఆ-ప్ర.

రసకర్పూరరూప ఊర్ధ్వభస్మ విధానము—పూర్వోక్త విధానమున శోధింపబడిన రసము, కావిరాయి, ఇటుకరాయి, సుద్ద, పటిక, సైంధవలవణము, పుట్టమన్ను, చవిటియుప్పు, కుమ్మరావలోని మన్ను అను నీ ద్రవ్యములను సమభాగములుగా గ్రహించి, యందు రసమును విడచి మిగిలిన వానిని మెత్తగాచూర్ణించి వస్త్రగాళితము జేసి యీ చూర్ణ సముదాయముతో రసమునుజేర్చి, యొక జాముకాలము మర్దించవలెను, పిమ్మట దీనినంతను ఒక భాండమునందుంచి దీని ముఖమును మరియొక భాండముతో ముఖముమై పునగప్పి (యూర్ధ్వపాతనయంత్రము వలె నమర్చి) వీటి ముఖసంధికి పలుమార్లు లేపనము జేసి యెండించవలెను. అది బాగుగా ఎండినపిమ్మట నీ సంపుటమును ప్రొయ్యిపై నుంచి నాలు గహోరాత్రములు అగ్నిని విరామములేకుండా ప్రజ్వలింప

చేయవలెను. స్వాంగశీతలమువ యంత్రమును విప్పి యంత్రోర్ధ్వభాండముయొక్క లోపలి యుపరిభాగమున కర్పూరమువలె లగ్నమై యుండు రసమును జాగ్రత్తగా గ్రహించవలెను. ఈ విధముగ సిద్ధము చేయబడినదిగూడ నూర్ధ్వరసభస్మయనియే చెప్పబడును.

## రసకర్పూరగుణము

శ్లో॥ ఫిరంగ కరికేసరీ సకలకుష్ఠ కాలానలః అఖిలవ్రణ వినాశకృద్వ్రిణజగర్త పూర్తిప్రదః। సువర్ణ సమవర్ణకృద్బల హుతాశ తేజస్కరః సమస్తగద తస్కరః రసపతిః స కర్పూరకః॥ ఆ-ప్ర.

రసకర్పూరమును మాత్రాపరిమితి * ననుసరించి యనుపాన పథ్య విశేషములతో సేవింపవలెను. ఇది ఫిరంగము, కుష్ఠము, వ్రణము మున్నగు సమస్త వ్యాధులను శమింపజేయును. గంభీరమగు వ్రణముల నతి శీఘ్రముగ రోపణము జేయును. శరీరమునకు బంగారుతో సమమగు వర్ణమును, బలమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధి పొందించును. మరియు, "రమయతి రమణీశతకం" శుక్రమును వృద్ధి జేసి కామోద్దీపనము గలిగించును.

---

* రసకర్పూరమునకు మాత్రాపరిమితి, అనుపానము, పథ్యము—శ్లో॥ వల్లం వల్లార్థంవా గుడేన జీర్ణేనరోగిణో దద్యాత్। దుగ్ధోదవంతు పథ్యం దేయం తస్మైచ తాంబూలం॥ ఆ-ప్ర.—రసకర్పూరమును మూడు గురుగింజల పరిమితినిగాని, నాలుగున్నర గురుగింజల పరిమితినిగాని ప్రాత బెల్లములో జేర్చి సేవించవలెను. పాలు అన్నమును గలిపి

## రసభస్మ విధానము

శ్లో॥ కాష్ఠోదుంబరికా దుగ్ధైరసం కించిద్విమర్దయేత్।
తద్దుగ్ధపిష్టహింగోశ్చ మూషాయుగ్మం ప్రకల్పయేత్॥
క్షిప్త్వా తత్సంపుటే గోళం తత్ర ముద్రాం ప్రకల్పయేత్।
ధృత్వా తద్గోలకం ప్రాజ్ఞో మృన్మూషాసంపుటేఽధికే॥
పచేద్గజపుటేనైవ జాతికోయాతి భస్మతాం। ఆ-ప్ర.

చూర్ణరూప రస భస్మ విధానము—పూర్వోక్త విధానమున సంస్కార సంస్కృతమైన రసమును బ్రహ్మమేడిపాలతో కొంచెము కాలము మర్దించి యొక గోళముగా జేయవలెను. ప్రశస్తమైన యింగువను బ్రహ్మమేడిపాలతో జక్కగా నూరి యాకల్కము నొకే ప్రమాణముగల రెండు చిన్న మూషలుగా జేసి, యందొక మూషలో పై రసగోళకము నుంచి, దీనిని రెండవ మూషతో గప్పి వీటి సంధికి లేపనము చేసి యెండించవలెను. పిమ్మట నీ హింగుమూషా సంపుటమును వేరొక మృణ్మూషాసంపుటమునం దుంచి, యీ సంపుటమునకు దృఢముగ వహ్నిమృత్తికచే సంధిలేపనము చేయవలెను. పిమ్మట దీనిని బాగుగా సెం

---

పథ్యముగా దీసుకొనవలెను. తాంబూలమును సేవించవలెను. ఈ విధముగా జేసిన సమస్తవ్యాధులను శమింపజేసి, యుక్తఫలప్రదమగును. మరియు, "తం దేవకుసుమ చందన కస్తూరీ కుంకుమైర్యుక్తం ఖాదేత్, పారతి।" ఆ-ప్ర. లవంగము, మంచిచందనము, కస్తూరి, కుంకుమపువ్వు అను నీ ద్రవ్యములయొక్క చూర్ణముతో జేర్చి రసకర్పూరమును సేవించిన గూడ యుక్తఫలప్రదమేయగును.

డించి యొక గజపుటమున * బాకము జేయవలెను. స్వాంగశీతలమున సంపుట సంధులను విదలించిచూచిన అందు రసము మృతమైయుండును. ఇదియే తలభస్మ విధానము. యథావతుగ మృతమైన రసముయొక్క లక్షణమును † సరిచూచి యట్టిభస్మను తత్తత్ప్రియోజనములకై యుపయోగించవలెను.

---

* గజపుటము—శ్లో॥ రాజహస్త ప్రమాణేన చతురస్రంచ నిమ్నకం। పూర్ణంచోపలశాఠీభిః కంఠావధ్యథ విన్యసేత్॥ పూర్వాచ్ఛగణతోఽర్ధాని గిరింఢాని వినిక్షిపేత్। ఏతద్గజపుటం ప్రోక్తం మహాగుణ విధాయకం॥ ర-ర-స,—ఒకటింబాతిక మూరెడు ప్రమాణమున లోతును, వైశాల్యమును గలిగి చతురస్రముగనుండు భూగర్తమును నేలమట్టమువరకు పిడకలచే నింపి, వీటిపై పుటపాకము జేయబడు నౌషధ ద్రవ్యముగల శరావసంపుటము నుంచి దీనిపై భూగర్తమును నింపుటకు గ్రహింపబడిన పిడకల సంఖ్యలో సగము సంఖ్యగల పిడకలచే గప్పి యగ్నిని ప్రజ్వలింపజేయవలెను. అనగా-ఒక్కొక్కటి 12 తులముల తూకముగల పిడకలచే భూగర్తమును నింపి, వీనిపై శరావసంపుటమునుంచి, యా సంపుటముపై అటువంటి పిడకలనే చేర్చి యగ్నిని ప్రజ్వలింపజేసిన యయ్యది గజపుటమని చెప్పబడును.

† మారితరసభస్మ లక్షణము.—శ్లో॥ అతేజా అగురుః శుభ్రోలోహహాఽచంచలోరసః। యదానావర్తతేవహ్నౌ నోర్ధ్వంగచ్ఛేత్తదామృతః॥ ఆ-ప్ర. — తేజస్సులేనిదియు, గురుత్వములేనిదియు, చాంచల్యములేనిదియు, అగ్నిపైనుం

## రసభస్మ గుణములు

శ్లో॥ రసాయనం త్రిదోషఘ్నో యోగవాహ్యతి శుక్రలః।
భస్మసూతో౽ఖిలాతంక నాశన స్త్వనుపానతః॥ ఆ-ప్ర.

రసభస్మను మాత్రాపరిమితిని * సేవించిన యెడల యుత్తమ రసాయనమగును. త్రిదోషములను శమింపజేయును. ఔషధయోగములందు చేర్చినచో నందలి ద్రవ్యముల యొక్క గుణములతో కలసి యాయావ్యాధుల శమింపజేయును. అధికముగ శుక్రమును వృద్ధిపరచును. అనుపాన భేదములతో సమస్త వ్యాధులను శమింపజేయును.

---

చిన ధూమమును బుట్టించనదియు, ఊర్ధ్వగమనములేనిదియు నై శ్వేతవర్ణముగలిగి లోహములను భక్షించునదిగ నున్నచో నట్టి రసభస్మ సమ్యగ్మారితమని గ్రహించవలెను. [ప్రస్తుతకాలమున బజారువంటు దొరకు రసభస్మయే గ్రహింపబడుచున్నది. మేముగూడ దీనినే గ్రహించి యోగములందు జేర్చుచున్నాము. అయితే దీనికి పై లక్షణములు ఒప్పుటలేదు. ఆ-ల.]

* రసభస్మకు మాత్రాపరిమితి—శ్లో॥ వల్లమేకం నరే౽శ్వేతు గద్యాణైకం గజేద్వయం। సర్వరోగ వినాశార్థం భిషక్సూతం ప్రయోజయేత్॥ ఆ-ప్ర.—రసభస్మను మానవులకు మూడు గురుగింజల పరిమితిని, అశ్వములకు నలుబదియెనిమిది గురుగింజల పరిమితిని, గజములకు తొంబైయారుగురుగింజలపరిమితిని సర్వవ్యాధులం దుపయోగింపవలెను. ఈపరిమితిని యుత్తమ మాత్రగా తెలియనలెను.

## రసాయనమునకు రసభస్మసేవన విధానము *

శ్లో॥ క్షేత్రీకృత నిజదేహః కుర్వీత రసాయనం మతిమాన్।
విధినా పథ్యవిధానా దమరదేహతుల్యదేహఃస్యాత్॥

---

* రసభస్మసేవనము—ఇది వ్యాధిహరణహేతుకము రసాయనహేతుకము అని రెండు విధములుగా నుండును. అందు, "అథయదికేవలం రోగఘ్నేచ్ఛాచేత్ స్వేదనాది దీపనాంతైః సంస్కారై రసంసంశోధ్య ప్రోక్తవిధినాసమ్మూర్చ్ఛ్య మాత్రయా పథ్యయోగేన సంసేవ్యో యావదారోగ్యమితి। అథరసాయనగుణేచ్ఛాచేత్ ...ప్రోక్తవిధినా సంసాధ్య మారణవిధినా హత్వా మాత్రయా క్షేత్రీకరణపూర్వకం పథ్యయోగేన మండలావధి షణ్మాసం వర్షైకం ద్వివర్షం త్రివర్షం వా సంసేవ్యః। తదా తదుక్తఫల మాప్నోతి" ఆ-ప్ర.—తత్తద్వ్యాధులందు పథ్యయోగమున మాత్రా పరిమితిననుసరించి వ్యాధి శమనమై పూర్వారోగ్యముకలుగు వరకు సేవింపబడునట్టిది వ్యాధిహరణహేతుకమగును. క్షేత్రీకరణ పూర్వకముగా పథ్యయోగమున మాత్రాపరిమితి ననుసరించి యొక మండలము (45 దినములు)గాని, యారు మాసములుగాని, యొక సంవత్సరముగాని, రెండు సంవత్సరములుగాని, మూడు సంవత్సరములుగాని యుక్తఫలము సిద్ధించువరకు సేవింపబడునట్టిది రసాయనహేతుకమగును. అందు సిందూర కర్పూర రూప రసభస్మసేవనము వ్యాధి హరణహేతుకమును, చూర్ణరూప రసభస్మసేవనము రసాయన హేతుకమును నగునని యిట గ్రహింపవలెను.

మృతాభ్రం భక్షయేన్మాస మేకమాదౌ విచక్షణః।
పశ్చాత్తం యోజయేద్దేహే క్షేత్రీకరణమిచ్ఛతః॥ ఇతి
శుద్ధో జాతబలః శాల్యోదనజాంగలాది ముద్గరసైః।
ప్రభాతే భక్షయేత్సూతం పథ్యం యామద్వయాధికే॥
నోల్లంఘయే త్త్రియామంతు మధ్యాహ్నే చైవభోజ
యేత్। తాంబూలాంతర్గతేసూతే విడ్బంధో నైవజా
యతే॥ సకణామమృతాంభుక్త్వా మలబంధే స్వపేన్నిశి॥
ఆ-ప్ర.

రసభస్మను సేవించుటకు పూర్వము మానవుడు తన శరీరమునకు సుక్షేత్రత్వమును కలిగించుకొనవలెను. అనగా రసము శారీరకధాతువులలో లీనమగుటకు వలయు సంస్కారమును జేసుకొనవలెననిభావము. ఇందుకు యథావిధిగ సిద్ధముజేయబడిన యభ్రకభస్మను † ఒక మాసము

---

† అభ్రకభస్మచే క్షేత్రీకరణము—శ్లో॥ దేవ్యారజో భవేద్గంధంధాతుః శుక్రంతథాభ్రకం। ఆలింగనే సమర్థాద్వా ప్రియత్వాచ్ఛివరేతసః॥ ఆ-ప్ర.—ఈ ప్రమాణము ననుస రించి రసాభ్రకముల కన్యోన్యమైత్రి యున్నటుల దెలియ నగును. అందుచేతనే రసాచార్యులు రససేవకు ముందు శరీరమునకు అభ్రకముతో క్షేత్రీకరణము అవశ్యముగ జేయవలెనని జెప్పియున్నారు. క్షేత్రీకరణమనగా భుజింప బడిన రసమును శారీరకధాతువు లాకర్షించి తమలో దానిని జీర్ణింపజేసుకుని తన్మూలమున నుత్తమరాసాయనిక శక్తివంత ములగునట్లు జేయు శారీరకధాతు సంస్కార విశేషమని దెలియవలెను.

సేవించవలెను. దీనిని సేవించునప్పుడు శాల్యోదనమును జాంగలాది మాంసరసములోడను ముద్గరసముతోడను భుజించుచుండవలెను. పిమ్మట యథాప్రమాణమున రసభస్మను తమలపాకునందు మడచి నియమితకాలము వరకు ప్రతిదినము ప్రభాతకాలమున సేవించవలెను. ఇటుల రసభస్మను సేవించునప్పుడు మధ్యాహ్నకాలమున అనగా ద్వితీయామాంతర కాలమున పథ్యమునుగూడ సేవించుచుండవలెను. తమలపాకునందు మడచి సేవించినచో రసభస్మవల్ల మలబంధము గలుగకుండును. ఒక వేళ మలబంధము గలిగినను రాత్రికాలమున పిప్పలీ చూర్ణమును త్రిఫలా చూర్ణమును భుజించి నిద్రింపవలెను.

## రసాజీర్ణజ వికారములు - అందు పరిహారము

శ్లో॥ రసాజీర్ణే మహావ్యాధిః లక్షయేద్భిషగుత్తమః।
అభ్యంగమనిలక్షోభే తైలైర్నారాయణాదిభిః॥
అరతౌ శీతతోయేన మస్తకే పరిషేచనం।
తృష్ణాయాం నారికేళాంబు ముద్గయూషం సశర్కరం॥
ఉద్గారేసతి దధ్యన్నం కృష్ణజీరంససైంధవం।
కార్శికం స్వర్జికాక్షారం కారవేల్లీ రసప్లుతం॥
గోమూత్రం సైంధవయుతం తస్య సంస్రావణంపరం॥

ఆ-ప్ర.

రసభస్మను సేవించునప్పుడు అపథ్యసేవనచే నది జీర్ణముగాక వాతవికారములను, అరతిని, తృష్ణను, ఉద్గారమును గలిగించును. వీనిని రసాజీర్ణజ వికారములని గుర్తించవలెను. అందు వాతవికారములకు నారాయణాది తైలములతో నభ్యంగమును, అరతియందు శిరస్సున శీతల జలముతో పరిషేచనమును, తృష్ణయందు నారికేళ జలపానమును,

చక్కెర జేర్చిన ముద్గయూషమును, ఉద్గారమునందు కృష్ణజీరక సైంధవ లవణచూర్ణములను జేర్చి దధ్యన్నభోజనమును జేయవలెను. ఈ యుపచారములకు రసాజీర్ణవికారములు శమించకపోయినచో నొక తులము సర్జక్షారమును కాకరాకు రసమునందు గలిపిగాని, సైంధవలవణమును గోమూత్రమునందు గలిపిగాని పానముజేసి యా రసమును బయటకు స్రావణము జేయవలెను.

## రస సేవనయందు పథ్యములు

శ్లో॥ ఘృతసైంధవధాన్యాక జీరకార్ద్రక సంస్కృతం।
తండులీయక ధాన్యాక పటోలాలంబుషాదికం॥
గోధూమ జీర్ణశాల్యన్నం గవ్యంక్షీరం ఘృతందధి।
హంసోదకం ముద్గయూషః పథ్యవర్గః ప్రకీర్తితః॥

ఆ–ప్ర.

ఘృతము, సైంధవలవణము, ధనియాలు, జీలకర్ర, అల్లము వీనిచే సంస్కరింపబడినట్టి చిర్రికూర, కొత్తిమిర్రి, చేదుపొట్లాకు, అలంబుష (లజ్జాలు భేదము) మున్నగు శాకములు, గోధూమాన్నము, ప్రాత వరియన్నము, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపెరుగు, హంసోదకము, పెసరకట్టు అను నీ వర్గమును రసభస్మను సేవించునప్పుడు పథ్యముగా గ్రహింపవలెను.

## రస సేవనయం దపథ్యములు

శ్లో॥ బృహతీ బిల్వకూష్మాండం వేత్రాగ్రం కారవేల్లకం।
మాషంమసూరం నిష్పావాన్ కులుత్థంసర్షపాం స్తిలాన్॥
లంఘనోద్వర్తనస్నాన తామ్రచూడ సురాసవాన్।
అనూపమాంస ధాన్యామ్లం భోజనం కదలీదలే॥

కాంస్యేచ గురువిష్టంభి తీక్ష్ణోష్ణం చ భృశంత్యజేత్।
కూష్మాండం కర్కటీంచైవ కారవేల్లం కలింగకం॥
కుసుంభికాంచ కర్కోటీం కదలీం కాకమాచికాం।
కకారాష్టకమేతద్ధి వర్జయే ద్రసభక్షకః॥
కపోతాన్ కాంజికంచైవ తక్రభక్తంచ వర్జయేత్।
కట్వమ్లతిక్తలవణం పిత్తలంచవివర్జయేత్॥
బదరం నారికేళంచ సహకారంసువర్చలం।
నారంగం కాంచనారంచ శోభాంజన మపిత్యజేత్॥

ఆ-ప్ర.

పెద్దములక, మారేడు, గుమ్మడికాయ, పేముచిగుళ్లు, కాకరకాయ, మినుములు, చిరుసెనగలు, అనుములు, ఉలవలు, అవాలు, నువ్వులు, ఉపవాసము, నలుగుబెట్టుకుని స్నానము చేయుట, కోడి మాంసము, సుర, ఆసవము, అనూపజంతుమాంసము, ధాన్యామ్లము, అరటియాకునందు భోజనము చేయుట, కంచుపాత్రయందు భోజనము చేయుట, గురుతీక్ష్ణోష్ణ గుణములుగల పదార్థములు, మలబంధము చేయు పదార్థములు అను నీ వర్గమును రసభక్షను సేవించునప్పుడు అపథ్యముగా విడువవలెను. మరియు, గుమ్మడికాయ, దోసకాయ, కాకరకాయ, పుచ్చకాయ, కుసుంభధాన్యము, ఆగాకరకాయ, అరటికాయ, కామంచికూర అను నీ వర్గమునుగూడ నపథ్యముగా విడువవలెను. మరియు, పావురముయొక్క మాంసము, తరవాణి, మజ్జిగ, కట్వమ్లతిక్త లవణరసద్రవ్యములు, పిత్తవర్ధకద్రవ్యములు, రేగుపండు, కొబ్బరికాయ, మామిడికాయ, ప్రొద్దుతిరుగుడుపువ్వు, నారింజపండు, దేవకాంచనము, మునగకాయ అను నీ ద్రవ్యములనుగూడ రససేవనయందపథ్యములుగా విడువవలెను.

## రసయోగములు *

### (1) రాజమృగాంకరసము

శ్లో॥ రసభస్మ త్రయోభాగాః భాగైకం హేమభస్మకం।
మృతతామ్రస్య భాగైకం శిలాగంధకతాళకం॥
ప్రతిభాగ ద్వయంశుద్ధం ఏకీకృత్య విచూర్ణయేత్।
వరాటాన్ పూరయేత్తేన అజాక్షీరేణ టంకణం॥
పిష్ట్వాతేన ముఖంరుద్ధ్వా మృద్భాండేతాన్నిరోధయేత్।
శుద్ధం గజపుటేపచ్యాత్ చూర్ణయేత్స్వాంగశీతలం॥
రసోరాజమృగాంకోఽయం చతుర్గుంజః క్షయాపహః।
దశపిప్పలికా క్షౌద్రైః మరి చైకోనవింశతిః॥
సఘృతైర్దాపయేద్వైద్యో రోగరాజ ప్రశాంతయే॥

ర-ర-స.

పూర్వోక్తవిధానమున చేయబడిన రససిందూరము మూడుభాగములు, స్వర్ణభస్మ మొకభాగము, తామ్రభస్మ మొకభాగము, శుద్ధిచేయబడిన మణిశిల రెండుభాగములు, శుద్ధిచేయబడిన గంధకము రెండుభాగములు, శుద్ధిచేయబడిన తాళకము రెండుభాగములు ఇటుల గ్రహించి

---

* శోధితరసముతోగాని, రసభస్మతోగాని మిశ్రితములుగానట్టి యౌషధములు రసశాస్త్రమునం దెచ్చటను గానరావు. అనగా రసాచార్యులచే గల్పింపబడిన రసౌషధయోగములన్నియు రసమిశ్రితములుగానే యుండును. వాని నెల్ల ఇతర గ్రంథములనుండి తెలిసికొననగును. ఇచ్చట గొన్ని దిఙ్మాత్రముగ దెలుపబడును.

ఖల్వమునం దన్నింటిని చేర్చి బాగుగా కలియ నూరవలెను. పిమ్మట నీ చూర్ణమును ప్రశస్తమైన పచ్చగవ్వలలో పూరించవలెను. శుద్ధిచేయ బడిన టంకణమును మేకపాలతో జిగురువచ్చువరకు వేరొక ఖల్వము నంగు నూరి యీ పిష్టముచే నా గవ్వలయొక్క ద్వారములకు లేపనము చేసి యెండించవలెను. పిమ్మట నీ శుష్కవరాటములను శరావసంపుటమునందుంచి సంధిబంధనము జేసి యొక గజపుటముచే పాకము జేయవలెను. స్వాంగశీతలమున దగ్ధములైన యీవరాటములను గ్రహించి ఖల్వమునందు మెత్తగా నూరవలెను. ఇట్టులచేసిన యయ్యది తెల్లగను, మృదువుగను నుండు చూర్ణమగును. ఇది రాజమృగాంకరసమని వ్యవహరింపబడును. దీనిని నాలుగు కురిగింజల పరిమితి చొప్పున పది పిప్పళ్లను, పందొమ్మిది మిరియములను మెత్తగా చూర్ణించి, యిందు కలిపి తేనెతో గాని, నేయితో గాని సేవించుచుండిన రాజయక్ష్మరోగము శమించును.

## (2) పూర్ణచంద్రోదయ రసము

శ్లో॥ పలంమృదుస్వర్ణదలం రసేంద్రం పలాష్టకం షోడశగంధకస్య। శోణైః సుకార్పాసభవైః ప్రసూనైః సర్వంవిమర్ద్యాథకుమారికాద్భిః॥ తత్కాచకుంభే నిహితం ప్రగాఢే మృత్కర్పటై స్తద్దినసత్రయంచ। పచేత్క్రమాగ్నౌ సికతాఖ్యయంత్రే తతోరజః పల్లవరాగరమ్యం॥ నిగృహ్యచైతచ్చ పలంపలంచ చత్వారి కర్పూర రజస్తథైవ। జాతీఫలం శోషణమింద్రపుష్పం కస్తూరికాయా ఇహ శాణమేకం॥ చంద్రోదయోఽయం కథితోఽస్య మాషో భుక్తోఽహివల్లీదళమధ్యవర్తీ। మదోత్కటానాం ప్రమదాశతానాం గర్వాధికత్వం శ్లథయత్యకాండే॥ ఘృతం ఘనీభూతమతీవదుగ్ధం గురూణిమాంసాని సమస్త

కాని। మాషాన్నపిష్టాని భవన్తి పథ్యాన్యానందదాయీ
న్యపరాణిచాత్ర। వలీపలిత నాశన స్తనుభృతాంవయస్తం
భనస్సమస్త గదఖండనః ప్రచురరోగ పంచాననః।
గృహేఽపిగృహభూపతి ర్భవతియస్య చంద్రోదయస్స
పంచశరదర్పితో మృగదృశాంభ వేద్వల్లభః॥ రతికాలే
రతాంతే వా సేవితవ్యో రసోత్తమః। నూనహానిం
కరోత్యేష ప్రమదానాం సునిశ్చితం॥ కృత్రిమం స్థావరం
చైవ జంగమంచాపి యద్విషం। నవికారాయ భవతి
సాధకే నాస్య వత్సరాత్। యథామృత్యుంజయాభ్యా
సాత్ మృత్యుంజయతి దేహినాం। తథాయం సాధకా
త్తస్య జరామరణనాశనః॥ తంత్రాంతే ప్రసిద్ధోఽయం
మకరధ్వజ నామకః॥ బ-రా.

శుద్ధిచేయబడిన స్వర్ణపత్రము ఒకపలము, యథోక్తవిధానమున సంస్కారింపబడిన పాదరస మెనిమిదిపలములు, శుద్ధిచేయబడిన గంధకము పదియారుభాగములు ఇటుల గ్రహించి, తొలుత స్వర్ణమును పాదరసములో గలిసిపోవునట్లు ఖల్వమునందు జక్కగా మర్దించవలెను. పిమ్మట యథోక్తవిధానమున జారణసంస్కారము* గావించి, యందు

---

* రసప్రకరణమున పాదరసమునకు జేయదగు సంస్కారములను జూడనగును. అటుల సంస్కారింపబడిన రసమునందే స్వర్ణము జారితమగును. స్వర్ణజారణము జేయుకయే సామాన్యముగా నన్నింటిని గలియనూరి పాకము జేసినచో పాకాంతమున స్వర్ణము అందుండి ప్రత్యేకముగ విడిపోవును. అట్లు విడిపోవునట్లుజేయుట యీ యోగకల్ప

గంధకమును చేర్చి కజ్జలిజేసి యెర్రప్రత్తిపువ్వుల స్వరసముతో మూడు దినములును, కలబందరసముతో మూడుదినములును మర్దించి, యెండించి మెత్తగా చూర్ణము జేయవలెను. దీనిని ఉక్తవిధానమున సిద్ధము చేయబడిన కాచకూపికయందు పూరించి, దానిని వాలుకాయంత్రమునం దమర్చి మూడహోరాత్రములు క్రమాగ్నులచే పాకముచేసి స్వాంగశీతలమున కూపికయొక్క కంఠమునందు లగ్నమైయున్న సిందూరమును గ్రహించవలెను. దీనిని మెత్తగా ఖల్వమున నూరినచో లేతచిగుళ్లవలె నెఱ్ఱని వర్ణముగలిగి యతిమనోహరముగ గానుపించును. ఇందు పచ్చకర్పూర చూర్ణము నొకపలమును, జాజికాయల చూర్ణము నొకపలమును, పిప్పళ్ల చూర్ణము నొకపలమును, లవంగ చూర్ణము నొకపలమును, కస్తూరి నొక శాణప్రమాణమును గలిపి బాగుగా గలియనూరవలెను †.

---

నమునందలి యుద్దేశ్యముగాదు. స్వర్ణముచేతను, గంధకముచేతను జారణముజేయబడిన రసమునకే యిందు జెప్పబడిన ఫలము సిద్ధించును. లేనిచో నిది నిష్ఫలమగును. కావున యథోక్తఫలప్రాప్తికై శాస్త్రసాంప్రదాయము ననుసరింపదగును. [ప్రస్తుతము వైద్యలోకమున సామాన్య విధానము ననుసరించియే యీ యోగము పాకము చేయబడుచున్నది. మేముగూడ నీ సాంప్రదాయమునే అనుసరించుచున్నాము. ఇందువలన బంగారము కూపికలో నడుగున బూడిదవర్ణముతో నిలిచిపోవుచున్నది. దీనిని సిందూరములోచేర్చి నూరి యుపయోగించుచున్నాము. ఆ-ల.]

† ఇందు ''జాతీఫలం శోషణ మింద్రపుష్పం'' అను పాఠమునకు ''జాతీఫలం చోషణ మింద్రపుష్పం'' అని మతభేదముగలదు. అందుచే శోషణశబ్దమునుబట్టి వాజీకరణా

ఈ విధముగ సిద్ధము చేయబడినట్టిది పూర్ణచంద్రోదయరసమని వ్యవహరింపబడును. ఇదియే తంత్రాంతరమున మకరధ్వజమనిగూడ వ్యవహరింపబడుచున్నది. దీని నొక మాషప్రమాణము తమలపాకుమధ్యను మడచి సేవించుచు, అధికముగ నెయ్యి, పాలు, గురుగుణముగల మాంసములు, మాషపిష్టము చే సిద్ధముచేయబడిన భక్ష్యములు, ఇతరములగు పుష్టికర పదార్థములు వీనిని భక్షించుచుండవలెను. ఇందువలన మిక్కిలి సంభోగశక్తి కలుగును. రాజయక్ష్మాది సమస్తవ్యాధులును శమించి శరీరమునకు స్థిరత్వమేర్పడును. మరియు, దీనిని మైథునమునకు పూర్వముననుు పరముననుగూడ సేవించిన మిక్కిలి వీర్యశక్తి యేర్పడును. మరియు, దీనిని నిత్యమును సేవించుచుండిన కృత్రిమ స్థావర జంగమ విషములనుండి యెట్టి వికారమును గలుగకుండును. జరామరణములు లేక మానవుడు దృఢశరీరుడై చిరకాలము జీవింపగలుగును.

---

ర్థమై చలవమిరియాలను జేర్చుకొనుటయు, మిగిలిన వ్యాధులందు ప్రయోగించుటకై పిప్పళ్లను జేర్చుకొనుటయు రెండు విధములగు సాంప్రదాయములుగలవు. మరియు, "భుక్తో ఽహివల్లీ దలమధ్యవర్తీ" అను వాక్యమునుబట్టి యీ యౌషధమును తమలపాకు మధ్యను మడచి భుజించవలెనని యర్థము దెలియుచున్నను, అటుల భుజించుట కష్టమగును గాన తమలపాకుల రసముతో దీనిని మూడుదినములు మర్దించి యుక్తప్రమాణమున మాత్రలుజేసి సేవించుటగాని యటుల మర్దించి ఛాయాశుష్కముజేసి, తిరిగి మెత్తగా చూర్ణించి, దీనిని ఉక్తప్రమాణమున సేవించుటగాని సుకరముగా నుండునని దెలియవలెను.

## (3) వ్యాధిహారణ రసము

శ్లో॥ హింగుళోత్థరసం భాగం ద్వాభాగా రసకర్పూరం।
రసతుల్యం బలిందద్యాత్ ఖల్వమధ్యేతు కజ్జలీం॥
దత్వాండే మృత్పటంపంచ వాలుకాయంత్రగంపచేత్।
దినైకంతు క్రమాగ్నాతు స్వాంగశీతంసముద్ధరేత్॥
పూజయేద్గురువిప్రాదీ న్యథారోగం ప్రయోజయేత్।
గుంజాచతుష్టయం ఖాదే న్నాగవల్లీ దళైర్యుతం॥
షండోఽపి లభతే పుంస్త్వం వాజీకరణముత్తమం।
అపుత్రః పుత్రమాప్నోతి జీవేచ్చ శరదాంశతం॥
వలీపలిత హృచ్ఛూలం వాతశ్లేష్మ నిబర్హణం।
అయంవ్యాధిహరస్సూతః పూజ్యపాదేన నిర్మితః॥

బ-రా.

శోధితహింగుళమునుండి గ్రహింపబడిన పాదరస మొకభాగము, రసకర్పూరము రెండుభాగములు, శోధితగంధకము ఒకభాగము ఇటుల గ్రహించి, ఖల్వమునందుంచి మెత్తగా కజ్జలివలె నూరవలెను. కోడి గ్రుడ్డునకు రంధ్రము చేసి యందలి సొనను తొలగించి పరిశుద్ధముగా కడిగి యెండబెట్టి కాచకూపికకువలెనే యైదుమారులు మృల్లేపిత వస్త్రఖండము లచే కవచములనిచ్చి బాగుగా నెండించవలెను. పిమ్మట నీ విధముగా సిద్ధము చేయబడిన కోడిగ్రుడ్డునందు పైకజ్జలిని పూరించి దీనిని వాలుకా యంత్రమునందు అమర్చి రససిందూరమువలెనే క్రమాగ్నులతో నొక దినము పాకము జేయవలెను. దీని పాకలక్షణము రససిందూరపాకము నకువలె గుర్తించవలెను. స్వాంగశీతలమువ యా కోడిగ్రుడ్డుయొక్క కంఠమునందు లగ్నమైయున్న (సిందూరమువలె) యౌషధమును జాగ్ర

_త్తగా గ్రహించి యుపయోగించవలెను. ఈ విధముగ సిద్ధము చేయబడి నట్టిది వ్యాధిహరణ రసమని చెప్పబడును. శుభదివసమున గురువిప్రాదులను బూజించి నాలుగు గురిగింజల పరిమితిని యీ యౌషధమును తమలపాకుమధ్యను మడచి సేవించవలెను. వలీపలితములను, హృదయశూలలను, వాతశ్లేష్మ వికారములను, ఉపదంశమును (ఫిరంగవ్యాధిని) శమింపజేయును. మరియు వీర్యమునకు నధికశక్తిని గలిగించి వాజీకరణమగును. బీజసంస్కారమును జేయును. ఆయువును వృద్ధిబొందించును.

## (4) వాతవిధ్వంసినీ రసము

శ్లో॥ రసం గంధకం నాగ వంగంచ లోహంతథా తామ్రజం
వ్యోమనిశ్చంద్రకంచ। కణా టంకణం చోషణం నాగ
రంవై పృథగ్భాగమేకం క్షిపేత్ ఖల్వమధ్యే॥ తతో
వత్సనాభం చతుష్కార్థభాగంద్రుథం మర్దయేద్వ్యోష
జైశ్చ త్రివారం। వరాచిత్రకైర్భార్గ కుష్ఠైస్త్రివారం
పృథగ్భావయే త్సింధువారార్ద్రివాసైః॥ తథామోహినీ
జంభనీరైః పృథగ్వై మహాన్ వాతవిధ్వంసకోఽయం
రసశ్చ। సమీరే చ శూలే తథాశ్లేష్మరోగే గ్రహణ్యాం
తథా సన్నిపాతే చ మూకే॥ అపస్మార మాంద్యేచ
శీతేచ పిత్తే ప్లీహోదరేకుష్ఠరోగేచ దద్యాత్। స్త్రియ
స్సూతికా వాతరోగే తథైవ ద్విగుంజం ప్రదద్యాత్
ఇమం సూతరాజం॥ బ-రా.

యథోక్తవిధానమున శుద్ధిచేయబడిన పాదరసము, శుద్ధిచేయబడిన గంధకము, నాగభస్మము, వంగభస్మము, లోహభస్మము, తామ్ర

భస్మము, అభ్రకభస్మము, పిప్పళ్లు, శోధితటంకణము, మిరియాలు, శుంఠి ఇటుల నీ ద్రవ్యములను సమభాగములుగ గ్రహించవలెను. శుద్ధి చేయఒడిన వత్సనాభిని నాలుగున్నర భాగములు గ్రహించవలెను. పిమ్మట నీ ద్రవ్యములలో తొలుత రసగంధకములను ఖల్వమునందు కజ్జలిగానూరి, అందు భస్మములను, పిప్పల్యాది ద్రవ్యముల చూర్ణములను చేర్చి త్రికటుకముల కషాయముతో మూడుదినములును, త్రిఫలాకషాయముతో మూడుదినములును, చిత్రమూలకషాయముతో మూడుదినములును, గుంటకలగరాకు రసముతో మూడుదినములును, చంగల్వకోష్టుకషాయముతో మూడుదినములును, వావిలాకురసముతో మూడుదినములును, అల్లపురసముతో మూడుదినములును, అడ్డసరపాకు రసముతో మూడు దినములను, గంజాయాకు రసముతో మూడుదినములును, నిమ్మపండ్ల రసముతో మూడుదినములును జక్కగా మర్దించవలెను. ఇటుల సిద్ధము చేయబడినట్టిది వాతవిధ్వంసినీ రసమని వ్యవహరింపబడును. దీనిని రెండు గురిగింజల ప్రమాణమున సేవించిన వాతవ్యాధులు, శూల, కఫజ వ్యాధులు, గ్రహణి, సన్నిపాతము, మూకవాతము, అపస్మారము, అగ్నిమాంద్యము, శీతపిత్తము, ప్లీహోదరము, వృద్ధము, నూతికావాతము మున్నగువ్యాధులు శమించును.

## (5) వాతగజాంకుశ రసము

శ్లో॥ అష్టభాగా రసస్యాపి విషతిందోస్త థైవచ।
గంధకస్య త్రిభాగంచ కటుత్రయఫలత్రయం॥
గుంజామాత్రాం వటీంఖాదేత్ అశీతివాతనాశనం।
వాతగజాంకుశో నామ్నా హన్యాద్రుస్తంభం నిహన్తిచ॥
బ-రా.

శుద్ధిచేయబడిన పాదరసము ఎనిమిదిభాగములు, శుద్ధిచేయబడిన విషముష్టిబీజచూర్ణ మెనిమిదిభాగములు, శుద్ధిచేయబడిన గంధకము

మూడుభాగములు, త్రికటుకములు ప్రత్యేకముగా మూడు మూడు భాగములు, త్రిఫలములు ప్రత్యేకముగా మూడు మూడు భాగములు ఇటుల గ్రహించి, తొలుత ఖల్వమునందు రసగంధకములను కజ్జలిగా నూరి అందు మిగిలిన ద్రవ్యముల చూర్ణములను చేర్చి నిమ్మపండ్లరసములో నేడుదినములు చక్కగా మర్దించి యొక గురిగింజ పరిమితిని మాత్రలను చేసి ఛాయాశుష్కము చేయవలెను. ఇటుల సిద్ధముచేయబడినట్టిది వాతగజాంకుశరసమని వ్యవహరింపబడును. దీనిని సేవించినయెడల సమస్తవాతవ్యాధులును శమించును. విశేషముగ నూరుస్తంభవాతము శమించును.

## (6) వాతరాక్షస రసము

శ్లో॥ మృతంసూతం తథాగంధం కాంతంచాభ్రకమేవచ।
తామ్రభస్మకృతం సమ్యక్ మర్దయిత్వా సమాంశకం॥
పునర్నవా గుడూచ్యగ్ని సురసాత్ర్యూషణం తథా।
ఏతేషాం స్వరసే నైన భావయేత్త్రిదినం పృథక్॥
దత్వా లఘుపుటం సమ్యక్ స్వాంగశీతం సముద్ధరేత్।
వాతరాక్షస నామాయం వాతరోగే ప్రయోజయేత్॥
తత్తద్రోగానుపానేన ద్విగుంజా మాత్రసేవనాత్।
ఊరుస్తంభం వాతరక్తం గాత్రభంగం తథైవచ॥
ఆమవాతం ధనుర్వాతం వేదనా వాతమేవచ।
పక్షాఘాతం కంపవాతం సర్వసంధిగతం తథా॥
సుప్తవాతం వాతశూల మున్మాదంచ వినాశయేత్।
తత్తద్రోగానుపానేన వాతాశీతి వినాశనః॥ వై-చిం.

యథోక్తవిధానమున సిద్ధముచేయబడిన రససిందూరము, శుద్ధిచేయబడిన గంధకము, కాంతలోహభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ

ఇటుల వీనిని సమాంశములుగ గ్రహించి, రససిందూరమును, గంధకమును తొలుత ఖల్వమునందు చక్కగా మర్దించి, అందు మిగిలిన ద్రవ్యములను చేర్చి తెల్లగలిజేరువేరు స్వరసముతోను, శిప్పతీగ స్వరసముతోను, చిత్రమూల కషాయముతోను, తులసి స్వరసముతోను, త్రికటుకముల కషాయముతోను ప్రత్యేకముగ మూడుదినములు-చొప్పున మర్దించి చిన్న చిన్న చక్రికలు చేసి యెండించవలెను. పిమ్మట వీనిని శరావసంపుటమున బంధించి లఘుపుటమున పాకముజేయవలెను. స్వాంగశీతలమున నౌషధమును గ్రహించి మెత్తగా ఖల్వమునందు నూరి యుంచుకొనవలెను. ఇటుల సిద్ధము చేయబడినట్టిది వాతరాక్షసరసమని చెప్పబడును. దీనిని రెండు గురిగింజల పరిమితిని ఆయా రోగానుపాన విశేషములతో సేవించిన ఊరుస్తంభము, వాతరక్తము, గాత్రభంగము, ఆమవాతము, ధనుర్వాతము, వాతశూల, పక్షాఘాతము, కంపవాతము, సంధివాతము, సుప్తవాతము, శూల, ఉన్మాదము మున్నగు సమస్తవాతవికారములును శమించును.

## (7) గ్రహణీ వజ్రకవాట రసము

శ్లో॥ మృతంసూతాభ్రకం గంధం యవక్షారం సటంకణం।
అగ్నిమంథం వచాం కుర్యాత్ సూతతుల్యానిమార్కసుధీః॥ తతోజయంతీ జంబీర భృంగద్రావైర్విమర్దయేత్। త్రివాసరం తతోగోళం కృత్వా సంశోష్యధారయేత్। లోహపాత్రే శరావంచ దత్వోపరివిముద్రయేత్। అధోవహ్నిం శనైః కుర్యాత్ యామార్థం తత ఉద్ధరేత్॥ రసతుల్యా మతివిషాం దద్యాన్మోచ రసం తథా। కపిత్థ విజయాద్రావై ర్భావయేత్ సప్తధా పృథక్॥ ధాతకీంద్రయవా ముస్తా లోధ్ర ప్రతివిషా

స్మృతాః। ఏతైర్ద్రవై ర్భావయిత్వా దినైకం చ విశోషయేత్। రసో వజ్రకవాటాఖ్యో మాషైకం మధునా లిహేత్। వహ్నింశుంఠీం బిడం బిల్వం లవణం చూర్ణయేత్సమం॥ పిబే దుష్ణాంబునా చాను వాతజాం గ్రహణీం జయేత్॥ బ-రా.

రససిందూరము, అభ్రకభస్మ, శుద్ధిచేయబడిన గంధకము, యవక్షారము, శుద్ధిచేయబడిన టంకణము, నెల్లివేరు, వస ఈ ద్రవ్యములను సమభాగములుగ గ్రహించి, తొలుత రససిందూరమును గంధకమును ఖల్వమునందు జక్కగా గలియనూరి యందు మిగిలిన ద్రవ్యములను, నెల్లివేరు వస వీని చూర్ణములను చేర్చి సోమంతాకు రసముతోను, నిమ్మపండ్ల రసముతోను, గుంటకలగరాకు రసముతోను ప్రత్యేకముగ మూడుదినములు మర్దించి, యాపిష్టము నొకగోళమును జేసి యెండింపవలెను. పిమ్మట నీ గోళము నొక యినపబాణలియందుంచి దానిపై నొక శరావమును గప్పి నేర్పుగా సంధిబంధనము జేసి, యా బాణలిని పొయ్యిమీద నుంచవలెను. తరువాత మందాగ్నితో నొకటిన్నరజాము పాకము జేసి స్వాంగశీతలమున నందుండి యౌషధమును గ్రహించి ఖల్వమునందు మెత్తగా చూర్ణించవలెను. అందు అతివస చూర్ణమును, బూరుగ బంక చూర్ణమును రససిందూరముతో సమముగ నుండునంత చేర్చి, వెలగాకుల రసముతోను, గంజాయాకు కషాయముతోను ప్రత్యేకముగ నేడుదినములు మర్దించవలెను. పిమ్మట అగెపువ్వు, కొడిశపాల గింజలు, తుంగముస్తలు, లొద్దుగపట్ట, అతివస, తిప్పతీగె వీని కషాయములలో ప్రత్యేకముగ నొక్కొక్కదినము చొప్పున మర్దించి యారబెట్టవలెను. ఇటుల సిద్ధముచేయబడినట్టి గ్రహణీ వజ్రకవాట రసమును వ్యవహరింపబడును. దీని నొక మినుపగింజ ప్రమాణమున తేనెతో గలిపి సేవించి, చిత్రమూలము, శుంఠి, బిడాలవణము, మారేడుపిందెలు,

సైంధవలవణము వీనిని సమాంశములుగ చూర్ణించి యుష్ణోదకములో కలిపి పానముచేసిన వాతజగ్రహణి శమించును.

## (8) వాతాగ్ని కుమార రసము

శ్లో॥ రసగంధౌచ ద్వాభాగౌ పృథగాలం తథైకకం।
ఖల్వే కజ్జలికాంకృత్వా కాచకూప్యాం నిధాపయేత్॥
తతో వాలుకయంత్రేచ క్రమాగ్నా పరిపాచయేత్।
త్రిదినంచ భిషక్ సమ్యక్ స్వాంగశీతల ముద్ధరేత్॥
విఖ్యాతశ్చైవ వాతాగ్ని కుమారో రస భూతలే।
అనుపానవిశేషైశ్చ ఖాదేత్ గుంజాప్రమాణతః॥
ఊరుస్తంభం పక్షవాతం ఖల్లీం ఖంజం తథైవ చ।
కంపవాతం ధనుర్వాతం జిహ్వాస్తంభాదికాన్ గదాన్।
కఫరోగాన్ జ్వరాంశ్చైవ సంతతాదీన్ వినాశయేత్॥
(గురుసాంప్రదాయము)

శుద్ధిచేయబడిన రసము రెండుభాగములు, శుద్ధిచేయబడిన గంధకము రెండుభాగములు, శుద్ధిజేయబడిన తాళకమొక భాగము ఇటుల గ్రహించి ఖల్వమునందు చక్కని కజ్జలిగా నూరవలెను. దీనిని కాచకూపికయందు నింపి వాలుకాయంత్రమునం దమర్చి మూడుదినములు క్రమాగ్నులతో జాగ్రత్తగా పాకముజేయవలెను. స్వాంగశీతలమునన నా కూపికనుండి సిందూరమును గ్రహించి మెత్తగా చూర్ణించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది వాతాగ్నికుమారరసమని చెప్పబడును. దీనిని అనుపానవిశేషములతో గురిగింజప్రమాణమున సేవించినచో ఊరుస్తంభము, పక్షవాతము, ఖల్లీవాతము, ఖంజవాతము, కంపవాతము, ధనుర్వాతము, జిహ్వాస్తంభము మున్నగు సమస్త వాతవ్యాధులును, కఫజ వ్యాధులును, సంతతాది విషమజ్వరములును శమించును.

## (9) హుతాశన రసము

శ్లో॥ గంధేశ టంకణాన్యేకం విషంచైవ ద్విభాగికం।
కఫరీం శంఖభస్మంచ నిర్ధూమంచ త్రిభాగికం॥
అష్టభాగంచ మరిచం జంభనీరేణ మర్దితం।
గుల్మారోచక శూలేషు విషూచ్యాం వహ్నిమాంద్యకే॥
అజీర్ణే శ్వాసకాసేషు శైత్యే జాడ్యే శిరోగతే।
హుతాశన రసోనామ బ్రహ్మణా నిర్మితం పురా॥

ర-యో-ర.

శుద్ధిజేయబడిన గంధక మొకభాగము, శుద్ధిజేయబడిన రస మొక భాగము, శుద్ధిజేయబడిన టంకణ మొకభాగము, శుద్ధిజేయబడిన వత్స నాభి రెండుభాగములు, శుద్ధిజేయబడిన పాలతుత్థము మూడుభాగములు, శంఖభస్మ మూడుభాగములు, కరియూపము మూడుభాగములు, మిరియాల చూర్ణ మెనిమిది భాగములు ఇటుల గ్రహించి, తొలుత రసగంధకము లను ఖల్వమునందు కజ్జలిగా నూరి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి నిమ్మపండ్ల రసముతో మూడుదినములు చక్కగా మర్దించి గుంజా ప్రమాణమున మాత్రలు జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది హుతాశనరసమని చెప్పబడును. దీనిని అనుపానవిశేషములతో సేవిం చినయెడల గుల్మము, అరుచి, శూల, విషూచి, అగ్నిమాంద్యము, అజీర్ణము, శ్వాస, కాస, శిరోగతమైన శైత్యము, జడత్వము మున్నగు నవి శమించును.

## (10) బాలసూర్యోదయ రసము

శ్లో॥ సూతం త్రైగుణ్యాగంధం పరిమిత మమృతం భానుతీక్ష్ణంచ
నేత్రం ఆరూఢం తచ్చతుర్థంగగనశరయుతం మాగిచం

సర్వతుల్యం। ఏత ద్దద్యా న్నిహన్తి జ్వరవనదహావం
శ్వాసకాసంచ ఛర్దిం పాండుప్లీహా ప్రమేహం క్షయ-
గుదజరుజం లింగదోషంచ పుంసాం॥ నారీణాం యోని
దోషం బహువిధ ప్రదరాన్ మూత్రకృచ్ఛ్రంచ సర్వాం
నామ్నాయం బాలసూర్యోదయ ఇతి భువి ప్రఖ్యాపితో
వై మునీంద్రైః॥ బ-రా.

శుద్ధిజేయబడిన రసము ఒకభాగము, శుద్ధిజేయబడిన గంధకము మూడుభాగములు, శుద్ధిజేయబడిన వత్సనాభి మూడుభాగములు, తామ్రభస్మము, లోహభస్మము, ఇవి రెండు రెండుభాగములు, పొంగించిన యింగువ అర్ధభాగము, అభ్రకభస్మ మైదుభాగములు, మిరియాల చూర్ణము పదియారున్నర భాగములు ఇటుల గ్రహించి, తొలుత రస గంధకములను కజ్జలిగా నూరి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి బాగుగా కలియనూరియుంచవలెను. ఈ విధముగ సిద్ధము జేయబడినట్టిది బాలసూర్యోదయ రసమని వ్యవహరించబడును. దీనిని అనుపానవిశేష ములతో సేవించిన జ్వరము, శ్వాస, కాస, ఛర్ది, పాండు, ప్లీహావృద్ధి, ప్రమేహము, క్షయము, అర్శస్సు, ఉపదంశము, యోనిదోషము, సమస్త ప్రదరములు, మూత్రకృచ్ఛ్రము మున్నగు వ్యాధులెల్ల శమించును. ఇందు మూలమున నెట్టి స్వరసములతోను భావన చెప్పకపోయినను హంసపాదిరసముతోగాని, కలబంద రసముతోగాని నూరి మాత్రలు జేసి యుపయోగించుట వైద్యక సాంప్రదాయమున గలదు.

## (11) సూతికాభరణ రసము

శ్లో॥ స్వర్ణమభ్రం తథాగంధం వత్సనాభంచ లోహకం।
తామ్రంనాగం తథావంగం తారం వై క్రాంతపారదౌ॥

సమంగృహీత్వా నిర్గుండీ కారవల్లీ ద్రవైః పునః।
జంబీరస్వరసే నాథవర్షాభూ మార్కవద్రవైః॥
చిత్రకస్వరసేనాపి సురసాయా రసేనచ।
అర్కస్యచ కషాయేణ కన్యాయాస్వరసేనహి॥
ముండ్యాస్తథాచపాఠాయాః లాంగల్యాఃస్వరసైస్తథా।
భావయిత్వాథ సంశోష్య కాచకుప్యాం నిధాపయేత్॥
పాచయేత్త్రిదినంసమ్యక్ వాలుకాయంత్రతః సుధీః।
పునస్తంమర్దయేత్సమ్యక్ రసైఃపూర్వోదితైఃక్రమాత్॥
భేకాహి మహిషాశ్వానాం బర్హిణః కిటిదక్షయోః।
పిత్తైర్విమర్దయేద్యామం ముద్గమాత్రాంవటీంచరేత్॥
సూతికాభరణాఖ్యోయం రసోదేయో భిషగ్వరైః।
సూతికా సన్నిపాతాది దారుణేషు జ్వరేషుతు॥
దధ్యన్న మిక్షుఖండాంశ్చ దాపయే చ్ఛీతలోదకం॥

ఆం-వై-చిం.

స్వర్ణభస్మ, అభ్రకభస్మ, శోధితగంధకము, శోధితవత్సనాభి, లోహభస్మ, తామ్రభస్మ, నాగభస్మ, వంగభస్మ, రజతభస్మ, వైక్రాంత భస్మ, శోధితపాదరసము ఇటుల వీనిని సమాంశములుగ గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిగా ఖల్వమునందు నూరవలెను, పిమ్మట నందు మిగిలిన ద్రవ్యములను జేర్చి వావిలాకురసముచేతను, కాకరాకు రసముచేతను, నిమ్మపండ్ల రసముచేతను, గలిజేరువేళ్ల రసముచేతను, గుంటకలగరాకు రసముచేతను, చిత్రమూలకషాయముచేతను, తులసీ రసముచేతను, జిల్లేడువేళ్ల కషాయముచేతను, కలబందరసముచేతను, బోడతరపు కషాయముచేతను, చిరుబొద్ది కషాయముచేతను, పొత్తిదుంప

కషాయముచేతను ప్రత్యేకముగ మూడుదినములు చొప్పున మర్దించి, చిన్నచిన్న గుటికలుజేసి యెండించి కాచకూపికయందుంచి వాలుకా యంత్రమున మూడుదినములు పాకముజేయవలెను. స్వాంగశీతలమున నౌషధమును గ్రహించి, ఖల్వమున మెత్తగా చూర్ణించవలెను. పిమ్మట పూర్వోక్త స్వరసకషాయములలో పూర్వోక్తవిధానమున జక్కగా మర్దించి, కప్ప, పాము, గన్నపోతు, గజ్జాకు, నెమలి, అడవిపంది, కోడి వీనియొక్క పిత్తములచే ప్రత్యేకముగ నొక్కొక్కజాము చొప్పున భావనజేసి, పెసరగింజ ప్రమాణమున మాత్రలు చేయవలెను. ఈ విధముగా సిద్ధముజేయబడినట్టిది సూతికాభరణ రసమని వ్యవహరింపబడును. దీనిని సూతికావ్యాధులు, దారుణమైన సన్నిపాతజ్వరము వీనిలో సేవించిన వెంటనే యవి శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు పెరుగు అన్నమును, చెరకు ముక్కలను భుజింపవలెను. శీతలోదకమును పానము చేయవలెను. [ఇందు జముడుకాకి, పెద్దపులి మొదలగు జంతువులయొక్క పిత్తములతోకూడా చేర్చి మర్దించుట ఆంధ్రదేశమున సాంప్రదాయముగా నున్నది. అ-ల.]

---

3-వ అధ్యాయము

# ఉపరసములు *

శ్లో॥ గంధో హింగుల మభ్ర తాలక శిలాః స్రోతోంజనం
టంకణం రాజావర్తకచుంబకౌచ స్ఫటికా శంఖఃఖటీ

---

* పారదేతర రసముల కిట్లు వర్గీకరణము రసరత్న సముచ్చయాది గ్రంథములందు గానుపించుచున్నది. మహారసములు—శ్లో॥ అభ్ర వైక్రాంత మాక్షీక విమలాద్రిజ

గైరికం। కాసీసం రసకం కపర్దసికతా బోలాశ్చ కంకుష్ఠకం సౌరాష్ట్రీచ మతా అమీ ఉపరసాః సూతస్య కించిద్గుణైః॥ తుల్యాః స్యుర్యది తే విశోధ్య విధినా సంసా

---

సస్యకం। చపలో రసకశ్చేతి జ్ఞాత్వాష్టౌ సంగ్రహేద్రసాన్॥ ర-ర-స.—అభ్రకము, వైక్రాంతము, స్వర్ణమాక్షికము, తారమాక్షికము, శిలాజతు, మయూరతుత్థము, చపలము, క్షీరతుత్థము అను నీ యెనిమిది ఖనిజములు మహారసములని గ్రహింపదగినవి. ఉపరసములు—శ్లో॥ గంధాశ్మగైరికాసీస కాంక్షీ తాల శిలాంజనం। కంకుష్ఠంచే త్యుపరసాశ్చాష్టౌ పారదకర్మణి। ర-ర-స.—గంధకము, గైరికము, కాసీసము, స్ఫటికము, తాళకము, మణిశిల, అంజనము, కంకుష్ఠము అను నీ యెనిమిది ఖనిజము లుపరసములుగా గ్రహింపదగినవి.

సాధారణరసములు—శ్లో॥ కంపిల్ల శ్చాపరో గౌరీపాషాణో నవసాగరః। కపర్దో వహ్నిజారశ్చ గిరిసిందుర హింగుళౌ॥ మృద్దారుశృంగమిత్యష్టౌ సాధారణ రసాఃస్మృతాః। రససిద్ధికరాః ప్రోక్తాః నాగార్జున పురస్సరైః॥ ర-ర-స.—కంపిల్లము, గౌరీపాషాణము, నవసాగరము, కపర్దము, అగ్నిజారము, గిరిసిందూరము, హింగుళము, మృదారుశృంగి అను నీ యెనిమిది ఖనిజములు సాధారణ రసములుగా గ్రహింపదగినవి. ఇవి రససిద్ధిని గలిగించునవిగనుండును.

ఇటుల ఖనిజములకు వర్గీకరణము గానుపించుచున్నను

ధితాః సేవితా స్తత్తద్రోగహరానుపాన సహితై
ర్యోగై శ్చిరాయుఃప్రదాః॥ ఆ-ప్ర.

గంధకము, హింగుళము, అభ్రకము, తాళకము, మనశ్శిల, స్రోతోంజనము, టంకణము, రాజావర్తము, చుంబకము, స్ఫటికము, శంఖము, ఖటికము, గైరికము, కాసీసము, రసకము, కపర్దము, సికత, బోలము, కంకుష్ఠము, సౌరాష్ట్రిమృత్తిక అనునవి యుపరసములని చెప్ప

---

ఇవి యెల్ల పారదసిద్ధికొరకే గ్రహింపబడినట్లుగా నా నర్గీకారులనిరూపణమునుబట్టి స్పష్టమగుచునే యున్నది. మరియు, నివి యెల్ల పారదముకంటె కొంచెము తక్కువైన గుణములనే గలిగియుండునని గూడ దెలియగలదు. ఇందుచేతనే పూర్వాచార్యుల మతములో పాదరస మొక్కటియే మహారసముగా నెంచబడి, మిగిలిన ఖనిజములన్నియు నుపరసములుగ, అనగా - ఆ మహారసమున కివి యనుబంధ రసములుగ గ్రహింపబడినవి. ఇదియునుంగాక యీ ఖనిజములతో గావింపబడిన రసౌషధకల్పన యంతయు పారదాను బంధితముగనే యున్నదిగాని పారద భిన్నముగ నెచ్చటను గానరాదు. అందుచే వీనికన్నింటికి ప్రత్యేక ప్రయోగము మృగ్యముగనే యుండును. మరియు, వీనినట్లు మహారస - ఉపరస - సాధారణ రసములని యట్టి విభజనపూర్వకముగ వ్యవహరించుటకు వాని కట్టి మహత్త్వాది ధర్మములున్నట్లును, వాని నటులనే వ్యవహరింపవలసి యున్నట్లును నిరూపించుటకు దగిన ప్రమాణము లెందును గానరావు. కావున పాదరసము నొక్కదానినే మహారసముగా జెప్పుకొని, మిగి

బడును. వీనిని † యథోక్తవిధిని శోధించియు, భస్మరూపమును బొందించియు, అనుపానభేదములతో జేర్చి సేవించినయెడల యావత్తద్రోగములందు పాదరసముకంటె కొంచెము తక్కువగు తత్సమఫలప్రదము అగును.

---

లిన ఖనిజముల నుపరసములుగ గ్రహించుటలో నెట్టి యవరోధ ముండ నేరదని మా యభిమతము. ఇట్టి యభిమతము ననే యవియెల్ల నీ యుపరస ప్రకరణమున జేర్చబడి వివరింపబడు చున్నవి. అయితే, ఈ మహారసాదివర్గములందు చేర్కొనబడిన మాక్షికము, శిలాజతు, తుత్థము, గిరిసిందూరము మున్నగు కొన్ని ద్రవ్యములు పూర్వాచార్యులచేత నుపరసవర్గమున గ్రహింపబడక ధాతువర్గమున నుపధాతువులుగా జేర్చబడినవి. కావున నీ విధానము ననుసరించియే యవియెల్ల ధాతునర్గమున జేర్చి యీ గ్రంథమున వివరింపబడును.

† ఏవంసర్వ ఉపరసాః....శుద్ధాస్సన్తో మృతా అమృతా వాయథావచనం యోజ్యా నాశుదా ఇతిదిక్॥ ఆ-ప్ర.— ఈ సూచనబట్టి వీనిలో గొన్ని శోధితమాత్రమున ప్రయోగార్హములగుననియు, గొన్ని శోధింపబడినను భస్మీకృతములైనగాని యటుల ప్రయోగార్హతను గలిగియుండవనియును దెలియవలెను. ఇట్టి వివేచనము ఇటగావింపబడు తత్తద్వివరణములనుబట్టి గ్రహించవలెను.

# గంధకము

## గంధకనామములు *

శ్లో॥ గంధకో గంధికశ్చాపి గంధపాషాణ ఇత్యపి।
సౌగంధికశ్చ కథితో బలిః బలివసాపి చ॥ ఆ-ప్ర.

గంధకము, గంధికము, గంధపాషాణము, సౌగంధికము, బలి, బలివస యనునవి గంధకనామములు

---

* గంధకనామార్థములు—శ్లో॥ క్షీరాబ్ధిమథనే చైతత్ అమృతేన సహోత్థితం। నిజగంధేన తాన్ సర్వాన్ సార్థయన్ దేవదానవాన్। తతో దేవగణైరుక్తం గంధకాఖ్యోభవత్వయం। బలినా సేవితః పూర్వం ప్రభూతబలహేతవే॥ వాసుకిం కర్షత స్తస్య తన్ముఖజ్వాలయా ద్రుతా। వసాగంధకగంధాఢ్యా సర్వాంగేభ్యో వినిస్సృతా తనోః।గంధకత్వం చ సంప్రాప్తా తస్మాద్బలివసా స్మృతా। ఆ-ప్ర.—పూర్వకాలము దేవదానవులు క్షీరసముద్రమును మధించినప్పుడు అందుండి యీ ద్రవ్య మమృతముతో గూడ నుత్పన్నమై స్వకీయ గంధముచే నా దేవదానవులను వ్యామోహితులనుగా జేసెను. అందుచే నిది గంధకమని జెప్పబడుచున్నది. అధికమైన బలసంపత్తుకై తొలుత నిది బలియను రాక్షసునిచే భుజింపబడినది యగుటచే బలియనియు, వాసుకిని బలాత్కారమున లాగి చంపునప్పుడు ఆతని ముఖజ్వాలా స్పర్శచే యీ భుజింపబడిన గంధకము ద్రవీభూతమై యీ రాక్షసుని శరీరమునుండి వసారూపమున బయటకు స్రవించినది యగుటచే బలివస యనియు జెప్పబడుచున్నది.

ఈ గంధకమను ద్రవ్యము అగ్నిసంయోగముచే

ద్రవించునట్టియు, మండునట్టియు స్వభావముగలది. కావున గంధక మిశ్రితములైన యౌషధములను అగ్నియందు పాకము జేయునప్పు డది జ్వలింపకుండునట్లు జాగ్రత్తగలిగి యుండవలెను. ఇది శ్వేతాది వర్ణభేదముచే ననేక విధములుగా నుండును. అందు పసుపుపచ్చని వర్ణము గలిగినదియే విశేషముగా లభించును. ఇదియు రెండు విధములుగా లభించుచున్నది. అందొకటి రూక్షమైన పీత వర్ణముతోను, మఱియొకటి స్నిగ్ధమైన పీతవర్ణముతోను లభించును. వీనిలో మొదటిది యౌషధములం దుపయో గింప నర్హముగా నుండదు. ఇది సన్నముగను, లావుగను నుండు నళికలవలె నుండును. రెండవది చిన్నచిన్న గడ్డల వలె నుండును. ఇది చిలుకరెక్కల నర్ణమువంటి వర్ణము గలిగి యౌషధములం దుపయోగార్హమై యుండును. శ్లో॥ శుకపిచ్ఛ సముచ్ఛాయో నవనీతసమప్రభః। మసృణః కఠినః స్నిగ్ధః శ్రేష్ఠో గంధక ఉచ్యతే॥ పీత శ్చామలసా రాఖ్యః శ్రేష్ఠో రస రసాయనే॥ ఆ-ప్ర.—మరియు, నిది నవ నీతమువంటి కాంతిగలిగియుండును. నునుపుగను, కఠినము గను నుండును. ఇట్టి గంధకమే చిలుకరెక్కల గంధక మనియు, అమలసార గంధకమనియు వ్యవహరింపబడును. ఈ గంధకద్రవ్యముగూడ పాదరసమువలె సమస్త రసౌషధ నిర్మాణమునందును జేర్పదగినదిగ నుండును. దీనితో పాద రసమును గలిపి నూరినచో రసమునకు కృష్ణవర్ణ మేర్ప డును. మరియు, నీ గంధకము, శ్లో॥ రసరాజ రాగదాయీ

బీజానాం పాకజారణ సమర్థః। సూతక పక్షచ్ఛేదీ రసబంధే గంధకోఽభిహితః॥ ర-హృ.—రసమునందు జీర్ణమై దానికి యెఱ్ఱని వర్ణమును గలిగించును. స్వర్ణాది బీజములను రసములో జారణము జేయునప్పుడు అవి గంధకసంయోగమున బక్కగా పక్వములై రసమునందు లీనమగును. రసమునకు చాపల్యగుణమును బోగొట్టి స్థిరత్వమును గలిగించును. మరియు, ద్రవస్వరూపమునందు రసమునకు బంధనత్వమును అనగా ఘనస్వరూపమును గలిగించును. ఈ గంధకము సాధారణముగ వ్యాధులందు పాదరసముతో గలిపియే ప్రయోగింపబడుచుండును. కాని యక్కడక్కడ ప్రత్యేకముగగూడ ప్రయోగింపదగినదిగనే యుండును. ఈ గంధక జాతులలో "శ్వేతోఽత్ర ఖటికా ప్రోక్తా లేపనే లోహమారణే" ఆ-ప్ర.—అని చెప్పబడుటచే వ్యవహారములో గ్రహింపబడుచున్న సుద్దయను ద్రవ్యమే శ్వేతగంధకమని తెలియగలను. ఇది కేవలము బహిర్లేపములకును, లోహమారణమునకును మాత్రముపయోగింపదగినదిగా నుండును. కాని, కొందరు కర్పూర శిలాజితును శ్వేతగంధకముగా జెప్పుదురు. ఈ రెండింటిని నిప్పులపై కాల్చిన వాటినుండి గంధకగంధముత్పన్నమగును. కావున వీనిలో నెయ్యది శ్వేత గంధకమో నిశ్చయింపవలసియున్నది. రక్తవర్ణముగలగంధకము అచ్చటచ్చట గానుపించినను నయ్యది యూపధార్థమునకు గాక వాదార్థమైయ్యే ప్రయోగింపదగినదిగా నుండును. కృష్ణవర్ణముగల గంధక మెచ్చటను గానుపించదు.

## గంధక శోధనవిధానము *

శ్లో॥ సాజ్యభాండే పయః క్షిప్త్వా ముఖంవస్త్రేణబంధయేత్।
గంధకం పృష్ఠదేశేతు శ్లక్ష్ణచూర్ణితమర్పయేత్॥

---

* గంధకము శోధింపబడినంత మాత్రమున వ్యాధులం దుపయోగింపదగునట్టి ద్రవ్యముగా నుండును. శుద్ధిజేయకయే దీనినుపయోగింపరాదు. శ్లో॥ అశుద్ధ గంధః కురుతేచ కుష్ఠంతాపంభ్రమం పిత్తరుజంతథైవ। రూపం సుఖం వీర్యబలంనిహన్తి తస్మాద్విశుద్ధో వినియోజనీయః॥ (ఆ-ప్ర.)—శుద్ధిజేయక గంధకము నుపయోగించినయెడల నది కుష్ఠురోగమును, శరీరతాపమును, భ్రమను, పిత్తవికారములను గలిగించును. అంగవైకల్యమును గలిగించును. సుఖమును, వీర్యమును, బలమును బోగొట్టును. అందుచే గంధకమును శుద్ధిజేసియే యుపయోగించవలెను. ఈ శోధనము సామాన్యము విశిష్టము అని రెండువిధములుగా నుండును. అందు పైనిజెప్పిన విధానము ననుసరించి యొకమారు శోధించుట సామాన్యశోధన మనదగును. ఈ విధానము ననుసరించియే యేడుమారులు శోధనము జేసినచో నయ్యది విశిష్ట శోధన మనదగును. శ్లో॥ గంధకో ద్రావితః భృంగ రసేక్షిప్తో విశుధ్యతి। సప్తధైవం భక్షణార్థం యోగార్థం సకృదేవహి॥ (ఆ-ప్ర)—ఏడుమారులు శుద్ధిజేయబడిన గంధకము ప్రత్యేక సేవనార్హతను గలిగియుండును. ఒకమారు శుద్ధిజేయబడినది యోగములందు జేర్చుకొనదగియుండును.

ఛాదయేత్ప్రథుదీర్ఘేణ ఖర్పరేణైవ గంధకం।
సంధిరోధః ప్రకర్తవ్యో భాండఖర్పరయోర్మృదా॥
భాండం నిక్షిప్యభూగర్తే కించిద్రక్షే ద్బహిర్ముఖం।
జ్వాలయేత్ ఖర్పరస్యోర్ధ్వం జాతవేదం వనోపలైః।

ఈ రెండువిధములగు శోధనములను వేరొక విధానమున జేయవచ్చును. ఎట్లనగా—గంధకమును స్వల్పప్రమాణమున నొక యినుపగరిటెలో కరంగించి యావుపాలలోగాని, భృంగరాజ స్వరసమునందుగాని బోసినయెడల నయ్యది శుద్ధమగును. అయితే యీ విధానములో నొకప్పుడు గంధకము మండిపోవుటయు, నష్టమగుటయుగూడ సంభవింపవచ్చును. ఈ విధానము ఒకసారి శోధనమునకే వీలుగానుండును గాని, యేడుమార్లు శోధించుట కనువుగానుండదు. కావున, పైని వివరించిన విధానము నా రెండువిధములగు శోధనలకు ననుసరించుట శ్రేష్ఠముగా నుండును. మరియు, నిట జెప్పబడిన భృంగరాజ స్వరసము, పాలు అనునవియే గాకుండ మరికొన్ని ద్రవములలోగూడ నట్లు శోధించుట కలదు. పైని జెప్పిన ద్రవములతోబాటు కలబందరసము, ముగలిచన్నల రసము, అడ్డసరపాకుల రసము, తెల్లగలిజేరు వేళ్ల స్వరసము, వాకుడుకాయల రసము, నేయి, తేనె అనువానిని గ్రహించి, వీనితో ప్రత్యేకముగ నొక్కొక్కమారు శోధించినచో నయ్యది సేవించుట కుత్తమమైన దని వ్యవహారమున గలదు. [మేము గంధకమును ముజ్జిగతో శుద్ధిజేయుచున్నాము. బంగారుపూసలవలె అనుగున

తతః క్షీరే ద్రుతం గంధం శీతం ధౌతం జలేనతు।
వస్త్రఘృష్టం నిర్జలంతు శుద్ధంయోగేషు యోజయేత్॥

ఆ-ప్ర.

---

దిగుచున్నది. ఆ-ల.]—ఇట్లుల గంధకమును శోధించినను దానిని సేవించుటకు ముందుగా దాని గంధమునకు వినాశమును గలిగింపవలెనని జెప్పబడియున్నది. శ్లో॥ విచూర్ణ్య గంధకంక్షీరే ఘనీభావా వధింపచేత్। తతఃసూర్యావర్త రసం పునర్దత్వాపచేచ్ఛనైః॥ పశ్చాచ్ఛపాతయేత్త్రిఫలో జలే త్రైఫలసంభవే। జహాతి గంధకోగంధం నిజం నాస్తిసంశయః॥ (ఆ-ప్ర)—శుద్ధిజేయబడిన గంధకమును మెత్తగా చూర్ణించి యొక యినుపబాణలియందుంచి యందు ఆవుపాలనుబోసి కలియబెట్టును నది తిరిగి ఘనీభవించువరకు సన్నని యగ్నిజ్వాలతో పాకముజేయవలెను. పిమ్మట దీనిని పైవిధముగనే ప్రొద్దుతిరుగుడుపువ్వు మొక్కల స్వరసమునందుంచి గట్టిపడువరకు పాకముజేసి వెంటనే త్రిఫలాకషాయమునందు డాలనము చేయవలెను. అది బాగుగ గడ్డకట్టి శీతలమైయున్నప్పుడా కషాయమునుండి గ్రహించి యారబెట్టవలెను. ఇట్లుల జేసిన గంధకము నిజగంధమును విడిచిపెట్టును. ఇట్టిదానిని మాత్రాపరిమితి ననుసరించి యనుపానవిశేషములతో పథ్యయోగమున సేవించిన తత్త ద్వ్యాధులను శమింప జేయును. గంధకసేవనకు శోధనము మాత్రమే చెప్పబడినది గాని భస్మవిధానము చెప్పబడలేదు. కాని కొందరు దీనికి భస్మత్వమునుగూడ కల్పించుచున్నారు.

విశాలమైన ముఖముగలిగి హ్రస్వముగ నుండునట్టియు, ఘృతముచే బూయబడినట్టియు నొక భాండమును గ్రహించి, దీనిని కంఠము

---

అది యెట్లన—శోధనవిధానములో జెప్పబడిన యే ద్రవము నందైన గంధకమును కరగించి యొకేయొక గడ్డవలె నగునట్లు జాలనము జేయవలెను. ఒక భాండమునందు సగము వరకు అర్జునక్షారమును పూరించి, దానిపై యీ గంధకపు గడ్డనుంచి, తిరిగి భాండకంఠమువరకు అర్జునక్షారమును పూరించి, యీ భాండముఖము నొక శరావముచే గప్పి దృఢముగ సంధిలేపనము జేసి యెండించవలెను. పిమ్మట నీ భాండమును బ్రొయ్యిపైనుంచి యీ భాండోపరిస్థశరావము వెచ్చబడువరకు సన్నని జ్వాలతో బాకము జేయవలెను. స్వాంగశీతలమున నా యర్జునక్షారమధ్యమున స్వచ్ఛమైన శ్వేతవర్ణముతో నుండిన గంధకము యొక్క గడ్డను గ్రహించి, దీనిని కుప్పెంటాకు (మార్జారమోహిని) కల్కముయొక్క మధ్యనుంచి దళసరిగ మృల్లేపిత వస్త్ర ఖండములతో చుట్టి బాగుగా నెండించవలెను. శుష్కమైన యీ గోళమును యేబదిపిడకల మధ్యనుంచి పుటపాకము జేయవలెను. స్వాంగశీతలమున మృదువుగను గంధక గంధ రహితముగను నుండు ఆ గంధకభస్మను గ్రహించవలెను. ఇటుల సిద్ధము జేయబడిన గంధకభస్మను అయిదు యవల ప్రమాణమున తేనెతో సేవించిన మధుమేహము శమించును. ఈ పై విధానము ననుసరించి గంధకభస్మను నేను సిద్ధముచేసితిని. ఈ భస్మ స్వచ్ఛమైన తెల్లని వర్ణముగలిగి యుండెను.

వరకు భూమియందు పాతి, యా భాండమున సగమువరకు ఆవుపాలను బోసియుంచవలెను. పిమ్మట దీనిముఖముపై నొక పరిశుద్ధమైన వస్త్ర ఖండములో గప్పి మధ్యభాగమున కొంచెము పల్లముగ నుండునట్లు వస్త్రఖండము నమర్చి, యిది భాండ కంఠమున దృఢముగ నంటియుండునట్లు సూత్రముచే నా వస్త్రఖండముయొక్క యంచులపైనుండి భాండకంఠము చుట్టును బిగువుగ చుట్టి ముడివేయవలెను. పిమ్మట నా వస్త్రఖండముపై మెత్తగ చూర్ణింపబడి నూటయిరువది తులముల బరువుగల గంధకమునుంచి, యా భాండవక్త్రము నొక విశాలమైన శరావముచే గప్పవలెను. పిమ్మట నీ శరావముయొక్క ఊర్ధ్వభాగమున నొక్కొక్కటి సుమారు పదిరెండుతులముల బరువుగల యిరువది పిడకలను చేర్చి యగ్నిని జ్వలింపజేయవలెను. ఇటుల జేసిన యిద్యది కూర్మపుటమని చెప్పబడును. ఈ పుటపాకమువలన గంధకము ద్రవరూపమునుదాల్చి, యా వస్త్రమునుండి క్రిందికి జారి యధస్థమైన క్షీరమున చిన్నచిన్న బిందువుల రూపమున పడును. ఈ బిందువులు అందలి శీతలస్పర్శచే తిరిగి ఘనీభవించి చిన్నచిన్న గుళికల రూపమును బొందినవై యా క్షీరమునందు మునిగియుండును. స్వాంగశీతలమున నా భాండమునందు పరిశుద్ధమై యున్నట్టి యా గంధకమును దీసికొని దానిని శీతల జలముచే కడిగి యారబెట్టవలెను. ఇదియే గంధక శోధనవిధానము.

## శోధిత గంధక గుణములు

శ్లో॥ గంధకః కటుకస్తిక్తః వీర్యోష్ణస్తువరః సరః।
పిత్తలః కటుకః పాకే కండూ వీసర్పజంతుజిత్॥
హన్తికుష్ఠం క్షయంప్లీహ కఫవాతాన్ రసాయనః॥

ఆ-ప్ర.

గంధకము, కటుతిక్తకషాయరసములను, సరగుణమును, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. పిత్తమును వృద్ధిజేయును.

మిగుల రసాయనమగును. కఫవాతములను శమింపజేయును. కండువును, విసర్పమును, కృములను, కుష్ఠమును, క్షయమును, ప్లీహావృద్ధిని బోగొట్టును.

## గంధక తైలవిధానము

శ్లో॥ ఆవర్త్యమానే పయసి దద్యా ద్గంధకజం రజః।
తజ్జాతదధిజం సర్పిర్గంధతైలం నియచ్ఛతి॥
గంధతైలం గలత్కుష్ఠంహన్తి లేపాచ్చ భక్షణాత్॥
అ-ప్ర.

పాలు కాగుచున్నప్పుడు అందు మెత్తగ చూర్ణము చేయబడిన గంధకచూర్ణమును కొద్దిగ చేర్చి, యా పాలు బాగుగా కాగినపిమ్మట తోడుబెట్టవలెను. ఇవి దధిగ పరిణమించిన పిమ్మట దీనినుండి వెన్నను గ్రహించి దీనిని కాచగా లభించిన ఘృతమే గంధకతైల మనబడును. ఈ తైలమును మాత్రాయుక్తముగ భక్షించినను, పైకి లేపనము చేసుకొనినను గలత్కుష్ఠము నశించును *.

## గంధక సేవనా ప్రకారములు †

శ్లో॥ చూర్ణీకృత్య పలానిపంచ నితరాం గంధాశ్మనోయత్నతః
తచ్చూర్ణం త్రిగుణేతు మార్కవరసే ఛాయావిశుష్కీ-

* [ ఇట 1 శేరు పాలకు 2½ తులముల గంధకచూర్ణమును జేర్చి, తైలమును పై విధముగా సిద్ధము జేసి యుపయోగించినాము. ఆ-ల. ]

† గంధక కల్పన లనేకముగా జెప్పబడినవి. కాని యిట నైదుకల్పనలు మాత్రము దిఙ్మాత్రముగ వివరింపబడును.

కృతం। యత్నాత్స్వచ్ఛార్ణమథాభయా మధుఘృతం ప్రత్యేకమేషాం పలం వృద్ధో యౌవనమేతి మాసయుగలం ఖాదన్నరః ప్రత్యహం॥ ఆ-ప్ర.

(1) పూర్వోక్తవిధానమున శుద్ధిజేయబడిన గంధకమును మెత్తగా చూర్ణించి, యందుండి యైదుపలముల పరిమితిగల చూర్ణమును గ్రహించి, దీనిని పదునైదుపలముల భృంగరాజస్వరసమునందు బాగుగా కలియగలిపి ఛాయాశుష్కము చేయవలెను. పిమ్మట హారీతకీచూర్ణము, మధు, ఘృతము అను నీ ద్రవ్యముల నొక్కొక్కపలము చొప్పున పై గంధకచూర్ణముతో గలిపి యొక గాజుపాత్రయందు భద్రపరచవలెను. దీనిని ప్రతిదినము యథోక్తప్రమాణమున రెండుమాసములు సేవించినయెడల మిగుల రసాయనమగును.

శ్లో॥ యోవాప్యుగ్రమతిః సుచూర్ణితమిదం గంధాశ్మకృష్ణాసమం పథ్యాతుల్యమపి ప్రపూజితగురుర్భ్యా తేశపూజారతః। ఆహారాదిషు యంత్రణాది రహితః స్యాత్పుష్టివీర్యాధికః ప్రోత్ఫుల్లాంబుజ నేత్రయుగ్మ విలసచ్చామీకరా భాసురః॥ ఆ-ప్ర.

(2) పూర్వోక్తవిధానమున శుద్ధిజేయబడిన గంధకచూర్ణము, పిప్పలీచూర్ణము, హారీతకీచూర్ణము వీనిని సమాంశములుగా గలిపి మాత్రాయుక్తముగ సేవించిన ధాతువులకు పుష్టియు, అధికవీర్యమును గలుగును. నేత్రములకు స్వచ్ఛమైన దృష్టియు, ముఖమునకు కాంతియు గూడ కలుగును. ఇందు ఆహారాదులకు నియమములేదు.

శ్లో॥ కలాంశ వ్యోమసంయుక్తం శుద్ధగంధం విచూర్ణితం।
అరత్నిమాత్రేవ స్త్రే తద్విప్రకీర్య్యవివేష్టయేత్॥

సూత్రేణ వేష్టయిత్వాథ యామం తైలే నిమజ్జయేత్।
ధృత్వాసందంశతో వర్తిం మధ్యే ప్రజ్వాలయేచ్ఛతాం॥
ద్రుతో నిపతితో గంధో బిందుశః కాచభాజనే।
తాం ద్రుతిం ప్రక్షిపేత్పత్రే నాగవల్ల్యా స్త్రిబిందుకాం॥
వల్లేన ప్రమితం శుద్ధం సూతేంద్రంచ విమర్దయేత్।
అంగుల్యాచ సపత్రాంతాం ద్రుతిం సూతంచ భక్ష
యేత్॥ కరోతి దీపనం తీవ్రం క్షయం పాండుంచ నాశ
యేత్। కాసం శ్వాసంచ శూలార్తిం గ్రహణీ మపి
దుర్ధరాం॥ ఆమం వినాశయత్యాశు లఘుత్వం
ప్రకరోతి చ॥ అ-ప్ర.

(8) పూర్వోక్తవిధానమున శుద్ధిజేయబడిన గంధకమును చూర్ణించి, దీనికి పదియారవభాగము త్రికటుచూర్ణమును గలిపి, దీని నంతను నొక పదిరెండంగుళముల చదరముగల పరిశుద్ధమైన వస్త్రఖండముపై పరచి వత్తివలె చుట్టి సన్నని దారముతో చుట్టి గట్టవలెను. పిమ్మట నీ వత్తిని తిలతైలమునం దొక ఝాము నూరబెట్టి సందంశయంత్రముతో నీ వత్తియొక్క మధ్యభాగమును బట్టుకొని దీని రెండుకొనలయందును అగ్నిని జ్వలింపజేయవలెను. దీని క్రిందిభాగమున నొక విశాలమైన గాజుపాత్ర నుంచినయెడల నటుల జ్వలించునట్టి వత్తినుండి గంధకము ద్రవరూపమున నా పాత్రలోనికి పడును. అట్టి గంధక ద్రవమునుండి మూడుబిందువుల నొక తమలపాకుపైనుంచి అందు మూడుగురుగింజల పరిమితిగల శోధితరసమును జేర్చి యది యా ద్రవరూప గంధకముతో కలియునట్లు వ్రేలితో మర్దవలెను. పిమ్మట నా తమలపాకు నటులనే మడచి భక్షింపవలెను. ఇట్టి గంధకసేవనవలన జాఠరాగ్ని మిక్కిలి వృద్ధిపొందును. క్షయరోగము, పాండువు, కాస, శ్వాస, శూల,

గ్రహణి యను నీ వ్యాధులు శమించును. ఆమదోషము శమించును. శరీరమునకు లఘుత్వ మేర్పడును*.

శ్లో॥ శుద్ధోబలిర్గోపయసా త్రివారం తతశ్చతుర్జాత గుడూచి కాద్భిః। పథ్యాక్షధాత్ర్యౌషధ భృంగనీరై ర్భావ్యోఽష్టవారం పృథగార్ద్రకేణ। సిద్ధేసితాం యోజయ తుల్య భాగం రసాయనం గంధక సంజ్ఞితంస్యాత్। ధాతు క్షయం మేహగణాగ్నిమాంద్యం శూలంతథా కోష్ఠ గతాంశ్చ రోగాన్॥ కుష్ఠా న్యథా ష్టాదశరోగసంఘాన్ నివారయత్యేవచ రాజరోగం। కర్షోన్మితే సేవిత ఏతి మర్త్యో వీర్యంచ పుష్టిం బలమగ్ని దీప్తిం॥ అ-ప్ర.

(1) పూర్వోక్తవిధానమున శుద్ధిజేయబడిన గంధకమును ఆవు పాలలో మూడుమారులు భావనజేయవలెను. పిమ్మట చాతుర్జాతక కషాయము, గుడూచీ స్వరసము, హరీతకీ కషాయము, విభీతకీ కషాయము, ఆమలకీ కషాయము, భృంగరాజ స్వరసము, ఆర్ద్రక స్వరసము అనువానిలో ప్రత్యేకముగ నెనిమిది పర్యాయములు చొప్పున భావన జేయవలెను. పిమ్మట నిటుల సిద్ధమైన గంధకమునకు సమాంశముగ చక్కెరను గలిపి మెత్తగా మర్దించవలెను. ఇటుల జేయబడినది గంధకరసాయన మనబడును. ఈ రసాయనమున మాత్రాపరిమితి

---

* [స్వానుభవము—శోధితగంధకము 10 తులములు, మిరియాల చూర్ణము 2½ తులములు, త్రిఫలా చూర్ణము 15 తులములు ఇటుల కలిపి ఖల్వమునందు చక్కగా నూరి పై విధముగా తైలమును గ్రహించుచున్నాము. అ-ల.]

ననుసరించి పథ్యయోగమున సేవించినయెడల ధాతుగత క్షయము, ప్రమేహము, అగ్నిమాంద్యము, శూల, కోష్ఠగతవ్యాధులు, అష్టాదశ కుష్ఠములు, రాజయక్ష్మ అను నీవ్యాధులు శమించును. ఆరోగ్యవంతుడు ఈ రసాయనమును యథోక్తమాత్రా పరిమితిని యొక కర్షమంత భుజించునప్పటికి అధికమైన వీర్యమును, ధాతుపుష్టిని, బలమును, జఠరాగ్ని దీప్తిని గలవాడగును.

శ్లో॥ వాతారితైలసంయుక్త స్త్రిఫలాకౌశికేనతు। గంధకో రససంయుక్తో జరావ్యాధి వినాశనః॥ మాసమాత్ర ప్రయోగేణ శృణువక్ష్యామితద్గుణాన్। అర్శోభగంద రశ్చైవ తథాశ్లేష్మసముద్భవాః॥ నశ్యంతివ్యాధయ స్సర్వే మాసే నైకేన గంధకాత్। షణ్మాసస్య ప్రయోగేణ దేవతుల్యోభవే న్నరః॥ హంసవర్ణాశ్చయే కేశాః వలిశ్చైవ ప్రలంబనీ। చలాదన్తా మందదృష్టి ర్బల శుక్రాదిసంక్షయః॥ నిర్జిత్య యౌవనంయాతి భ్రమరా ఇవమూర్థజాః। దివ్యదృష్టి ర్మహాప్రాణో వరాహ ఇవ కర్ణయోః॥ చక్షుషా తార్క్ష్యతుల్యోఽసౌ బలేన బల విక్రమః। దృఢదన్తో వజ్రకాయో ద్వితీయ ఇవశంకరః॥ తస్య మూత్రపురీషేణ శుల్బంభవతికాంచనం॥ అ-ప్ర.

(5) పూర్వోక్త విధానమున శుద్ధిజేయబడిన గంధకమును, శుద్ధ పారదమును సమాంశములుగ గలిపి మెత్తగానూరి యందు త్రిఫలా చూర్ణమును, శుద్ధగుగ్గులు చూర్ణమును గంధకిమునకు సమముగ జేర్చి యేరండతైలమును తగుమాత్రము కలిపి మెత్తగ నన్నిటిని కలియగలిపి లేహ్యమువలె నూరవలెను. దీనిని మాత్రాపరిమితిని ప్రతిదినము

సేవించవలెను. ఇటుల నొక మాసము సేవించినయెడల అర్శస్సు, భగందరము, కఫజవ్యాధులు ఇవి శమించును. ఆరుమాసములు సేవించినయెడల దివ్యత్వము సంభవించును. అనగా - నెరసిన శిరోజములకు భ్రమరములవంటి వర్ణముగలుగును. శరీరముపై నేర్పడు లంబమానము లగు ముడతలు నశించి శరీరమునకు దృఢత్వ మేర్పడును. దృష్టిమాంద్యము నశించి గరుడపక్షిదృష్టితో సమమైన దృష్టి యేర్పడును. అధికమైన బలము, ధాతువృద్ధి, వరాహమువంటి శ్రవణశక్తియు నేర్పడును. దన్తదార్ఢ్యము, ఈశ్వరునివంటి తేజస్సును సంభవించును. ఈ గంధక రసాయనమును సేవించినట్టి పురుషునియొక్క మూత్రపురీషముల స్పర్శచే తామ్రము బంగారమగును.

## గంధక సేవనయందు పథ్యవిధానము

శ్లో॥ వమనై రేచనైఃపూర్వం దేహశుద్ధి స్సమాచరేత్।
జాంగలాని తు మాంసాని ఛాగలాని ప్రయోజయేత్॥
ఆ-ప్ర.

గంధకమును సేవించునప్పుడు తొలుత వమనవిరేచన కర్మలచే శోధనము జేసుకొనవలెను. ఈ సేవాకాలమున జాంగలమాంసమును, మేకమాంసమును (లేక) యీ మాంసరసములను యాహారమునందు చేర్చుకొని భుజించవలెను.

## గంధక సేవనయం దపథ్యము

శ్లో॥ లవణామ్లాని శాకాని ద్విదలాని తథైవచ।
స్త్రియశ్చారోహణం యానం సదాచైతానివర్జయేత్॥
ఆ-ప్ర.

గంధకమును సేవించునప్పుడు లవణరసమును, అమ్లరసమును, కూరలను, పప్పులను, మైథునమును, అశ్వాది యానమును అపథ్యములుగా విడువవలెను.

---

# హింగుళము

## హింగుళనామములు *

శ్లో॥ హింగుళం దరదం మ్లేచ్ఛం హింగుళ శ్చూర్ణ పారదం
సురంగం రసగర్భంచ బర్బరం ర క్తమప్యథ ॥ ఆ-

---

* హింగుళ నామార్థములు—దరదం - దరద దేశమున నుత్పన్నమగునది. మ్లేచ్ఛం - మ్లేచ్ఛ దేశమున నుత్పన్నమగునది. చూర్ణ పారదం - చూర్ణరూపముననుండు పాదరసమని వ్యవహరింపబడునది. సురంగం, ర క్తం - మిక్కిలి యెఱ్ఱని వర్ణముగలిగి యుండునది. రసగర్భము - పాదరసమును తనగర్భమునం దిముడ్చుకొని యుండునది.

హింగుళ భేదములు—ఇది సహజము, కృత్రిమము అని రెండువిధములుగా నుండును. అందు సహజః "దరద స్త్రివిధఃప్రో క్తః చర్మారః శుకతుండకః। హంసపాద స్తృతీయస్స్యా ద్గుణవా ను త్తరో త్తరః॥ చర్మారః శుక్లవర్ణః స్యాత్సపీతః శుకతుండకః। జపాకుసుమసంకాశో హంసపాదో మహో త్తమః॥" (ఆ-ప్ర.)—చర్మారః శుకతుండకము, హంసపాదము అని మూడు విధములు

హింగుళము, దరదము, మ్లేచ్ఛము, చూర్ణపారదము, సురంగము, రసగర్భము, బర్బరము, రక్తము అనునవి హింగుళనామములు.

---

లభ్యమగును. అందు చర్మారహింగుళము శ్వేతవర్ణమును, శుకతుండక హింగుళము పీతవర్ణమును, హంసపాద హింగుళము మందారపుష్పముతో సమమైన యెఱ్ఱని వర్ణమును గలిగియుండును. వీనిలో హంసపాదహింగుళమే మిక్కిలి శ్రేష్ఠమైనది. దీనినే గ్రహించి యోగములందు జేర్చుకొనవలెను. హింగుళము పై విధముగా పాదరసపు గనుల సమీపముననే లభించును. అందుచేతనే యిది చూర్ణపారదము, రసగర్భము అనెడి నామములతో వ్యవహరింపబడుచున్నది. కృత్రిమ హింగుళము రసగంధకాది సంయోగముచే సిద్ధము జేయబడినట్టిది—"అశుద్ధపారదం భాగం చతుర్భాగంచ గంధకం। ఉభౌ క్షిప్త్వా లోహపాత్రే క్షణం మృద్వగ్నినాపచేత్॥ తస్మిన్ మనశ్శిలాచూర్ణం పారదాద్ద్వాదశాంశకం। క్షిప్త్వా చాల్యమయోదర్వ్యా హ్యవతార్యం సుశీతలం॥ తతస్తు ఖండశః కృత్వా కాచకూప్యాం నిరుధ్య చ। వాలుకాయంత్రగర్భేతు దినం మృద్వగ్నినాపచేత్॥ క్రమవృద్ధాగ్నినాపశ్చాత్ పచేద్దివస పంచకం। సప్తాహాత్తు సముద్ధృత్య హింగులః స్యాన్మనోహరః॥" ఆ-ప్ర.—శుద్ధి జేయబడని పాదరసము ఒక భాగము, శుద్ధి జేయబడని గంధకము నాలుగు భాగములు ఇటుల రెండింటిని కజ్జలి జేసి యా కజ్జలిని యొక యినుపబాణలియందుంచి కొంచెము కాలము మృద్వగ్నితో పాకము జేయవలెను. అనగా

గంధకము కరగి రసముతో బాగుగా సమ్మిశ్రితమగు వరకు పాకము జేయవలెనని యర్థము. పిమ్మట నందు పాదరసములో పదియవవంతుండునట్లు శుద్ధి జేయబడని మనశ్శిలా చూర్ణమును జేర్చి యినుపగరిటెతో పై ద్రవ్యములందు దీనిని కలియునట్లు కలిపి యా బాణలిని క్రిందకుదింపి చల్లార బెట్టవలెను. పిమ్మట నాద్రవ్యపిష్టమును చిన్న చిన్న ముక్కలుగా నగునట్లు నలియగొట్టి, వీనిని కాచకూపికలో పూరించి, మృల్లేపిత వస్త్రఖండములచే కవచమిచ్చి యెండించవలెను. తరువాత నీ కూపికను వాలుకాయంత్రమునందమర్చి యొక దినము మందాగ్నిచేతను, నైదుదినములు మధ్యమ గాఢాగ్నులచేతను పాకముజేసి, యేడవ దినమున అనగా స్వాంగశీతలమున నా కూపికయందు గడ్డగా సిద్ధమైన హింగుళమును గ్రహించవలెను. ఇదియే కృత్రిమ హింగుళమని చెప్పబడుచున్నది. ఇది గూడ సహజ హింగుళముతో బాటు బజారులో లభించును. దీనినిగూడ యథావిధిగ శుద్ధిజేసుకొని యుపయోగించుకొనవలెను. కాని సహజమైనదియే శ్రేష్ఠము. కేవలము శుద్ధిజేయబడి యుపయోగింపబడు ఖనిజములలో నింగిలీకముగూడ జేరి యున్నది. అనగా—ఇంగిలీకమునకు, "హింగులస్య శోధనమేవదృష్టం రసగ్రంథేషు నాన్యత్క్రియాంతర మితిదిక్॥" ఆ-ప్ర.—అని చెప్పియుండుటవల్ల శోధనమేగాని భస్మవిధానము లేదని తెలియవలెను.

## హింగుళ శోధనవిధానము

శ్లో॥ మేషీ క్షీరేణ దరద మమ్లవర్గైశ్చ భావితం।
సప్తవారం ప్రయత్నేన శుద్ధిమాయాతి నిశ్చితం॥

ఆ-ప్ర.

గొఱ్ఱెపాలతోను, అమ్లవర్గ స్వరసములతోను ప్రత్యేక ప్రత్యేక ముగ నేడుమారులు భావనజేసిన హింగుళము పరిశుద్ధమగును. అనగా ఇంగిలీకమును ఖల్వమునందు మెత్తగా చూర్ణించి యాచూర్ణము మునుగునంత గొఱ్ఱెపాలను బోసి యొకరోజు బాగుగా మర్దించి, యెండలో నెండించవలెను. ఇటుల నేడుమారులు జేసి పిమ్మట నమ్లవర్గ ద్రవ్యములలో నొక్కొక్క ద్రవ్యముయొక్క స్వరసముతో పైవిధముగ నేయేడేసిమారులు భావన శోషణములను జేయవలెను. ఈ విధముగ జేసిన యది పరిశుద్ధమై యౌషధ యోగములందు జేర్చుకొనుటకు అర్హమగునని తెలియవలెను *.

---

* స్వానుభూత సాంప్రదాయములు—(1) ఇంగిలీకమును మెత్తగా చూర్ణించి జంబీర రసముతో మూడుదినములు మర్దించి యెండలో బాగుగా నెండించిన శుద్ధియగును. ఈ విధముగ శుద్ధిజేయబడిన దానిని గూడ యోగములందు జేర్చుకొనవచ్చును. (2) ఇంగిలీకపు గడ్డను ఒక గాజుపాత్రయందుంచి యది మునుగునంత స్తన్యము నందు బోసి యాపాత్రను ప్రతిదినము ఎండలోనుంచవలెను. ఇటుల నా స్తన్యము శోషించువరకు నుంచవలెను. ఈ విధముగ నేడుమారులు గాని, యిరువది యొకమారులుగాని చేయవలెను. ఇందు మొదటబోసిన

## శోధితహింగుల గుణములు *

శ్లో॥ తిక్తం కషాయం కటుహింగులంస్యా న్నేత్రామయఘ్నం
కఫపిత్తహారి। హృల్లాస కుష్ఠజ్వర కామలాంశ్చ ప్లీహామ
వాతౌ చ గరం నిహన్తి॥ ఆ-ప్ర.

యథావిధిగ శోధింపబడిన యింగిలీకము తిక్తకషాయ కటురసములను గలిగియుండును. కఫపిత్తములను శమింపజేయును. నేత్రవ్యాధు

---

స్తన్య మిగిరిపోవగనే తిరిగి స్తన్యమును చేర్చుచుండవలెనని తెలియవలెను. ఇటుల స్తన్యముతో భావన జేసినచో నయ్యది పరిశుద్ధమగును. ఈ విధముగ శుద్ధి జేయబడిన హింగుళము పిత్తజ జ్వరములందును, పిత్త వికారములందును నుపయోగింపదగియుండును. (3) ఇంగిలీకపు గడ్డను ఒక శరావమునందుంచి దానిని భల్లాతకబీజములచే గప్పి యందు అగ్నిని ప్రజ్వలింపజేయవలెను. భల్లాతకబీజము లన్నియు దగ్ధమైన పిమ్మట నా యింగిలీకపు గడ్డను అం దుండి గ్రహించవలెను. ఇటుల శుద్ధి జేయబడిన యింగిలీ కము ఫిరంగవ్యాధులం దుపయోగింపదగి యుండును.

* ఇంగిలీకమును యథావిధిగ శుద్ధిజేయక యుపయోగించినచో "అశుద్ధోదరదః కుర్యా దాంధ్యం క్షైణ్యం క్లమం భ్రమం। మోహం మేహంచ సంశోధ్య స్తస్మాద్వైద్యైస్తు హింగుళః" ॥ (ఆ-ప్ర.)—అంధత్వమును, బలక్షైణ్యమును, బడలికను, భ్రమను, మూర్ఛను, ప్రమేహమును గలిగించును. కావున హింగుళమును యథోక్తవిధానమున శోధించియే యుపయోగించవలెను.

లను, హృల్లాసమును, కుష్ఠమును, జ్వరమును, కొమిలావ్యాధిని, ప్లీహ వృద్ధిని, ఆమవాతమును, కృత్రిమవిషమును బోగొట్టును.

## హింగుల యోగములు *

### (1) ఆనందభైరవి

శ్లో॥ హింగులంచ విషం వ్యోషం మరిచం టంకణంకణాః।
మాతులుంగరసైః స్మర్ద్యం రస మానందభైరవం॥
కాసశ్వాస క్షయేగుల్మే ప్రమేహే విషమజ్వరే।
తృష్ణాయాం గ్రహణీరోగే హ్యజీర్ణే సన్నిపాతకే॥
గుంజైకంతుప్రదాతవ్యం రసమానందభైరవం॥

బ-రా.

---

* హింగుళముయొక్క ప్రయోగము రసౌషధము లందు రెండువిధములుగా నున్నది. అందు కేవలము శోధిత హింగుళమునే యోగములందు జేర్చుట యొకటియు, రెండవది శోధితహింగుళమునుండి పాదరసమును గ్రహించి, దానిని యోగములందు జేర్చుటయునని దెలియనగును. హింగుళమునుండి రసమును గ్రహించు విధానమును గంధక జారణప్రసంగమున రసప్రకరణమునందు వివరింపబడి యున్నది. కావున హింగుళరసాకర్షణము నందుండి తెలియ నగును. ఇట మొదటి పద్ధతిననుసరించి హింగుళమిశ్రితము లగు రసౌషధయోగములు, వీని నిర్మాణవిధానములును బాలుర సుఖబోధకై దిఙ్మాత్రముగ వివరింపబడుచున్నవి.

పూర్వోక్త విధానమున శుద్ధిజేయబడిన యింగిలీకము, శుద్ధిజేయబడిన వత్సనాభి, త్రికటుకములు (ప్రత్యేకముగ), మిరియాలు, శుద్ధిజేయబడిన వెలిగారము, పిప్పళ్లు వీనిని సమభాగములుగా గ్రహించవలెను. అందు ఇంగిలీకమును మొదట ఖల్వమునందుంచి మాదీఫలరసముతో జక్కగా మర్దించవలెను (ఇట జంబీరస్వరసముతో మర్దించుట సాంప్రదాయము). పిమ్మట మిగిలిన ద్రవ్యములను మెత్తగా చూర్ణించి యందు జేర్చి పై రసముతోనే మాత్రాపాకము వచ్చువరకు మర్దించి గుంజాప్రమాణమున మాత్రలు జేసి ఛాయాశుష్కము గావించి భద్రపరుచవలెను. ఇటుల సిద్ధముజేయబడినది యానందభైరవి యని చెప్పబడును. ఇది యుక్తప్రమాణమున సేవింపబడినయెడల కాసము, శ్వాసము, క్షయ, గుల్మము, ప్రమేహము, విషమజ్వరము, తృష్ణ, గ్రహణి, అజీర్ణము, సన్నిపాతజ్వరము అను నీ వ్యాధులను శమింపజేయును.

## (2) హింగుళేశ్వర రసము

శ్లో॥ తుల్యాంశంమర్దయేత్ ఖల్వే పిప్పలీం హింగుళం విషం।
గుంజార్ధం మధునాదేయం వాతజ్వరనివృత్తయే॥

భై-ర.

యథోక్త విధానమున శుద్ధిజేయబడిన హింగుళ చూర్ణమును, శోధితవత్సనాభి చూర్ణమును, పిప్పళ్ల చూర్ణమును సమభాగములుగ గ్రహించి, యందు హింగుళచూర్ణమును ఖల్వమునందుంచి హంసోదకముతో నూరవలెను. పిమ్మట మిగిలిన రెండుద్రవ్యముల చూర్ణములను జేర్చి పూర్వమువలెనే హంసోదకముతో మాత్రాపాకము వచ్చువరకు మర్దించి యర్ధగుంజాప్రమాణమున మాత్రలనుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది హింగుళేశ్వరరసమని వ్యవహ

రించబడును. దీనిని తేనెతో జేర్చి సేవించినయెడల వాతజ్వరము శమించును.

## (3) మృత్యుంజయ రసము

శ్లో॥ విషస్యైక స్తథాభాగో మరించం పిప్పలీకణః। గంధకస్య తథాభాగో భాగస్స్యాత్ టంకణస్యవై॥ సర్వత్ర సమభాగఃస్యా చ్ఛుద్ధ హింగుళకస్యతు। జంబీరేణవిమర్ద్యాథ ముద్గమాత్రాంవటీంచరేత్। మధునాలేహసంప్రోక్తం సర్వజ్వరనివృత్తయే। దధ్యుదకానుపానేన వాతజ్వర నిబర్హణః॥ ఆర్ద్రికస్యరసైఃపానం దారుణే సాన్నిపాతికే। జంబీరరసయోగేన అజీర్ణ జ్వరనాశనః॥ అజాజీగుడ సంయుక్తో విషమజ్వరనాశనః। అయంమృత్యుంజయో నామ రసః సర్వజ్వరాపహః॥ అనుపానప్రభేదేన నిహన్తి సకలాన్ గదాన్॥ భై-ర.

శోధితవత్సనాభి యొకభాగము, మిరియాలు ఒకభాగము, పిప్పళ్లు ఒకభాగము, శోధితగంధ మొకభాగము, శోధితటంకణ మొకభాగము, శోధితహింగుళము * అన్నింటి మొత్తమునకు సమభాగము (అనగా నైదుభాగములు) ఇటుల గ్రహించి, అందు హింగుళమును తొలుత జంబీరరసముతో నూరి పిమ్మట గంధకమును జేర్చి యీ రెండును జక్కగా గలియువరకు పైరసముతోనే నూరవలెను. అటుపిమ్మట

---

* [ ఇచ్చట ఇంగిలీకమునకు బదులుగా పాదరసమును మే ముపయోగించుచున్నాము. అల్లపురసముతో మర్దించుచున్నాము. ఆ-ల. ]

మిగిలినద్రవ్యముల చూర్ణములను జేర్చి మాత్రాపాకము వచ్చువరకు నా రసములోనే నూరి ముద్గప్రమాణమున మాత్రలుజేసి ఛాయా శుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది మృత్యుంజయరసమని వ్యవహరింపబడును. దీనిని తేనెతోజేర్చి సేవించిన సర్వజ్వరములు శమించును. పెరుగుమీది నీళ్లతో వాతజ్వరము, అల్లపురసముతో దారుణమైన సన్నిపాతజ్వరము, జంబీరస్వరసముతో నజీర్ణముచే గలిగిన జ్వరము, తెల్లజీలకర్ర, బెల్లము వీనితో విషమజ్వరమును ఇటుల ననుపానభేదములతో నీ యౌషధమును సేవించిన యా జ్వరములెల్ల శమించును.

## (4) సన్నిపాత భైరవి

శ్లో॥ తాళకం గంధకం సూతం వత్సనాభం త్రిభిస్సమం।
శిలాచ టంకణం చైవ సర్వత్ర సమహింగుళం॥
మర్దితం చిత్రజంబీరే శార్ద్రకేన దినత్రయం।
అనుపాన విశేషేణ సన్నిపాతకభైరవం॥
త్రిదోషంచాతిసారంచ కఫపాండు మనోచకం।
కుక్షిశూల ముదావర్త సన్నిపాతనికృన్తనం॥

బ-రా.

శుద్ధిజేయబడిన తాళక మొకభాగము, శుద్ధిజేయుబడిన గంధక మొకభాగము, శుద్ధిజేయబడిన పాదరస మొకభాగము, శుద్ధిజేయబడిన వత్సనాభి మూడుభాగములు, శుద్ధిజేయబడిన మణిశిల యొకభాగము, శుద్ధిజేయబడిన వెలిగార మొకభాగము, శుద్ధిజేయబడిన హింగుళము పై ద్రవ్యభాగములమొత్తమునకు సమభాగము ఇటుల గ్రహించవలెను. ఇందు రసగంధకములను కజ్జలిగా నూరియుంచవలెను. తాలకమును ప్రత్యేకముగ భావనకు జెప్పబడిన స్వరసములలో నేయొకదానిచేనైన

తళుకు నశించువరకు మర్దించి యుంచవలెను. పిమ్మట హింగుళమును ప్రత్యేకముగ నై విధముగనే మర్దించి యందు రసగంధక కజ్జలిని, తాళకపిష్టమును, మిగిలినద్రవ్యముల చూర్ణములను జేర్చి యందు చిత్రమూలస్వరసమును బోసి మూడుదినములును, జంబీరస్వరసమును బోసి మూడుదినములును, అల్లపురసమునుబోసి మూడుదినములును జక్కగా మర్దించి మాత్రాపాకము వచ్చినపిమ్మట ముద్గప్రమాణమున మాత్రలు జేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది సన్నిపాతభైరవి యని వ్యవహరింపబడును. దీనిని యనుపానభేదములతో సేవించినయెడల త్రిదోషములును, అతిసారమును, కఫపాండువును, అరుచియు, పక్షిశూలయు, ఉదావర్తమును, సన్నిపాతజ్వరమును శమించును.

## (5) కర్పూరాది రసము

శ్లో॥ హింగుళం ఫణిఫేనంచ ముస్తకేంద్రయవంతథా।
జాతీఫలంచ కర్పూరం సర్వం సమ్మర్ద్యయత్నతః॥
జలేన గుటికా కార్యా ద్విగుంజాపరిమాణతః।
జ్వరాతీసారిణే చైవ తథాతీసారరోగిణే॥
గ్రహణీషట్ప్రకారే చ రక్తాతీసార ఉల్బణే॥ భై-ర.

శుద్ధిజేయబడిన హింగుళము, నల్లమందు, తుంగముస్తలు, కొడిశపాలగింజలు, జాజికాయ, హారతి కర్పూరము వీనిని సమభాగములుగ గ్రహించి, అందు హింగుళమును ఖల్వమునందుంచి జలముతో మొదట నూరి, పిమ్మట నల్లమందును జేర్చి బాగుగా కలియువరకు నూరవలెను. అటుపిమ్మట తుంగముస్తలు, కొడిశపాలగింజలు, జాజికాయ వీని చూర్ణములను జేర్చి జలముతోనే మూడుదినములు చక్కగా మర్దించవలెను. తరువాత హారతి కర్పూరమును జేర్చి యొకదినము నూరి రెండు గురిగింజల పరిమితిని మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల

సిద్ధము జేయబడినది కర్పూరాదిరసమని చెప్పబడును. ఇందు మర్దనకు జలమునకు బదులు అజమోదార్కము నుపయోగించుట సాంప్రదాయముగా నున్నది. దీనివలన జ్వరాతిసారము, అతిసారము, గ్రహణి, రక్తాతిసారమును శమించును *.

## (6) రసరాడ్రసము

శ్లో॥ హింగుళ స్యైకభాగంతు గంధస్యాష్టౌ తథైవచ।
లోహస్య రజసోభాగాన్ వేదసంఖ్యాన్ ప్రకల్పయేత్॥
రసకర్పూర మేకంతు సిందూరం చైకభాగికం।
సూతమేకం వినిక్షిప్య ఖల్వే సర్వం విమర్దయేత్॥
కుమారీస్వరసే నాథ గుటికాన్ కారయే ద్బుధః।
శరావసంపుటేరుధ్వా పాచయే న్మృదునాగ్నినా॥
గంధస్య చ క్షయో యావత్ స్వాంగశీతే సముద్ధరేత్।
పునఃకుమారికాద్భిస్తం మర్దయేచ్చ విశోషయేత్॥
గుంజామాత్రా ప్రదాతవ్యా కాసశ్వాసాదికేషువై।
వాతవ్యాధీన్ తథాహన్యాత్ రసరాడ్రసఉత్తమః॥
(గురుసాంప్రదాయము)

శుద్ధిజేయబడిన హింగుళ మొకభాగము, శుద్ధిజేయబడిన గంధక మెనిమిదిభాగములు, శుద్ధిజేయబడిన లోహరజను నాలుగుభాగములు, శుద్ధిజేయబడిన రసకర్పూర మొకభాగము, శుద్ధిజేయబడిన రససిందూర మొకభాగము, శుద్ధిజేయబడిన పాదరస మొకభాగము ఇటుల గ్రహించి; తొలుత రసగంధకములను ఖల్వమునందు కజ్జలిజేసి, మిగిలిన ద్రవ్యముల నందుజేర్చి కలబందరసముతో మూడుదినములు చక్కగా మర్దించి,

* [ఈ యోగములో మేము టంకణమునుగూడ చేర్చుచున్నాము. ఆ-ల.]

గుటికలుగాజేసి యెండించవలెను. పిమ్మట వీటిని శరావసంపుటము నందు (ఊర్ధ్వశరావమునకు మధ్యగా గంధకపు పొగ బయటకుపోవుట కనువుగానుండునట్లు చిటికెనవ్రేలు దూరునంత బెజ్జమును జేయవలెను) బంధించి, మృద్వగ్నితో నందలి గంధకము పోవువరకును పాకముజేయ వలెను. స్వాంగశీతలమున నౌషధమును గ్రహించి తిరిగి కలుబందరస ముతో జక్కగా మర్దించి యెండించవలెను. ఇటుల సిద్ధముజేయబడి నట్టిది రసరాడ్రసమని వ్యవహరించబడును. దీనిని గుంజాప్రమాణమున సేవించినయెడల కాస, శ్వాస మున్నగు కఫజవ్యాధులును, వాతవ్యాధు లును శమించును.

## (7) భేదిజ్వరాంకుశరసము

శ్లో॥ పారదం వత్సనాభంచ ప్రత్యేకం నిష్కసమ్మితం।
ద్వినిష్కం గంధకంచైవ టంకణంచ ద్వినిష్కకం॥
మరిచం పంచనిష్కంస్యాత్ షణ్ణిష్కం దన్తిబీజకం।
సింహీఫలరసై ర్మర్ద్యం ద్వియామం శ్లక్ష్ణతాంనయేత్॥
గుంజామాత్రాం వటీంకృత్వా ఛాయాశుష్కంచ కార
యేత్। ఆర్ద్రికద్రవ సంయుక్తం జ్వరేజీర్ణే ప్రయోజ
యేత్॥ సర్వజ్వరహరం శీఘ్రం నామ్నా భేది జ్వరాం
కుశం॥ బ-రా.

శుద్ధిజేయబడిన హింగుళ (ఇట పాదరసమునకు బదులు హింగు ళము నియోగమున జేర్చుట మా సాంప్రదాయము) యొక భాగము, శుద్ధిజేయబడిన వత్సనాభి యొకభాగము, శుద్ధిజేయబడిన గంధకము రెండు భాగములు, పొంగించిన వెలిగారము రెండు భాగములు, మిరియాల చూర్ణ మైదుభాగములు, శుద్ధిజేయబడిన దన్తిబీజ మారుభాగములు ఇటుల గ్రహించి, తొలుత హింగుళమును గంధకమును ఖల్వమునందుంచి బాగుగా కలియ నూరవలెను. పిమ్మట మిగిలిన ద్రవ్యములను జేర్చి

వాకుడుకాయల రసముతో జక్కగా రెండు యామములు మర్దించి గురు గింజ ప్రమాణమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది శీతజ్వరాంకుశ రసమని చెప్పబడును. దీనిని అల్లపు రసములో సేవించవలెను. ఇందువలన జీర్ణజ్వరము మున్నగు సమస్త జ్వరములును శమించును. ఇది విరేచనము జేయును.

## (8) నిత్యానందరసము

శ్లో॥ హింగూళ సంభవం సూతం గంధకం మృతతామ్రకం।
కాంస్యంవంగం హరితాలం తుత్థం శంఖం వరాటికా॥
త్రికటుత్రిఫలాలోహం విడంగం పటుపంచకం।
చవికా పిప్పలీమూలం హాపుషాచ వచా తథా॥
శఠీపాఠా దేవదారు ఏలాచ వృద్ధదారకం।
త్రివృతా చిత్రకందస్తీం గృహీత్వాతు పృథక్ పృథక్॥
ఏతాని సమభాగాని సంచూర్ణ్య గుటకీకృతం।
హరీతకీరసం దత్వా దశగుంజోన్మితం శుభం॥
ఏకైకం భక్షయేన్నిత్యం శీతం చాను పిబేజ్జలం।
.........నిత్యానంద రసశ్చాయం మహాశ్లీపదనాశనః॥
రక్తజే పిత్తజే చాపి శ్లీపదే యోజయేదముం।
నాతః పరతరం కించి ద్విద్యతే శ్లీపదామయే॥ భై-ర.

శోధిత హింగుళమునుండి గ్రహింపబడిన రసము, శోధితగంధకము, తామ్రభస్మ, కాంస్యభస్మ, వంగభస్మ, శోధితతాళకము, తుత్థభస్మ, శంఖభస్మ, వరాటికాభస్మ, త్రికటు చూర్ణము (ప్రత్యేకముగ), త్రిఫలా చూర్ణము (ప్రత్యేకముగ), లోహభస్మ, విడంగచూర్ణము, పంచ లవణములు (ప్రత్యేకముగ), చవ్య చూర్ణము, మోడిచూర్ణము, బోడతర

చూర్ణము, వచాచూర్ణము, కచోరాలచూర్ణము, చిరుబొద్దిచూర్ణము, దేవదారు చూర్ణము, ఏలకుల చూర్ణము, వృద్ధదారుబీజములచూర్ణము, తెగడచూర్ణము, చిత్రమూలచూర్ణము, నాగదన్తీమూలచూర్ణము ఇటుల వీనిని సమాంశములుగ గ్రహించవలెను. ఇందలి రసగంధకములను కజ్జలిగా నూరి, పిమ్మట నందు మిగిలిన ద్రవ్యములనెల్ల జేర్చి కరక్కాయల కషాయముతో మూడు దినములు చక్కగానూరి 10 గురుగింజల ప్రమాణమున గుటికలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది నిత్యానందరస మనబడును. దీనిని శీతలజలాను పానముతో ప్రతినిత్యము సేవించవలెను. ఇందువలన సమస్త శ్లీపదము లును శమించును. మేదోవృద్ధి, గండమాల, అర్బుదము, అన్త్రవృద్ధియు శమించును.

---

# అభ్రకము

## అభ్రకనామములు *

శ్లో॥ అభ్రకం గిరిజాబీజ మమలం గగనాహ్వయం॥

ర-సా-సం.

అభ్రకము, గిరిజాబీజము, అమలము, గగనము అనునవి యభ్రక నామములు.

---

* అభ్రకనామార్థములు—శ్లో॥ తద్వజ్రం వజ్రజాతత్వా దభ్ర మభ్రరవోద్భవాత్। గగనా త్పతితంయస్మా ద్గగనంచ తతోమతం॥ (అ-ప్ర.)—పూర్వకాలమున నింద్రుడు వృత్రాసురుని వధించుటకై తన వజ్రాయుధమును పైకియెత్తినప్పుడు దాని తేజఃకణములు ఆకాశమునందు

వ్యాపించి మేఘధ్వనివలె ధ్వనిజేయుచు నవి పర్వతములపై బడియుండెను. అట్టి తేజఃకణమే పర్వతములనుండి యభ్రక రూపమున నుద్భవించెను. కావున నిది మేఘగర్జనముతో సమమై ధ్వనిజేయుచు క్రిందపడుటచే నభ్రకమని చెప్పబడు చున్నది. వజ్రాయుధమునుండి యుత్పన్నమైనదగుటచే వజ్ర మనియు, పర్వతపు గనులనుండి యుత్పన్నమైనదగుటచే గగనమనియు, పార్వతీదేవియొక్క బీజరూపమున నుత్పన్న మైనదగుటచే గిరిజాబీజమనియు, తేజఃకణరూపమున నుత్ప న్నమైనదగుటచే మలముతో గూడియుండనిదై యమల మనియు వ్యవహరింపబడుచున్నది.

అభ్రక భేదములు—శ్లో॥ పినాకం దర్దురం నాగం వజ్రంచేతి చతుర్విధం। కృష్ణాభ్రం కథితం ప్రాజ్ఞైః తేషాం లక్షణముచ్యతే॥ ముంచత్యగ్నౌ వినిక్షిప్తం పినాకం దల సంచయం। అజ్ఞానాద్భక్షణం తస్య మహాకుష్ఠ ప్రదాయకం॥ దర్దురం త్వగ్నినిక్షిప్తం కురుతే దర్దురధ్వనిం। గోలకాన్ బహుశః కృత్వా తత్స్యాన్మృత్యుప్రదాయకం॥ నాగంతు నాగవద్వహ్నౌ ఫూత్కారం పరిముంచతి। తద్భక్షితమవ శ్యంతు విదధాతి భగందరం॥ వజ్రంతు వజ్రవత్తిష్ఠేత్ నచాగ్నౌ వికృతింవ్రజేత్। సర్వాభ్రేషు వరం వజ్రం వ్యాధి వార్ధక్యమృత్యుజిత్॥ (ఆయుర్వేదప్రకాశ)—అభ్రకము శ్వేత-రక్త-పీత-కృష్ణ వర్ణభేదముచే నాలుగువిధములుగా నుండును. అందు శ్వేతాభ్రకము తారక్రియకును (వేధ

కర్మచే వంగమును రజతముగాజేయు నిమిత్తము పాదరస మునకు అభ్రకముతో జేయు జారణసంస్కారము తార క్రియ యనబడును), రక్తాభ్రకము రసాయనమునకును, పీతాభ్రకము హేమక్రియకును (వేధకర్మచే తామ్రరజత ములను స్వర్ణముగా పరిణమింపజేయు నిమిత్తము అభ్రక ముతో పాదరసమునకు జేయు జారణసంస్కారము హేమ క్రియ యనబడును), కృష్ణాభ్రకము వ్యాధులకును శ్రేష్ఠము లైనవిగా నుండును. వీనిలో కృష్ణాభ్రకము తిరిగి పినాకము, దర్దురము, నాగము, వజ్రము అని నాలుగువిధములుగా నుండును. అందు పినాకమను కృష్ణాభ్రకమును అగ్ని యందు గాల్చినప్పుడు విశేషముగా దళములను విడిచి పెట్టును. అనగా దళరూపమున విడిపోవును. దీనిని సేవిం చుటవల్ల కుష్ఠువ్యాధి జనించును. కావున ఇట్టి యభ్రకము గ్రాహ్యముకాదు. దర్దురమను కృష్ణాభ్రకమును అగ్ని యందు గాల్చినప్పుడు మండూకమువంటి ధ్వనిని బుట్టించును. దీనిని సేవించుటవల్ల మలము గోళకాకారముగ బరిణమించి మలబంధమేర్పడి తన్మూలమున మరణము సంభవించును. కావున నిట్టి యభ్రకముగూడ గ్రాహ్యముకాదు. నాగమను కృష్ణాభ్రకమును అగ్నియందు గాల్చినప్పుడు సర్పమువలె ఫూత్కారము జేయును. దీనిని సేవించుటవల్ల భగందర మను వ్యాధి జనించును. కావున నిట్టి యభ్రకముగూడ గ్రాహ్యముకానేరదు. వజ్రమను కృష్ణాభ్రకమును అగ్ని యందు గాల్చినప్పు డెట్టివికారములను జెందకయది స్థిరముగా

నిలిచియుండును. దీనిని సేవించుటవల్ల నియ్యాది వ్యాధులను, ముసలితనమును, మృత్యువును జయించును. కావున నిది యన్నింటిలో శ్రేష్ఠమైనదై గ్రహింప యోగ్యమైనదిగా నుండును. మరియు, శ్లో॥ స్నిగ్ధం పృథుదలం వర్ణ సంయుక్తం భారతోఽధికం। సుఖనిర్మోచ్యపత్రంచ తదభ్రంశస్తమీరితం॥ (ర-ర-స.)—నిగనిగలాడునట్టి పెద్ద పెద్ద దళములు గలిగినట్టియు, మిక్కిలి కృష్ణవర్ణముగలిగినట్టియు, అధికమైన భారముతో గూడియున్నట్టియు, అనాయాసముగ విడదీయుట కనువైన పత్రములను గలిగియున్నట్టియు కృష్ణాభ్రకము శ్రేష్ఠమైనదిగా గుర్తెఱిగి యట్టి దానిని ఔషధార్థమై గ్రహించవలెను. మరియు, శ్లో॥ అభ్రముత్తరశైలోత్థం బహుసత్వం గుణోత్తరం। దక్షిణాద్రిభవం స్వల్పసత్వ మల్పగుణోత్తరం॥ (ఆ-ప్ర.)—ఉత్తర దేశస్థములగు పర్వతపు గనులలో నుత్పన్నమైన యభ్రకము అధికమైన సత్వముతో గూడి యధిక గుణవంతముగ నుండును. దక్షిణదేశస్థములగు పర్వతపు గనులలో నుత్పన్నమైన యభ్రకము స్వల్పసత్వముతో గూడి స్వల్పగుణవంతముగ నుండును. కావున అట్టి గుణభేదమును గుర్తెఱింగి యభ్రకమును గ్రహించవలెను. మరియు, శ్లో॥ అభ్రం గృహీతం ఖనితో భిషగ్భిః సంఖానయిత్వా పురుషప్రమాణం। తద్వారవ త్సత్వఫలప్రదంస్యాద్గుణాధికం, స్వల్పగుణంతతోఽన్యత్॥ (ఆ-ప్ర.)—అభ్రకపుగనులలో నిలువులోతున త్రవ్వి యచ్చట లభించినట్టి యభ్రకమునే గ్రహించవలెను.

ఇది మిక్కిలి భారవంతమై గుణముతోగూడి యభ్రకసత్వ
ముతో తుల్యమైన ఫలమును గలిగించునదిగా నుండును.
గనులలో నూర్ధ్వభాగమున లభించునట్టిది తేలికగను,
స్వల్పగుణములు గలదిగను నుండును. కావున గుణవంత
మైన యభ్రకమును గ్రహించవలెనని తెలియవలెను.
అభ్రకము శుద్ధిజేయబడినంతమాత్రాన సేవింపదగినట్టి ఖనిజ
ద్రవ్యము గానేరదు. మారణముజేసియే యనగా శోధనా
నంతరము భస్మగా బరిణమింపజేసి దీనిని సేవింపవలెనని
దెలియవలెను. మరియు, "దేవ్యా రజో భవే ద్గంధం ధాతు
శ్శుక్రం తథాభ్రకం। ఆలింగనే సమర్థాద్వా ప్రియత్వా
చ్ఛివరేతసః॥ యథాస్యాజ్జారణాబహ్వీ తథాస్యా ద్గుణవో
భవేత్ ॥॥" (అ-ప్ర.) అని చెప్పబడినది. అనగా నభ్రక
మునకును పాదరసమునకు నత్యంత సఖ్యతయున్నదనియు,
నిది రసమునందు జారణజేయుట కుపయోగింపబడుననియు,
దీనితో నెంతహెచ్చుగ రసమునకు జారణముజేసిన యంత
హెచ్చుగ రసమునకు గుణాధిక్యతను గలిగించుననియు దెలి
యదగినది. మరియు, "ఘనరహితబీజచారణ సంప్రాప్త
దశాది సిద్ధికృతకృత్యాః। కృపణాఃప్రాప్యసముద్రం వరా
టికాలాభసంతుష్టాః॥" (ర-హృ.) రసమునకు గుణోత్పా
దనముకై స్వర్ణాదులను జారణముజేసినను అభ్రకజారణము
జేయనిచో నది ప్రయోజనవంతము గానేరదు. అభ్రకము
రసమునందు జీర్ణమై "న పునః పక్షచ్ఛేదో ద్రవ్యత్వాం వా
వినాగగనం॥ అభ్రజీర్ణో బలవాన్ భవతిరసః॥ పక్షచ్ఛిన్నశ్చ

రసో యోగ్యః స్యాద్రసరసాయనయోః ॥ (ర-హృ.) దాని యొక్క చాంచల్యస్వభావమును నశింపజేసి స్థిరత్వమును గలిగించును. ఇట్టి స్థిరభావము అభ్రకమును విడచి రసమునకు ఏ యితరద్రవ్యముచేతను గలుగనేరదు. అట్లు స్థిరత్వమును బొందించుటవల్ల నభ్రకముచే రసమునకు వ్యాధిహరణశక్తియందును రసాయనశక్తియందును బలమేర్పడును. కావుననే "తస్మాజ్జీవన్ముక్తిం సమీహమానేన యోగినాప్రథమం। దివ్యా తను ర్విధేయా హరగౌరీ సృష్టి సంయోగాత్ ॥" (ర-హృ.) జీవన్ముక్తిని సాధించుటకు వలయు శరీరసిద్ధికి అభ్రకజారితమైన రససేవనము పరమోత్కృష్టమైనదని రసాచార్యులు దెలిపియున్నారు. అయితే శరీరసిద్ధికై జేయు రససేవనమునకు ముందుగా శరీరమునకు క్షేత్రీకరణ మవసరమైయుండును. "అకృతక్షేత్రీకరణే రసాయనం యో నరః ప్రయుంజీత। తస్య క్రామతి న రసః॥ అభ్రస్య రసాయనినాం భక్ష్యమిహకీర్తితం పరం సత్వం॥" (ర-హృ.) క్షేత్రీకరణము జేయక రసమును సేవించినయెడల నయ్యది శారీరకధాతువులందు లీనముగానేరదు. కావున ఇందుకు గూడ అభ్రకసేవనము ఆవశ్యకమైయున్నది. ఇటుల ఖనిజద్రవ్యములలో నభ్రకమునకు పాదరసముతో నత్యంత సంబంధమున్నట్లు దెలియవలెను. అభ్రకము సహజముగా రసాయనద్రవ్యము. దీనిని యథోక్తవిధానమున నుపయోగించినచో నమృతముతో దుల్యముగ శరీరమున కుపకరించును.

## అభ్రకశోధన విధానము *

శ్లో॥ వజ్రాభ్రం వహ్నిసంతప్తం నిక్షిప్తం సప్తసప్తధా।
గోదుగ్ధే త్రిఫలాక్వాథే కాంజికే సురభీజలే॥
శుద్ధిమాయాతిమలతః ప్రక్షిప్తం వాత్రిధాత్రిధా॥
ఆ-ప్ర.

కృష్ణాభ్రకము (వజ్రాభ్రకము) ను కొలిమియందు నిపుణముగ దీనికి యగ్నితో సదృశమైన వర్ణము వచ్చువరకు గాల్చి యావుపాల యందును, త్రిఫలాకషాయమునందును, కాంజికమునందును, గోమూత్రమునందును ప్రత్యేకముగ నేడేసిమారులుగాని, మూడేసిమారులుగాని ముంచిన నయ్యది పరిశుద్ధమగును †.

---

* అభ్రకమును కొలిమియందు గాల్చి కేవల మొక్క త్రిఫలాకషాయమునం దేడుమారులు ముంచినను అయ్యది పరిశుద్ధమగును. ఇటుల జేయుట స్వానుభూత సాంప్రదాయమని తెలియవలెను.

† ఇట శోధనమునకు గ్రహింపబడు ద్రవ ద్రవ్యముల పరిమితి యభ్రకము మునిగియుండుటకు గావలసినంత యని తెలియవలెను. మరియు నొక్కొక్క ద్రవమునం దేడు మారులు ముంచవలెను అనగా నాయొక్కొక్క ద్రవము నేడేసి విభాగములను జేసికొని, తొలుత నొకద్రవముయొక్క యేడు విభాగములలో మొదటి విభాగమున గాల్చిన యభ్రకమును ముంచి యందుండి గ్రహించి, తిరిగి దీనిని కొలిమిలో గాల్చి యాద్రవముయొక్క రెండవ విభాగమునందు ముంచవలెను. ఇటులనే యాద్రవముయొక్క యేడు

## ధాన్యాభ్రక విధానము

శ్లో॥ పాదాంశ శాలిసంయుక్త మభ్రం బద్ధ్వాథకంబళే।
త్రిరాత్రం స్థాపయేన్నీరే క్లిన్నంవైమర్దయేత్కరైః॥
తన్నీర ఏవయత్నేన యావత్సర్వం స్రవేత్తతః।
కంబళాద్గళితం సూక్ష్మం వాలుకా సదృశం చయత్॥
తద్ధాన్యాభ్రక మిత్యుక్తం మారణం చాప్యథో భవేత్॥
ఆ-ప్ర.

పూర్వోక్త విధానమున శుద్ధిజేయబడిన యభ్రకమును బాగుగా నెండించి హస్తముతో రుద్దినయెడల కొద్దిగ ఖర చూర్ణమువలె నగును. అందు నాల్గవభాగము ధాన్యమునుజేర్చి, రెండింటిని కలియగలిపి దీని

---

విభాగములందును ముంచినపిమ్మట రెండవ మూడవ నాల్గవ ద్రవములయొక్క సప్తవిభాగములందును అభ్రకమును గాల్చి ముంచుటను క్రమముగా బూర్తిచేయవలెను. అనగా నీ నాలుగు విధములగు ద్రవములలో మొత్తము ఇరువది యెనిమిదిమారు లభ్రకమును గాల్చి ముంచవలెనని దెలియనగును. మూలమునందు మూడుమారులైనను ముంచవలెనని జెప్పబడియున్నది. కాని, యేడుమారులు ముంచుటయే సాంప్రదాయమని గ్రహించవలెను.

[అభ్రకమును రేగుచెక్క కషాయముతో శుద్ధి జేయుట కూడ గలదు. మే మీ కషాయములో నభ్రకమును గాల్చి యేడుమార్లుముంచి, శుద్ధిజేసి యున్నాము. ఆ-ల.]

నంతను ఒక కంబళియందుంచి, (పరిశుద్ధమైన గోనెగుడ్డయందైనను, దళసరిగనుండు వస్త్రమునందైనను నుంచవచ్చును) వదులుగా నుండు నట్లు మూటగట్టి, దీని నొక వెడల్పుగనుండు పాత్రయందుంచి యది మునిగియుండునంత జలము * ను బోసి యటులనే మూడు దినము లూర బెట్టవలెను. పిమ్మట నా మూట నా జలమునందుంచియే హస్తములతో బలముగ రుద్దవలెను. ఇటుల జేయుటవలన ధాన్యముతో గలిగిన సంఘర్షణముచే నభ్రకము నలిగి యా మూటనుండి మిక్కిలి మృదుత్వము గలిగి సూక్ష్మరూపమున నుండు నిసుకరేణువుల సదృశమున నా ద్రవము నందు జారును. ఇటుల నా మూటయందలి యభ్రకమంతయు నా ద్రవ మునం దట్లు జారువరకును హస్తములతో రుద్దుచుండవలెను. పిమ్మట నా పాత్రము నెండలోనుంచి యూర్ధ్వభాగమున మిక్కిలి పలుచగ తేరిన ద్రవమును బయటకు బోవునట్లు జేయుచుండవలెను. ఈ విధముగ గొంతకాలము చేయునప్పటికి యడుగుభాగమున నభ్రకము మిక్కిలి చిక్కని నవనీతమువలె నిలిచియుండును. ఇదియే ధాన్యాభ్రకమని వ్యవహరింపబడును. మరియు నిది యభ్రకనవనీతమనిగూడ జెప్పబడు చుండును. పిమ్మట దీనిని జాగ్రత్తగ నెండలో శోషింపజేసి భస్మీకరణ ముకై యుపయోగించవలెను.



## అభ్రకభస్మ విధానము

శ్లో॥ ధాన్యాభ్రకం సమాదాయ ముస్తాక్వాథైః పుటత్రయం।
తద్వత్పునర్నవానీరైః కాసమర్దరసైస్తథా।
నాగవల్లీదలైస్తద్వత్సూర్యక్షీరైః పుటత్రయం।
క్వాథై ర్వటజటోత్థైశ్చ త్రిః పుటే న్ముసలీజలైః॥
త్రిర్గోక్షుర కషాయేణ త్రిః పుటే ద్వానరీరసైః।
మోచకందరసైః పాచ్యం త్రివారం కోకిలాక్షజైః॥

రసైః పుటేత్ తతోఽర్కాద్యైః క్షీరాదేకం పుటం ముహుః।
దధ్నాఘృతేన మధునా స్వచ్ఛయాసితయా తథా॥
ఏకమేకం పుటం దద్యాద్ అభ్రస్యైవం మృతిర్భవేత్॥
సర్వరోగహరం వ్యోమ జాయతే యోగవాహకం॥

ఆ-ప్ర.

ధాన్యాభ్రకమును ఖల్వమునందుంచి, యిది మునుగునంత పరిమితిని తుంగముస్తలకషాయము నందుబోసి చక్కగా మూడుదినములు మర్దించవలెను. పిమ్మట నాపిష్టమును చిన్న చిన్న చక్రికలను (బిళ్లలను) జేసి, వీని నొక విశాలమైన శరావమునందుంచి యెండింపవలెను. అవి బాగుగా నెండినపిదప వేరొక శరావ సంపుటమునందుంచి దృఢముగ సంధిబంధనము జేసి యెండించవలెను. పిమ్మట నీ సంపుటమును బాగుగా నెండిన గిరీండకముల (పిడకల) మధ్యనుంచి యొక గజపుటముచే * పాకము జేయవలెను. స్వాంగశీతలమున నా సంపుటమునందుండి

* గజపుటము—దీనియొక్క లక్షణము రసప్రకరణమున రసభస్మ విధానమునందు వివరింపబడియున్నది. అందు జూచి గ్రహింపనగును. పుటపాక మనగా—"రసాది ద్రవ్యపాకానాం ప్రమాణజ్ఞాపనం పుటం। నేష్టో న్యూనాధికః పాకః సుపాకం హితమౌషధం॥ (ర-ర-స.) రసాది ద్రవ్యములయొక్క పాకము అనగా వీటికి శారీరక ధాతువులందు లీనమగుట కనువగు అతి సూక్ష్మరూపమైన పరిణామము బొందించు నిమిత్త మగ్నిచే జేయబడు సంస్కారము పుటపాక మనబడును. ఈ సంస్కారము శరావసంపుటము యొక్కగాని, మూషా సంపుటముయొక్కగాని **సహాయ**

గ్రహించి యందలి దగ్ధమైన యభ్రక చక్రికలను దీసికొని వానిని ఖల్వమునందుంచి మెత్తగా నూరవలెను. పిమ్మట పై విధముగా తుంగ ముస్తల కషాయమును జేర్చి మూడుదినములు మర్దించి పుటపాకము జేయ వలెను. ఇటుల ముస్తా కషాయముతో మూడు పుటములను, పునర్నవా స్వరసముతో మూడు పుటములను, కొసమర్ద స్వరసముతో మూడు పుటములను, నాగవల్లీదల స్వరసముతో మూడు పుటములను, అర్కక్షీరముతో మూడు పుటములను, మర్రియూడల స్వరసముతో మూడు పుటములను, నేలతాడిగడ్డల స్వరసముతో మూడు పుటములను, దురదగొండివేళ్ళ కషాయముతో మూడు పుటములను, అరటిదుంప రసముతో మూడు పుటములను, నీరుగొబ్బివేళ్ళ కషాయముతో మూడు పుటములను వేయవలెను. పిమ్మట నిదేవిధముగ గొద్దుగపట్ట కషాయముతో నొకపుటమును, ఆవుపాలతో నొక పుటమును, ఆవు పెరుగుతో నొక పుటమును, ఆవు నేయితో నొకపుటమును, తేనెతో నొక పుటమును, తెల్లని చక్కెరతో (శర్కరోదకముతో) నొక పుట

---

ముతో జేయబడునది యగుటచే పుటమనిగూడ వ్యవహరింపబడుచున్నది. ఈ సంస్కార మట్టి ద్రవ్యములకు హెచ్చుగగాని, తక్కువగగాని చేయకూడదు. ఎంతయగ్నిచే నెన్నిమారులు జేసిన యాద్రవ్యములకు శారీరకధాతువులలో ననాయాసముగ లీనమగునట్టి పరిణామ మేర్పడునో యన్ని పుట సంస్కారములనే జేయవలెను. హెచ్చుగ జేసినచో దగ్ధవీర్యములగును. తక్కువగ జేసినచో శారీరక ధాతువులందు లీనముగాక పోవును. కావున అట్టి ప్రమాణమును దెలుపుటయే పుటపాకమునందలి యుద్దేశ్యమని దెలియవలెను.

మును వేయవలెను. ఇటుల పుటపాకము జేసినయెడల నయ్యది సమస్త రోగహరముగను, రోగవాహిగను నుండు భస్మరూపమున బరిణమించును †.

---

† స్వానుభూత సాంప్రదాయమునందలి యభ్రకభస్మ విధానము—ధాన్యాభ్రకమును తొమ్మిదిపౌనుల పరిమితిగల దిగా గ్రహించి త్రిఫలా కషాయముతో మూడు దినములు చక్కగా మర్దించి, యాపిష్టమును దళసరిగ నాలుగు చక్రికలనుజేసి గాఢమగు నాతపమున నెండించవలెను. పిమ్మట నొక్కొక్క చక్రికను దళసరిగనుండు వస్త్రఖండముచేజుట్టి, వీటికి పైని బంకమన్నుతో దళసరిగా బూసి బాగుగా నెండించవలెను. పిమ్మట నీ చక్రికలను ఒక్కొక్కటి సుమారు పదిరెండు తులముల బరువుగల మైదువందల గిరీండకముల మధ్యనుంచి పుటపాకము జేయవలెను. స్వాంగ శీతలమున నందుండి యా చక్రికలను గ్రహించి, పైనియంటి యున్న మృల్లేపమును దొలగించి, తిరిగి పైవిధముగనే మర్దనము జేయుచు ముప్పది పుటములను బూర్తిచేయవలెను. ఇటుల జేయుబడు మూడు, లేక, నాలుగు పుటపాకములకే యభ్రకము చక్కని గైరికమువంటి వర్ణముగలది యగును. మరియు, శరావసంపుటమున నరువది పుటములు వేయు నప్పటి కెట్టి లక్షణములు గానుపించునో యవియన్నియు పైని వివరించినట్టి ముప్పది పుటపాకములవల్లనే యభ్రకమునందు గానుపించును. తరువాత నిదేవిధముగ కుక్కపొగాకు రసముతో పది పుటములను, జలపిప్పలి రసముతో పది

పుటములను వేయవలెను. పిమ్మట మఱ్ఱియూడల స్వరస ముతో రెండు, లేక, మూడు పుటములు పైవిధముగనే వేసినచో నయ్యది చక్కని సిందూరమువంటి వర్ణముగలది యగును. ఇటుల పాకముజేయుటవలన నభ్రకమునకు మృదుత్వ-లఘుత్వ-వారితరత్వాది భస్మ లక్షణములన్నియు నేర్పడి, యది వ్యాధులయం దుపయోగార్హ మగుచున్నది.

[ధాన్యాభ్రకమును మేము, మొదట కుక్కపొగాకు రసముతోను, మఱ్ఱియూడల కషాయముతోను, పిమ్మట పంచవల్కల కషాయముతోను మర్దించి, మొత్తము నూరు పుటములు వేయుచున్నాము. ఆ-ల.]

విశేషసూచన—శ్లో॥ శతాదిస్తు సహస్రాంతః పుటో దేయోరసాయనే। దశాదిస్తు శతాంతఃస్యా ద్వ్యాధినాశన కర్మణి॥ సహస్ర పుటపక్షేతు భావనాపుటసంభవేత్। షడ్గుణం తు తథా నస్యా దితిప్రాచాం హి సంమతం॥ ఆ-ప్ర.— అభ్రకభస్మయొక్క సేవనము పాదరసమునకువలెనే రసాయనహేతుకము, వ్యాధిహరణ హేతుకము అని రెండు విధములుగా నుండును. అందు ప్రమేహాది వ్యాధులందు సేవించుట వ్యాధిహరణ హేతుకమనియు జరామృత్యువుల జయించుటకై సేవించుట రసాయనహేతుక మనియు దెలియ నగును. ఈ ద్వివిధ ప్రయోజనములకు నభ్రకభస్మ ద్వివిధములుగనే సిద్ధముజేయ దగియున్నది. అందు వ్యాధి హరణమునకై నూరు పుటపాకములను, రసాయనమునకు వేయి పుటపాకములను జేయవలెను. అయితే నూరు పుట

## అభ్రకభస్మ గుణములు *

శ్లో॥ అభ్రం కషాయం మధురం సుశీత మాయుఃకరం ధా
వివర్ధనంచ। హన్యా త్త్రిదోష వ్రణమేహకుష్ఠ ప్లీహ

---

ములు వేయుచో ప్రతితడవునకును నుక్తరసములతో మ
నము జేయవలసియుండును. వేయి పుటములు వేయు
నూటయొకటవ పుటమునుండి వేయి పుటముల ఆఖరువర
కేవలము భావనయే జేయదగియుండును. అనగా నిందు మ
నమున కవసరము లేదు. కేవలము ఉక్తరసములతో భా
జేయుచు (అభ్రకభస్మ నొక పాత్రయందుంచి యది మును
నంత పరిమితిని ఉక్తరసములనుబోసి యెండలో నారస
లింకిపోవువరకు నుంచుచు) సూర్యపుటములను వేయుచుం
వలెను. ఇటుల జేసిన యుక్తఫలప్రదమగునని పూర్వా
చార్యుల యభిమతము.

* అశోధితాభ్రకభస్మజవికారములు—శ్లో॥ పీడా
విధత్తే వివిధాం నరాణాం కుష్ఠంక్షయం పాండుగదం
శోఫం। హృత్పార్శ్వపీడాంచ కరోత్యశుద్ధ మభ్రం హి
జాఠరవహ్నిహృత్స్యాత్॥ (అ-ప్ర). — అభ్రకము
యథోక్త విధానమున శుద్ధిజేసియే అనగా ధాన్యాభ్ర
మునుగూడ జేసియే పుటపాకము జేయవలెను గాని యట
శోధన ధాన్యాభ్రకములను జేయక త్వరపడి పుటపాక
జేయగూడదు. అటుల జేసినచో నట్టి యభ్రకభ
యొక్క సేవనమువలన ననేకవిధములగు బాధలు జ

దర గ్రంథి విషకృమీంశ్చ॥ రోగాణ్ హన్తి దృఢయతి
వపు ర్వీర్యవృద్ధిం విధత్తే, తారుణ్యాఢ్యం రమయతి
శతం యోషితాం నిత్య మేవ। దీర్ఘాయుష్మాణ్
జనయతి సుతాణ్ విక్రమైః సింహతుల్యాణ్, మృత్యో
ర్భీతిం హరతి సతతం సేవ్యమానం మృతాభ్రం॥ అ-ప్ర.

పూర్వోక్త విధానమున సిద్ధము చేయబడిన యభ్రకభస్మ కషాయ మధుర రసములను, శీతవీర్యమును గలిగియుండును. ఆయువును వృద్ధి బొందించును. రసాది ధాతువులకు ధారణాశక్తిని వృద్ధిజేయును. శరీరమునకు దృఢత్వమును గలిగించును. వీర్యమును వృద్ధిజేయును. యౌవన సంపత్తును గలిగించి సురతేచ్ఛను బుట్టించును. శుక్రమునకు బలవంతమగు బీజత్వమును సిద్ధింపజేయును. మరణభీతిని తగ్గించును. త్రిదోషములను శమింపజేయును. వ్రణము, కుష్ఠము, ప్లీహవృద్ధి, గ్రంథి, విషము, కృమిరోగము అను నీవ్యాధులను బోగొట్టును.

## అభ్రకభస్మ సేవనవిధానము *

శ్లో॥ నిశ్చంద్ర మభ్రకం భస్మ ధాత్రీవ్యోష విడంగకం।
భృంగాంబునాజలై ర్వాపి ఖల్వేమర్ద్యం ద్వియామకం॥

---

చును. మరియు, కుష్ఠము, క్షయము, పాండువు, శోథ, హృచ్ఛూల, పార్శ్వశూల యను నీ వికారములుగూడ జనించును.

* సమ్యఙ్మారితాభ్రకలక్షణము — శ్లో॥ మృతం నిశ్చంద్రతాంయాతం అరుణం చామృతోపమం। సచంద్రం విషవత్ జ్ఞేయం మృత్యుకృ ద్వ్యాధిరోమవత్ ॥ అ-ప్ర.—

గుటికాంకారయేత్సర్వాం ఛాయాశుష్కాంసురక్షయేత్॥
ఏకైకాం భక్షయేత్ప్రాజ్ఞో వర్షమేకం నిరంతరం॥
ద్వితీయేతు పున ర్వర్షే భక్షయేద్గుటికాద్వయం।
ఏవం సంవత్సరేణైవ గుటికైకాం వివర్ధయేత్॥
త్రివర్షస్యప్రయోగోఽయం అభ్రకస్య ప్రకీర్తితః।
అనేన క్రమయోగేన వ్యోమ్నః శతపలం నరః॥

---

యథావిధిగ మారితమైన యభ్రకము (భస్మ) చంద్రిక లేక, యరుణవర్ణముగలిగి యుండవలెను. ఇట్టిది యమృతముతో సమానమైన గుణమును గలిగియుండును. చంద్రికతో గూడి యున్నచో నయ్యది సంపూర్ణముగ మారితము గాలేదని దెలియవలెను. ఇట్టి యభ్రకభస్మ విషముతో సమానమై వ్యాఘ్రరోమమువలె మరణమును గలిగించును. కావున సమ్యఙ్మారితా సమ్యఙ్మారితమగు అభ్రకభస్మను పై విధముగ బరీక్షించి దెలిసికొనవలెను. సమ్యఙ్మారితాభ్రక భస్మకు అమృతీకరణ విధానము—శ్లో॥ త్రిఫలోత్థ కషాయస్య పలా న్యాదాయ షోడశ। గోఘృతస్య పలాన్యష్టౌ మృతాభ్రస్య పలాః దశ॥ ఏకీకృత్య లోహపాత్రే పాచయే న్మృదువహ్నినా। ద్రవే జీర్ణే సమాదాయ సర్వరోగేషు యోజయేత్॥ అ-ప్ర.—త్రిఫలా కషాయము పదియారు పలములు, గోఘృతము ఎనిమిది పలములు, సమ్యఙ్మారితాభ్రకభస్మ పది పలములు వీనినన్నిటిని యొక యినుప బాణలియందుంచి మందాగ్నిచే నందలి ద్రవము జీర్ణమగు

అద్యాద్భవేన్న సందేహో వజ్రకాయో మహాబలః।
మాసత్రయేణ రక్తాఖ్యం క్షయంశ్వాసం సుదారుణం॥
పంచకాసాంశ్చహన్యాచ్ఛూలంగ్రహణ్యర్శోగదాంస్తథా।
ఆమవాతం తథాశోషం పాండురోగం సుదారుణం॥
మృత్యుకల్పం మహావ్యాధిం వాతపిత్తకఫోద్భవం।
హన్త్యష్టాదశకుష్ఠాని నృణాం పథ్యాశినాం ధ్రువం॥

ఆ-ప్ర.

యథోక్త విధానమున సిద్ధము జేయబడిన యభ్రకభస్మ, ఉశిరికకా యలచూర్ణము, త్రికటుక చూర్ణము, వాయువిడంగముల చూర్ణము వీనిని సమభాగములుగ గ్రహించి భృంగరాజ స్వరసముతోగాని, హంసోదకముతోగాని రెండుయామములు మర్దించవలెను. పిమ్మట నా పిష్టము నైదు యవలపరిమితివి గుటికలుగాజేసి, వాటిని ఛాయాశుష్కముజేసి భద్రపరచవలెను. ప్రతిదినము ఒక్కొక్కగుటికను సేవించుచు హితాహార విహారములను అనుసరించుచుండవలెను. ఈ విధముగ నొక సంవత్సరకాలము సేవించి, అటులనే రెండవసంవత్సరము ఉదయమున నొక గుటికయు, సాయంకాల మొక గుటికయు నటుల ప్రతిదినము రెండు

---

వరకు పాకము జేసిన యది యభ్రకామృతీకరణ సంస్కార మని చెప్పబడును. ఇటుల యభ్రకభస్మను సేవించుటకు బూర్వము దానికి సంస్కారము జేయదగును. ఇందువలన నభ్రకమునకు గుణోత్కర్ష యేర్పడును. అయితే యిటుల జేయుటవలన "అరుణాభస్మనస్తు పున రమృతీకరణేన గుణా వృద్ధిః, వర్ణహానిశ్చ భవతి॥" అ-ప్ర.— వర్ణహాని యేర్పడు నని దెలియవలెను.

గుటికలు చొప్పున సేవించవలెను. మూడవసంవత్సరమున పై విధము గనే మూడుగుటికలు చొప్పున సేవింపవలెను. ఈ విధముగ క్రమ యోగమున నూరుపలముల పరిమితిగల యభ్రకభస్మను సేవించవలెను. ఇందువలన శరీరమునకు మిక్కిలి దృఢత్వ మేర్పడును. మూడు మాసములు పై విధముగ సేవించునప్పటికి రక్తపిత్తము, క్షయము, అసాధ్యమగు శ్వాస, పంచవిధములగు కాసలు, హృదయశూల, గ్రహాణి అర్శస్సు, ఆమవాతము, శోష, పాండురోగము, వాతపిత్త కఫోద్భవములగు నితర కష్టసాధ్యవ్యాధులు, అష్టాదశ కుష్ఠములు ఇవి శమించును.

## అభ్రకసత్వభస్మ విధానము *

గ॥ త్రిఫలాదిభి ర్లోహవ ద్భావయిత్వా వింశతివారం, షష్టి
వారం, శతవారంవా పుటయిత్వా సత్వభస్మ సంపాద్య
భక్షణార్థం॥ అ-ప్ర

అభ్రకసత్వమును లోహభస్మమువలెనే త్రిఫలాదుల కషాయములతో మర్దించి, యిరువదిమారులుగాని, అరువదిమారులుగాని, నూరు మారులుగాని పుటపాకము జేసిన యయ్యది సేవించుట కనువగు భస్మయగును.

---

* సత్వముగల ద్రవ్యములలో నభ్రకము గూడ జేరి యున్నది. దీనినుండి సత్వమును గ్రహించు విధానము రస ప్రకరణమున చారణావిధానమునందు వివరింపబడియున్నది. అటుల నభ్రకమునుండి సత్వమును గ్రహించి పైనిజెప్పిన విధానము ననుసరించి దీనికి మారణసంస్కారము జేయ వలెను.

## అభ్రకసత్వ భస్మ గుణములు *

శ్లో॥ సత్వమభ్రస్య శిశిరం త్రిదోషఘ్నం రసాయనం।
విశేషాత్పుంస్త్వ జననం వయసః స్తంభనం పరం॥
నానేన సదృశంకించి ద్భైషజ్యం పుంస్త్వకృత్పరం।
సత్వసేవీ వయస్తంభం లభతే నాత్ర సంశయః॥ ఆ-ప్ర.

---

* అభ్రకసత్వ భస్మము కేవలాభ్రకభస్మకంటె నుత్తమమైన రసాయనము. దీనిని యథోక్తవిధానమున సేవించినచో శరీరమున కమరత్వము సిద్ధించునని దెలియవలెను. అనేకవ్యాధులందు దీని సేవన విధానము రసరత్న సముచ్చయమున నిట్లు చెప్పబడియున్నది. శ్లో॥ వేల్లవ్యోష సమన్వితం ఘృతయుతం వల్లోన్మితం సేవితం, దివ్యాభ్రం క్షయపాండురు గ్గ్రహణికా శూలామకుష్ఠామయం। ఊర్ధ్వ శ్వాసగదం ప్రమేహమరుచిం కాసామయందుర్ధరం, మందాగ్నిం జఠరవ్యథాం విజయతే యోగై ర శేషామయాన్॥ (ర-ర-స.)——అభ్రకసత్వ భస్మను విడంగములు, త్రికటుకములు అనువాని చూర్ణములతో మూడు గురిగింజల పరిమితిని జేర్చి ఘృతముతో గలిపి సేవించినయెడల క్షయము, పాండువు, గ్రహణి, శూల, ఆమము, కుష్ఠము, ఊర్ధ్వశ్వాసము, ప్రమేహము, అరుచి, కాసము, అగ్నిమాంద్యము, అతిసారము అను నీ వ్యాధులను శమింపజేయును. అనుపాన విశేషములతో సమస్తవ్యాధులను శమింపజేయును.

యథోక్తవిధానమున సిద్ధము జేయబడిన యభ్రకసత్వముయొక్క భస్మము శీతవీర్యమును గలిగియుండును. రసాయనము, శుక్రమును వృద్ధిజేయును. అత్యంత వయస్తంభనము, శుక్రమును వృద్ధిజేసి వయస్సును స్తంభింపజేయుటలో దీనితో సమమైనది మరియొకటి లేదు. త్రిదోషములను శమింపజేయును.

## అభ్రక సేవనయం దపథ్యములు *

శ్లో॥ క్షారామ్లం ద్విదలం కోలం కర్కటీ కారవేల్లకం।
వృన్తాకంచ కరీరంచ తైలం చాభ్రే వివర్జయేత్॥
ఆ-ప్ర.

అభ్రకభస్మనుగాని, యభ్రకభస్మ మిశ్రితములైన యౌషధములను గాని సేవించునప్పుడు క్షారములను, అమ్లరసవిశిష్టములైన ద్రవ్యములను, పప్పుధాన్యములను, రేగుపండును, దోసకాయను, కాకరకాయను, వంకాయను, వెదురు మొలకలను, తైలమును వర్జింపవలెను.

## అభ్రకయోగములు †

### (1) తారకేశ్వరరసము

శ్లో॥ మృతంసూతం మృతంవంగం మృతం లోహాభ్రకం సమం। మర్దయేన్మధునా చాహ్ని రసోఽయం తారకే

---

* అభ్రకమును సేవించునప్పు డీచెప్పబడిన ద్రవ్యములను విడచి మిగిలిన యాహారయోగ్య ద్రవ్యములనెల్ల భుజింపవచ్చునని దెలియవలెను.

† అభ్రకభస్మ సామాన్యముగ పాదరసమువలె రసౌషధయోగములం దన్నింటిలోను గలియును. ఈ

శ్వర॥ మాషమేకం లిహేత్ క్షౌద్రై ర్బహుమూత్రా
పనుత్తయే। ఉదుంబర ఫలం పక్వం చూర్ణితం కర్ష
మాత్రకం॥ సంలిహే న్మధునాసార్ధ మనుపానం సుఖా
వహం। ముద్గామలకయూషేణ పథ్యం దేయం
సతక్రకం॥ బ-రా.

రసభస్మ (రససిందూరము), వంగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ వీనిని సమాంశములుగ గ్రహించి, తేనెతో చక్కగా మర్దించవలెను. ఇటుల సిద్ధము జేయబడినది తారకేశ్వరరసమని చెప్పబడును. శుష్కమైన యత్తిపండ్లను మెత్తగా చూర్ణించి,యీచూర్ణము ఒకతులముచొప్పునను, తారకేశ్వరరసముమ మాషప్రమాణమునను గ్రహించి, యీరెండింటి నేకముజేసి తేనెతో గలిపి సేవించుచుండిన బహుమూత్రము శమించును. ఇందు ఉశీగికపండ్ల రసముతో సిద్ధముజేయబడిన ముద్గయూషమును పథ్యముగా సేవించుచుండవలెను.

## (2) సిందూరభూషణరసము

శ్లో॥ అభ్రకం రససిందూరం గంధకం టంకణం సమం।
ధత్తూర రస సమ్మర్ద్యం మాషమాత్రంతు సేవయేత్॥
మధునా భక్షయే న్నిత్యం కుష్ఠ్వష్ట దశకామిలాః।
.............సిందూరభూషణో నామ హితంసాధ్యం
విధీయతే॥ ర-యో-ర.

అభ్రకభస్మ, రససిందూరము, శోధితగంధకము, శోధిత టంకణము ఇటుల వీనిని సమభాగములుగ గ్రహించవలెను. తొలుత రస

---

యభ్రకమిశ్రితయోగము లిట గ్రంధవిస్తరభీతిచే దిఙ్మాత్ర ముగ నుదహరింపబడును.

సిందూరమును గంధకమును బాగుగా కలియనూరి, పిమ్మట మిగి
నందుచేర్చి నల్లయుమ్మెత్తాకు రసముతో జక్కగా మూడుదినము
యొండించి, చూర్ణముజేసి యుంచుకొనవలెను. ఇయ్యది సి
భూషణ రసమని చెప్పబడును. దీనిని మాషప్రమాణమున
సేవించవలెను. ఇందువలన సమస్త కుష్ఠువులు, కామిల, కఫజ
ములు, పిత్త వికారములు, వాతవికారములు, శూల, ప్రమేహము
పాతజ్వరము, అతిసారము, పాండు, మూత్రకృచ్ఛ్రము ఇయ్యవి
చును. మరియు, శుక్రవృద్ధియై కామోద్దీపన మగును.

---

# తాళకము

## తాళక నామములు *

శ్లో॥ హరితాలంతు తాలంస్యా దాలం తాలకమిత్య
అ

హరితాలము, తాలము, ఆలము, తాలకము అనునవి
నామములు.

---

* తాళకభేదములు — శ్లో॥ హరితాళం
ప్రోక్తం పత్రాఖ్యం పిండసంజ్ఞకం। తయోరాద్యం
శ్రేష్ఠం తతోహీనగుణం పరం॥ స్వర్ణవర్ణం గురు
సపత్రం చాభ్రపత్రవత్। పత్రాఖ్యం తాళకం విద
గుణాఢ్యం త ద్రసాయనం। నిష్పత్రం పిండసదృశం
సత్వం తథాలఘు॥ స్త్రీపుష్పహారకం స్వల్పగుణం త
తాళకం॥ ఆ-ప్ర.— తాళకము—పత్రతాళకము,
తాళకము అని రెండువిధములుగా నుండును. వీనిలో

## తాళకశోధన విధానము

శ్లో॥ తాళకం కణశః కృత్వా బధ్వాపోటలికాం తతః।
డోలాయంత్రేణ యామైకం సచూర్ణే కాంజికేపచేత్॥
యామైకం డోలయా తద్వత్ కూష్మాండ స్వరసే తతః।
తిలతైలే పచే ద్యామం యామంచ త్రైఫలే జలే॥
డోలాయంత్రే చతుర్యామం పక్వం శుధ్యతి తాలకం॥

తాళకమును చిన్నచిన్న ముక్కలుగాజేసి యొక పరిశుద్ధమైన వస్త్రఖండమునందు మూటగట్టవలెను. డోలాయంత్రమునం దుక్తపరిమితిని కాంజికమునుబోసి యందు తగుమాత్రముగ సున్నమును గలిపి యీ ద్రవమున కూర్ధ్వమున నుండునట్లు పైమూటను వ్రేలాడగట్టి యొక యామము పాకముజేయవలెను. స్వాంగశీతలమున అందుండి తాళక

---

తాళకము బంగారువర్ణమును, అభ్రకపత్రములవంటి పత్రములను గలిగి గురువుగను, స్నిగ్ధముగను నుండును. ఇదియే శ్రేష్ఠమగునట్టిది. గుణవంతమై సత్వమును గలిగి రసాయనముగ నుండును. రెండవది కాంతిహీనమై పత్రములు లేక ముద్దగానుండి స్వల్పమగు సత్వమును గలిగియుండును. స్వల్పమైన గుణములను గలిగి మిగుల తేలికగనుండును. స్త్రీల కార్తవమును నశింపజేయును. మరియు నీ తాళకమును బహిర్లేపనము జేసినచో రోమము లూడిపోవును. దీనికి "నటమండన" మని వ్యవహారముగలదు. అనగా— నాట్యముజేయువారలు తాళకముతో ముఖమునకు రంగు వేసుకొనుదురు.

మును గ్రహించి వేడినీటిలో పరిశుద్ధముగ కడిగి యెండబెట్టి
పిమ్మట పై విధముగనే కూష్మాండ స్వరసముతోను, తిలతైలము
త్రిఫలా కషాయముతోను ఒక్కొక్క యామము పాకముజేయవ
ఉష్ణోదకముతో గడుగుటయు, యెండబెట్టుటయు మధ్యమధ్య
చునే యుండవలెను. ఈ విధముగ నాలుగు యామములు సే
జేసిన తాళకము శుద్ధమగును.

## శోధిత తాళక గుణములు *

శ్లో॥ శోధితం హరితాళంతు కాంతివీర్య వివర్ధనం।
కుష్ఠాది పాపరోగఘ్నం జరామృత్యుహరం పరం

యథోక్తవిధానమువ శుద్ధిజేయబడిన తాళకము కాంతిని,
మును వృద్ధిబొందించును. కుష్ఠము మున్నగు పాపరోగములను,
తనమును, మృత్యువును బోగొట్టును. అనగా మిక్కిల రసాయ
భావము.

---

* అశోధిత తాళకముచే జనించు వికారములు

శ్లో॥ అశుద్ధతాళ మాయుఘ్నం కఫమారుత మేహక
తాపస్ఫోటాంగ సంకోచాౕ కురుతేఽతో విశోధయే
ఆ-ప్ర.—తాళకము నుక్తవిధానమున శుద్ధిజేయక
యోగించినయెడల నయ్యది యాయువును క్షీణింప జేయ
కఫవాతములను ప్రకోపింపజేయును. ప్రమేహమును,
మును, విస్ఫోటమును, అంగ సంకోచమును గలిగించ
కావున ఉక్త విధానమున శుద్ధిజేసియే యుపయో
వలెను.

## తాళకభస్మవిధానము *

శ్లో॥ పత్త్రాఖ్యం తాళకంశుద్ధం పౌనర్నవరసేనతు।
ఖల్వే విమర్దయే దేకం దినంపశ్చాద్విశోషయేత్॥

---

* తాళకము సామాన్యముగా శుద్ధిజేసియే యోగములందు జేర్చబడుచున్నది. కాని యిటుల ప్రత్యేకముగ వ్యాధులం దుపయోగింపబడుట లేదు. అట్టిప్రయోజనమునకై దీనికి మారణము జేయవలసియేయుండును. అయితే యిది యగ్నితో సంయోగము చేయబడినప్పుడు పాదరసమువలె నగ్నిని సహింపలేక యుండును. అందుచే దీనికి భస్మవిధానము కష్టసాధ్యమని దెలియువలెను. స్వానుభవమునందలి దీని భస్మవిధాన మిట దెలుపబడుచున్నది. శోధిత తాళకమును మెత్తగా చూర్ణించి, దీని నొక శరావముపై పలుచగ పరవవలెను. పిమ్మట నా శరావమును నిప్పు బొగ్గులపైనుంచి వెదురుగొట్టముతో జాగ్రత్తగా నా నిప్పుబొగ్గుల నూదవలెను. ఈ యూదుటవలన నగ్నిజ్వాల తగుమాత్రముగనే యుండవలెను గాని జ్వాల హెచ్చుగా నున్నచో శరావమునందలి తాళకము దగ్ధమైపోవును. కావున సన్నని జ్వాలవచ్చునట్లూదుచుండవలెను. ఇటుల జేయుటవలన నా తాళకమంతయు ద్రవీభూతమై యెర్రని వర్ణముగలదియగును. సమానముగ ద్రవించి, యంతటను ఎర్రనివర్ణము-వ్యాపించగనే యా శరావమును సందంశయంత్రము (పట్టుకారు)తో నొకచేత గ్రహించి రెండవచేతితో నా తాళకద్రవమును పరిశుద్ధముగనున్న పింగాణీ ప్లేటులోనికి యిను

సంశోష్య గోళకంకృత్వా, చక్రాకార మథాపివా।
తతఃపునర్నవాక్షారైః స్థాల్యామర్థం ప్రపూరయేత్
తత్ర తద్గోలకం కృత్వా పునస్తేనైవ పూరయేత్।
స్థాలీం చూల్యాం సమారోప్య క్రమా ద్వహ్నిం వి
యేత్॥ దినాన్యష్ట రశూన్యాని పంచ వహ్నిం ప్ర
యేత్। ఏవం తన్మ్రియతే తాలం॥ ఆ-(

పూర్వోక్త విధానమున శుద్ధిజేయబడిన తాళకమును ఖల్వ
నందు మెత్తగా చూర్ణించి యందు పునర్నవా స్వరసమునుబోసి ఒ
దినము మర్దించి యా పిష్టము నొక గోళకముగాని, చక్రికగ గా
జేసి బాగుగా నెండించవలెను. అటుల యెండినట్టి యాతాళకపు గ
మునుగాని చక్రికనుగాని యొక చిన్న భాండమునందు పునర్నవాక్ష
మధ్యమునం దుండునట్లు అమర్చి యనగా పునర్నవాక్షారము †

ముతో జేయబడి సమానముగను దీర్ఘముగను పలుచగ
నుండు దర్వియొక్క సహాయమున వెంటనే గ్రహించవలెన
ఆలస్యము జేసినచో నీ శరావమునందే గడ్డకట్టి దీసికొ
టకు కష్టమగును. కావున వెంటనే వేరొక పాత్రలో
గ్రహించుట యుక్తము. ఆ ప్లేటునం దటులనే యుంచినచొ
కొంచెముకాలమునకు గడ్డకట్టును. శీతలమైన పిమ్మట
దానిని జాగ్రత్తగా దీసికొని ఖల్వమునందు మెత్తగ
చూర్ణించి యుపయోగించుకొనవలెను. ఇటుల జేయుట
వలన తాళకమునందలి చంద్రికయంతయు నశించిపోవు
చున్నది.

† పునర్నవాక్షారవిధానము—గలిజేరును సమూల
ముగా నెండించి కాల్చి బూడిదజేయవలెను. ఈ బూడి

భాండమునందు సగమువరకు పూరించి దీనిపై యాగోళమును లేక, చక్రికను ఉంచి తిరిగి యా పునర్నవాక్షారములోనే భాండశేషమును బూరించవలెను. పిమ్మట నీ భాండమును పొయ్యిపైనుంచి యై దహోరాత్రములు (విరామము లేకుండగ) క్రమముగ నగ్నిని వృద్ధిజేయుచు పాకము జేయవలెను. స్వాంగశీతలమున నాక్షారమధ్యమున తెల్లగ భస్మమైన యా తాళకమును గ్రహించవలెను. ఇది సలక్షణముగ ‡ మృతమైనచో వ్యాధులయందు బ్రయోగించవలెను. లేనిచో దిరిగి యథోక్త విధానమున దీనికి మర్దనపాకములను గావించవలెనని యిట దెలియవలెను.

---

దను ఉక్తప్రమాణమున జలమునందు గలిపి యొకరాత్రి యటులనే యుంచిన మరునాటికి స్వచ్ఛమగు జలమూర్ధ్వభాగమున తేరును. ఈ తేరిన నీటిని వేరొకపాత్రలోనికి వంపుకొని దానిని పొయ్యిపైనుంచి సన్నని మంటతో నిగర గాచవలెను. ద్రవమంతయు నిగిరిపోయిన పిమ్మట నాపాత్రయందు చూర్ణరూపమున క్షారము గానుపించును. అప్పుడా పాత్రను పొయ్యిమీదనుండి క్రిందకు దింపి యాక్షారము గ్రహించవలెను. దీనినే యీ తాళకభస్మ విధానమున గ్రహింపవలెనని దెలియవలెను.

‡ సమ్యఙ్మారిత తాళకభస్మ లక్షణము—శ్లో॥ తాళం మృతం తదా జ్ఞేయం వహ్నిస్థం ధూమవర్జితం। సధూమం నమృతంప్రాహుః వృద్ధవైద్యా ఇతి స్థితిః। ఆ-ప్ర.—తాళకభస్మను కొద్దిగా నిప్పుపై వేసిన ధూమములేక యున్నచో యథావతుగ నది మారితమైనట్లును, ధూమముగలిగినచో నటుల మారితము గానటులను దెలియవలెను. ఈ లక్షణము వృద్ధవైద్యుల సమ్మతమనిగూడ దెలియవలెను.

## తాళకభస్మసేవన విధానము

శ్లో॥ గుడూచ్యాది కషాయేణ గదా నేతా న్వ్యపోహతి।
సోపద్రవం వాతర క్తం కుష్ఠా న్యష్టాదశాపిచ॥
ఫిరంగదేశజం జంతో ర్వ్యా న్తిరోగం సుదు స్తరం।
విసర్ప మండలం కండూంపామాం విస్ఫోటకంతథా।
వాతర క్త కృతాన్ రోగా నన్యానపి వినాశయేత్॥
ఆ–ప్ర.

యథోక్త విధానమున సిద్ధముజేయబడిన తాళకభస్మను మాత్రా యుక్తముగను*, సపథ్యముగను † గుడూచ్యాది కషాయానుపానముతో

---

* తాళకభస్మను మాత్రాపరిమితి—శ్లో॥ మాత్రా తస్యైకరక్తికా। అనుపానా న్యనేకాని యథారోగం ప్రయో జయేత్॥ ఆ–ప్ర.—తాళకభస్మను ఒక గురుగింజప్రమాణ మున గ్రహించి తత్తద్రోగములకు హితములైన యనుపాన విశేషములతో ప్రయోగించవలెను.

† తాళకభస్మ సేవనయందు పథ్యాపథ్య విధానము—శ్లో॥ ఏతద్భేషజసేవీతు లవణామ్లా వివర్జయేత్। తథా కటురసం వహ్ని మాతపం దూరత స్త్యజేత్॥ లవణంయః పరిత్యక్తుం నశక్నోతి కథంచన। సతు సైంధవ మశ్నీయాత్ మధు రోపరసోహి సః॥ ఆ–ప్ర.—తాళకభస్మను సేవించు నప్పుడు లవణామ్ల కటురసములను విడువవలెను. అగ్నికి సమీపమున నుండగూడదు. ఎండలో దిరుగ గూడదు. లవణమును త్యజించుటకు కష్టమైనచో మధురరసముగల

సేవించిన యెడల ఉపద్రవములతోగూడిన వాతరక్తమును, అష్టాదశ కుష్ఠములను, అసాధ్యమగు ఫిరంగరోగమును, విసర్పమును, కండువును, పామను, విస్ఫోటకమును, వాతరక్తముచే గలిగిన యితర వ్యాధులను శమింపజేయును.

## తాళక యోగములు

### (1) రసమాణిక్యము

శ్లో॥ తాళకంవంశపత్రాఖ్యం కూష్మాండసలిలే క్షిపేత్॥
సప్తధా వా త్రిధా వాపి దధ్నామ్లేవ తథైవచ॥
శోధయిత్వా పునఃశుష్కం చూర్ణయే త్తండులాకృతిం।
తతఃశరావకే యంత్రే స్థాపయేత్ కుశలో భిషక్॥
బదరీ పల్లవోత్థేన లేపనం కారయే త్తతః।
అరుణాభ మధఃపాత్రం తావ జ్జ్వాలాః ప్రదాపయేత్॥
స్వాంగశీతం సముద్ధృత్య మాణిక్యాభో భవే ద్రసః।
ఘృతక్షౌద్రేణ సమ్మర్ద్య ఖాదయే ద్రక్తికా ద్వయం॥
సంపూజ్య దేవదేవేశం కుష్ఠరోగా ద్విముచ్యతే।
స్ఫుటితం గలితం కుష్ఠం వాతరక్తం భగందరం॥

---

సైంధవలవణమును జేర్చుకొనవలెను. పథ్యము— శ్లో॥ పథ్యంచ చణకస్యోక్తా రోటికా షష్ఠికౌదనం॥ అ-ప్ర.— తాళకభస్మను సేవించునప్పుడు శనగలతో జేసిన రొట్టెని, షష్ఠికధాన్యపు అన్నమును భుజింపవలెను.

నాడీవ్రణం వ్రణం దుష్ట ముపదంశం విచర్చికాం
నాసాస్యసంభవాన్ రోగాన్ క్షతాన్ హ నా
సుదారుణాన్॥ పుండరీకంచ చర్మాఖ్యం విస
మండలం తథా॥

శాళకమును బూడిదగుమ్మడికాయ స్వరసమునందును, 
పెరుగునందును ప్రత్యేకముగ నేడు దినములుగాని, మూడు దినము
యూరఁబెట్టి కడిగినచో నయ్యది పరిశుద్ధమగును. ఇట్టి దాని నెం
చిన్న చిన్న ముక్కలుగా నలియగొట్టి, శరావసంపుటమున
బదరీపల్లవ (రేగుచిగుళ్లు) కల్కముతో సంధిలేపనముజేసి యెం
వలెను. పిమ్మట నీ శరావసంపుటమును పొయ్యిపైనుంచి సన్నని
లతో నధశ్శరావముయొక్క అధోభాగము ఎఱ్ఱవగుపరకు ప
జేయవలెను. స్వాంగశీతలమున నందు మాణిక్యమువలె సింధూ
శాళకమును గ్రహించవలెను. ఇది రసమాణిక్యమని చెప్పబడును.
రెండు గురుగింజల పరిమితిని మధుఘృతములతో గలిపి పరమేశ్వర
యొనర్చి సేవించినయెడల కుష్ఠురోగము శమించును. స్ఫుటి
గళితము అయినట్టి కుష్ఠమును, వాతరక్తమును, భగందరమును,
వ్రణమును, దుష్టవ్రణమును, ఉపదంశమును, విచర్చికను, నాసా
మును, ముఖరోగమును, దారుణములైన క్షతవ్రణములను, పుండరీక
మును, చర్మదళ కుష్ఠమును, విస్ఫోట కుష్ఠమును, మండల కుష్ఠ
శమింపజేయును.

## (2) మహా తాళేశ్వరము

శ్లో॥ సమ్మర్ద్య తాళకం శుద్ధం వంశపత్రాఖ్యముచ్ఛ
కూష్మాండనీరైః సంభావ్య త్రిదినం శోధయే త్సాః
ఘృతకన్యా ద్రవైర్యా భయో భావయేచ్చ దినత్ర

సమ్మర్ద్య కాంజికేనైవ దధ్నామ్లేన విమర్దయేత్॥
సమ్మర్ద్య చూర్ణం సలిలే రసే పౌనర్నవే పునః।
త్రిదినం మర్దయిత్వాతు కారయేత్ ఖటికాకృతిం॥
స్థాల్యాం దృఢతరాయాంతు పలాశక్షారసంచయం।
ఉపర్యధస్తాలకస్య క్షారందత్వా శరావకైః॥
పిధాయ లేపయేత్ యత్నాత్ పూరయేత్ క్షారసం
చయం। పునారుద్ధం శరావేణ లేపయేత్ తత్ దృఢం
తతః॥ ద్వాత్రింశద్యామపర్యంతం వహ్నిజ్వాలా ప్రదా
పయేత్। ఏవంసిద్ధేన తాళేన గంధతుల్యేన మేళయేత్॥
ద్వయోస్తుల్యం జీర్ణతామ్రం వాలుకాయంత్రగం
పచేత్। అయంతాళేశ్వరో నామ రసః పరమదుర్లభః॥
హన్త్యష్టాదశకుష్ఠాని వాతశోణితనాశనః।
రక్తమండల మత్యుగ్రం స్ఫుటితం గళితం తథా॥
బహురూపం సర్వజాతం నాశయే దవికల్పతః।
దుష్టవ్రణంచ వీసర్పం త్వగ్దోషంచ వినాశయేత్॥
దృష్టో వారసహస్రంచ రోగవారణకేసరీ॥ భై-ర.

శోధిత తాళకమును ఖల్వమునందు మెత్తగా చూర్ణించి, దీనికి బూడిద గుమ్మడికాయ రసముతోను, కలబందరసముతోను, కాంజికముతోను, పుల్లని పెరుగుతోను, జలముతోను, పునర్నవాస్వరసముతోను ప్రత్యేకముగ మూడు దినములు చొప్పున మర్దన భావనలుజేసి, యాపిష్టమును ఒక గోళముగాజేసి యెండించవలెను. ఒక భాండమునందు సగమువరకు పలాశక్షారమును పూరించి దానిపై నాతాళకపు గోళమునుంచి తిరిగి

పలాశక్షారముచే నాభాండముయొక్క కంఠమువఱకు పూరించి ముఖము నొక శరావముచే గప్పి పలుమార్లు సంధిలేపనము జేసి యెం వలెను, పిమ్మట నీ భాండమును పొయ్యిపైనుంచి పదిరెండు ( ములు పాకముజేయవలెను. స్వాంగశీతలమున నందుండి యా ( మును గ్రహించి దీనికి సమముగ శోధితగంధకమును గలిపి మె నూరి యీ రెండింటికిని సమముగ తామ్రభస్మను జేర్చి వాలుకాం మున యథోక్తకాలము పాకము జేయవలెను. ఇటుల సిద్ధముజేం నట్టిది మహాతాళేశ్వరమని జెప్పబడును. ఇది యష్టాదశ కుష్ఠము వాతరక్తమును, రక్తమండలమును, స్ఫుటితకుష్ఠమును, గళితకుష్ఠ సన్నిపాతజకుష్ఠమును, దుష్టవ్రణమును, విసర్పమును, త్వగ్దోష శమింపజేయును.

---

# మనశ్శిల

## మనశ్శిలా నామములు *

శ్లో॥ మనశ్శిలా మనోగుప్తా మనోహ్వా నాగజిహ్వికా।
నేపాలీ కునటీ గోలా శిలా దివ్యౌషధిః స్మృతా॥ ఆ-

మనశ్శిల, మనోగుప్త, మనోహ్వా, నాగజిహ్వక, నేపాలి, కు గోల, శిల, దివ్యౌషధి యనునవి మనశ్శిలా నామములు.

---

* మనశ్శిలా భేదములు.—శ్లో॥ మనశ్శిలా త్రి ప్రోక్తా శ్యామాంగీ కరవీరికా। ద్విఖండాఖ్యా చ తాసాం లక్షణాని నిబోధత॥ శ్యామా హింగుళవ ద్రక్తా కించి తాతిదీప్తికా। కరవీరా రక్తవర్ణా చూర్ణరూపాఽతి

యుక్॥ కించిద్రక్తాచ గౌరాచ ద్విఖండా భారవత్తరా। త్రివిధాసుచ శ్రేష్ఠా స్యాత్కరవీర మనశ్శిలా॥ ఆ-ప్ర.—శ్యామాంగి, కరవీరిక, ద్విఖండయని మణిశిల మూడు విధములుగ నుండును. ఇందు శ్యామాంగియను మణిశిల హింగుళమువంటి రక్తవర్ణమును గలిగి, కొంచెము పసుపుపచ్చని వర్ణముతో మిక్కిలి ప్రకాశమానమై యుండును. కరవీరయను మణిశిల ఎఱ్ఱని వర్ణముగలిగి చూర్ణరూపముగ నుండి, మిక్కిలి బరువుగలిగి యుండును. ద్విఖండయను మణిశిల కొద్దిగ నెరుపువర్ణముతోగూడి గౌరవర్ణముగలిగి యత్యధిక భారమును గలిగియుండును. ఈ మూడు విధములగు మణిశిలలలో కరవీరికయను మణిశిల శ్రేష్ఠమైనదిగా దెలియవలెను. మరియు, శ్లో॥ తాలక స్యైవభేదోఽస్తి మనోహ్వాచ తదన్తరం। తాలకం త్వతిపీతంస్యా ద్భవేద్రక్తా మనశ్శిలా॥ ఆ-ప్ర.—మణిశిల తాళకములో నొక భేదముగా గుర్తింపబడుచున్నది. అయితే తాళకము పసుపుపచ్చగా నుండును. మణిశిల యెఱ్ఱగానుండును. ఇట్టి వర్ణభేదముచే నవి ప్రత్యేకద్రవ్యములుగా జెప్పబడుచున్నవి. కాని, మణిశిల వాస్తవముగా తాళకము యొక్క భేదమనియే దెలియవలెను. మణిశిలగూడ సత్వముగల ఖనిజములలో నొకటియై యున్నది. కాని విశేషముగా నిది శుద్ధిజేయబడియే యోగములం దుపయోగింపదగియున్నది. దీనికి భస్మవిధానము గానరాదు.

## మనశ్శిలాశోధన విధానము *

శ్లో॥ పచేత్త్ర్యహ మజామూత్రే డోలాయంత్రేమనశ్శిలాం।
భావయేత్ సప్తధా పిత్తైరజాయాః శుద్ధి మృచ్ఛతి॥
ఆ-ప్ర.

డోలాయంత్రమునందు మేకమూత్రమును యథోక్త పరిమితిని బోసి మణిశిలను దానిపై వ్రేలాడునట్లు జేసి మూడుదినములు పాకము జేయవలెను. పిమ్మట దీనిని మేకయొక్క పిత్తద్రవమునందు ఏడు మారులు భావన జేయవలెను. అనగా మణిశిల నొక మూతివెడల్పు గల పాత్రయందుంచి యది మునిగియుండునంత పరిమితిని యజాపిత్త ద్రవమును బోసి ఈ ద్రవ మిగిరిపోవువరకును యెండలో నా పాత్రము నుంచవలెను. ఇట్టుల నేడుమారులు జేసినయెడల మణిశిల పరిశుద్ధ మగును.

## శోధిత మనశ్శిలా గుణములు †

శ్లో॥ మనశ్శిలా గురుర్వర్ణ్యా సరోష్ణా లేఖనీకటుః।
తిక్తా స్నిగ్ధా విషశ్వాస కాసభూత కఫాస్రనుత్ ॥ఆ-ప్ర.

---

* స్వానుభవమున మణిశిలకు శోధన మిట్లు జేయబడుచున్నది.—యథోక్త విధానమున దీనిని డోలాయంత్రమునం దమర్చి, యందు యథోక్తపరిమితిని సున్నముగలిపిన జలమును బోసి మూడు యామములు పాకముజేసి, యుష్ణోదకముతో గడిగి యెండబెట్టిన పరిశుద్ధమై యోగములందు జేర్చుట కర్హతగలిగి యుండును.

† అశోధిత మనశ్శిలా గుణములు.—శ్లో॥ మనశ్శిలా మందబలంకరోతి జంతుం ధ్రువం శోధన మన్తరేణ। మలస్య

పూర్వోక్తవిధానమున శుద్ధిజేయబడిన మణిశిల కటు తిక్త రసము లను, గురుస్నిగ్ధ గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. వర్ణ మును గలిగించును. కఫదుష్టమాంసాదులకు లేఖనము జేయును. కఫ మును శమింపజేయును. విషమును, శ్వాసను, కాసమును, భూత వికార ములను, రక్తదుష్టిని బోగొట్టును.

## మనశ్శిలా యోగములు

### (1) శీతాంశురసము

శ్లో॥ కునటీ శుద్ధతాళంచ తద్యుగ్మం వ్యోషకంభవేత్।
మర్దయే న్నింబనీరేణ గుంజాయుగ్మంతు సేవయేత్॥
అనుపానం మధు పథ్యా ప్యుష్ణవారి తే థార్ద్రికం।
శీతజ్వరం సన్నిపాతం కామిలా పంచగుల్మకే॥
సర్వం శ్వాసంచ కాసంచ హృదరే పూర్వరోగజిత్।
సన్నిపాతం తథా ఛర్ది మశీతే వాతపైత్తికే॥
శూలం శూకా జీర్ణశూలం నాభాకుక్షౌ చ విద్రథిం।
ఆధ్మా నానాహ విష్టంభం తాపం సర్వాంగ దాహకం॥
జంగమ స్థావరవిషం హిక్కాం దీప్తేశ్చ కారణం।

---

బంధం కిల మూత్రరోధం సశర్కరం కృచ్ఛ్రగదంచ కుర్యాత్॥ అ-ప్ర.—శుద్ధిజేయబడని మణిశిలను సేవించి నచో నయ్యది దౌర్బల్యమును గలిగించును. మరియు, మలబంధమును, మూత్రరోధమును, మూత్రాశ్మరిని, మూత్రకృచ్ఛ్రమును గలిగించును. కావున దీనిని యథోక్త విధానమున శోధించియే యుపయోగించవలెను.

శోఫంచ భ్రమమూర్ఛాంచ తిమిరం చాను విధ్యతి॥
మర్దితం నింబతోయేన లేపితం గజచర్మకం।
విసర్పి మండలే చైవ తుషా చర్మవ్యపోహతి॥
సేవితం లేపితంకుర్యా ద్వ్యాధితం గ్రంధిమర్బుదం।
లేపితం దంతరోగాంశ్చ జిహ్వా నేత్రరుజ స్తథా॥
అర్కపత్ర రసైః కర్ణే కర్ణరోగస్య నాశనం।
నిర్గుండీ మిశ్రితం నస్య మపస్మారం శిరోరుజాం॥
అంజనం సర్షమాత్రంచ నేత్రరోగ వినాశనం।
మాషంచ సన్నిపాతానాం కామిలా జ్వరశీతకే॥
ధనుర్వాతం తథాఘాతం శేషరోగేచ కా కథా।
భాషితం రేవణేనైవ రసం శీతాంశునామకం॥ బ-రా.

యథోక్త విధానమున శుద్ధిజేయబడిన మణిశిల యొక భాగము, శుద్ధిజేయబడిన తాళక మొకభాగము, త్రికటు చూర్ణము రెండు భాగములు (ప్రత్యేకముగ) ఇటుల గ్రహించి, మొదట తాళకమును ఖల్వము నందుంచి వేపచెక్క కషాయముతో మూడు దినములు మర్దించవలెను. పిమ్మట మిగిలిన వానినిజేర్చి పై కషాయముతోనే మూడు దినములు మర్దించి రెండు గురుగింజల పరిమితిని మాత్రలుజేసి యెండించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది శీతాంశురసమని వ్యవహరింపబడును *.

---

* ఈ యౌషధ నిర్మాణమునందు మర్దనకై వేప చెక్క కషాయమునకు బదులు జంబీరస్వరసమును గ్రహించుట సాంప్రదాయమై యున్నది. మరియు, నీ స్వరసముతో మూడుదినములేగాక యెంతకాలము హెచ్చుగా మర్దించిన యంతా యౌషధ మంత హెచ్చు ఫలము నొసగునని కూడ వృద్ధవైద్య వ్యవహారము.

దీనిని తేనెతోగాని, కరక్కాయ చూర్ణముతోగాని, యుష్ణోదకముతో గాని, అల్లపు రసముతోగాని సేవించిన శీతజ్వరము, సన్నిపాతజ్వరము, కామిల, గుల్మము, శ్వాస, కాస, ఉదరరోగపూర్వరూపములు, ఛర్ది, వాతరోగములు, పిత్తజరోగములు, శూల, శూకరోగము, పరిణామ శూల, నాభియందు కుక్షియందు జనించు విద్రధి, అధ్మానము, ఆనాహము, మలబంధము, తాపము, సర్వాంగదాహము, జంగమ విషము, స్థావర విషము, హిక్క, అగ్నిమాంద్యము, శోఫ, భ్రమ, మూర్ఛ, తిమిరము ఇవి శమించును. వేపచెక్క కషాయముతో నూరి లేపనము జేసిన గజచర్మ కుష్ఠము, విసర్పి, మండలము, చర్మదలము ఇవి శమించును. మరియు, వేధనముజేసి లేపనము జేయుచు సేవించినయెడ అర్బుద రోగము శమించును. లేపనముజేసిన దన్తరోగము, జిహ్వారోగము, నేత్రరోగము ఇవి శమించును. జిల్లేడాకుల రసముతో నూరి ద్రవరూపమున కర్ణపూరణముజేసినయెడ కర్ణరోగము శమించును. వావిలాకు రసముతో నూరి ద్రవరూపమున నస్యముజేసినయెడ అపస్మారము, శిరశ్శూలయు శమించును. దీనిని సర్షప ప్రమాణమున అంజనము వేసినచో నేత్రరోగములును, మాష ప్రమాణమున అంజనము వేసినచో సన్నిపాత జ్వరము, కామిల, శీతజ్వరము, ధనుర్వాతమును శమించును.

---

# అంజనములు

## అంజననామములు *

శ్లో॥ స్రోతోఽంజనంచ సౌవీరమంజనంచ రసాంజనం।
నీలాంజనం త దన్యచ్చ పుష్పాంజనక మేవచ॥ ఆ-ప్ర.

---

* అంజన భేదములు.—వీని లక్షణములు.—శ్లో॥ వల్మీక శిఖరాకారం భిన్న మంజనసన్నిభం। ఘృష్టంతు

స్రోతోంజనము, సౌవీరాంజనము, రసాంజనము, నీలాంజనము, పుష్పాంజనము అని యంజనము లైదువిధములు.

---

గైరిక చ్ఛాయమేతత్ స్రోతోఽంజనం స్మృతం॥ ఆ-ప్ర.— స్రోతోఽంజనము పుట్టయొక్క శిఖరమువంటి యాకృతి గలిగియుండును. పగులగొట్టినచో లోన కాటుకవలె నల్లని వర్ణము గలిగియుండును. మెత్తగా నూరినచో గైరికము వంటి వర్ణము గలిగియుండును. ఇట్టి లక్షణముగల స్రోతోంజనమును గ్రహించవలెనని తెలియవలెను. శ్లో॥ స్రోతోఽంజనంతు కాపోతం యామునం సరభం తథా। భార్యాఖ్యం నందనవనం యదిచ్ఛాగత సంజ్ఞితం॥ ర-కా-ధే. —ఈ స్రోతోంజనము కాపోతము, యామునము, సరభము, భార్యాఖ్య, నందనవనము, అనెడి యిచ్ఛకు దగినట్టి నామములతో వ్యవహరింపబడును.

**సౌవీరాంజనము.**—శ్లో॥ స్రోతోఽంజన సమం జ్ఞేయం సౌవీరం తత్తు పాండురం। ధూమ్రవర్ణాభ మపివా సౌవీ రాంజన ముచ్యతే। ఆ-ప్ర. — స్రోతోంజనముతో సమమైన యాకృతినే గలిగియుండును. కాని యిది పాండువర్ణమునుగాని, ధూమ్రవర్ణమునుగాని గలిగియుండును. ఇట్టి లక్షణముగల సౌవీరాంజనమును గ్రహించవలెను. శ్లో॥ సౌవీరం కేతువీరః స్యాత్పార్వతేయం నదీభవం। రక్త సంవరణం నాట్యం కృష్ణాఖ్యం నేత్రభూషణం॥ ర-కా-ధే. —సౌవీరాంజనము కేతువీరము, పార్వతేయము, నదీభవము, రక్తసంవరణము, నాట్యము, కృష్ణాఖ్యము, నేత్రభూషణము అను నామములచే వ్యవహరింపబడును.

రసాంజనము.—శ్లో॥ దార్వీక్వాథ మజాక్షీర పాద పక్వం యదాఘనం। తదా రసాంజనం ఖ్యాతం నేత్రయోః పరమం హితం॥ ఆ-ప్ర.—మ్రానుపసపు కషాయమున నాల్గవవంతు మేకపాలనుజేర్చి, గట్టిపడువరకు గాచిన యయ్యది రసాంజనమని చెప్పబడును. ఇది నేత్రములకు చాల హితమైనది. [రసాంజనము లోహసంబంధమైనది వేరుగా నున్నది. ఆ-ల.] శ్లో॥ రసాంజనం తార్క్ష్యశైలం రసగర్భం చ తార్క్ష్యజం॥ ఆ-ప్ర.—రసాంజనము తార్క్ష్యశైలము, రసగర్భము, తార్క్ష్యజము అను నామములతో వ్యవహరింపబడును.

నీలాంజనము.—శ్లో॥ నీలాంజనం నీలవర్ణం స్నిగ్ధం గురుతరం స్మృతం॥ ఆ-ప్ర.—నీలవర్ణమును, స్నిగ్ధ గుణమును (నిగనిగ లాడుట), అతి భారమును గలిగియుండును. ఇట్టి లక్షణముగల నీలాంజనమును గ్రహింపవలెను. మరియు, శ్లో॥ నీలాంజనంతు బహుధా సర్వలోహసదృ గ్భవేత్। స్వర్ణతారారతీక్ష్ణాది శబ్దపూర్వ ప్రభేదతః॥ ర-కా-ధే.—ఈ నీలాంజనము స్వర్ణాది లోహములతో సమానముగ నుండి యనేకవిధములుగా నుండును. అందుచే నియ్యది స్వర్ణనీలాంజనము, తారనీలాంజనము, ఆర (పిత్తల) నీలాంజనము, తీక్ష్ణలోహ నీలాంజనము అనియిట్లు లోహశబ్ద పూర్వకముగ ననేక విధములుగా వ్యవహరింపబడుచుండును.

పుష్పాంజనము.—శ్లో॥ పుష్పాంజనం రీతికిట్ట మితి కేచిద్వదంతిహి॥ ఆ-ప్ర.—ఇది పిత్తళముయొక్క కిట్టమని

కొందరిచే జెప్పబడుచున్నది. శ్లో॥ పుష్పాంజనం పుష్పకేతుః కౌసుమం రీతిపుష్పకం॥ ర-కా-ధే.—పుష్పాంజనము పుష్ప కేతువు, కౌసుమము, రీతిపుష్పకము అను నామములచే వ్యవహరింపబడును. ఈ యంజనములన్నియు, "ఏతాని నదీశైలభవానిచ" ర-కా-ధే.—అని చెప్పబడుటచే నదుల యందును, పర్వతములందును లభ్యములగునవియని దెలియ గలదు. కాని "దార్వీకాథమజాక్షీర పాదపక్వం యదా ఘనం। తదా రసాంజనంఖ్యాతం" ఆ-ప్ర.—అను ప్రమా ణమును బట్టి వీనిలో రసాంజనము ఓషధీ సంభూతము అనగా కృత్రిమము అని దెలియగలదు. కాని గ్రంథాన్తర నిర్దేశమునుబట్టి దీనిలోగూడ లోహసంబంధమగు మరియొక భేదమున్నట్లు దెలియుచున్నది. ఇంతియేగాకుండ రాజనిఘం టువునందు కుళుత్థాంజనమను మరియొక భేద మధికముగా జెప్పబడినది.—శ్లో॥ కుళిత్థా దృక్ప్రసాదాచ చక్షుష్యా చ కుళిత్థికా। కుకులాలీ లోకహితా కుంభకారీ మలాపహా॥ రా-ని.—కుళుత్థాంజనము కుళిత్థ, దృక్ప్రసాద, చక్షుష్య, కుళిత్థిక, కుకులాలి, లోకహిత, కుంభకారి, మలాపహా యను నామములతో వ్యవహరింపబడును. ఈ యంజ నముగూడ నోషధీ సంభూతమనియే గ్రహించ వలెను. "నిస్తుషీకృతవన కుళుత్థచూర్ణం పటేన సంశోధ్య శిశూనాం నేత్రరోగేయోజనీయం॥" అని యాయుర్వేద ప్రకాశికయందు శ్రీ మాధవాచార్యుడు చెప్పియున్నాడు. అనగా - అడవి యులవలకు పైని పొట్టుదీసి మెత్తగా

## అంజనశోధన విధానము

శ్లో॥ అంజనాని విశుధ్యన్తి భృంగరాజ దలద్రవైః ॥

ర-ర-స.

ఈ యంజనము లెల్ల గుంటకలగరాకు రసముచే స్వేదనముజేసిన (లేక) భావనజేసిన పరిశుద్ధములగును. అనగా నొక్కొక్క యంజనమునకును డోలాయంత్రమున గుంటకలగరాకు రసము నుక్తపరిమితిని బోసి మూడు యామములు పాకము జేసిన యవి శుద్ధములగును. లేక, ఒక్కొక్క యంజనమును బ్రత్యేకముగ చూర్ణముజేసి ప్రత్యేకముగనే వాటిని వేరువేరు పాత్రలయందుంచి యందు గుంటకలగరాకు రసమును అవి మునుగునంత పరిమితిని బోసి యెండలో నారస మిగిరిపోవువరకు నుంచిన యవి శుద్ధములగును. అయితే యిందలి యోషధీభవ రసాంజనమునకు మాత్ర మట్టి శోధన మవసరములేదని తెలియవలెను. ఇటులనే కుళుత్థాంజనమునకు గూడ తెలియనగును.

---

చూర్ణించి వస్త్రగాళితము జేసిన యయ్యది కుళుత్థాంజనమనబడును. దీనిని చంటిపిల్లలకు నేత్రములం దంజనమునకై యుపయోగించవలెను. ఈ యంజన భేదములలో రసాంజనము,కుళుత్థాంజనము అను నీయోషధీసంభవాంజనములుగాక మిగిలినవి సత్వము గలవిగా నుండును. అంజనములెల్ల విశేషముగా "సర్వాణ్యేతా న్యంజనాని నేత్ర్యాణి పరమం తథా। విషఘ్నాని విశేషాచ్చ హిధ్మాధ్మాన హరాణిచ॥" అ-ప్ర.—అని చెప్పబడుటచే నేత్రహితములును, విషహరములును, హిక్కను, ఆధ్మానమును హరించునవియు నైయుండును.

## శోధితాంజన గుణములు *

శ్లో॥ స్రోతోంజనం స్మృతంస్వాదు చక్షుష్యం కఫపిత్తనుత్।
కషాయం లేఖనంస్నిగ్ధం గ్రాహిఛర్ది విషాపహం॥
హిధ్మాక్షయాస్రహృచ్ఛీతం, సౌవీరమపితాదృశం।
కింతు ద్వయో రంజనయోః శ్రేష్ఠంస్రోతోంజనం
స్మృతం॥ రసాంజనం కటుశ్లేష్మ విషనేత్రవికారనుత్।
ఉష్ణం రసాయనం తిక్తం ఛేదనం వ్రణదోషహృత్॥
ఆ-ప్ర.

నీలాంజనం గురుస్నిగ్ధం నేత్ర్యం దోష త్రయాపహం।
రసాయనం సువర్ణఘ్నం లోహమార్దవ కారకం॥
పుష్పాంజనం సితం స్నిగ్ధం హిమం సర్వాక్షిరోగనుత్॥
అతిదుర్ధర హిధ్మాఘ్నం విషజ్వర గరాపహం॥
ర-ర-స.

యథోక్తవిధానమున శుద్ధిజేయబడిన యాంజనములలో స్రోతోంజనము మధుర రసమును, కషాయాను రసమును, స్నిగ్ధగుణమును, శీత వీర్యమును గలిగియుండును. నేత్రములను హితమైనది. లేఖనము. మల

---

* కులుత్థాంజనగుణములు.— శ్లో॥ కులిత్థికాతు చక్షుష్యా కషాయా కటుకాహిమా। విష విస్ఫోటకండూతి వ్రణదోష నిబర్హణీ॥ రా-ని.—కులుత్థాంజనము కషాయ రసమును, కటుకాను రసమును, శీతవీర్యమును గలిగి యుండును. నేత్రములకు హితమైనది. విషమును, విస్ఫోట మును, కండువును, వ్రణదోషమును బోగొట్టును.

మును నిరోధించును. కఫ పిత్తములను శమింపజేయును. ఛర్దిని, విష మును, హిక్కను, క్షయమును, రక్తదుష్టిని బోగొట్టును. సౌవీరాంజ నము గూడ స్రోతోంజన గుణములనే గలిగియుండును. కాని ఈ రెండింటిలో స్రోతోంజనమే శ్రేష్ఠమైనదిగా గుర్తించవలెను. రసాం జనము కటురసమును, తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. రసాయనము. దుష్టమాంసాదులను ఛేదించును. కఫమును శమింపజేయును. విషమును, నేత్ర వికారములను, వ్రణమును బో గొట్టును. నీలాంజనము గురు స్నిగ్ధగుణములను గలిగియుండును. నేత్రములకు హితమైనది. రసాయనము. త్రిదోషములను శమింప జేయును. మరియు, నిది స్వర్ణముయొక్క స్వరూపమును బోగొట్టును. లోహములకు మృదుత్వమును గలిగించును. పుష్పాంజనము తెల్లగ నుండును. స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగియుండును. సమస్త నేత్రవ్యాధులను, అతి దుర్భరమైన హిక్కను, విషమును, జ్వరమును బోగొట్టును.

## అంజనయోగము

### (1) వాతనాశనరసము

శ్లో॥ సూతం స్వర్ణం తామ్రకం వజ్రమేవ లోహం తాప్యం తాళకం తుత్థకంచ। అబ్ధేః ఫేనం శుద్ధ సౌవీరకం హి కృత్వా సమ్యక్ సర్వమేతత్ సమాంశం॥ భాగంచైకం కారయేద్వై పటూనాం వజ్రీ క్షీరైర్మర్దితం తద్ది నైకం। రుద్ధ్వాసమ్యక్ భూధరే తం విపాచ్య మాషంచైకం భక్షయేదార్ద్రకేణ॥ ..................
సర్వాన్ వాతాన్ వాతజాన్వై వికారాన్ హన్యా త్సత్యం భాషితం భైరవేణ॥ ర-ప్ర-సు.

రససిందూరము, స్వర్ణభస్మ, తామ్రభస్మ, వజ్రభస్మ, లోహభస్మ, స్వర్ణమాక్షికభస్మ, శుద్ధ తాళకము, తుత్థభస్మ, సముద్రఫేనము, శుద్ధ సౌవీరాంజనము, పంచ లవణములు (ప్రత్యేకముగ) వీటిని సమాంశములుగ గ్రహించి, ఖల్వమునందుంచి, జెముడుపాలతో నొక దినము మర్దించి యొక గోళము జేసి బాగుగా నెండించవలెను. పిమ్మట నీ గోళమును భూధర యంత్రమునందు బంధించి పాకము జేయవలెను. స్వాంగశీతలమున నాగోళమును గ్రహించి ఖల్వమునందు చూర్ణించి యుంచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది వాతనాశన రసమని చెప్పబడును. దీనిని మాషప్రమాణమున అల్లపురసముతో సేవించవలెను. దీనివలన సమస్తములైన వాతరోగములును శమించును.

---

# టంకణము

## టంకణక్షార నామములు *

శ్లో॥ సౌభాగ్యం టంకణక్షారో ధాతుద్రావక ముచ్యతే॥

ఆ-ప్ర.

సౌభాగ్యము, టంకణక్షారము, ధాతుద్రావకము అనునవి టంకణక్షార నామములు.

---

* టంకణము క్షారములలో నొకటి. అయినను ఈ ద్రవ్యమునకు రసకర్మలో హెచ్చు వ్యాపకముండుటను బట్టి యిది యుపరసవర్గమున రసాచార్యులచే గణింపబడి యుండవచ్చునని యూహింపనగును. రసౌషధములలో విషము జేరు ప్రతి యౌషధమునందును టంకణప్రయోగము చెప్పబడియున్నది. ఈ టంకణ సంయోగముచే విషమునకు

మారణ మేర్పడి దానియొక్క తీక్ష్ణత తగ్గిపోవును. కావు
ననే యటుల జేర్చబడుచున్నదని దెలియవలెను. ఇందుకు
"విషదోషహర" మని గూడ దీనిని రసాచార్యులు వ్యవహ
రించియున్నారు. మరియు నిది "స్వర్ణరూప్యయోః శోధనః
పరః" అని చెప్పబడుటచే స్వర్ణమును, రజతమును గూడ
నిది శోధించును. అనగా వాటిలోనుండు మలినమును
బోగొట్టి స్వచ్ఛతను గలిగించును. కావుననే బంగారు పని
చేయువారలు దీనిని విశేషముగా నుపయోగించుచుందురు.
మరియు, నిది "ధాతుద్రావక"మని చెప్పబడుటచే ప్రతి
లోహమును కరగించునప్పుడు దీని నందు కొంచెముగా జేర్చి
నచో నాలోహము లతిశీఘ్రముగా ద్రవించును. ఈ క్షారము
నకు వ్రణములందుగూడా ప్రయోగముగలదు. "అపరో
నీలకంఠాఖ్యః టంకణః పూర్వటంకణాత్। శ్రేష్ఠో నీలచ్ఛవిః
కించి చ్ఛోధనం తస్యపూర్వవత్॥" అ-ప్ర.—దీనిలో నీల
కంఠమను మరియొక భేదముగలదు. దీనివర్ణము మిక్కిలి
స్వల్పమైన నీలవర్ణముగా నుండును. ఇదియే 'మడ్డివెలిగార'
మని వ్యవహరింపబడుచున్నది. పూర్వ టంకణముకంటె
నిది శ్రేష్ఠమైనదిగా దెల్పియవలెను. దీనికి శోధనముగూడా
పైదానివలెనే యని తెలియనగును. టంకణశోధనము.—
శ్లో॥ వహ్నావుత్ఫుల్లితః శుచిః॥ అ-ప్ర.— టంకణమును
నలియగొట్టి యొక యినుపబాణలిలో వేసి అడుగున సన్నని
మంటవేయుచు లోహదర్వితో నా చూర్ణమును భర్జనజేయు
చుండినచో కొంచెముకాలమునకు బుసబుస పొంగి మరి

## శోధిత టంకణక్షార గుణములు *

శ్లో॥ టంకణోఽగ్నికరో రూక్షః కఫఘ్నో వాతపిత్తకృత్ ॥
అ-ప్ర.

ఉక్తవిధానమున శోధింపబడిన టంకణక్షారము రూక్షగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతపిత్తములను వృద్ధి జేయును. కఫమును శమింపజేయును.

---

కొంతకాలమునకు పుష్పమువలె విడిపోవును. అప్పుడు శుద్ధమైనట్లు గుర్తించవలెను. వెంటనే నిప్పుమీద నుండి క్రిందకు దింపి చల్లారిన పిదప నుపయోగించుకొనవలెను. ఔషధార్థమై యుపయోగించునప్పుడు దీని నిటుల శోధించియే యుపయోగించవలెను. లోహములను ద్రవింపజేయుటకై శుద్ధిజేయకయే యుపయోగింపవచ్చును.

* అశోధిత టంకణక్షారముచే గలుగు వికారములు—

శ్లో॥ అశుద్ధష్టంకణో వాంతి భ్రాంతికారీ ప్రయోజితః ॥అ-ప్ర.

—శుద్ధిజేయక టంకణమును ప్రయోగించినచో నయ్యది వాంతిని, శిరోభ్రమణమును గలిగించును.

# రాజావర్తము

## రాజావర్త నామములు *

శ్లో॥ రాజావర్తో రాజపట్టో చూర్ణగోలాభిధా ద్విధా॥
ర-కా-ధే.

రాజావర్తము, రాజపట్టము, చూర్ణగోల యనునవి రాజావర్త నామములు.

---

* రాజావర్త భేదములు—శ్లో॥ రాజావర్తో ద్విధా ప్రోక్తః సరక్తో నీలిమాశ్రితః। గురుః శ్రేష్ఠః సకథితః తదన్యో హీనఉచ్యతే॥ అ-ప్ర.—రాజావర్తము రక్త నీల వర్ణ భేదముచే రెండువిధములుగ నుండును. ఇవి మిక్కిలి బరువుగానున్నచో శ్రేష్ఠములైనవిగా దెలియవలెను. తేలికగ నున్న హీనములైనవిగా గుర్తింపవలెను. అనగా నట్టి వానిని గ్రహింపగూడదని భావము. మరియు, శ్లో॥ రాజావర్తః స్మృతః కైశ్చిత్ బుధై రుపరసే తథా॥ రత్నజాతౌ స్మృతః కైశ్చి ల్లక్షణం తస్యకథ్యతే॥ అ-ప్ర.— రాజావర్తపు రాయి కొందరిచే నుపరసవర్గమునందును, మరికొందరిచే రత్నవర్గమునందును గణింపబడినది. ఈ విధముగ దీని విషయమై మతభేదములు గానుపించుచున్నవి. ఇది భస్మ జేయబడియే యుపయోగింపదగినట్టి ద్రవ్యము. కాని దీనియొక్క ప్రయోగమంతగా గానరాదు. దీనినుండి సత్వము గ్రహించి రసకర్మయందుపయోగింపబడునని దెలియగలదు.

## రాజావర్త శోధన విధానము

శ్లో॥ నింబూద్రవైః స గోమూత్రైః సక్షారైః స్వేదితాఃఖలు।
ద్విత్రివారేణ శుధ్యంతి రాజావర్తాది ధాతవః॥ ర-ర-స.

జంబీరస్వరసమున క్షారమును జేర్చిగాని, గోమూత్రమునందు క్షారమును జేర్చిగాని డోలాయంత్రమున బూరించి యందు రాజావర్తమును వ్రేలాడగట్టి మూడు యామముల కాలము స్వేదనము జేయవలెను. ఇటుల రెండు మూడు పర్యాయములు జేసిన యయ్యది పరిశుద్ధమగును.

## రాజావర్త భస్మవిధానము

శ్లో॥ లుంగాంబు గంధకోపేతో రాజావర్తః సుచూర్ణితః।
పుటనాత్సప్తవారేణ రాజావర్తో మృతో భవేత్॥
ర-ర-స.

యథోక్తవిధానమున శుద్ధిజేసిన రాజావర్తమును మెత్తగా చూర్ణించి మాదీఫలరసముతో మూడుదినములు చక్కగా నూరి, బిళ్ళ జేసి యెండించవలెను, పిమ్మట నీబిళ్లకు ద్విగుణముగానుండునట్లు శోధితగంధకమును గ్రహించి యందొకభాగమును శరావమునందు పరువవలెను. దానిపైనా బిళ్లనుంచి తిరిగి దీనిని రెండవగంధకభాగముచే గప్పి యాశరావమును మరియొక శరావముచే సంధానముజేసి, శిల మృత్తికచే లేపనముజేసి యెండించి పుటము వేయవలెను. ఈ విధముగా నేడుమారులు పుటము వేసినచో నయ్యది భస్మయగును.

## రాజావర్తభస్మ గుణములు

శ్లో॥ రాజావర్తః కటుస్తిక్తః శిశిరః పిత్తనాశనః।
ప్రమేహ నాశకః ప్రోక్త శ్ఛర్దిహిక్కా నివారణః॥
ఆ-ప్ర.

రాజావర్తభస్మము కటుతిక్తరసములను, శీతవీర్యమును గలిగి యుండును. పిత్తమును శమింపజేయును. ప్రమేహమును, ఛర్దిని, హిక్కను బోగొట్టును.

---

# చుంబకము

## చుంబక నామములు *

శ్లో॥ చుంబకః కాంతపాషాణో ఽయస్కాంతో లోహ
కర్షకః॥ ఆ-ప్ర.

చుంబకము, కాంతపాషాణము, అయస్కాంతము, లోహకర్షకము అనునవి చుంబక నామములు.

---

* చుంబకము (సూదంటురాయి) ''కాంతలోహశ్చ భేదాః స్యుశ్చుంబక భ్రామకాదయః'' ఆ-ప్ర—అని చెప్ప బడుటచే చుంబకపురాళ్లు కాంతలోహములో నొక భేదమని దెలియనగును. మరియు 'లోహకర్షక' మని యిది చెప్ప బడుటచే రసకర్మయందు లోహముల నాకర్షించుట కుప యోగింపబడునని దెలియగలదు. అందుచేతనే శ్రీ మాధ వాచార్యుడు 'కాంతపాషాణః పారదోపకృత్' అని జెప్పి, దీనికి వేరు ప్రయోజనమును జెప్పక విడిచియున్నట్లు దెలియ గలదు. యోగములందు దీని ప్రయోగ మెచ్చటను గాన రాదు. కాని గుణములు చెప్పబడియున్నవి.

## చుంబక శోధన విధానము

శ్లో॥ సౌంభాంజనరసే సామ్లవర్గే డోలాంగతే దినం।
పాచితః శుధ్యతే కాంత పాషాణః॥ ఆ-ప్ర.

ములగాకు రసమును డోలాయంత్రమున బూరించి అందు అమ్లవర్గద్రవ్యములను జేర్చి చుంబకపురాయిని దానిపై వ్రేలాడునట్లుజేసి యొకదినము స్వేదనముజేసిన యది పరిశుద్ధమగును.

## శోధిత చుంబక గుణములు

శ్లో॥ చుంబకో లేఖనః శీతః మేదో విష జరాపహః।
కండూ పాం డూదర శ్లైష్మ్య మోహ మూర్ఛాయ
రోగహృత్॥ ఆ-ప్ర.

శుద్ధి జేయబడిన చుంబకము శీతవీర్యమును గలిగియుండును. లేఖనము, మేదోవృద్ధి, విషము, జర, కండు, పాండు, ఉదరము, ధాతుశ్లైష్మ్యము, మోహము, మూర్ఛ యను నీ వ్యాధులను బోగొట్టును.

---

# స్ఫటిక

## స్ఫటికా నామములు *

శ్లో॥ స్ఫటికాచ స్ఫటీప్రోక్తా..............।
దృఢరంగా రంగదృఢా రంగాంగా చాపి కథ్యతే॥
ఆ-ప్ర.

---

* (1) గ్రాహ్యస్ఫటికా లక్షణము—"స్ఫటికా నిర్మలా శ్వేతా శ్రేష్ఠా॥" ఆ-ప్ర.—స్వచ్ఛమైన తెల్లని

స్ఫటిక, స్ఫటి, దృఢరంగ, రంగదృఢ, రంగాంగ యనునవి పటిక నామములు.

---

వర్ణముగలిగినట్టి పటిక శ్రేష్ఠమైనదిగా గుర్తెరిగి యోగములందు జేర్చుకొనవలెను.

(2) స్ఫటికా శోధనము.—"శోధనం క్వచిత్ । నదృష్టం శాస్త్రతో, లోకా వహ్నౌ ఫుత్ఫుల్లయంతిహి॥" అ-ప్ర.—శాస్త్రమునందు పటికకు శోధనము చెప్పబడి యుండలేదు. అనగా నిజద్రవ్యమును యోగములం దెట్టి సంస్కారమును జేయకయే చేర్చుకొనవచ్చునని శాస్త్ర సమ్మతము. కాని, నిప్పుమీాద పొంగించినచో దీనికి శుద్ధి యగునని కొందరీ విధానము ననుసరించుచున్నారు.

(3) పటికతో నెర్రని వర్ణమును తయారుచేయుదురు. అందుచేతనే యిది "దృఢరంగ, రంగదృఢ, రంగాంగ" యను నామములచే వ్యవహరింపబడుచున్నది. ఈ ద్రవ్యము మిక్కిలి కషాయరసమును గలిగి యుండును. వ్రణములందు దీని యుపయోగము దెలియరాదు. కాని నోటియందు వ్రణము ఏర్పడినప్పుడు (ఆస్యపాకము) దీనిని నీటిలో కలిపి గండూషము జేసినచో నది శమించును. కళ్ల కలకయందు గూడ పటికను చనుబాలలో గలిపి అశ్చోతనము జేసిన యవ్యాధి శమించును. మరియు, నిది ఘటకి, ఫుల్లికయని రెండు విధములుగ నుండుననియు, అందు ఘటకి యను భేదము కొంచెము పసుపుపచ్చని వర్ణముగలిగి బరువుగా నుండుననియు, ఫుల్లికయను భేదము తేలికగ నుండి

## స్ఫటికా గుణములు

శ్లో॥ స్ఫటికాతు కషాయోష్ణా వాతపిత్త కఫవ్రణాన్।
నిహన్తి శ్విత్ర వీసర్పాన్ యోనిసంకోచ కారిణీ॥

అ-ప్ర.

పటిక కషాయరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాత పిత్త కఫజ వ్రణములను శమింపజేయును. శ్విత్రకుష్ఠమును, విసర్పమును బోగొట్టును. యోనిని సంకోచింపజేయును. మరియు, నిది నేత్రములకు హితమైనదని గ్రంథాంతరమున జెప్పబడినది.

## స్ఫటికాయోగము

### (1) స్ఫటికాద్యంజనము

శ్లో॥ స్ఫటికః కుంకుమం శంఖో మధుకో మధు నాంజనం॥

అ-హృ-ఉ.

పటిక, కుంకుమపువ్వు, శంఖము, యష్టిమధుకను వీటిని మెత్తగా చూర్ణించి తేనెతో గలిపి నేత్రముల కంజనము జేసిన అర్జున మను నేత్రరోగము శమించును.

---

తెల్లని వర్ణముతో అమ్లరసమును గలిగియుండుననియు రస రత్న సముచ్చయమున జెప్పబడినది. మరియు, పటిక రస జారణమున కుపకరించుననిగూడ అందు జెప్పబడినది. ఈ యుద్దేశ్యముతోనే గొందరు స్వర్ణవంగమను రసౌషధ యోగమున నవాసారమునకు బదులు పటికను జేర్చుట వ్యవహారమునందు గలదు.

# శంఖము

## శంఖ నామములు *

శ్లో॥ శంఖః సముద్రజః కంబుః క్షుద్రః శంఖనకః స్మృతః॥
ఆ-ప్ర.

శంఖము, సముద్రజము, కంబు, క్షుద్రము, శంఖనకము అనునవి శంఖనామములు.

---

* (1) శంఖ లక్షణము.—"శంఖశ్చ విమలః శ్రేష్ఠః చంద్రకాంతి సమప్రభః॥ ఆ-ప్ర.—స్వచ్ఛముగను, చంద్రకాంతితో సమమైన తెల్లని వర్ణముగలదిగను నుండునట్టి శంఖము శ్రేష్ఠమైనదిగా గ్రహింపనగును.

(2) శంఖ భేదములు.—"ద్విధా స దక్షిణావర్తో వామావర్తః శుభేతరః।దక్షిణావర్త శంఖస్తు త్రిదోషఘ్నః శుచిర్నిధిః। గ్రహాలక్ష్మీ క్షయ క్ష్వేడ క్షామ తాక్ష్మ్యామయాపహః॥" ఆ-ప్ర.—శంఖము దక్షిణావర్తము, వామావర్తము అని రెండు విధములుగా నుండును. అందు దక్షిణావర్త శంఖము శ్రేష్ఠమైనది. ఇది పుణ్యవంతులకే లభించును. ఇది యేగృహమునం దుండునో యా గృహము లక్ష్మీసంపన్నమై యుండును. మరియు, నిది శుచికరమైనదియు, త్రిదోషములను శమింపజేయునదియునై యుండును. గ్రహదోషమును బోగొట్టును. పాపమును దొలగించును. క్షయవ్యాధిని, కర్ణనాదమును, కార్శ్యమును, నేత్రరోగమును బోగొట్టును.

## శంఖ గుణములు *

శ్లో॥ శంఖః క్షారో హిమో గ్రాహీ గ్రహణీ రోగనా
నేత్ర పుష్పహరో వర్ణ్యః తారుణ్య పిటికా ప్ర

శుద్ధిజేయబడిన శంఖము, క్షారగుణమును, శీతవీర్యము
యుండును. గ్రాహి. వర్ణమును గలిగించును. గ్రహణీరోగము
మునందలి పుష్పమును, యౌవానపిటికను శమింపజేయును.

---

* (1) శంఖశోధన విధానము.—వెడల్పు
పాత్రలో శంఖమునుంచి యది మునుగునంత ప
జంబీర స్వరసము నందు బోసి, యొక గంటకాల వ
యుంచవలెను. ఈ జంబీరస్వరసమునుబోసిన కొ
కాలముననే అందు పొంగు వచ్చును. ఇందువలన అ
నంటియున్న మలినమంతయు నా వేగముతో సడ
ద్రవమునందు మిళితమగును. నియమితకాల మటుల
పిమ్మట నా శంఖము నందుండితీసికొని జలముతో శ
క్షాళనము జేసి యెండించవలెను.

శంఖభస్మ విధానము—శుద్ధిజేయబడిన శ
ంపుటమునందుంచి, దృఢముగ సంధిబం
లమధ్య నుంచి పుటపాకము
మున నా శంఖమును గ్రహించి
ట్లు గానుపించును. అనగా
నట్లు గాననగును. దీనిని తిరిగి ఖ

## శంఖ యోగములు

### (1) శంఖవటి

శ్లో॥ దగ్ధశంఖస్య చూర్ణం హి తథా లవణ పంచకం।
చించికా క్షారకంచైవ కటుకత్రయ మేవచ॥
తథైవ హింగుకం గ్రాహ్యం విషగంధక పారదం।
అపామార్గస్య వహ్నేశ్చ క్వాథైర్లింపాకజై రసై॥
భావయేత్ సర్వచూర్ణం త దమ్లవర్గై ర్విశేషతః।
యావ త్తదమ్లతాం యాతి గుడి కామృతరూపిణీ॥
సద్యో వహ్నికరీచైవ భస్మకం చ నియచ్ఛతి।
భుక్తాకంఠం తు తస్యాంతే ఖాదేచ్ఛ గుడికామిమాం॥
తత్ క్షణా జ్జారయత్యాశు సర్వాజీర్ణ వినాశినీ।
జ్వరం గుల్మం పాండురోగం కుక్షశూలం ప్రమేహకం॥
వాతరక్తం మహాశోథం వాతపిత్త కఫానపి।
దుర్నామారి రయం చాశు దృష్టో వార సహస్రశః॥
నిర్మూలం దహ్యతే శీఘ్రం తూలకం వహ్నినాయథా।
లోహవంగయుతా సేయం మహాశంఖవటీ స్మృతా॥

---

నందు మెత్తగా చూర్ణించి జంబీర స్వరసముతో నొక దినము మర్దించి చిన్నచిన్న చక్రికలుగా జేసి యెండించి తిరిగి పై విధముగనే పుటమువేయవలెను. ఇటుల జేసి వచో శంఖము స్వచ్ఛమైన తెల్లని వర్ణముతో భస్మ యగును. ఇది స్వానుభూత సాంప్రదాయముగా దెలియ నగును.

ప్రభాతే కోష్ణతో యానుపాన మేవ ప్రశస్యతే॥
జంబీరం బీజపూరంచ మాతులుంగక చుక్రకం।
చాంగేరీ తిత్తిడీ చైవ బదరీ కరమర్దకం॥
అష్టా వమ్లస్యవర్గోఽయం కథితో మునిసత్తమైః॥

భై-ర.

కాల్చిన శంఖముయొక్క చూర్ణము, పంచలవణములు, చింత క్షారము (చింతమ్రానుపై నుండు బెరడును గ్రహించి యెండబెట్టవలెను. ఒకచో కొంచెమెత్తుగా పిడకలను బేర్చి వాటిపై యెండిన చింతబెరడును పలుచగాబరచి, దానిపై శంఖమునుంచి తిరిగి చింతబెరడుతో కప్పి యథాపూర్వముగా పైన కొంచెమెత్తుగా పిడకలను బేర్చవలెను. పిమ్మట నందు నిప్పుబొగ్గుల నుంచిన యదియంతయు గొంతకాలమునకు గాలిపోవును. స్వాంగశీతలమున పైనున్న కచికలను మెల్లగా తొలగించి, తెల్లగా కాలియున్న చింతబెరడులను, వానిమధ్య నున్న దగ్ధ శంఖమును జాగ్రత్తగా వేరొక పాత్రలోనికి గ్రహించవలెను. ఇటుల సిద్ధముజేసి గ్రహింపబడినట్టిదియే చింతక్షారము, దగ్ధశంఖము అని తెలియవలెను), త్రికటుచూర్ణము, భర్జితహింగుచూర్ణము, శోధితవత్సనాభి చూర్ణము, శోధితగంధకము, శోధితపాదరసము వీటినెల్ల సమాంశము లుగ గ్రహించవలెను. ఇందు రసగంధకములను ముందుగా ఖల్వము నందుంచి కజ్జలి చేసుకొనవలెను. పిమ్మట మిగిలిన చూర్ణములనన్నిటిని జేర్చి యందు అపామార్గకషాయములో మూడుదినములును, చిత్రమూల కషాయములో మూడుదినములును, తియ్యనిమ్మ స్వరసములో మూడు దినములును మర్దించవలెను. పిమ్మట నమ్లవర్గద్రవ్యముల స్వరసములతో (నిమ్మ, దబ్బ, మాదీఫలము, చుక్కకూర, పులిచెంచలి, చింత, రేగు, వాకకాయ వీటియొక్క స్వరసములతో ప్రత్యేకముగా మూడు మూడు దినములు చొప్పున మర్దించవలెను) బాగుగా నమ్లత్వముగలుగువరకు

మర్దించి యైదు యవల పరిమితిని మాత్రలుజేసి యుంచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది శంఖవటి యని వ్యవహరింపబడును. ఇందు పై ద్రవ్యములతో సమముగా లోహభస్మను, వంగభస్మను జేర్చి పై విధముగా మర్దించి గుటికలుజేసినచో నయ్యది మహాశంఖవటియని వ్యవహరించబడును. ఈ గుటికలను ప్రతిరోజును ఉదయకాలమునందే కోష్ణ జలానుపానముతో సేవించుచుండిన జ్వరము, గుల్మము, పాండురోగము, కుష్ఠము, శూలము, ప్రమేహము, వాతరక్తము, సర్వాంగశోఫ, వాత పిత్త కఫవికారములు, అర్శస్సు ఈ వ్యాధులు శమించును. మరియు, భోజనాంతమున సేవించినచో నెంత గురుపదార్థమునైనను అతిశీఘ్రముగా జీర్ణింపజేయును. సమస్త అజీర్ణములను శమించును. భస్మక వ్యాధి శమించును. అగ్నిదీప్తి గలుగును.

## (2) శంఖ ద్రావకము *

శ్లో॥ శంఖచూర్ణం యవక్షారం సర్జిక్షారం సటంకణం।
సమంచ పంచలవణం స్ఫటికారి నృసాదరః॥

---

* స్వానుభూత సాంప్రదాయమున శంఖద్రావకమిట్లు సిద్ధము జేయబడుచున్నది.—ఈ యోగమునందుజెప్పబడిన ద్రవ్యముల నన్నింటిని తొలుత మెత్తగాచూర్ణించి యుంచుకొనవలెను. సుమారు రెండడుగుల యెత్తును విశాలమైన యుదరమును, ముఖమును గలిగియున్నట్టి యొక భాండమును గ్రహించి, దానిలోపలి యడుగుభాగమున నొక యిటుకరాయి నుంచవలెను. ఈ రాతికి చుట్టును పై చూర్ణమును పరచవలెను. మధ్యభాగమున లోతుగానుండునట్టి యొక మృణ్మయ శరావము నారాతిపై కదలకుండు న

కాచకుప్యాం తతః క్షిప్త్వా వారుణీ యంత్రముద్ధరేత్॥
యామార్ధం ద్రావయత్యేష శంఖశుక్తి వరాటికాః॥
అర్శాంసి నాశయేత్ షట్ చ మూత్రకృచ్ఛ్రాశ్మరీస్తథా।

---

ట్లమర్చవలెను. పిమ్మట నా భాండముయొక్క ముఖముపై వేరొక భాండము నూర్ధ్వముఖముగ నుంచి యీ రెండు భాండములయొక్క సంధిని దృఢముగా మృల్లేపిత వస్త్ర ఖండముచే బంధించి యెండించవలెను. సంధిబంధనము దృఢముగా నున్నట్లు దెలిసికొని యీ సంపుటమును జాగ్రత్తగా పొయ్యిపైనుంచి యగ్నిని ప్రజ్వలింపజేయవలెను. అటుల అగ్నిని జ్వలింపజేయుటకు ముందుగా నూర్ధ్వభాండమును శీతలోదకముచే పూరించవలెను. మరియు, నగ్నితాపముచే నాజలమున నుష్ణత్వమేర్పడినప్పుడు దానిని జాగరూకతతో బయటకు తొలగించి, వెంటనే శీతలజలముచే పూరించుచుండవలెను. ఇటుల జేయుటవలన లోపలనున్న యౌషధ ద్రవ్యము అగ్నితాపముచే బాష్పరూపమున నూర్ధ్వముగా ప్రసరించి యచ్చటి శీతలస్పర్శచే ద్రవరూపమును బొంది యూర్ధ్వభాండముయొక్క యధో మధ్యభాగము నుండి బిందురూపమున అందమర్చిన శరావమునందు జారును. ఈ పాకకాలమున భాండసంపుటమునుండి వచ్చు చుంయ్ అను శబ్దము తగ్గిపోయినవెంటనే నిప్పును చల్లార్చి, సంధి బంధనమునుగూడ తొలగించి ద్రావకముచే పూరితమైన శరావమును బయటకు జాగ్రత్తగా గ్రహించి, యందలి ద్రావకమును వేరొక పాత్రలోనికి వంపుకొని భద్రపరచవలెను.

ఉదరాష్టవిధం హన్తి గుల్మప్లీహోదరాణిచ॥
అజీర్ణం నాశయే చ్ఛీఘ్రం గ్రహణీంచ విషూచికాం।
భుక్తశేషేచ భోక్తవ్యో మాషమాత్రో రసోత్తమః॥
క్షణమాత్రా ద్భవేద్భస్మ పున ర్భోజన మిచ్ఛతి।
ప్రత్యహం భోజనాంతేచ సంసేవ్యోఽయం రసోత్తమః॥
నరుజాయాం భయంక్వాపి సత్యం సత్యం వదామ్యహం।
న దేయో యస్యకస్యాపి సదాగోప్యః ప్రయత్నతః॥
రసః శంఖద్రవో నామ వైద్యానా ముపకారకః॥

భై-ర.

శంఖము, యవక్షారము, సర్జక్షారము, టంకణక్షారము, పంచ
ులు, పటిక, నవాసారము వీటిని సమాంశములుగ గ్రహించి
గా చూర్ణించవలెను. పిమ్మట నీ చూర్ణమును కాచకూపికయందు
దానిని వారుణీ యంత్రమునందుంచి నియమితకాలమువరకు
ుజేసి యందుండి ద్రావకమును గ్రహించవలెను. ఇది పైయంత్ర
ను బాకముజేసినచో నర్ధయామములోనే ద్రవీభూతమగును. ఇటుల
చినట్టిదియే శంఖద్రావకమని వ్యవహరించబడును. మరియు, నిట్టి
ములో శంఖము, శుక్తి, వరాటము వీనియొక్క ముక్కల నుంచి
నవి వెంటనే ద్రవరూపమును దాల్చును. ఈ విధముగా శంఖాదు
దవరూపమును బొందించు శక్తి గలిగియున్నట్టిదియే శ్రేష్ఠమగు
ద్రావకమని గుర్తించవలెను. దీనిని పది లేక పదిరెండు బిందువులు
ున సేవించినచో సర్వస్సు, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, ఉదరము,
ు, ప్లీహోదరము, అజీర్ణము, గ్రహణి, విషూచిక, రసశేషాజీర్ణము
గునవి యతిశీఘ్రముగా శమించును. భోజనాంతమున సేవించి
తిరిగి తత్క్షణమే యాకలిని బుట్టించును. కావున ఎట్టి యజీర్ణ
యైనను దీనిచే నిశ్చయముగ నది శమించును.

## (3) విమలావర్తి

శ్లో॥ శంఖప్రియంగు నేపాలీ కటుత్రిక ఫలత్రికైః।
దృగ్వైమల్యాయ విమలావర్తిః........॥
అ-హృ-ఉ-అ 13.

శుద్ధిజేసిన శంఖము, ప్రేంఖణము, శుద్ధిజేసిన మణిశిల, త్రికటుకములు, త్రిఫలములు వీటిని సమాంశములుగా గ్రహించి మెత్తగా చూర్ణించి శుద్ధోదకముతో ఖల్వమునందు జక్కగా మూడుదినములు మర్దించి చిన్నచిన్న కణికెలుగా జేసి। ఛాయాశుష్కము జేయవలెను. వీటిని శుద్ధజలముతో నరుగదీసి నేత్రముల కంజనము జేసిన దృష్టిమాంద్యము శమించును.

---

# ఖటిక

## ఖటికా నామములు *

శ్లో॥ ఖటికా ఖటినీ చాపి లేఖనీ చ నిగద్యతే॥ ఆ-ప్ర:

ఖటిక, ఖటిని, లేఖని యనునవి ఖటికా నామములు.

---

* ఖటికాభేదములు.—— "ఖటీ గౌరఖటీ చేతి ద్విధాద్యా మలినా స్మృతా। మృదుపాషాణసదృశీ ఖటీ శుభ్రాధికా గురుః॥" ఆ-ప్ర.—సుద్ద 'ఖటి - గౌరఖటి' యని రెండు విధములుగా నుండును. అందు మొదటిది మలినముగా నుండును. రెండవది మృదువైన పాషాణముతో సమమై తెల్లగను, బరువుగను నుండును. బజారులో నిది రెండువిధములుగా లభ్యమగును. అందు ఒకటి పెద్ద పెద్ద

## ఖటికాగుణములు

శ్లో॥ ఖటీ దాహాస్రనుచ్ఛీతా మధురా విషశోథజిత్।
కఫఘ్నీ నేత్రయోః పథ్యా............॥
తద్వత్పాషాణఖటికా వ్రణ పిత్తాస్రజి ద్ధిమా।
లేపాదేతే గుణాః ప్రోక్తా, భక్షితా మృత్తికాసమా॥
ఖటీ గౌరఖటీ ద్వేచ గుణై స్తుల్యే ప్రకీర్తితే॥ ఆ-ప్ర.

సుద్ద - మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును, కఫమును శమింపజేయును. దాహమును, విషజశోథను బోగొట్టును. నేత్రములకు

---

గడ్డలవలె లభ్యమగును. దానిని స్పృశించినచో మృదువుగ నుండును. చూర్ణించినచో తేలికగా చూర్ణమగును. ఇది మిక్కిలి తెల్లగా నుండును. బజారులో నమ్మబడు ప్రతి దంతధావన చూర్ణమునందును దీనిని జేర్చుచుందురు. మరియు, నిది లేఖన (వ్రాయుట) కర్మ కుపయోగింపబడు చుండును. అందుచేతనే "లేఖనే బాలకోచితా॥" ఆ-ప్ర. అని చెప్పబడినది. రెండవది చిన్నచిన్న ముక్కలవలె లభ్యమగును. ఇది నునుపుగను, పసపు తెలుపు గలసిన వర్ణముగలదిగను, బరువుగను నుండును. దీనిని వైష్ణవ భక్తులు విష్ణుచిహ్నధారణమునకై యుపయోగించుదురు. ఇది మిక్కిలి శీతలస్పర్శగలిగియుండును. మూత్రకృచ్ఛ్రము నందు సుద్దను నీళ్లతో నరుగదీసి పొత్తికడుపుపై లేపనము జేసినచో కొంచెము కాలముననే మూత్రము ధారాళముగా వెడలును. అయితే సుద్ద యనునది యొకవిధమగు మన్ను జాతిలో జేరినది యని దెలియనగును.

హితమగును. పాషాణసంబంధమగు సుద్ద పైగుణములనే గలిగియుండును. మరియు, శీతవీర్యము గలిగి వ్రణమును, రక్తపిత్తమును బోగొట్టును. ఈ గుణములన్నియు వీటి బాహ్యోపయోగమువల్లనే గలుగును. కాని వీటికి ఆభ్యంతరప్రయోగములేదు. దీనిని భక్షించినచో మృత్తికతో సమానముగ నుండును. మొత్తముమీద రెండువిధములగు సుద్దలును సమానగుణములనే గలిగియుండునని తెలియవలెను.

---

# గైరికము

## గైరికనామములు *

శ్లో॥ గైరికం రక్తధాతుశ్చ గైరేయం గిరిజం తథా॥

ఆ-ప్ర.

గైరికము, రక్తధాతువు, గైరేయము, గిరిజము అనునవి గైరిక నామములు.

---

* గైరికభేదములు.—"ద్వివిధం గైరికం ప్రాహుః స్వర్ణం సామాన్యగైరికం। పరైస్తృతీయ మప్యుక్తం పాషాణాఖ్యం హి గైరికం॥ సువర్ణగైరికం రక్తతరం శిష్టంతు రక్తకం। సువర్ణగైరికం శ్రేష్ఠం గైరిక ద్వితయాత్ పరం॥" ఆ-ప్ర.—స్వర్ణగైరికము, సామాన్య గైరికము అని గైరికము రెండు విధములుగా నుండును. అందు స్వర్ణగైరికము మిక్కిలి రక్తవర్ణమును గలిగియుండును. రెండవది సామాన్య రక్తవర్ణమును గలిగియుండును. కొందరు పాషాణ గైరికమను మరొక భేదముగూడా గలదని చెప్పుదురు.

## గైరిక శోధనవిధానము

శ్లో॥ గైరికం కించిదాజ్యేన భృష్టం శుద్ధం ప్రజాయతే॥
ఆ-ప్ర.

కావిరాయిని యొక యినుపబాణలిలో నుంచి యందు కొద్దిగా నెయ్యిజేర్చి నిప్పులపై మంచి భర్జనజేసినచో నయ్యది శుద్ధమగును.

## గైరిక గుణములు *

శ్లో॥ గైరికద్వితయం స్నిగ్ధం మధురం తువరం హిమం।
చక్షుష్యం దాహపిత్తాస్ర కఫ హిక్కా విషాపహం।
అతికండూ హరం చైవ తథా ప్రోక్త ముదర్దనుత్॥
ఆ-ప్ర.

పరిశుద్ధములైన రెండువిధములగు కావిరాళ్లును మధురరసమును, కషాయామరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగియుండును. నేత్రమునకు హితమైనవి. కఫమును శమింపజేయును, దాహమును, రక్తపిత్తమును, హిక్కను, విషమును, అధికకండువును, ఉదర్దమును బోగొట్టును.

---

ఇదియే జేగురురాయి యనబడుచున్నది. దీనితో బట్టలకు వర్ణము వేయుదురు. వీటి యన్నింటిలో సువర్ణగైరికమే శ్రేష్ఠమైనదిగా గుర్తించవలెను.

* పాషాణగైరిక గుణములు—"పాషాణ గైరికం త్వన్యత్ హిక్కాఽలక్ష్మీ విషాపహం॥" ఆ-ప్ర.—పాషాణ గైరికము హిక్కను, అలక్ష్మిని, విషమును బోగొట్టును.

# కాసీసము

## కాసీసనామములు *

శ్లో॥ కాసీసం ధాతుకాసీసం పాంశుకాసీస మిత్యపి ।
తదేవ కించి త్పీతంతు పుష్పకాసీస ముచ్యతే॥ ఆ-ప్ర.

కాసీసము, ధాతుకాసీసము, పాంశుకాసీసము, అనునవి కాసీస నామములు. ఈ కాసీసము కొంచెము పసుపుపచ్చని వర్ణముగలిగి యున్నచో నయ్యది పుష్పకాసీసమని వ్యవహరింపబడును.

## కాసీసశోధనవిధానము *

శ్లో॥ సకృ ద్భృంగాంబునా స్విన్నం కాసీసం నిర్మలంభవేత్॥
ఆ-ప్ర.

కాసీసమును భృంగరాజస్వరసముతో డోలాయంత్రమున పాక విధానము ననుసరించి స్వేదముజేసినచో నయ్యది పరిశుద్ధమగును.

---

* కాసీస భేదములు—ఇది వాలుకా కాసీసము, పుష్ప కాసీసము అని రెండు విధములుగా నుండును. "పుష్పాదికాసీస మతి ప్రశస్తం"॥ ర-ర-స. —పై వానిలో పుష్ప కాసీసము చాల శ్రేష్ఠమైనదిగా దెలియవలెను.

* స్వానుభూత సాంప్రదాయమున (1) శోధన విధానము—కాసీసమును ఖల్వమునందుంచి, మెత్తగా చూర్ణించి యందు జంబీర స్వరసమునుబోసి మూడు యామములు చిక్కగా నూరి యెండలో నెండించిన శుద్ధియగును. మరియు, దీనికి శాస్త్రమునందు భస్మవిధానము జెప్పబడియుండలేదు.

## కాసీసగుణములు *

శ్లో॥ కాసీసద్వయ మమ్లోష్ణం తిక్తంచ తువరం తథా।
వాతశ్లేష్మహరం కేశ్యం నేత్ర్యం కండూ విషవ్రణుత్॥
మూత్రకృచ్ఛ్రాశ్మరీ శ్విత్రనాశనం పరికీర్తితం॥ ఆ-ప్ర.

---

అయినను భస్మగావించియే యిది ప్రయోగింపబడుచున్నది. (2) భస్మవిధానము.—పై విధముగా శుద్ధిజేయబడిన కాసీసమును శరావసంపుటమునందు బంధించి సుమారు ముప్పది పిడకలతో పుటము వేసినయెడల సిందూరమువలె నెర్రగ భస్మయగును. ఇదియ కాసీస భస్మ విధానము.

* ఇందు జెప్పబడిన వ్యాధులలో పై విధముగ భస్మజేసియే యుపయోగింపబడుచున్నది. మరియు, కొందరు దీనిని కుక్క పొగాకు స్వరసముతో నూరి రెండుమూడు పుటములు వేసి జ్వరాది వ్యాధులం దుపయోగించుట కూడ వ్యవహారమునందు గలదు. ఇంతియేగాకుండ కాసీసమునకు ద్విగుణముగా సురాక్షారమును జేర్చి జంబీరస్వరసముతో మూడు యామములు నూరి, యెండించి శరావసంపుటమునందు బంధించి నలుబది (లేక) యేబది పిడకలతో పుటము వేసిన మిక్కిలి యెర్రని భస్మయగును. ఇది మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము, ఉదరము, శోఫమున్నగు వ్యాధులలో నుపయోగించిన మిక్కిలి గుణదాయకముగా నుండును. ఇదియు స్వానుభూతి సాంప్రదాయకముగనే దెలియవలెను.

పరిశుద్ధములైన రెండు విధములగు కాసీసములు అమ్లరసవ తిక్తకషాయానురసములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. శ్లేష్మములను శమింపజేయును. కేశములకును, నేత్రములకును మైనవి. కండువును, విషమును, మూత్రకృచ్ఛ్రమును, అశ్మరిని, శ్వి కుష్ఠమును బోగొట్టును.

## కాసీసప్రయోగవిధానము

శ్లో॥ బలినా హతకాసీసం కాంతం కాసీస మారితం।
ఉభయం సమభాగంహి త్రిఫలా వేల్లసంయుతం॥
విషమాంశ ఘృతక్షౌద్ర ప్లుతం శాణమితం ప్రగే।
సేవితం హన్తి వేగేన శ్విత్రం పాండు క్షయామయ
గుల్మప్లీహ గదం శూలం మూలరోగం విశేషతః।
రసాయన విధానేన సేవితం వత్సరావధి॥
ఆమసంశోషణం శ్రేష్ఠం మందాగ్ని పరిదీపనం।
పలితం వలిభిస్సార్ధం వినాశయతి నిశ్చితం॥ ర-ర-

కాసీసమును గంధకముతో భస్మజేసియు, కాంతలోహమ కాసీసముతో భస్మజేసియు నీ రెండింటిని అనగా కాసీసభస్మను, కా లోహభస్మను సమముగా గ్రహించి అందు త్రిఫలాచూర్ణమును, వా విడంగచూర్ణమును గలుపవలెను. పిమ్మట నీ చూర్ణమునంతను హె తక్కువలుగా గ్రహించిన మధుఘృతములతో లేహ్యమువలె గ యుంచుకొనవలెను. పిమ్మట నందుండి శాణప్రమాణము, అన సుమారు అరతులము చొప్పున ప్రతినిత్యము సేవించుచుండిన శ్వి కుష్ఠము, పాండు, క్షయము, గుల్మము, ప్లీహవృద్ధి, శూల, అర్శః ఈ వ్యాధులు శమించును. మరియు, రసాయనవిధి ననుసరించి రొ

సంవత్సరము సేవించినచో ఆమదోషము శోషించును. జాఠరాగ్ని వృద్ధి బొందును. వలీపలితములు రాకుండును.

## కాసీసయోగములు

### (1) కాసీసాది తైలము

శ్లో॥ కాసీసం లాంగలీ కుష్ఠం శుంఠీ కృష్ణాంచ సైంధవం।
మనశ్శిలాశ్వమారశ్చ విడంగం చిత్రకోవృషః॥
దన్తీ కోశాతబీజం హేమాహ్వో హరితాలకః।
కల్కైః కర్షమితై రేతైః తైలప్రస్థం విపాచయేత్।
సుధార్క పయసీ దద్యాత్ పృథ ద్ద్వి పలసమ్మితే॥
చతుర్గుణంగవాంమూత్రం దత్వాసమ్యక్ ప్రసాధయేత్।
కథితం ఖరనాదేన తైలమర్శో వినాశనం॥
క్షారవత్పాతయత్యేతత్ అర్శాంస్యభ్యంగితో భృశం।
వలిం న దూషయత్యేతత్ క్షారకర్మ కరం స్మృతం॥
శార్ఙ్గ-సం.

అన్నభేది, పొత్తిదుంప, చంగల్వకోష్ఠు, శుంఠి, పిప్పళ్లు, సైంధవ లవణము, మణిశిల, గన్నేరువేరు, వాయువిడంగాలు, చిత్రమూలము, అడ్డసరపువేరు, నాగదన్తిమూలము, చేదుబీరగింజలు, ఉమ్మెత్తగింజలు, తాళకము ఈ ద్రవ్యములను ఒక్కొక్క తులము చొప్పున గ్రహించి కల్కమువలె నూరి యందు ఒక ప్రస్థ పరిమితిని తైలమును జేర్చవలెను. మరియు జెముడుపాలు ఒకపలమును, జిల్లేడుపాలు ఒకపలమును అందు జేర్చవలెను. తైలమునకు నాలుగురెట్లు అనగా నాలుగు ప్రస్థముల పరిమితిని గోమూత్రమును జేర్చి తైలపాకవిధి ననుసరించి తైలమును

సిద్ధము జేయవలెను. ఈ తైలము నర్శ్యాంకురములకు అభ్యంగనము జేయు చుండినయెడల క్షారప్రయోగమువలె గుదాన్తర్గతనళుల కెట్టి దుష్టిని గలిగించకయే యర్శ్యాంకురములను ఛేదించును.

## (2) కాసీసాది ఘృతము

శ్లో॥ కాసీసం ద్వేనిశే ముస్తం హరితాలం మనశ్శిలాం।
కంపిల్లకం గంధకంచ విడంగం గుగ్గులుం తథా॥
సిక్థకం మరిచం కుష్ఠం తుత్థకం గౌర సర్షపాన్।
రసాంజనం చ సిందూరం శ్రీవాసం రక్తచందనం॥
ఇరిమేదం నింబపత్రం కరంజం సారిబాం వచాం।
మంజిష్ఠా మధుకం మాంసీ శిరీషం లోధ్రపద్మకం॥
హరీతకీం ప్రపున్నాటం చూర్ణయేత్ కార్షికాన్ పృథక్।
తతస్త చ్చూర్ణమాలోడ్య త్రింశ త్పలమితే ఘృతే॥
స్థాపయే త్తామ్రపాత్రేచ ఘర్మే సప్తదినాని చ।
అస్యాభ్యంగేన కుష్ఠాని దద్రుపామా విచర్చికాః॥
శూకదోషా విసర్పాశ్చ విస్ఫోటా వాతరక్తజాః।
శిరస్స్ఫోటో పదంశాశ్చ నాడీదుష్ట వ్రణానిచ॥
శోఫో భగందరశ్చైవ లూతా శ్శామ్యన్తి దేహినాం।
శోధనం రోపణంచైవ సవర్ణ కరణం ఘృతం॥

శార్ఙ్గ-సం.

అన్నభేది, పసపు, మానుపసపు, తుంగముస్తలు, తాళకము, మణిశిల, కంపిల్లకము, గంధకము, వాయువిడంగములు, గుగ్గిలము, మైనము, మిరియాలు, చంగల్వకోష్ఠము, మైలతుత్థము, తెల్లావాలు, రసాంజనము, గంగసిందూరము, తెల్లగుగ్గిలము, ఎఱ్ఱచందనము, తుమ్మ

చెక్క, వేపాకులు, గానుగవిత్తులు, సుగంధిపాల, వస, మంజిష్ఠ, యష్టిమధుకము, జటామాంసి, దిరిశెనగింజలు, లొద్దుగపట్ట, పద్మకాష్ఠము, కరక్కాయి, తగిరిశవిత్తులు ఈ ద్రవ్యములను ఒక్కొక్క తులము చొప్పున గ్రహించి మెత్తగా చూర్ణించవలెను. పిమ్మట నొక తామ్రశరావమునందు ముప్పదిపలముల పరిమితిని ఘృతమును బోసి యందు పై చూర్ణమును కలిపి, యీ శరావమును తీవ్రమైన ఎండలో నేడుదినములుంచవలెను. ఇటుల సూర్యతాపముచే పక్వముజేయబడిన ఘృతమును అభ్యంగముజేసినచో కుష్ఠము, దద్రువు, పామ, విచర్చిక, శూకదోషము, విసర్పము, విస్ఫోటము (వాతరక్తజ), అరూంషిక, ఉపదంశము, నాడీవ్రణము, దుష్టవ్రణము, శోఫ, భగందరము, లూతా విషము ఇవి శమించును. వ్రణముల కభ్యంగముజేసినచో శోధనము, రోపణము, సవర్ణీకరణమును అగును.

## (3) రజఃప్రవర్తినీవటి

శ్లో॥ టంకణం హింగుకాసీసం కన్యాసారం సమాంశకం।
కుమారీ స్వరసేనైవ చణకప్రమితా వటీ॥
రజోరోధం కష్టరజో వేదనాశ్చ తదుద్భవాః।
రజః ప్రవర్తినీ నామ వటీతూర్ణం వినాశయేత్॥

అ-విజ్ఞా.

కాసీసభస్మము, శుద్ధిజేసిన వెలిగారము, భర్జితహింగువు, ముసాంబ్రము వీటిని సమభాగములుగ గ్రహించి ఖల్వమునందుంచి కలబంద రసములో జక్కగా మర్దించి శనగగింజంత ప్రమాణమున మాత్రలు జేసి యెండించవలెను. వీటిని ఉష్ణోదకముతోగాని, జీలకర్ర కషాయముతోగాని సేవించినచో స్త్రీలకు ప్రతిమాసమున నేర్పడు ఆర్తవస్రావమునందు శూల, కృచ్ఛ్రస్రావము, రుద్ధస్రావము మున్నగు వికారములు శమించును.

## (4) కాసీసాద్యంజనము

శ్లో॥ సంచూర్ణ్య పుష్పకాసీసం భావయే త్సురసారసైః।
తామ్రే దశాహం పరమం పక్ష్మశాతే తదంజనం॥
అ-హృ-ఉ-అ 9

పుష్పకాసీసమును మెత్తగా చూర్ణించి యొక తామ్రపాత్రలో వేసి అందు తులసియాకు స్వరసమును బోసి యొకరాత్రి యూరబెట్టి మరు నాడు ఎండలో నెండించవలెను. తిరిగి తులసియాకు స్వరసము నందు బోసి రాత్రికాల మూరబెట్టుచు పగటివేళ యెండించుచు నిటుల పది దినములు చేసి బాగుగా నెండినపిమ్మట మెత్తగా చూర్ణించి నేత్రముల కంజనము వేసినచో పక్ష్మశాతమను నేత్రవ్యాధి శమించును.

---

# రసకము

## రసకనామములు *

శ్లో॥ రసకం తుత్థభేదః స్యా త్ఖర్పరంచాపి తత్స్మృతం॥
ఆ-ప్ర.

రసకము, తుత్థభేదము, ఖర్పరము అనునవి రసకనామములు.

---

* రసకభేదములు—ఇది తుత్థభేదశబ్దముచే తుత్థములో నొకభేదముగా దెలియగలదు. ఇదియే పాలతుత్థమని వ్యవహరింపబడుచున్నది. ఇది "నాగార్జునేన సందిష్టౌ రసశ్చ రసకావుభౌ। శ్రేష్ఠౌ సిద్ధరసౌఖ్యాతౌ దేహలోహకరౌ పరౌ॥" మరియు, "రసశ్చ రసకశ్చోభౌ యేనాగ్ని

సహానౌ కృతౌ। దేహలోహమయీ సిద్ధిః దాసీ తస్య న సంశయః॥'' ఆ-ప్ర.—అని చెప్పబడినది. అనగా-శరీరము నకు లోహమునవలె దృఢత్వమును గలిగించుటయందు పాద రసమును, ఖర్పరమును మిగుల ప్రసిద్ధములైనవని నాగా ర్జునిచే గనిపెట్టబడినవి. అందుచే నుపరసములలో ఖర్పర మొక్కటియే శ్రేష్ఠమైనదిగా రసశాస్త్ర ప్రవర్తకుల యభి మతమైయున్నది. మరియు, పారదముతో సమానముగ ఖర్పరమును గూడ నగ్నిని సహించునట్లు జేసినచో నీ రెండింటినల్లను దేహమునకు లోహత్వసిద్ధి తప్పక గలుగునని శ్రీ మాధవాచార్యుడు జెప్పియుండెను. మరియు, ''నర మూత్రే స్థితోమాసం రసకో రంజయేద్ధ్రువం। శుద్ధం తామ్రం రసం తారం శుద్ధం స్వర్ణప్రభంయథా॥'' ఆ-ప్ర.— అని చెప్పబడినది. అనగా - ఖర్పరమును నరమూత్రములో వేసి యొక మాస మూరబెట్టినచో నయ్యది శుద్ధమైన తామ్రపత్రమును, శుద్ధమైన రజత పత్రమును స్వర్ణమువలె రంజింపజేయును. అనగా నీ రెండులోహములను ఖర్పర ముతో జేర్చి సంస్కారము జేసినచో నయ్యవి స్వర్ణధాతువు వలె పరిణమించునని భావము. ఈ ఖర్పరము సత్వము గ్రహింపదగువానిలో నొకటిగా గణింపబడుచున్నది. ''ఖర్ప రో ద్వివిధోజ్ఞేయః దర్దురః కారవేల్లకః। సదలో దర్దురః ప్రోక్తః నిర్దలః కారవేల్లకః॥ సత్వపాతే దర్దురః స్యాదౌ షధే కారవేల్లకః॥'' ఆ-ప్ర.—ఈ ఖర్పరము దర్దురము - కారవేల్లకము అని రెండు విధములుగా నుండును. అందు

## రసకశోధన విధానము

శ్లో॥ నృమూత్రే వాథ గోమూత్రే జలామ్లే వా ససైంధవే।
సప్తాహం త్రిదినంవాపి పక్వః శుద్ధ్యతి ఖర్పరః॥

ఆ-ప్ర.

పాలతుత్థమును డోలాయంత్రమునం దమర్చి అందు నరమూత్ర మునుగాని, గోమూత్రమునుగాని, అమ్లద్రవమునుగాని సైంధవలవణ సహితముగ బోసి యేడుదినములుగాని, మూడుదినములుగాని జాగ్రత్తగా పాకముజేసి శుద్ధోదకముతో కడిగి యెండబెట్టిన నయ్యది పరిశుద్ధమగును.

---

దర్దురభేదము దళసహితముగను, కారవేల్లకము దళ రహితముగను నుండును. దర్దురము సత్వపాతనమునకును, కారవేల్లకము ఔషధార్థమును నుపయోగించును. బజారులో నియ్యది రెండువిధములుగా లభ్యమగుచున్నది. అందు కొంచెము హెచ్చుతక్కువగ జిల్లేడుకాయతో సమానమైన ఆకారము గలిగి, మధ్యను బోలుగానుండి యెఱ్ఱని వర్ణముతో నొకటి లభ్యమగును. రెండవది యవక్షారపు బిళ్లలవలె నుండి తెల్లని వర్ణముతో లభ్యమగును. ఈ రెండు విధములగు తుత్థములలో నేది పైని జెప్పినట్లుగ సదళమో నెయ్యది నిర్దళమో కనుగొనుట కష్టముగనే యుండును. అయినను వైద్యక వ్యవహారమున బజారులో లభించు రెండు విధములగు పాలతుత్థములును గ్రహింపబడుచునే యున్నవి.

## రసకగుణములు *

శ్లో॥ రసకః సర్వమేహఘ్నః కఫపిత్త వినాశనః।
నేత్రరోగ క్షయఘ్నశ్చ లోహ పారద రంజనః॥

ఆ - ప్ర.

యథావతుగ శుద్ధిజేయబడిన పాలతుత్థము కఫపిత్తములను శమింప జేయును. సమస్త ప్రమేహములను, నేత్రరోగములను, క్షయరోగమును బోగొట్టును. ఇది లోహములను, పాదరసమును రంజింపజేయును. మరియు, తంత్రాంతరమున పాలతుత్థము కటురసమును, కషాయానురసమును, క్షార లఘు గుణములను, శీతవీర్యమును గలిగియుండును. వాంతిని

---

* అశోధిత ఖర్పర వికారములు—"అశుద్ధః ఖర్పరః కుర్యాత్ వాంతిం భ్రాంతిం విశేషతః। తస్మాచ్ఛోధ్యః ప్రయత్నేన యావ ద్వాంతి వివర్జితః॥" అ-ప్ర.—పాల తుత్థమును శోధింపక నుపయోగించినచో నయ్యది విశేషముగ వాంతిని, భ్రాంతిని గలిగించును. కావున యీ వికారములు నశించు వరకును దీనిని యథావతుగ శోధించవలెను. మరియు, పైని జెప్పిన గుణములు శోధించిన రసకమువల్లనే యేర్పడునని దెలియవలెను. కొందరు దీనికి భస్మవిధానముగూడ జెప్పియున్నారు. కాని, దీని భస్మప్రయోగ మెందును గానరాదు. ఇందుచేతనే మాధవాచార్యుడు "రసాదిషు శోధయిత్వైవ దేయం॥" ఆ-ప్ర.—అని నిర్దేశించియున్నాడు. అనగా - యోగములందు శోధింపబడినంత మాత్రముననే యియ్యది ప్రయోగార్హత గలిగి యున్నది యని భావము.

గలిగించును. లేఖనము జేయును. మలమును భేదించును. నేత్రములకు హితమగును. విషమును, అశ్మరిని, కుష్ఠమును, కండువును బోగొట్టును అని చెప్పబడినది.

## రసకయోగములు

### (1) లఘుమాలినీవసంతము

శ్లో॥ ఖర్పరం మానుషేమూత్రే స్థితం ఘస్రత్రిసప్తకం।
నిస్త్వక్ తదర్ధమరిచం నవనీతేన మర్దయేత్॥
శతధా భావయే న్నింబు రసైస్స్యా ద్రసకేశ్వరః।
పిప్పలీ మధుయుగ్దత్తః ససితో వాస్య భేషజం॥
జ్వరం ధాతుగతం పిత్తం భ్రమం పిత్తాస్రజాన్ గదాన్
రక్తాతిసారం గ్రహణీం దుర్నామాస్రం నివారయేత్॥
అనమ్లం దధివా దుగ్ధం పథ్యంచాస్మిన్ ప్రయోజయేత్॥

యో-ర.

పాలతుత్థమును నరమూత్రమున నిరువదియొకదినము లూరబెట్టి, పిమ్మట దానిని శుద్ధోదకముతో గడిగి యెండబెట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడిన పాలతుత్థము ఒకభాగము, పైనుండు త్వక్కును తొలగించి గ్రహించిన మిరియాలు అర్ధభాగము, ఈ రెండింటిని ఖల్వమునందు మెత్తగా చూర్ణించి యందు తగుమాత్రముగ అవువెన్నను జేర్చి చక్కగా మర్దించవలెను. పిమ్మట వేపచెక్క కషాయమును కొద్దికొద్దిగా బోయుచు నూరుమార్లు మర్దించవలెను. అనగా మొదట కషాయమును జేర్చి మర్దించగా కొంతకాలమున కయ్యది గట్టిపడును. అప్పుడు తిరిగి కొంచెము కషాయమును జేర్చి గట్టిపడువరకును మర్దించవలెను. ఇటుల నూరుమారులు కషాయమును చేర్చి మర్దించవలెనని భావము. ఇటుల

సిద్ధముజేయుబడిన యౌషధమునుండి రెండు లేక మూడు యవల ప్రమాణము గ్రహించి యందు తగుమాత్రము పిప్పలిచూర్ణమును జేర్చి తేనెతోగాని, చక్కెరతోగాని గలిపి సేవించిన ధాతుగతజ్వరము, పిత్తవికారములు, భ్రమ, రక్తపిత్తము, రక్తాతిసారము, గ్రహణి, రక్తార్శస్సు ఇవి శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు తియ్యని పెరుగునుగాని, పాలనుగాని అహారమునందు జేర్చుకొనవలెను.

## (2) స్వర్ణమాలినీవసంతము

శ్లో॥ స్వర్ణం ముక్తా దరదమరిచం భాగవృద్ధ్యా ప్రదేయం
ఖర్పర్యష్టౌ ప్రథమ నవనీతేన నింబ్వాంబునా చ। యావ
త్స్నేహో వ్రజతివిలయం మర్దయే ద్దీయతేఽసౌగుంజా
ద్వంద్వం మధుచపలయా సర్వరోగే వసంతః ॥

యో-ర.

స్వర్ణభస్మ ఒకభాగము, మౌక్తికభస్మ రెండుభాగములు, శుద్ధిజేసిన యింగిలీకము మూడుభాగములు, మిరియాల చూర్ణము నాలుగు భాగములు, శుద్ధిజేసిన పాలతుత్థము ఎనిమిదిభాగములు ఇటుల గ్రహించి వీనినెల్ల ఖల్వమునందుంచి తొలుత ఆవువెన్నతో జక్కగా నూరవలెను. పిమ్మట కొంచెము కొంచెముగా వేపచెక్క కషాయమును బోయుచు అందలి జిడ్డుపోవువరకును మర్దించవలెను. ఇటుల సిద్ధముజేయబడిన యౌషధమును రెండు గురిగింజల ప్రమాణమున గ్రహించి యందు తగుమాత్రము పిప్పలీచూర్ణమును జేర్చి తేనెతో గలిపి సేవించిన సమస్తమైన వ్యాధులును శమించును. ఇది విశేషముగ జీర్ణజ్వరమునందును, రాజయక్ష్మయందును, విషమజ్వరమునందును ప్రయోగింపబడుచున్నది.

---

# కపర్దిక

## కపర్దికానామములు *

శ్లో॥ కపర్దికా కపర్దీచ వరాటీ చ వరాటికా॥

కపర్దిక, కపర్ది, వరాటి, వరాటిక యనునవి కపర్దికా నామములు.

---

* కపర్దికా భేదములు—"వరాటికా త్రిధాప్రోక్తా శ్వేతాశోణా తధాపరా। పీతా, సాచాతి చక్షుష్యా శ్వేతా శోణా హిమాఽవ్రణా। అసితైః బిందుభిః శ్వేతై ర్లాంఛితా రేఖయాఽథవా॥ బాలగ్రహహారీ నానాకౌతుకేషుచ పూజితా। పీతా గుల్మయుతా పృష్ఠే రసయోగేషు పూజితా॥ సార్ధ నిష్కప్రమాణాఽసా శ్రేష్ఠా యోగేషు యుజ్యతే। నిష్కప్రమాణా మధ్యాసాహీనా పాదోన నిష్కకా॥" ఆ-ప్ర.

గవ్వలు తెలుపు, ఎరుపు, పసపు అను వర్ణ భేదముచే మూడు విధములుగా నుండును. ఇందు తెల్లని గవ్వలు నేత్రములకు హితమైనవి. ఎర్రని గవ్వలు గ్రంథులు లేక యుండి శీతవీర్యమును గలిగియుండును. ఇవి పృష్ఠభాగ మున నల్లని తెల్లని బిందువులచేగాని యాయావర్ణములుగల రేఖలచేగాని వ్యాప్తమైయుండును. బాలగ్రహములను బోగొట్టునవిగా నుండును. ఇవి యనేకవిధములగు నుత్స వములలో గ్రహింపబడుచుండును. అనగా స్త్రీలును పిల్ల లును తమతమ వినోదార్థమై యాడుకొను ఆటలలో పరికర ములుగా గ్రహింపబడుచుండునని భావము. ఇందు పసపు పచ్చని గవ్వలు పృష్ఠభాగమున గ్రంథులను గలిగియుండును.

## కపర్దికాశోధన విధానము *

శ్లో॥ వరాటాః కాంజికే స్విన్నాః యామాచ్ఛుద్ధి మవాప్నుయుః॥ ర-ప్ర.

గవ్వలను డోలాయంత్రమున నఖుర్చి అందు కాంజికమునుబోసి యొకఝాము పాకము జేసి శుద్ధోదకములో కడిగి యెండబెట్టిన యవ్వాని పరిశుద్ధములగును.

---

ఇవియే రసౌషధములందు జేర్చబడును. మరియు, ఔషధార్థమై గ్రహింపబడు గవ్వలలో నొక్కొక్కటి సుమారు అరువదియెనిమిది గ్రైనుల బరువుగలిగినట్టివి శ్రేష్ఠమైనవి, నలుబదియైదు గ్రైనుల బరువుగలిగినట్టివి మధ్యమములుగా నుండును. ముప్పది గ్రైనుల బరువుగలిగినట్టివి హీనమైనవిగా నుండును. కావున ఈ ప్రమాణము ననుసరించి శ్రేష్ఠమైనవాటినే గ్రహింపవలెను.

* స్వానుభూత సాంప్రదాయమున కపర్దికా శోధన విధానము.—ఒక శరావమునందు గవ్వలనుంచి యవి మునుగునంత పరిమితిని జంబీర స్వరసమునుబోసి యొక గంట కాల ముంచినచో నందు బాగుగా పొంగువచ్చి చల్లారిపోవును. పిమ్మట వాటిని ఉష్ణోదకముతో గడిగి యెండబెట్టవలెను.

## కపర్దికాభస్మవిధానము *

శ్లో॥ అంగారాగ్నౌ స్థితాధ్మాతౌసమ్యక్ ప్రోత్ఫుల్లితాయదా।
స్వాంగశీతా మృతా సాతు పిష్ట్వా సమ్యక్ ప్రయోజ
యేత్॥ ఆ-ప్ర.

శుద్ధిజేయబడిన గవ్వలను బొగ్గునిప్పలపై నుంచి బాగుగా నూద
వలెను. అవి కొంతకాలమునకు పొంగి విడిపోవును. అప్పుడు వాటిని
జాగ్రత్తగా నిప్పలమీదనుండి దీసి చల్లార్చి మెత్తగా ఖల్వమునందు
చూర్ణించి యుపయోగించుకొనవలెను.

## కపర్దికాభస్మగుణములు

శ్లో॥ కపర్దికా హిమా నేత్రహితా స్ఫోట క్షయాపహా। కర్ణ
స్రావాగ్నిమాంద్యఘ్నీ పిత్తాస్ర కఫనాశినీ॥ ఆ-ప్ర.

గవ్వలభస్మము శీతవీర్యమును గలిగియుండును. నేత్రములకు హిత
మైనది. పిత్త రక్త కఫ వికారములను శమింపజేయును. విస్ఫోటమును,
క్షయను, కర్ణస్రావమును, అగ్నిమాంద్యమును బోగొట్టును. మరియు,

---

* స్వానుభూత సాంప్రదాయమున కపర్దికాభస్మ
విధానము—శుద్ధిజేయబడిన గవ్వలను ½ వీశె పరిమితిని
గ్రహించి, వీటిని శరావ సంపుటమున బంధించి సుమారు
ఏబది పిడకలతో పుటమువేయవలెను. స్వాంగశీతలమున
వాటిని గ్రహించి, ఖల్వమున మెత్తగా చూర్ణించి, జంబీర
స్వరసముతో జక్కగా మర్దించి చక్రికలుజేసి యెండించ
వలెను. పిమ్మట పైవిధముగానే పుటమువేసిన తెల్లని భస్మ
యగును.

విది కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండు ననియు, వాతమును శమింపజేయుననియు, శూల, పరిణామశూల, గ్రహణి వీటిని బోగొట్టుననియు గ్రంథాంతరమున జెప్పబడినది.

## కపర్దికా యోగములు

### (1) శూలగజకేసరీరసము

శ్లో॥ శూరంకపర్దా ద్విషసైంధవౌ చ వ్యోషంచ సమ్మర్ద్య భుజంగవల్ల్యాః। రసేన గుంజాప్రమితః ప్రదిష్టః సమీరశూలేభహారిః ప్రచండః॥ యో-ర.

గవ్వలభస్మము, శుద్ధవత్సనాభి, సైంధవలవణము, త్రికటుకములు వీనినెల్ల సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి, ఖల్వమునందుంచి, తమలపాకులరసముతో జక్కగా మర్దించి గురుగింజ ప్రమాణమున మాత్రలను జేయవలెను. వీటిని యుష్ణోదకముతో సేవించిన వాతజశూల శమించును.

### (2) లోకనాథరసము

శ్లో॥ వరాటతుల్యం మందూరం తదర్ధం తీక్ష్ణలోహకం।
తత్పాదాంశం మృతంసూతం సూత ద్విగుణగంధకం॥
ఖల్వోదరే వినిక్షిప్య మర్దయే ద్దివస త్రయం।
వర్షాభూమూల సారేణ వజ్రవల్లీ రసేనచ॥
వాసా పాతలకే నాపి చిత్రమూలేన మర్దయేత్।
గోళకం చాతపే శోష్యం దినాంతే తు వినిక్షిపేత్॥
శరావేణచ మృద్వగ్నౌ కుక్కుటే పుటవ ద్భవేత్।
సూక్ష్మచూర్ణం తతః కృత్వా తత్సమం మారిచంరజః॥

భావనానంతరం ద్రవ్యం నాగవల్లీ రసార్ద్రికం।
భృంగరాజంచ నిర్గుండీ ముండీ శిగ్రు రసస్తథా॥
త్రిఫలాయా రసేనాథ ఛాయాశుష్కంతు కారయేత్।
నిష్కార్ధంమధునా లేహ్యంయామేయామేచ భక్షయేత్।
క్షయంక్షయకృశంవ్యాధీన్ వాతపిత్త కఫోద్భవాన్।
కాసశ్వాస ప్రతిశ్యాయ శోఫపాండు గదాదికాన్॥
హలీమకం చాస్థిగతం వినిహన్తి చ సత్వరం।
దీపనం వీర్యవృద్ధించ కారయే న్నాత్రసంశయః।
లోకనాథ రసోనామ శంభునా పరికీర్తితః॥ బ-రా.

గవ్వలభస్మము ఒకభాగము, మండూరభస్మ మొకభాగము, లోహభస్మ అర్ధభాగము, యథోక్తవిధానమున పాకముజేయబడిన రససిందూరము నాలవభాగము, శుద్ధిజేయబడిన గంధక మర్ధభాగము ఇటుల గ్రహించి ఖల్వమునందు వీటినన్నిటిని కలియచూరి గలిజేరువేళ్ల రసముతోను, నల్లేరు రసముతోను, అడ్డసరపాకు రసముతోను, సంబరేణురసముతోను, చిత్రమూలరసముతోను ప్రత్యేకముగ మూడు మూడు దినములు చొప్పున మర్దించవలెను. పిమ్మట దానినొక గోళముగాజేసి యెండించి, శరావసంపుటమునందు బంధించి కుక్కుటపుటముచే పాకముజేయవలెను. స్వాంగశీతలమున నౌషధమును గ్రహించి మెత్తగా చూర్ణించవలెను. ఇందు మిరియాలచూర్ణమును ఈ యౌషధము యొక్క పరిమితికి సమముగా నుండునట్లు జేర్చి తమలపాకురసముతోను, అల్లపురసముతోను, గుంటకలగరాకు రసముతోను, వావిలాకు రసముతోను, బోడతరపు రసముతోను, మునగచెక్క రసముతోను, త్రిఫలా కషాయముతోను ప్రత్యేకముగా మూడు మూడు దినములు చొప్పున మర్దించి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది లోకనాథరసమని చెప్పబడును. దీనిని అర్ధనిష్క ప్రమాణమున తేనెతో

గలిపి సేవించినయెడల రాజయక్ష్మ, క్షయముచే గలిగిన కార్శ్యము, వాతపిత్త కఫజనితములైన కాసములు, శ్వాసలు, ప్రతిశ్యాయము, శోఫ, పాండు, హలీమకము మున్నగువ్యాధులు, అస్థిగతజ్వరము ఇయ్యవి శమించును. మరియు, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వీర్యవృద్ధిని గలుగజేయును.

---

# సికత

## సికతా నామములు *

శ్లో॥ వాలుకా సికతాప్రోక్తా శర్కరా రేతికాపిచ॥ ఆ-ప్ర.

వాలుక, సికత, శర్కర, రేతిక యనునవి సికతానామములు.

---

* ఇసుక సన్నముగను, ముతకగను రెండు విధములుగ లభ్యమగును. ఇది గంధకాది జారణక్రియకు ముఖ్యమైన ద్రవ్యముగా గ్రహించబడుచున్నది. దీనికి వైద్యకమునందు బాహ్యప్రయోగమేగాని యాభ్యంతర ప్రయోగము గానరాదు. అందును స్వేదకర్మకు మాత్రమే గ్రహింపబడుచున్నది. "ఖర్పరభ్రష్టపటస్థిత కాంజిక సంసిక్త వాలుకాస్వేదః। శమయతి వాత కఫామయ మస్తక శూలాంగభేదాదీన్॥" యో-ర.— ఇసుకను శరావమునందు భర్జనజేసి గుడ్డలో మూటగట్టి, యామూటను కాంజికమునందు ముంచి పిమ్మట దీనితో స్వేదముజేసిన వాతకఫజ జ్వరమునందు గలుగు శిరశ్శూల, అంగభేదము మున్నగునవి శమించును అని యిట్లు దీనికి స్వేదకర్మ

## సికతా గుణములు

శ్లో॥ వాలుకా మధురా శీతా సంతాప శ్రమనాశినీ।
స్వేద ప్రయోగతశ్చైవ శాఖాశైత్యానిలాపహా॥
తద్వచ్చ లేఖనీ ప్రోక్తా వ్రణోరః క్షత నాశినీ॥ ఆ-ప్ర:

ఇసుక మధురరసమును, శీతవీర్యమును గలిగియుండును. తాపమును, శ్రమను బోగొట్టును. దీనితో స్వేదకర్మ జేసినయెడల హస్త పాదములందేర్పడు శైత్యము, వాతవికారములును శమించును. మరియు, లేఖనమగును. వ్రణమును, ఉరఃక్షతమును బోగొట్టును.

---

# బోలము

## బోల నామములు

శ్లో॥ బోల గంధరస ప్రాణ పిండ గోపరసాః సమాః॥ ఆ-ప్ర.

బోలము, గంధరసము, ప్రాణము, పిండము, గోపరసము అనునవి బోల నామములు.

---

యందు ప్రయోగమును దెలియనగును. మరియు, ఇసుకయందు లోహము మిళితమైయుండునని తెలియగలదు. "శర్కరాభ్యశ్చుంబకేన కేచి ద్గృహ్ణంత్యయో రజః। సుకరం త్విద మాఖ్యాతం తచ్చ సంశోధ్య మారయేత్॥" ఆ-ప్ర.—ఇసుకయందు లగ్నమైయున్న లోహమును చుంబక (కాంతలోహ) సహాయమున గ్రహించి శోధన మారణములుజేసి యుపయోగించుకొననగును.

## బోల గుణములు *

శ్లో॥ బోలం రక్తహరం శీతం మేధ్యం దీపన పాచనం।
మధురం కటుకం తిక్తం గ్రహాస్వేద త్రిదోషనుత్॥
ఆ-ప్ర.

బాలింతబోలు మధురరసమును, కటుతిక్తానురసములను, శీతవీర్యమును గలిగియుండును. మేధాశక్తిని వృద్ధిబొందించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. త్రిదోషములను శమింపజేయును. రక్తమును హరించును (రక్తస్రావమును ఆపును). గ్రహదోషమును, స్వేదమును బోగొట్టును.

---

* బోల భేదములు—గుణ భేదములు.—"బోలంతు త్రివిధం ప్రోక్తం రక్తం శ్యామం మనుష్యజం॥" ఆ-ప్ర.—రక్తబోలము, శ్యామబోలము, మనుష్యబోలము అని బాలింతబోలు మూడు విధములుగా నుండును. రక్త బోల గుణములు—"జరాపస్మార కుష్ఠఘ్నం గర్భాశయ విశోధనం। చక్షుష్యంచ సరంప్రోక్తం రక్తబోలం భిషగ్వరైః॥ ఆ-ప్ర.—ఇది సరగుణమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. గర్భాశయమును శోధించును. ముసలితనమును, అపస్మారమును బోగొట్టును. శ్యామబోల గుణములు—"శ్యామబోలం తీక్ష్ణగంధం దద్రుకండూ విషాపహం। కుష్ఠాపస్మార బ్రధ్నార్శో రక్త గ్రంధించ నాశయేత్॥" ఆ-ప్ర.—ఇది తీక్ష్ణమైన గంధమును గలిగియుండును (ఘాటుగానుండును). దద్రువును, కండువును, విషమును, కుష్ఠమును, అపస్మారమును, బ్రధ్నము (ఆండ

## బోల యోగములు

### (1) బోలబద్ధరసము

శ్లో॥ రసభస్మ విషం తుల్యం గంధకం ద్విగుణం మతం।
బోలతాలక బాహ్లీక కర్కోటీ మాక్షికం నిశా॥
కంటకారీ యవక్షారం లాంగలీ క్షారసైంధవం।
మధూకసారం సంచూర్ణ్య సప్తాహం చార్ద్రికద్రవైః
గుటికాం బదరాకారాం శ్లేష్మకాసాప నుత్తమే।
భక్షయే ద్బోలబద్ధోయం రసః సశ్వాసపాండునుత్॥
ర-ర-స.

---

వృద్ధి)ను, అర్శస్సును, రక్తజ గ్రంథిని బోగొట్టును మానుషబోల గుణములు.—"అపరం మానుషం బోలం సద్యో వ్రణ విషాపహం। భగ్నాస్థి సంధి జననం త్రిదోష శమనం హిమం॥ ధాతుకాంతి వయస్థైర్య బలౌజో వృద్ధికారకం। ప్రమేహ కుష్ఠపిటికా సర్వవ్రణ విషాపహం॥" ఆ-ప్ర.—ఇది శీతవీర్యమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. రసాది సప్తధాతువులను, కాంతిని, వయస్సును, బలమును, ఓజస్సును వృద్ధిజేయును. విరిగిన ఎముకలకు సంధానము జేయును. ప్రమేహ పిటిక, కుష్ఠవ్రణము, సామాన్యవ్రణము, విషము వీటిని బోగొట్టును. ఇటుల బాలింతబోలు మూడు విధములుగా వర్ణింపబడినది. కాని దీని వివరము తెచ్చుటను గానరాదు. గర్భిణీస్త్రీకి ఆర్తవము కనుపించినచో బాలింతబోలును ప్రయోగించుట వ్యవహారమునందు గానుపించుచున్నది.

రసభస్మ (లేక) రససిందూరము ఒకభాగము, శుద్ధిజేసిన వత్స నాభి యొకభాగము, శుద్ధిజేసిన గంధకము రెండుభాగములు, చాలింత బోలు, శుద్ధిజేసిన తాళకము, కుంకుమపువ్వు, కర్కాటకశృంగి, స్వర్ణ మాక్షికభస్మ, కుసుపు, వాకుడువేరు, యవక్షారము, ప్రత్తిగుంపక్షారము, సైంధవలవణము, ఇప్పసారము ఇవి యొక్కొక్కభాగము ఇట్లు వీని నెల్ల గ్రహించి ఖల్వమునందుంచి, మెత్తగా చూర్ణించి యల్లపురస ముతో నేడుదినములు చక్కగా మర్దించి రేగుగింజంత పరిమితిని మాత్రలుజేసి యెండించవలెను. ఇట్లు సిద్ధము జేయబడినట్టిది బోలబద్ధ రసమని వ్యవహరింపబడును. దీనిని సేవించినయెడల కఫజకాస, శ్వాస, సాంండువు శమించును.

## (2) బోల పర్పటి

శ్లో॥ సూతగంధకసుకజ్జలికాయాః పర్పటీ సమయుతా సమ
భాగం। బోలచూర్ణ విహితం ప్రతివాప్యం స్యాద్రసోఽ
యం సుసృగామయహారీ॥ వల్లయుగ్మ యుగలం ప్రతి
దేయం శర్కరా మధుయుతః కిలదత్తః। రక్తపిత్త
గుదజస్రుతి యోనిస్రావ మాశు వినివారయ తీశః॥
యో-ర.

శుద్ధిజేసిన పాదరసము ఒకభాగము, శుద్ధిజేసిన గంధక మొక భాగము ఇట్లు వీనిని గ్రహించి, ఖల్వమునందుంచి చక్కని కజ్జలి జేయవలెను. పిమ్మట నీకజ్జలిని యొక యినుపగరిటెయందుంచి యగ్ని సహాయమున బాగుగా ద్రవించునట్లు జేయవలెను. చాలింతబోలును పైకజ్జలితో సమానముగ గ్రహించి మెత్తగా చూర్ణించి దీనిని పైని ద్రవీభూతమైన యౌషధమునందు ప్రతీవాపముజేసి, చక్కగా కలియ బెట్టి గోమయాచ్ఛాదిత కదళీదళముపై యీ ద్రవమును వంపుకొని

తిరిగి కదళీదళమును దానిపై పరచి గోమయముచే గప్పవలెను. స్వాంగ శీతలమున పైనుండు గోమయాదులను దొలగించి యందు పర్పటివలె నుండు యౌషధమును గ్రహించుకొనవలెను. ఇది బోలపర్పటి యని చెప్పబడును. దీనిని నాలుగు వల్లములయెత్తు చక్కెరతోగాని, తేనెతో గాని సేవించినయెడల రక్తవ్యాధులు శమించును. అనగా రక్తపిత్తము, రక్తార్శస్సు, రక్తప్రదరము మున్నగునవి శమించును అని భావము.

---

# కంకుష్ఠము

## కంకుష్ఠ నామములు *

శ్లో॥ కంకుష్ఠం కాకకుష్ఠంచ వరాంగం కోలవాలుకం॥

ఆ-ప్ర.

కంకుష్ఠము, కాకకుష్ఠము, వరాంగము, కోలవాలుకము అనునవి కంకుష్ఠనామములు.

---

* కంకుష్ఠ భేదములు.—"హిమాచలైక దేశే తు కంకుష్ఠ ముపజాయతే। తత్రైకం నలికాఖ్యం స్యా దన్య ద్రేణుక నామకం॥ పీతప్రభం గురుస్నిగ్ధం కంకుష్ఠం శిలయా సమం। మృ ద్వతీవ శలాకాభం సచ్ఛిద్రం నలికాభిధం॥ రేణుకాఖ్యంతు కంకుష్ఠం శ్యామపీత రజోన్వితం।త్యక్త సత్వం లఘుప్రాయః పూర్వస్మా ద్ధీనవీర్యకం॥" ఆ-ప్ర.—కంకుష్ఠమను ద్రవ్యము శిలారూపమున హిమవత్పర్వతమున నుత్పన్నమగును. ఇయ్యది నలికయని, రేణుకమని రెండు విధములుగ లభ్యమగును. అందు పసపుపచ్చని వర్ణము

గలిగి బరువుగను, స్నిగ్ధముగను, మిక్కిలి మృదువుగను, శలాకతో సనముగను, ఛిద్రములతో గూడినదిగను నుండు నట్టిది నలికా కంకుష్ఠము. రేణుకమను కంకుష్ఠము శ్యామ వర్ణమును పీతవర్ణమునుగలిగి రజస్సుతో గూడియుండును. మరియు నిది సత్వములేనిదై తేలికగానుండును. ఇది పై దానికంటె హీనమైన వీర్యముగలిగియుండును. ఇందు కొందరి మతములో, "సద్యోజాతస్య కరిణః శకృత్కంకుష్ఠ ముచ్యతే। యద్వా సద్యః ప్రసూతస్య వాజిబాలస్య విట్స్మృతం॥ నాలంవా వాజిబాలస్య॥" ఆ-ప్ర.—అని చెప్ప బడుచున్నది. అనగా - అప్పుడే పుట్టిన యేనుగుపిల్ల విడిచిన మలమని కొందరును, అప్పుడే పుట్టిన గుఱ్ఱపుపిల్ల విడిచిన మలమని మరికొందరును, అప్పుడేపుట్టిన గుఱ్ఱపుపిల్లయొక్క నాభి నాళమని మరికొందరును కంకుష్ఠముగా జెప్పుచున్నారు. కాని, మాధవాచార్యుడు "ఇత్యేవం కంకుష్ఠకే భ్రమః॥" ఆ-ప్ర.—అని చెప్పియున్నాడు. అనగా పైని చెప్పిన మత భేదములన్నియు కంకుష్ఠమునందు భ్రమప్రదములని భావము. కావున దీనినిబట్టి కంకుష్ఠమను ద్రవ్యము కేవలము శిలా స్వరూపముననే యుండునుగాని దన్తిబాలాది మలరూపమున నుండదని తెలియనగును. మరియు, "సత్వాకర్షోఽస్య నప్రోక్తో యస్మాత్సత్వమయం హితత్"॥ ర-ర-స.—అని చెప్పబడుటచే నిది కేవలము సత్వస్వరూపముననే యుండును గాన దీనినుండి తిరిగి సత్వమును గ్రహింపనవసరము లేదని తెలియగలదు. మరియు, "భజేదేనం విరేకార్థం గ్రాహి

## కంకుష్ఠ శోధనవిధానము

శ్లో॥ శుంఠ్యంబుభావితం శుద్ధిం కంకుష్ఠ ముపగచ్ఛతి॥ఆ-ప్ర.

కంకుష్ఠమును శుంఠీకషాయమున పలుమార్లు భావనజేసిన యయ్యది పరిశుద్ధమగును.

---

భిర్యవమాత్రయా। నాశయే దామజా_ర్తించ విరేచ్యక్షణ మాత్రతః॥'' ర-ర-స.—అని చెప్పుటంబట్టి యిది కేవలము విరేచనము కొఱకే సేవింపదగినదిగా నుండునని దెలియ గలదు. అందును ఇయ్యది మిక్కిలి తీక్ష్ణ విరేచనకారి యగుటచే సంగ్రాహక ద్రవ్యములతో జేర్చి యొక యవ పరిమితినే సేవింపదగియుండును. ఇటుల జేసినచో కావలసి నంత పరిమితిని దోషమును శోధించి ఆమాజీర్ణమును బోగొట్టును. మరియు, ''భక్షితః సహతాంబూలై ర్విరిచ్య అశూన్ వినాశయేత్॥'' ర-ర-స.—దీనిని విరేచనార్థమై తాంబూలముతో జేర్చి సేవించినచో నియ్యది హెచ్చుగా విరేచనములను జేయించి తద్వారా ప్రాణహానిని గూడా గలిగించునని చెప్పబడినది. కావున విరేచనార్థమై సేవించు నప్పుడు సంగ్రాహక ద్రవ్యములతో జేర్చి సేవించుట హిత మగును. ఒకవేళ నియ్యది హెచ్చు విరేచనములను గలి గించుచున్నయెడల తద్దోషశాంతికై ''బబ్బూల మూలికా క్వాథం జీర సౌభాగ్యకం సమం। కంకుష్ఠ విషనాశాయభూ యోభూయః పిబేన్నరః॥'' ఆ-ప్ర.—జీలకర్ర చూర్ణమును, భ్రష్టటంకణ చూర్ణమును సమాంశములుగ గ్రహించి తుమ్మవేరు కషాయముతో పలుమార్లు సేవించవలెను.

## కంకుష్ఠ గుణములు

శ్లో॥ కంకుష్ఠం రేచనం తిక్తం కటూష్ణం వర్ణకారకం।
కృమిశోషోదరాధ్మాన గుల్మానాహ కఫాపహం॥

ఆ-ప్ర.

శుద్ధిజేయబడిన కంకుష్ఠము తిక్తరసమును, కటుకొనురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దోషములను శోధించును. వర్ణమును గలిగించును. కఫమును శమింపజేయును. కృమిరోగము, రాజయక్ష్మ, ఉదరము, ఆధ్మానము, గుల్మము, ఆనాహము ఈ వ్యాధులను బోగొట్టును.

---

# సౌరాష్ట్రి

## సౌరాష్ట్రి నామములు

శ్లో॥ సౌరాష్ట్రీ తువరీ కాంక్షీ మృత్తాలక సురాష్ట్రజే।
ఆఢకీ సాపిచఖ్యాతా మృత్స్నాచ సురమృత్తికా॥

ఆ-ప్ర.

సౌరాష్ట్రి, తువరి, కాంక్షి, మృత్తాలకము, సురాష్ట్రజము, ఆఢకి, మృత్స్న, సురమృత్తిక యనునవి సౌరాష్ట్రి నామములు.

## సౌరాష్ట్రి గుణములు *

శ్లో॥ స్ఫటికాయా గుణాః సర్వే సౌరాష్ట్ర్యామపికీర్తితాః॥

ఆ-ప్ర.

---

* సౌరాష్ట్రమృత్తిక పటికయొక్క గుణములనే గలిగి యుండునని చెప్పబడుటవల్ల నీ రెండింటికిని యభేదత్వ

పటికకు జెప్పబడిన గుణములన్నియు సౌరాష్ట్రిమృత్తికకుగూడ నుండును. (కషాయరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. వాతపిత్త కఫజ వ్రణములను శమింపజేయును. శ్విత్రకుష్ఠమును, విసర్పమును బోగొట్టును. యోనిని సంకోచింపజేయును.)

---

# పరిశిష్ట - ఉపరసములు *

## సముద్రఫేనము

### సముద్రఫేన నామములు

శ్లో॥ అబ్ధిఫేనోఽబ్ధిసారః స్యా దబ్ధిజశ్చ సముద్రజః ఆ-ప్ర.

అబ్ధిఫేనము, అబ్ధిసారము, అబ్ధిజము, సముద్రజము అనునవి సముద్రఫేన నామములు.

---

మున్నట్లు తెలియగలదు. అయినను సౌరాష్ట్రిమృత్తిక మృత్తికాశబ్దముచే మృత్స్వరూపమున నుండుననియు, పటిక గడ్డవలె నుండుననియు గ్రహింపవలసియున్నది. పైని జెప్పిన యభేదత్వముచేతనే యియ్యది, "తస్మా త్పరస్పరాభావే ప్రయోజ్యాన్యతరాబుధైః॥" ఆ-ప్ర.--అనుటవల్ల స్ఫటికా భావమున సౌరాష్ట్రిమృత్తికయు దీని యభావమున స్ఫటికయు నన్యోన్యప్రయోగార్హతలను గలిగియుండునని స్పష్టము చేయబడినది.

* ఇంతవరకు తొలుత నిర్దేశించిన ప్రకారము గంధకాద్యుపరసములెల్ల వివరింపబడినవి. సముద్రఫేనము, క్షుద్రశంఖము, శుక్తి, జలశుక్తి, కృష్ణమృత్తిక, పంకము, కంపిల్లము, గౌరీపాషాణము, నవసారము, అగ్నిజారము,

## సముద్రఫేన శోధనవిధానము *

శ్లో॥ సముద్ర ఫేనః సంపిష్టో నింబుతోయేన శుధ్యతి॥ ఆ-ప్ర.

సముద్రఫేనమును ఖల్వమునందు మెత్తగా చూర్ణించి జంబీర స్వరసముతో జక్కగా మర్దించి యెండించిన యయ్యది పరిశుద్ధమగును.

## సముద్రఫేన గుణములు

శ్లో॥ సముద్ర ఫేన శ్చక్షుష్యో లేఖనః శీతలః సరః।
కర్ణస్రావ రుజాగ్రంథి హరః పాచన దీపనః॥ ఆ-ప్ర.

---

బోదారశృంగము అను నీ ద్రవ్యములుగూడ నుపరసములుగా గ్రహింపబడినట్లు గ్రంథాంతరములందు గానబడుచున్నది. కావున నివిగూడ నీ ప్రకరణమునందు పై వానితోబాటు వివరింపబడుచున్నవి.

* సముద్రఫేనమను ద్రవ్యము విశేషముగా లేఖన క్రియకై ప్రయోగింపబడుచున్నది. శస్త్రచికిత్సా ప్రవర్తకులగు సుశ్రుతాదులు తమతమ యుపకరణ ప్రకరణములందు సముద్రఫేనము నొక యుపశస్త్రముగా బేర్కొని యున్నారు. మరియు, నిది వారి నేత్రచికిత్సా ప్రకరణమున విశేషముగా బ్రయోగింపబడినది. "అశుద్ధః సకరోత్యంగ భంగం తస్మా ద్విశోధయేత్॥" ఆ-ప్ర.—అని చెప్పబడుటచే సముద్రఫేనమును శుద్ధిజేయక ప్రయోగించి నచో నంగభంగము గలిగించును గాన యథావతుగ దీనిని శోధించియే యుపయోగించవలెను.

శుద్ధిజేయబడిన సముద్రఫేనము, సరగుణమును, శీతవీర్యమును కలిగియుండును. నేత్రములకు హితమైనది. లేఖనము జేయును. అన్నమును పచింపజేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కర్ణస్రావము, కర్ణశూల, కర్ణగ్రంధి మున్నగు కర్ణవ్యాధులను బోగొట్టును.

## సముద్రఫేన యోగములు

### (1) సముద్రఫేనాదివర్తి

శ్లో॥ సముద్రఫేనః దక్షాండత్వక్ సింధూత్థైః సమాక్షికైః।
శిగ్రుబీజయుతైర్వర్తిః శుక్రఘ్ని శిగ్రువారిణా॥
భై-ర.

సముద్రఫేనము, కోడిగ్రుడ్డుయొక్క కపాలము, సైంధవలవణము, స్వర్ణమాక్షికము, మునగవిత్తులు వీనిని సమాంశములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి, ఖల్వమునందుంచి మునగచిగుళ్ల స్వరసముతో జక్కగా మర్దించి సన్నని వర్తులుగా జేసి నీడ నారించవలెను. పిమ్మట యీ వర్తిని జలముతో నరుగదీసి నేత్రముల కంజనము వేసిన శుక్రరోగము శమించును.

### (2) అర్జునహరాంజనము

శ్లో॥ సిత యార్ణవఫేనోవా పృథ గంజన మర్జునే॥ అ-ప్ర.

చక్కెరను, సముద్రఫేన చూర్ణమును సమాంశములుగ గ్రహించి, ఖల్వమునందుంచి మెత్తగా రసక్రియవలె నూరి నేత్రముల కంజనము వేసిన అర్జునమను నేత్రవ్యాధి శమించును.

### (3) సముద్రఫేనాది చూర్ణాంజనము

శ్లో॥ సముద్రఫేనం లవణోత్తమంచ శంఖోఽథ ముద్గో
మరిచం చ శుక్లం। చూర్ణాంజనం జాడ్య మథాపి కండూ
మక్లిన్న వర్త్మా న్యపహన్తి శీఘ్రం॥ సు-ఉ-అ 12.

సముద్రఫేనము, సైంధవలవణము, శంఖము, పెసలు, తెల్లమిరియాలు వీనిని సమాంశములుగ గ్రహించి ఖల్వమునందుంచి మెత్తని చూర్ణమువలె నూరి నేత్రముల కంజనము వేసిన నేత్రములందు గలుగు జడత్వము, కండు, అక్లిన్నవర్త్మ యను వర్త్మరోగమును శీఘ్రముగ శమించును.

---

## క్షుద్రశంఖము

### క్షుద్రశంఖ నామములు

శ్లో॥ క్షుద్రశంఖాః శంఖనకాః శంబూకా జలశుక్తయః।
ఆ-ప్ర.

క్షుద్రశంఖము, శంఖనకము, శంబూకము, జలశుక్తి యనునవి క్షుద్రశంఖనామములు.

### క్షుద్రశంఖ గుణములు *

శ్లో॥ శంబూకః శీతలో నేత్రరు జాస్ఫోట వినాశనః।

---

* "అస్యశుద్ధిః మహాశంఖ వద్బోధ్యా" ఆ-ప్ర.— అని చెప్పబడుటచే దీనికి శోధనము మహాశంఖమునకువలెనే చేయనగును.

శీతజ్వరహరః తీక్ష్ణో గ్రాహీ దీపన పాచనః॥
గ్రహణీ రోగహన్తాచ రక్తాతీసార నాశనః॥ ఆ-ప్ర.

నత్తగుల్ల తీక్ష్ణగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలాదుల నడ్డుపెట్టును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. నేత్రరోగము, విస్ఫోటము, శీతజ్వరము, గ్రహణి, రక్తాతిసారము వీటిని బోగొట్టును.

## క్షుద్రశంఖ యోగములు

### (1) శంబూక తైలము

శ్లో॥ శంబూకస్యతు మాంసేన కటుతైలం విపాచయేత్।
తస్య పూరణమాత్రేణ కర్ణనాడీ ప్రశామ్యతి॥
యో-ర.

నత్తగుల్లలోని మాంస మొకభాగము, ఆవనూనె నాలుగుభాగములు, జలము పదహారుభాగములు ఇటుల గ్రహించి, మాంసమును కల్కమువలె నూరి తైలమునందు జేర్చి తైలపాకవిధానమున పాకము జేసి యీ తైలములో కర్ణపూరణము జేసిన కర్ణనాడీవ్రణము శమించును.

### (2) శంబూకాది చూర్ణము

శ్లో॥ శంబూకం త్ర్యూషణం పంచలవణాని మృతాయసం।
సమాంశం పేషయేన్మూత్రైః కృష్ణాజస్య దినావధి॥
భక్షయే త్కర్షమాత్రంతు పరిణామాఖ్య శూలజిత్॥
ర-ర-స.

శుద్ధిజేసిన నత్తగుల్లలను మహాశంఖములవలెనే పుటము వేసి భస్మము సిద్ధముజేయవలెను. ఈ భస్మము ఒకభాగము, శుంఠిచూర్ణ మొకభాగము, పిప్పలిచూర్ణ మొకభాగము, మిరియాలచూర్ణ మొక

భాగము, బిడాలవణ మొకభాగము, సైంధవలవణ మొకభాగము, సాముద్రలవణ మొకభాగము, కౌచలవణ మొకభాగము, సౌవర్చలవణ మొకభాగము, లోహభస్మ మొకభాగము ఇటుల గ్రహించి ఖల్వము నంగుంచి నల్లమేక మూత్రముతో నొకదినము చక్కగా మర్దించి యెండించవలెను. పిమ్మట మెత్తగా చూర్ణమువలె నూరి యొకతులము పరిమితిని వేడినీళ్లతో గాని, ఘృతముతో గాని సేవించిన పరిణామశూల శమించును.

---

# శుక్తి

## శుక్తి నామములు

శ్లో॥ శుక్తి ర్ముక్తాప్రసూశ్చైవ మహాశుక్తి శ్చశుక్తికా।
ముక్తాస్ఫోటోఽబ్ధి మండూకీ మౌక్తికప్రసవా చసా॥
జ్ఞేయా మౌక్తికసూ ర్ముక్తామాతా మౌక్తికమందిరం॥
ఆ-ప్ర.

శుక్తి, ముక్తాప్రసు, మహాశుక్తి, శుక్తిక, ముక్తాస్ఫోటము, అబ్ధిమండూకి, మౌక్తికప్రసవ, మౌక్తికసు, ముక్తామాత, మౌక్తికమందిరము అనునవి శుక్తినామములు.

# జల శుక్తి

## జలశుక్తి నామములు

శ్లో॥ జలశుక్తి ర్వారిశుక్తిః కృమిభూః క్షుద్రశుక్తికా।
శంబూకా నరశుక్తిశ్చ పుటికా తోయశుక్తికా॥ ఆ-ప్ర.

జలశుక్తి, వారిశుక్తి, కృమిఘ్న, క్షుద్రశుక్తిక, శంబూక, నరశు_ పుటిక, తోయశుక్తి యనునవి జలశుక్తి నామములు.

## శుక్తి - జలశుక్తి శోధన మారణ విధానములు

శ్లో॥ శోధనం శంఖవత్తస్య మృతిః ప్రోక్తా కపర్దవత్॥
ఆ-(

ముత్యపుచిప్పను, ఆలుచిప్పను శంఖమునువలె శోధించవలె[ను,] గవ్వవలె వీటిని భస్మజేయవలెను.

## శుక్తిభస్మ గుణములు

శ్లో॥ ముక్తాశుక్తిః కటుఃస్నిగ్ధా శ్వాస హృద్రోగహారిణీ।
శూల ప్రశమనీ రుచ్యా మధురా దీపనీ పరా॥ ఆ-(

ముత్యపుచిప్ప భస్మము కటురసమును, మధురానురసమును, స్ని[గ్ధ] గుణమును గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృ[ద్ధి] బొందించును. శ్వాసను, హృద్రోగమును, శూలను బోగొట్టును.

## జలశుక్తిభస్మ గుణములు

శ్లో॥ జలశుక్తిః కటుః స్నిగ్ధా దీపనీ గుల్మశూలనుత్।
విషదోష హరా రుచ్యా పాచనీ బలదాయినీ॥ ఆ-(

ఆలుచిప్పభస్మము కటురసమును, స్నిగ్ధగుణమును గలిగియుండు[ను.] జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. ఆమమును పచి[ంప] జేయును. బలమును గలిగించును. గుల్మమును, శూలను, విషదోషము[ను] బోగొట్టును.

# శుక్తి యోగము

## (1) మహాగంధక పర్పటి

శ్లో॥ రసగంధకయోః కర్షం గ్రాహ్యమేకం సుశోధితం।
తతః కజ్జలికాం కృత్వా మృదుపాకేన సాధయేత్॥
జాత్యాఃఫలం తథా కోశో లవం గారిష్టపత్రకే।
ఏతేషాం కర్షమాత్రేణ తోయేన సహమర్దయేత్॥
ముక్తాగృహే పునః స్థాప్యం పుటపాకేన సాధయేత్।
గుంజాషట్క ప్రమాణేన ప్రత్యహం భక్షయేన్నరః॥
ఏతత్ప్రోక్తం కుమారాణాం రక్షణాయమహౌషధం।
జ్వరఘ్నం దీపనంచైవ బలవర్ణ ప్రసాధనం॥
దుర్వారం గ్రహణీరోగం జయత్యేన ప్రవాహికాం।
సూతికాంచ జయేదేత దపి వైద్య వివర్జితాం॥
కాస శ్వాస సాతిసారఘ్నం వాజీకరణ ముత్తమం।
బాలరోగం నిహన్త్యాశు సగోపద్రవ సంయుతం॥
మహాగంధక మేతద్ధి సర్వవ్యాధి నిషూదనం॥ భై-ర

శుద్ధిచేయబడిన రసము, శుద్ధిచేయబడిన గంధకము వీటి నొక్కొక్క కర్షము చొప్పున గ్రహించి ఖల్వమునందుంచి కజ్జలిగా నూరవలెను. పిమ్మట దీనినొక యినుపగరిటెయందుంచి మృద్వగ్నిచే బాగుగా కరిగించి గోమయాచ్ఛాది తైరండపత్రమునందు బోసి తిరిగి ఏరండపత్రమును గప్పి దానిపై గోమయము నుంచవలెను. స్వాంగ శీతలమున అందలి పర్పటిరూపమునుండు ఔషధమును గ్రహించి ఖల్వమునందు మృదువుగా చూర్ణించవలెను. జాతీఫలము, జాతిపత్రి, లవంగము, వేపాకులు వీనిని ఒక్కొక్కతులము చొప్పున గ్రహించి

మెత్తగా చూర్ణించి పై చూర్ణముతో గలిపి శుద్ధజలముతో మూడు దినములు చక్కగా మర్దించవలెను. పిమ్మట దీనినొక గోళముగాజేసి ముత్యపుచిప్పల సంపుటమునందుంచి, పైని మృల్లేపితవస్త్రముచే చుట్టి యెండించి సుమారు ఏబది పిడకలతో పుటము వేయవలెను. స్వాంగ శీతలమున పైనుండు మృత్తికాలేపమును తొలగించి యందలి యౌషధ ద్రవ్యమును ముత్యపుచిప్పలతోకూడా గ్రహించి ఖల్వమునందు దాని నెల్ల మృదువుగా చూర్ణించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మహా గంధకపర్పటి యనబడును. దీనిని ఆరు గురుగింజల ప్రమాణమున ప్రతి నిత్యము సేవించుచుండినచో జాఠరాగ్ని వృద్ధిబొందును. బలము, వర్ణము గలుగును. మిక్కిలి వాజీకరణమగును. జ్వరము, అసాధ్యమగు గ్రహణి, ప్రవాహిక, సూతికావాతము, కాసము, శ్వాసము, అతిసారము వీనిని శమింపజేయును. మరియు, దీనిని అల్పమాత్రగ నుపయోగించినచో చిన్నపిల్లలకు గలుగు సమస్తవ్యాధులను శమించును.

---

# కృష్ణ మృత్తిక

## కృష్ణమృత్తికా నామములు

శ్లో॥ మృన్మృత్తికాతు మృత్స్నాచ మృత్సా సా కృష్ణ మృత్తికా॥ ఆ-ప్ర.

మృత్తు, మృత్తిక, మృత్స్న, మృత్స, కృష్ణమృత్తిక యనునవి కృష్ణమృత్తికానామములు.

## కృష్ణమృత్తికా గుణములు

శ్లో॥ కృష్ణమృత్ క్షతదాహాస్ర ప్రదర శ్లేష్మ పిత్తనుత్॥

ఆ-ప్ర.

నల్లమన్ను (బాహ్యోపయోగముచే) కఫపిత్తములను, క్షతమును, దాహమును, రక్తప్రదరమును శమింపజేయును.

---

# పంకము

## పంక నామములు

శ్లో॥ పంకః కర్దమ ఇత్యుక్తో జంబలః పంకిలస్తథా॥ ఆ-ప్ర.

పంకము, కర్దమము, జంబలము, పంకిలము అనునవి పంక నామములు.

## పంక గుణములు

శ్లో॥ పంకో దాహాస్ర పిత్తార్తి శోఫఘ్నః శీతలః సరః॥
ఆ-ప్ర.

బురద సరగుణమును, శీతవీర్యమును గలిగియుండును. దాహమును, రక్తపిత్తమును, శోఫను (బాహ్యప్రయోగముచే) బోగొట్టును.

---

# కంపిల్లకము

## కంపిల్లక నామములు *

శ్లో॥ కంపిల్లకోఽథ రక్తాంగో రేచీ రేచనకస్తథా।
రంజకో లోహితాంగశ్చ కంపిల్లో రక్తచూర్ణకః॥
ఆ-ప్ర.

---

* కంపిల్లముయొక్క ఉత్పత్తి స్వరూపలక్షణము.—
"సౌరాష్ట్రదేశే సంజాతః కంపిల్లస్తస్య లక్షణం। ఇష్టకా

కంపిల్లకము, రక్తాంగము, రేచి, రేచనకము, రంజకము, లోహితాంగము, కంపిల్లము, రక్తచూర్ణకము అనునవి కంపిల్ల నామములు.

## కంపిల్ల గుణములు *

శ్లో॥ కంపిల్లకో విరేచీస్యాత్కటూష్ణో వ్రణనాశనః।
కఫకాసార్తి హారీచ జంతు క్రిమిహరో లఘుః॥

ఆ-ప్ర.

కంపిల్లకము కటురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. విరేచనములను గలిగించును. వ్రణమును, కఫకాసను, క్రిమిరోగమును బోగొట్టును.

## కంపిల్ల యోగము

### (1) మహా బిందుఘృతము

శ్లో॥ స్నుహీక్షీరపలే కల్కే ప్రస్థార్ధంచైవ సర్పిషః।
కంపిల్లకం పలంచైకం పలార్ధం సైంధవస్య చ॥
త్రివృతాయాః పలంచైకం కుడవం ధాత్రికారసాత్।

---

చూర్ణసంకాశః స విరేకీ హి కథ్యతే॥" ఆ-ప్ర.—కంపిల్లమను ద్రవ్యము ఇటుకరాయిపొడితో సమానమైన స్వరూపమును గలిగి సౌరాష్ట్రదేశమున నుత్పన్నమగును. ఇది విరేచనకారిగా నుండును.

* కంపిల్ల శోధనము.—కంపిల్లమును మాదీఫల రసముతోగాని, అల్లపు రసముతోగాని మూడు రాత్రులు భావనజేసిన యెడల యది పరిశుద్ధ మగును. ర-ర-స.

త్రోయ ప్రస్థేన విపచేత్ శనైర్మృద్వగ్నినా భిషక్॥
కర్షప్రమాణం దాతవ్యం జఠరే ప్లీహగుల్మయోః।
తథా కచ్ఛపరోగేషు యుంజీత మతిమాన్ భిషక్॥
ఏతద్గుల్మాన్ సనిచయాన్ సశూలాన్ సపరిగ్రహాన్।
నిహన్త్యేష ప్రయోగోహి వాయుర్జలధరానివ॥
పంచగుల్మ నథార్థాదస వజ్రో౽ముక్తః స్వయంభువా।
మహాబిందు ఘృతంనామ సిద్ధం సిద్ధైశ్చపూజితం॥

భై-ర.

జెముడుపాలు రెండుపలములు, ఘృతము ఒకటిన్నరప్రస్థము, కంపిల్ల మొకపలము, సైంధవలవణము అర్ధపలము, తెగడమూల మొకపలము, ఉసిరిక పండ్లరస మొక కుడపము, శుద్ధజల మొకప్రస్థము ఇటుల గ్రహించి మృద్వగ్నితో ఘృతపాకము జేయవలెను. దీనినొక కర్షప్రమాణము సేవించినయెడల సమస్తగుల్మవ్యాధులను, ప్లీహావృద్ధిని బోగొట్టును.

---

# గౌరీపాషాణము

## గౌరీపాషాణ నామములు *

శ్లో॥ గౌరీపాషాణకశ్చాన్యో వికటో హాతచూర్ణకః॥

యో-ర.

గౌరీపాషాణకము, వికటము, హాతచూర్ణకము అనునవి గౌరీపాషాణ నామములు.

---

* పాషాణభేదములు—— "గౌరీపాషాణకః ప్రోక్తో ద్వివిధః శ్వేతపీతకః। శ్వేతఃశంఖసదృక్ప్రోక్తో దాడిమాభః

ప్రకీర్తితః శ్వేతః కృత్రిమకః ప్రోక్తః పీతః పర్వతసంభవః। విషకృత్యకరౌ తౌ హి రసకర్మణి పూజితౌ॥" ఆ-ప్ర.—
గౌరీపాషాణము తెలుపు పసపు వర్ణభేదముచే రెండు విధములుగా నుండును. తెల్లనివర్ణముగలది శంఖముతో సమానముగ నుండును. పసపువర్ణముగలది పండిన దానిమ్మపండువలె నుండును. ఇందు తెల్లనిపాషాణము కృత్రిమమనియు, పసపుపచ్చనిది సహజముగా పర్వతములం దుత్పన్నమగు ననియు జెప్పబడినది. ఈ రెండునుగూడ విషగుణములను గలిగి విషమువలెనే ప్రాణహానిని గలిగించును. పాదరసమునకు జేయు సంస్కారమునందు దీని ప్రయోజనము మెండు. రసరత్న సముచ్చయమున "స్ఫటికాభశ్చ శంఖాభః హారిద్రాభస్త్రయః స్మృతాః। పూర్వపూర్వో గుణైః శ్రేష్ఠః॥" అని చెప్పబడినది. దీనినిబట్టి స్ఫటికమునంటి వర్ణముగలది, శంఖమునంటి వర్ణముగలది, పసపువంటి వర్ణముగలది యని పాషాణమున మూడుభేదములున్నట్లు తెలియగలదు. అయితే వీనిలో నొకదానికంటె నొకటి పూర్వపూర్వముగ అనగా స్ఫటికాభ పాషాణముకంటె శంఖాభ పాషాణమును, దీనికంటె హరిద్రాభ పాషాణమును శ్రేష్ఠమైనదిగా తెలుపబడినవి. ఇంతియేగాకుండ నీపాషాణములలో సౌవీర పాషాణము, ఎలుకపాషాణము, ఉల్లిపాషాణము, దొడ్డిపాషాణము మున్నగు ననేకపాషాణములు వ్యవహారములో నున్నట్లు తెలియగలదు. మరియు, ని పాషాణ జాతులను సన్నిపాతజ్వరమునందును, శ్వాసకాసలయందును, సూతికా

## గౌరీపాషాణ శోధన విధానము *

శ్లో॥ ............కారవల్లీ ఫలేక్షిపేత్।
స్వేదయేద్దండికామధ్యే శుద్ధోభవతి మూషక॥
ర-ర-స.

---

వాతములందును, వాతరోగములందును విశేషముగా నొక తరహా వైద్యులు ప్రయోగించుట గూడ వ్యవహారమునందు గలదు. కాని రసశాస్త్ర ప్రవర్తకులు తమ చికిత్సావిధానమున నెచ్చటను వీటిని ప్రయోగించినట్లు గానరాదు.

* ఈ పాషాణ జాతులకు శోధనవిధానము గ్రంథాన్తరమునం దిట్లు చెప్పబడియున్నది.

1. గౌరీపాషాణ శోధన విధానము—శ్లో॥ ద్విపలం గౌరిపాషాణం మర్ద్యం జంబీరవారిణా। పిష్టం కృత్వా పటే బధ్వా డోలాయంత్రేణ బుద్ధిమాన్॥ శిలాతోయోదకే పాచ్యం భవేచ్ఛుద్ధి ర్వినిశ్చయః॥ ట-రా.—రెండు పలములు గౌరీ పాషాణమును గ్రహించి, దీనిని ఖల్వమునందుంచి మెత్తగా చూర్ణించి జంబీరస్వరసముతో నూరి యొక గోళముగా జేయవలెను. పిమ్మట దీనినొక వస్త్రఖండమునందు బంధించి, యీ మూటను డోలాయంత్రమున నమర్చి అందు సున్నపునీళ్లను బోసి రెండుజాములు స్వేదనముజేసిన యయ్యది పరిశుద్ధమగును.

2. ఉల్లిపాషాణ శోధన విధానము—శ్లో॥ ఉల్లి పాషాణ సంశుద్ధి ర్వక్ష్యతే శాస్త్రనిశ్చితం। చూర్ణీకృతం

గౌరీపాషాణము కాకరకాయలో బెట్టి డోలాయంత్రమున స్వేదనము జేసిన శుద్ధియగును.

---

పటేబధ్వా శిలాక్షారోదకేన చ॥ డోలాయంత్రే దినైకంతు పాచితం చ విశుధ్యతి॥ బ-రా.—ఉల్లి పాషాణమును మెత్తగా చూర్ణించి యొక వస్త్రఖండమునం దా చూర్ణమును మూట గట్టి, దీనిని డోలాయంత్రమునం దమర్చి సున్నపునీటితో నొకదినము స్వేదనము జేసిన యయ్యది శుద్ధమగును.

3. దొడ్డిపాషాణ శోధన విధానము—శ్లో॥ గోమూత్రే దొడ్డిపాషాణం డోలాయంత్రే దినత్రయం। పటేబధ్వా తతో పాచ్యం సమ్యక్ శుద్ధి ర్భవిష్యతి॥ బ-రా.—దొడ్డిపాషాణమును మెత్తగా చూర్ణించి యొక వస్త్రఖండమునం దా చూర్ణమును మూటగట్టి, దీనిని డోలాయంత్రమునం దమర్చి గోమూత్రముతో మూడుదినములు స్వేదనము జేసిన యయ్యది పరిశుద్ధమగును.

4. శంఖపాషాణ శోధన విధానము—శంఖపాషాణమును ఒక వస్త్రఖండమున మూటగట్టి దీనిని డోలాయంత్రమునం దమర్చి నారికేళ జలముతో మూడుజాములు స్వేదనము జేసిన యయ్యది పరిశుద్ధమగును. (అనుభూతము)

5. సౌవీరపాషాణ శోధన విధానము—సౌవీరపాషాణమును ఒక గాజుపాత్రలో వేసి యది మునుగునంత పరిమితిని అందు స్తన్యమునుబోసి యది యిగిరిపోవువరకు నెండలో నుంచవలెను. ఇటుల జేసిన యయ్యది పరిశుద్ధమగును. ఇందు స్తన్యాభావమున గోక్షీరమును ఉపయోగించవలెను. (అనుభూతము)

## గౌరీపాషాణ గుణములు

|| రసబంధకరః స్నిగ్ధో దోషఘ్నో రసవీర్యకృత్ ||

ర-ర-స.

గౌరీపాషాణము స్నిగ్ధగుణమును గలిగియుండును. రసమునకు ధనము జేయును. పాదరసముతో జేర్చినప్పుడు దానియొక్క శక్తిని ద్ధిజేయును.

## పాషాణ యోగములు

### (1) నవగ్రహీ సిందూరము

శ్లో|| గౌరీం హింగుళ గంధౌచ పత్రతాళక పారదౌ।
తుత్థం పిండాఖ్యతాళంచ రసకంచ శిలాజతు॥
సమం గృహీత్వా ఖల్వేతు కారవల్లీ ద్రవైః పునః।
పిచుమందరసేనాపి మర్దయే చ్ఛోషయే త్తథా॥
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్రతః పచేత్।
నవగ్రహీతి విఖ్యాతో హ్యనుపాన విశేషతః॥
హన్తి శీతజ్వరాన్ సర్వాన్ కుష్ఠం వీసర్ప మేవచ।
వాతరక్తంచ విస్ఫోటం ఫిరంగ మఖిలవ్రణాన్॥

(అనుభూతం)

శుద్ధిజేసిన గౌరీపాషాణము, శుద్ధిజేసిన ఇంగిలీకము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన పత్రతాళకము, శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన మైలుతుత్థము, శుద్ధిజేసిన పిండతాళకము, గోమూత్ర శిలాజతు, శుద్ధిజేసిన పాలతుత్థము వీటిని సమభాగములుగ గ్రహించి, అందు తొలుత రసగంధకములను ఖల్వమునందు కజ్జలిగా నూరవలెను. పిమ్మట మిగిలిన ద్రవ్యములను జేర్చి కాకరాకురసముతో నొకదినమును, వేపచెక్క-

కషాయముతో నొకదినము మర్దించి యెండించవలెను. పిమ్మట మెత్తని చూర్ణముగా నూరి కాచకూపికయందు బోసి దీనిని వాలుకాయంత్రమున నమర్చి క్రమాగ్నులతో రెండుదినములు రససింధూర పాకవిధానము ననుసరించి పాకముజేసి స్వాంగశీతలమున కూపికాకంఠలగ్నమగు నౌషధము గ్రహించి మెత్తగా ఖల్వమునందు చూర్ణించి యుపయోగించవలెను. అనుపానవిశేషములతో రెండుగురుగింజల యెత్తు సేవించిన విషమజ్వరము, కుష్ఠము, విసర్పము, వాతరక్తము, విస్ఫోటము, ఫిరంగరోగము, వ్రణము మున్నగునవి శమించును.

## (2) పాషాణ పర్పటి

శ్లో॥ గౌరీ మనశ్శిలే దొడ్డిం తాళకం శంఖకం రసం।
గంధం చేతి సమంత్రి పర్పటీం కారయే త్పృథః॥
మాత్రాం వికల్ప్య దాతవ్యా హ్యేషా పాషాణ పర్పటీ।
సన్నిపాతే తథా రోషజ్వరే ఘోరే కఫాత్మకే॥
దధ్యన్నం తత్ర దాతవ్యం పానే కేరజలం పయః॥

ర - యో - ర.

శుద్ధిజేయబడిన గౌరీపాషాణము, శుద్ధిజేయబడిన మణిశిల, శుద్ధిజేయబడిన తాళకము, శుద్ధిజేయబడిన శంఖపాషాణము, శుద్ధిజేయబడిన పాదరసము, శుద్ధిజేయబడిన గంధకము వీనిని సమాంశములుగ గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిగానూరి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి మెత్తగా నూరవలెను. పిమ్మట నీ చూర్ణము నొక యినుపగరిటెలో వేసి బొగ్గునిప్పులపై ద్రవింపజేయవలెను. పిమ్మట నా ద్రవమును పర్పటిని జేయవలెను. ఇయ్యది పాషాణపర్పటి యని వ్యవహరింపబడును. స్వాంగశీతలమున నా పర్పటిని గ్రహించి, మెత్తగా చూర్ణించి గురుగింజ ప్రమాణమున అల్లపుస్వరసముతో నిచ్చిన కఫోల్బణ సన్నిపాత

జ్వరము, దోషజ్వరము మున్నగు దారుణజ్వరములు శమించును. దీనిని ప్రయోగించినప్పుడు రోగికి వెంటనే పెరుగుతో నన్నమును బెట్టవలెను. నారికేళ జలమును, పాలను పానార్థ మొసంగవలెను.

## (3) లోహసౌవీరము

శ్లో॥ లోహంచూర్ణంచ సౌవీరం సమంకృత్వా సుఖల్వకే। సమ్యక్ సంచూర్ణ్య మతిమాన్ మర్దయే ద్బ్రహ్మ బిందునా॥ యావత్పిచ్ఛిలతా తత్ర చక్రికాంకారయే దథ। సంశోష్య గాఢం యత్నేన బంధయేచ్ఛ శరావకే॥ తీక్ష్ణాగ్నినా పచే ద్యామద్వయంపశ్చా త్సముద్ధరేత్। సింధూరాభం లోహచూర్ణం గృహీత్వా మృదుచూర్ణయేత్। లోహసౌవీరనామాయం దేయః పక్షవధాదికే॥ (గురుసాంప్రదాయం)

శుద్ధిజేయబడిన లోహచూర్ణము, శుద్ధిజేయబడిన సౌవీరపాషాణము వీటిని సమాంశములుగా గ్రహించి తొలుత సౌవీరమును మెత్తగా ఖల్వమునందు నూరి యందు లోహచూర్ణమును జేర్చి తిరిగి నూరవలెను. పిమ్మట బ్రహ్మబిందువును కొంచెము కొంచెముగా జేర్చుచు మర్దించు చుండవలెను. ఇటుల మర్దించుచుండగా కొంతకాలమున కందు పిచ్ఛిలత్వ మేర్పడును. అప్పుడా పిష్టమును దీసి యొక శరావమునందు పలుచని బిళ్లవలె పరచి తీక్ష్ణాతపమున నెండబెట్టవలెను. ఎండినపిమ్మట వేరొక శరావముచే గప్పి దృఢముగా సంధిబంధనముజేసి తీక్ష్ణాగ్నితో రెండుజాములు పాకముజేసి నిప్పుపైనుండి యా శరావసంపుటమును క్రిందకు దింపవలెను. స్వాంగశీతలమున సిందూరవర్ణముతో నుండు లోహచూర్ణమును గ్రహించి తిరిగి ఖల్వమునందు మెత్తగా చూర్ణించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది లోహసౌవీరమని చెప్పబడును.

దీనిని రెండు-మూడు గింజల ప్రమాణమున తేనెతో సేవించిన పక్షవాతము అర్దితము మున్నగు వాతవ్యాధులు శమించును.

## (4) చండమారుతము

శ్లో॥ సౌవీరం రసకర్పూరం హింగుళం రసగంధకౌ।
సమంగృహీత్వా విధినా పర్పటీంకారయేత్సుధీః॥
చండమారుత నామాయం ప్రదేయో వల్లమాత్రక
అపతంత్రే పక్షవధే ధనుర్వాతాదికేషుచ॥

ర-యో-।

శుద్ధిచేయబడిన సౌవీరపాషాణము, శుద్ధిచేయబడిన రసకర్పూరము, శుద్ధిచేయబడిన హింగుళము, శుద్ధిచేయబడిన పాదరసము, శుద్ధిచేయబడిన గంధకము వీటిని సమభాగములుగ గ్రహించి, తొలుత గంధకములను ఖల్వమున కజ్జలిచేసి యందు మిగిలిన ద్రవ్యములను [illegible] బాగుగా కలియనూరవలెను. పిమ్మట పూర్వోక్తవిధానమున పర్పటి గావింపవలెను. ఇయ్యది చండమారుతమని వ్యవహరింపబడును. దీనిని వల్లప్రమాణమున సేవించినయెడల అపతంత్రము, పక్షవధ, ధనుర్వాతము మున్నగు వాతరోగములెల్ల శమించును.

## (5) మహాపాశుపతాస్త్ర రసము

శ్లో॥ ద్విభాగ శ్వేతపాషాణం రసం నేపాళ మ్లేచ్ఛకం।
ప్రత్యేకమేకభాగంతు ఖల్వమధ్యే వినిక్షిపేత్।
కృష్ణధత్తూరతోయేన మర్దితం యామమాత్రకం।
ముద్గప్రమాణ మాత్రేణ త్వార్ద్రకంచానుపానకం॥
ఏకాహికం ద్వ్యాహికం చ త్ర్యాహికం నాశ
జ్వరం॥ ర-యో.

శుద్ధిజేయబడిన శంఖపాషాణము రెండుభాగములు, శుద్ధిజేయబడిన పాదరస మొకభాగము, శుద్ధిజేయబడిన దన్తీబీజ మొకభాగము, శుద్ధిజేయబడిన హింగుళ మొకభాగము ఇటుల గ్రహించి, తొలుత వీటి నన్నింటిని ఖల్వమునందు గలియనూరి, పిమ్మట నల్లయుమ్మెత్త వేళ్లరసముతో నొకజాము జక్కగా మర్దించి ముద్గప్రమాణమున మాత్రలు జేయవలెను. ఇయ్యది మహాపాశుపతాస్త్ర రసమని వ్యవహరింపబడును. అల్లపురసముతో దీనిని సేవించినయెడల ఏకాహికజ్వరము, ద్వ్యాహికజ్వరము, త్ర్యాహిక జ్వరము మున్నగు విషమజ్వరములు శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు చప్పిడిగంజిని పానముజేయవలెను.




## నవాసారము

### నవాసార నామములు*

శ్లో॥ నవసారః సమాఖ్యాతః చూలికాలవణాభిధః॥ — ఆ-ప్ర.

నవసారము, చూలికాలవణము అనునవి నవాసార నామములు.

---

* (1) "ఇష్టికాపాకదహనే జాయతే పాండురప్రభః। మనుష్యసూకరాణాంచ నిష్క్రాన్తః కిట్టవద్భవేత్॥ క్షారేషు గణనాతస్య స్వర్ణశోధనకః పరః। శంఖద్రావరసే పూజ్యో ముఖకర్మణిపారదే। బిడద్రవ్యోపయోగీచ క్షారవత్తద్గుణాః స్మృతాః॥" ఆ-ప్ర.— నవాసారము తెల్లనివర్ణము గలిగి, యిటికిరాళ్లను గాల్చినప్పుడు వాటిమధ్య నుత్పన్నమగును. మరియు, మానవులయొక్కయు, పందులయొక్కయు మలమునందు కిట్టమువలె లభించును. ఇది

## శోధిత నవసార గుణములు

శ్లో॥ వహ్నించ దీపయత్యాశు గుల్మ ప్లీహామయాపహం।
వూంసాది జారణం సమ్య గ్భుక్తపాకం కరోతితత్॥
ర-ప్ర-సు.

శుద్ధిజేయబడిన నవాసారము జఠరాగ్నిని వృద్ధిబొందించును. మాంసము మున్నగు గురుపదార్థములను జీర్ణింపజేయును. ఎటువంటి యాహారమునైనను భుజించినవెంటనే పాకముజేయును. గుల్మమును, ప్లీహావృద్ధిని బోగొట్టును.

## నవసార యోగము

### (1) స్వర్ణవంగము

శ్లో॥ ప్రక్షిపేద్భాజనే వంగం అయసేవాపి మృణ్మయే।
విద్రుతే వహ్నితాపేన తస్మిన్ తన్మానకం రసం॥

---

క్షారములందొక్కటిగా గణించబడును. స్వర్ణమును శోధించును. శంఖద్రావ రసమునందు ప్రయోగింపబడును. పాదరసమునకు ముఖీకరణమునకై ప్రయోగింపబడును. పాదరసమున స్వర్ణాదిలోహములను జారణముజేయుటకై ప్రయోగింపబడు బిడద్రవ్యములలో నిదియొకటిగా గ్రహింపబడుచున్నది. దీనిగుణము లితర క్షారగుణములవలెనే గ్రహింపనగును. మరియు, నిది "లోహద్రావణకం" అని చెప్పబడుటచే లోహములను ద్రవింపజేయుటకుగూడా యుపయోగింపబడుచున్నది. (2) నవసార శోధనము.—దీనిని మాదీఫలరసమున మూడుదినములు భావనజేసిన యది పరిశుద్ధమగును.

క్షిప్త్వా సంచూర్ణయేత్తత్ర నరసారంచ గంధకం।
తనువాస మృదా లిప్త కాచ కూప్యాం నిధాయచ॥
తత్సర్వం సికతాయంత్రే పచే ద్యామ చతుష్టయం।
పాకాత్ సంజాయతేచిత్రం కీర్ణ హేమకణై రివ॥
రమణీయతరం స్వర్ణవంగం నామరసాయనం।
బల్యం మేహహారం కాంతి మేధా వీర్యాగ్నివర్ధనం॥
అం-ఆ-షా-జో-యో.

శుద్ధిజేసిన వంగము, శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన నవాసారము, శుద్ధిజేసిన గంధకము వీటిని సమభాగములుగ గ్రహించవలెను. అందు వంగమును తొలుత నొక మృచ్ఛరావమున నుంచి దీనిని నిప్పులపై బెట్టి కరగించవలెను. పాదరసమును వేరొక శరావమున బోసి దీనిలో పైని ద్రవీభూతమైన వంగమును జాగ్రత్తగా జేర్చవలెను (ఈ విధముగ రసవంగసంయోగము జేసిన నెట్టి ప్రమాదమును గలుగనేరదు. అటుగాక ద్రవించిన వంగమునందు రసమును జేర్చుటకు బ్రయత్నించినచో వంగము పెద్దశబ్దముతో బ్రేలి చిన్న చిన్న తునకలుగా నయి, మిగుల వేగముతో నలుప్రక్కలకును వచ్చి దగ్గరనుండువారి శరీరముల కభిఘాతమును గలిగించును. కావున రసవంగ సంయోగమును సంప్రదాయము నెరిగి జేయదగియుండును). వాటి నటుల సంయోగపరచిన పిమ్మట నటులనే కొంతకాలముంచినచో నది చల్లబడును. అప్పుడు రసమిశ్రితమగు వంగమునందుండి తీసి చూచినచో పర్పటివలె నుండును. దీనిని ఖల్వమునందుంచి నూరినయెడల మెత్తని చూర్ణమువలె బరిణమించును. ఇట్టి సమయమున అందు గంధకమును జేర్చి దృఢముగా నూరవలెను. ఇందువలన నయ్యది కజ్జలిరూపమును దాల్చును. పిమ్మట నందు నవాసారచూర్ణమును జేర్చి బాగుగా నూరవలెను. ఈ విధముగ సిద్ధమైన యౌషధద్రవ్యమును కలుబందరసముతో మూడు దినములు

జక్కగా మర్దించి యెండించవలెను. దీనిని తిరిగి చూర్ణముగా నూరి కాచకూపికయందు బోసిగాని, శరావసంపుటమునందు బంధించిగాని సికతాయంత్రసహాయమున పాకముజేయవలెను. (శరావసంపుటమునం దుంచినచో నూర్ధ్వస్థశరావమునకు మధ్యభాగమున చిటికెనవ్రేలు దూరునంత బెజ్జము గంధకధూమము బయటకు పోవుట కనువుగా జేసుకొనవలెను). గంధకధూమము బోయి తెల్లనిధూమ మందుండి వచ్చుచున్నప్పుడు ఒక యినుప శలాకను ఆ ద్వారముగుండా లోపలకు ప్రవేశపెట్టి బలముగ గ్రుచ్చి పైకితీసి చూచినచో శలాకాగ్రమున బంగారువంటి వర్ణము గానుపించును. అప్పుడు పాకము సమాప్తియైనట్లు దెలిసికొని అగ్నిని చల్లార్చవలెను. స్వాంగశీతలమున కూపికనుండిగాని, శరావసంపుటమునుండిగాని బంగారువర్ణమువంటి యౌషధమును గ్రహించుకొనవలెను. ఇదియు స్వర్ణవంగమని వ్యవహరించబడును. దీని నైదు యవల పరిమితిని అనుపానవిశేషములతో సేవించిన బలమును గలిగించును. కాంతిని, మేధాశక్తిని, వీర్యమును, జాఠరాగ్నిని వృద్ధి బొందించును. సమస్త ప్రమేహములను బోగొట్టును. విశేషముగ శుక్ర మేహమును, పూయమేహమును బోగొట్టును.

---

# అగ్నిజారము

## అగ్నిజార నామములు *

శ్లో॥ అగ్నిజారోఽగ్నినిర్యాసః అగ్నిగర్భోఽగ్నిజస్స్మృతః।
బడబాగ్నిమలశ్చైవ జరాయుశ్చార్ణవోద్భవః॥

ఆ-కం.

---

* అగ్నిజారోత్పత్తి—"అబ్ధితీరేఽగ్నినక్రస్య జరాయుః శుష్కతాంగతః। అగ్నిజారస్తు సంప్రోక్తః సజారో

అగ్నిజారము, అగ్నినిర్యాసము, అగ్నిగర్భము, అగ్నిజము, బడబాగ్నిమలము, జరాయువు, అర్ణవోద్భవము అనునవి యగ్నిజార నామములు.

## అగ్నిజార గుణములు

శ్లో॥ అగ్నిజారస్త్రిదోషఘ్నః ధనుర్వాతాది వాతనుత్॥
ర-ర-స.

అగ్నిజారము త్రిదోషములను శమింపజేయును. ధనుర్వాతము మున్నగు వాతరోగములను బోగొట్టును.

---

జారణేహితః॥'' ఆ-ప్ర.—సముద్రముననుండు అగ్నినక్రము (మొసలి) యొక్క జరాయువు ఒడ్డునకు గొట్టుకువచ్చి యచ్చట సూర్యతాపముచే శుష్కించగా నయ్యది యగ్ని జారమని వ్యవహరింపబడుచున్నది. మరియు, నిది పాదరస జారణ సంస్కారమునకు గ్రహింపబడు క్షారములలో నొక టిగా గణింపబడుచున్నది. మరియు, ''వర్ధనో గసవీర్యస్య దీపనో జారణ స్తథా। త దబ్ధిక్షారసంశుద్ధం తస్మ చ్ఛుద్ధిం వహీష్యతే॥'' ర-ర-స.—ఇది పాదరసమునకు వీర్యమును, లోహముల భుజించుశక్తిని వృద్ధిజేయును. రసమునం దభ్రక సత్వాదులను జీర్ణింపజేయును. ఇయ్యది సముద్రమునందలి క్షారజలముచే శుద్ధమైనది గాన తిరిగి దీనికి శోధనముజేయ నవసరములేదు.

# మృద్దారు శృంగము

## మృద్దారు శృంగనామములు *

శ్లో॥ మృద్దారుశృంగకం ప్రోక్తం శృంగంబోదారపూర్వకం॥
(గురూపదిష్టం.)

మృద్దారుశృంగకము, బోదారశృంగము అనునవి మృద్దారుశృంగ నామములు.

---

* (1) మృద్దారుశృంగ లక్షణము.— "భవేద్గుర్జరకే దేశే సదళం పీతవర్ణకం। అర్బుదస్యగిరేః పార్శ్వే నామ్నా మృద్దారుశృంగకం॥" ర-ప్ర-సు.—గుర్జరదేశమున యర్బుదపర్వతమునకు పార్శ్వమున దళముతోగూడి పసపుపచ్చని వర్ణముగలిగి మృద్దారుశృంగమను ద్రవ్యముత్పన్నమగును.

(2) మృద్దారుశృంగ భేదములు.— "బోదారశృంగకం ప్రోక్తం ద్వివిధం పీతపాండురం। సదలం నిర్దలం తస్య జని ర్గుర్జరమండలే॥" ఆ-ప్ర. — మృదారుశృంగి పసపు తెలుపు వర్ణభేదముచే రెండు విధములుగా నుండును. అందు పసపుపచ్చగ నుండునది దళములతోగూడియుండును. తెల్లగనుండునది దళములులేక యుండును. ఇది 'సీససత్వం' అని చెప్పబడుటచే సీసధాతు వుత్పన్నమగు స్థలమున దాని సత్వరూపముగ నుత్పన్నమగు నేమో యని యూహింపదగినది. ఇందుచేతనే యియ్యది మిగుల భారముగగూడ నుండును. దీనికి రసౌషధములలో నెచ్చటను ప్రయోగము

## మృద్దారుశృంగ గుణములు

శ్లో॥ నాగసత్వం లింగదోషహరం శ్లేష్మవికారనుత్।
విరేచనకరంసమ్యక్ కేశరంజనకం పరం॥ ర-ప్ర-సు.

మృద్దారుశృంగి విరేచనములను గలిగించును. కేశములను రంజింపజేయును. శ్లేష్మవికారములను, లింగదోషము (ఉపదంశము)ను పోగొట్టును.

---

4-వ అధ్యాయము

# ధాతు - ఉపధాతువులు

## ధాతువులు *

శ్లో॥ సువర్ణం రూప్యకం తామ్రం వంగం జశద సీసకం।
లోహం చైతే మతాః సప్తధాతవో గిరిసంభవాః॥
ఆ-ప్ర.

బంగారు, వెండి, రాగి, తగరము, సత్తు, సీసము, ఇనుము అను నవి పర్వతములం దుత్పన్నములైన సహజధాతువులుగా వ్యవహరింప బడుచున్నవి.

---

గానరాదు. రసబంధనమని చెప్పబడుటచే రసమునకు బంధన సంస్కారముకై యుపయోగింపబడునని దెలియ నగును. దీనికి శోధనము నవసారమునకు వలెనే జేయదగి యుండును,

* ధాతుశబ్ద నిరుక్తి—''వలీపలితఖాలిత్య కార్శ్యా బల్యజరామయాః। నివార్య దేహం దధతి నృణాం త ద్ధాత

## ఉపధాతువులు

శ్లో॥ తాప్యంచ విమలా తుత్థం కాంస్యం పిత్తలకం తథా।
సిందూరం శైల నిర్యాసః స్మృతాః సప్తోపధాతవః॥
ఆ-ప్ర.

స్వర్ణమాక్షికము, తారమాక్షికము, మైలతుత్థము, కంచు, ఇత్తడి, గంగసిందూరము, శిలాజతు అనునవి యుపధాతువులుగా వ్యవహరింపబడుచున్నవి.

---

వోమతాః''॥ ఆ-ప్ర.—వలి, పలితము, ఖాలిత్యము, కార్శ్యము, దౌర్బల్యము, జర, వ్యాధి అనునవి శరీరమునకు గలుగకుండ శరీరధారణము జేయునవి యగుటచే ధాతువులని వ్యవహరింపబడుచున్నవి.

పైని బేర్కొనిన ధాతూపధాతువులలో బంగారు, వెండి, తామ్రము, లోహము అనునవి శుద్ధలోహములనియు, తగరము, సీసము అనునవి పూతిలోహములనియు, ఇత్తడి, కంచు అనునవి మిశ్రలోహములనియు రసరత్నసముచ్చయమున దెలుపబడినవి. మరియు, నీ మిశ్రలోహములలో వర్తలోహమను మరియొక భేదముగూడ గానుపించుచున్నది. ఈ లోహమును గురించియు, ఇట్టి లోహభేదమగు చపలమును గురించియు, భూనాగమునుగురించియు పరిశిష్టభాగమున వివరించెదము.

# స్వర్ణము

## సువర్ణ నామములు *

శ్లో॥ స్వర్ణంసువర్ణం కనకం హిరణ్యం హేమహాటకం।
తపనీయం కలధౌతం గాంగేయం భర్మకాంచనం॥

---

* (1) సువర్ణభేదములు.—"సువర్ణం పంచధా ఖ్యాతం ప్రాకృతం సహజంపరం। వహ్నిజం ఖనిజం తద్వద్రసేంద్ర వేధసంభవం॥" ఆ-ప్ర.—ప్రాకృతము, సహజము, వహ్నిజము, ఖనిజము, రసేంద్రవేధ సంభవము అని బంగారు అయిదు విభేదములను గలిగియుండును. అందు "ఏతాని దుర్లభానిహి" అని చెప్పబడుటచే మొదటి మూడు విభేదములు దుర్లభములనియు, మిగిలిన రెండు విభేదములే ప్రకృతమున లభ్యములనియు దెలియనగును. అందు, "పర్వతే భూమిదేశేషు ఖన్యమానేషుకుత్రచిత్। దృశ్యతే ఖనిజంప్రాజ్ఞైః తచ్చతుర్దశ వర్ణకం॥ రసజం రసవేధేన జాయతే హేమసుందరం। తచ్చతుర్దశ వర్ణాఢ్యం సర్వకార్య కరంపరం॥" ర-ప్రసు.— పర్వతములందుగాని, భూమి ప్రదేశములందుగాని యెచ్చట త్రవ్వగా బంగారము లభించునో యయ్యది ఖనిజమని చెప్పబడును. ఇట్టిది పదునాలుగు వన్నెలు గలిగియుండును. తామ్రాది లోహములకు రసముతో వేధజేయగా బరిణమించునట్టిది రసేంద్రవేధసంభవమనబడును. ఇది గూడ పైదానివలెనే పదునాలుగు

చామీకరం శాతకుంభం తథాకార్తస్వరం చతత్।
జాంబూనదం జాతరూపం మహారజత మిత్యపి॥ ఆ-ప్ర.

స్వర్ణము, సువర్ణము, కనకము, హిరణ్యము, హేమ, హాటకము, తపనీయము, కలధౌతము, గాంగేయము, భర్మ, కాంచనము, చామీకరము, శాతకుంభము, కార్తస్వరము, జాంబూనదము, జాతరూపము, మహారజతము అనునవి సువర్ణ నామములు.

---

వన్నెలు గలిగి సర్వకార్యముల కుపయోగకారిగనుండును.

(2) సదసత్స్వర్ణలక్షణము.—"దాహేర క్తం సితం ఛేదే నికషే కుంకుమప్రభం। తార శుల్బోజ్ఝితంస్నిగ్ధం కోమలం గురుహేమసత్॥ యచ్ఛ్వేతం కఠినం రూక్షం వివర్ణం సమలందళం। దాహేఛేదేసితం, శ్వేతంకషేత్యాజ్యం లఘుస్ఫుటం॥" ఆ-ప్ర.—నిప్పులయందు గాల్చినప్పు డెఱ్ఱని వర్ణమును, తెగగొట్టినప్పుడు తెల్లనివర్ణమును, ఒరుపుడు రాతిపై నరుగదీసినప్పుడు కుంకుమముతో సమానమైన వర్ణమును గలిగి, వెండి రాగి వీటియొక్క సంబంధములేక స్నిగ్ధముగను, కోమలముగను, బరువుగను నుండునట్టి స్వర్ణము స్వచ్ఛమైనదిగా గుర్తించవలెను. తెల్లగను కఠినముగను, రూక్షముగను, వివర్ణముగను, మలముతోగూడినదిగను, దళములుగ విడిపోవునదిగను, తేలికగను, పగిలిపోవునదిగను నుండి, కాల్చినప్పుడును, తెగగొట్టినప్పుడును, ఒరుపుడు రాతిపై నరుగదీసినప్పుడును తెల్లనివర్ణముగలిగి యుండునట్టి స్వర్ణము అగ్రాహ్యమైనదిగా దెలియవలెను.

(3) స్వర్ణమునకు వర్ణోత్కర్షవిధానము.— వల్మీక

## సువర్ణ శోధన విధానము *

శ్లో॥ సువర్ణ ముత్తమం వహ్నౌ విద్రుతం నిక్షిపేత్త్రిశః।
కాంచనారరసే శుద్ధం కాంచనం జాయతే భృశం॥
ఆ-ప్ర.

---

మృత్తికా ధూమం గైరికం చేష్టికా పటు। ఇత్యేతాః మృత్తికాః పంచ జంబీరై రారనాళకైః॥ పిష్ట్వా కంటక వేధ్యాని స్వర్ణపత్రాణి లేపయేత్। పుటేత్ పృథు హాసంత్యాంతు నిర్వాతే వింశదుత్పలైః॥ అధికై ర్వాఽధికే హేమ్నియావ ద్వర్ణో వివర్ధతే"॥ ఆ-ప్ర.—పుట్టమన్ను, కరి దూపము, కావిరాయి, ఇటుకరాయిపొడి, ఉప్పు ఈ యైదును పంచమృత్తిక లనబడును. ఈ మృత్తికలను ఖల్వమునందు చూర్ణించి యందు జంబీరస్వరసమును, కాంజికమును బోసి చక్కగా నూరి యా పిష్టముతో మిగుల పలుచగా జేయ బడిన బంగారు రేకులకు బూసి యారించవలెను. పిమ్మట నొక పెద్ద కుంపటిని నివాతప్రదేశమున గ్రహించి యాకతో గూడిన యిరువది పిడకల ముక్కలను నింపి వాటిమధ్య నా బంగారు రేకుల నుంచి యగ్నిని రగుల్పవలెను. బంగా రముయొక్క పరిమితి హెచ్చుగానున్నచో పిడకల సంఖ్య గూడ హెచ్చింపవచ్చును. స్వాంగశీతలమున దీసి చూచి నచో స్వర్ణముయొక్క వర్ణమధికమై యుండును.

* స్వచ్ఛమైన స్వర్ణమునకు శోధన మనావశ్యకము. "మూషాద్ది యోగేన యదామిశ్రం స్వర్ణం హిజాయతే।

ఉత్తమమగు సువర్ణమును మూషయందుంచి కొలిమియందు కరగించి మూడుమారులు కాంచనారపట్టయొక్క స్వరసమున ఆవాపము జేసిన యయ్యది పరిశుద్ధమగును.

## స్వర్ణభస్మ విధానము *

శ్లో॥ శుద్ధసూత సమం స్వర్ణం ఖల్వే కృత్వాతుగోళకం।
ఊర్ధ్వాధో గంధకం దత్వా సర్వతుల్యం నిరుధ్యచ॥

---

హేమకార్యం నచేత్తేన తదా శోధ్యం భిషగ్వరైః॥ నతు శుద్ధస్య హేమ్నశ్చ శోధనం కారయేద్భిషక్। అన్యేషామేవలోహానాం శోధనం కారయేద్భిషక్''॥ ర-ప్ర-సు.— బంగారము - వెండి మున్నగు లోహములతో మిశ్రమమై యుత్పన్నమైనట్టిది స్వర్ణకార్యము జేయనేరదు గాన యట్టి దానికే శోధనకర్మ యవసరమైయుండును. కాని, స్వచ్ఛమైన బంగారమున కెప్పుడును శోధనము జేయుట కావశ్యకత లేదు. అయితే యితర లోహములు స్వచ్ఛముగానున్నను వాటికి అవశ్యముగ శోధనము జేసియే తీరవలెను.

* (1) లోహములకు పారదసంయోగమున భస్మ చేయుటవలన నేర్పడు ఉత్కృష్టత—''రసీభవంతి లోహాని మృతాని సురవందితే। వినిఘ్నంతి జరావ్యాధీన్ రసయుక్తాని కింపునః॥ లోహానాం మారణం శ్రేష్ఠం సర్వేషాం రస భస్మనా। మూలీభిర్మధ్యమం ప్రాహుః కనిష్ఠంగధకాదిభిః॥ అరిలోహేన లోహస్య మారణం దుర్గుణప్రదం''॥ ఆ-ప్ర.— లోహములన్నియు యథావతుగ మారితములైనప్పుడు రస

త్రింశద్వనోపలైర్దేయాః పుటాస్త్వేవం చతుర్దశ।
నిరుత్థం హేమభస్మస్యా ద్గంధో దేయః పునః పునః॥

---

ముతో తుల్యములగును. అనగా పాదరసమునకు శరీర ధారణయందెట్టి శక్తి కలదో ఇవికూడ నంతటి శక్తి వంతములగునని భావము. కావుననే జరావ్యాధులను బోగొట్ట సమర్థములగుచున్నవి. ఇట్టి శక్తివంతములైన ధాతువులు రసమిశ్రితములైనప్పుడు ఎంత శక్తివంతము లగునో వేరుగ జెప్పవలెనా? కావున లోహముల కుత్తమ శక్తి కలిగింపవలెనన్నచో వాటిని రసమిశ్రితములుగనే మారితములు గావింపవలెను. ఇదియే శ్రేష్ఠమగు లోహ మారణవిధానము. మూలికలతో జేయబడు లోహమారణ విధానము మధ్యమముగా నెంచబడును. ఇక గంధకము తాళకము మున్నగువానితో జేయబడు లోహమారణవిధా నము అధమముగా జెప్పబడును. నాగవంగాది శత్రులోహ సమిశ్రణమున జేయు లోహమారణవిధానము దుర్గుణప్రద మగును. మరియు, ''లోహం సూతయుతం దోషాం త్యజే త్సూతశ్చ లోహయుక్। అతః స్వర్ణాది లోహాని వినాసూతం నమారయేత్''॥ ర-సం-శ. —లోహములను పాదరసముతో జేర్చి మారణము గావించినచో లోహములందలి దోషము లన్నియు నశించును. ఇటులనే పాదరసమును లోహములతో జేర్చి మారణము గావించినచో పాదరసమునందలి దోషము లన్నియు నశించును. కావున స్వర్ణాదిలోహములకు రస సమ్మిశ్రణము లేకుండ వానిని మారితములు గావింప

అత్రానుక్తమపి జ్ఞేయం గోళకీ కరణే బుధైః।
జంబీరద్రవదానం తు సర్వత్రైవం వినిశ్చయః॥ ఆ-ప్ర.

---

గూడదు. అనగా సూతసమ్మిశ్రితములై మారితములైన స్వర్ణాదిలోహభస్మలు నిర్దుష్టములైనవి యని యెరుంగవలెను. మరియు, "చపలేన వినాలోహం యః కరోతి పుమానిహ। ఉదరే తస్య కిట్టాని జాయంతే నాత్రసంశయః॥ నరసేన వినాలోహం నరసం చాభ్రకం వినా। ఏకత్వేన శరీరస్య వేధో భవతి దేహినః"॥ పా-సం.—రససంయోగము లేకయే లోహములకు మారణముజేసి సేవించినచో నందువలన శరీరములో కిట్టములు (లోహకిట్టములు) ఉత్పన్నములగును. అందుచే రసమిశ్రితములుగనే వాటికి భస్మలను గావింపవలెను. మరియు, లోహములను రసమిశ్రితములుగ మారితములు గావింపకున్నను, ముందుగా నభ్రకమును రసములో జారితముజేయక యట్టి రసమును మారితము గావించినను అట్టివానిని (లోహభస్మములను, రసభస్మను) సేవించినప్పుడు అయ్యవి శారీరక ధాతువులందు లీనములుగాక అనగా ధాత్వైక్యతను బొందకయుండును.

(2) స్వర్ణాదిలోహములకు వేయు పుటములందు నియమము—"స్వర్ణరూప్యవధే జ్ఞేయం పుటం కుక్కుటకాదికం। తామ్రే కాష్ఠా దిజోవహ్నిః లోహే గజపుటాని చ"॥ ఆ-ప్ర.—బంగారు వెండి మున్నగు మృదులోహములను మారణము జేయునప్పుడు కుక్కుటపుటము లావకపుటము మున్నగు లఘుపుటములతో పాకముజేయవలెను (కుక్కుటపుటము—

శుద్ధిజేయబడిన పాదరసమును పలుచని బంగారురేకులను సమభాగములుగా గ్రహించి ఖల్వమునందుంచి, బంగారమంతయు రసము

---

"పుటం భూమి తలే యత్ర ద్వితస్తి ద్వితయోచ్ఛ్రియం।
తావచ్చ తలవిస్తీర్ణం తత్స్యాత్కుక్కుటకం పుటం"॥
ర-ర-వ.—రెండుజానలు ఆయామవిస్తీర్ణములుగల భూమిపై రెండుజానల యెత్తువరకు పేర్చిన పిడకలయొక్క మధ్య నౌషధద్రవ్యమునుంచి పుటమువేసినచో నయ్యది కుక్కుటపుట మనబడును. లావకపుటము—"ఊర్ధ్వంషోడశికామాత్రై స్తుషైర్వాగోవరైః పుటం। యత్ర తల్లావకాఖ్యం స్యాత్సుమృదు ద్రవ్యసాధనే"॥ ర-ర-వ.—భూమిపై పదునారు పిడకల నూకతో గలిపి పేర్చి వాటిమధ్య నౌషధద్రవ్యమునుంచి పుటమువేసినచో నయ్యది లావకపుటమనబడును. ఇవి రెండును మృదుద్రవ్యములను సాధించుట కనువుగ నుండును). తామ్రమునకు మారణము జేయునప్పుడు కాష్ఠముల వహ్నినే యుపయోగించవలెను. అనగా దీనికి పుటపాకము లేదని భావము. ఇనుము మున్నగు కఠినలోహములను మారణము జేయునపుడు గజపుటముతో పాకము జేయవలెను.

(B) స్వానుభూత సాంప్రదాయమున స్వర్ణభస్మ విధానము—ఒక తులము పరిమితిగల స్వచ్ఛమైన స్వర్ణపత్రములను గ్రహించి రెండుతులములపరిమితిగల రసకర్పూరముతో జేర్చి ఖల్వమునందు మృదుచూర్ణమగువరకును నూరవలెను. స్వర్ణము కర్పూరముతోగలిసి కొంతకాలము నూరగా మెత్తని చూర్ణమగును. అప్పుడు కొంచెము

నందు లీనమగువరకు మెల్లగా మర్దించవలెను. పిమ్మట నందు కొంచెము కొంచెముగా జంబీరస్వరసమును జేర్చుచు జాగ్రత్తగా మూడుదినములు

---

కొంచెముగా ముళ్లతోటకూర యొక్క సమూల స్వరసమును బోయుచు మూడుదినములు జక్కగా మర్దించి, యొక చక్రిక జేసి బాగుగా నెండించవలెను. పిమ్మట దీనినొక శరావమున నుంచి యూర్ధ్వాధోభాగములందు ద్విగుణముగా శుద్ధగంధకచూర్ణముతో గప్పి పైని రెండవశరావము నుంచి సంధిబంధనముజేసి యెండించవలెను. అటుపిమ్మట నీ శరావసంపుటమును పదునైదు పిడకల మధ్యనుంచి పుటము వేయవలెను. స్వాంగశీతలమున నా చక్రిక నందుండి దీసి దీనికి సమముగ రసకర్పూరమును జేర్చి ముళ్లతోటకూరయొక్క సమూల స్వరసముతో మూడుదినములు మర్దించి చక్రిక జేసి యెండించవలెను. పిమ్మట రెండు తులముల శుద్ధగంధకచూర్ణము నూర్ధ్వాధోభాగములందు గప్పి శరావసంపుటమునందు బంధించి తిరిగి పదునైదు పిడకల మధ్యనుంచి పుటము వేయవలెను. ఈ విధముగ పదిరెండు పుటములువేసిన పిమ్మట మరియొక పుటము పైవిధముగనే యేబది పిడకలతో వేయవలెను. పిమ్మట రెండు లేక మూడు పుటములు రసకర్పూరమును గంధకమును జేర్చక కేవలము ముళ్లతోటకూర రసముతో నూరి నూరు లేక నూటయేబది పిడకలతో వేయవలెను. అప్పటికి చంద్రికాదులు నశించి నిర్దుష్టమైన భస్మలక్షణములు గలిగి లేత గులాబీపుష్ప వర్ణముగల స్వర్ణభస్మ సిద్ధమగును.

మర్దించి, చక్రికగా జేసి గాఢాతపమున నెండించవలెను. ఒక చిన్న శరావసంపుటమును గ్రహించి యందొక దానియందు స్వర్ణపారదముల పరిమితికి సమానముగ గ్రహింపబడిన శుద్ధగంధకములో సగభాగము పరచి దానిపై యీ చక్రికనుంచి తిరిగి దానిపై రెండవ సగము గంధకమును పరచి, రెండవ శరావతో కప్పి దృఢముగా వాటిసంధిని మృల్లేపిత వస్త్రఖండముచే బంధించవలెను. ఇది బాగుగా నెండినపిమ్మట నీ సంపుటమును ముప్పది పిడకలమధ్య నుంచి పుటను వేయవలెను. స్వాంగశీతలమున నందుండి యీ చక్రికను గ్రహించి పైవిధముగనే శేయవలెను. అనగా స్వర్ణమునకు సమముగ రసమును జేర్చి నూరుచు చక్రికకు సమపరిమితిని శుద్ధగంధకముచే నూర్ధ్వాధోభాగముల దానిని కప్పుచు పుటము వేయవలెను. ఇటుల పదునాలుగు పుటములు వేసిన స్వర్ణము నిర్దుష్టమైన భస్మయగును.

## సువర్ణభస్మ గుణములు *

శ్లో॥ సువర్ణం శీతలం వృష్యం బల్యంగురు రసాయనం।
స్వాదుతిక్తంచ తువరం పాకేచ స్వాదు పిచ్ఛిలం॥

---

* (1) స్వర్ణమునకు పక్వాపక్వ భేదముచే గలుగు గుణభేదము.—"అపక్వమేవ సంశుద్ధం, పక్వంతత్తు రసాయనం॥" ఆ-ప్ర —పైని చెప్పబడిన గుణములన్నియు కేవలము శుద్ధమైన స్వర్ణమునకే యుండుననియు, పక్వమైన యనగా యథావతుగ మారితమైన స్వర్ణభస్మ రసాయనమగుననియు శ్రీమాధవాచార్యుడు దెలిపియున్నాడు. మరియు, కేవలము స్వర్ణమునకు మాత్రమే యపక్వస్థితి యందు వ్యాధిహరణశక్తి యుండుటయేగాకుండ తామ్రము

పవిత్రం బృంహణం నేత్ర్యం మేధాస్మృతిమతి ప్రదం।
హృద్యమాయుష్కరం కాంతి వాగ్విశుద్ధి స్థిరత్వకృత్
విషద్వయ క్షయోన్మాద త్రిదోష జ్వరశోక జిత్॥

అ-హ్ర

---

నకుగూడ నట్టిస్థితిలో నట్టిశక్తి యుండునట్లు రసపద్ధతి కార డగు శ్రీ బిందుపండితుడుగూడ దెలిపియున్నాడు. "పక్వ హేమరసాయనం విదు రథాపక్వం తు సద్యో విషప్రధ్వం క్షయిబృంహణం వమిహరం వర్ణ్యం జ్వరిభ్యో హితం రూప్యాద్యేషు విమృశ్యవాదిభిరుపక్షిప్తోఽస్త్య పక్వే గుణ స్తామ్రంచాపి విషార్తి హృన్నిగదితం వైద్యై రపక్వ ధ్రువం॥" ర-ప.—దీనినిబట్టి స్వర్ణము తామ్రము సంశు ములైనంతమాత్రాన వ్యాధులందు ప్రయోగింప నర్హమ లగుననియు, మారితములైనప్పు డవి రసాయనార్థమై ప్రయోగింపదగినవనియు దెలియగలదు. కాని తామ్రమ వాంతిభ్రాంత్యాదికరమగుటచే నపక్వస్థితిలో నయ్యది వాం కరమే యగును గాని వ్యాధిహరము గానేరదని తెలిం వలెను. మరియు, నపక్వములగు స్వర్ణతామ్రముల ప్రయో విధానము వాగ్భటమున, "విషభుక్తాయ దద్యాచ్ఛు శుద్ధ యోర్ధ్వమధస్తథా। సూక్ష్మం తామ్రరజః కాలే సక్షౌద్ర హృద్విశోధనం॥ శుద్ధే హృది తతః శాణం హేమచూర్ణస్య దాపయేత్। న సజ్జతే హేమపాంగే పద్మపత్రేఽంబువద్విషం॥ అని తెలుపబడినది. అవగా—విషభుక్తున కూర్ధ్వాధశో నము జేసి శుద్ధతామ్రముయొక్క సూక్ష్మచూర్ణమును

బంగారము మధురరసమును, తిక్తకషాయానురసములను, గురు పిచ్ఛిల గుణములను, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. రసాయనము. పవిత్రము. బృంహ

---

మితిననుసరించి తేనెతో గలిపి యిచ్చిన యయ్యది హృదయ శోధకమగును. పిమ్మట నొక శాణప్రమాణము శుద్ధ స్వర్ణ చూర్ణమును తేనెతో గలిపి యొసంగినచో విషమువల్ల నెన్నటికిని యెట్టివికారమును గలుగనేరదు. మరియు, నితర వ్యాధులందుగూడ నపక్వ స్వర్ణప్రయోగవిధాన మిట్లు తంత్రాంతరమున జెప్పబడినది. "అపక్వం హేమసంఘృష్టం శిలాయాంజలయోగతః। ద్రవరూపంతు తత్పేయం మధునా గుణదాయకం॥" అని, అనగా—శుద్ధస్వర్ణమును పరిశుద్ధ మగు శిలపై జలసంయోగమున నరుగదీసి యందు తేనె గలిపి సేవించిన యితరవ్యాధులు శమించును. ఇందు రూప్యాధిధాతువుల కపక్వస్థితిలో ప్రయోగార్హత శాస్త్ర కారులచే నంగీకరింపబడలేదు. దీని వివరము రజతప్రసంగ మున దెలుపబడును.

(2) అసమ్యఙ్మారిత స్వర్ణభస్మచే గలుగు వికార ములు—"అసమ్యఙ్మారితం స్వర్ణం బలం వీర్యం చ నాశ యేత్। కరోతి రోగాన్ మృత్యుంచ తద్ధన్యాద్యత్నతః తతః॥" ఆ-ప్ర.—బంగారును యథోక్తవిధి ననుసరించి మారితము గావింపక యుపయోగించినచో నయ్యది బల మును, వీర్యమును నశింపజేయును. అనేకవిధములగు వ్యాధులను బుట్టించి తద్వారా మరణమును గలిగించును.

ణము. నేత్రములకు హితమైనది. మేధాశక్తిని, స్మరణశక్తిని, బుద్ధిశక్తిని వృద్ధిజేయును. హృదయమునకు హితమైనది. ఆయుస్సును వృద్ధిజేయును. కాంతిని గలిగించును. వాగ్విశుద్ధి నొసంగును. ధాతుస్థైర్యమును గలిగించును. ద్వివిధములగు విషవికారములను, రాజయక్ష్మను, ఉన్మాదమును, సన్నిపాతజ్వరమును, శోకమును బోగొట్టును.

---

కావున వైద్యుడు గుర్తెరిగి యట్టి వికారములను వెంటనే శమింపజేయుటకు ప్రయత్నింపవలెను.

(3) స్వర్ణాదిలోహములకు మాత్రాపరిమితి—"యవవృద్ధ్యా ప్రయోక్తవ్యం హేమగుంజాష్టకం, రవిః। తారం తద్ద్విగుణం, లోహమన్యత్తు త్రిగుణాధికం॥ గుంజామేకాం సమారభ్య యావత్స్యుర్నవరక్తికాః। తావల్లోహం సమశ్నీయాద్ యథాదోష బలం నరః॥" ఆ-ప్ర.—స్వర్ణభస్మ నొక యవ మొదలుకొని యెనిమిది గుంజల పర్యంతము ప్రయోగించవలెను. తామ్రభస్మను, రజతభస్మను, పైదానికి ద్విగుణముగా బ్రయోగించవలెను. ఇతరలోహములను స్వర్ణపరిమితికి త్రిగుణముగా ప్రయోగించవలెను లేక, యాయా దోషబలము ననుసరించి యొక గుంజ పరిమితి నారంభించి లోహభస్మను తొమ్మిది రక్తికలవరకు ప్రయోగింపవచ్చును.

(4) స్వర్ణమున కనుపానభేదముచే గలుగు గుణభేదము—"మధ్వామలక చూర్ణంతు సువర్ణం చేతితత్త్రయం ప్రాశ్యారిష్ట గృహీతోఽపి ముచ్యతే ప్రాణసంకటాత్ మేధాకామస్తువచయా శ్రీకామః పద్మకేసరైః। శం॥

## స్వర్ణమునకు రసాయనకల్పనము

శ్లో॥ శిలాజతు ప్రయోగైస్తు తాప్యసూతకయో స్తథా।
అన్యై ర్రసాయనై శ్చాపి ప్రయోగో స్యోత్తమః॥
ఆ-ప్ర.

స్వర్ణభస్మను గోమూత్రశిలాజతులోగాని, స్వర్ణమాక్షికభస్మతో గాని, పారదభస్మతోగాని, యితరములైన రసాయనికభస్మలతో నన గా నభ్రకభస్మ వైక్రాంతభస్మ మున్నగువానితోగాని చేర్చి రసాయనార్థమై కల్పింపవలెను.

## స్వర్ణయోగములు

### (1) మహామృగాంకరసము

శ్లో॥ నిరుత్థ భస్మసౌవర్ణం ద్విగుణం భస్మసూతకం। త్రిగుణం భస్మముక్తోత్థం శుకపుచ్ఛం చతుర్గుణం॥ మృతతాప్యం చ పంచాంశం దద్యా దత్ర భిషక్ సుధీః। సప్తభాగం

పుష్పా న్యవయోఽర్థీచ విదార్యాచ ప్రజార్థకః॥'' ఆ-ప్ర.—ఎటువంటి వ్యాధ్యరిష్టములచే బీడింపబడువాడైనను స్వర్ణభస్మను యథోక్తప్రమాణమున ఆమలకచూర్ణముతో గలిపి తేనెతో సేవించినయెడల అట్టి వికారము వెంటనే శమించును. వసచూర్ణముతో సేవించిన మేధాశక్తి వృద్ధియగును. పద్మకింజల్కముల చూర్ణముతో సేవించిన లక్ష్మీసంపన్నుడగును. దింతెనవేరు చూర్ణముతో సేవించిన పిన్నవయస్సేర్పడును. నేలగుమ్మిడి చూర్ణముతో సేవించిన సంతానము కలుగును.

ప్రవాళంచ రసతుల్యంచ టంకణం॥ సర్వమేకత్ర
సమ్మర్ద్య త్రిదినం నింబవారిణా। తత్తతో గోళక
కృత్వా శోషయిత్వా ఖరాతపే॥ లవణైః పాత్రమా
పూర్య తన్మధ్యే గోళకం క్షిపేత్। తన్ముఖం చ మృదా
రుద్ధ్వా పచేద్యామ చతుష్టయం॥ ఆకృష్య చూర్ణిత
శుద్ధం ప్రదేయం పూర్వభాగికం। వజ్రంచ తదభావే తె
వైక్రాంతం తత్సమాంశకం॥ మహామృగాంకః ఖల
సిద్ధ ఏష శ్రీనంది నాథ ప్రకటీకృతోఽయం। వల్లోఽస
సేవ్యో మరిచాజ్యయుక్తః సేవ్యోఽథవా పిప్పలిక
సమేతః॥ అత్రోపచారాః కర్తవ్యాః సర్వేక్షయగద
దితాః। బల్యం ఘృతం చ భోక్తవ్యం త్యాజ్యంశా
విరోధియత్॥ యక్ష్మాణం బహురూపిణం జ్వరగణ
గుల్మం తథావిద్రధిం మందాగ్నిం స్వరభేదకాసమరుచి
వాంతించ మూర్ఛాం భ్రమం। అష్టావేవ మహ
గదాన్ గదగణాన్ పాండ్వామయం కామలా
పిత్తార్తిం సమనగ్రహాన్ బహువిధా నన్యాంస్తథ
నాశయేత్॥ భై-ర

యథోక్తవిధానమున సిద్ధముజేయబడిన స్వర్ణభస్మ మొకభాగమ
రసభస్మ రెండుభాగములు, మౌక్తికభస్మ మూడుభాగములు, శుద్ధగం
కము నాలుగుభాగములు, స్వర్ణమాక్షికభస్మ యైదుభాగములు, ప్రవా
భస్మ యేడుభాగములు, శోధితటంకణము రెండుభాగములు ఇటు
గ్రహించి వీటినన్నిటిని ఖల్వమునందుంచి వేపచెక్క కషాయముల
మూడుదినములు చక్కగా మర్దించి యొక గోళమునుజేసి దానిని గా
తపమున నెండించవలెను. పిమ్మట నొక భాండమును లవణము

బూరించి దీని మధ్యభాగమున నీ గోళమునుంచి యా భాండముఖమును
శరావముచే గప్పి వీటి సంధికి మృల్లేపనము జేయవలెను. పిమ్మట
నీ భాండము నగ్నిపై నుంచి నాలుగుఝాములు పాకము జేయవలెను.
స్వాంగశీతలమున నందుండి యా గోళమును గ్రహించి ఖల్వమునందు
చూర్ణించవలెను. పిమ్మట నందు స్వర్ణమునకు సమానముగ పరిశుద్ధమైన
వజ్రభస్మనుగాని, వైక్రాంతభస్మనుగాని చేర్చి కలియనూరవలెను.
ఇటుల సిద్ధముజేయబడినట్టిది మహామృగాంకరసమని వ్యవహరింపబడును.
దీని నొక వల్లప్రమాణము గ్రహించి మరిచ చూర్ణములో గలిపిగాని,
పిప్పలిచూర్ణములో గలిపిగాని ఘృతములో సేవించవలెను. దీనిని
సేవించునప్పుడు క్షయరోగివలె బలకరమైన యాహారమును ఘృతములో
జేర్చి భుజించవలెను. సాహసమైన కార్యములను విడువవలెను. ఇయ్యది
రాజయక్ష్మను, జ్వరములను, గుల్మమును, విద్రధిని, అగ్నిమాంద్యమును,
స్వరభేదమును, కాసను, అరుచిని, వాంతిని, మూర్ఛను, భ్రమను, మహా
రోగములను, పాండువును, కామిలను, పిత్తవికారములను, మానసిక
వికారములను, సమస్తమైన వ్యాధులను బోగొట్టును.

## (2) బృహత్కాంచనాభ్రరసము

శ్లో॥ కాంచనంరససిందూరం మౌక్తికంలోహ మభ్రకం।
విద్రుమంమృతవైక్రాంతం తారంతామ్రం చ వంగకం॥
కస్తూరికా లవంగం చ జాతీకో శైలవాలుకం। ప్రత్యేకం
బిందుమాత్రం చ సర్వం మర్ద్యం ప్రయత్నతః॥ కన్యా
నీరేణ సమ్మర్ద్య కేశరాజ రసేనచ। అజాక్షీరేణ
సంభావ్యం ప్రత్యేకం దివసత్రయం॥ చతుర్గుంజాప్రమా
ణేన వటికాంకారయేద్భిషక్। అనుపానం ప్రదాతవ్యం
యథాదోషానుసారతః॥ నానారోగప్రశమనం సర్వోప

ద్రవసంయుతం। క్షయం హన్తి తథాకాసం యక్ష్మాణం శ్వాసమేవచ॥ ప్రమేహాన్ వింశతిం చైవ దోషత్రయ సముత్థితాన్। సర్వాన్ రోగాన్ నిహన్త్యాశు భాస్కర స్తిమిరం యథా॥ భై - ర.

స్వర్ణభస్మ, రససిందూరము, మౌక్తికభస్మ, లోహభస్మ, అభ్రక భస్మ, విద్రుమభస్మ, వైక్రాంతభస్మ, రజతభస్మ, తామ్రభస్మ, వంగ భస్మ, కస్తూరి, లవంగచూర్ణము, జాజికాయచూర్ణము, జాపత్రిచూర్ణము, కూతురుబుడమచూర్ణము వీటినన్నింటిని సమాంశములుగ గ్రహించి, యిందలి కస్తూరిని విడచి మిగిలినవాటినన్నింటిని ఖల్వమునందుంచి కలబందరసముతో మూడుదినములును, గుంటకలగరాకు రసముతో మూడు దినములును, మేకపాలతో మూడుదినములును జక్కగా మర్దించవలెను. పిమ్మట నందు కస్తూరిని జేర్చి యొకదినము కలియనూరి నాలుగు గురిగింజల ప్రమాణమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. వీటిని అనుపానభేదములతో సేవించిన సమస్తమైన వ్యాధులును శమించును. విశేషముగా రాజయక్ష్మ, కాసము, శ్వాసము, వింశతి మేహములు లోనున్నగు వ్యాధులెల్ల శమించును.

## (3) స్వర్ణఘటిత షడ్గుణబలిజారిత మకరధ్వజ

శ్లో॥ పలమేకం సువర్ణస్య రసేంద్రస్య పలాష్టకం। రసస్య ద్విగుణం గంధం కజ్జలీకృత్య యత్నతః॥ కుమారికా రసైర్భావ్యం కాచపాత్రే నిధాపయేత్। వాలుయంత్రే చ సంస్థాప్య క్రమతస్త్రిదినంపచేత్॥ స్వాంగశీతం సమాదాయ పుష్పారుణ రజస్సమం। యవమాత్రం ప్రదాతవ్యం అహివల్లీదళైస్సహ॥ రసస్య షడ్గుణైః

ర్గంధైః పూర్వవత్కజ్జలీకృతే। భావితే పాచితే సమ్యక్
మద్గుణో బలిజారితః॥ విధివత్సేవితో హ్యేష ముమూర్షు
మపిజీవయేత్। ఏతదభ్యాసతశ్చైవ జరామరణ నాశనం॥
అనుపాన విశేషేణ కరోతి వివిధాన్ గుణాన్। జ్వరం
త్రిదోషజం ఘోరం మందాగ్నిత్వమరోచకం॥
అన్యాంశ్చ వివిధాన్ రోగాన్ నాశయేన్నాత్రసంశయః।
కరోత్యగ్నిం బలం పుంసాం వలీ పలిత నాశనః॥
మేధాయుః కాంతిజననః కామోద్దీపనకృన్మహాన్।
భాస్వజ్జ్యోతి ర్యథా భాతి కాచే నీలాంది కేశుభే॥ త
థానుపానభేదేన క్రియాకారీ మకరధ్వజః॥ భై-ర.

బంగారు రేకులు ఒకపలము, శుద్ధపాదరసము ఎనిమిదిపలములు, శుద్ధ గంధకము నలుబదియెనిమిది పలములు ఇట్లు గ్రహించి వీనిలో తొలుత బంగారు రేకులను పాదరసమును ఖల్వమునందుంచి బంగారము రసములో కలిసిపోవునంతవరకు మెల్లగా మర్దించవలెను. పిమ్మట పదునారు పలముల గంధకము నందు జేర్చి కజ్జలియగువరకు నూరవలెను. అటు పిమ్మట కలబందరసమును బోసి మూడుదినములు చక్కగా నూరి, గుండించి మెత్తగా చూర్ణమగునట్లు తిరిగి నూరి కాచకూపికయందు నింపి, దీనిని సికతా యంత్రమునం దమర్చవలెను. పిమ్మట నీ యంత్రమును అగ్నిపై నుంచి మూడుదినములు క్రమాగ్నులతో పాకము చేయవలెను. (దీని పాకవిధానమంతయు రసప్రకరణమున తెలిపిన రససింధూర పాక విధానము ననుసరించియే యుండునని యిట తెలియవలెను). స్వాంగ శీతలమున కూపికయొక్క కంఠమునందు లగ్నమైన సింధూరమును, కూపికాధోభాగమున నిలిచియుండు స్వర్ణమును గ్రహించి దీనిని ఖల్వమునందు మెత్తగా కలియనూరవలెను. పిమ్మట పదునారు పలముల గంధకము నందుజేర్చి బాగుగా కలియనూరి తిరిగి కలబందరసముతో

మూడుదినములు మర్దించి యెండింపవలెను. పిమ్మట దానిని చూర్ణముగా నూరి పైవిధముగనే పాకముచేయవలెను. స్వాంగశీతలమున నందలి యౌషధమును పైవిధముగనే గ్రహించి దీనితో మిగిలిన రెండుభాగముల గంధకమును జేర్చి పైవిధముగనే మర్దనపాకముల గావించి యందలి యౌషధ ద్రవ్యమును గ్రహింపవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది స్వర్ణఘటిత షడ్గుణబలిజారిత మకరధ్వజమని వ్యవహరించబడును. ఈ యౌషధమును ఒక యవ పరిమితిని తమలపాకుల రసముతో సేవించినయెడల మరణసన్నద్ధునిగూడా తిరిగి జీవింపజేయును. మరియు, వను పానవిశేషములతో సేవించినయెడల రసాయనమగును. అనేకవ్యాధు అను బోగొట్టును. అందు, త్రిదోషజ జ్వరము, అగ్నిమాంద్యము, అరుచి మున్నగువానిని బోగొట్టును. జాఠరాగ్ని వృద్ధిబొందును. బలము వృద్ధియగును. వలీపలితములు నశించును. మేధాశక్తి, ఆయువు, కాంతియుం వృద్ధియగును. కామోద్దీపనమగును. ఈ మున్నగు గుణవిశేషములన్నియుం నీ యౌషధసేవచే నిశ్చయముగ గలుగును.

## (4) వసంతకుసుమాకరము

శ్లో॥ పృథగ్ద్వౌ హాటకం చంద్రం త్రయో వంగాహి కాంతజం।
చత్వారః సూతమభ్రంచ ప్రవాళం మౌక్తికం తథా॥
భావనా గవ్యదుగ్ధేక్షు వాసాశ్రీ ద్విజలైర్నిశా। మోచా
కందరసైస్సప్త క్రమాద్భావ్యం పృథక్ పృథక్॥
శతపత్రరసేనైవ మాలత్యాః కుసుమైస్తథా। పశ్చా
న్మృగమదైర్భావ్యః సుసిద్ధో రసరాడ్భవేత్॥ కుసుమా
కరవిఖ్యాతో వసంతపదపూర్వకః। వల్లద్వయమితః
సేవ్యః సితాజ్య మధుసంయుతః॥ వలీపలితహృన్మేధ్యః
కామదః సుఖదః సదా। మేహఘ్నః పుష్టిదః శ్రేష్ఠః

పరంవృష్యో రసాయనం॥ ఆయుర్వృద్ధికరం పుంసాం ప్రజాజననము త్తమం। క్షయకాస తృషోన్మాద శ్వాస రక్త విషా ర్తిజిత్॥ సితాచందన సంయు క్తం అమ్ల పిత్తాదిరోగజిత్। శుక్లపాం డ్వామయాన్ శూలాన్ మూత్రా ఘాతా శ్మరీంహరేత్॥ యోగవాహి త్విదం సేవ్యం కాంతిశ్రీబలవర్ధనం। సుసాత్మ్య మిష్టభోజీచ రమయే త్ప్రిమదాశతం॥ మదనం మదయన్ మద ముజ్జ్వలయన్ ప్రమదానివహానతివిహ్వలయన్।సురతైః సుఖదై ర్గతివిచ్యవనైః భవ సార జుషామయ మేవ సుహృత్॥ యో-ర.

స్వర్ణభస్మ రెండుభాగములు, రజతభస్మ రెండుభాగములు, వంగ భస్మ మూడుభాగములు, నాగభస్మ మూడుభాగములు, కాంతలోహ భస్మ మూడుభాగములు, రసభస్మ నాలుగుభాగములు, అభ్రకభస్మ నాలుగుభాగములు, విద్రుమభస్మ నాలుగుభాగములు, మౌక్తికభస్మ నాలుగుభాగములు ఇటుల గ్రహించి ఖల్వమునందుంచి ఆవుపాలతో నేడుదినములును, చెరకురసముతో నేడుదినములును, అడ్డసరముయొక్క సమూల స్వరసముతో నేడుదినములును, చందనకషాయముతో నేడు దినములును, రక్తచందనకషాయముతో నేడుదినములును, కురువేరు స్వరసముతో నేడుదినములును, పసపు స్వరసముతో నేడుదినములును, అరటిదుంప రసముతో నేడుదినములును, తామరపువ్వుల రసముతో నేడుదినములును, మాలతీపువ్వుల రసముతో నేడుదినములును జక్కగా భావనచేయవలెను. పిమ్మట స్వర్ణమునకు సమముగ కస్తూరి నందుచేర్చి యొకదినము జక్కగా కలియనూరవలెను. ఇటుల సిద్ధముచేయబడినట్టి యౌషధరాజము వసంతకుసుమాకరమని వ్యవహరింపబడును. దీనిని రెండు వల్లముల పరిమితిని తేనె చక్కెర నెయ్యి వీటితో గలిపి సేవిం

-చినయెడల వలీపలితములు నశించును. మేధాశక్తి వృద్ధియగును. కామో ద్దీపనమగును. శరీరమునకు పుష్టి ఏర్పడును. వెంటనే శుక్రమును గలి గించును. రసాయనము, ఆయువును వృద్ధిజేయును. సంతానము గలి గించును. ప్రమేహమును, క్షయను, కాసను, తృష్ణను, ఉన్మాదమును, శ్వాసను, రక్తదోషమును, విషమును బోగొట్టును. మంచిగంధపు చూర్ణము, చక్కెర వీనితో సేవించినయెడల అమ్లపిత్తము, శుక్ర మేహము, పాండువు, శూల, మూత్రాఘాతము, అశ్మరి యివి నశించును. ఈ యౌషధము యోగవాహియగును. అనగా నే యనుపానముతో జేర్చి సేవించినను అట్టి యనుపానగుణముతో జేరి తదనుకూలముగ వ్యాధిహార మగును. మరియు, నిది కాంతిని, ఐశ్వర్యమును, బలమును వృద్ధిజేయును. సాత్వికమై యిష్టమగు నాహారమును భుజించుచు దీనిని సేవించుచుండి నచో మిక్కిలి కామోద్దీపనముగలిగి స్త్రీలకు యథేచ్ఛగ ననుభవింప సమర్థుడగును.

## (5) మహాలక్ష్మీవిలాస రసము

శ్లో॥ స్వర్ణం తారం చ తామ్రం చ కాంతంలోహం చ కిట్టకం॥
అభ్రకం వంగనాగౌ చ మౌక్తికం విద్రుమం తథా॥
క్రమవృద్ధానిమూనీ సర్వతుల్యం పారదభస్మ చ।
గృహీత్వానిక్షిపేత్ ఖల్వే జాతిపత్ర రసేనతు॥ కటు
త్రయ రసేనాపి త్రిఫలాయా రసేనచ। చాతుర్జాత కషా
యేణ భావయే త్త్రిదినం పునః॥ కుంకుమస్య రసే నాథ
దర్పేణ చ విమర్దయేత్। మాషమాత్రాం వటీం
కృత్వా ఖాదేత్ యక్ష్మగదాదిషు॥ మహాలక్ష్మీ విలా
సోఽయం రసో యోగేషు పూజితః। క్షయం క్షయ
కృశం పాండుం మూర్ఛాం శ్వాసం చ కామిలాం॥

కాసం తథా జ్వరం గుల్మం శూలారోచకమాంద్యకం। ప్రమేహం కుష్ఠమర్శాంసి నాశయేచ్చ భగందరం॥ వీర్యవృద్ధిం ధాతుపుష్టిం కరోత్యోజో వివర్ధకః॥

ర - యో - ర.

స్వర్ణభస్మ ఒకభాగము, రజితభస్మ రెండుభాగములు, తామ్రభస్మ మూడుభాగములు, కాంతలోహభస్మ నాలుగుభాగములు, లోహభస్మ యైదుభాగములు, మండూరభస్మ యారుభాగములు, అభ్రకభస్మ యేడుభాగములు, వంగభస్మ యెనిమిదిభాగములు, నాగభస్మ తొమ్మిదిభాగములు, ముత్యపుభస్మ పదిభాగములు, పవడపుభస్మ పదకొండుభాగములు, యథోక్తవిధానమున పాకముజేయబడిన రససిందూరము అరువదియారుభాగములు ఇటుల గ్రహించి, యన్నింటిని ఖల్వమునందుంచి జాపత్రి కషాయముతోను, త్రికటుకముల కషాయముతోను, త్రిఫలా కషాయముతోను, చాతుర్జాతక కషాయముతోను ప్రత్యేకముగ మూడుమూడు దినములు చొప్పున మర్దించవలెను. పిమ్మట కుంకుమపువ్వు రసముతో నొకదినము మర్దించి యందు కస్తూరిని జేర్చి పై కషాయముతోనే మరియొకదినము మర్దించి మాషప్రమాణమున మాత్రలుజేసి సేవించవలెను. ఇటుల జేయబడినట్టిది మహాలక్ష్మీవిలాసరసము (లేక) క్రమవృద్ధి మహాలక్ష్మీవిలాసగసము అని వ్యవహరింపబడును. ఇది రాజయక్ష్మ,క్షయముచే గలిగిన కార్శ్యము, పాండువు, మూర్ఛ, శ్వాసము, కాసము, కామిల, జ్వరము, గుల్మము, శూల, అరుచి, అగ్నిమాంద్యము, ప్రమేహము, కుష్ఠము, అర్శస్సు, భగందరము మున్నగువ్యాధులను శమింపజేయును. వీర్యవృద్ధిని జేయును. ధాతువులను పోషించును. ఓజస్సును వృద్ధిపరచును.

## (6) సువర్ణసూర్యావర్తిరసము

శ్లో॥ ఏకభాగం సువర్ణం చ మృగనాభితదర్ధకం। టంకణం
త్రీణి భాగాని హేమాభం త్రీణి భాగకం॥ లవంగం చ
చతుర్భాగం నాగరం పంచభాగకం। కార్పాసబీజ
చూర్ణం చ పంచభాగం తథైవచ॥ ఏలాచూర్ణంతు
షడ్భాగం గుడూచీ సత్వసప్తకం। దరదం సప్తభాగం చ
సర్వం ఖల్వే వినిక్షిపేత్॥ లవంగాది కషాయేణ ఆర్ద్రి
కస్య రసేనహి। మర్దయేత్సప్త వారాణి మాషమాత్రా
వటీకృతా॥ యోజయేదనుపానేన పిత్తరోగోపశాన్తయే।
సూర్యావర్తి రసోనామ అశ్వినీదేవ నిర్మితః॥

ర - యో - ర.

స్వర్ణభస్మ మొకభాగము, కస్తూరి యర్ధభాగము, శుద్ధిజేసిన వెలి గారము మూడుభాగములు, నాగకేసర చూర్ణము మూడుభాగములు, లవంగచూర్ణము నాలుగుభాగములు, శుంఠీచూర్ణ మైదుభాగములు, వేయించిన ప్రత్తిగింజలచూర్ణ మైదుభాగములు, ఏలకులచూర్ణ మారు భాగములు, తిప్పసత్తేడుభాగములు, శుద్ధిజేయబడిన యింగిలీక మేడు భాగములు ఇటుల గ్రహించి, ఖల్వమునందుంచి లవంగాది కషాయ ముతో నేడుదినములును, అల్లపురసముతో నేడుదినములును జక్కగా మర్దించి మినుపగింజంత మాత్రలు జేయవలెను. ఇయ్యది సువర్ణసూర్యా వర్తి రసమని వ్యవహరింపబడును. అనుపానవిశేషములతో దీనిని సేవిం చినయెడల ఛర్ది, భ్రమ, మూర్ఛ, ఆస్యపాకము, పాండువు, కామిల, హృద్రోగము మున్నగు సమస్త పిత్తజ వ్యాధులను శమించును.

---

# రజతము

## రజతనామములు *

శ్లో॥ రూప్యం తు రజతం తారం చంద్రకాంతి సితప్రభం॥
భా-ప్ర.

---

* (1) రజతభేదములు—"రూప్యం త్రిధా స్యాత్సహజం కృత్రిమం ఖనిసంభవం। కైలాసాది స్థితం యద్ధి సహజం రజతం హితత్॥ రసేంద్రవేధ సంజాతం సంప్రోక్తం కృత్రిమం చ తత్। హిమాచలాది భూమౌచ జాయతే ఖనిజం చ తత్॥" ఆ-ప్ర.—వెండి సహజము, కృత్రిమము, ఖనిసంభవము అని మూడువిధములుగ నుండును. అందు, కైలాసాదిపర్వతములందుండునది సహజమనియు, పారదముచే వేధసంస్కారము జేయబడిన వంగమునుండి యేర్పడినట్టిది కృత్రిమమనియు, హిమవత్పర్వతాదులందు లభ్యమైనట్టిది ఖనిజమనియు దెలియవలెను.

(2) సదసద్రజత లక్షణము—"గురుస్స్నిగ్ధం మృదు శ్వేతం దాహచ్ఛేద ఘనక్షమం। వర్ణాఢ్యం చంద్రవత్స్వచ్ఛం రూప్యం నవగుణం శుభం॥ కృత్రిమం కఠినం రూక్షం రక్తం పీతం దళం లఘు॥" ఆ-ప్ర.—బరువుగ నుండునట్టియు, నిగనిగలాడుచుండునట్టియు, మృదువుగ నుండునట్టియు, తెల్లగ నుండునట్టియు, నిప్పులో గాల్చినప్పుడును, తెగగొట్టినప్పుడును, సాగగొట్టినప్పుడును ఎట్టి వికారములను జూపక సహించునట్టిదియు, దాహాదిక్రియలచే వర్ణాధిక్యత గలిగి

రూప్యము, రజతము, తారము, చంద్రకాంతి, సితప్రభ య
నవి రజతనామములు.

## రజతశోధనవిధానము *

శ్లో॥ సువర్ణరూప్య తామ్రాయః పత్రాణ్యగ్నౌ ప్రత
యేత్। కృత్వా కంటక వేధీని దృష్ట్వా వహ్నౌ సమాని·

---

నట్టియు, చంద్రునివలె నిర్మలమైనట్టిదియు యోగ్యమై
లక్షణములు గలిగిన రజతముగా గుర్తించవలెను. అన
నిట్టి లక్షణవిశిష్టమైన రజతము యోగములందు జేర్చ
నదిగా నుండునని భావము. కృత్రిమమైనట్టిదియు, క
ముగ నుండునట్టిదియు, రూక్షముగ నుండునట్టిదియు (
వెలబోవునట్టిది), ఎఱ్ఱనివర్ణముగలిగినట్టిదియు (లేక) పస
పచ్చని వర్ణము గలిగినట్టిదియు, సాగగొట్టునప్పుడు పగు
జూపునదియు, తేలికగా నుండునదియు దుష్టలక్షణము
గల రజతముగా గుర్తించవలెను. అనగా నిట్టి లక్షణవిశి
మైన రజతము యోగములందు జేర్చతగనిదిగా నుండు
భావము.

* రజతమునకు విశిష్ట శోధనము—"తామ్రా
సంసర్గభవం త్వశుద్ధం రూప్యంహి మిశ్రం ఖలుదోషలం
తచ్ఛోధయేద్వై భసితస్యమూషాం శీసేనసార్ధం రజతం
ధ్మాపయేత్॥ తారాచ్చ షడ్గుణం నాగం ధ్మాపయేద్యత్న
సుధీః। శనైర్విధమ్యమానంహి దోషశూన్యం ప్రజాయ
అనేనైవ ప్రకారేణ శోధయేద్రజతంసదా। సర్వకా

నిషించేత్తప్త తప్తాని తైలే తక్రే గవాంజలే। కాంజికే చ కులుత్థానాం కషాయే సప్తధా పృథక్॥ ఏవం స్వర్ణాదిలోహానాం విశుద్ధిః సంప్రజాయతే॥ ఆ-ప్ర.

వెండిని మిక్కిలి పలుచగనుండు రేకులవలె సాగగొట్టి ఎఱ్ఱని వర్ణము వచ్చువరకు నిప్పులపై వాటిని గాల్చి తిలతైలమునందు ముంచవలెను. ఇటులనే యా రేకులను గాల్చుచు తైలమునందు నేడుమారులును, తక్రమునందు నేడుమారులును, గోమూత్రమునందు నేడుమారులును, కులుత్థ కాంజికమునందు నేడుమారులును ముంచి, యుష్ణోదకముతో కడిగి యెండబెట్టిన నయ్యది పరిశుద్ధమగును.

---

ప్రయోక్తవ్యం సర్వసిద్ధి విధాయకం॥'' ర-ప్ర-ను.—వెండి రాగి మున్నగు లోహములతో మిశ్రమమైయుండినచో దీనికి ప్రత్యేక శోధనము జేయవలసియుండును. అటుల జేయనేని దోషయుక్తమై యనేక వికారములను గలిగించును. వెలిబూడిదను మూషగా జేసి, యందుగాని, యొక శరావమునందు వెలిబూడిదతో పాళిగట్టి యాపాళిమధ్యమునందుగాని రజతమునుంచి దీనితో షడ్గుణముండునట్లు సీసమును జేర్చి యా మూషను (లేక) శరావమును కొలిమిలో బెట్టి సీసక్షయమగువరకు జాగ్రత్తగా నూదవలెను. ఇటుల జేసినచో రజతము తామ్రాది లోహవిముక్తమై పరిశుద్ధమగును. ఇట్టిదియే యోగములందు జేర్చుకొనదగియుండునని తెలియనగును.

## రజతభస్మవిధానము *

శ్లో॥ సూతగంధకయోస్తార తుల్యయోః కజ్జలీంభిషక్।
ద్రవీకృత్య కుమార్యద్భిః తారపత్రాణి లేపయేత్
శరావ సంపుటే రుద్ధ్వా త్రింశదుత్పలకైః పుటేత్
ద్వివారం రజతస్యాశు భస్మస్యాత్ ప్రాయశః సి
జ

* స్వానుభూత సాంప్రదాయమున రజత
విధానము.—శుద్ధిజేసిన వెండిరేకులు (చిన్న చిన్న ప
లుగా కత్తిరింపబడినట్టివి) అయిదుతులములు, శుద్ధి
యింగిలీక చూర్ణము పదితులములు ఇటుల గ్రహి
యొక శరావమునందు పై యింగిలీక చూర్ణమును స
పలుచగా నుండునట్లు చల్లి దానిపై వెండిరేకులను
చగా పరచవలెను. పిమ్మట నింగిలీకచూర్ణమును పై
ముగనే యీరేకులపై జల్లి తిరిగి పలుచగా రే
దానిపై పరచవలెను. ఈ విధముగా వెండిరేకులను
లీకమును బూర్తిజేసి వేరొక శరావముచే గప్పి సంధి
జేసి యెండించవలెను. పిమ్మట నేబది పిడకల మధ్య
పుటము వేయవలెను. స్వాంగశీతలమున వంచుండి
రజతమును గ్రహించి ఖల్వమునందు మెత్తగానూరి
రజతమునకు సమముగా శుద్ధిజేసిన యింగిలీక చూర్ణ
జేర్చి జంబీరస్వరసములో జక్కగా మూడుదిన
మర్దించి చిన్నచిన్న చక్రికలుగా జేసి యెండించవ

శుద్ధిజేసిన పాదరస మొకభాగము, శుద్ధిజేసిన గంధక మొక భాగము, శుద్ధిజేసిన వెండిరేకు లొకభాగము ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిగానూరి పిమ్మట కలుబందరసముచే నా కజ్జలిని జక్కగానూరి రసపంకము జేయువలెను. దీనిచే వెండిరేకులకు లేపనముజేసి, యెండించి, వీటిని శరావసంపుటమునందు బంధించి ముప్పది పిడకలతో పుటము వేయవలెను. స్వాంగశీతలమున యా రజతమును గ్రహించి ఖల్వమునందు మెత్తగా నూరవలెను. పిమ్మట నందు రజతమునకు సమముగా శుద్ధపారదమును, శుద్ధగంధకమును జేర్చి కజ్జలి యగువరకు నూరి యందు కలుబందరసమునుబోసి జక్కగా మర్దించవలెను. తరువాత నా పిష్టమును చిన్న చిన్న చక్రికలుగాజేసి యెండించి వీనిని శరావసంపుటమునందు బంధించి పైవిధముగనే ముప్పది పిడకలతో పుటము వేయవలెను. ఇటుల జేసినచో రజతము తెల్లని భస్మ యగును.

## రజతభస్మ గుణములు *

శ్లో॥ రూప్యంశీతం కషాయామ్లం స్వాదుపాకరసం సరం।
వయసః స్థాపనం స్నిగ్ధం లేఖనం వాతపిత్తజిత్॥

---

పిమ్మట వీటిని శరావసంపుటమునందు బంధించి పైవిధముగనే పుటము వేయవలెను. ఈ విధముగా పదునాలుగు లేక పదునారు పుటములువేసిన వెండి భస్మయగును. ఇది కొంచె మెరుపువర్ణము గలిగియుండును.

* (1) శోధనముజేయకయే మారణముగావింపబడిన రజతముయొక్క దోషములు,—"తారం శరీరస్య కరోతితాపం విడ్బంధతాం యచ్ఛతి శుక్రనాశం। వీర్యం

ప్రమేహాదిక రోగాంశ్చ నాశయ త్యచిరా ద్ధ్రువం।
గుటి కాస్య ధృతా వక్త్రే తృష్ణా శోషవినాశనీ॥
ఆ-ప్ర.

---

బలంహన్తి తనోశ్చపుష్టిం మహాగదాన్ పోషయతిహ్యశుద్ధం॥" ఆ-ప్ర. రజతమును యథావిధిగ శుద్ధి జేయక భస్మ జేసి సేవించినచో శరీరతాపమును, విడ్బంధమును, శుక్ర నాశమును గలిగించును. వీర్యమును, బలమును క్షీణింప జేయును. శరీరపుష్టిని నశింపజేయును. ఇంకను మహారోగములను గలిగించును.

(2) అపక్వరజతమునకు ప్రయోగార్హత లేదు.—"అపక్వరజతం నైవసంయోజ్యం స్వర్ణవద్గదే। పక్వం భస్మాపి తన్నైవ యోజ్యం తామ్రాది భస్మవత్॥ వ్యవహారాభావతః కించ శ్వేతకుష్ఠకరం హితత్। ఇతిలోక ప్రసిద్ధిస్తు తస్మాద్యోజ్యం రసాదిషు॥" ఆ-ప్ర.— బంగారమువలె వెండిని పక్వముగావింపకయే అనగా మారణము పొందించకయే వ్యాధులయందు ప్రయోగింపగూడదు. మరియు, పక్వము జేయబడిననుగూడ తామ్రాది లోహములవలె ప్రత్యేకముగను వ్యాధులందు ప్రయోగింపగూడదు. అటుల ప్రయోగించినచో వ్యాధిహరణమునకు బదులు శ్వేతకుష్ఠమును (బొల్లిని) గలిగించును. అందుచే వ్యవహారమునందెచ్చుటను దీనికి ప్రత్యేక ప్రయోగము గానరాదు. కావున రసయోగములందు మాత్రము రజతభస్మను జేర్చుకొనవచ్చును.

వెండిభస్మ మధురరసమును, కషాయామ్లానురసములను, సరస్నిగ్ధ గుణములను, శీతవీర్యమును, మధుర విపాకమును గలిగియుండును. వయస్థాపకమగును. లేఖనము జేయును. వాత పిత్తములను శమింపజేయును. ప్రమేహాది వ్యాధులను శీఘ్రముగ బోగొట్టును. రజతభస్మతో జేయబడిన గుటికను వక్త్రమునందు ధరించినచో తృష్ణయు, ముఖశోషయు శమించును.

## రజతరసాయన విధానము

శ్లో॥ భస్మీభూతం రజతమమలం తత్సమా వ్యోమభానూ।
సర్వైస్తుల్యం త్రికటుకవరం సారఘాజ్యేనయుక్తం।
లీఢం ప్రాతః క్షపయతితరాం యక్ష్మపాండూదరార్శః
శ్వాసం కాసం నయనజరుజః పిత్తరోగా నశేషాన్॥
ర-ర-స.

యథావతుగ మారణముజేయబడిన రజతభస్మ, అభ్రకభస్మ, తామ్రభస్మ వీటిని సమాంశములుగ గ్రహించి వీటియన్నింటికిని సమముగా త్రికటు చూర్ణమును గలిపి మధు ఘృతములతో ప్రతి యుదయమునను సేవించుచుండినచో రాజయక్ష్మ, పాండువు, ఉదరము, అర్శస్సు, శ్వాసము, కాసము, నేత్రరోగములు, పిత్తవికారములు ఇవి యన్నియు శమించును.

## రజత యోగములు

### (1) రజతలోహరసాయనము

శ్లో॥ హింగులోత్థరసం భాగం ద్విభాగం శుద్ధగంధకం।
త్రిభాగం తీక్ష్ణలోహంచ రజతం చైకభాగకం॥

ఖల్వమధ్యే వినిక్షిప్య కుమారీ రసమర్దితం।
పునర్నవా వజ్రవల్లీ శ్లేష్మాగ్నిః శృంగిబేరకం॥
పాతలా రససమ్మర్ద్యం భృంగనీరేణ మర్దయేత్।
బదరీ ఫలమాత్రంచ కాచకూప్యాం వినిక్షిపేత్॥
వాలుకాయంత్ర మార్గేణ ద్వియామం మందవహ్నినా।
స్వాంగశీతల ముద్ధృత్య పూర్వాది రసకైః క్రమాత్॥
చతుర్గుంజా ప్రమాణేన అనుపాన విశేషతః।
సేవితం సప్తరాత్రంతు సర్వరోగ వికృంతనం॥
ఉదరం పాండురోగంచ కామిలా కుంభజం తథా।
సర్వక్షయాన్ నిహన్త్యాశు సర్వపాండూన్ వినాశయేత్॥
పథ్యం శాల్యోదనంచైవ గోక్షీరం గోధుమప్రియం।
రౌప్య లోహ రసో నామ అశ్వినీ దేవ నిర్మితం॥
ర-యో-ర.

ఇంగిలీకమునుండి తీసిన రస మొకభాగము, శుద్ధిజేసిన గంధకము రెండు భాగములు, లోహభస్మ మూడుభాగములు, రజతభస్మ మొక భాగము * ఇటుల గ్రహించి, తొలుత ఖల్వమునందు రసగంధకముల

---

* ఈ యోగమునందు భస్మలకు బదులు జీవలోహములనే శుద్ధిజేసి చేర్చుట యొక సాంప్రదాయముగలదు. లోహములకు రసగంధకములతో సమ్మేళన మేర్పడి యగ్ని తాపముచే మారణ మగుననియు, నందుచే జీవలోహములను జేర్చినచో నయ్యవి రసగంధకములతో గలిసియున్నప్పు డెట్టి దోషములను గలిగించక సుఖముగ జీర్ణమగునని వీరి మతమునందలి యభిప్రాయమైయున్నది.

నుంచి కజ్జలిజేసి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి కలబందరసముతో మూడు దినములును, గజ్జేరు వేళ్ల రసముతో మూడుదినములును, నల్లేరు రసముతో మూడుదినములును, చిత్రమూలరసముతో మూడుదినములును, అల్లపురసముతో మూడుదినములును, సంబరేణు రసముతో మూడుదినములును, గుంటకలగరాకు రసముతో మూడుదినములును జక్కగా మర్దించి రేగుకాయంత పరిమితిని గుటికలుజేసి యెండించవలెను. పిమ్మట వీటిని కాచకూపికయందుంచి, సికతాయంత్రమున నమర్చి రెండు యామములు పాకము జేయవలెను. గంధక గంధము నిలిచిపోవునరకు పాకము జేయువలెనని యిట దెలియవలెను. స్వాంగశీతలమున నందుండి యాగుటికలను గ్రహించి ఖల్వమునందు మెత్తగా చూర్ణించి పై రసములతో క్రమముగ పై విధముగనే తిరిగి మర్దించవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది రజతలోహ రసాయన మనబడును. నాలుగు గురిగింజల పరిమితిని అనుపాన భేదములతో సేవించిన యెడల యేడుదినములలోనే సమస్త వ్యాధులను శమింపను. అందు ఉదరము, సమస్తపాండువులు, కామిల, కుంభకామిల, క్షయము మున్నగునవి శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు శాల్యోదనము, గోధుములు, ఆవుపాలు వీనిని పథ్యముగా సేవింపవలెను.

## (2) రజత చంద్రోదయము

శ్లో॥ రజతం చైకభాగంతు రసేంద్రం చాష్టభాగకం।
సూతాద్ద్విగుణగంధంచ ఖల్వేదత్వా విమర్దయేత్॥
కన్యారసేన త్రిదినం శోషయే చ్చూర్ణయేత్తతః।
కాచకుంభే నిధాయైతత్ వాలుకాయంత్రగం పచేత్॥
క్రమాగ్నిభిస్తథా త్రీణి దినాని కుశలోభిషక్।
స్వాంగశీతల ముద్ధృత్య సిందూర మరుణప్రభం॥

లవంగం మరిచం జాతీఫలం కర్పూరమేవచ।
పృథక్ తార సమందత్వా శాణం మృగమదం తథా
నాగవల్లీ దలరసైః సర్వం సమ్మర్ద్య కారయేత్।
గుంజాప్రమాణాన్ గుటికాన్ ఏవసిద్ధో రసాయనః
రౌప్య చంద్రోదయోనామ పరం శుక్రస్య వర్ధనః।
అనుపాన విశేషైస్తు సర్వరోగ. వినాశనః॥
ప్రమేహం పాండురోగంచ కాసం చాజీర్ణమేనచ।
జీర్ణజ్వరం క్షయంచాపి నాశయే దితికీర్తితః॥
(అనుభూతము

శుద్ధిజేసిన వెండిరజను ఒకభాగము, శుద్ధిజేసిన పాదరస మిదిభాగములు, శుద్ధిజేసిన గంధకము పదియారు భాగములు ఇట గ్రహించి వీటిని ఖల్వమునందు కజ్జలిజేసి కలుబందరసముతో జక్క మూడుదినములు మర్దించి యెండించవలెను. పిమ్మట మెత్తగ చూర్ణి కాచకూపికయందుంచి వాలుకాయంత్ర సహాయమున క్రమాగ్నులు మూడు దినములు పాకము జేయవలెను. స్వాంగశీతలమున నం సిందూరమును, పక్వమైన వెండిని గ్రహించి అందు లవంగచూర్ణ మిరియాల చూర్ణము, జాజికాయ చూర్ణము, పచ్చకర్పూరము క ప్రత్యేకముగ రజతముతో సమానముగ నుండునట్లు జేర్చి తమలపా రసముతో బాగుగా మర్దించి గురుగింజ ప్రమాణమున మాత్రలు సేవించవలెను. ఈ విధముగ సిద్ధమైన రసాయనము రజత చం దయమని వ్యవహరింపబడును. అనుపాన విశేషములతో సేవిం సమస్తవ్యాధులను శమింపజేయును. మిగుల శుక్రవర్ధకము. ప్రమేహ పాండువు, కాసము, అజీర్ణము, జీర్ణజ్వరము, క్షయము ఇవి శమించు

---

# తామ్రము

## తామ్ర నామములు *

శ్లో॥ తామ్రమహోదుంబరం శుల్బముదుంబర మితిస్మృతం।
రవిప్రియం మ్లేచ్ఛముఖం సూర్యపర్యాయనామకం॥
ఆ-ప్ర.

---

* (1) తామ్రభేదములు.—''తామ్రంతు ద్వివిధం ప్రోక్తం నేపాలం మ్లేచ్ఛనామకం। అతిశోణంమ్మృదుః, కృష్ణం కఠినం క్రమశః స్మృతం॥'' ఆ-ప్ర.—రాగి నేపాలము, మ్లేచ్ఛము అని రెండువిధములుగ నుండును. అందు నేపాల తామ్రము మిక్కిలి ఎఱ్ఱగను, మృదువుగను నుండును. మ్లేచ్ఛ తామ్రము నల్లనివర్ణముగలిగి కఠినముగ నుండును.

(2) సదసత్తామ్ర లక్షణములు.—''జపా కుసుమ సంకాశం స్నిగ్ధం మృదుఘనక్షమం। లోహనాగోజ్ఝితం తామ్రం నేపాలం మృత్యవేశుభం॥ కృష్ణం రూక్షమతి స్తబ్ధం శ్వేతంచాపి ఘనాసహం। లోహనాగయుతం శుల్బం మ్లేచ్ఛందుష్టం మృతౌత్యజేత్॥'' ఆ-ప్ర.—మందారపువ్వుతో సమానమైన వర్ణముగలిగి స్నిగ్ధముగను, మృదువుగను, సాగగొట్టినప్పుడు సహించునదిగను, లోహ నాగములతో సంబంధములేనిదిగను నుండునట్టి నేపాళతామ్రము భస్మచేయుటకై గ్రహింపదగియుండును. నల్లని వర్ణముగలిగి

తామ్రము, ఔదుంబరము, శుల్బము, ఉదుంబరము, రవిప్రియము, మ్లేచ్ఛముఖము, సూర్యనామకము అనునవి తామ్ర నామములు.

---

రూక్షముగను, మొద్దుగను, తెల్లగను, సాగగొట్టునప్పుడు సహింపక పగుళ్లుచూపునదిగను, లోహనాగములతో గలిసి యున్నదిగను నుండునట్టి మ్లేచ్ఛతామ్రము భస్మ జేయుటకు గ్రహింపదగనిదిగ నుండును.

(3) తామ్రస్వభావము.— "నవిషం విషమిత్యాహుః తామ్రంతు విషముచ్యతే। ఏకోదోషో విషే తామ్రే త్వష్టౌదోషాః ప్రకీర్తితాః। భ్రమో మూర్ఛా విదాహశ్చ స్వేదక్లేదన వాంతయః। అరుచి శ్చిత్తసంతాప ఏతేదోషా విషోపమాః"॥ అ-ప్ర.... తామ్రము పాషాణాది విషముల కంటె యధికమైన విషస్వభావమును గలిగియుండుటను బట్టి యిది యుత్తమ విషముగా జెప్పబడుచున్నది. ఎటులనగా- విషమునందు మరణమును గలిగించు స్వభావ మొక్కటియే యున్నది. కాని తామ్రమునందు మృత్యువుకంటెను హెచ్చు బాధాకరములగు నెనిమిది దోషములుగలవు. అయ్యవి భ్రమ, మూర్ఛ, దాహము, స్వేదము, క్లేదము, వాంతి, అరుచి, చిత్తసంతాపము అనునవియే. ఇట్టి దోషములతో గూడి యుండుటచే తామ్రమునకు స్వభావమైయున్నది. అనగా తామ్రమును యథావతుగ శోధింపక పోయినచో నీ పైని జెప్పిన వికారములను గలిగించునని భావము.

## తామ్ర శోధనవిధానము *

శ్లో॥ సువర్ణరూప్య తామ్రాయః పత్రాణ్యగ్నౌ ప్రతాప
యేత్। కృత్వాకంటకవేధీని ద్రుష్ట్వా వహ్నిసమానిచ॥
నిషించేత్తప్తతప్తాని తైలే తక్రేగవాంజలే। కాంజికేచ
కులుత్థానాం కషాయే సప్తథా పృథక్॥ ఏవం స్వర్ణాది
లోహానాం విశుద్ధిః సంప్రజాయతే॥ ఆ-ప్ర.

---

* తామ్రమునకు విశేషశోధనము.— "స్నుహ్యా
ర్కక్షీరలవణై స్తామ్రపత్రాణి లేపయేత్। అగ్నౌప్రతాప్య
నిర్గుండీ రసే సంసేచయే త్త్రిశః॥ స్నుహ్యార్క క్షీరసేకైర్వా
శుల్బశుద్ధిః ప్రజాయతే॥" ఆ-ప్ర.—జెముడుపాలు, జిల్లేడు
పాలు, సైంధవలవణము వీనిని ముద్దవలె నూరి రాగిరేకులకు
(పై విధముగా శుద్ధిజేసి యుంచినట్టి రేకులకు) లేపనము
జేసి, ఎండించి నిప్పులయందు ఎర్రనివర్ణము వచ్చువరకు
ఆ రేకులను గాల్చి వావిలాకు రసమునందు ముంచవలెను.
ఇదేవిధముగ లేపనము జేయుటయు, కాల్చి వావిలాకు రస
మున ముంచుటయు ముమ్మారు జేసిన తామ్రమునకు విశేష
శోధనమగును. అటుగాదేని తామ్రపత్రములను నిప్పు
లపై నెర్రగగాల్చి యట్టివానిపై స్నుహ్యర్కక్షీరములను
సేచనము జేయవలెను. ఈ విధానముగూడ ముమ్మారు
జేయదగియుండును. ఈ విశేష శోధనముచే తామ్రమున
కుండు విష సదృశస్వభావము నశించును. తామ్రమును
భస్మచేయుటకు ముందు ఈ చెప్పబడిన విశిష్ట శోధన విధా
నముతో దానిని శోధింపవలెనని యిట తెలియవలెను.

రాగిని మిగుల పలుచగనుండు రేకులవలె సాగగొట్టి యె
ఱ్ఱవర్ణము వచ్చువరకు నిప్పులపై వాటినిగాల్చి తిలతైలమునందు వ
వలెను. ఇటులనే యారేకులను గాల్చుచు తిలతైలమునందు నేడు
రులును, తక్రమునం దేడుమారులును, గోమూత్రమునం దేడుమారు
కుళుత్థ కాంజికమునం దేడుమారులును ముంచి యుష్ణోదకముతో
యెండబెట్టిన వయ్యవి పరిశుద్ధమగును.

## తామ్రభస్మ విధానము *

శ్లో॥ సూక్ష్మాణి తామ్రపత్రాణి కృత్వా సంస్వేదయేద్బు
వాసరత్రయ మమ్లేన తతః ఖల్వే వినిక్షిపేత్ ॥
పాదాంశం సూతకందత్వా యామ మమ్లేన మర్దయే
తతఉద్ధృత్య పత్రాణి లేపయే ద్ద్విగుణేనచ॥

---

* స్వానుభూత సాంప్రదాయమున తామ్ర
విధానము—శుద్ధిజేసిన తామ్రపత్రములను చిన్న
ముక్కలుగా కత్తిరించి వెడల్పుగనుండు శరావమున
గుళచూర్ణమును జల్లి దానిపై నాముక్కలను పలు
పరవవలెను. వీటిపై తిరిగి హింగుళచూర్ణమును
దానిపై వెనుకటివలెనే యా ముక్కలను పలుచగా
వలెను. ఈ విధముగ నైదుతులముల తామ్రపత్రమ
పదితులముల హింగుళమును ఆశరావమునునింపి,
వేరొక శరావముచే గప్పి దృఢముగ సంధిబంధనమ
నూటయేబది పిడకలతో పుటము వేయవలెను. పిద
స్వాంగశీతలమున నందలి తామ్రమును గ్రహించి ఖల

గంధకే నామ్లఘృష్టేన తస్యకుర్యాచ్చ గోళకం।
తతః పిష్ట్వాచ మీనాక్షీం చాంగేరీం వా పునర్నవాం॥
తత్కల్కేన బహిర్గోలం లేపయేద్ద్వ్యంగుళోన్మితం।
ధృత్వా తద్గోళకం భాండే శరావేణచ రోధయేత్॥
వాలుకాభిః ప్రపూర్యాథ విభూతి లవణాంబుభిః।
దత్వాభాండముఖేముద్రాం,తతశ్చుల్ల్యాంవిపాచయేత్॥
క్రమవృద్ధాగ్నినా సమ్యగ్యావద్యామ చతుష్టయం।
స్వాంగశీతం సముద్ధృత్య మర్దయేత్సూరణద్రవైః॥
యామైకం గోళకం తచ్చ నిక్షిపేత్సూరణోదరే।

---

నందు మెత్తగ చూర్ణించి పొన్నగంటియాకు రసముతో మూడుదినములు మర్దించి చిన్నచిన్న చక్రికలుగాజేసి యేబది పిడకలతో పుటము వేయవలెను. ఇదే విధముగ నేబదిపిడకలతో మూడు పుటములును, నూరుపిడకలతో మూడు పుటములును, నూటయేబది పిడకలతో మూడు పుటములును, రెండువందల పిడకలతో మూడు పుటములును ముగించవలెను. అటుపిమ్మట అడవికంద రసముతో మూడు దినములు నూరి యొకబిళ్లగా జేసి యెండించి, యడవికంద కల్కము నాబిళ్లకు నలుప్రక్కలను దళసరిగా కప్పి యొక గోళముగాజేసి దానికి మన్నుబూసిన గుడ్డను చుట్టి యెండబెట్టవలెను. దీనిని రెండువందల పిడకలమధ్య నుంచి పుటము వేయవలెను. ఈ విధముగ మూడుపుటములు పూర్తిజేయవలెను. వాంతి భ్రాంత్యాది దోషరహితమై కపోతవర్ణముగల తామ్రభస్మ సిద్ధమగును.

మృదా లేపస్తు కర్తవ్యః సర్వతోఽంగులమాత్రకః॥
పాచ్యం గజపుటేక్షిప్తం మృతంభవతి నిశ్చితం।
వమనంచ విరేకంచ భ్రమం క్లమమధారుచిం॥
విదాహం స్వేదముత్క్లేదం నకరోతి కదాచన॥ ఆ-ప్ర

యథోక్తవిధానమున శుద్ధిజేయబడిన తామ్రపత్రములను చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి డోలాయంత్ర సహాయమున కాంజి ముతో మూడుదినములు స్వేదనము జేయవలెను. పిమ్మట వీటిని ఖల్వ మునందుంచి యందు ఈ ముక్కలపరిమితిలో నాల్గవభాగముండునట్లు శోధిత పాదరసమునుంచి జంబీర రసమును కొంచెము కొంచెముగా బోయుచు నొకరుఝాము ఈ రెండింటిని కలియ నూరవలెను. అనగా పాదరసమంతయు తామ్రపత్రముల కంటుకొనునంతవరకు నూరవలెన భావము. వేరొక ఖల్వమున తామ్రమునకు ద్విగుణముగ నుండునట్లు శోధిత గంధకమును గ్రహించి దీనిని జంబీరరసముతో జక్కగా నూ దీనితో నా నూతసహిత తామ్రపత్రములను లేపనము జేసి పిమ్మట వా వన్నింటిని కలిపి యొక గోళముగ జేయవలెను. పొన్నగంటియాకును పులిచెంచలియాకును, గలిజేరు వేరును కలిపి మెత్తగానూరి యీకల్క ములో పై గోళమునకు రెండంగుళముల దళసరిని లేపనము జేయవలెన ఈ గోళమును ఇసుకచే పూరింపబడిన భాండమునునుంచి (అనగా ఇసు మధ్యనుంచి) పైని శరావముచే గప్పి విభూతి లవణ పిష్టముచే దృ ఢముగా సంధిబంధనము జేయవలెను. పిమ్మట నీ భాండమును పొయి మీద నుంచి క్రమాగ్నులతో నాలుగు యామములు * పాకముజేం

---

* ఇచ్చట "తామ్రే కాష్ఠాదిజో వహ్నిః" ఆ-ప్ర. అని చెప్పబడుటచే కాష్ఠాగ్నిచేతనే తామ్రమునకు మా ణము గావింపదగియున్నట్లు దెలియదగినది.

వలెను. స్వాంగశీతలమున తామ్రగోళమును జాగ్రత్తగా గ్రహించి యడవికంద రసముతో నొక యామము మర్దించి, తిరిగి దీనినొక గోళముగా జేసి, యడవికంద కల్కముతో దానికి లేపనము జేయవలెను. పిమ్మట నొక యంగుళము దళసరిని మృల్లేపిత వస్త్రము నా గోళమునకు జుట్టి యొక గజపుటముచే పాకము జేయవలెను. ఇటుల పాకము జేయుటచే తామ్రము నిర్దుష్టముగను వాంతి భ్రాంత్యాది వికారరహితముగను భస్మయగును †.

## తామ్రభస్మ గుణములు *

శ్లో॥ తామ్రం కషాయం మధురంచతిక్తమమ్లంచ పాకే కటు సారకంచ। పిత్తాపహం శ్లేష్మహరంచశీతం తద్రోపణం

---

† తామ్రభస్మ లక్షణము.— "బర్హికంఠ ప్రభం తామ్రం మృతంభవతి కేవలం। పిష్టం చూర్ణత్వమాయాతి సరసంచే త్సచంద్రికం॥" ఆ-ప్ర.—తామ్రము నిర్దుష్టముగ మృతమైనట్టిది నెమలికంఠముతో సమమైన వర్ణముగలిగి నూరినచో మెత్తని చూర్ణమువలె నగును. పాదరసముతో గలిపి మూరితమైనప్పుడు చంద్రికతో గూడియుండును. అనగా తళతళమనుచుండును. ఇది స్వచ్ఛమైన తామ్రభస్మ లక్షణముగా గుర్తింపవలెను.

* అశుద్ధమారిత తామ్రభస్మ వికారములు.... "దాహః స్వేదోఽరుచిర్మూర్ఛా క్లేదో రేకో వమిర్భ్రమః। అసమ్యగ్శోధితే దోషాః తామ్రేఽసమ్యక్చ మారితే॥" ఆ-ప్ర.—తామ్రమును యథోక్తవిధానమున శోధింపక యే

స్యాల్లఘు లేఖనంచ॥ పాండూదరార్శోగర కుష్ఠ కాస
శ్వాసక్షయాన్ పీనసమమ్లపిత్తం। శోఫం క్రిమింశూల
మపాకరోతి ప్రాహుః పరే బృంహణమల్ప మేతత్॥
అ-ప్ర.

తామ్రభస్మ కషాయరసమును, మధురతిక్తామ్లానురసములను, లఘుగుణమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగియుండును దోషములను శోధించును. వ్రణరోపణము జేయును. దుష్టమాంసము నకు లేఖనము జేయును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. పాండు, ఉదరము, అర్శస్సు, గరవిషము, కుష్ఠము, కాసము, శ్వాసము, క్షయము, పీనసము, అమ్లపిత్తము, శోఫ, క్రిమి, శూలము వీనిని బోగొట్టును. తామ్ర భస్మ స్వల్పముగ బృంహణమగునని కొందరి మతము.

## తామ్రయోగములు

### (1) తామ్రపర్పటి

శ్లో॥ మృతం తామ్రం త్రిభాగం చ రసం గంధం చ తత్సమం।
భాగమేకం వత్సనాభం కజ్జలీ ఖల్వమధ్యగం॥ గోఘృతే
నకృతం కల్కం లోహపాత్రే విపాచయేత్। జాలయే
దర్కపత్రస్థాం పర్పటీం రససిద్ధయే॥ గుంజాద్వయం
త్రయంచైవ పిప్పలీ మధుసంయుతం। త్రిసప్తరాత్ర

మారితము గావించి సేవించినచో దాహము, స్వేదము, అరుచి, మూర్ఛ, క్లేదము, విరేకము, వాంతి, భ్రమ, అను నీ వికారములు గలుగును. కావున ఉక్త విధానమున తామ్రమును శోధించి మారితము గావింపవలెను.

యోగేన రోగరాజం చ నాశయేత్॥ ఆర్ద్రికస్య రసే
నైవ సన్నిపాతం నియచ్ఛతి। త్రిఫలారస సంయుక్తా
సర్వపాండుం వినాశయేత్॥ వాతారి తైలసంయుక్తా
సర్వశూలనివారిణీ। కుమారీ రసయోగేన వాతపిత్తోప
శాన్తికృత్॥ వాకుచీ రససంయుక్తా సర్వదద్రు వినాశినీ।
త్రిఫలా మధుసంయుక్తా సర్వమేహ నివారిణీ॥ ఖదిర
క్వాథపానేన కుష్టాష్టాదశ నాశినీ। మంథాన భైరవే
ణోక్తా లోకానాం హితకామ్యయా॥ యో-ర.

తామ్రభస్మము మూడుభాగములు, శుద్ధరసము మూడుభాగములు, శుద్ధగంధకము మూడు భాగములు, శుద్ధవత్సనాభి యొకభాగము ఇటుల గ్రహించి, వీటిని ఖల్వమునయుంచి చక్కగా కజ్జలి జేయవలెను. పిమ్మట తగుమాత్రముగా నందు గోఘృతమును జేర్చి ముద్దయగువరకు నూర వలెను. ఆ ముద్దను లోహపాత్రమునయుంచి సన్నని యగ్నిజ్వాలచే ద్రవీ భూతముజేసి గోమయస్థార్క పత్రములపై దానిని జాగ్రత్తగా వంపి దానిపై తిరిగి యర్కపత్రములను పరచి తిరిగి గోమయముచే గప్ప వలెను. స్వాంగశీతలమున దీసినచో నయ్యది పర్పటివలె సిద్ధమగును. ఇటుల సిద్ధము జేయబడినట్టిది తామ్రపర్పటి యనబడును. దీనిని రెండు లేక మూడు గురిగింజల ప్రమాణమున గ్రహించి పిప్పలిచూర్ణమునందు గలిపి తేనెతో నిరువదియొక్కదినములు సేవించినచో రాజయక్ష్మ శమించును. అల్లపురసముతో సేవించిన సన్నిపాతజ్వరము పోవును. త్రిఫలాకషాయముతో సేవించిన సమస్త పాండువులును, ఏరండతైల ములో సేవించిన సర్వశూలలును శమించును. కలబందరసములో సేవిం చిన వాతపిత్తములు శమించును. బావంచాల కషాయములో సేవించిన సమస్త దద్రువులును, త్రిఫలాచూర్ణమునందు గలిపి తేనెతో సేవించిన

సమస్త ప్రమేహములును, చంద్రకషాయముతో సేవించిన సమస్త కుష్ఠ
ములను శమించును.

## (2) పంచామృతపర్పటి

శ్లో॥ శుల్బమేకం ద్విధాతాలం చతుర్గుణ మయస్తథా। సూత
మష్టగుణంచైవ గంధం షోడశకం తతః॥ లోహపాత్రే
ద్రవీకృత్య పర్పటీం కారయేత్సుధీః। సైషా పంచా
మృతానామ్నా పర్పటీతి నిగద్యతే। గ్రహణీం రాజ
యక్ష్మాణ మతీసారం జ్వరంతథా। స్త్రీరోగం పాండు
రోగం చ గరమర్శోఽమ్లపిత్తకం॥ అరుచిం చాగ్ని
మాంద్యం చ నాశయే దవిశంకితా॥ ర-యో-ర

తామ్రభస్మ యొకభాగము, శుద్ధతాళకము రెండుభాగముల
లోహభస్మ నాలుగుభాగములు, శుద్ధపారదము ఎనిమిదిభాగములు, శు
గంధకము పదియారుభాగములు ఇటుల గ్రహించి, వీటిని ఖల్వమున
దుంచి కజ్జలిజేయవలెను. పిమ్మట లోహపాత్రయందుంచి యగ్నిసంయో
గమున ద్రవీభూతముగావించి పర్పటీవిధానము ననుసరించి సిద్ధముజేయ
వలెను. ఇయ్యది పంచామృతపర్పటి యనబడును. దీనిని మాత్రాపరిమి
తనుసరించి సేవించినయెడల సమస్త గ్రహణులు, రాజయక్ష్మ, అతి
సారము, జ్వరము, స్త్రీల గర్భాశయవ్యాధులు, పాండువు, గరవిషవ
అర్శస్సు, అమ్లపిత్తము, అరుచి, అగ్నిమాంద్యము ఇవియెల్ల శమించు.

## (3) ప్రళయాగ్నిరుద్రరసము

శ్లో॥ తామ్రాయసీ మృతేశుద్ధౌ నేపాలం పారదం తథా
ఖల్వే నిధాపయే త్తేషా మేకైకం భాగికం పృథక్
గంధం విషం చ సౌభాగ్యం హింగుళం ద్వ్యాచభాగికే

తాలస్య పంచభాగాః స్యుః షడ్భాగం రసకస్య చ॥ త్రిభాగాం కునటీం తత్ర దత్వా సర్వం విమర్దయేత్। జంభనిర్గుండికాగ్నీనాం రసైశ్చైకైకవాసరం॥ తథా చార్కస్య పయసా సౌరసేన రసేనచ। కారవల్లీరసైశ్చాపి గుటికాః కారయేద్బుధః॥ తామ్రపాత్రే నిధాయైతాః వాలుకాయంత్రగాః పచేత్। ద్వియామం తత ఉద్ధృత్య శీతలాః ఖల్వసంస్థితాః॥ పూర్వోక్త స్వరసైరేవ మర్దయేత్క్రిమతః పునః। ప్రలయాగ్ని రుద్రపూర్వో రసో ఖ్యాతో మహీతలే॥ గుంజాద్వయ మితాం మాత్రా మస్యఖాదేత్ యథానుపాం। జ్వర మష్టవిధంచైవ గ్రహణీం సర్వదోషజాం॥ జీర్ణజ్వరం చ యక్ష్మాణం నాశయేద్రసఉత్తమః। స్నానం తథేష్ట భక్తం చ తాంబూలం చాత్రభక్షయేత్॥

ర-యో-ర.

తామ్రభస్మ మొకభాగము, లోహభస్మ మొకభాగము, శుద్ధ నేపాళబీజ మొకభాగము, శుద్ధపాదరస మొకభాగము, శుద్ధగంధకము రెండుభాగములు, శుద్ధవత్సనాభి రెండుభాగములు, శుద్ధటంకణము రెండుభాగములు, శుద్ధహింగుళము రెండుభాగములు, శుద్ధతాళకము అయిదుభాగములు, శుద్ధఖర్పరము ఆరుభాగములు, శుద్ధమనశ్శిల మూడు భాగములు ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను ఖల్వమునం దుంచి కజ్జలిజేసి, అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి జంబీరస్వరసముతో నొకదినమును, వావిలాకు రసముతో నొకదినమును, చిత్రమూలరస ముతో నొకదినమును, జిల్లేడుపాలతో నొకదినమును, తులసీ స్వరస ముతో నొకదినమును, కాకరాకురసముతో నొకదినమును మర్దించ

వలెను. పిమ్మట దీనిని చిన్న చిన్న గుళికలుగాజేసి యెండించి, రా డబ్బీలో నుంచి, యిసుకచే పూరింపబడిన యొక భాండమధ్యము నా డబ్బీనుంచి రెండుయామములు పాకముజేయవలెను. స్వాంగశీత మున నా గుళికలను గ్రహించి, ఖల్వమునందు మెత్తగా చూర్ణించి తిరి పూర్వోక్త స్వరసములచే క్రమముగా మర్దించవలెను. ఇటుల సిద్ధమ జేయబడినట్టిది ప్రళయాగ్నిరుద్రరసమని వ్యవహరింపబడును. దీని రెండు గురుగింజల ప్రమాణమున అనుపానవిశేషములతో సేవించి యెడల వాతపిత్తకఫజ గ్రహణులును, జీర్ణజ్వరము, రాజయక్ష్మయు శమించును. దీనిని సేవించునప్పుడు శీతలజలపానము, ఇష్టాన్నభో నము, తాంబూలభక్షణమును హితములైనవి.

## (4) తామ్రాంజనము

శ్లో॥ ఆలం చ సౌవీరకమంజనం చ తాభ్యాం సమం తామ్ర
రజశ్చ సూక్ష్మం। పిల్లేషు రోమాణి నిషేవితోఽసౌ
చూర్ణః కరోత్యేకశలాకయాపి॥ అ-హృ-ఉ. 16

శుద్ధతాలక మొకభాగము, శుద్ధసౌవీరాంజన మొకభాగము శుద్ధ తామ్రచూర్ణము రెండుభాగములు ఇటుల గ్రహించి వీటిని ఖల్వమ నందుంచి మెత్తగా చూర్ణించవలెను. ఈ చూర్ణమును శలాకతో నేత్రముల కంజనము వేసినచో పిల్లీభూతములైన నేత్రవ్యాధులు శమించి రెప్పలయందు తిరిగి రోమములు జనించును.

---

# వంగము

## వంగ నామములు *

శ్లో॥ వంగం రంగం త్రపుప్రోక్తం తథాపిచ్చటమిత్యపి॥
ఆ-ప్ర.

వంగము, రంగము, త్రపు, పిచ్చటము అనునవి వంగనామములు.

---

* వంగభేదములు—"ఖురకం మిశ్రకంచేతి ద్వివిధం వంగముచ్యతే। ఖురకం శ్రేష్ఠ ముద్దిష్టం మిశ్రకం చావరం స్మృతం॥ ఖురకం చంద్రరూపాభ్యాభం ఖురాకారం చ కీర్త్యతే। ఏతల్లక్షణభిన్నంతు వంగం మిశ్రకనామకం॥" ఆ-ప్ర., "నాగాద్యైర్మిశ్రితం శ్యామం దుర్గంధి మలినంగురు। రసే రసాయనే నైవ యోజనీయం కదాచన॥" ర-ప్ర-సు.— తగరము, 'ఖురకము, మిశ్రకము' అని రెండువిధములుగా నుండును. వీనిలో ఖురవంగము శ్రేష్ఠమైనదిగను, మిశ్ర వంగము నీచమైనదిగను గుర్తించవలెను. అందు చంద్రుని వలెను, వెండివలెను కాంతిగలదియు, జంతువుయొక్క డెక్కవలె ఆకారముగలదియు శ్రేష్ఠమైనదిగా దెలియ వలెను. ఈ లక్షణమునకు భిన్నమైనది మిశ్రవంగమని నెరుంగవలెను. మరియు, నీ మిశ్రజాతివంగము సీసము మున్నగు లోహములతో మిశ్రితమై నల్లగను, దుర్గంధ ముతో గూడినదిగను, మలినముగను, మిక్కిలి బరువుగను నుండును. దీనిని రసయోగములందుగాని, రసాయనార్థము గాని ప్రయోగింపగూడదు.

## వంగశోధనము *

శ్లో॥ ద్రావయిత్వా నిశాయుక్తే క్షిప్తం నిర్గుండికారసే।
విశుధ్యతి త్రివారేణ ఖురవంగం నసంశయః॥

ర-ర-

తగరమును కరగించి పసుపు చూర్ణము కలిపిన వావిలాకురస
మందు మూడుమారులు ఢాళనముజేసినచో నయ్యది పరిశుద్ధమగును.

---

* వంగమును శోధించునప్పుడు గమనింపవల
నియమములు—,వంగము, సీసము, జసదము మున్న
మృదుద్రవ్యములు ద్రవీభూతములై యితరద్రవ ద్రవ్య
లతో సంయోగమేర్పడినప్పుడు అట్టి సంయోగమును సహి
పనేరక గొప్పశబ్దముతో చిన్న చిన్న తునుకలుగా విడిపో
యట్టి ద్రవ ద్రవ్యముల స్పర్శవలన నయ్యవి వేగవంతము
నలుదెసలకు వ్యాపించును. ఇట్టి వ్యాప్తి మిక్కిలి వేగము
గూడియుండుటచే సమీపముననుండువారికి బలమగు
ఘాతము గలిగించును, ఇది మిక్కిలి ప్రమాదభూయిష్ఠమై
దిగా గుర్తించవలెను. ఈ ప్రమాదమునుండి తప్పించుకొ
టకై యొక బలమగు ఇనుపపాత్రను (ఇనుపరోలువంటి
గ్రహించి దానిలో నౌషధద్రవ్యముల స్వరసాదులను ని
మధ్యభాగము సన్నని రంధ్రము గలిగివట్టిదియు, దళసరిగ
బరువుగను ఆ యినుపపాత్రయొక్క ముఖమును గప్పనం
చుట్టుకొలత గలదిగను నుండు ఒక రాతిపలకను దాని
మూసియుంచవలెను. దీర్ఘమగు నాళముగలిగిన రెం
యినుపదర్వియందు వంగమును కరిగించి నాళముయొక

## వంగభస్మవిధానము *

శ్లో॥ శుద్ధం వంగం క్షిపే ద్ధండ్యాం చుల్లిస్థాయాం శనైః శనైః। త దధో జ్వాలయే దగ్నిం ద్రుతే వంగే క్షిపే త్పునః॥ అపామార్గం చతుర్థాంశం చూర్ణం సంచాలయే

---

చివరభాగమున దృఢముగా నా దర్విని పట్టుకుని యా శిలా ఫలకముయొక్క రంధ్రముగుండా మెల్ల మెల్లగా లోపల నుండు ద్రవమునం దా వంగము నావాపము జేయవలెను. ఇటుల జేయుటవలన పైని దెలిపిన ప్రమాదము సంభవింప నేరదు. ఈ క్రియలో వైద్యుడు మిక్కిలి జాగరూకుడై యుండవలెను.

* స్వానుభూత సాంప్రదాయమున వంగభస్మ విధానము.—శుద్ధిజేయుబడిన వంగమును ఆకురాయితో సన్నని రజనుగా గోయవలెను. ఈ వంగరజను ఎనిమిదితులము లును, పసపు చూర్ణము పదియారుతులములును గ్రహించి చదరముగానుండు వస్త్రఖండమునుగాని, గోనెగుడ్డనుగాని యొక బల్లపై పరచి నాలుగువైపుల నొక్కొక్క యంగుళముచొప్పున విడచి, మధ్యభాగమున నా గుడ్డపై పసపు చూర్ణమును పరచి, పిదప నా వంగచూర్ణము నా పసుపుపై నంతటను జల్లి కడపట నిది నిశాచూర్ణములో కలియునట్లు నాలుగువ్రేళ్లతో నలుప్రక్కలకు కలియరాయవలెను. పిమ్మట నొకవైపునుండి యా వస్త్రఖండమును వర్తిగా చుట్టి దారముతో బిగువుగా పైని చుట్టబెట్టి, దీని రెండుకొనలకును నిప్పుముట్టించి గాలిలేని ప్రదేశమున నొక

దిదం। స్థూలాగ్రయా లోహదర్వ్యా యావ త్తద్భస్మ జాయతే॥ చూర్ణ ప్రక్షేపణం కార్యం స్వల్పం స్వల్పం ముహుర్ముహుః। యావద్భస్మ భవేద్వంగం తావ చ్చూర్ణం సమాపయేత్॥ తతః శరావపిహితం స్థాపయే త్తత్ర తద్భిషక్। రజః సర్వం తతో౽ధస్తా త్కుర్యా దగ్నిం తు తీవ్రకం॥ యావదఙ్గారవర్ణం తద్రజః సము పజాయతే। స్వాంగశీతం తతో గ్రాహ్యం మారణాయ రజః శుభం॥ అథైనం వంగజం భస్మ శుద్ధతాలేన మేలయేత్। సమేన వాంఘ్రిణాంశేన హ్యష్టమాంశేన వాతతః॥ మర్దయేన్నింబుకద్రావైః అథవా కన్యకా ద్రవైః। యామైకంవా ద్వియామంవా దృఢం మర్ద్యాథ చక్రికాం॥ కృత్వా ఘర్మ విశుష్కాంతాం పిప్పలస్య

---

రాతిపలకపై నుంచవలెను. ఈ వర్తి మరునాటికంతయు కాలియుండును. ఈ బూడిదను జాగ్రత్తగా వెడల్పుగనుండు ఒకపాత్రలోనికి యెత్తి శుద్ధజలముచే కడిగిచూచినచో వంగశకలములు తెల్లని పేలాలవలె గానుపించును. వీటిని బాగుగా నెండించి ఖల్వమునందుంచి నూరినచో మెత్తని చూర్ణమునలె వగును. కలబందరసముతో నా చూర్ణమును మూడుదినములు మర్దించి చిన్న చిన్న చక్రికలుగాఁజేసి యెండించవలెను. పిమ్మట వీటిని శరావసంపుటమున బంధించి ముప్పది పిడకలతో పుటము వేయవలెను. ఇటుల నైదారు పుటములు వేసిన వంగము స్వచ్ఛమైన భస్మ మగును.

త్వాగంతరే। సంస్థాప్య పశ్చాదేవం తత్స్తథా విపచే
ద్భిషక్॥ సర్వోత్తమం వంగభస్మ నిరుత్థం ఖటికా
ప్రభం। సర్వకార్యకరంచైవ జాయతే వైద్యజీవనం॥
ద్వితీయాది పుటేతాలం నదేయం కింతు ఘర్షణైః।
ప్రోక్త ద్రవ్యేణ చక్రాభం కృత్వా శుష్కం పుటే
న్ముహుః॥ ఆ-ప్ర.

ఒక యినుపబాణలిని పొయ్యిమీద బెట్టి దానిలో శుద్ధవంగము నుంచి, క్రింద మంట బెట్టుచుండవలెను. అగ్నితాపముచే నా వంగ మందు ద్రవీభూతమగును. అప్పుడు సమూలముగా గ్రహించిన యుత్తరేణును వంగమునకు నాల్గవవంతు గ్రహించి దీనిని ఖరచూర్ణముగా దంచి యందుండి కొంచెము కొంచెముగా పై వంగమునందు వేయుచు స్థూలమైన యగ్రభాగముగల లోహదర్వితో బలముగ నా వంగద్రవమును రుద్దుచుండవలెను. ఈ విధముగ వంగము చూర్ణరూపము బొందువరకు అగ్నిని జ్వలింపజేయుచు, అపామార్గచూర్ణమును వేయుచు, లోహదర్వితో రుద్దుచునుండవలెను. వంగము సంపూర్ణముగా చూర్ణరూపమును బొందినట్లు దెలిసికొని యధోభాగమున నగ్నిని తీవ్రముగా ప్రజ్వలింపజేయవలెను. ఇటుల జేయుటకు ముందుగా నా బాణలిపై నొక శరావమును కప్పియుంచవలెను. అటుల వంగచూర్ణము అగ్నితో సమానమైన వర్ణము బొందువరకు గాఢముగా నగ్నిని ప్రజ్వలింపజేయుచు నే యుండవలెను. పిమ్మట అగ్నిని చల్లార్చి స్వాంగశీతలమున నా వంగచూర్ణమును గ్రహించి దీనిని ఖల్వమునందు జేర్చవలెను. అందు శోధిత తాళకచూర్ణమును వంగమునకు సమానముగ గాని, నాల్గవ భాగముగాని, యెనిమిదవభాగముగాని జేర్చి, జంబీరస్వరసముతోగాని, కలబందరసముతోగాని యొకఝాము లేక, రెండుఝాములు దృఢముగా మర్దించి యొక చక్రికనుజేసి యెండించవలెను. రావిపట్టచూర్ణము నొక

శరావమున సగమువరకు నింపి యా చూర్ణముపై పై వంగచక్రికనుంచి తిరిగి యా శరావముయొక్క ముఖమువరకు పై చూర్ణముతోనే నింపవలెను. పిమ్మట వేరొక శరావముతో కప్పి వాటిసంధికి దృఢముగ లేపనముజేసి యెండించవలెను. పిమ్మట గజపుటముచే బాకముజేయవలెను. ఈ విధముగా నేడు గజపుటములు వేసినచో వంగము తెల్లని భస్మమగును. ఇందు మొదటిపుటమునకేగాని తరువాతిపుటములకు తాళకమును జేర్చ నవసరములేదని తెలియవలెను. పై విధముగ సిద్ధము జేయబడినట్టి వంగభస్మ నిరుత్థమై సర్వకార్యకరణ సామర్థ్యము గలిగి యుండును.

## వంగభస్మ గుణములు *

శ్లో॥ వంగం తిక్ష్ణోష్ణరూక్షం కఫకృమిజి న్మేహమేదోఽ-
నిలఘ్నం కాసశ్వాస క్షయఘ్నం ప్రశమితహుత
భుగ్మాంద్య మాధ్మానదారి। బల్యం వృష్యం ప్రభాకృ

---

* (1) అసమ్యగ్శోధిత - మారిత వంగజ వికారములు.—"అశుద్ధ మమృతం వగం ప్రమేహాది గణప్రదం। గుల్మ హృద్రోగ శూలార్శః కాస శ్వాస వమిప్రదం॥" ఆ-ప్ర.—యథోక్త విధానమున వంగమును శుద్ధిజేయకయు, మారితము గావింపకయు సేవించినచో ప్రమేహామున్నగు దారుణ వ్యాధులను గలిగించును. మరియు, గుల్మము, హృద్రోగము, శూల, అర్శస్సు, కాసము, శ్వాస, వాంతి వీటిని గలిగించును.

(2) వ్యాధి విశేషమున వంగభస్మకు అనుపానవిశేషములు.—"వంగం శిలాజతుయుతంతు మతం ప్రమేహ

స్మనసిజజనకం సర్వమేహ ప్రణాశి ప్రజ్ఞాకృద్వర్ణవి
ముచ్చైరలఘురతిరస స్యాస్పదం బృంహణాంచ॥

ఆ-ప్ర.

వంగభస్మ తీక్ష్ణ రూక్షగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. బలమును గలిగించును. వెంటనే శుక్రధాతువును బోషించును. కాంతిని గలిగించును. కామము నుద్దీపింపజేయును. మైధునమునం దధికశక్తిని గలిగించును. బృంహణము. బుద్ధిని వికసింపజేయును. వర్ణమును గలిగించును. కఫవాతములను శమింపజేయును. కృమిరోగము, వాంతి, ప్రమేహము, కాస, శ్వాస, క్షయము, అగ్నిమాంద్యము, ఆధ్మానము వీటిని బోగొట్టును. విశేషముగా సమస్త ప్రమేహములను బోగొట్టును.

---

ధాతుక్షయే దుర్బల నష్ట శుక్రయోః। అభ్రేణయుక్తంతు సుతప్రదంస్యా జ్జాతీఫలార్క. కరహాట లవంగయుక్తం॥ శాల్మలీత్వగ్రసోపేతం సక్షౌద్రరజనీరజః। వంగభస్మహరేత్ మేహాన్ పంచానన ఇవద్విపాన్॥'' యో-ర.—ప్రమేహము, ధాతుక్షయము, దుర్బల శుక్రము, నష్టశుక్రము అను నీవ్యాధులందు వంగభస్మను గోమూత్ర శిలాజతుతో గలిపి సేవించవలెను. సంతానప్రాప్తికై వంగభస్మను అభ్రకభస్మతోను, జాజికాయ, జిల్లేడుపువ్వు, ప్రుంగ చెక్క, లవంగములు వీటి చూర్ణముతోను జేర్చి సేవించవలెను. మరియు, సమస్త ప్రమేహములందును వంగభస్మను పసపు చూర్ణముతో జేర్చి తేనెతో సేవించి బూరుగపట్ట రసమును పానము జేయవలెను.

## వంగయోగములు

### (1) మహావంగేశ్వరరసము

శ్లో॥ వంగం కాంతంచ గగనం హేమపుష్పం సమం సమం।
కుమారీ రసతో భావ్యం సప్తవారంభిషగ్వరైః॥
ఏషవంగేశ్వరో నామ ప్రమేహాన్ వింశతిం జయేత్॥
మూత్రకృచ్ఛ్రం సోమరోగం పాండురోగం మహాశ్మరీం।
రసాయనమిదం శ్రేష్ఠం నాగార్జున వినిర్మితం॥
యో-ర.

వంగభస్మ, కాంతలోహభస్మ, అభ్రకభస్మ, తంగేడుపువ్వుల చూర్ణము వీనిని సమభాగములుగ గ్రహించి, ఖల్వమునందుంచి కలుబంద రసముతో నేడుదినములు మర్దించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మహావంగేశ్వరరసమని జెప్పబడును. దీనిని యుక్తప్రమాణమున సేవించినయెడల ఇరువది ప్రమేహములు శమించును. మరియు, మూత్రకృచ్ఛ్రము, సోమరోగము, పాండువు, అశ్మరి యీ వ్యాధులుగూడ శమించును. మిగుల రసాయనమగును.

### (2) మేహకులాంతక రసము

శ్లో॥ మృతం వంగం మృతంచాభ్రం శుద్ధపారద గంధకం।
భూనింబం పిప్పలీమూలం త్రికటు త్రిఫలాత్రివృత్॥
రసాంజనం విడంగాబ్ద బిల్వగోక్షుర దాడిమం।
ప్రత్యేకం తోలకం గ్రాహ్యం శుద్ధమశ్మజతోః పలం॥
గోపాల కర్కటీమూల స్వరసైర్వటికాం కురు।
ప్రమేహాన్ వింశతింహన్తి మూత్రకృచ్ఛ్రంహలీమకం॥
అశ్మరీం కామలాం పాండుం మూత్రాఘాతమరోచకం।

అనుపానం ప్రయోక్తవ్యం ఛాగీదుగ్ధంపయోఽథవా॥
ధాత్రీఫలస్య నిర్యాసం క్వాథం కౌలుత్థజంపిబేత్॥
భై - ర.

వంగభస్మ మొకతులము, అభ్రకభస్మ మొకతులము, శుద్ధపారద మొకతులము, శుద్ధగంధక మొకతులము, నేలవేముచూర్ణ మొకతులము, మోడిచూర్ణ మొకతులము, త్రికటుకచూర్ణ మొకతులము, త్రిఫలాచూర్ణ మొకతులము, రసాంజన మొకతులము, విడంగచూర్ణ మొకతులము, తుంగముస్తలచూర్ణ మొకతులము, మారేడువేళ్లచూర్ణ మొకతులము, పల్లేరుకాయలచూర్ణ మొకతులము, దాడిమత్వక్చూర్ణ మొకతులము, పరిశుద్ధమైన గోమూత్రశిలాజతు నాలుగుతులములు ఇటుల వీటిని గ్రహించి, తొలుత రసగంధకములను గలిపి కజ్జలిజేసి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి చేదుపుచ్చవేళ్ల కషాయముతో జక్కగా మూడుదినములు నూరి గుంజాప్రమాణమున మాత్రలను జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మేహకులాంతకరసమనబడును. దీనిని మేకపాలతోగాని, శుద్ధజలముతోగాని, ఉశిరికకాయల రసముతోగాని, ఉలవలకషాయముతోగాని సేవించినయెడల సమస్త ప్రమేహములు, మూత్రకృచ్ఛ్రము, హలీమకము, అశ్మరి, కామిల, పాండు, మూత్రాఘాతము, అరుచి యనునవి శమించును.

## (3) వంగాష్టకము

శ్లో॥ రసంగంధం మృతంలోహం మృతరూప్యంచ ఖర్పరం।
మృతాభ్రకం మృతంతామ్రం సర్వతుల్యంచ వంగకం॥
పుటే ద్గజపుటే విద్వాన్ స్వాంగశీతం సముద్ధరేత్।
రక్తిద్వయ ప్రమాణేన మధునా లేహయే న్నరం॥
నిశాచూర్ణ క్షౌద్రయుతం పిబేద్ధాత్రీ రసంహ్యను।

వంగాష్టకమిదంఖ్యాతం మహాదేవ ప్రకాశితం॥
ప్రమేహాణ్ వింశతిం హన్తి చామదోషం విషూచికాం।
విషమజ్వర గుల్మార్శో మూత్రాతీసార పిత్తజిత్॥
వీర్యవృద్ధిం కరోత్యాశు సోమరోగ నిబర్హణం॥ భై-ర.

శుద్ధరస మొకభాగము, శుద్ధగంధక మొకభాగము, లోహభస్మ మొకభాగము, రజతభస్మ మొకభాగము, శుద్ధఖర్పర మొకభాగము, అభ్రకభస్మ మొకభాగము, తామ్రభస్మ మొకభాగము, వంగభస్మ మేడుభాగములు ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను గలిపి కజ్జలిగావించి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి కలబందరసముతో మూడుదినములు జక్కగా మర్దించవలెను. పిమ్మట నా పిష్టమును చిన్న చిన్న చక్రికలుగాజేసి యెండించి, వాటిని శరావసంపుటమునందు బంధించి యొక గజపుటమునే పాకము జేయవలెను. స్వాంగశీతలమున దానిని ఖల్వమునందు మెత్తగానూరి భద్రపరచవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది వంగాష్టకమని వ్యవహరింపబడును. దీనిని రెండు రక్తికల ప్రమాణమున తేనెతో సేవింపవలెను. లేక, పదియవల ప్రమాణమున నిశాచూర్ణమును గ్రహించి యందు రెండు రక్తికల ప్రమాణమున నీ యౌషధమును గలిపి తేనెతో సేవించి వెంటనే యుసిరికకాయల రసమును పానముచేయవలెను. ఇరువది విధములగు ప్రమేహములు, ఆమదోషము, విషూచిక, విషమజ్వరము, గుల్మము, అర్శస్సు, మూత్రాతిసారము, పిత్తవికారములు, సోమరోగము వీటి నిది శమింపజేయును. విశేషముగా వీర్యమును వృద్ధిజేయును.

## (4) వంగరాజీయరసము

శ్లో॥ రసమేకం త్రయోవంగం వంగసామ్యంతు గంధకం।
మర్దయేద్దిన మేకంతు కుమారీ రసమర్దితం॥

తత్పిష్టం గోళకంకృత్వా శోషయే ద్ధాతుకజ్జలిం।
కాచకుప్యాం వినిక్షిప్య వాలుకాయంత్ర పాచితం॥
ద్వాదశం యామమాత్రాణి పాచయేద్ద్రుఢవహ్నినా।
స్వాంగశీతలముద్ధృత్య పూజయే చ్ఛినదైవతం॥
వంగరాజ మితిఖ్యాతం సేవయే త్కర్షమాత్రకం।
అనుపాన విశేషేణ అసృగ్దర వినాశనం॥
ప్రదరాస్థి స్రవౌ గుల్మం సర్వమేహ కులంజయేత్।
మధు శుక్లేక్షు మేహానాం తలపోటక సంయుతం॥
రక్తమేహశ్చ గోక్షీరైః నవనీతేన వా తథా।
తదన్యేచ ప్రమేహాస్తు ఘోదుంబర రసేనచ॥
అథవా ప్రవినశ్యంతి శిలపిష్ట రసాన్వితం।
అశ్మరీ శర్కరాంచైవం హంసపాదీ రసేనచ॥
శ్వదంష్ట్రి రసపానేన సర్వమూత్ర వికారజిత్।
ఇష్టభుక్తాన్నపానేన సర్వరోగా న్వినాశయేత్॥

ర-యో-ర.

శుద్ధరస మొకభాగము, వంగభస్మ మాడుభాగములు, శుద్ధగంధకము మూడుభాగములు ఇటుల గ్రహించి తొలుత రసగంధకములను కజ్జలిజేసి యిందు వంగభస్మను జేర్చి యొకదినము కలబందరసముతో జక్కగా మర్దించవలెను. పిమ్మట నా పిష్టమును ఒక గోళముగాజేసి యెండించి దీనిని కాచకూపికయందుంచి వాలుకాయంత్రమున పదిరెండు జాములు పాకముజేయవలెను. స్వాంగశీతలమున గ్రహించి మెత్తగా నూరవలెను. ఇయ్యది వంగరాజీయరసమనబడును. దీనిని మొత్త మొకతులము పరిమితిని ప్రతినిత్యము యుక్తప్రమాణమున అనుపానవిశేషములతో సేవించినయెడల ప్రదరము, అస్థిస్రావము, గుల్మము, సమస్త

ప్రమేహములును శమించును. మధుమేహము, శుక్లమేహము, ఇక్షుమేహము ఇవి తంగేడుపువ్వుల రసముతో సేవించిన శమించును. రక్తమేహము గోక్షీరముతో గాని, నవనీతముతో గాని సేవించిన శమించును. ఇతరమేహములన్నియు మేడిపండ్ల రసముతోగాని, తెలకపిండి రసముతోగాని సేవించిన శమించును. హంసపాదిరసముతో సేవించిన అశ్మరి, శర్కర యివి శమించును. పల్లేరుకాయల రసముతో సేవించిన సమస్త మూత్రరోగములును పోవును. దీనిని సేవించునప్పుడు ఇచ్ఛాపథ్యము ననుసరింపవలెను.

---

# జశదము

## జశదనామములు

శ్లో॥ జశదం రంగసదృశం రీతిహేతుశ్చ తన్మతం॥ ఆ-ప్ర.

జశదము, రంగసదృశము, రీతిహేతు వనునవి జశదనామములు.

## జశదశోధన - మారణవిధానములు

శ్లో॥ జశదం గిరిజం తస్య దోషాః, శోధన మారణే।
వంగస్యేవ హి బోద్ధవ్యా, గుణాంస్తు ప్రవదామ్యహం॥
ఆ-ప్ర.

సత్తు పర్వతములనుండి యుత్పన్నమగును. అందుచే నితరలోహము అందువలె దీనియందుగూడ దోషములుండును. కావున దీనికిగూడ శోధనమారణములు జేసియే యుపయోగింపవలెను. సత్తునకు శోధన మారణములు వంగమునకువలెనే జేయదగునని తెలియవలెను.

## జశదభస్మ గుణములు

శ్లో॥ జశదం తువరం తిక్తం శీతలం కఫపిత్తహృత్।
చక్షుష్యం పరమం మేహాన్ పాండుం శ్వాసంచ
నాశయేత్॥    ఆ-ప్ర.

పత్తుభస్మ కషాయరసమును, తిక్తానురసమును, శీతవీర్యమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. కఫపిత్తములను శమింపజేయును. ప్రమేహమును, పాండువును, శ్వాసను బోగొట్టును.

---

# నాగము

## నాగనామములు *

శ్లో॥ సీసకంతు జడం సీసం యవనేష్టం భుజంగమం।
యోగేష్టం నాగ మురగం కువంగం పరివిష్టకం॥
ఆ-కం.

---

* గ్రాహ్యనాగలక్షణము.—"శ్లో॥ ఛేదేకృష్ణం గురు స్నిగ్ధం ద్రుతద్రావ మథోజ్వలం। కృష్ణవర్ణం బహిః శుద్ధం నాగం హిత మతోఽన్యథా॥" ర-ప్ర-సు.—తెగగొట్టినప్పుడు నల్లనివర్ణము గలిగియున్నట్టిదియు, మిక్కిలి బరువుగా నుండునట్టిదియు, స్నిగ్ధగుణముగలిగియున్నట్టియు, కరగించినప్పుడు శీఘ్రముగా ద్రవీభూతమై ప్రకాశవంతమైనట్టియు నాగము ఔషధార్థము గ్రహింపదగియున్నది. ఇందుకు విరుద్ధమైన లక్షణములుగలది యగ్రాహ్యమని గుర్తింపవలెను.

సీసకము, జడము, సీసము, యవనేష్టము, భుజంగమము, యోగేష్టము, నాగము, ఉరగము, కువంగము, పరివిష్టకము అనునవి నాగ నామములు.

## నాగశోధనము

శ్లో॥ నిర్గుండికా రజన్యోశ్చ రసే నాగం ప్రవాపయేత్।
ఏవంనాగో విశుద్ధస్స్యాత్ మూర్ఛాస్ఫోటాది నాచరేత్॥
ర-ప్ర-సు.

సీసమును కరగించి నిశాచూర్ణయుక్తముగ వావిలాకురసమున వంగమునువలె ఆవాపముజేసిన నయ్యది పరిశుద్ధమగును. (ఇట మిగిలిన విశేషములన్నియు వంగశోధన ప్రసంగమున దెలిపిన విషయములను బట్టి గ్రహింపదగియుండును.)

## నాగభస్మ విధానము *

శ్లో॥ అశ్వత్థ చించా త్వక్చూర్ణం చతుర్థాంశేన నిఃక్షిపేత్।
మృత్పాత్రే విద్రుతే నాగే లోహదర్వ్యా ప్రచాలయేత్॥
యామైకేన భవే ద్భస్మ తత్తుల్యాతు మనశ్శిలా॥
కాంజికేన ద్వయం పిష్ట్వా పుటే ద్గజపుటేనచ॥

---

* స్వానుభూత సాంప్రదాయమున నాగభస్మ విధానము.—నాగమును శుద్ధిజేసిన పిమ్మట వంగమునువలె రజనుగాగోసి యటులనే నిశాచూర్ణముతో గలిపి వర్తిజేసి కాల్చవలెను. పిమ్మట శుద్ధోదకముతో ప్రక్షాళనముజేసి యెండబెట్టవలెను. పిమ్మట ఖల్వమునందుంచి దీనికి నాల్గవవంతు శుద్ధమణిశిల చూర్ణమును జేర్చి కలబందరసముతో

స్వాంగశీతం పునఃపిష్ట్వా శిలయా కాంజికేనచ।
పునఃపచేత్ శరావాభ్యాం ఏవం షష్ఠిపుటైర్మృతిః॥

ఆ-ప్ర.

శుద్ధిజేసిన నాగమును ఒక శరావమునందుంచి దానిని నిప్పులపై బెట్టి కరగించి యందు నాల్గవవంతు రావిపట్టయొక్కయు, చింతపట్ట యొక్కయు చూర్ణములను కొద్దికొద్దిగా వేయుచు లోహదర్విలో రుద్దుచుండవలెను. ఇటుల నొకజాము జేసినచో నాగము చూర్ణరూపమున బరిణమించును. పిమ్మట స్వాంగశీతలమున నా చూర్ణమును ఖల్వము నందుంచి యందు దీనికి సమముగా శోధితమణిశిలను జేర్చి కాంజికముతో జక్కగా మర్దించి, చిన్నచిన్న చక్రికలుగాజేసి, శరావసంపుటము నందు వీటిని బంధించి, గజపుటముచే పాకము జేయవలెను. స్వాంగశీతల

---

మూడుదినములు నూరి చక్రికలుజేసి యెండించవలెను. వీటిని శరావసంపుటమునందు బంధించి యేబది పిడకలతో పుటము వేయవలెను. స్వాంగశీతలమున నాగమును గ్రహించి వెనుకటివలెనే శుద్ధమణిశిల చూర్ణమును జేర్చి మర్దన పుటపాకములను గావించవలెను. ఇటుల సుమారు పదునాలుగు పుటములు వేసినచో బూడిదవర్ణముగల నాగభస్మ సిద్ధమగును.

రెండవపద్ధతి.—పై విధముగా నిశాచూర్ణసంయోగమున గాల్చి జారితము జేసి, వంగమునువలె కేవలము కలబందరసముతో నూరి చక్రికలుగాజేసి యెండించి శరావసంపుటమున బంధించి ముప్పది పిడకలతో పుటము వేయవలెను. ఈ విధముగా నైదారుపుటములు వేసినచో సీతవర్ణముగల నాగభస్మ సిద్ధమగును.

మున నాగభస్మమును గ్రహించి తిరిగి సమాంశముగ శోధితమణిశిలను గలిపి పైవిధముగనే మర్దన పుటపాకములను గావింపవలెను. ఇట్టుల నరువది పుటపాకములు గావించినచో నాగము చక్కని భస్మ మగును.

## నాగభస్మ గుణములు *

శ్లో॥ నాగః సమీరకఫపిత్త వికారహన్తా సర్వప్రమేహ వన రాజకృపీటయోనిః। ఉష్ణః సరోరజత రంజనకృద్ద్వ ణార్శో గుల్మగ్రహణ్యతిసృతి క్షణదాంశుమాలీ॥ నా గస్తు నాగశతతుల్య బలందదాతి వ్యాధింవినాశయతి జీవనమాతనోతి వహ్నింప్రదీపయతి కామబలం కరోతి మృత్యుంచ నాశయతి సంతతసేవితఃసః॥ ఆ-ప్ర.

---

* అసమ్యగ్శోధిత-మారిత నాగభస్మజ వికారములు.—"అశుద్ధః కురుతేనాగః ప్రమేహాః క్షయకామలాః। తస్మాత్ సంశుద్ధపవాయం మారణీయో భిషగ్వరైః॥ పాకేనహీనౌ కిలనాగవంగౌ కుష్ఠాని గుల్మాంశ్చ తథాతి కష్టాన్। పాండుప్రమేహానలసాద శోథ భగందరాదీన్ కురుతః ప్రభుక్తౌ॥" ఆ-ప్ర.—నాగమును యథోక్తవిధానమున శోధింపకయు, మారితము గావింపకయు సేవించినచో ప్రమేహము, క్షయము, కామిల, మిక్కిలి దారుణమైన కుష్ఠము, పాండువు, అగ్నిమాంద్యము, శోఫ, భగందరము మున్నగు వ్యాధులు జనించును. కావున నాగవంగములను యథోక్త విధానమున శోధన మారణములను గావించియే సేవింపవలెనని దెలియదగినది.

నాగభస్మ సరగుణమును ఉష్ణవీర్యమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. సమస్త ప్రమేహములను, వ్రణమును, అర్శస్సును, గుల్మమును, గ్రహణిని, అతిసారమును బోగొట్టును. ఇది రజతమును రంజింపజేయును. మరియు, నాగభస్మను ప్రతినిత్యము సేవించుచుండినచో నూరుగజములతో తుల్యమైన బలమును గలిగించును. రసాయనమగును. జాఠరాగ్నిని వృద్ధిజేయును. కామోద్దీపనము జేయును.

## నాగయోగములు

### (1) నాగేశ్వర రసము

గద్య॥ పలప్రమితం నాగం తిలతైలే సప్తవారం విశోధ్య, పశ్చా ద్విస్తీర్ణహాండికాయాం ద్రవీకృత్య వర్తుల పాషాణేన మర్దనపూర్వకం కాసీసస్యోత్తమస్య చూర్ణం నాగపరిమితం స్వల్పం స్వల్పం దత్వామారయేత్। మృతం నాగం ఘటీద్వయం వహ్నావేవస్థాప్యం। పశ్చాద్భాజనేతచ్చూర్ణందత్వా, ఉష్ణోదకేన సప్తవారంసుధౌతం ఘర్మ సంశుష్కంచ విధాయ, అర్కదుగ్ధేన ప్రహార ద్వయం మర్దయేత్। పశ్చాత్త చ్చక్రికాం కృత్వా, సంశోష్య, శరావసంపుటేధృత్వా, పంచషట్క పరిమితై ర్వనోపలైః పుటేత్। స్వాంగశీతం గృహీత్వా అనయైవ రీత్యా రసేన ప్రహారద్వయం మర్దయిత్వా పుటేత్। పశ్చాత్ పారదః పలమితః, గంధకః అమలసారాఖ్యః పలప్రమితః, ద్వయోః కజ్జలింకృత్వా పూర్వసిద్ధ మృత నాగే విమిశ్ర్య మర్దయిత్వా, సహదేవ్యారసేన మర్దయే త్ప్రహారద్వయం, తతశ్చక్రికాంకృత్వా విశోష్య శరావ

సంపుటేధృత్వా పూర్ణం గజపుటందద్యాత్। తతః స్వాంగశీతం గృహీత్వా, కుమారీరసేనమర్దయేత్, తదుపరి అర్కదుగ్ధేన మర్దయేత్ ప్రహరైకం, పశ్చాత్తచ్చక్రికాంకృత్వా, సంశోష్య శరావసంపుటే ధృత్వాపంచషట్క పరిమితైర్వనోపలైః పుటేత్, తదుత్తరంతస్య సహదేవ్యారసేన పుటైకం దద్యాత్, తతః సిద్ధోజాతః। అథప్రయోగః—రక్తికా ద్వయమస్య వాకుచీ చూర్ణేన సహ దేయందినాని చత్వారింశత్, పథ్యంగోధూమ తిలతైలం, ఔషధం భక్షయిత్వా ఘర్మే ప్రహరైకం స్థేయం, తతోఽల్పదినైర్మండల పాకాజ్జల స్రావోత్తరం క్రమేణ సవర్ణతా। దేవదారు దారుచినీ వాకుచీయుక్తం గళత్కుష్ఠే. త్రికటు దేవదారుయుక్తం వాతరక్తే, మూత్రకృచ్ఛ్రే వాకుచీయుక్తం, దుగ్ధోదనం సర్వత్రపథ్యం। ఇతి నాగేశ్వరోరసః॥ ఆ-ప్ర.

నాగము నొకపల పరిమితిని గ్రహించి, కరగించి తిలతైలమునందావాపము జేయవలెను. ఇటుల నేడుమారులు జేసిన యయ్యది పరిశుద్ధమగును. దీనిని తిరిగి విశాలమైన శరావమునందుంచి కరగించి దీనికి సమముగా నుత్తమజాతి కాసీసమును గ్రహించి దీని నందు కొంచెము కొంచెముగా జేర్చుచు గుండ్రముగనుండు ఒక పాషాణముతో రుద్దుచుండవలెను. ఇటుల నాగమును అగ్నిపైననే యుంచి కాసీసముయొక్క పరిమితియంతయు నైపోవువరకు పాషాణముతో రుద్దుచునే యుండవలెను. ఇందువలన నాగము చూర్ణరూపమున మారితమగును. పిమ్మట నా నాగము నగ్నిపై రెండుఘడియలకాల మటులనే యుంచవలెను. తరువాత నా శరావము నగ్నిపైనుండి తొలగించి స్వాంగశీతలమున

నందుండి నాగచూర్ణమును గ్రహించి, వేరొకపాత్రలోనుంచి పరిశుద్ధ
మైన జలము నందు బోయుచు నేడుమారులు క్షాళనముజేసి యెండలో
నెండించవలెను. శుష్కమైన యీ నాగచూర్ణమును ఖల్వమునందుంచి
జిల్లేడుపాలతో రెండుజాములు మర్దించి, చక్రికజేసి, ఎండించి శరావ
సంపుటమున బంధించి యైదారు పిడకలతో పుటమువేయవలెను.
స్వాంగశీతలమున దానిని గ్రహించి పైవిధముగ మర్దన పుటపాకములను
గావింపవలెను. పిమ్మట శుద్ధపారదము నొకపలమును, శుద్ధగంధకము
నొకపలమును గ్రహించి కజ్జలిజేసి యందు పై నాగభస్మను జేర్చి కలియ
నూరి సహదేవీమూలరసముతో రెండుజాములు మర్దించి, చక్రికజేసి
యెండించవలెను. పిమ్మట దీనిని శరావసంపుటమున బంధించి యొక
గజపుటమున పాకముజేయవలెను. స్వాంగశీతలమున గ్రహించి కలబంద
రసముతో నొకజామును, జిల్లేడుపాలతో నొకజామును మర్దించి చక్రిక
జేసి యెండించి, శరావసంపుటమున బంధించి యైదారు పిడకలతో
పుటమువేయవలెను. స్వాంగశీతలమున దానిని గ్రహించి సహదేవీ
మూలరసముతో మర్దించి పైవిధముగనే పుటమువేయవలెను. స్వాంగ
శీతలమున గ్రహించి మెత్తగా చూర్ణించవలెను. ఇటుల సిద్ధముజేయబడి
నట్టిది నాగేశ్వరరసమనబడును. దీనిని రెండు రక్తికల ప్రమాణమున
వాకుచీ చూర్ణముతో జేర్చి నలుబదిదినములు సేవించవలెను. గోధూమము,
తిలతైలము పథ్యమునందు జేర్చుకొనవలెను. ఈ యౌషధము నిటుల
సేవింపుచు ప్రతినిత్యము ఒకజాము ఎండలో గూర్చుండవలెను. ఇటుల
జేయుటవలన కొలదిదినములలో మండల కుష్ఠరోగికి మండలములందు
పాకమేర్పడి అందుండి దుష్టజలము బయటకు స్రవించిపోయి, యచ్చట
శుష్కత్వమేర్పడి క్రమముగా శరీరముతో సమమైన వర్ణమేర్పడును.
ఇటులనే గళత్కుష్ఠమున దేవదారు, దాల్చినిచెక్క, బావంచాలు వీని
చూర్ణముతో గలిపి పైవిధముగనే సేవించవలెను. వాతరక్తమున
త్రికటుకములు, దేవదారు వీని చూర్ణముతోను, మూత్రకృచ్ఛ్రమున

బావంచాల చూర్ణముతోను సేవించవలెను. ఈ యౌషధమును సేవించు నప్పుడు దుగ్ధోదనమును భుజించవలెను.

## (2) నాగరసాయనము

శ్లో॥ ఏవం నాగోద్భవం భస్మతాప్య భస్మార్ధభాగికం॥
పాదంపాదం క్షిపేద్భస్మ శుల్బస్య విమలస్యచ॥
కాంతాభ్ర సత్వయోశ్చాపి స్ఫటికస్య పృథక్ పృథక్ ।
సర్వ మేకత్ర సంచూర్ణ్య పుటే త్రిఫలవారిణా॥
త్రింశ ద్వనగిరిండైశ్చ త్రింశద్వారం విచూర్ణ్యచ।
వ్యోష వేల్లక చూర్ణైశ్చ సమాంశైః సహమేళయేత్॥
మధ్వాజ్యసహితం హంతి ప్రలీఢం వల్లమాత్రయా।
అశీతివాతజాన్ రోగాన్ ధనుర్వాతం విశేషతః॥
కఫరోగా నశేషాంశ్చ మూత్రరోగాంశ్చ సర్వశః।
శ్వాసంకాసం క్షయంపాండుం శ్వయథుం శీతకజ్వరం॥
గ్రహణీ మామదోషంచ వహ్నిమాంద్యం సుదుర్జయం।
సర్వా నుదకదోషాంశ్చ తత్తద్రోగానుపానతః॥

ర-ర-స.

నాగభస్మ మొకభాగము, స్వర్ణమాక్షికభస్మ అర్ధభాగము, తామ్రభస్మ నాల్గవభాగము, విమలభస్మ నాల్గవభాగము, కాంతలోహ భస్మ నాల్గవభాగము, అభ్రకసత్వభస్మ నాల్గవభాగము, పొంగించిన పటికచూర్ణము నాల్గవభాగము ఇటుల గ్రహించి త్రిఫలాకషాయముతో మూడుదినములు జక్కగా మర్దించి చక్రికలుజేసి యెండించవలెను. పిమ్మట వీనిని శరావసంపుటమునందు బంధించి ముప్పదిపిడకలతో పుటమువేయవలెను. స్వాంగశీతలమున గ్రహించి తిరిగి త్రిఫలాకషాయ

ముతో మర్దనయును, ముప్పదిపిడకలతో పుటపాకమును గావింపవలెను. ఈ విధముగ ముప్పది పుటములను వేయవలెను. పిమ్మట మెత్తగా చూర్ణించి యీ యౌషధమునకు సమముగా త్రికటుచూర్ణమును, విడంగ చూర్ణమును గలిపి యొక వల్లప్రమాణమున మధుఘృతములతో జేర్చి సేవింపవలెను. ఇందువలన నెనుబది వాతవ్యాధులును, విశేషముగా ధనుర్వాతమును, సమస్త కఫరోగములును, మూత్రజవ్యాధులును, శ్వాస, కాస. క్షయము, పాండువు, శోథ, శీతజ్వరము, గ్రహణి, ఆమదోషము, అగ్నిమాంద్యము మున్నగువ్యాధులు శమించును.

---

# లోహము

## లోహనామములు *

శ్లో॥ లోహోఽస్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిండం కాలాయ సాయసీ॥
అ-ప్ర.

లోహము, శస్త్రకము, తీక్ష్ణము, పిండము, కాలాయసము, అయము అనునవి లోహనామములు.

---

* లోహభేదములు.—"ముండంతీక్ష్ణం తథాకాంతం ఇతిలోహం త్రిధామతం। ముండంతు త్రివిధంతత్ర మృదు కుంతం కడారకం। తీక్ష్ణకంషడ్విధం ప్రాహుః ఖరాఖ్యం సారసంజ్ఞకం॥ హున్నాల మపరంతారావట్టం వాజిరకాలకం। కాంతం పంచవిధం జ్ఞేయం భ్రామకం చుంబకం తథా। కర్షకం ద్రావకం తద్వత్ రోమకాంతంచ పంచమం॥ ఏకాస్యం ద్విముఖం త్ర్యాస్యం వేదాస్యం శరవక్త్రకం। సర్వతో

## లోహ శోధనము *

శ్లో॥ సువర్ణరూప్యతామ్రాయః పత్రాణ్యగ్నౌ ప్రతాపయేత్ ।
కృత్వాకంటకవేధీని దృష్ట్వా వహ్నౌ సమానిచ॥

---

ముఖమిత్యేవ ముత్తమాధమ కాంతకం॥" ఆ-ప్ర., "కనిష్ఠంస్యా దేకముఖం మధ్యం ద్వి త్రిముఖం భవేత్ ॥ చతుః పంచముఖం శ్రేష్ఠం ఉత్తమం సర్వతోముఖం॥" ర-ర-స,——ముండలోహము, తీక్ష్ణలోహము, కాంతలోహము అని లోహము మూడువిధములుగా నుండును. అందు ముండలోహము - మృదు, కుంఠము, కడారకము అని మూడు విధములుగ నుండును. తీక్ష్ణలోహము - ఖరము, సారము, హృన్నాలము, తారావట్టము, వాజిరము, కాలకము అని యారు విధములుగా నుండును. కాంతలోహము- భ్రామకము, చుంబకము, కర్షకము, ద్రావకము, రోమకము అని యైదు విధములుగా నుండును. వీనిలో కాంత లోహము ఏకముఖము, ద్విముఖము, త్రిముఖము, చతుర్ముఖము, పంచముఖము, సర్వతోముఖము అని తిరిగి యారువిధములుగా నుండును. ఈ యేకముఖాది కాంతలోహములలో నేకముఖము గలది కనిష్ఠమైనదిగను, ద్విముఖ త్రిముఖములుగలది మధ్యమముగను, చతుర్ముఖ పంచముఖములుగలది శ్రేష్ఠమైనదిగను, సర్వతో ముఖములు గలది యుత్తమమైనదిగను గణింపబడును.

* (1) శోధనాదికర్మలకు గ్రాహ్యములగు లోహ భేదములు——"ముండాచ్ఛతగుణంతీక్ష్ణం తీక్ష్ణాత్ కాంతం

నిషించే త్రిఫ్తతప్తాని తైలే తక్రే గవాంజలే।
కాంజికేచ కుళుత్థానాం కషాయేస్తథా పృథక్॥
ఏవం స్వర్ణాదిలోహానాం విశుద్ధిః సంప్రజాయతే॥
ఆ-ప్ర.

శతాధికం। తస్మాత్ ముండం పరిత్యజ్య తీక్ష్ణం వా కాంత ముత్తమం॥'' ఆ-ప్ర.—ఈ లోహభేదములలో ముండ లోహముకంటె తీక్ష్ణలోహము శతగుణములుగను, తీక్ష్ణలోహముకంటె కాంతలోహము శతాధికగుణములుగను శ్రేష్ఠమైనవిగనుండును. కావున శోధనాదిక్రియలకు తీక్ష్ణలోహమును గాని, కాంతలోహమునుగాని గ్రహింపవలెను.

(2) తీక్ష్ణకాంతలోహ లక్షణములు.—''కాసీసామల కల్కాక్తే లోహేఽంగం దృశ్యతే స్ఫుటం। తీక్ష్ణలోహంతదుద్దిష్టం మారణాయోత్తమం విదుః॥'' ఆ-ప్ర.—అన్నభేదిని అమ్లద్రవముతో నూరి లోహఖండమునకు లేపనముజేసి చూచినచో నందు ఎచ్చటెచ్చట బొబ్బలు గానుపించునో యా లోహఖండముపై నచ్చటచ్చట తీక్ష్ణలోహాంశములున్నట్లు తెలిసికొని వాటినిమాత్రమే మారణకర్మకు గ్రహించవలెను. ''జీర్ణశస్త్రాది ఖండావా పురాణాయంత్రఖండకాః। తీక్ష్ణజాస్తేహి గృహ్ణంతి మారణార్థం భిషగ్వరాః॥'' ఆ-ప్ర.—పైనిజెప్పిన లక్షణములనుబట్టి తీక్ష్ణలోహాంశములను గ్రహించి తయారుచేయబడిన ప్రాత శస్త్రఖండములనుగాని, ప్రాత యంత్రఖండములను (కంసాలులపద్ద బంగారు వెండి మున్నగు లోహములనుండి తీగెలు దీయు

లోహ సామాన్యమునంతను మిక్కిలి పలుచగానుండు రేకుల వలె సాగగొట్టి, కొలిమిలో నెర్రగ గాల్చి, తిలతైలమునందు, తక్రము నందు, గోమూత్రమునందు, కుళుత్థ కాంజికమునందును, కుళుత్థ కషాయమునందును ప్రత్యేక ప్రత్యేకముగా నేడుమారులు ముంచిన యయ్యవి పరిశుద్ధములగును.

---

టకు సన్నని రంధ్రములుగలిగి రెండువ్రేళ్ల వెడల్పున దీర్ఘముగానుండు "కమ్మెచ్చు" అను పనిముట్టు) గాని మారణ కర్మకు గ్రహించవలెను. "యత్పాత్రే న ప్రసరతిజలే తైల బిందుః ప్రతప్తే హింగుర్గంధం త్యజతిచనిజం తిక్తతాం నింబ కల్కః। తప్తం దుగ్ధం భవతి శిఖరాకారకం నైతి భూమిం కృష్ణాంగః స్యాత్సజలచణకః కాంతలోహం తదుక్తం॥" ఆ-ప్ర.—ఏ లోహపాత్రయందు జలమును బోసి బాగుగా కాచి యందు తైలబిందువును విడిచినచో నయ్యది చుట్టు ప్రక్కలకు ప్రసరించక యటులనే స్థిరముగనుండునో, యే లోహపాత్రయందు హింగు కల్కముగాని వేపాకుల కల్కము గాని పూసినచో నయ్యవి నిజగుణమును విడచునో అనగా హింగు తన గంధమును, వేపాకు తన చేదుగుణమును విడచునో, ఏ లోహపాత్రయందు పాలుపోసి కాచినప్పుడు నయ్యవి పైకి మెత్తుగా పొంగియు బయట పడిపోకుండ నందేయుండునో, యే లోహపాత్రయందు నీళ్లుపోసి యందు సెనగలను వేసియుంచినచో నయ్యవి నల్లబడిపోవునో యట్టి లోహము ఉత్తమమైన కాంతలోహముగా గుర్తించి శోధ నాదికర్మలకు గ్రాహ్యమైనట్లు దెలియవలెను.

## తీక్ష్ణలోహమునకు విశేష శోధనము

శ్లో॥ తైలతక్రాది సంశుద్ధం లోహం శోధ్యం విశేషతః।
ప్రోక్తదోష వినాశాయ త దిదానీ మిహోచ్యతే॥
త్రిఫలాష్ట గుణేతోయే త్రిఫలా షోడశం పలం।
తత్క్వాథే పాదశేషేతు లోహస్య పలపంచకం॥
కృత్వా పత్రాణి తప్తాని సప్తవారం నిషేచయేత్।
ఏవం ప్రలీయతే దోషో గిరిజో లోహసంభవః॥

ఆ-ప్ర.

పై విధముగ తీక్ష్ణలోహపత్రములను తైలతక్రాదులందు శోధించిన పిమ్మట అందుండి యైదుపలముల పరిమితిని యా పత్రములను గ్రహించి, పదియారు పలముల త్రిఫలాచూర్ణమును నూట యిరువది యెనిమిది పలముల జలములో వేసి నాల్గవభాగము మిగులునట్లు కషాయము గాచి, వడియగట్టి యందు పై లోహపత్రముల నెఱ్ఱగా గాల్చి యేడు మారులు ముంచవలెను. ఇటుల జేసినచో లోహము నంటియున్న గిరిదోషము తొలగును. ఇట్టి విశేష శోధనము గావించినపిమ్మటనే లోహమునకు మారణసంస్కారము గావించవలెను.

## కాంతలోహమునకు విశేష శోధనము

శ్లో॥ శశరక్తేన సంలిప్తం కిం వార్కా పయసాయసం।
దలంహుతాశనే ధ్మాతం సిక్తం త్రైఫలవారిణా॥
త్రిశః కాంతస్య సంశుద్ధి రిత్యేవం పరమం భవేత్॥

ఆ-ప్ర.

కాంతలోహము తైలతక్రాదులలో శుద్ధిజేసిన పిమ్మట నా దళములకు చెవుల పిల్లి రక్తమును బూసి యారబెట్టిన పిమ్మట జిల్లేడుపాలను

కూడా బూసి కొలిమియందు వాటి నెర్రగా గాల్చి త్రిఫలాకషాయ మున మూడుమారులు ముంచవలెను. ఇటుల జేసినయెడల కాంతలోహ మత్తమ శోధనసంస్కారమును బొంది మారణార్థ ముపయోగింపదగి యుండును.

## తీక్ష్ణలోహ - కాంతలోహభస్మ విధానము *

శ్లో॥ శాణాకృష్టమయోరజస్త్రిదివసం పిష్టం వరావారిణా
యద్వా రక్త పునర్నవాదళరసైర్యద్వాద్రి కర్ణీరసైః।
చాంగేరీ సలిలై స్తథైవ సలిలై ర్వాసీరవానీరజైః
త్రింశద్వస్తి పుటైః పరైర్జలతరంస్యాద్భస్మ జంబూ
ప్రభం॥ ఆ-ప్ర.

---

* (1) లోహములను పారదసహితముగ మారణము జేయుటయందు గల ఆవశ్యకత.—"పార దేన వినాలోహం యః కరోతి పుమానిహ। ఉదరేతస్య కిట్టాని జాయంతే నాత్రసంశయః॥" ఆ-ప్ర.—లోహములను పాదరసముతో సమ్మిశ్రము జేయకయే కేవలము మూలికాదులతో మారి తములు గావించి యుపయోగించినచో నందువల్ల శరీరము నందు కిట్టములు సంభవించును. కావున లోహములనన్నిటిని పారదసహితముగనే మారితములు గావించి సేవించవలెను.

(2) స్వానుభూత సాంప్రదాయమున లోహ - కాంత ముల మారణవిధానము.—రెండువీశెల పరిమితిగల లోహ ములను గ్రహించి కోష్ఠీయంత్రమున నెర్రగ గాల్చి త్రిఫలా కషాయమున నేడుమారులు ముంచవలెను. పిమ్మట

యథావిధిగ శుద్ధిజేయబడిన తీక్ష్ణలోహదళములనుగాని, కాంత లోహదళములనుగాని ఆకురాయితో సన్నని రజనుగా గోసి, యా చూర్ణ మును ఖల్వమునందుంచి త్రిఫలాకషాయముతోగాని, యెఱ్ఱగజ్జేరాకుల రసముతోగాని, విష్ణుక్రాంతరసముతోగాని, పులిచెంచలియాకు రస ముతోగాని. నీటిప్రబ్బలి రసముతోగాని మూడుదినములు జక్కఁగా మర్దించవలెను. పిమ్మట చిన్న చిన్న చక్రికలుగాజేసి యెండించి, వీటిని శరావసంపుటమున బంధించి యొక గజపుటమున పాకము జేయవలెను. ఇటుల ముప్పది పుటములుగాని, అంతకు హెచ్చుగాగాని వేసినచో నయ్యది నేరేడు చిగుళ్లవంటి వర్ణముగల భస్మలగును.

## తీక్ష్ణలోహభస్మ గుణములు *

శ్లో॥ లోహం శీతం సరం తిక్తం మధురం తువరంగురు।
రూక్షం వయస్యం చక్షుష్యం లేఖనం వాతలం జయేత్ ॥

---

త్రిఫలాకషాయముతో మూడుదినములు మర్దించి చిన్న చిన్న చక్రికలుగాజేసి యెండించి శరావసంపుటమున బంధించి మూడువందల పిడకలతో పుటము వేయవలెను. స్వాంగశీతలమున దీసి తిరిగి పైవిధముగ మర్దన పుటములతో పది పుటములు ముగించవలెను. పిమ్మట జంబూత్వగ్రస ముతో మర్దించుచు నాలుగుపుటములు వేయవలెను. జంబూ పల్లవముతో సమానమైన వర్ణములుగలిగి చక్కని భస్మ లగును.

* (1) లోహభస్మ కమ్మృతీకరణ విధానము.—
"ద్విగుణే త్రిఫలాక్వాథే ఖల్వే పిష్ట్వాప్యయోరజః। విపచే న్మధ్యపాకేన సర్వవ్యాధి జరాపహం॥" ఆ. ప్ర.—యథోక్త

కఫం పిత్తం గరం శూలం శోఫార్శః ప్లీహపాండుతాః।
మేదో మేహ కృమీనుష్టం.........॥ ఆ-ప్ర.

---

విధానమున మారితమైన లోహభస్మను ఖల్వమునందుంచి యందు ద్విగుణముగా త్రిఫలా కషాయమును జేర్చి కలియ నూరి, యాపిష్టము నొక యినుపబాణలిలోనికి గ్రహించి యగ్నిపైనుంచి కొంచెము ద్రవశేషముండునట్లు పాకము జేయువలెను. ఈవిధముగ సిద్ధము జేయబడినట్టి లోహభస్మ సమస్తవ్యాధులను బోగొట్టి ముసలితనము రాకుండ కాపాడును.

(2) అసమ్యక్ శోధిత-మారిత లోహభస్మ వికార ములు.—"షండత్వ కుష్ఠామయ మృత్యుదంభవేత్ హృ ద్రోగశూలౌ కురుతేఽశ్మరీంచ। నానారుజానాంచ తథా ప్రకోపం కరోతి హృల్లాసమశుద్ధలోహం॥ జీవహారి మదకారి చాయసం దేహశూల కృదసంస్కృతంధ్రువం। పాటవం నతనుతే శరీరకే దారుణాం హృదిరుజాంచ యచ్ఛతి॥" ఆ-ప్ర.—లోహములు యథోక్తవిధానమున శోధన మారణ సంస్కారములను బొందించకున్నచో షండత్వము, కుష్ఠము, హృద్రోగము, శూల, అశ్మరి, హృల్లాసము మున్నగు వికా రములను గలిగించును. మత్తును గలిగించును. శరీరపాట వమును బోగొట్టును. దారుణమైన హృదయశూలను బుట్టించి క్రమముగా మరణమును గలిగించును.

(3) లోహభస్మ సేవనయందపథ్యములు.— కూష్మాండం తిలతైలంచ మాషాన్నం రాజికాం తథా।

తీక్ష్ణలోహభస్మ తిక్తరసమును, మధురకషాయానురసములను, శరగురు రూక్షగుణములను, శీతవీర్యమును గలిగియుండును. వయస్సును పెంచును. నేత్రములకు హితమైనది. లేఖనము, వాతమును వృద్ధి జేయును. కఫ పిత్తములను శమింపజేయును. గరవిషమును, శూలను, శోఫను, అర్శస్సును, ప్లీహావృద్ధిని, పాండురోగమును, మేదస్సును, ప్రమేహమును, కృములను, కుష్ఠమును బోగొట్టును.

## కాంతలోహభస్మ గుణములు

శ్లో॥ కాంతాయః కామలాశోఫ కుష్ఠాని క్షయగుల్మకౌ।
శూలోదరార్శః ప్లీహాన మామవాతం భగందరం॥
అమ్లపిత్తం యకృచ్చాపి శిరోరోగం హరేద్ధ్రువం।
బలంవీర్యం వపుఃపుష్టిం కురుతేఽగ్నిం వివర్ధయేత్॥
సర్వాన్ గదాన్ విజయతే కాంతలోహం నసంశయః॥

ఆ-ప్ర.

కాంతలోహభస్మ బలమును, వీర్యమును, శరీరమునకు పుష్టిని గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. కామిల, శోఫ, కుష్ఠము, క్షయము, గుల్మము, శూల, ఉదరము, అర్శస్సు, ప్లీహావృద్ధి, ఆమవాతము, భగందరము, అమ్లపిత్తము, యకృద్వృద్ధి, శిరోరోగము మున్నగు సమస్తవ్యాధులను బోగొట్టును.

---

మద్య మమ్లం మసూరాంశ్చ త్యజే ల్లోహస్య సేవకః॥"
ఆ-ప్ర.—లోహభస్మను సేవించునప్పుడు గుమ్మడికాయను, నువ్వులనూనెను, మినుమును, ఆవాలను, మద్యమును, అమ్లరసమును, చిరుసెనగలను వర్జింపవలెను.

# తీక్ష్ణలోహ - కాంతలోహ యోగములు

## (1) నవాయసలోహము

శ్లో॥ త్ర్యూషణం త్రిఫలాముస్తం విడంగం చిత్రకం సమం।
నవాయో రజసో భాగా స్తచ్చూర్ణం మధుసర్పిషా॥
భక్షయే త్పాండుహృద్రోగ కుష్ఠార్శః కామలాపహం॥
భై-ర.

త్రికటుకములు, త్రిఫలములు, తుంగముస్తలు, వాయువిడంగములు, చిత్రమూలము వీటి నొక్కొక్క భాగముచొప్పున గ్రహించి మృదువుగా చూర్ణించవలెను. లోహభస్మము తొమ్మిదిభాగములు అనగా పైవాని మొత్తమునకు సమముగా గ్రహించి యీ రెండింటిని గలియ నూరిన యద్యది నవాయసలోహమని చెప్పబడును. దీనిని మధుఘృతములతో జేర్చి సేవించినచో పాండు, హృద్రోగము, కుష్ఠము, అర్శస్సు, కామిల యివి శమించును.

## (2) లోహపర్పటి

శ్లో॥ సమాంగంధరసౌ కృత్వా కజ్జలీకృత్య యత్నతః।
శుద్ధలోహస్య చూర్ణంతు రసతుల్యం ప్రదాపయేత్॥
ఏకీకృత్య తతో యత్నా ల్లోహపాత్రే ప్రమర్దితం।
ఘృతప్రలిప్త దర్వ్యాంతు స్వేదయే న్మృదునాగ్నినా॥
ద్రవీభూతం సమాహృత్య ఢాలయేత్ కదలీదలే।
చూర్ణీకృత్య సుఖార్థాయ పథ్యభుగ్భిః ప్రసేవ్యతే॥
శీతోదకానుపానంవా క్వాథంవా ధాన్యజీరయోః।
లోహేన పర్పటీహ్యేషా భక్ష్యాలోకస్య సిద్ధిదా॥

రక్తికైకాం సమారభ్య వర్ధయే ద్రక్తికాం క్రమాత్ ।
సప్తాహంవా ద్వయంవాపి యావ దారోగ్య దర్శనం॥
సూతికాంచ జ్వరంచైవ గ్రహణీ మతి దుస్తరాం।
ఆమశూలాత్రిసారాంశ్చ పాండురోగం సకామలం॥
ప్లీహాన మగ్నిమాంద్యంచ భస్మకంచ తథైవచ।
ఆమవాత ముదావర్తం కుష్ఠా న్యష్టాదశైవతు।
ఏవమాదీం స్తథారోగా న్గరాణి వివిధానిచ।
హన్త్యనేన ప్రయోగేణ వపుస్స్యా న్నిర్మలః సుఖీ॥
జీవేద్వర్ష శతంపూర్ణం వలీ పలితవర్జితః।
భోజనం రక్తశాలీనాం త్యక్త్వాశాకం విదాహిచ॥
ఆమ వాత ప్రకోపంచ చింతనం మైథునంతథా।
ప్రాతరుత్థాయ సంసేవ్యా విధి నాయుఃప్రవర్ధినీ॥

భై-ర.

యథోక్తవిధానమున శుద్ధిజేసిన గంధకమును, పాదరసమును సమభాగములుగ గ్రహించి కజ్జలిగా ఖల్వమునందు నూరవలెను. పిమ్మట శుద్ధిజేయబడిన లోహచూర్ణమును పాదరసమునకు సమముగా గ్రహించి, పై కజ్జలితో జేర్చి వేరొక లోహపాత్రయందు వేసి నిమ్మనీటిని కలియ నూరవలెను. పిమ్మట నొక లోహదర్వియందు ఘృతమును బూసి యందు నీ చూర్ణమును జేర్చి యా దర్విని మృద్వగ్నిపైనుంచి ద్రవింపజేయవలెను. అది బాగుగా ద్రవించినట్లు తెలిసికొని గోమయముపై లేత యరటి యాకునుంచి దానిపై యా ద్రవీభూతమైన యౌషధద్రవ్యమును జాగ్రత్తగా బోసి దానిపై తిరిగి లేత యరటియాకును గప్పి దానిపై గోమయము నుంచవలెను. స్వాంగశీతలమున పర్పటి యాకృతిలోనుండు నౌషధమును గ్రహించి ఖల్వమునందు మెత్తగానూరి యుంచుకొనవలెను.

ఇటుల సిద్ధముచేయబడినట్టిది లోహపర్పటి యని వ్యవహరింపబడును. దీనిని శీతోదకానుపానముతోగాని, ధనియాలు జీలకర్ర వీని కషాయముతోగాని సేవించుచు పథ్యమైన యాహారమును భుజించుచుండవలెను. ఒకరక్తికా ప్రమాణమున నారంభించి ప్రతిదిన మొక్కొక్క రక్తికచొప్పున మాత్రను హెచ్చింపుచు నేడుదినములుగాని, పదునాలుగు దినములుగాని సేవింపవలెను. లేక, ఆరోగ్యము కలుగువరకును సేవింపవచ్చును. ఇందువలన నూతికాపాతము, జ్వరము, అతిదుస్తరమగు గ్రహణి, ఆమశూల, అతిసారము, పాండువు, కామిల, ప్లీహావృద్ధి, అగ్నిమాంద్యము, భస్మకము, ఆమవాతము, ఉదావర్తము, అష్టాదశకుష్ఠువులు, గరవిషవికారములు మున్నగువ్యాధులు శమించును. మరియు నీ యౌషధ సేవనవలన వలీపలితములు నశించి సుఖముగ నూరువర్షములు జీవింపగలుగును. దీనిని సేవించునప్పుడు విదాహికరములగు శాకములను, ఎర్రధాన్యపు అన్నము, ఆమవర్ధకములగువానిని, వాతప్రకోపకరములగు వానిని, చింతించుటను, మైధునమును విడిచిపెట్టవలెను.

## (3) ధాత్రీలోహము

శ్లో॥ ధాత్రీచూర్ణస్యాష్టౌపలాని చత్వారి లోహచూర్ణస్య।
యష్టీ మధుకరజశ్చ ద్విపలం దద్యాత్ ప్రత్యేకమ్ప్రష్టం॥
అమృతా క్వాథేన తచ్చూర్ణం భావ్యంచ సప్తసప్తాహం।
చండాతపేషు శుష్కంభూయః పిష్ట్వాన వేషు శ్చేస్థాప్యం॥
ఘృతమధునా సంయుక్తం భక్తాదౌమధ్యతస్తథాన్తేచ।
త్రీనపివారాన్ ఖాదేత్ పథ్యందోషాను బంధేన॥

---

N. B.—(3) ఈ యోగమునందలి చూర్ణములను వస్త్రఖాళితము చేసిన వానినే గ్రహింపవలెనని తెలియవలెను.

భక్తస్యాదౌ శమయతిరోగాన్ పిత్తాని లోద్భూతాన్।
మధ్యేఽన్నే విష్టంభం జయతినృణాం విదహ్యతేచాన్నం॥
పానాన్నకృతాన్ దోషాన్ భక్తాన్తే శీలితం జయతి।
ఏవంజీర్యతిచాన్నం శూలం నృణాం సుకష్టమపి॥
హారతి చసహసాయుక్తో యోగశ్చాయం జరత్పిత్తం।
చక్షుష్యః పలితఘ్నః కఫపిత్త సముద్భవాన్ జయతి॥

భై - ర.

ఉసిరికకాయలచూర్ణ మెనిమిదిపలములు, లోహభస్మ నాలుగు పలములు, మధుయష్టిచూర్ణము రెండుపలములు ఇటుల గ్రహించి, ఖల్వమునంగుంచి యందు తిప్పతీగె కషాయమును బోసి యేడుదినములు చక్కగా మర్దించవలెను. పిమ్మట తీక్ష్ణమగు నెండలో నెండించవలెను. ఈ చూర్ణమును తిరిగి తిప్పతీగె కషాయముతో బాగుగా నానిపోవువరకు నూరి వేరొకపాత్రలో భద్రపరచవలెను. ఇటుల సిద్ధము చేయబడినట్టిది ధాత్రీలోహ మనబడును. దీనిని మాత్రాపరిమితి ననుసరించి మధుఘృత ములతో జేర్చి భోజనమున కాదిమధ్యావసానకాలములందు సేవించి నచో వాతాదిదోషజములగు వ్యాధులు శమించును. అందు భోజనమున కాదియందు సేవించినచో పిత్తవాతదోష సంబంధములగు వికారములు శమించును. భోజనమధ్యమున సేవించినచో విష్టంభము నశించి ఆహారము చక్కగా జీర్ణమగును. భోజనాంతమున సేవించినచో అన్నపానముల వలన నేర్పడు దోషవికృతి శమించును. ఇటుల దోషవికృతులెల్ల శమించి యాహారము జీర్ణమై యతికష్టసాధ్యమగు శూలగూడా బోవును, మరియు, నేత్రములకు హితమైనది. పలితమును బోగొట్టును. కఫపిత్తజ వికారములు శమించును.

## (4) కాంతవల్లభరసము

శ్లో॥ కాంతం షోడశభాగంచ చతుర్దశ త్వయోరజః।
కిట్టం ద్వాదశకంచైవ దశభాగంతు టంకణం॥
మనశ్శిలాష్టభాగాని షడ్భాగంచ శిలాజతు।
సర్వత్ర చ సమంసూతం గంధకంచాపి తత్సమం॥
హంసపాదీ రసేనైతత్సర్వం సమ్మర్దయే ద్భిషక్।
శుష్కం కాచఘటేక్షిప్త్వా వాలుకాయంత్రగంపచేత్॥
సప్తరాత్రంతు తత్పక్త్వా స్వాంగశీతల ముద్ధరేత్।
భూయః పిష్ట్వాతు పూర్వోక్తరసేన పరిశోషితం॥
చూర్ణితం మధునాయోగ్యం నిష్కార్ధంచ సుసేవితం।
పాండురోగం క్షయంగుల్మం గ్రహణీరోగనాశనం।
కాసం శ్వాసం జ్వరంఛర్ది ప్లీహోదర మరోచకం॥
మందాగ్నిం కుష్ఠరోగంచ మూలరోగం భగందరం।
దృష్టిపుష్టికరం కాంతివర్ధనం బలవర్ధనం॥
సర్వపాండు క్షయంచైవ లోకస్యారోగ్యదాయకం।
కాంతవల్లభనామోఽయం విష్ణుదేవేన నిర్మితం॥

ర-యో-ర.

కాంతలోహభస్మ * పదియారుభాగములు, లోహభస్మ పదునాలుగుభాగములు, మండూరభస్మ పదిరెండుభాగములు, శోధితటంక

---

* ఈ యోగము రసాయనార్థమై కల్పింపబడినట్టిది. ఇందు కొందరు కాంతలోహము, లోహము, మండూరము అను వాటిని శుద్ధిజేసి, మృదుచూర్ణములుగాజేసి చేర్చు

ణము పదిభాగములు, శోధితమణిశిల యెనిమిదిభాగములు, గోమూత్ర
శిలాజతు ఆరుభాగములు, ఈ పైవాటి మొత్తమునకు సమము శోధిత
పాదరసము, అంతియేభాగము శోధితగంధకము ఇటుల గ్రహించి,
తొలుత రసగంధకములను కజ్జలిజేసి యందు మిగిలిన ద్రవ్యములను జేర్చి
హంసపాదియాకు స్వరసముతో మూడుదినములు చక్కగా నూరి యెండ
బెట్టవలెను. పిమ్మట మెత్తగా చూర్ణించి కాచకుపికయందు నించి,
దానిని వాలుకాయంత్రమున నమర్చి రెండుదినములు క్రమాగ్నులతో
పాకముజేయవలెను. స్వాంగశీతలమైన నందుండి యౌషధమును
గ్రహించి, మెత్తగానూరి తిరిగి హంసపాదియాకు స్వరసములో మర్దించి
యుపయోగింపవలెను. ఇటుల సిద్ధముచేయబడినట్టిది కాంతవల్లభరసమని
వ్యవహరింపబడును. అర్ధనిష్క ప్రమాణమున తేనెతో సేవించిన పాండు
రోగము, క్షయము, గుల్మము, గ్రహణి, కాసము, శ్వాస, జ్వరము,
ఛర్ది, ప్లీహావృద్ధి, అరుచి, అగ్నిమాంద్యము, కుష్ఠురోగము, అర్శస్సు,
భగందరము మున్నగువ్యాధులు శమించును. మరియు, దీని సేవనవలన
దృష్టిబలమును, ధాతుబలమును, కాంతియు జేర్పడును. విశేషముగ
పాండురోగములను బోగొట్టి ఆరోగ్యమును గలిగించును.

---

కొందురు. మరి కొందరు ఈ కాంతాదిలోహముల భస్మ
లను జేర్చుకొందురు. ఇటుల రెండు సాంప్రదాయములు
ప్రచారములోనున్నవి. ఈ యౌషధము రసాయనమగుటచే
లోహములను గంధకాది ద్రవ్యముల సహాయమున పాదరస
మునందు జారణముజేయవలసియున్నది. అట్లుల లోహజారిత
మగు రసమునకే రసాయనత్వము సిద్ధించును. అందుచే
నిజలోహముల చూర్ణములనే యీ యోగమున జేర్చుకొన
వలెనని దెలియనగును.

## (5) లోహరసాయనము

శ్లో॥ సూతమేకం ద్విధాగంధం లోహభస్మత్రయోః సమం।
సర్వం సమ్మర్ద్య ఖల్వేతు కజ్జలీం కారయేద్బుధః॥
కుమారీ స్వరసేనైతత్ మర్దయేత్త్రిదినం తతః।
గుళికాంతు విధాయాథ తామ్రసంపుటగాం న్యసేత్॥
త్రిదినం ధాన్యరాశౌతు తత ఉద్ధృత్య మర్దయేత్।
సురసా త్రికటువాసానాం గుడూచీ చిత్రమూలయోః।
పృథగ్ద్విమర్దయేత్సమ్యగ్వాసరాన్ త్రీన్ ప్రయత్నతః॥
తత్సర్వం లోహపాత్రస్థం భూయోభావ్యం ఖరాతపే।
త్రిఫలాబిస నిర్గుండీ దాడిమత్వగ్రసైః పృథక్॥
భృంగరాజస్యతథా కురంటక పలాశయోః।
మోచాకందస్య చరసైః త్రివారం పరిశోషయేత్॥
యుక్తానుపాన సహితః సేవ్యోమాష ప్రమాణతః।
ఏషలోహరసాయన స్సర్వరోగనికృంతనః॥
ఆయుస్తేజోబలంచైవ వర్ధయే న్నాత్ర సంశయః।
సర్వప్రణా నందవృద్ధిం నాశయే దితికీర్తితః॥

ర-యో-ర.

శుద్ధిజేయబడిన పాదరస మొకభాగము, శుద్ధిజేయబడిన గంధకము రెండుభాగములు, లోహభస్మ మూడుభాగములు ఇటుల గ్రహించి, ఖల్వమునం దన్నింటిని కలిపి కజ్జలిగా నూరవలెను. పిమ్మట నందు కలబందరసమును జేర్చి మూడుదినములు జక్కగానూరి యొక గోళమును జేసి యెండించవలెను. ఈ గోళము నొక రాగిడబ్బియందుంచి యాడబ్బిని ధాన్యరాశియందు మూడుదినములు కప్పియుంచవలెను. పిమ్మట నా గోళమును తిరిగి ఖల్వమునందు చూర్ణించి యందు తులసీయాకు స్వరసముతో మూడుదినములు మర్దించవలెను. ఇటులనే త్రికటు

కషాయముతోను, అడ్డసరపాకు రసముతోను, తిప్పతీగె రసముతోను, చిత్రమూలకషాయముతోను ప్రత్యేకముగ మూడుదినములు చొప్పున మర్దించవలెను. పిమ్మట నీ యౌషధపిష్టము నొక యినుపపాత్రయం దుంచి యది మునుగునంత పరిమితి నందు త్రిఫలాకషాయమును బోసి యా పాత్ర నెండలో నుంచవలెను. ఆ ద్రవము అందు ఇనికిపోయినపిమ్మట తిరిగి యా కషాయము నే బోసి యెండలో నుంచవలెను. మూడవపర్యాయముగూడ పై కషాయముతో పై విధముగ నే భావనజేయవలెను. ఈ విధముగా తామరతూండ్ల రసముతోను, వావిలాకు రసముతోను, దానిమ్మపండుపై నుండు బెరడుయొక్క కషాయముతోను, గుంటకలగరాకురసముతోను, గోరింటవేళ్ల కషాయముతోను, మోదుగచెక్క కషాయముతోను, అరటిగుంప రసముతోను ప్రత్యేకముగ మూడుపర్యాయములు పై విధముగా భావనచేయవలెను. పిమ్మట నెండించి, మృగు చూర్ణముగా నూరి యుపయోగించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది లోహరసాయనమని వ్యవహరింపబడును. దీనిని మాత్రప్రమాణమున యుక్తానుపానముతో సేవించినచో సమస్తవ్యాధులును శమించును. ఆయువు, వీర్యము, బలము ఇవి వృద్ధిబొందును. మరియు, సమస్తవ్రణములును, అండవృద్ధియు శమించును.

---

# మండూరము

## మండూర నామములు *

శ్లో॥ ధ్మాయమానస్య లోహస్య మలం మండూరముచ్యతే।
లోహసింహానికా కిట్టీ సింహానంచ నిగద్యతే॥ అ-ప్ర.

---

* (1) మండూరలక్షణము.—"ఊషచోచ్ఛ్రేణాం గురు స్నిగ్ధం మండకిట్టం జగుర్బుధాః। భిన్నాంజన ప్రభం కిట్టం

లోహమును కొలిమిలో గాల్చునప్పుడు అందుండి బయటకు మల రూపమున వచ్చునట్టిది మండూరమని వ్యవహరింపబడును. లోహసింహానిక, కిట్టి, సింహానము అనునవి మండూరనామములు.

---

విశేషాద్గురు నిర్వ్రణం॥ నిష్కోటరంచ విజ్ఞేయం తీక్ష్ణ కిట్టం మణీషిభిః। పింగం రూక్షం గురుతమ్మం మందసీర్ఘమకోటరం। ఛిన్నంతు రజతచ్ఛాయం స్యాత్తత్కిట్టంతు కాంతజం॥"
ఆ-ప్ర.—ముండలోహముయొక్క కిట్టము కొద్దిగ నెఱ్ఱని వర్ణముగలిగి బరువుగను, స్నిగ్ధముగను నుండును. తీక్ష్ణలోహ కిట్టము నల్లనివర్ణముగలిగి ఎక్కువ బరువుగను, బొడుపులు తొఱ్ఱలు లేక యుండును కాంతలోహ కిట్టము-పింగళ వర్ణముగలిగి రూక్షముగను, మిక్కిలి బరువుగను, పలచ గను, పొడవుగను, తొఱ్ఱలులేనిదిగను, పగులగొట్టినప్పుడు వెండివంటి వర్ణముగలదిగను నుండును.

(2) గ్రాహ్యమండూర లక్షణము.— "అకోటరం గురుస్నిగ్ధం దృఢం శతసమాధికం। చిరోజ్ఝిత జనస్థాన సంస్థితం కిట్టమాహరేత్॥ శతోర్ధ్వ ముత్తమం కిట్టం మధ్యం చాశీతివార్షికం। అధమం షష్టివర్షీయం తతోహీనం విషో పమం॥ ఆ-ప్ర.—మధ్యమధ్య తొఱ్ఱలులేక సమముగా నున్నట్టియు, బరువుగను, స్నిగ్ధముగను, దృఢముగను నున్నట్టియు, నూరు సంవత్సరములనుండి జనులులేని స్థల మున భూమిలో కప్పబడియున్నట్టియు మండూరమును ఔష ధార్థమై గ్రహించవలెను. మరియు, నీ మండూరమును నూరు సంవత్సరముల నాటిదైనచో నుత్తమమైనదిగను,

## మండూర శోధనవిధానము

శ్లో॥ తీక్ష్ణాది లోహాకిట్టంతు సంశోధ్యం లోహవచ్ఛుధైః॥
ఆ-ప్ర.

మండూరమును లోహమునకువలెనే శోధించవలెను. అనగా—మండూరపురాళ్లను కొలిమిలో నెఱ్ఱగా గాల్చి తైలతక్రాది ద్రవ్యము లందు ప్రత్యేకముగా నేడుమార్లుచొప్పున ముంచినచో నయ్యది పరిశుద్ధ మగును.

## మండూరభస్మ విధానము *

శ్లో॥ 'గోమూత్రై స్త్రిఫలాక్వాథై స్సేచయేచ్చ పునః పునః।
లోహాకిట్టం సుతప్తం స ద్యావచ్చీర్యతి తత్స్వయం॥

---

ఎనుబది సంవత్సరములనాటిదైనచో మధ్యమముగను, అరువది సంవత్సరముల నాటిదైనచో నీచమైనదిగను, అంతకు తక్కువకాలము నాటిదైనచో విషతుల్యముగను దెలియనగును. దీనినిబట్టి మండూర మెంత పురాతనమైన నంత శ్రేష్ఠమైనదిగా దెలియదగినది.

* స్వానుభూత సాంప్రదాయమున మండూరభస్మ విధానము.—దీనిని లోహమునకువలెనే తొలుత త్రిఫలా కషాయముతో మర్దించుచు పదిపుటములు పూర్తిజేయ

Note.—మండూరమునకు శాస్త్రమునందు పుటపాకము చెప్పబడి యుండలేదు. అయినను వృద్ధవైద్య సాంప్రదాయమున నీ విధముగా పుటములువేయుట ప్రచారమున గలదు.

తచ్చూర్ణం గ్రాహయేత్ పేష్యం మండూరోఽయం ప్రయుజ్యతే॥ ఆ-కం.

మండూరమును శుద్ధిజేసినపిమ్మట తిరిగి కొలిమిలో గాల్చుచు పలుమార్లు అది స్వయముగా చూర్ణరూపమును బొందువరకు గోమూత్రముతోను, త్రిఫలాకషాయముతోను తడుపుచుండవలెను. అటుల చూర్ణరూపమును బొందిన మండూరమును ఖల్వమునందు మెత్తగా నూరి వ్యాధులందుపయోగించవలెను.

## మండూరభస్మ గుణములు

శ్లో॥ కిట్టం కషాయం శిశిరంపాండు శ్వయథు శోఫజిత్।
హలీమకం కామలాంచ హరతే కుంభకామలాం॥

ఆ-ప్ర.

మండూరభస్మ కషాయరసమును, శీతవీర్యమును గలిగియుండును. పాండు, శోఫ, సర్వాంగశోఫ, హలీమకము, కామిల, కుంభకామిల వీనిని బోగొట్టును.

## మండూర యోగములు

### (1) పునర్నవాది మండూరము

శ్లో॥ పునర్నవా త్రివృచ్ఛుంఠీ పిప్పలీ మరిచానిచ।
విడంగం దేవకాష్ఠంచ చిత్రకం పుష్కరాహ్వయం॥

---

వలెను. పిమ్మట నాలుగుపుటములు గోమూత్రముతో మర్దించుచు పూర్తిచేయవలెను. ఇటుల జేసినచో నలుపుతో జేరిన యెఱ్ఱనివర్ణముగల భస్మయగును.

త్రిఫలా ద్వే హరిద్రేచ దన్తీచ చివికాతథా।
కుటజస్య ఫలం తిక్తా పిప్పలీమూల ముస్తకం॥
ఏతాని సమభాగాని మండూరం ద్విగుణం తతః।
గోమూత్రేఽష్టగుణే పక్త్వా స్థాపయేత్ స్నిగ్ధభాజనే॥
పాండుశోథోద రానాహ శూలార్శః క్రిమిగుల్మనుత్॥

భై-ర.

తెల్లగలిజేరువేరు, తెగడవేరు, శుంఠి, పిప్పళ్లు, మిరియాలు, వాయువిడంగములు, దేవదారు, చిత్రమూలము, పుష్కరమూలము, త్రిఫలములు, పసపు, మ్రానుపసపు, దన్తీమూలము, చవ్యము, కొండిశపాలగింజలు, కటుకరోహిణి, మోడి, తుంగముస్తలు ఈ ద్రవ్యములను సమభాగములుగా గ్రహించి, వీని మొత్తమునకు ద్విగుణముగా శోధిత మండూరమును గ్రహించవలెను. తొలుత గలిజేరువేరు మున్నగు ద్రవ్యములను మెత్తగా చూర్ణించి అందు మండూరచూర్ణమును కలుపవలెను. పిమ్మట నీ చూర్ణమునంతను ఒక యినుపబాణలియందుంచి అందు పై చూర్ణముయొక్క మొత్తమునకు ఎనిమిదిరెట్లుండునట్లు గోమూత్రమును బోసి ఇనుపగరిటితో కలుపుచు సన్నని మంటపైనుంచి యందలి ద్రవమంతయు నిగిరిపోవువరకును పాకముజేయవలెను. పిమ్మట నది చల్లబడినప్పుడు ఎండలోబెట్టి యెండించవలెను. తిరిగి మెత్తగా చూర్ణించి యుపయోగించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది పునర్నవామండూరమని వ్యవహరింపబడును. దీనిని యుక్తప్రమాణమున సేవించినచో పాండురోగము, శోఫ, ఉదరము, ఆనాహము, శూల, అర్శస్సు, క్రిమిరోగము, గుల్మము ఇవి శమించును.

## (2) శోథారిమండూరము

శ్లో॥ గోమూత్ర శుద్ధమండూరం నిర్గుండీ రసభావితం।
మాణకార్ద్రక కందానాం రసైరపిచ భావయేత్॥
త్రిఫలావ్యోషచవ్యానాం చూర్ణంకర్షద్వయం పృథక్।
చూర్ణాద్ద్విగుణమండూరం గోమూత్రేఽష్టగుణేపచేత్॥
సిద్ధే చూర్ణం క్షిపేత్ శీతే మధునశ్చ పలద్వయం।
నిహన్తి సర్వజంశోథం సర్వాంగోత్థం నసంశయః॥

భై-ర.

మండూరమును గోమూత్రముతో శోధించి వావిలాకురసముతోను, మానకందరసములోను, అల్లపురసములోను భావనజేయవలెను. త్రిఫలములు, త్రికటుకములు, చవ్యము వీని చూర్ణములను ప్రత్యేకముగా రెండు రెండు తులముల చొప్పున గ్రహించవలెను. పైవిధముగ శోధన భావనలు జేయబడిన మండూరచూర్ణము పై చూర్ణముల మొత్తమునకు ద్విగుణముగా నుండునట్లు గ్రహించవలెను. ఒక యినపపాత్రయందు తొలుత మండూరచూర్ణము నుంచి యందు ఎనిమిదిభాగములు గోమూత్రమును బోసి సన్నని మంటపై నంతయు ఘనీభవించువరకును బాకము జేయవలెను. అది యటుల ఘనీభవించినప్పుడు ఆ త్రిఫలాదిచూర్ణము నందు వేసి యొక దర్వితో జక్కగా కలియగలిపి నిప్పుపైనుండి క్రిందకు పాత్రను దింపవలెను. పిమ్మట నా పాత్ర చల్లబడినట్లు తెలిసికొని యందు రెండుపలముల పరిమితిని తేనెను జేర్చి బాగుగా కలియబెట్టవలెను. పిమ్మట నైదుయవల పరిమితిని గుటికలుగా జేసి యుపయోగించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది శోథారి మండూరమనబడును. దీనిని సేవించుటవల్ల సమస్త శోథలును శమించును.

## ఉప ధాతువులు

# స్వర్ణమాక్షికము

### స్వర్ణమాక్షిక నామములు *

శ్లో॥ స్వర్ణమాక్షిక మాఖ్యాతం తాపీజం మధుమాక్షికం।
తాప్యం మాక్షిక ధాతుశ్చ మాక్షికంచైవ తన్మతం॥
ఆ-ప్ర.

---

* (1) స్వర్ణమాక్షికలక్షణము.—"కించిత్స్వర్ణసాహిత్యాత్ స్వర్ణమాక్షిక మీరితం। ఉపధాతుః సువర్ణస్య కించిత్స్వర్ణగుణైః సమం॥ న కేవలం స్వర్ణగుణాః వర్తన్తే స్వర్ణమాక్షికే। ద్రవ్యాన్తరస్య సంసర్గాత్ సన్త్యన్యేఽపి గుణా యతః॥ కింతు తస్యాను కల్పత్వాత్ కించిదూనాగుణా స్తతః। తథాఽపి కాంచనాభావే దీయతే స్వర్ణమాక్షికం॥" ఆ-ప్ర.—బంగారముతో సాంగత్యము గలిగియుండుటంబట్టి స్వర్ణమాక్షికమని యిది వ్యవహరింపబడుచున్నది. మరియు, నిది బంగారముయొక్క గుణములను కొంచెము తక్కువగా గలిగియుండుటంబట్టి స్వర్ణమున కుపధాతువుగా గ్రహింపబడు చున్నది. అందుచే కేవలము దీనియందు స్వర్ణగుణములే గాక యితర గుణములుగూడా ఉండును. కావున నితర గుణములయొక్క సంబంధముచే స్వర్ణగుణము లిందు తక్కువగా నున్నట్లు దెలియవలెను. అయినను స్వర్ణాభావమున నౌషధయోగములందు స్వర్ణమాక్షికమును ధారాళముగా

## (2) శోథారిమండూరము

శ్లో॥ గోమూత్ర శుద్ధమండూరం నిర్గుండీ రసభావితం।
మాణకార్ద్రిక కందానాం రసైరపిచ భావయేత్॥
త్రిఫలావ్యోషచవ్యానాం చూర్ణంకర్షద్వయం పృథక్।
చూర్ణాద్ద్విగుణమండూరం గోమూత్రేఽష్టగుణేపచేత్॥
సిద్ధే చూర్ణం క్షిపేత్ శీతే మధునశ్చ పలద్వయం।
నిహన్తి సర్వజంశోథం సర్వాంగోత్థం నసంశయః॥

భై-ర.

మండూరమును గోమూత్రముతో శోధించి వావిలాకురసము తోను, మానకందరసములోను, అల్లపురసములోను భావనజేయవలెను. త్రిఫలములు, త్రికటుకములు, చవ్యము వీని చూర్ణములను ప్రత్యేకముగా రెండు రెండు తులముల చొప్పున గ్రహించవలెను. పైవిధముగ శోధన భావనలు జేయబడిన మండూరచూర్ణము పై చూర్ణముల మొత్తమునకు ద్విగుణముగా నుండునట్లు గ్రహించవలెను. ఒక యినపపాత్రయందు తొలుత మండూరచూర్ణము నుంచి యందు ఎనిమిదిభాగములు గోమూత్రమును బోసి సన్నని మంటపై నంతయు ఘనీభవించువరకును బాకము జేయవలెను. అది యటుల ఘనీభవించినప్పుడు ఆ త్రిఫలాదిచూర్ణము నందు వేసి యొక దర్విలో జక్కగా కలియగలిపి నిప్పుపైనుండి క్రిందకు పాత్రను దింపవలెను. పిమ్మట నా పాత్ర చల్లబడినట్లు తెలిసికొని యందు రెండుపలముల పరిమితిని తేనెను జేర్చి బాగుగా కలియబెట్ట వలెను. పిమ్మట వైద్యుయవల పరిమితిని గుటికలుగా జేసి యుపయోగించ వలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది శోథారి మండూరమనబడును. దీనిని సేవించుటవల్ల సమస్త శోథలును శమించును.

## ఉప ధాతువులు

# స్వర్ణమాక్షికము

### స్వర్ణమాక్షిక నామములు *

శ్లో॥ స్వర్ణమాక్షిక మాఖ్యాతం తాపీజం మధుమాక్షికం।
తాప్యం మాక్షిక ధాతుశ్చ మాక్షికంచైవ తన్మతం॥
ఆ-ప్ర.

---

* (1) స్వర్ణమాక్షికలక్షణము.—"కించిత్సువర్ణసాహిత్యాత్ స్వర్ణమాక్షిక మీరితం। ఉపధాతుః సువర్ణస్య కించిత్స్వర్ణగుణైః సమం॥ న కేవలం స్వర్ణగుణాః వర్తన్తే స్వర్ణమాక్షికే। ద్రవ్యాన్తరస్య సంసర్గాత్ సన్త్యన్యేఽపి గుణాయతః॥ కింతు తస్యానుకల్పత్వాత్ కించిదూనాగుణాస్తతః। తథాఽపి కాంచనాభావే దీయతే స్వర్ణమాక్షికం॥"
ఆ-ప్ర.—బంగారముతో సాంగత్యము గలిగియుండుటంబట్టి స్వర్ణమాక్షికమని యిది వ్యవహరింపబడుచున్నది. మరియు, నిది బంగారముయొక్క గుణములను కొంచెము తక్కువగా గలిగియుండుటంబట్టి స్వర్ణమున కుపధాతువుగా గ్రహింపబడుచున్నది. అందుచే కేవలము దీనియందు స్వర్ణగుణములే గాక యితర గుణములుగూడా ఉండును. కావున నితర గుణములయొక్క సంబంధముచే స్వర్ణగుణము లిందు తక్కువగా నున్నట్లు దెలియవలెను. అయినను స్వర్ణాభావమున ఔషధయోగములందు స్వర్ణమాక్షికమును ధారాళముగా

స్వర్ణమాక్షికము, తాపీజము, మధుమాక్షికము, తాప్యము, మాక్షికధాతువు, మాక్షికము అనునవి స్వర్ణమాక్షిక నామములు.

---

జేర్చుకొనవచ్చును. మరియు, "కన్యాకుబ్జాఖ్య విషయే జాయతే స్వర్ణమాక్షికం। తపతీ తీరతోఽపిస్యాదిత్యేవం తద్ద్వియోనికం॥ కన్యాకుబ్జోద్భవం తాప్యం విజ్ఞేయం స్వర్ణ వర్ణకం। తపతీతీరగం తత్తు పంచవర్ణ ముదాహృతం॥" ఆ-ప్ర.—స్వర్ణమాక్షికము కన్యాకుబ్జ ప్రాంతమున నుత్పత్తి గలిగినట్టిది స్వర్ణముతో సమానమైన వర్ణమునుగలిగి యుండును. ఇది తపతీనదియొక్క తీరమునందుగూడ నుత్పత్తియగును. ఇట్టిది బంగారములో నైదువర్ణములనే గలిగియుండును. ఇటుల స్వర్ణమాక్షికము రెండు విధము లగు ప్రదేశములం దుత్పన్నమై రెండువిధములుగా లభ్య మగును.

(2) గ్రాహ్య స్వర్ణమాక్షిక లక్షణము.—"స్వర్ణ వర్ణం గురుస్నిగ్ధం ఈషన్నీలచ్ఛవి స్ఫుటం। కషేకనక వద్ఘృష్టం తద్వరం హేమమాక్షికం॥" ఆ-ప్ర.—బంగారు వర్ణముగలిగినట్టిదియు, బరువుగ నుండునట్టిదియు, నిగనిగ లాడుచుండు నట్టిదియు, కొంచెము నీలవర్ణము గలిగియుండు నట్టిదియు, కోణములేక యుండునట్టిదియు, రాతిపై గీసి నప్పుడు బంగారువర్ణమును చూపునట్టిదియు స్వర్ణమాక్షి కము ఔషధార్హమై గ్రహింపదగియుండును.

## స్వర్ణమాక్షిక శోధనవిధానము *

శ్లో॥ మాక్షికస్య త్రయోభాగాః భాగైకం సైంధవస్యచ।
మాతులుంగ ద్రవైర్వాఽథ జంబీరస్య ద్రవైః పచేత్॥
చాలయేల్లోహజేపాత్రే యావత్పాత్రం సులోహితం।
భవే త్తతస్తు సంశుద్ధం స్వర్ణమాక్షిక మత్ర తు॥

ఆ-ప్ర.

స్వర్ణమాక్షిక చూర్ణము మూడుభాగములు, సైంధవలవణ చూర్ణము ఒకభాగము ఇటుల ఖల్వమునందు జేర్చి కలియనూరి పిమ్మట నా చూర్ణమును ఒక శరావమునందుంచి, అందు కొంచెము కొంచెముగా మాదీఫలరసమునుగాని, జంబీరస్వరసమునుగాని బోయుచు లోహ దర్వితో కదుపుచు సన్నని మంటపై పాకము జేయవలెను. ఇటుల పాకముజేయు కాలములో నా పాత్రకు లోహితవర్ణము గలిగిన వెంటనే దానిని మంటపైనుండి క్రిందకు దింపవలెను. ఇటుల పాకముజేయుట వలన స్వర్ణమాక్షికము పరిశుద్ధమగును.

## స్వర్ణమాక్షిక భస్మ విధానము †

శ్లో॥ మాక్షికస్య చతుర్థాంశందత్వా గంధం విమర్దయేత్।
ఉరూబకస్య తైలేన తతః కార్యాస్య చక్రికా॥

---

* స్వానుభూత సాంప్రదాయమున స్వర్ణమాక్షిక శోధనవిధానము.—స్వర్ణమాక్షికమును కొలిమిలో నెర్రగ గాల్చి త్రిఫలా కషాయమున నేడుమారులు ముంచిన యయ్యది పరిశుద్ధమగును.

† స్వానుభూత సాంప్రదాయమున స్వర్ణమాక్షిక

శరావసంపుటే ధృత్వా పుటే ద్గజపుటేన చ।
ధాన్యస్య తుషమూర్ధ్వాఽధో దత్వాశీతంసముద్ధరేత్॥
సిందూరాభం భవే ద్భస్మ మాక్షికస్య నసంశయః॥

ఆ-ప్ర.

శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము ఒకభాగము, శుద్ధిజేసిన గంధకము నాల్గవభాగము ఇటుల ఖల్వమునందుంచి అందు కొద్దిగ నేరండతైలము బోసి చక్కగా మర్దించి చక్రికజేసి యెండించవలెను. దీనిని శరావసంపుటమునందు బంధించి యొక గజపుటమున (పిడకలమధ్య శరావసంపుటము నుంచునప్పుడు దాని కూర్ధ్వాధోభాగములు ఊకచే గప్పవలెను) పాకము జేయవలెను. స్వాంగశీతలమున నందు సిందూరము వలె నుండు స్వర్ణమాక్షికభస్మను గ్రహించవలెను.

---

భస్మ విధానము.—శుద్ధిజేసిన స్వర్ణమాక్షికమును మెత్తగా చూర్ణించి యొక యినుప బాణలియందుంచి దీనిని కొలిమిపై బెట్టి యూదుచు నా బాణలియందు కొంచెము కొంచెముగా సైంధవలవణము గలిపిన జలమును జల్లుచు నొక యినుప దర్వితో కదుపుచుండవలెను. అటుల స్వర్ణమాక్షిక చూర్ణమంతయు నెర్రనివర్ణమును బొందువరకును జేయుచుండవలెను. పిమ్మట దానిని జల్లార్చి త్రిఫలాకషాయముతో మూడుదినములు చక్కగానూరి చిన్నచిన్న చక్రికలుజేసి యెండించవలెను. వీటిని శరావ సంపుటమున బంధించి యిరువది ముప్పది పిడకలతో పుటము వేయవలెను. ఇటుల మూడు పుటములువేసినచో నయ్యది సిందూరవర్ణమున భస్మయగును,

## స్వర్ణమాక్షిక భస్మ గుణములు *

శ్లో॥ సువర్ణమాక్షికం స్వాదుతిక్తం వృష్యం రసాయనం।
చక్షుష్యం వస్తిహృత్కంఠ పాండుమేహ విషోదరం॥
అర్శః శోఫం విషంకండూం త్రిదోషమపి నాశయేత్।
అనుపానం వరావ్యోషం వేల్లం సాజ్యంహి మాక్షికే॥
ఆ-ప్ర.

స్వర్ణమాక్షికభస్మ మధురరసమును, తిక్తానురసమును గలిగి యుండును. సవ్యశుక్రమును గలిగించును. రసాయనము. నేత్రములకు హితమైనది. త్రిదోషములను శమింపజేయును. వస్తిరోగము, హృద్రోగము, గళరోగము, పాండువు, ప్రమేహము, గరవిషముచే బుట్టిన ఉదరము, అర్శస్సు, శోఫ, విషము, కండు వీటిని బోగొట్టును. ఈ భస్మకు త్రిఫలములను, త్రికటుకములను, వాయువిడంగములను, నెయ్యిని అనుపానములుగా జేర్చవలెను.

---

* అసమ్యక్శోధిత మారిత స్వర్ణమాక్షిక వికారములు.—"మందానలత్వం బలహానిముగ్రాం విష్టంభితాం నేత్రగదాన్ సకుష్ఠాన్। మాలాం విధత్తేఽపిచ గండపూర్వాం శుద్ధ్యాదిహీనం ఖలుమాక్షికంతు॥" ఆ-ప్ర.— స్వర్ణమాక్షికమును యథోక్త విధానమున శోధింపకయు మారణము గావింపకయు సేవించినచో అగ్నిమాంద్యము, బలక్షీణ్యము, మిక్కిలి దారుణమైన మలబంధము, నేత్రవ్యాధులు, కుష్ఠము, గండమాల అను నీ వికారములను గలిగించును. కావున యథావిధిగ దీనికి శోధనమును, మారణమును గావింపవలెను.

# స్వర్ణమాక్షిక యోగములు

## (1) తాప్యాది మండూర వటకము

శ్లో॥ తాప్యందార్వ్యౌ వృ స్త్వచంచవ్యం గ్రంథికం దేవదారుచ। వ్యోషాది నవకంచైత చ్చూర్ణయే ద్ద్విగుణం తతః॥ మండూరంచాంజననిభం సర్వతోఽష్ట గుణేఽథతత్। పృథ గ్విపక్వే గోమూత్రే వటకీ కరణక్షమే॥ ప్రక్షిప్య వటకాన్ కుర్యాత్ తాన్ఖాదే త్తక్ర భోజనః। కుష్ఠా న్యజరకంశోఫం ఊరు స్తంభం అరోచకం॥ అర్శాంసి కామలాం మేహాన్ ప్లీహానం శమయ న్తిచ॥ అ-హృ-చి 16.

స్వర్ణమాక్షికభస్మ, మ్రానుపసపు, చవ్యము, మోడి, దేవదారు త్రికటుకములు, చిత్రమూలము, వాయువిడంగములు, త్రిఫలములు, తుంగముస్తలు వీటిని సమభాగములుగ గ్రహించి మెత్తగా చూర్ణించి యుంచవలెను. ఈ చూర్ణముయొక్క మొత్తమునకు ద్విగుణముగా శోధితమండూరమును గ్రహించి మెత్తగా చూర్ణించి యొక యినుప బాణలియం దుంచవలెను. పిమ్మట నందు పై వాటికన్నింటికిని అష్టగుణముండునట్లు గోమూత్రమునుబోసి మృద్వగ్నితో పాకముజేయవలెను. అందలి ద్రవమంతయు నిగిరిపోయి యది ఘనీభవించునప్పుడు అందు స్వర్ణమాక్షికాదిచూర్ణమును జేర్చి బాగుగా గలియబెట్టి యగ్నిపైనుండి పాత్రను క్రిందకు దించవలెను. తరువాత కొంచెము వేడిగా నున్నప్పుడు అయిదు గ్రెయినుల పరిమితి చొప్పున గుటికలను జేయవలెను. వీటిని సేవించుచు తక్రముతోజేర్చి యాహారమును భుజించుచుండవలెను. ఇందువలన కుష్ఠము, శోఫ, ఊరు స్తంభము, అరుచి, అర్శస్సు, కామిల, ప్రమేహము, ప్లీహావృద్ధి ఇవి శమించును.

## (2) తాప్యాది చూర్ణము

శ్లో॥ తాప్యాద్రిజతురౌప్యాయో మలాః పంచపలాఃపృథక్।
చిత్రక త్రిఫలావ్యోష విడంగైః పాలికైః సహ॥
శర్కరాష్టపలోన్మిశ్రా శ్చూర్ణితాః మధునాద్రుతాః।
పాండురోగం విషంకాసం యక్ష్మాణం విషమం జ్వరం॥
కుష్ఠా న్యజరకంమేహం శోఫంశ్వాస మరోచకం।
విశేషా ద్ధ స్త్యపస్మారం కామలాం గుదజానిచ॥

అ-హృ-చి 16.

స్వర్ణమాక్షికభస్మ, గోమూత్రశిలాజతు, రౌప్యభస్మ, మండూర భస్మ వీటి నైదైదు పలముల చొప్పునను, చిత్రమూలము, త్రిఫలములు, త్రికటుకములు, వాయువిడంగములు వీటి నొక్కొక్క పలము చొప్పునను గ్రహించవలెను. ఇందలి చిత్రమూలము మున్నగు ద్రవ్యములను మెత్తగా చూర్ణించి యుంచవలెను. చక్కెరను ఎనిమిది పలముల ప్రమాణమున గ్రహించి మెత్తగా చూర్ణించి అందు పై మాక్షికాది ద్రవ్యములను, చిత్రమూలాదిద్రవ్య చూర్ణమును జేర్చి బాగుగా కలియ గలిపి యుంచుకొనవలెను. ఇందుండి యుక్తప్రమాణమున గ్రహించి తేనెతో గలిపి సేవించిన పాండురోగము, విషము, కాసము, రాజ యక్ష్మ, విషమజ్వరము, కుష్ఠములు, దారుణమేహము, శోఫ, శ్వాస, అరుచి యివి శమించును. విశేషముగా అపస్మారము, కామిల, అర్శస్సు ఇవి శమించును.



# తారమాక్షికము

## తారమాక్షిక నామములు *

శ్లో॥ విమలం మాక్షికశ్రేష్ఠం శ్వేతాక్షం తారమాక్షికం॥
శా-ని.

విమలము, మాక్షికశ్రేష్ఠము, శ్వేతాక్షము, తారమాక్షికము అనునవి తారమాక్షిక నామములు.

---

* తారమాక్షిక స్వరూపలక్షణాదులు.—"తారమాక్షిక మన్యత్తు తద్భవేద్రజతోపమం। కించిద్రజత సాహిత్యా త్తారమాక్షిక మీరితం॥ అనుకల్పతయా తస్య తతో హీనగుణాస్స్మృతాః। న కేవలం రౌప్యగుణాః వర్తంతే తారమాక్షికే॥ ద్రవ్యాన్తరస్య సంసర్గాత్ సన్త్యన్యేఽపి గుణాయతః॥" "కాంస్యవచ్చాక చక్యాఢ్యం కషేఘృష్టేతు రూప్యవత్। గురుస్నిగ్ధం సితంయ త్తచ్ఛ్రేష్ఠంస్యా త్తారమాక్షికం॥" ఆ-ప్ర.—మాక్షికములో తారమాక్షికమను మరియొక భేదముగలదు. అది వెండితో సమానముగ నుండును. ఇది వెండితో సంబంధము గలిగియుండుటనుబట్టి యటుల తారమాక్షికమను పేర జెప్పబడుచున్నది. మరియు నిది వెండిని యనుకరించుటచే వెండికి యుపధాతువుగా నుండి వెండియొక్క గుణములను స్వల్పముగా గలిగియుండును. ఇంతియేగాకుండ అందు ద్రవ్యాన్తర సంయోగ ముండుటనుబట్టి యితరగుణములుగూడ గలవు. కంచువలె తళతళలాడుచు, రాతిపై గీసినప్పుడును, అరుగదీసినప్పుడును వెండివంటి వర్ణమును జూపునట్టిదియు, బరువుగను, స్నిగ్ధము

## తారమాక్షిక శోధనవిధానము

శ్లో॥ కర్కోటీ మేషశృంగ్యుత్థై ర్ద్రవై ర్జంబీరజై ర్దినం।
భావయే దాతపే తీవ్రే విమలా శుద్ధ్యతిధ్రువం॥
ఆ-ప్ర.

తారమాక్షికమును ఒక శరావమునందుంచి అందు ఆగాకరవేళ్ల రసమును, దుష్టుపాకురసమును, జంబీరస్వరసమును క్రమముగ నొకొక్కదినము చొప్పున బోసి తీవ్రమగు నెండలో బెట్టి భావన జేసిన యయ్యది పరిశుద్ధమగును.

## తారమాక్షికభస్మ విధానము

శ్లో॥ స్వర్ణమాక్షిక వజ్జ్ఞేయం తారమాక్షిక మారణం॥
ఆ-ప్ర.

స్వర్ణమాక్షికమునకు జెప్పిన విధానము ననుసరించి మర్దన పుటములను గావించినచో నయ్యది భస్మయగును.

## తారమాక్షికభస్మ గుణములు

శ్లో॥ విమలాయాః గుణాః కించిన్న్యూనాః కనకమాక్షికాత్॥
ఆ-ప్ర.

తారమాక్షికభస్మ స్వర్ణమాక్షికభస్మకు జెప్పిన గుణములను స్వల్పముగ గలిగియుండును.

---

గను, తెల్లగను నుండునట్టియు తారమాక్షికమును మారణాది కర్మలకు గ్రహించవలెను.

# విమలము

## విమల నామములు *

శ్లో॥ విమలం నిర్మలం స్వచ్ఛమమలం స్వచ్ఛ ధాతుకం॥

ధ-ని.

విమలము, నిర్మలము, స్వచ్ఛము, అమలము, స్వచ్ఛధాతుకను అనునవి విమల నామములు.

---

* (1) విమల భేదములు.—"త్రేధాస్యా ద్విమలః స్వర్ణపూర్వకో రూప్యపూర్వకః। కాంస్య పూర్వశ్చవిఖ్యాత స్తత్తత్కాంత్యా సలక్ష్యతే॥ విమల స్తపతీతీర వర్తిన్యద్రివిభాగకే। ఉత్పద్యతే, పరైఃకాంస్య మాక్షికోఽయ మితి స్మృతః॥ ఆద్యో హేమక్రియాసూక్తః చరమః శ్వేతకర్మసు। మధ్యో రజతనామాయః సప్రోక్తో వైరసాదిషు॥" ఆ-ప్ర.— విమలమను (మాక్షిక భేదము) ద్రవ్యము స్వర్ణవిమల, రూప్యవిమల, కాంస్య విమల యని మూడు విధములుగా నుండి యయ్యవి యాయా ధాతువుల వర్ణములను గలిగియుండును. ఈ విమలము తపతీనది యొడ్డుననుండు పర్వతప్రాంతమున నుత్పన్నమగును. ఇందలి స్వర్ణవిమల హేమక్రియకు (ఇతర లోహములను స్వర్ణముగా బరిణమింపజేయుటకై వలయు రస సంస్కారమునకు) ను, ఇటులనే కాంస్యవిమల శ్వేత కర్మకు (ఇతర లోహములను వెండిగా బరిణమింపజేయుటకై వలయు రససంస్కారమునకు)ను, రజత విమల రసౌషధ నిర్మాణమునకును నుపయోగింపబడుచుండును. కొందరి

## విమల శోధనవిధానము

శ్లో॥ వాసారసే మర్దితోహి శుద్ధోఽతి విమలో భవేత్ ॥
ర-ప్ర-సు.

విమలమును ఖల్వమునందు మెత్తగా చూర్ణించి యందు అడ్డ సరపాకు రసమును బోసి మూడు జాములు మర్దించిన యద్యది పరిశుద్ధ మగును.

---

మతమున నీ విమలమను మాక్షికభేదము కాంస్యమాక్షిక మని చెప్పబడుచున్నది.

(2) విమల లక్షణము.—"వర్తులః కోణసంయుక్తః స్నిగ్ధశ్చ ఫలకాన్వితః॥" ఆ-ప్ర.—విమలమనునది గుండ్ర ముగను, కోణములు గలదిగను, పలకలు తేరినదిగను, స్నిగ్ధ ముగను నుండును. ఇచ్చట కోణములు గలది యనుటచే "షట్కోణః" అను రసప్రకాశ సుధాకరకారుని వచన మునుబట్టి యారు కోణములుగలిగి యుండును అని తెలియు చున్నది.

(3) మాక్షిక - విమలములకు గల పారస్పరిక విభే దము.—మాక్షికమను ఖనిజము తపతీ తీరమున నుత్పన్న మగును. కోణములులేక యుండును. మిక్కిలి బరువుగా నుండును. విమలమను ఖనిజము తపతీనదికి సమీపమున నుండు పర్వతములలో నుత్పన్నమగును. కోణములుగలిగి యుండును. పలకలుదేరి గుండ్రముగ నుండును. కావున ద్రవ్యగ్రహణమునం దీ విభేదమును గుర్తించవలెను.

## విమలభస్మ విధానము

శ్లో॥ గంధ నింబుద్రవై ర్మర్ద్య్యః పుటితశ్చ మృతింవ్రజేత్॥

ర-ప్ర-సు.

శోధితవిమలచూర్ణమును ఖల్వమునందుంచి అందు శోధితగంధక చూర్ణమును నాల్గవభాగముండునట్లు గలిపి జంబీర రసముతో మర్దించి పుటము వేసిన యయ్యది భస్మమగును.

## విమలభస్మ గుణములు

శ్లో॥ వృష్యః పిత్తానిల హారోరసాయన వరః ఖలు॥

ర-ప్ర-సు.

విమలభస్మము సద్యశ్శుక్రమును గలిగించును. ఉత్తమమైన రసాయనము. వాతమును, పిత్తమును శమింపజేయును.

---

# మయూరతుత్థము

## మయూరతుత్థ నామములు *

శ్లో॥ తుత్థం వితున్నకంచాపి శిఖిగ్రీవం మయూరకం॥

ఆ-ప్ర.

---

* (1) తుత్థము తామ్రమున కుపధాతువు.—"తుత్థం తామ్రోపధాతుఃస్యా త్కించిత్తామ్రేణ తద్భవేత్। కించిత్తామ్రగుణం తస్మాద్వక్ష్యమాణ గుణంచతత్॥"ఆ-ప్ర.— తుత్థమను ద్రవ్యము కొద్దిగా తామ్రముతో గూడి యుత్పన్నమగును, అందుచే నయ్యది కొద్దిగా తామ్రమునకు జెప్పిన

తుత్థము, వితున్నకము, శిఖిగ్రీవము, మయూరకము అనునవి మయూరతుత్థనామములు.

---

గుణములనుగూడా గలిగియుండును. అందుచే నియ్యది తామ్రమున కుపధాతువుగా జెప్పబడుచున్నది. కేవల మియ్యది తామ్రగుణములను స్వల్పముగా గలిగియుండు టయే గాకుండ నిజగుణములను గూడా గలిగియుండునని యిట దెలియనగును.

(2) తుత్థలక్షణము.—"శిఖికంఠ సదృక్ఛాయం భారాఢ్యం తుత్థకం చయత్। గుణవత్తత్పరిజ్ఞేయం అన్యద్ధీన గుణంమతం॥" ఆ-ప్ర.—ప్రశస్తమైన తుత్థము నెమలి కంఠముతో సమమైన వర్ణమునుగలిగి మిక్కిలి బరువుగా నుండును. ఇందుకు విపరీతమైనట్టిది అగ్రాహ్యమని తెలియ వలెను. మైలుతుత్థము తామ్రమువలెనే విషసదృశమైనది. దీని సేవనవలన గూడా తామ్రమునకువలె వాంతి భ్రాం త్యాది వికారములు కలుగును. దీనికి బాహ్యప్రయోగ ములేగాని సాధారణముగా నాభ్యంతర ప్రయోగములు గానరావు. అందు విశేషముగా లేఖనార్థమై వ్రణాదులం దుపయోగింపబడుచున్నది. మరియు, నేత్రవ్యాధులలో విశేషప్రయోగములను గలిగియున్నది. దీనియందు సత్వ రూపమున తామ్రమున్నది. దానిని గ్రహించి, ముద్రికగా జేసి, యా ముద్రికను జలమునందు ముంచి, యాజలమును పానముజేసినచో విష వికారములు శమించునని శాస్త్రము నందు జెప్పబడినది.

## మయూరతుత్థ శోధనవిధానము

శ్లో॥ స్వేదితం మహిషాజాభ్యాం గవాంమూత్రైర్నరస్యవా।
డోలాయంత్రేణ యామాద్యా శుధ్యత్యేవహిసస్యకం॥
ర-ప్ర-సు.

డోలాయంత్రమున మయూరతుత్థము నమర్చి యందు మహిష మూత్రమునుగాని, మేకమూత్రమునుగాని, గోమూత్రమునుగాని బోసి రెండుజాములు పాకము జేసి, యెండబెట్టిన యయ్యది పరిశుద్ధమగును.

## మయూరతుత్థ గుణములు *

శ్లో॥ తుత్థంతు కటుకంక్షారం కషాయం వామకం లఘు।
లేఖనం భేదనంశీతం చక్షుష్యం కఫపిత్తహృత్॥
విషాప స్మారకండూఘ్నం॥ ఆ-ప్ర.

శుద్ధిజేసిన మయూరతుత్థము కటురసమును, కషాయానురసమును, క్షారగుణమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. వాంతి

---

* మయూరతుత్థమునకు భస్మవిధానము లేదు. అయినను కొన్ని గ్రంథములందు మారణము జెప్పబడినది. "గంధాశ్మ టంకణయుతం లకుచద్రావమర్దితం। అంధమూషాగతం ద్విత్రి కుక్కుటైర్భస్మతిమాప్నుయాత్॥" ఆ-ప్ర.—శోధిత తుత్థమును ఖల్వమునంనుంచి అందు నాల్గవభాగము గంధకమును, టంకణమును జేర్చి జంబీర స్వరసముతో మర్దించి చక్రికలుజేసి యెండించి శరావ సంపుటమునందు బంధించి రెండుమూడు కుక్కుట పుటములు వేసినచో భస్మయగును.

గలిగించును. లేఖనము జేయును. మలభేదనము జేయును. నేత్రములకు హితమైనది. కఫపిత్తములను శమింపజేయును. విషము, అపస్మారము, కండు వీటిని బోగొట్టును.

## మయూరతుత్థ యోగములు

### (1) భాస్కరాంజనము

శ్లో॥ నిర్దగ్ధం బాదరాంగారైః తుత్థం చేత్థం నిషేచితం।
క్రమాదజాపయఃసర్పిః క్షౌద్రే తస్మాత్ పలద్వయం॥
శార్ఙ్గికైః తాప్యమరిచ స్రోతోజ కటుకానతైః।
పటురోధ్ర శిలాపథ్యా కణైలాం జన ఫేనకైః॥
యుక్తంపలేన యష్ట్యాశ్చ మూషాంతర్ధ్మాత చూర్ణితం।
హన్తి కాచార్మనక్తాంధ్య రక్తరాజీః సుశీలితః॥
చూర్ణో విశేషాత్తిమిరం భాస్కరో భాస్కరోయథా॥
అ-హృ-ఉ-అ 13.

రేగుకట్టెల బొగ్గునిప్పులలో మయూరతుత్థమును గాల్చి క్రమముగా మేకపాలతోను, మేక నెయ్యితోను, తేనెతోను పలుమార్లు తడపవలెను. ఇటుల సిద్ధముజేయబడిన తుత్థము రెండుపలములు, శుద్ధిజేసిన స్వర్ణమాక్షికము ఒకతులము, శ్వేతమరిచము ఒకతులము, స్రోతోంజన మొకతులము, కటుకరోహిణి యొకతులము, గ్రంధితగర మొకతులము, సైంధవలవణ మొకతులము, లొద్దుగపట్ట యొకతులము, శోధితమణశిల యొకతులము, కరక్కాయ యొకతులము, పిప్పళ్లు ఒకతులము, ఏలకులు ఒకతులము, రసాంజన మొకతులము, సముద్రఫేన మొకతులము, మధుయష్టి యొకపలము ఇటుల గ్రహించి వీటినన్నిటిని మెత్తగా చూర్ణించి, యొక మూషయందు బంధించి కొలిమియందు నల్లని మసియగువరకు

గాల్చి తిరిగి మెత్తగా నూరవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది భాస్కరాంజన మనబడును. దీనిని నేత్రముల కంజనము వేసినచో కాచము, అర్మ, నక్తాంధ్యము, రక్తరాజి, తిమిరము అను నీ నేత్రరోగములు శమించును. విశేషముగ తిమిరరోగము శమించును.

## (2) శీతభంజన రసము

శ్లో॥ ద్వితుత్థం మరిచం సూత మల్లిపాషాణ నాగరం।
కారవల్లీ రసేమర్ద్యం కుక్కుటే పుటపాచితం॥
మత్స్యపిత్తే తతోభావ్యం గుంజామాత్రంప్రయత్నతః
శర్కరస్యానుపానేన దేయం శీతజ్వరం హరేత్।
రసః ప్రకటితః పూర్వం నామాయం శీతభంజనః॥

వై-చిం.

శుద్ధిజేయబడిన మైలతుత్థము, శుద్ధిజేయబడిన పాలతుత్థము, మిరియాలచూర్ణము, శుద్ధిజేయబడిన పాదరసము, శుద్ధిజేయబడిన యుల్లిపాషాణము, శుంఠీచూర్ణము వీటిని సమాంశములుగా గ్రహించి, ఖల్వమునందుంచి కాకరాకురసముతో మూడుదినములు మర్దించవలెను. పిమ్మట నొక గోళమును జేసి యెండించి శరావసంపుటమున బంధించి కుక్కుటపుటముచే పాకముజేయవలెను. స్వాంగశీతలమున నీయౌషధమునందుండి గ్రహించి యందు మత్స్యపిత్తమును జేర్చి చక్కగా నా రెండింటిని కలిపి యొకజాము మర్దించి గుంజాప్రమాణమున మాత్రలు జేయవలెను. ఇయ్యది శీతభంజనరసమని వ్యవహరింపబడును. దీనిని చక్కెరతో గలిపి సేవించినయెడల శీతజ్వరమును శమింపజేయును.

---

# కాంస్యము

## కాంస్య నామములు *

శ్లో॥ తామ్రజం త్రపుజం ఖ్యాతం కాంస్యం ఘోషంచ
కంసకం॥ ఆ-ప్ర.

---

* (1) కాంస్యోత్పత్తి.—"అష్టభాగేన తామ్రేణ ద్విభాగం కుటిలం యుతం। ఏకత్రద్రావితం తత్స్యాత్కాంస్యం సౌరాష్ట్రిజం శుభం॥" ఆ-ప్ర.—ఎనిమిదిభాగములు తామ్రము, రెండుభాగములు తగరము ఇటుల గ్రహించి, రెండింటిని కలిపి కరగించి పోసినచో కంచు అను లోహము సిద్ధమగును. ఇది సౌరాష్ట్రదేశమునందు సిద్ధముజేయబడినట్టిది ప్రశస్తమైనదిగా నెంచబడును.

(2) కాంస్యభేదములు.—"కాంస్యంతు ద్వివిధం ప్రోక్తం పుష్పతైలిక భేదతః। పుష్పం శ్వేతతమం తత్ర తైలికం కపిశప్రభం॥ ఏతయోః ప్రథమం శ్రేష్ఠం సంసేవ్యం రోగశాంతయే॥" ఆ-ప్ర.—ఈ కాంస్యమను లోహము పుష్పకాంస్యము, తైలికకాంస్యము అని రెండు విధములుగా సిద్ధముజేయబడుచున్నది. ఇందు రెండవరకము హీనమైనదనియు, మొదటిరకమే యౌషధములందు జేర్చుకొనదగియుండు ననియు దెలియవలెను.

(3) కాంస్యమున కుపధాతుత్వ నిరూపణము.—'ఉపధాతుర్భవేత్కాంస్యం ద్వయోస్తరణిరంగయోః"॥

తామ్రజము, త్రపుజము, కాంస్యము, ఘోషము, కంసకము అనునవి కాంస్యనామములు.

## కాంస్యశోధన విధానము

శ్లో॥ తప్తం కాంస్యం గవాంమూత్రే సప్తవారై ర్విశుద్ధ్యతి॥
ర-ప్ర-సు.

కంచు నెర్రగా గాల్చి గోమూత్రమున నేడుమారులు ముంచిన యయ్యది పరిశుద్ధమగును.

## కాంస్యభస్మ విధానము

శ్లో॥ హరితాళకగంధాభ్యాం మ్రియతే పంచభిః పుటైః॥
ర-ప్ర-సు,

---

ఆ-ప్ర.—కంచు తామ్ర వంగములనుండి తయారుజేయ బడినదగుటచే నా రెండు లోహములకు నుపధాతువుగా పరిగణింపబడు చున్నది.

(4) గ్రాహ్యకాంస్య లక్షణము.—"శ్వేతం దీప్తం మృదుజ్యోతిః శబ్దాఢ్యం స్నిగ్ధనిర్మలం। ఘనాగ్ని సహ శుభ్రాంగం కాంస్య ముత్తమమీరితం॥" ఆ-ప్ర.— తెల్లని వర్ణముగలిగి ప్రకాశవంతముగనున్నట్టియు, మృదువుగ నుండునట్టియు, తళతళలాడునట్టియు, అధికమైన శబ్దముగలిగినట్టియు, స్నిగ్ధముగను, నిర్మలముగను, దళసరిగను నుండునట్టియు, అగ్నిని సహించునట్టియు, పరిశుభ్రముగ నుండునట్టియు కంచును గ్రహించవలెను.

శుద్ధిజేసిన కాంస్యమును రజనుగా గోసి, అందు నాల్గవభాగ ముండునట్లు శుద్ధిజేసిన తాళకమును, గంధకమును జేర్చి జంబీరస్వరస ముతో మూడుదినములు మర్దించి చక్రికలుజేసి యెండించవలెను. పిమ్మట వాటిని శరావసంపుటమునందు బంధించి గజపుటమున పాకముజేయ వలెను. ఇటుల నైదుపుటములు వేసినచో నయ్యది భస్మమగును.

## కాంస్యభస్మ గుణములు

శ్లో॥ కాంస్యస్యతుగుణాః జ్ఞేయాః స్వయోని సదృశాఃబుధైః।
సంయోగజప్రభావేణ తస్యాఽన్యేఽపిగుణాఃస్మృతాః॥
కాంస్యం కషాయంతిక్తోష్ణం లేఖనం విశదంసరం।
గురు నేత్రహితం రూక్షం కఫపిత్తహరంపరం॥

ఆ-ప్ర.

కంచు తన యుత్పత్తికి కారణములైన ద్రవ్యముల (తామ్రవంగ ముల) యొక్క గుణములను గలిగియుండును. అయితే లోహద్వయ సంయోగ విశేషముచేగూడ మరికొన్ని గుణములుగూడా (ఈ చెప్ప బోవునవి) యిందు గలవని తెలియవలెను.

కాంస్యభస్మము కషాయరసమును, తిక్తానురసమును, విశదసర గురురూక్ష గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. లేఖనము. నేత్రములకు హితమైనది. కఫపిత్తములను శమింపజేయును.

---

# పిత్తళము

## పిత్తళ నామములు *

శ్లో॥ పిత్తళం త్వారకూటంస్యా దారో రీతిశ్చ కథ్యతే।
రాజరీతిర్బ్రహ్మరీతిః కపిలా పింగళాపిచ॥ ఆ-ప్ర.

---

* (1) పిత్తళ-ఉత్పత్తి.— "రీతిర ప్యుపధాతుః స్యాత్తామ్రస్య యశదస్యచ। పిత్తలస్య గుణాః జ్ఞేయాః స్వయోని సదృశాః బుధైః॥ సంయోగజ ప్రభావేణ తస్యాన్యేఽపి గుణాఃస్మృతాః॥" ఆ-ప్ర.—రాగి, సత్తు అను నీ రెండు లోహములయొక్క సమ్మేళనమువల్ల తయారైనట్టిది యిత్తడి యను లోహము. అందుచే నిది యీ రెండులోహములకును ఉపధాతువుగా నేర్పడుచున్నది. మరియు, పై కారణముచేతనే యియ్యది యీ రెండులోహములయొక్క గుణములను గలిగియుండును. లోహద్వయ సంయోగజ ప్రభావముచే మరికొన్ని యితరగుణములు గూడా యిం దుండునని తెలియనగును.

(2) పిత్తళభేదములు.—"రీతికా ద్వివిధా ప్రోక్తా తత్రాద్యా రాజరీతికా। కాకతుండీ ద్వితీయాస్యాత్తయో రాద్యా గుణాధికా॥ సంతప్తా కాంజికేక్షిప్తా తామ్రాస్యా ద్రాజరీతికా। కాకతుండీతు కృష్ణాస్యా న్నాసా సేవ్యా విజానతా॥" ఆ-ప్ర.—పిత్తళము రాజరీతిక, కాకతుండి యుని రెండువిధములుగ నుండును. అందు మొదటిది

పిత్తళము, ఆరకూటము, ఆరము, రీతి, రాజరీతి, బ్రహ్మరీతి, కపిల, పింగల యనునవి పిత్తళ నామములు.

---

ఉత్తమగుణములను గలిగియుండును. రాజరీతిక యను భేదము నిప్పులోగాల్చి కాంజికమున ముంచినప్పు డయ్యది తామ్రవర్ణమును బొందినచో రాజరీతికయనియు, కృష్ణ వర్ణమును బొందినచో నయ్యది కాకతుండియనియు గుర్తించ వలెను. ఈ రెండవది సేవించుట కనర్హమైనదిగా దెలియ వలెను.

(3) గ్రాహ్యపిత్తళ లక్షణము.— "శుద్ధాస్నిగ్ధా మృదుః శీతాసురంగా స్వర్ణరూపిణీ। హేమోపమాశుభా స్వచ్ఛా రాజరీతిః ప్రకీర్తితా॥" ఆ-ప్ర.— పరిశుద్ధముగను, మృదువుగను, స్నిగ్ధముగను, స్పృశించినప్పుడు మంచువలె మిక్కిలి శీతలముగను, స్వర్ణమువలె మంచి వర్ణము గలది గను నుండునట్టి రాజరీతిక నిర్దోషమై గ్రాహ్యముగ నుండును.

(4) హీనపిత్తళ లక్షణము.—"దుర్గంధా పూతిగంధాచ ఖరస్పర్శాచ పాండురా। ఘనఘాతాక్షమారూక్షా రీతిర్నేష్టా రసాయనే॥" ర-ప్ర-సు.— దుర్గంధముగలది గను, కుళ్లినవాసనగలదిగను, స్పృశించినప్పుడు కఠినముగ నుండునదిగను, తెల్లని వర్ణముగలదిగను, సాగగొట్టినప్పుడు విరుగునట్టి స్వభావముగలదిగను, గరగర లాడునదిగను నుండు పిత్తళము హీనమైనదై యగ్రాహ్యముగ నుండునని దెలియవలెను.

# పిత్తళము

## పిత్తళ నామములు *

శ్లో॥ పిత్తళం త్వారకూటంస్యా దారో రీతిశ్చ కథ్యతే।
రాజరీతిర్బ్రహ్మరీతిః కపిలా పింగళాపిచ॥ ఆ-ప్ర.

---

* (1) పిత్తళ-ఉత్పత్తి.— "రీతిర ప్యుపధాతుః స్యాత్తామ్రస్య యశదస్యచ। పిత్తలస్య గుణాః జ్ఞేయాః స్వయోని సదృశాః బుధైః॥ సంయోగజ ప్రభావేణ తస్యా న్యోఽపి గుణాఃస్మృతాః॥" ఆ-ప్ర.—రాగి, సత్తు అను నీ రెండు లోహములయొక్క సమ్మేళనమువల్ల తయారైనట్టిది యిత్తడి యను లోహము. అందుచే నిది యీరెండులోహములకును ఉపధాతువుగా నేర్పడుచున్నది. మరియు, పై కారణముచేతనే యియ్యది యీ రెండులోహములయొక్క గుణములను గలిగియుండును. లోహద్వయ సంయోగజ ప్రభావముచే మరికొన్ని యితరగుణములు గూడా యిం దుండునని తెలియనగును.

(2) పిత్తళభేదములు.—"రీతికా ద్వివిధా ప్రోక్తా తత్రాద్యా రాజరీతికా। కాకతుండీ ద్వితీయాస్యాత్తయో రాద్యా గుణాధికా॥ సంతప్తా కాంజికేక్షిప్తా తామ్రాస్యా ద్రాజరీతికా। కాకతుండీతు కృష్ణాస్యా న్నాసా సేవ్యా విజానతా॥" ఆ-ప్ర.—పిత్తళము రాజరీతిక, కాకతుండి యని రెండువిధములుగ నుండును. అందు మొదటిది

పిత్తళము, ఆరకూటము, ఆరము, రీతి, రాజరీతి, బ్రహ్మరీతి, కపిల, పింగల యనునవి పిత్తళనామములు.

---

ఉత్తమగుణములను గలిగియుండును. రాజరీతిక యను భేదము నిప్పులోగాల్చి కాంజికమున ముంచినప్పు డయ్యది తామ్రవర్ణమును బొందినచో రాజరీతికయనియు, కృష్ణ వర్ణమును బొందినచో నయ్యది కాకతుండియనియు గుర్తించవలెను. ఈ రెండవది సేవించుట కనర్హమైనదిగా దెలియవలెను.

(3) గ్రాహ్యపిత్తళ లక్షణము.— "శుద్ధాస్నిగ్ధా మృదుః శీతాసురంగా స్వర్ణరూపిణీ। హేమోపమాశుభాస్వచ్ఛా రాజరీతిః ప్రకీర్తితా॥" ఆ-ప్ర.— పరిశుద్ధముగను, మృదువుగను, స్నిగ్ధముగను, స్పృశించినప్పుడు మంచువలె మిక్కిలి శీతలముగను, స్వర్ణమువలె మంచి వర్ణము గలదిగను నుండునట్టి రాజరీతిక నిర్దోషమై గ్రాహ్యము గనుండును.

(4) హీనపిత్తళ లక్షణము.—"దుర్గంధా పూతిగంధాచ ఖరస్పర్శాచ పాండురా। ఘనఘాతాక్షమారూక్షా రీతిర్నేష్టా రసాయనే॥" ర-ప్ర-సు.— దుర్గంధముగలదిగను, కుళ్లినవాసనగలదిగను, స్పృశించినప్పుడు కఠినముగ నుండునదిగను, తెల్లని వర్ణముగలదిగను, సాగగొట్టినప్పుడు విరుగునట్టి స్వభావముగలదిగను, గరగర లాడునదిగను నుండు పిత్తళము హీనమైనదై యగ్రాహ్యముగ నుండునని దెలియవలెను.

## పిత్తళ శోధనవిధానము

శ్లో॥ తాపితాశ్చైవ నిర్గుండీ రసేక్షిప్తా ప్రయత్నతః।
పంచవారాన్ సమాయాతి శుద్ధిం రీతిస్తు తత్ క్షణాత్॥
ర-ప్ర-సు.

ఇత్తడి రేకులను గాల్చి యైదుమారులు వావిలాకురసమున ముంచి నచో నయ్యవి పరిశుద్ధములగును.

## పిత్తళభస్మ విధానము

శ్లో॥ శిలాగంధక సింధూత్థరసైశ్చాతి ప్రమర్దితైః।
రీతిపత్రాణి లేప్యాని పుటితా న్యష్టధా పునః॥
సద్యోభస్మత్వ మాయాతి తతో యోజ్యా రసాయనే॥
ర-ప్ర-సు.

ఇత్తడిరేకులకు నాల్గవభాగముండునట్లు శోధితమణిశిలను, శోధిత గంధకమును, సైంధవలవణమును గ్రహించి, ఖల్వమునందు వీటిని జంబీర రసముతో మర్దించి శోధిత పిత్తళ పత్రములకు లేపనముజేసి యెండించవలెను. పిమ్మట వాటిని శరావసంపుటమునందు బంధించి గజపుటమున పాకముజేయవలెను. ఇటుల నెనిమిది పుటములు వేసినచో రసౌషధములందు జేర్చుకొనుట కర్హమైన భస్మయగును.

## పిత్తళభస్మ గుణములు

శ్లో॥ రీతికాయుగళం రూక్షం తిక్తంచ లవణంరసే।
శోధనం పాండురోగఘ్నం క్రిమిఘ్నం నేత్రలేఖనం॥
ఆ-ప్ర.

రెండువిధములగు పిత్తళముల భస్మలును, తిక్తరసమును, లవణాను రసమును, రూక్షగుణమును గలిగియుండును. దోషమును శోధించును. కొద్దిగ లేఖనము జేయును. పాండురోగమును, క్రిమిరోగమును బోగొట్టును.

---

# భర్తలోహము

## భర్తలోహ నామములు *

శ్లో॥ పంచలోహం పంచరసం వర్తులం భర్త మిత్యపి॥
ఆ-ప్ర.

పంచలోహము, పంచరసము, వర్తులము, భర్తము అనునవి భర్త (లేక) వర్తలోహ నామములు.

---

* (1) వర్తలోహోత్పత్తి.—"కాంస్యంరీతి స్తథా తామ్రం నాగోవంగశ్చ పంచమః। ఏకత్ర ద్రావితై రేతైః పంచలోహం ప్రజాయతే॥" ఆ-ప్ర.— కంచు, ఇత్తడి, రాగి, సీసము, తగరము అను నీ యైదులోహములను ఒకచో కరిగిపోసిన యయ్యది భర్తలోహమని వ్యవహరింపబడును. ఇయ్యది పై కారణముచే నా యైదు లోహములకు నుపధాతువుగా నుండునని దెలియనగును.

(2) భర్తలోహోపయోగము.—"వ్యంజనం సూపమన్యచ్చ తద్భాండే సాధితం శుభం॥" ఆ-ప్ర.—ఈ జర్మని సిల్వరును పాత్రగా తయారుజేసి యందు కూరలను

## భర్తలోహశోధన విధానము

శ్లో॥ ఆదౌ తైలాదికే శోధ్యంపశ్చాత్తప్త్వాఽజ మూత్రకే।
నిషిక్తం శుద్ధిమాయాతి పంచలోహం న సంశయః॥

ఆ-ప్ర.

వర్తలోహము (జర్మని సిల్వరు) ను కరగించి తైలమునందు, తక్రమునందు, గోమూత్రమునందు, ఉలవకాంజికమునందు ప్రత్యేకముగ నేడుమారులు ఆవాపముజేసి, పిమ్మట నారేకును. గాల్చి మేకమూత్రమున నేడుమారులు ముంచినచో నయ్యది పరిశుద్ధమగును.

## భర్తలోహ భస్మవిధానము

శ్లో॥ అర్కక్షీరేణసంపిష్ట గంధతాళక లేపనాత్।
పంచకుంభి పుటైర్భర్తం మ్రియతే యోగవాహకం॥

ఆ-ప్ర.

---

పాకముజేసినను, పప్పు పదార్థములను పాకముజేసినను, ఇంకను ఆహారమునకు వలయు నితరపదార్థములను పాకము జేసినను అయ్యవి మిగుల ప్రశస్తములుగ నుండును. అయితే "క్షారేణామ్లేనచవినా" అను రసప్రకాశ సుధాకర వచనమునుబట్టి యీ పాత్రలందు క్షారమును (లేక) లవణమును జేర్చకూడదని తెలియుచున్నది. అనుభవమునందుగూడ నీ పాత్రలయం దుప్పును, పులుసును విశేషకాల మొంచినచో వాటికి బెజ్జములు పడి యుపయోగమున కనర్హములగుచుండుట సర్వజన విదితమే గదా!

భర్తలోహమునకు నాల్గవభాగముండునట్లు శోధితగంధక తాళకములను గ్రహించి జిల్లేడుపాలతో నూరి, యీ పిష్టమును శుద్ధిజేసిన భర్తలోహపత్రములకు లేపనముజేసి యెండించవలెను. పిమ్మట వాటిని శరావసంపుటమునందు బంధించి గజపుటమున పాకముజేయవలెను. ఇటుల నైదు గజపుటములచే పాకముజేసిన యడ్యాది భస్మయగును.

## భర్తలోహ భస్మగుణములు

శ్లో॥ శ్లేష్మపిత్తహరం చామ్లం రుచ్యం కృమిహరం తథా।
నేత్రరోగ ప్రశమనం గలరోగ నిబర్హణం॥ ర-ప్ర-సు.

భర్తలోహభస్మము ఆమ్లరసమును గలిగియుండును. రుచిని బుట్టించును. కఫపిత్తములను శమింపజేయును. కృమిరోగమును, నేత్రరోగములను, కంఠరోగములను బోగొట్టును.

# సిందూరము

## సిందూర నామములు *

శ్లో॥ సిందూరం రక్తరేణుశ్చ నాగగర్భంచ సీసకం॥
ఆ-ప్ర.

సిందూరము, రక్తరేణువు, నాగగర్భము, సీసకము అనునవి సిందూరనామములు.

---

* (1) సిందూరోత్పత్తి.—"మహాగిరౌ శిలా న్తస్థో రక్తవర్ణశ్చ్యుతోరసః। సూర్యాతపేన సంశుష్కో గిరి సిందూర సంజ్ఞకః॥" ర-ప్ర-సు.—పెద్దపెద్ద పర్వతములపై రాళ్లమధ్యనుండి యెర్రని వర్ణముగలిగి యొక విధమగు

## సిందూరశోధన విధానము

శ్లో॥ సిందూరం నింబుకద్రావైః పిష్ట్వా ఘుర్మ్నైవిశోషయేత్।
తత స్తండుల తోయేన తథాభూతం విశుధ్యతి॥
ఆ-ప్ర.

---

ద్రవము జారును. అయ్యది సూర్యతాపముచే శుష్కమై గిరి సిందూరమను నామమున వ్యవహరింపబడుచుండును.

(2) సిందూరమున కుపధాతుత్వ నిరూపణము.—"సీసోపధాతుస్సిందూరం గుణై స్తత్సీసవత్స్మృతం। సంయోగజ ప్రభావేణ తస్యాప్యన్యే గుణాఃస్మృతాః॥" ఆ-ప్ర.—గంగసిందూరము సీసమున కుపధాతువుగా నుండును, అందుచే దీని గుణములు సీసముయొక్క గుణములతో సమానముగ నుండును. మరియు, దీనిలోనుండు ఇతర ద్రవ్యముల సంయోగ విశేషమున మరికొన్ని గుణములు గూడ నిందుండునని దెలియవలెను.

(3) ప్రశస్త సిందూరలక్షణము.—"సురంగోఽగ్నిసహః స్నిగ్ధః సూక్ష్మః స్వచ్ఛో గురుర్మృదుః। సువర్ణాకరజః శుద్ధః సిందూరోమంగలప్రదః॥" ఆ-ప్ర.—మంచి వర్ణము గలిగినదియు, నిప్పుపై వేసిన చలించకుండునదియు, స్నిగ్ధముగ నుండునదియు, సూక్ష్మముగను, స్వచ్ఛముగను, బరువుగను, మృదువుగను నుండునదియు, బంగారుగనియం దుత్పన్నమైనదియు పరిశుద్ధమై ప్రశస్తమైనదిగ నుండును. ఇట్టి సిందూరము మంగళప్రదమైనదని దెలియనగును.

గిరిసిందూరమును జంబీరస్వరసముతో నూరి యెండలో బాగుగా నెండించవలెను. పిమ్మట బియ్యపు కడుగుతో నూరి పైవిధముగనే యెండించవలెను. ఇటుల జేసినచో నయ్యది పరిశుద్ధమగును.

## సిందూర గుణములు *

శ్లో॥ సిందూర ముష్ణం వీసర్పకుష్ఠ కండూం విషాపహాం।
భగ్నసంధాన జననం వ్రణశోధన రోపణం॥

ఆ-ప్ర.

గంగసిందూరము ఉష్ణవీర్యమును గలిగియుండును. విరిగిన యెముకలను సంధానము జేయును. వ్రణమును శోధించును. వ్రణమును మాన్పును. విసర్పము, కుష్ఠము, కండు, విషము వీటిని బోగొట్టును.

## సిందూర యోగములు

### (1) సిందూరాది విపరీత మల్లతైలము

శ్లో॥ సిందూర కుష్ఠవిష హింగురసోన చిత్ర బాణాంఘ్రి
లాంగలిక కల్కవిపక్వతైలం। ప్రాసాదమండన యుత

---

* సిందూరమునకు ప్రత్యేక ప్రయోగము లేదు.— "సిందూరస్య హి ప్రయోగోహి నదృష్టః కుత్రచిత్ పృథక్। తస్మాదుక్తస్థలే యోజ్య ముపదేశో గురోరితి॥" ఆ-ప్ర.— గంగసిందూరమునకు ప్రత్యేక ప్రయోగము అనగా నితర ద్రవ్యముల సంయోగము లేకుండ ప్రయోగించుట ఎచ్చటను గానరాదు. కావున చెప్పబడ్డ స్థలమునందు గురూపదేశము ననుసరించి యుపయోగించవలెను.

శ్చ సతుత్థఫేనః క్లిన్నవ్రణాప్రశమనే విపరీతమల్లః॥
ఖడ్గాభిఘాత గురుగండ మహోపదంశ నాడీవ్రణ వ్రణ
విచర్చిక కుష్ఠపామాః। ఏతాన్నిహన్తి విపరీతకమల్ల
నామ తైలం యథేష్టశయనాసనభోజనస్య॥ యో-ర.

గంగసిందూరము, చంగల్వకోష్ఠు, వత్సనాభి, ఇంగువ, వెల్లుల్లి, చిత్రమూలము, గోరింట వేళ్లు, పొత్తిదుంప, తాళకము, మైలతుత్థము, సముద్రఫేనము వీటిని సమభాగములుగ గ్రహించి మెత్తని కల్కము వలె నూరి, యీ ముద్దకు చతుర్గుణముండునట్లు తిలతైలమును గ్రహించి యందు పై కల్కమును, తైలమునకు చతుర్గుణముండునట్లు జలమును జేర్చి తైలపాకము జేయవలెను. ఇట్లుల సిద్ధము జేయబడినట్టిది సిందూరాది విపరీతమల్లతైలమని వ్యవహరింపబడును. దీనిని అభ్యంగము జేసినచో దుష్టవ్రణము, శస్త్రాభిఘాతవ్రణము, గలగండము, ఉపదంశము, నాడీ వ్రణము, విచర్చిక, కుష్ఠము, పామ మున్నగు వ్యాధులు శీఘ్రముగా శమించును. ఈ తైలముయొక్క ప్రయోగమునందు యథేష్టముగ ఆహార విహారములను సేవింపవచ్చును. అనగా వాటియందెట్టి నియమమును అనుసరింప నవసరములేదని భావము.

## (2) సూర్యపక్వసిందూరాద్య తైలము

శ్లో॥ సిందూర శంఖచూర్ణక హరితాళ మనశ్శిలాయవక్షారైః।
కాసీసకచ్ఛ సంభవ గంధాహ్వాయ సంయుతైస్తైలం॥
దినకరతప్తం పామావిచర్చికా దద్రుకుష్ఠకిటిభాదీన్।
నాశయతి లేపమాత్రాత్ భూయోభూయః కపాలకుష్ఠ
మపి॥ గ-ని.

గంగసిందూరము, శంఖచూర్ణము, తాళకము, మణిశిల, యవ క్షారము, అన్నభేది, సైంధవలవణము, గంధకము వీటిని సమభాగము

లుగ గ్రహించి మెత్తగా చూర్ణించి యీ మొత్తమునకు చతుర్గుణ ముండునట్లు తిలతైలమునుగాని, ఆవనూనెనుగాని యొక శరావమునందు బోసి, అందు పై చూర్ణమును గలిపి తీక్ష్ణమగు యెండలో నా పాత్ర నుంచవలెను. అందలి జలభాగమంతయును నిగిరిపోవువరకు నెండలో నటులనే యుంచవలెను. ఈ విధముగ సిద్ధముజేయబడినట్టిది సూర్యపక్వసిందూరాద్య తైలమని చెప్పబడును. దీనిని పలుమార్లు అభ్యంగముజేసిన పామ, విచర్చిక, దద్రుకుష్ఠము, కిటిభకుష్ఠము కపాలకుష్ఠము మున్నగునవి శమించును.

## (3) సిందూరాది లేపము

శ్లో॥ సిందూరైకం మధూచ్ఛిష్ట స్త్యేషుభాగాన్ ప్రకల్ప
యేత్। నారికేళోత్థ తైలస్య తథాపంచదశస్మృతాః
సర్వమేకీకృతం వహ్నౌ దర్వ్యాతమవ ఘట్టయేత్।
లేపస్సిద్ధోయ మాఖ్యాత స్సిందూరాది స్తురోపణః।
వ్రణేషు పూజితశ్చాయం దోషక్షత సముద్భవే॥
(అనుభూతము.)

గంగసిందూర మొకభాగము, మైన మైదు భాగములు, కొబ్బరినూనె పదియైదు భాగములు ఇటుల గ్రహించి, యొక పాత్రలో మైనమును కొబ్బరినూనెను వేసి దానిని యగ్నిపై నుంచగా కొంతకాలమునకు మైనము కరిగి కొబ్బరినూనెలో కలిసిపోవును. పిమ్మట గంగసిందూరము నందు వేసి యొక యినుపగరిటితో బాగుగా కలియబెట్టవలెను. చల్లబడిన పిమ్మట నిదియంతయూ వెన్నవలె ముద్దయగును. ఇది సిందూరాదిలేపమని చెప్పబడును. దోషజవ్రణములకును, సద్యోవ్రణములకును రోపణము జేయును.

# శిలాజతు

## శిలాజతు నామములు *

శ్లో॥ శిలాజ త్వద్రిజతు చ శైల నిర్యాస ఇత్యపి।
శైరేయ మశ్మజంచాపి గిరిజం శైలధాతుజం॥ ఆ-ప్ర.

---

* (1) శిలాజతు భేదములు.—"శిలాజతు ద్విధా ప్రోక్తం తత్రాద్యం గిరిసంభవం। ద్వితీయంస్యాత్ క్షార భూమ్యాం మృత్తికా జలయోగతః॥" ఆ-ప్ర.—"తత్రా ద్యం ద్వివిధం చైవ ససత్వం సత్వహీనకం। గుణాధికం తయోర్మధ్యే యత్పూర్వం సర్వదోషహృత్॥" ర-ప్ర-సు.—పర్వతములం దుత్పన్నమగునది, చవిటి భూమిలో మృత్తికాజల సంయోగమున నుత్పన్నమగునది యని శిలాజతు రెండువిధములుగా నుండును. అందు పర్వతము లందుత్పన్నమగునది ససత్వము, నిస్సత్వము అని తిరిగి రెండు విధములుగా నుండును. వీనిలో ససత్వమగు శిలాజతు త్రిదోషహరమై గుణాధిక్యతతోగూడి యుండును.

(2) శిలాజతూత్పత్తి విధానము —"నిదాఘేఘుర్మ సంతప్తా ధాతుసారం ధరాధరాః। నిర్యాస వత్ప్రముంచంతి తచ్ఛిలాజతు కీర్తితం॥ సౌవర్ణం రాజతం తామ్ర మాయ సంచ చతుర్విధం। శిలాజతు హివిజ్ఞేయం తత్తల్లక్షణ లక్షితం॥" ఆ-ప్ర.—గ్రీష్మర్తువునందు సువర్ణాది లోహము లుండు పర్వతములందలి రాళ్లమధ్యనుండి యాయా లోహ లక్షణములు గలిగి శిలానిర్యాసము బయటకు వచ్చును.

శిలాజతు, అద్రిజతు, శైలనిర్యాసము, గైరేయము, అశ్మజము, గిరిజము, శైలధాతుజము అనునవి శిలాజతు నామములు.

---

ఇదియే శిలాజతు వను నామమున వ్యవహరింపబడుచున్నది. ఇది స్వర్ణశిలాజతు, రౌప్యశిలాజతు, తామ్ర శిలాజతు, లోహ శిలాజతు అని నాలుగు విధములుగా నుండును. "త్రపస్వాదీనాంతు లోహానాం షణ్ణామన్యతమాన్వయం। జ్ఞేయం స్వగంధతశ్చాపి షడ్యోని ప్రథితం క్షితౌ॥ లోహా ద్భవతి తద్యస్మా చ్ఛిలాజతు జతుప్రభం। తస్యలోహస్య తద్వీర్యం రసంచాపి బిభర్తితత్॥ (సు-సం-చి. అ 13).— అని సుశ్రుతవచనమునుబట్టి వంగసీసము లుండు పర్వతము లందు గూడా శిలాజతు ఉత్పన్నమగుననియు, మొత్తము మీాద శిలాజతు ఆరు విధములుగానుండుననియు దెలియ గలదు. మరియు నీ శిలాజతువు లాయా లోహముల యొక్క రసవీర్యములనే గలిగియుండుననిగూడ పై వాక్య మునుబట్టి దెలియుచున్నది.

(3) వివిధ శిలాజతువుల లక్షణములు.—"సౌవ ర్ణంతు జపాపుష్పవర్ణం భవతి శైలజం।...రాజతం పాం డురం...। తామ్రం మయూరకంఠాభం...॥ లౌహం జటా యుపక్షాభం...॥ గోమూత్రగంధి యత్కృష్ణం స్నిగ్ధం మృదుతథాగురు। తిక్తం కషాయం శీతంచ సర్వశ్రేష్ఠంతదా యసం॥" ఆ-ప్ర.—బంగారముండు పర్వతమునుండి యుత్ప న్నమైనది మందార పువ్వు (ఎరుపువర్ణము) వర్ణమును గలిగి యుండును. వెండిగల పర్వతమునుండి యుత్పన్నమగు శిలాజతు తెల్లనివర్ణముగలిగియుండును. తామ్రము బుట్టు

## శిలాజతు శోధనవిధానము

శ్లో॥ ఉష్ణేఽథ కాలే రవితాపయుక్తే వ్యభ్రే నివాతే సమ భూమిభాగే। చత్వారిపాత్రా ణ్యసితాయసాని న్యస్యా

---

పర్వతమునుండి యుత్పన్నమగునది నెమలికంఠముతో సమమైన వర్ణమును గలిగియుండును. ఇనుముబుట్టు పర్వతమునుండి యుత్పన్నమగునది నల్లనివర్ణము గలిగియుండును. వీనిలో నీ కడపటిది గోమూత్ర గంధమును, తిక్తకషాయ రసములను, స్నిగ్ధమృదు గురు గుణములను, శీతవీర్యమును గలిగి యితర శిలాజతువులకంటె మిగుల శ్రేష్ఠమైనదిగా జెప్పబడుచున్నది.

(4) కర్పూర శిలాజతు లక్షణము.— "ద్వితీయం సోరకాఖ్యంస్యా చ్ఛ్వేతవర్ణం శిలాజతు। అగ్నిబాణోపయుక్తం తద్ధితం మూత్రామయేషు చ॥" ఆ-ప్ర.—కర్పూర సదృశం శ్వేతం కర్పూరాఖ్యం శిలాజతు॥" ర-ప్ర-సు.— రెండవ శిలాజతు భేదము సోరకమను పేరుతో వ్యవహరింపబడుచు తెల్లనివర్ణముతోఁగూడి యగ్నిబాణమును నిర్మించుటకుపయుక్తమై యుండును. వైద్యకమునందు మూత్రజవ్యాధులలో నుపయుక్తమైయుండును. ఈ శిలాజతు కర్పూరమువలె తెల్లగ నుండుటనుబట్టి కర్పూర శిలాజతువని వ్యవహరింపబడుచున్నది. దీనిని కొందరు గోదన్తతాళకమనియు, మరికొందరు శ్వేతగంధకమనియు జెప్పుదురు. కాల్చినప్పు డిందుండి గంధకగంధము వచ్చుట సర్వ విదితమే గదా!

తపే తత్రకృతావధానః॥ శిలాజతు శ్రేష్ఠ మవాప్య పాత్రే ప్రక్షిప్యతస్మా ద్ద్విగుణం చతోయం। ఉష్ణంతదర్థం క్వథితంచ దత్వా విశోధయే త్తన్మృదితంయథావత్॥ సువస్త్రపూతం ప్రవిధాయతత్తు సంస్థాపనీయం పునరేవతత్ర॥ తతస్తు యత్కృష్ణముపైతి చోర్ధ్వం సంతానికావద్ర విరశ్మితప్తం॥ పాత్రే త దన్యత్రతతో విదధ్యాత్తస్యాన్తరే కోష్ణజలం నిధాయ। తతశ్చ తస్మా దపరత్రపాత్రే తస్మాచ్చ పాత్రా దపరత్ర భూయః॥ పునస్తతోఽన్యత్ర నిధాయకృష్ణం యత్సంహృతం తత్పునరాహరేచ్చ। యదావిశుద్ధం జలమచ్ఛమూర్ధ్వం ప్రసన్నభావా న్మలమేత్యధస్తాత్॥ తదా త్యజేత్తత్సలిలం మలంచ శిలాజతుస్యా జ్జలశుద్ధమేవం। చతుర్థపాదా ద్గలితంహి సర్వం పరీక్షణం తస్య వదామి భూయః॥ ఆ-ప్ర.

గ్రీష్మకాలమునందు బాగుగా సూర్యతాపముచే తపింపబడిన భూమిపై నాలుగు ఇనుప కడాయిల నుంచవలెను. గోమూత్రశిలాజతును వేరొకపాత్రలో నుంచి అందుకు ద్విగుణముగా జలమును బోయవలెను. బాగుగా సల సల కాగిన నీళ్లను సగభాగము పోయవలెను. పిమ్మట నా శిలాజతును ఆ నీళ్ల సహాయమున చేతులతో బాగుగా రుద్ది యొక యినుప కడాయిలోనికి నీళ్లను గుడ్డతో వడియగట్టవలెను. కొంతకాలమటులనే యా పాత్ర నెండలో నుంచగా నందలి నీళ్లపైకి నల్లని ద్రవ్యము సూర్యతాపముచే పాలమీగడ తొరకవలె కన్పట్టును. అప్పుడీ నల్లని భాగమును రెండవ యినప కడాయిలోనికి జాగ్రత్తగా వంపి యందు తిరిగి గోరువెచ్చని జలమును బోయవలెను. పై విధముగానే చేతితో రుద్ది కొంచెముకాల మటులనే యుంచినచో తిరిగి పై విధము

గానే నీళ్ల పైకి నల్లని భాగము తేరును. దానిని తిరిగి మూడవ యినుప కడాయిలోనికి జాగ్రత్తగా వంపి యందు గోరువెచ్చని నీళ్లను బోసి చేతితో గిలగొట్టి కొంచెముకాల ముంచినచో తిరిగి పై విధముగనే నీళ్లపైకి నల్లని పదార్థము తేరును. దీనిని నాల్గవ యినుప కడాయి లోనికి వంపి యందు తిరిగి గోరువెచ్చని నీళ్లను బోసి పై విధముగా జేసియుంచినచో కొంతకాలమునకు నీటిపైకి నల్లని పదార్థము తేరును. ఇటుల నాల్గవసారి తేరినట్టిది శుద్ధమైన శిలాజతువుగా దెలిసికొని జాగ్రత్తగా వేరొక పాత్రలోనికి గ్రహించి భద్రపరచవలెను. ఇటుల జేయబడినట్టిది జలశుద్ధ శిలాజతువని తెలియవలెను.

## శిలాజతు భావనావిధానము

శ్లో॥ త్రిఫలావారిగోదుగ్ధ మూత్రైర్భావ్యం శిలాజతు।
స్వల్పంస్వల్పం విధానేన స్థాపయే త్కాచపాత్రకే॥

ఆ-ప్ర.

పైవిధముగ జలశోధితమైన శిలాజతును లక్షణపరీక్ష * గావించి యది నిర్దుష్టమైనచో అట్టిదానిని మూతి వెడల్పుగానుండు ఒక గాజు పాత్రలోనుంచి కొంచెముగా త్రిఫలాకషాయమునుబోసి యెండలో నా పాత్రనుంచవలెను. అందలి ద్రవమింకిపోయినప్పుడు తిరిగి కొంచెముగా త్రిఫలాకషాయమునుబోసి పైవిధముగనే యుంచవలెను. ఇటుల త్రిఫలా కషాయముతోను, ఆవు పాలతోను, ఆవు పంచితముతోను పలు మార్లు భావనజేయవలెను.

---

* శిలాజతు లక్షణము.— "వహ్నౌక్షిప్తంతు నిర్ధూమం పక్వా లింగోపమం భవేత్। తృణాగ్రేణాం భసి క్షిప్త మధోగలతి తన్తువత్॥ గోమూత్ర గంధియచ్ఛుద్ధం తజ్జ్ఞేయంహి శిలాజతు॥" ఆ-ప్ర.— అగ్నియందునుంచి

## శిలాజతు గుణములు *

శ్లో॥ శిలాహ్వాం కటుతిక్తోష్ణం కటుపాకం రసాయనం।
ఛేది యోగావహం హన్తి కఫమేహాశ్మ శర్కరాః॥
మూత్రకృచ్ఛ్రం క్షయం శ్వాసం వాతాస్రార్శాంసి
పాండుతాం। అపస్మారం తథోన్మాదం శోథకుష్ఠోదర
కృమీన్॥    ఆ-ప్ర.

గోమూత్ర శిలాజతుయథావతుగ శుద్ధిజేయబడినట్టిదియు భావన జేయబడినట్టిదియు కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. మిగుల రసాయనము. దోషములను ఛేదించును. యోగవాహి. కఫమును శమింపజేయును. ప్రమేహము, అశ్మరి, శర్కర, మూత్రకృచ్ఛ్రము, శ్వాస, వాతరక్తము, అర్శస్సు, పాండువు, అపస్మా

---

నప్పుడు పొగలేకుండ లింగాకృతిని పైకి యుబుకునట్టియు, తృణాగ్రమున కొద్దిగ దీసి జలమునందుంచినచో తంతువువలె నధోభాగమునకు జారునట్టిదియు, గోమూత్రమువంటి గంధము గలిగినట్టిదియు పరిశుద్ధమైన శిలాజతుగా దెలిసి గ్రహింపవలెను.

* అశోధిత శిలాజతుజ వికారములు.—"అశుద్ధం దాహ మూర్ఛాయ భ్రమ పిత్తాస్ర శోషకృత్। శిలాజతు ప్రకురుతే మాంద్య మగ్నేశ్చ విడ్గ్రహం॥" ఆ-ప్ర.—శుద్ధి జేయని శిలాజతును సేవించినచో దాహము, మూర్ఛ, భ్రమ, రక్తపిత్తము, శోష, అగ్నిమాంద్యము, మలబంధము అను నీ వికారములు జనించును. కావున యథోక్త విధానమున దీనిని పరిశోధించి సేవింపవలెను.

క్షయము, ఉన్మాదము, శోథ, కుష్ఠము, ఉదరము, కృమి అను నీవ్యాధు లను బోగొట్టును.

శిలాజతు ప్రయోగవిధానము *

శ్లో॥ మాత్రయాశిలయే త్పశ్చాత్ స్నిగ్ధశుద్ధోయథావిధి।
ఏక త్రిస ప్త సప్తాహం కర్ష మర్ధపలం పలం॥
హీనమధ్యో త్తమో యోగః శిలాజస్య క్రమాన్మతః।
క్షీరే ణాలోడితం కుర్యా చ్ఛీఘ్రం రాసాయనం ఫలం॥
హన్యాద్రోగా నశేషాంశ్చ జీర్ణేహిత మితాశనః।
నసోఽ స్తిరోగో భువిసాధ్యరూపో జత్వశ్మజంయం నజ యేత్ప్రసహ్య। తత్కాలయోగై ర్విధివత్ప్రయు క్తం స్వస్థస్య చోర్జాం విపులాం దధాతి॥ సర్వానుపానైః సర్వేషు రోగేషు వినియోజితం। జయత్యభ్యాసతో నూనం తాంస్తాన్ రోగా న్నసంశయః॥ అ-హ్ర.

---

* శిలాజతు సేవనయందు అపథ్యము—పథ్యము:—
"వ్యాయామ మాతప మారుత చేతస్సంతాప గురువిదా హ్యాది। ఉపయోగాదపి పరతో ద్విగుణం పరివర్జయే త్కాలం॥ కులుత్థాన్ కాకమాచీంచ కపోతాంశ్చ సదా త్యజేత్। పిబే న్మాహేంద్రముదకం కౌపం ప్రాస్రవణాం బువా॥" అ-హ్ర.—గోమూత్ర శిలాజతును సేవించు కాల మునను, పిమ్మట ద్విగుణిత కాలమునను వ్యాయామము, ఆ తపసేవ, మారుతసేవ, మనస్సునకు సంతాపము గలిగించు నవి, గురుగుణముగలవి, విదాహికరములు, ఉలవలు, కామంచికూర, పావురపుపిట్ట మాంసము వీటిని విడిచిపెట్ట

యథోక్తవిధానమున శోధనభావనలు జేయబడిన గోమూత్ర శిలాజతును స్నేహాశోధన కర్మలను జేసికొని, యథోక్త పరిమితి ననుసరించి అనగా ఒక తులము పరిమితిగల శిలాజతునుగాని, రెండు తులముల పరిమితిగల శిలాజతునుగాని, నాలుగు తులముల పరిమితిగల శిలాజతునుగాని * పాలలోగలిపి, యేడుదినములు, లేక, యిరువదియొక దినములు, లేక, నలభైతొమ్మిది దినములు సేవించవలెను. అనగా- ఉక్తకాలమున నా పరిమితిని ముగించవలెనని దెలియవలెను. ప్రతి దినమునను అయ్యది జీర్ణమైన పిమ్మట హితమైన యాహారమును మితముగా భుజించుచుండవలెను. ఇందువలన మిగుల రసాయన గుణమేర్పడును. అనగా జరాత్వము నశించును. మరియు, అనుపానభేదములతో దీనిని సేవించిన సమస్తమైన వ్యాధులును శమించును. మరియు శరీరమునందు మిగుల బలము వృద్ధియగును ‡

---

వలెను. పర్వతములపైనుండు జలమునుగాని, పర్వతముల నుండి ధారగా క్రిందకుజారు జలమునుగాని, కూపోదకమును గాని పానముజేయవలెను.

* ఇచ్చట చెప్పబడిన శిలాజతుయొక్క పరిమితులు అనగా - ఒకతులము, రెండు తులములు, నాలుగు తులములు అనునట్టివి హీన - మధ్య - ఉత్తమ మాత్రలుగా దెలియవలెను. రోగియొక్క శరీర ప్రకృత్యాదుల ననుసరించి హీనమాత్రనుగాని, మధ్యను మాత్రనుగాని, ఉత్తమ మాత్రనుగాని నిర్దిష్టమైన కాలములో సేవించదగును.

‡ రసోప రసాదులలో శిలాజతునకు మిగుల రసాయనత్వ నిరూపణము.—"రసోపరససూతేంద్ర రత్నలోహేషు యేగుణాః। వికంతితే శిలాధాతౌ జరామృత్యు జిగీషయా॥"

## కర్పూర శిలాజతు శోధనవిధానము *

శ్లో॥ ఏలాతోయేన సంస్విన్నం శుష్కం శుద్ధిముపైతి తత్॥
ఆ-ప్ర.

కర్పూర శిలాజతురాళ్లను గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమున నమర్చి యందు ఏలకులకషాయమును బోసి మృద్వగ్నితో మూడుజాములు స్వేదనము జేసి యెండించినచో నయ్యది పరిశుద్ధమగును.

---

ఆ-ప్ర.—శిలాజతువునందు రసోపరస సూతరత్న లోహములయొక్క గుణములన్నియు నుండుటంబట్టి ఖనిజద్రవ్యములలో నిది మిగుల రసాయనశక్తి గలిగియుండును.

* స్వానుభూత సాంప్రదాయమున కర్పూర శిలాజతువుకు శోధన - మారణ విధానములు.—"నైతస్యమారణం సత్వ పాతనం విహితం బుధైః" ఆ-ప్ర.—రసశాస్త్రమునం దెచ్చటను కర్పూరశిలాజతు అను ద్రవ్యమునకు భస్మ విధానముగాని, సత్వపాతన విధానముగాని చెప్పబడలేదు. అయినను వైద్యకసాంప్రదాయమున నీ ద్రవ్యమునకు భస్మత్వము పొందించి యుపయోగించుట కలదు. అందు శోధనము—ఒక శరావమున కర్పూర శిలాజతురాళ్లనుంచి యవి మునుగునంత పరిమితిని బియ్యపు కడుగునుబోసి యొకరాత్రి యూరబెట్టవలెను. మరునాడు శుద్ధోదకముతో వాటిని బాగుగా కడిగి యెండబెట్టవలెను. భస్మ విధానము.—పై విధముగా శోధితమైన శిలాజతురాళ్లను శరావమునందుంచి యవి మునుగునంత పరిమితిని కలబంద స్వరసమునుబోసి వేరొక శరావముచే గప్పి సంధి

## కర్పూర శిలాజతు గుణములు

శ్లో॥ పాండురం సికతాకారం కర్పూరాభం శిలాజతు।
మూత్రకృచ్ఛ్రాశ్మరీమేహ కామలా పాండునాశనం॥
ఆ-ప్ర.

యథోక్త విధానమున శుద్ధిజేసిన కర్పూరశిలాజతు మూత్రకచ్ఛ్రము, అశ్మరిని, ప్రమేహమును, కామిలను, పాండురోగమునుబోగొట్టును.

---

లేపముజేసి యేబది పిడకలతో పుటమువేయవలెను; స్వాంగ శీతలమున తీసిచూచిన మిక్కిలి తెల్లనివర్ణముగలిగి మృదువుగా విడిపోయి యున్నట్లు గానవగును. దానిని మెత్తగా చూర్ణించి మూతివెడల్పుగల పాత్రలో వేసి యందు శుద్ధ జలమునుబోసి ద్రవప్రాయముగా కలియ గలుపవలెను. పిమ్మట వేరొక మూతి వెడల్పుగల పాత్రలోనికి యాద్రవమును వస్త్రగాళితము జేయవలెను. మొదటిపాత్రలో నింకను శిలాజతు పిష్టము శేషించినచో తిరిగి శుద్ధజలమునుబోసి పైవిధముగనే వస్త్రగాళితము జేయవలెను. ఇటుల జేయుట వలన నందిమిడియున్న వాలుకాది ద్రవ్యములను శిలాజతు నుండి వేరుపరచినట్లగును. మరియు నిర్దుష్టమైన శిలాజతు సిద్ధమగును. రెండవపాత్రను ఎండలోనుంచినచో నందలి శిలాజతు భాగము క్రిందకు దిగిపోవును. జలము పైకి తేరును. క్రమముగా నాజలమునంతను పైకివంచి యటులనే యుంచినచో శిలాజతు ఎండిపోవును. దానిని తిరిగి కలబంద రసముచే నూరి, చక్రికలుజేసి యెండించి పైవిధముగా పుటమువేసినచో స్వచ్ఛమైన భస్మ సిద్ధమగును.

## శిలాజతు యోగములు

### (1) శిలాజత్వాదివటి

శ్లో॥ శిలాజ త్వభ్ర హేమాని లోహం గుగ్గులు టంకణం।
కేశరాజస్య తోయేన మర్దయే ద్దివసద్వాయం॥
వల్లమానాం వటీంకృత్వా శైవాల సలిలేనచ।
ప్రాతః ప్రాతః ప్రయుంజీత శుక్రమేహ నివృత్తయే॥
భై-ర.

శుద్ధిజేయబడిన గోమూత్ర శిలాజతు, అభ్రకభస్మ, స్వర్ణభస్మ, లోహభస్మ, శోధితగుగ్గులు, శోధితటంకణము వీటిని సమభాగములుగ గ్రహించి, ఖల్వమునందుంచి గుంటకలగరాకు రసముతో రెండుదినములు చక్కగా మర్దించి వల్లప్రమాణమున (రెండుగుంజల పరిమితిని) మాత్రలు జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది శిలాజత్వాదివటి యని వ్యవహరింప బడును. వీటిని ప్రతియుదయమునను ఒక రాత్రి నాచుతో నూరబెట్టిన జలముతో సేవించిన శుక్రమేహము శమించును.

### (2) చంద్రప్రభావటి

శ్లో॥ చంద్రప్రభావచా ముస్తా భూనింబ సురదారవః।
హరిద్రాతివిషా దార్వీ పిప్పలీమూల చిత్రకం॥
త్రివృద్దన్తీ పత్రకంచ త్వగేలావంశ లోచనా।
ప్రత్యేకం కర్షమాత్రాణి కుర్యాదేతాని బుద్ధిమాన్॥
ధాన్యకం త్రిఫలాచవ్యం విడంగం గజపిప్పలీ।
సువర్ణమాక్షికం వ్యోషం ద్వౌక్షారౌ లవణత్రయం॥
ఏతాని కర్షమాత్రాణి సంగృహ్ణీయాత్ పృథక్ పృథక్।

ద్వికర్షం హతలోహంస్యా చ్చతుష్కర్షాసితాభవేత్।
శిలాజత్వష్టకర్షంస్యా దష్టౌకర్షాశ్చ గుగ్గులోః।
విధినా యోజితైరేతైః కర్తవ్యా గుటికా శుభా॥
చంద్రప్రభేతి విఖ్యాతా సర్వరోగ ప్రణాశినీ।
నిహన్తి వింశతిం మేహాన్ కృచ్ఛ్రిమష్టవిధం తథా॥
చతస్ర శ్చాశ్మరీ స్తద్వ న్మూత్రాఘాతాస్త్రయోదశ।
అండవృద్ధిం పాండురోగం కామలాంచ హలీమకం॥
కాసంశ్వాసం తథాకుష్ఠ మగ్నిమాంద్య మరోచకం।
వాతపిత్త కఫవ్యాధీన్ బల్యావృష్యా రసాయనీ॥
సమారాధ్య శివంతస్మాత్ ప్రయత్నా ద్గుటికామిమాం।
ప్రాప్తవాం శ్చంద్రమాయస్మాత్ తస్మాచ్చంద్ర ప్రభా
స్మృతా॥ భై-ర.

బావంచాలు, వస, తుంగముస్తలు, నేలవేము, దేవదారు, పసుపు, అతివస, మ్రానుపసుపు, నోడీ, చిత్రమూలము, తెగడ, దన్తీమూలము, పత్రము, లవంగపట్ట, ఏలకులు, వెదురుప్పు వీటిని ప్రత్యేకముగ నొక్కొక్క తులము చొప్పునను, ధనియాలు, త్రిఫలములు, చవ్యము, వాయువిడంగాలు, గజపిప్పలి, స్వర్ణమాక్షికభస్మ. త్రికటుకములు, సర్జక్షారము, యవక్షారము, బిడాలవణము, సైంధవలవణము, సౌవర్చలవణము వీటిని ప్రత్యేకముగా నొక్కొక్క తులము చొప్పునను గ్రహించవలెను. వీటి నన్నిటిని మృదువుగా చూర్ణించి ఖల్వమునందుంచవలెను. అందు లోహభస్మ రెండు తులములు, చక్కెర నాలుగు తులములు, శోధిత భావిత గోమూత్ర శిలాజతు ఎనిమిది తులములు, శోధిత గుగ్గులు ఎనిమిది తులములు ఇటుల జేర్చి త్రిఫలాకషాయముతోను, నేరేడు గింజల కషాయముతోను చక్కగా మూడు మూడు

దినములు మర్దించి రెండు యవల పరిమితిని మాత్రలుజేసి యుంచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది చంద్రప్రభావటి యని వ్యవహరింపబడును. దీనిని విధిప్రకారము సేవించినచో నిరువది విధములగు ప్రమేహము లును, సమస్త మూత్రకృచ్ఛ్రములును, సమస్త అశ్మరులును, సమస్త మూత్రాఘాతములును, అండవృద్ధి, పాండువు, కామిల, హలీమకము, కాసము, శ్వాస, కుష్ఠము, అగ్నిమాంద్యము, అరుచి, వాతపిత్తకఫ వికారములును శమించును. మరియు, బలము వృద్ధియగును. వెంటనే శుక్రధాతువు వృద్ధియగును. రసాయనము.

---

## పరిశిష్ట - ఉపధాతువులు

# చపలము

### చపలనామములు *

శ్లో॥ వంగవద్ద్రవతే వహ్నౌ చపలస్తేన కీర్తితః॥ ఆ-ప్ర.

చపలమను ఉపధాతువు వంగమువలె అగ్నిసంయోగమున ద్రవించును గాన యయ్యది చపల నామముతో వ్యవహరింప బడుచున్నది.

---

* (1) చపలభేదములు.—"చత్వార శ్చపలాః సితాసిత హరిచ్ఛోణ ప్రభేదైః పునః। మోఘౌ శోణిత శోణ కజ్జలనిభౌ లాక్షేవ దాశుద్రవాచ్ఛేషౌతు ద్రవతశ్చిరేణ సుభగౌతౌ... ॥" ర-ప —చపల మనునట్టిది తెలుపు, నలుపు, ఆకుపచ్చ, ఎరుపు అను వర్ణభేదముచే నాలుగు విధములుగా నుండును. అందు ఎర్రగనుండునట్టిదియు, నల్లగ నుండునట్టిదియు నగ్ని సంయోగముచే నతి శీఘ్రముగ

లక్కవలె ద్రవించు స్వభావముగల వగుటచే నయ్యవి హీనమైనవిగా దెలియనగును. మిగిలినవి యగ్నిసంయోగమున దీర్ఘకాలమునకు ద్రవించునవియై మంచి గుణములను గలిగి యుండునుగాన యియ్యవి శ్రేష్ఠములైనవిగా దెలియవలెను.

(2) చపల లక్షణము.—"చపల స్ఫటికచ్ఛాయః షట్కోణా స్నిగ్ధకో గురుః॥" ఆ-ప్ర.—చపలమను రాయి స్ఫటికమువంటి కాంతిగలిగి యారు కోణములతో స్నిగ్ధముగను, బరువుగను నుండిన యయ్యది శ్రేష్ఠమైనదిగ గుర్తింపదగియుండును.

(3) చపలముయొక్క ఉత్పత్తిస్థల నిరూపణము.—"మాక్షికభూమ్యుద్భవా॥" ఆ-ప్ర.— చపలపురాళ్లు స్వర్ణమాక్షికము జనించు భూమియందే అనగా తపతీ తీరపరిసర ప్రాంతమునందే యుద్భవించును. ఇది యిటుల సహజముగ ఖని సంభవమని దెలియుచున్నను ఇందులో కృత్రిమము గూడ నున్నట్లు దెలియగలదు. "త్రింశత్పలమితం నాగం భానుదుగ్ధేన మర్దితం। విమర్ద్య పుటయేత్తావద్యావత్కార్షావశేషితం॥ న తత్పుట సహస్రేణ క్షయమాయాతి సర్వథా। చపలోఽయం సమాఖ్యాతో వార్తికైర్నాగసంభవః॥ ఇత్థంహి చపలః కార్యః వంగస్యాపి నసంశయః।" పా-సం.—ముప్పదిపలముల సీసమును జిల్లేడుపాలతో జక్కగా మర్దించి చక్రికలుజేసి యెండించి యథోక్తవిధానమున పుటపాకము జేయవలెను. ఇటులనే యాసీసమొక తులము పరిమితివరకు తగ్గునట్లు జిల్లేడుపాలతో మర్దించుచు పుటములు

## చపల శోధన విధానము

శ్లో॥ కర్కోటక్యా ర్ద్రికజంభకస్య సలిలే సంస్వేదితో వా ప్లుతః॥ ర-ప.

గొడ్డుగాకరదుంప, అల్లము, జంబీరము వీనిరసములందు చపలపు రాళ్లను మూడుజాములు స్వేదనము జేసినను, లేక యారసములందు భావన జేసినను అయ్యది శుద్ధంబగును. ఇట స్వేదనముగాని, భావనగాని యేదుమార్లు జేయవలెనని తెలియనగును.

## చపలగుణములు

శ్లో॥ త్రిదోషఘ్నోఽతి వృష్యశ్చ రసబంధ విధాయకః॥ ఆ-ప్ర.

శుద్ధిజేయబడిన చపలము మిగుల వృష్యము. త్రిదోషములను శమింపజేయును. ఇది పారదమునకు బంధన సంస్కారమునకై మిగుల ఉపకరించును.

---

వేయుచు నుండవలెను. అది యొకతులము ప్రమాణము నకు వచ్చినపిమ్మట నిక వెయ్యిపుటములు వేసినను ఆ ప్రమాణమునుండి తగ్గకుండును. కావున అటుల నా ప్రమాణమునకు తగ్గువరకు పాకము జేయబడినట్టి నాగ మప్పుడు చపలమను పేరతో వ్యవహరింపబడును. ఇదేవిధముగ వంగమునుగూడ పాకముజేసిన యయ్యదిగూడ చపల మనియే జెప్పబడును. ఇటుల చపలము నాగవంగముల కుప ధాతువుగాను కృత్రిమముగను నుండునని తెలియవలెను. కొందరు చపలమును మహారస గణములలో పఠించి యున్నారు. అట్టిది సహజమైనదిగా దెలియగలదు.

# భూనాగము

## భూనాగనామములు *

శ్లో॥ భూనాగః క్షితినాగశ్చ భుజంగో రక్తజంతుకః।
క్షితిజః క్షితిజంతుశ్చ భూమిజో రక్తతుండకః॥

ఆ-ప్ర.

భూనాగము, క్షితినాగము, భుజంగము, రక్తజంతుకము, క్షితిజము, క్షితిజంతు, భూమిజము, రక్తతుండకము అనునవి భూనాగ నామములు.

---

* భూనాగ భేదములు.—"చతుర్విధాస్తు భూనాగాః స్వర్ణాది ఖనిసంభవాః। స్వర్ణభూమి భవాః పీతా రూప్య భూమి భవాః సితాః। తామ్రభూమి భవాస్తామ్రాః కృష్ణా లోహ మయీభవాః॥ రసేంద్ర ప్రాణరూపాస్తే భూనాగాః సిద్ధసంమతాః। స్వర్ణాదిభూమి సంభూతా దుర్లభాస్తే ప్రకీర్తితాః॥ తామ్రభూమిభవాః ప్రాయః సులభా గుణ వత్తరాః॥" ఆ-ప్ర.—వానపాములు వర్షాకాలమున వర్ష జలముచే క్లిన్నమైన భూగర్భమునుండి యుత్పన్నములగు క్రిమి విశేషములు. ఇవి స్వర్ణాది లోహములుండు భూముల నుండి యుత్పన్నములగుటచే నాలుగు లోహములకు సంబంధించినవిగా నుండును. అందుచే నియ్యవి నాలుగువిధము లని దెలియవలెను. అందు స్వర్ణభూమిజములు పసపు పచ్చగను, రూప్యభూమిజములు తెల్లగను, తామ్రభూమి జములు ఎఱ్ఱగను, లోహభూమిజములు నల్లగను నుండును.

## భూనాగ సత్వగుణములు *

శ్లో॥ భూనాగసత్వం శిశిరం సర్వకుష్ఠ వ్రణప్రణుత్ ।
తద్యుక్త జలపానేన స్థావరంచాపి జంగమం॥
విషం నశ్యతి, తత్పాత్ర గతఃసూతోఽగ్నితోదృఢం॥
ఆ-ప్ర.

---

ఇవి యన్నియు పాదరసమునకు శక్తినొసంగునవిగా నుండును. అయితే వీనిలో తామ్రభూమిజములు తప్ప మిగిలినవి దుర్లభములుగా నుండును. అందుచే తామ్రభూమిజములు సులభముగా లభ్యములగుచుండును. ఇవియే యన్నింటిలోను గుణవత్తరములుగా నుండును.

* భూనాగములనుండి సత్వమును ఆకర్షించు విధానము.—"తామ్రభూ భవ భూనాగా న్నిశా పిష్టాః సమేనతాః। గుడగుగ్గులు లాక్షోర్ణా మత్స్య పిణ్యాక టంకణైః। దృఢమేతైశ్చ సంయోజ్య మర్దయిత్వా ధమేత్సుఖం॥ ముంచంతి తామ్రవత్సత్వంతే...॥" ఆ-ప్ర.—తామ్రభూమియందుత్పన్నములైన భూనాగములను గ్రహించి వీనికి సమముగా పసపు చూర్ణమును జేర్చి ఖల్వమునందు తొలుత నా రెండింటిని మర్దించవలెను. పిమ్మట భూనాగములకు పదియారవ భాగముండునట్లు ప్రత్యేక ప్రత్యేకముగా బెల్లమును, గుగ్గిలమును, లక్కను, గొర్రె బొచ్చును, చిన్న చేపలను (నత్తలు), తెలకపిండిని, వెలిగారమును అందు చేర్చి బాగుగా కలియనూరి యా కల్కమునంత నొక గోళముగా జేసి దాని నొక

వానపాములనుండి గ్రహించిన సత్వము శీతవీర్యమును గలిగి యుండును. సమస్తమైన కుష్ఠములను, వ్రణములను శమింపజేయును. ఈ సత్వముతో జేయబడిన పాత్రయందు జలమును బోసియుంచి దానిని త్రాగుచుండినచో స్థావరజంగమ విషవికారములన్నియు శమించును. మరియు నట్టిపాత్రయందు పాదరసమునుబోసి యగ్నిపై నుంచినచో పారసమున కెట్టిచలనము నుండ నేరదు. అనగా పాదరసమున కట్టి పాత్రసంయోగమున నగ్నిసహానత్వ మేర్పడునని భావము.

---

మూసయందుంచి కొలిమిలో బలముగా నూదవలెను. అటుల నూదగా కొంతకాలమునకు ఔషధ కల్కమంతయు నగ్నితో సమానమైన వర్ణము గలది యగును. అప్పు డా మూసను పైకి దీసి శీతల జలమునందు మూసలోని ద్రవ్యము నావాపము జేయవలెను. పిమ్మట జలమునందలి ద్రవ్యమును చూర్ణరూపమున హస్తముతో విడదీసి వేరొక పాత్రలోనికి ఆ ద్రవ్యమంతయు పైకి పోవునట్లు క్షాళనము జేయవలెను. ఇటుల పలు తడవు లా ద్రవ్యమంతయు బోవునట్లు జలమును బోయుచు క్షాళనము జేయవలెను. పిమ్మట నా జలమున కడుగు భాగమున మిక్కిలి సూక్ష్మములైన రవ్వల రూపమున నుండు తామ్రమును గ్రహించవలెను. ఇటుల గ్రహింపబడి నట్టిదియే (తామ్రము) భూనాగసత్వ మనబడును. ఈ విధానము ననుసరించియే నేను పది యవల పరిమితి గల భూనాగ సత్వమును గ్రహించియున్నాను.

---

5-వ అధ్యాయము

# రత్న - ఉపరత్నములు

## రత్నములు *

శ్లో॥ వజ్రం విద్రుమ మౌక్తికే మరకతం వైడూర్య గోమేదకే,
మాణిక్యం హరినీలపుష్ప ద్రుషదౌ రత్నాని నామ్నా
నవ। యాన్యన్యాన్యపిస న్తికాని చిదిహ త్రైలోక్యసీమ్ని
స్ఫుటం, నామ్నాతా న్యుపరత్నతా న్యుపగతా
న్యాహుః పరీక్షా కృతః॥ ర-ప.

వజ్రము, విద్రుమము, మౌక్తికము, మరకతము, వైడూర్యము, గోమేదము, మాణిక్యము, ఇంద్రనీలము, పుష్పరాగము అనునవి తొమ్మిది మహారత్నములుగా వ్యవహరింపబడును. వీటికి భిన్నమైన రత్నజాతులన్నియు నుపరత్నములుగా రత్నపరీక్షకులచే గణింపబడుచున్నవి.

---

* (1) రత్నముల ప్రయోజనము.—"మణయోఽపి చ విజ్ఞేయాః సూత బంధస్య కారకాః। దేహస్య ధారకా నౄణాం జరావ్యాధి వినాశకాః॥" ఆ-ప్ర.—పాదరసముయొక్క బంధన సంస్కారమునకు మణులు మిక్కిలి ప్రయోజనవంతములుగా నుండును. మరియు, జరావ్యాధులను శమింపజేసి శరీర ధారణము జేయునవిగా నుండును.

(2) రత్నశబ్ద నిరుక్తి.—"ధనార్థినో జనాః సర్వే రమన్తేఽస్మిన్నతీవయత్। అతోరత్న మితి ప్రోక్తం శబ్ద శాస్త్ర విశారదైః॥" ఆ-ప్ర.—ధనార్థులగు జనులు దీనిని

## ఉపరత్నములు *

శ్లో॥ వైక్రాంతః సూర్యకాంతశ్చ చంద్రకాంత స్తథైవచ॥
రాజావర్త మణిశ్చాథ ఫేరోజాఖ్య స్తథాపరః॥
ఉపరత్నేషు గణితా మణయో లోకవిశ్రుతాః॥

ఆ-ప్ర.

---

మిక్కిలి ప్రేమించుదురు గాన శబ్ద శాస్త్ర విశారదులచే నియ్యది రత్నమని చెప్పబడుచున్నది.

(3) రత్నాభరణ ధారణ గుణము.—"ధన్యం మాంగల్య మాయుష్యం శ్రీమద్వ్యసన సూదనం। హర్షణం కామ్యమోజస్యం రత్నాభరణ ధారణం॥" రా-ని.—రత్నములను ధరించుటవలన బుణ్యము గలుగును. మంగళకరము. ఆయువు వృద్ధి యగును. లక్ష్మి గలుగును. దుఃఖములు నశించును. సంతోష మేర్పడును. కామ శక్తి కలుగును. ఓజో వృద్ధియగును.

(4) ఇందు వర్ణింపబడు రత్నోపరత్నములకు సామాన్య శుభాశుభ లక్షణములును, శుద్ధి భస్మ ప్రకారములును, గుణవిశేషములును మాత్రము వ్రాయబడును. మిగిలిన విశేషములు అనగా భేదములు, పరీక్షా విధానము మున్నగునవి తత్తద్గ్రంథములనుండి దెలిసికొనదగియుండును.

* విశేష సూచన.—ఈ యుపరత్నములలో పఠింపబడిన వైక్రాంతము కొందరిచే మహారసవర్గమున బేర్కొనబడినది. ఇట మే ముపరత్నములలో రత్నసదృశముగ నుండుటం బట్టి జేర్చియున్నాము. మరియు, రాజావర్త మను

వైక్రాంతము, సూర్యకాంతము, చంద్రకాంతము, రాజావర్తము, ఫేరోజమున్నగునవి యుపరత్నములుగా జెప్పబడును.

# వజ్రము

## వజ్రనామములు *

శ్లో॥ హీరకః పుంసి వజ్రోఽస్త్రీ చంద్రోమణివరశ్చసః॥

ఆ-ప్ర.

హీరకము, వజ్రము, చంద్ర, మణివర అనునవి వజ్ర నామములు.

---

నదిగూడ రత్నేతరవర్గమునందు గొందరిచే పఠింపబడినది. కొందరిచే నుపరత్న వర్గమునందు పఠింపబడినది. ఈ రెండింటికిని స్వరూపమునందు కొంచెము భేదము గాన్పించుచుండుటచే మేము దీనిని ఉపరసవర్గమునందును, ఉపరత్న వర్గమునందును గూడ జేర్చియున్నాము. ఈ యుపరత్నములలో ముక్తాశుక్తి, శంఖము, కర్పూర శిలాజతు, నీలపీతాది కాచములు మున్నగునవిగూడ పఠింపబడినవి. వీని వివరము లుపరస ప్రకరణమునందు వర్ణింపబడుటచే నిం దవి విడువబడినవని దెలియనగును.

* (1) గాహ్యవజ్రలక్షణము—"అచ్ఛత్వం లఘుతా తథాష్టఫలతా షట్కోణతా తీక్ష్ణతా। హ్యేతాః పంచ గుణాః గృణన్తి గుణినో దేవోప భోగ్యేపవా॥" ఆ-ప్ర.—మిక్కిలి స్వచ్ఛముగాను, తేలికగాను, ఎనిమిది పలకలు

## వజ్ర శోధన విధానము

శ్లో॥ వ్యాఘ్రీ కందగతం వజ్రం డోలాయంత్రేణ పాచయేత్।
సప్తాహం కోద్రవ క్వాథే కులిశం విమలం భవేత్॥

ఆ-ప్ర.

వాకుడు వేళ్లను మెత్తగానూరి యాకల్కముయొక్క మధ్యభాగమున వజ్రమునుంచి పిమ్మట దాని నొకగోళముగా జేసి గుడ్డలో మూటగట్టి దీనిని డోలాయంత్రమున యథోక్తవిధానమున వ్రేలాడగట్టి యందు కొర్రలకషాయమును బూరించి, యగ్నిపైనుంచి యేడుదినములు పాకము జేసిన యయ్యది పరిశుద్ధమగును.

---

గలదిగను, ఆరు కోణములు గలదిగను, తీక్ష్ణముగను (వాడిగను) నుండునట్టిది శ్రేష్ఠమైన వజ్రముగా గ్రహింపదగియుండును.

(2) నిషిద్ధ వజ్రలక్షణము—"భస్మాంకం కాకపాదం చ రేఖాక్రాంతంతువర్తులం। అధారం మలినం బిందు సంత్రాసి స్ఫుటితం తథా॥ నీలాభం చిపిటం రూక్షం తద్వజ్రం దోషలం త్యజేత్॥" ఆ-ప్ర.—భస్మతో సమమైన మచ్చలు గలిగినట్టియు, కాకి పాదమువంటి మచ్చలు గలిగినట్టియు, రేఖలతో గూడినట్టియు, గుండ్రముగ నుండునట్టియు, అంచులు లేనట్టియు, మలినముగ నుండునట్టియు, బిందువులతో గూడియున్నట్టియు, వంకరగ నుండునట్టియు, పగుళ్లతో గూడి యుండునట్టియు వజ్రమును త్యజించవలెను.

## వజ్రభస్మ విధానము *

శ్లో॥ త్రివర్షారూఢ కార్పాస మూలమాదాయ పేషయేత్।
త్రివర్ష నాగవల్ల్యా వా నిజద్రావైః ప్రపేషయేత్॥
తద్గోలకే క్షిపేద్వజ్రం రుద్ధ్వా గజపుటే పచేత్।
ఏవం సప్త పుటైర్యాతం కులిశం మృతిమాప్నుయాత్॥
ఆ-ప్ర.

మూడుసంవత్సరముల ప్రాయముగలిగిన ప్రత్తివేరునుగాని, మూడు వర్షముల ప్రాయము గలిగిన తమలపాకు తీగవేరునుగాని గ్రహించి మెత్తగా కల్కమువలె నిజద్రవములతో నూరి, యా కల్క మధ్యమున శోధితవజ్రమునుంచి దానికి చుట్టున మన్నుగుడ్డచే దళసరిగ గప్పి యెండించి గజపుటముచే పాకము జేయవలెను. ఈ విధముగ నేడుపుట పాకములు జేసినచో వజ్రము వారితరమగు భస్మమగును.

---

* రత్నములకు నిజస్వరూపమున భస్మ గావించుట యందు నిషేధము.—"సహాన్యా ద్ధీరకాదీని నవరత్నాని బుద్ధిమాన్। మహామూల్యాని తేషాం తువధే రౌరవమృచ్ఛతి॥ వజ్రాదీనాంతు సంస్కారే క్రియమాణే పతంతియే। గాత్రేభ్యః ఖండకాః స్వల్పాస్తాన్ హన్యాద్బుద్ధిమాన్ భిషక్॥ యద్వా తత్ ఖనిజాతాయే తజ్జాతీయాః సులక్షణాః। స్వల్ప మూల్యాస్తు తేషాం హివధే నాస్తీహ పాతకం॥"ఆ-ప్ర.— గొప్ప వెలగలిగినట్టివి గాన రత్నములను మారితములు గావింపగూడదు. అటుల జేసినచో మహాపాతకము సంభవించునని రత్నశాస్త్రవిదులు దెలిపియున్నారు. అయితే వాటిని సంస్కరించునప్పుడు వాటినుండి క్రిందకు రాలిన

## వజ్రభస్మ గుణములు *

శ్లో॥ ఆయుః పుష్టిం బలం వీర్యం వర్ణం సౌఖ్యం కరోతి చ।
సేవితం సర్వ రోగఘ్నం మృతం వజ్రం నసంశయః॥
ఆ-ప్ర.

యథోక్తవిధానమున శోధనమారణములు గావింపబడిన వజ్రము (భస్మ) ఆయువును వృద్ధిపరచును. ధాతుపుష్టిని జేయును. బలవీర్యములను గలిగించును. వర్ణమును సౌఖ్యమును గలిగించును. సమస్త వ్యాధులను శమింపజేయును.

---

చిన్న చిన్న రత్న ఖండములను సేకరించిగాని, రత్నము లుత్పన్నములగు భూములందు రెండవ రకముగా లభించిన వానినిగాని మారితములు గావింపవచ్చును. ఇటుల జేసినచో నెట్టి పాతకమును గలుగనేరదు. ఇందుచేతనే "రత్నముల చూరు" అని వ్యవహరింపబడునదియే శోధన మారణములకు గ్రహింపబడుచుండుట వైద్యక వ్యవహారమున గలదు.

* అశోధిత వజ్ర వికారములు.—"అశుద్ధం కురుతే వజ్రం కుష్ఠం పార్శ్వ వ్యథాం తథా। పాండుం తాపం గురుత్వం చ తస్మాత్సంశోధ్య మారయేత్॥" ఆ-ప్ర.— వజ్రమును యథోక్త విధానమున శోధింపక మారితము గావించి సేవించినచో కుష్ఠము, పార్శ్వశూల, పాండు, తాపము, గురుత్వము మున్నగు వికారములను గలిగించును. అందుచే దీనిని బాగుగా శోధించి భస్మ గావించి యుపయోగించవలెనని దెలియనగును.

# విద్రుమము

## విద్రుమ నామములు *

శ్లో॥ పుంసిక్లీబే ప్రవాలస్స్యాత్ పుమానేవతువిద్రుమః॥
ఆ-ప్ర.

ప్రవాళము, విద్రుమము అనునవి విద్రుమనామములు.

---

* (1) గ్రాహ్య విద్రుమ లక్షణము.—"పక్వబింబీ ఫల చ్ఛాయం వృత్తాయత మవక్రకం। స్నిగ్ధమవ్రణకం స్థూలం ప్రవాలం సప్తధా శుభం॥" ఆ-ప్ర.—బాగుగా పండిన దొండపండుతో సమమైన వర్ణము గలిగినట్టియు, గుండ్రముగను కొంచెము నిడివిగను నున్నట్టియు, వంకర లేకుండునట్టియు, నిగనిగలాడుచుండునట్టియు. మధ్య మధ్య మచ్చలు లేనట్టిదియు, లావుగ నుండునట్టిదియు విద్రుమము శోధన మారణములకు గ్రహింపదగియుండును.

(2) అగ్రాహ్యమగు విద్రుమ లక్షణము.—"ఆగార రంజనాక్రాంతం వక్రం సూక్ష్మం సకోటరం। రూక్షం కృష్ణం లఘు శ్వేతం ప్రవాళ మశుభం త్యజేత్॥" ఆ-ప్ర.—పొగ మూరినట్లుండునట్టియు, వంకరగ నుండునట్టియు, సూక్ష్మముగ (చిన్నదిగ) నుండునట్టియు, మధ్య మధ్య తొర్రలతో గూడి యుండునట్టియు, గరకుగా నుంతునట్టియు, నల్లగ నుండునట్టియు, తేలికగ నుండునట్టియు, తెల్లగా నుండునట్టియు విద్రుమము శోధన మారణములకు గ్రహింపతగనిది యని దెలియసగును.

## విద్రుమ శోధన విధానము

శ్లో॥ జంబీర నీరాంతరేణ భావితం యామ మాత్రకం।
ఉష్ణోదకే క్షాళయిత్వా శుద్ధం భవతి విద్రుమం॥

వై-చిం.

పగడమును జంబీరస్వరసమునందు ఒక జాము నూరబెట్టి వేడినీళ్లతో గడిగిన నయ్యది పరిశుద్ధమగును.

## విద్రుమ భస్మవిధానము *

శ్లో॥ తద్విద్రుమం రవి క్షీరై ర్భావితం దినసత్రయం।
ఏవం గజపుటే పాచ్యం భస్మీ భవతి తత్‌క్షణాత్॥

వై-చిం.

---

* స్వానుభూత సాంప్రదాయమున విద్రుమ భస్మ విధానము.—జంబీర స్వరసమునందు ఒక తులము పరిమితి గల పగడముల నొకదిన మూరబెట్టి వేడినీళ్లతో గడిగి యెండబెట్టవలెను. పిమ్మట వీటిని మెత్తగా చూర్ణించి కలుబందరసము జేర్చి మూడుదినములు చక్కగా మర్ధించి, చిన్న చిన్న చక్రికలు జేసి, యెండించి, శరావసంపుటమున బంధించి పది లేక పదిరెండు పిడకల మధ్య నుంచి పుటము వేయవలెను. స్వాంగశీతలమున ఆ యౌషధమును గ్రహించి తిరిగి వెనుకటివలెనే మర్దన పుటములను గావింపవలెను. ఇటుల మూడు పుటములు వేసినచో పగడము తెల్లని భస్మమగును.

పగడమును యథోక్తవిధానమున శుద్ధిజేసినపిమ్మట మెత్తగా చూర్ణించి జిల్లేడుపాలతో మూడుదినములు చక్కగా మర్దించి చక్రికలు జేసి శరావసంపుటమున బంధించి యొకగజపుటముచే పాకముజేసిన యయ్యది భస్మమగును.

## విద్రుమ భస్మగుణములు

శ్లో॥ క్షయపిత్తాస్రకాసఘ్నం దీపనం పాచనం లఘు।
విషభూతాది శమనం విద్రుమం నేత్రరోగహృత్॥
ఆ-ప్ర.

పగడపు భస్మ లఘుగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. క్షయమును, రక్తపిత్తమును, కాసమును, విషమును, భూతాదిగ్రహ వికారములను, నేత్రరోగములను శమింపజేయును.

## విద్రుమలత *

శ్లో॥ బాలార్క కిరణారక్తా సాగర సలిలోద్భవా లతా
యాఽస్తి। న త్యజతి నిజరుచిం నికషే ఘృష్టాఽపి
నాస్మృతా జాత్యా॥ ఆ-ప్ర.

---

*(1) పగడపు తీగె బజారులో విశేషముగా తక్కువ ధరకు లభించును. పై విద్రుమమునకు ప్రతినిధిగా నీ తీగెను గ్రహించి శోధన మారణములు గావించి యథోక్త వ్యాధులం దుపయోగించుట వైద్యక వ్యవహారమున గలదు. అందుచే నీలత రత్నవర్గమున పఠింపబడకున్నను ప్రసంగవశమున నిట జేర్చబడి, దీనికి అనుభూత సాంప్రదాయమున

ఉదయించుచున్న సూర్యునియొక్క కిరణములవలె మిక్కిలి యెఱ్ఱని వర్ణముగలిగి సముద్రజలమునం దుద్భవించునట్టి పగడపు లత పగడపు జాతిలోనే చేరియుండును. ఇది రాత్రిపై నరుగదీసినను నిజ వర్ణమును విడువకుండును.

---

శోధన మారణ విధానములు వ్రాయబడినవి. పగడపు భస్మ నేయే వ్యాధులం దుపయోగించుదురో యీ లత యొక్క భస్మముగూడ నాయావ్యాధులందే యుపయోగింప నగును.

(2) విద్రుమ లతకు శోధన మారణ విధానములు.— ఒకవీశె పరిమితిగల ప్రవాల లతను గ్రహించి యొక పాత్ర యందుంచి, అందది మునుగునంత పరిమితిగల జంబీర స్వరసమును బోసి యొక జాము ఊరబెట్టవలెను. పిమ్మట నుష్ణోదకముతో కడిగి యారబెట్టవలెను. బాగుగా నెండిన ప్రవాళమును శరావసంపుటమునందు బంధించి రెండు వందల పిడకలతో పుటము వేయవలెను. ఇటుల జేయుట వలన తెల్లని వర్ణమును, సున్నమువలె విడిపోవుటయు గలుగును. ఇట్టి ప్రవాళభస్మను ఖల్వమునందుంచి వాసా పత్ర స్వరసముతో మూడుదినములు మర్దించి )చిన్న చిన్న చక్రికలు జేసి యెండించి, శరావసంపుటమునందు బంధించి పై విధముగనే మూడు పుటములు వేసిన యయ్యది స్వచ్ఛమైన భస్మ యగును. దీనిని పై విధముగ నుపయోగించు కొనవలెను.

# మౌక్తికము

## మౌక్తికనామములు *

శ్లో॥ మౌక్తికం శౌక్తికం ముక్తా తథా ముక్తా ఫలం చ తత్ ॥
ఆ-ప్ర.

మౌక్తికము, శౌక్తికము, ముక్త, ముక్తాఫలము అనునవి మౌక్తిక నామములు.

---

* (1) మౌక్తికమున కుత్పత్తి భూమి వివరణము.— "యేఽష్టౌ మౌక్తిక భూమయః కరి కిరిత్వక్సారమత్స్యాంబు ముక్కంబూరోగతి శుక్తయోఽత్ర చరమోత్పన్నం పునశ్శ్రుతం॥" ఆ-ప్ర.—ఏనుగుయొక్క కుంభస్థలము, అడవి పంది శిరము, వెదురు, చేప, మేఘము, శంఖము, సర్పము యొక్క శిరము, ముత్యపు చిప్ప అను నీ యెనిమిది స్థలము లందు మౌక్తికము జనించును. వీనిలో ముత్యపుచిప్ప యందలి ముత్యము తప్ప మిగిలినవి లభ్యములు గానని దెలియవలెను. పైవాని లక్షణముల నాయా గ్రంథముల నుండి గ్రహించవలెను.

(2) గ్రాహ్య-అగ్రాహ్య మౌక్తిక లక్షణములు.— "హ్లాది శ్వేతం రశ్మిమన్నిర్మలం చ వృత్తం ఖ్యాతం మౌక్తికం తోయభాసం। స్నిగ్ధం తౌల్యే భారవద్యన్మహచ్ఛలింగైః శ్రేతైర్లక్షితం తచ్ఛశుద్ధం॥ రూక్షాంగం చేన్నిర్జలం శ్యావ తామ్రం చార్ధం శుభ్రం గ్రంథిలం మౌక్తికం చ। క్షారాభాసం వైకటం యుగ్మకం చ దోషైర్యుక్తం సర్వథా త్యాజ్య

## మౌక్తిక శోధన విధానము

శ్లో॥ మౌక్తికం శోధయే దమ్లైః కాంజికై ర్నింబుక ద్రవైః।
గోమూత్రే శోధయేత్పశ్చా చ్ఛోధయే త్పయసా తథా॥
వై-చిం.

యుక్తోక్తలక్షణముగల ముత్యములను గ్రహించి అమ్లవర్గ ద్రవము నందు మూడుదినములును, కాంజికమునందు మూడు దినములును, జంబీర స్వరసమున మూడుదినములును, గోమూత్రమునందు మూడుదినములును, పాలయందు మూడుదినములును భావనజేసి యుష్ణోదకముతో గడిగి యెండబెట్టిన యయ్యవి పరిశుద్ధములగును.

---

మేభిః॥'' ర-ప్ర.-మ.— మనోహరముగను, తెల్లగను, కిరణమువలె నిర్మలముగను, గుండ్రముగను, లోభాగమున జలమువలె ప్రకాశవంతముగను, స్నిగ్ధముగను, తూచిన బరువుగను, పెద్దదిగను నుండునట్టి ముత్యములు గ్రహింప దగినవిగా నుండును. గరగరలాడునదిగను, లోన జలము వంటి ప్రకాశము లేనిదిగను, శ్యావ వర్ణమును, తామ్రవర్ణ మును గలదిగను, సగభాగము తెల్లని వర్ణము కలదిగను, గ్రంథులు కలదిగను, క్షారముతో సమమైన కాంతి గలది గను, వంకరగను జంటగా గలసియుండునదిగను నుండు మౌక్తికమును గ్రహింపగూడదు.

(3) విశేష సూచన.—పైని జెప్పిన గ్రాహ్య మౌక్తిక లక్షణములు గల ముత్యములను శరీరముపై ధరించుటకే గ్రహించవలెను గాని శోధన మారణ కర్మలకు గాదని తెలియవలెను. అట్టి కర్మలకు ముత్యపు చూరని వ్యవహా

## మౌక్తికభస్మ విధానము *

శ్లో॥ శుద్ధ ముక్తా ఫలం శ్వేత బృహతీ ఫలజై ర్ద్రవైః।
భావితం భూపుటే † పాచ్యం భస్మ శుద్ధం భవిష్యతి॥
వై-చిం.

---

రింపబడునట్టి చిన్న చిన్న ముత్యములను ప్రశస్తమైనవాటిని గ్రహించదగును.

* అనుభూత సాంప్రదాయమున మౌక్తికభస్మ విధానము.—ప్రశస్తమైన ముత్యపు చూరును గ్రహించి ఖల్వమునందు మెత్తగా చూర్ణించి అందు కొద్దిగా పన్నీరును బోసి యొకదినము చక్కగా నూరి రెండవదిన మా ఖల్వమును ఒక యెత్తగు బల్లపై నుంచి అందు మన్ను ధూళి పడకుండునట్లు జాగ్రత్తగా నెండలో నుంచవలెను. ఆ మరునాడు పై విధముగనే మర్దించి తిరిగి యెండలో బెట్టవలెను. ఇటుల నిరువదియొక దినములు పన్నీరుతో మర్దించి. యిరువదియొకమారులు సూర్యపుటము వేసిన యయ్యది యుపయోగార్హమగు భస్మ యగును.

† భూధరపుట లక్షణము.—"వహ్నిమిత్రాంక్షితౌ సమ్యక్ నిఖన్యా ద్వ్యంగులాదధః। ఉపరిష్టా త్పుటం యత్ర పుటం తద్భూధరాహ్వయం॥" ర-ర-స.—మూసనుగాని, శరావసంపుటమునుగాని భూమిలో పాతి దానిపై రెండంగుళముల యెత్తున మన్నుండునట్లు మన్నుచే గప్పి దానిపై పిడకలను పరచి పుటము వేసిన యయ్యది భూధరపుటము లేక భూపుటము అని వ్యవహరింపబడును.

శుద్ధిజేయబడిన ముత్యములను మెత్తగా చూర్ణించి, ముళకకాయల రసముతో మూడుదినములు చక్కగా మర్దించి చిన్నచిన్న చక్రికలు జేసి యెండించి శరావసంపుటమున బంధించి భూధరపుటమున పాకము జేసిన స్వచ్ఛమైన భస్మయగును.

## మౌక్తికభస్మ గుణములు

శ్లో॥ కఫ పిత్త క్షయ ధ్వంసి కాస శ్వాసాగ్నిమాంద్యనుత్ ।
పుష్టిదం వృష్య మాయుష్యం దాహఘ్నం మౌక్తికం
మతం॥ ఆ-ప్ర.

మౌక్తికభస్మ ధాతువులను పోషించును. సద్యశ్శుక్రకరము. ఆయువును వృద్ధిబొందించును. కఫపిత్తములను శమింపజేయును. రాజయక్ష్మ, కాసము, శ్వాస, అగ్నిమాంద్యము, దాహము వీటిని పోగొట్టును.

---

# మరకతము

## మరకత నామములు *

శ్లో॥ గారుత్మతం మరకత మశ్మగర్భో హరిన్మణిః॥ ఆ-ప్ర.

గారుత్మతము, మరకతము, అశ్మగర్భము, హరిన్మణి యనునవి మరకత నామములు.

---

* గ్రాహ్య - అగ్రాహ్య మరకత లక్షణములు.—
"ఛార్త్స్యం స్నిగ్ధం భాసురం శష్పవర్ణం గాత్రే శుద్ధం భారవ ద్రశ్మియుక్తం। శ్లక్ష్ణం చైతే సప్తసంఖ్యా గుణాస్సైదానేశ స్తం

## మరకత శోధన విధానము

శ్లో॥ క్షిప్త్వా విదారి కందా న్తః పుటే త్కౌక్కుట సంజ్ఞకే।
పాచితం చాథ తం నీత్వా భవే న్మరకతం శుచి॥
వై-చిం.

యథోక్త లక్షణములు గల మరకతమణిని గ్రహించి, నేలగుమ్మడి గడ్డయొక్క లోభాగమున దాని నుంచి పైని మన్నుగుడ్డను దళసరిగా చుట్టబెట్టి, ఎండించి కుక్కుటపుటమున * పాకము జేసిన యయ్యది పరిశుద్ధమగును.

---

భక్షణే ధారణే చ॥ నీలం శ్వేతం కర్కశం శ్యావరూక్షం వక్రం కృష్ణం చిప్పిటం భారహీనం। దుష్టం తార్క్ష్యం చౌషధేనోపయోజ్యం॥'' ర-ప్ర-సు. —స్నిగ్ధముగను, ప్రకాశవంతముగను, పచ్చగరికెవంటి వర్ణము (ఆకుపచ్చని వర్ణము) గలదిగను, స్వచ్ఛముగను, బరువుగను, కిరణప్రసారము గలదిగను, నునుపుగను నుండునట్టి మరకతమణిదానమునకు, భక్షించుటకు, ధరించుటకును శ్రేష్ఠమైనదిగా నుండును. నీలవర్ణము గలదిగను, శ్వేతవర్ణము గలదిగను, కఠినముగను, శ్యావ వర్ణము గలదిగను, రూక్షముగను (గర గర లాడునదిగను), వంకరగను, నల్లని వర్ణము గలదిగను, మధ్య పల్లము గలదిగను, తేలికగను నుండునట్టి పచ్చను ఔషధార్థమై గ్రహింపగూడదు.

* కుక్కుటపుట లక్షణము.—ఈ పుటవిధానము రస ప్రకరణమునుండి దెలియవలెను.

## మరకత భస్మ విధానము

శ్లో॥ తతో మరకతం శుద్ధ్రా రసేన పరికల్పయేత్।
పాషాణభేదీ ద్రావేణ మర్దితం చ శరావకే॥
పుటమేకం తతః పాచ్యం భస్మీ భవతి తద్ధ్రువం॥
వై-చిం.

యథోక్తవిధానమున శుద్ధిజేయబడిన పచ్చను ఖల్వమున మెత్తగా చూర్ణించి, వాకుడు (సమూలము) రసమును బోసి మూడుదినములును, కొండపిండి (సమూలము) రసమును బోసి మూడుదినములును జక్కగా మర్దించి చిన్న చిన్న చక్రికలు జేసి యెండించి, శరావసంపుటమున బంధించి యొక గజపుటమున బాకము జేసిన యయ్యది భస్మమగును.

## మరకతభస్మ గుణములు

శ్లో॥ మరకతం హి విషఘ్నం శీతలం మధురం రసే।
అమ్లపిత్త హారం రుచ్యం పుష్టిదం భూతనాశనం॥
ఆ-ప్ర.

కాసం శ్వాసం సన్నిపాతాగ్ని మాంద్యం। శోఫం శూలం
జ్వార్తిరోగం విషం చ దుర్నామానం పాండురోగం
నిహన్యాత్॥ ర-ప్ర-సు.

పచ్చమణియొక్క భస్మము మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. ధాతువులను బోషించును. విషమును, అమ్లపిత్తమును, భూతవికారములను బోగొట్టును. మరియు, కాసను, శ్వాసను, సన్నిపాతమును, అగ్నిమాంద్యమును, శోఫను, శూలను, జ్వరమును, (విషమును), అర్శస్సును, పాండురోగమును బోగొట్టును.

---

# వైడూర్యము

## వైడూర్య నామములు *

శ్లో॥ వైడూర్యం దూరజం రత్నం స్యాత్కేతు గ్రహావల్లభః॥
ఆ-ప్ర.

వైడూర్యము, దూరజరత్నము, కేతుగ్రహావల్లభము అనునవి వైడూర్య నామములు.

## వైడూర్య శోధనవిధానము

శ్లో॥ వైడూర్యం వాజి మూత్రేణ కూష్మాండ స్వరసేన వా।
భావితం ద్విదినం చాథశుద్ధి ర్భవతి నిశ్చయః॥ వై-చిం.

---

* గ్రాహ్య-అగ్రాహ్య వైడూర్య లక్షణములు.—
"వైడూర్యం శ్యామ శుభ్రాభం సమం స్వచ్ఛం గురుస్ఫుటం।
అభ్రతోయో త్తరీయేణ గర్భితం శుభమీరితం॥ శ్యామ తోయసమ చ్ఛాయం చిపిటం లఘు, కర్కశం। రక్త గర్భో త్తరీయం చ వైడూర్యం నైవ శస్యతే॥" ర-ర-స.—
నలుపు తెలుపు గలసిన వర్ణము గలిగినట్టియు, సమానముగ నున్నట్టియు, స్వచ్ఛముగ నుండునట్టియు, బరువుగ నుండు నట్టియు, స్ఫుటముగ నుండునట్టియు, లోభాగమున మేఘోదకమువంటి తెల్లని పొరతో గూడియుండునట్టియు వైడూర్యము గ్రహింపదగినదిగా నుండును. నల్లగను, కేవలము తెల్లగను, మధ్య పల్లముగను, తేలికగను, కఠినముగను, ఎఱ్ఱని వర్ణముగల పొరను లోభాగమున గలదిగను నుండు వైడూర్యమును గ్రహింపంజనదు.

వైదూర్యమణిని, గుఱ్ఱపు మూత్రమున నొకదినమును, బూడిద గుమ్మడికాయ రసమున నొకదినమును భావనజేసిన యయ్యది పరిశుద్ధ మగును.

## వైడూర్య భస్మవిధానము

శ్లో॥ తద్వైడూర్యం శిలాభేది రసేన పరిభావితం।
విశ్వకర్మపుటే దగ్ధ్వా తీవ్రాగ్నౌ వజ్రమూషయా॥
తతో గజపుటే పాచ్యం భస్మీ భవతి నిశ్చయం॥

వై-చిం.

యథోక్త విధానమున శుద్ధిజేయబడిన వైదూర్యమణిని ఖల్వమున మెత్తగా చూర్ణించి, కొండపిండి (సమూలము) రసముతో మూడుదినములు మర్దించి యెండబెట్టవలెను. పిమ్మట నీ చూర్ణము నొక మూషలో నుంచి దానిని కొలిమిలో బెట్టి గాఢముగా నొక జాము ఊదవలెను. పిమ్మట నా చూర్ణమును తిరిగి కొండపిండి రసముతో జక్కగా మర్దించి, బిళ్ల జేసి యెండించి, శరావసంపుటమున బంధించి గజపుటమున బాకము జేసిన యయ్యది భస్మ మగును.

## వైడూర్య భస్మ గుణములు

శ్లో॥ వైడూర్యం రక్త పిత్తఘ్నం ప్రజ్ఞాయుర్బలవర్ధనం।
పిత్త ప్రధాన రోగఘ్నం దీపనం మలమోచనం॥

ర-ర-స.

వైదూర్యభస్మ బుద్ధిని వికసింపజేయును. ఆయువును వృద్ధి బొందించును. బలమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. మలమును శోధించును. రక్తపిత్తమును, పిత్తజ వ్యాధులను బోగొట్టును.

# గోమేదము

## గోమేద నామములు *

శ్లో॥ గోమేదః పీతరక్తకం॥ ఆ-ప్ర.

గోమేదము, పీతరక్తకము అనునవి గోమేద నామములు.

## గోమేదశోధన విధానము

శ్లో॥ తతో గోమేదకం వాజిమూత్రే భావ్యం దినత్రయం।
తతోవిదారీస్వరసే భావ్యం శుద్ధం భవిష్యతి॥
వై-చిం.

---

* గ్రాహ్య-అగ్రాహ్య గోమేద లక్షణములు.— "సుస్వచ్ఛ గోజలచ్ఛాయం స్నిగ్ధం స్వచ్ఛం సమం గురు। నిర్దలం మసృణం దీప్తం గోమేదం శుభమష్టధా॥ విచ్ఛాయం లఘు రూక్షాంగం చిపిటం పటలాచితం। నిష్ప్రభం పీతకాచాభం గోమేదం న శుభావహం॥" ఆ-ప్ర.—స్వచ్ఛమైన గోమూత్రవర్ణము గలిగినట్టియు, స్నిగ్ధముగను, సమముగను, బరువుగను నుండునట్టియు, దళము లేనట్టియు, నునుపుగ నుండునట్టియు, ప్రకాశించునట్టియు గోమేదమణి గ్రహింపదగినదిగా నుండును. కాంతి లేనట్టియు, తేలికగ నుండునట్టియు, గరగరలాడునట్టియు, మధ్యపల్లముగ నుండునట్టియు, పొరలచే వ్యాప్తమైనట్టియు, వెలవెలబోవునట్టియు, పసుపు పచ్చని గాజుపెంకుతో సమానముగ నుండునట్టియు గోమేదమణిని గ్రహింపం జనదు

గోమేదమణిని గుజ్జుపుమూత్రమున మూడుదినములును, నేలగుమ్మిడి గడ్డ స్వరసమున మూడుదినములును భావనజేసిన యయ్యది పరిశుద్ధ మగును.

## గోమేద భస్మవిధానము

శ్లో॥ శుద్ధం గోమేదకం కృష్ణధత్తూరద్రావభావితం।
విశ్వకర్మ పుటేదగ్ధ్వా త్రివారం భస్మ చాప్నుయాత్॥
వై-చిం.

యథోక్తవిధానమున శుద్ధిజేయబడిన గోమేదమణిని ఖల్వమునందు మెత్తగా చూర్ణించి నల్లయుమ్మెత్త (సమూలము) రసమున మూడుదినములు చక్కగా మర్దించి యెండించవలెను. పిమ్మట నా చూర్ణము నొక మూషలో నుంచి, దానిని కొలిమిలో బెట్టి గాఢముగా నొకజా మూదవలెను. పిమ్మట నా చూర్ణమును పై స్వరసముతో తిరిగి మర్దించి బిళ్లజేసి యెండించి, శరావసంపుటమున బంధించి గజపుటముచే బాకముజేయవలెను. స్వాంగశీతలమున దానిని గ్రహించి తిరిగి పై విధముగనే మర్దనపుటములను గావింపవలెను. ఇటుల మూడు పుటములు వేసిన యయ్యది భస్మయగును.

## గోమేద భస్మ గుణములు

శ్లో॥ గోమేదకోఽమ్ల ఉష్ణశ్చ వాతకోప వికారజిత్।
దీపనః పాచనశ్చైవ, ధృతోఽయం పాపనాశనః॥
ఆ-ప్ర.

గోమేదమణిభస్మము ఆమ్లరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. అన్నమును పచింపజేయును. వాతవికారములను బోగొట్టును. ఈ మణిని ధరించిన పాపములు శమించును.

# మాణిక్యము

## మాణిక్య నామములు *

శ్లో॥ మాణిక్యం పద్మరాగఃస్యా చ్ఛోణరక్తంచ లోహితం॥
ఆ-ప్ర.

మాణిక్యము, పద్మరాగము, శోణరక్తము, లోహితము అనునవి మాణిక్యనామములు.

---

* గ్రాహ్య—అగ్రాహ్య మాణిక్య లక్షణములు.— "స్నిగ్ధం సుగాత్రరచితం దీప్తం స్వచ్ఛం సురంగంచ॥ తజ్జాత్యం మాణిక్యం కల్యాణం ధారణాత్కురుతే॥ యద్వి చ్ఛాయం శర్కరిలం కర్కశ ధూమ్రం స్వరాగ వికలంచ। విరూప లఘుమాణిక్యం నధార్యం దోషావహం త్యాజ్యం॥" ఆ-ప్ర.—స్నిగ్ధముగను, మంచి స్వరూపముగలదిగను, ప్రకాశించునదిగను, స్వచ్ఛముగను, మంచి యెఱ్ఱని వర్ణముగలదిగను నుండు మాణిక్యము కళ్యాణకరమగును గాన యట్టిది గ్రాహ్యమని తెలియనగును. కాంతి హీనమైన దియు, ముక్కలు ముక్కలుగా విరిగిపోయినదిగను, కఠిన ముగను, ధూమ్రమవర్ణముగలదిగను, వర్ణము తక్కువైనది గను, వికృతమైన రూపముగలదిగను, తేలికగను నుండు నట్టి మాణిక్యము దోషకరమైనదిగాన యట్టి దానిని గ్రహింపంజనదు.

## మాణిక్య శోధనవిధానము

శ్లో॥ అశ్వమూత్రాంతరే భావ్యం త్రిదినంచ ఖరాతపే।
తథోష్ణ వారిణాక్షాళ్యం రత్నశుద్ధి ర్భవిష్యతి॥

వై-చిం.

మాణిక్యము నొకపాత్రలో వైచి యందు గుఱ్ఱపుమూత్రమును బోసి మూడుదినములు తీవ్రమైన యెండలో దాని నుంచి భావనజేసి యుష్ణోదకముతో గడిగిన యయ్యది పరిశుద్ధమగును.

## మాణిక్య భస్మవిధానము

శ్లో॥ తన్మాణిక్యం రవిక్షీరే దివసత్రయ భావితం।
శరావే త్రిపుటం పాచ్యం భస్మీభవతి తత్ క్షణాత్॥

వై-చిం.

శుద్ధిజేయబడిన మాణిక్యము నొక పాత్రయందుంచి యందు జిల్లేడుపాలను బోసి మూడుదినములు భావనజేసి శరావసంపుటమున బంధించి మూడు గజపుటములు వేసిన యయ్యది భస్మయగును.

## మాణిక్యభస్మ గుణములు

శ్లో॥ మాణిక్యం దీపనం వృష్యం కఫవాత క్షయార్తినుత్।
భూతవేతాల పాపఘ్నం కర్మజ వ్యాధినాశనం॥

ఆ-ప్ర.

మాణిక్యభస్మ జాఠరాగ్నిని వృద్ధిబొందించును. సద్యశ్శుక్రకరము. కఫవాతములను శమింపజేయును. క్షయమును, భూతగ్రహావికారములను, కర్మజవ్యాధులను, పాపమును బోగొట్టును.

---

# ఇంద్రనీలము

## ఇంద్రనీల నామములు *

శ్లో॥ ఇంద్రనీలంచ నీలంచ॥ ఆ-ప్ర.

ఇంద్రనీలము, నీలము అనునవి యింద్రనీలమణి నామములు.

---

* గ్రాహ్యా—అగ్రాహ్యేంద్ర నీల మణి లక్షణ ములు.—"ఏకచ్ఛాయం స్నిగ్ధవర్ణం గురుస్యాత్స్వచ్ఛం మధ్యే చోల్లసత్కాంతియుక్తం। నీలం ప్రోక్తం పండితం సప్తసంజ్ఞైరేతైర్లింగైర్లక్షితం చోత్తమంహి॥ నిర్చ్ఛాయంచేత్కోమలం చాస్రగంధి రూక్షం సూక్ష్మం చిప్పిటం వైహతంచ। ప్రోక్తంవై తద్వారినీలం భిషగ్భిరేతైర్లింగైః సప్తభిః త్యజ్యతేః క్షేపణీయం॥" ఆ-ప్ర.—ఒకే వర్ణముగలిగినట్టియు, స్నిగ్ధముగ నుండునట్టియు, బరువుగనుండునట్టియు, స్వచ్ఛముగ నుండునట్టియు, మధ్యభాగమున ప్రకాశవంతమైనట్టియు నింద్రనీలమణి శ్రేష్ఠమైనదిగా నెంచబడును. బరువులేనట్టిదియు, మృదువుగ నుండునట్టియు, రక్తగంధము గలిగినట్టియు, రూక్షముగ నుండునట్టియు, మిక్కిలి చిన్నదిగా నుండునట్టియు, మధ్య పల్లముగా నుండునట్టియు, పగుళ్లు గలిగినట్టియు నింద్రనీలమణి త్యాజ్యమైనదిగా గ్రహించవలెను.

## ఇంద్రనీల శోధనవిధానము

శ్లో॥ ఖరమూత్రాంతరే క్షిప్త్వా నీలం తీవ్రా తపేక్షిపేత్।
భావితం దినమేకంచ నీలం శుద్ధం భవిష్యతి॥ వై-చిం.

ఇంద్రనీలమణి నొకపాత్రలో నుంచి యందు గాడిదమూత్రమును బోసి దానిని తీవ్రమైన యెండలో నొకదినముంచి భావనజేసిన యయ్యది పరిశుద్ధమగును.

## ఇంద్రనీలభస్మ విధానము

శ్లో॥ తన్నీలం లక్షితం జీవాద్రివేభావ్యం త్రియామకం।
విశ్వకర్మపుటేదగ్ధ్వా భస్మీభవతి తత్‌క్షణాత్॥
వై-చిం.

శుద్ధిజేయబడిన యింద్రనీలమణిని మూడుదినములు పాలకూర రసమున భావనజేసి, దాని నొక మూసయందుంచి, కొలిమిలో గాఢముగా నూదినచో భస్మయగును.

## ఇంద్రనీలభస్మ గుణములు

శ్లో॥ శ్వాసకాసహరంవృష్యం త్రిదోషఘ్నం సుదీపనం।
విషమజ్వర దుర్నామ పాపఘ్నం నీలమీరితం॥
ఆ-ప్ర.

ఇంద్రనీలభస్మము సద్యశ్శుక్రకరము. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. త్రిదోషములను శమింపజేయును. శ్వాసను, కాసను, విషమజ్వరమును, అర్శోరోగమును, పాపమును బోగొట్టును.

# పుష్పరాగము

## పుష్పరాగ నామములు *

శ్లో॥ పుష్పరాగో మంజుమణిః స్యా ద్వాచస్పతి వల్లభః॥
ఆ-ప్ర.

పుష్పరాగము, మంజుమణి, వాచస్పతివల్లభము అనునవి పుష్పరాగ నామములు.

---

* గ్రాహ్య—అగ్రాహ్య పుష్పరాగ లక్షణములు. —"స్వచ్ఛం స్థూలం పుష్పరాగం గురుస్యాత్స్నిగ్ధం వర్ణే కర్ణికార ప్రసూనం। యచ్చావక్రం మసృణం కోమలంచ లింగై రేతైః శోభనం పుష్పరాగం॥ రూక్షం పీతం కర్కశం శ్యామలంచ పాండు స్యాద్వై కాపిలం తోయహీనం। వక్రం యత్స్యాన్నిష్ప్రభం పుష్పరాగం నోసేవ్యం తన్నైవ దేయం ద్విజేభ్యః॥" ర-ప్ర-సు.—స్వచ్ఛముగను, స్థూలముగను, బరువుగను, స్నిగ్ధముగను, మంకెనపువ్వుతో సమమైన వర్ణముగలదిగను, వంకరలేనిదిగను, నునుపుగను, మృదువుగను నుండునట్టి పుష్పరాగమణి శ్రేష్ఠమైనదిగా దెలియవలెను. గరగర లాడునదిగను, పసుపు పచ్చగను, కఠినముగను, నల్లగను, తెల్లగను, కపిలవర్ణముగలదిగను, లోన జలమువంటి ఛాయలేనిదిగను, వంకరగను, కాంతిహీనముగను నుండునట్టి పుష్పరాగము త్యాజ్యమైనదిగా గుర్తించవలెను.

## పుష్పరాగశోధన విధానము

శ్లో॥ పుష్పరాగం ఛాగమూత్రైర్భావ్యం శుద్ధం భవిష్యతి॥

వై-చిం.

పుష్పరాగమణిని మేకమూత్రముతో మూడుదినములు భావన జేసిన యయ్యది పరిశుద్ధమగును.

## పుష్పరాగ భస్మ విధానము

శ్లో॥ తత్పుష్పరాగం పాషాణభేదీద్రావేణభావితం।
విశ్వాకర్మపుటేదగ్ధ్వా భస్మీభవతి తత్‌క్షణాత్॥

వై-చిం.

శుద్ధిజేయబడిన పుష్పరాగమణిని కొండపిండి (సమూలము) రసమున మూడుదినములు భావనజేసి, దాని నొక మూసయందుంచి కొలిమిలో గాఢముగా నూదినచో నయ్యది భస్మమగును.

## పుష్పరాగభస్మ గుణములు

శ్లో॥ పుష్పరాగం విషచ్ఛర్ది కఫవాతాగ్నిమాంద్యనుత్।
కుష్ఠార్శో దాహశమనం దీపనం లఘుపాచనం॥

ఆ-ప్ర.

పుష్పరాగభస్మము లఘుగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. కఫవాతములను శమింపజేయును. విషమును, ఛర్దిని, అగ్నిమాంద్యమును, కుష్ఠమును, అర్శస్సును, దాహమును బోగొట్టును.

## ఉప రత్నములు

# వైక్రాంతము

### వైక్రాంత నామములు *

శ్లో॥ వైక్రాంతంచైవ విక్రాంతం నీలవజ్రం కువజ్రకం।
గోనాగం క్షుద్రకలశం వర్ణవజ్రంచ గోనసం॥

ఆ-కం.

---

* (1) వైక్రాంత భేదములు.—"శ్వేతో రక్తశ్చ పీతశ్చ నీలః పారావతచ్ఛవిః। శ్యామలః కృష్ణవర్ణశ్చ కర్బ్యూరశ్చాష్ట ధాహిసః॥" ర-ర-స.— తెల్లగను, ఎర్రగను, పసపుపచ్చగను, నీలముగను, పావురపుపిట్ట వర్ణముగను, శ్యామవర్ణముగను, నల్లగను, కర్బ్యూర వర్ణముగను వైక్రాంతమణి వర్ణభేదముచే నెనిమిది విధములుగనుండును. అయితే ఈ వర్ణభేదములలో సాధారణముగ తెల్లగ నుండునదియే లభ్యమగుచుండును. దీనినే భస్మరూపమును బొందించి యుపయోగించుట వైద్యక వ్యవహారమున గానుపించుచున్నది. కాని రసతంత్రికారులు కృష్ణవర్ణముగల వైక్రాంతము సర్వశ్రేష్ఠమైనదిగా జెప్పియున్నారు. "వైక్రాంతః కృష్ణవర్ణోయః షట్కోణో వసుకోణకః। మసృణో గురుతాయుక్తో నిర్మలః సర్వసిద్ధిదః॥" ఆ-ప్ర.— నల్లని వర్ణము గలిగినట్టియు, ఆరు కోణములుగాని, యెనిమిది కోణములుగాని గలిగినట్టియు, నునుపుగను, బరువు

వైక్రాంతము, విక్రాంతము, నీలవజ్రము, కువజ్రకము, గోనాగము, క్షుద్రకలశము, వర్ణవజ్రము, గోనసము అనునవి వైక్రాంత నామములు.

## వైక్రాంత శోధనవిధానము

శ్లో॥ కులుత్థ క్వాథసంస్విన్నో వైక్రాంతః పరిశుధ్యతి॥

ఆ-ప్ర.

---

గను, నిర్మలముగను నున్నట్టియు వైక్రాంతమణి సర్వసిద్ధుల నొసంగునదిగా నుండును. మరియు, వైక్రాంతము.— "వికృతా వజ్రఖండాయే వైక్రాంతాఖ్యాం భజంతి తే। జాతయః శోధనం హింసా (మారణం) గుణాస్తేషాంతు వజ్రవత్॥" ఆ-ప్ర.—అనియు, "వజ్రస్థానే ప్రయోజయేత్॥" ఆ-ప్ర....అనియు జెప్పబడియుండుటచే వజ్రముతో సమానముగ నుండుననియు, అందుచే వజ్రమునకు బదులు దీని నుపయోగింపవచ్చుననియు రస తంత్రకారుల మతమై యున్నది.

(2) యోగ్య వైక్రాంత లక్షణము.— "అష్టాస్రశ్చాష్టఫలకః షట్కోణో మసృణో గురుః। శుద్ధ మిశ్రిత వర్ణైశ్చయుక్తో వైక్రాంత ఉచ్యతే॥" ర-ర-స.—ఎనిమిది యంచులు గలిగినట్టియు, నెనిమిది పలకలు గలిగినట్టియు, నారు కోణములు గలిగినట్టియు, నునుపుగ నున్నట్టియు, బరువుగనున్నట్టియు, స్వచ్ఛమై యనేకవర్ణములు గలసిన వర్ణముతోఁగూడినట్టియు వైక్రాంతము యోగ్యమైనదిగా నెరుంగవలెను.

వైక్రాంతమణిని మూటగట్టి డోలాయంత్రమున ఉలవకషాయముతో మూడుజాములు స్వేదనము జేసినచో నయ్యది పరిశుద్ధమగును.

## వైక్రాంతభస్మ విధానము

శ్లో॥ మ్రియతేఽష్ట పుటైర్గంధ నింబూకద్రవ సంయుతైః॥

ఆ-ప్ర.

శుద్ధిజేయబడిన వైక్రాంతమును ఖల్వమున మెత్తగా చూర్ణించి అందు పదియారవభాగము శుద్ధ గంధకమును జేర్చి జంబీరస్వరసముతో మూడుదినములు చక్కగా మర్దించి చిన్న చిన్న చక్రికలు జేసి యెండించి, వానిని శరావసంపుటమున బంధించి గజపుటముచే పాకము జేయవలెను. ఇటులనే గంధకమును జేర్చుచు, జంబీరస్వరసముచే మర్దించుచు నెనిమిది పుటములు వేసిన యయ్యది భస్మమగును.

## వైక్రాంతభస్మ గుణములు *

శ్లో॥ వైక్రాంతస్తు త్రిదోషఘ్నః షడ్రసో దేహదార్ఢ్యకృత్।
పాండూదర జ్వర శ్వాస కాసయక్ష్మ ప్రమేహనుత్॥

ఆ-ప్ర.

---

* అశోధిత వైక్రాంతమువలన గలుగు వికారములు.—"అశుద్ధౌ వజ్రవైక్రాంతౌ కిలాసం దాహసంతతిం। పాండురోగం పార్శ్వపీడాం కురుతౌ తౌ విశోధయేత్॥" ఆ-ప్ర.—వైక్రాంతమును శోధింపకయే మారితముగావించి యుపయోగించిన అందువలన శ్విత్రకుష్ఠము, శరీర తాపము, పాండురోగము, పార్శ్వశూల అను నీ వికారములు గలుగును. దీనివలెనే వజ్రముగూడా అశోధితమైనచో పై

వైక్రాంతభస్మము మధురాదిమద్రసములను గలిగియుండును. శరీరమునకు ద్రుఢత్వమును గలిగించును. త్రిదోషములను శమింపజేయును. పాండు, ఉదరము, జ్వరము, శ్వాస, కాస, రాజయక్ష్మ, ప్రమేహము వీనిని బోగొట్టును. మరియు, నిది వజ్రముతో సమానమైన గుణములను గలిగియుండును. జ్వరమును, కుష్ఠమును బోగొట్టును. పాదరసముయొక్క విషదోషమును బోగొట్టును అనగా పాదరసమునకు దీనితో సంస్కారము జేయుటవల్ల అందలి విషదోషము నశించునని భావము.

---

# సూర్యకాంతము

## సూర్యకాంత నామములు *

శ్లో॥ అథ భవతి సూర్యకాంత స్తపనమణిస్తపనశ్చరవికాంతః।
దీప్తోపలో ఽగ్నిగర్భో జ్వలనాశ్మాఽర్కోపలశ్చ వసు
నామా॥ ఆ-ప్ర.

---

వికారములనే బుట్టించును. కావున వీనిని యథోక్తవిధానమున శోధింపవలెనని భావము.

* (1) గ్రాహ్యసూర్యకాంతమణి లక్షణము.—"శుద్ధః స్నిగ్ధో నిర్వ్రణో నిస్తుషోఽన్తర్యో నిర్ఘృష్టోఽత్యన్తనైర్మల్య మేతి। యః సూర్యాంశు స్పర్శనిష్ఠ్యూతవహ్ని ర్జాత్యః సోఽయం కథ్యతే సూర్యకాంతః॥" ఆ-ప్ర.—పరిశుద్ధముగను, స్నిగ్ధముగను, మచ్చలు లేనిదిగను, లోభాగమున తుషవంటి పొరలులేనిదిగను, బాగుగా సానబట్టి

సూర్యకాంతము, తపనమణి, తపనము, రవికాంతము, దీప్తోపలము, అగ్నిగర్భ, జ్వలనాశ్మ, అర్కోపలము అనునవి సూర్యకాంతమణి నామములు.

## సూర్యకాంతభస్మ గుణములు

శ్లో॥ రవికాంతో భవేదుష్ణో నిర్మలశ్చ రసాయనః।
వాతశ్లేష్మ హరో మేధ్యః పూజనా ద్రవితుష్టిదః॥

ఆ-ప్ర.

---

నప్పుడు అత్యంతము నిర్మలముగను, సూర్యకిరణ స్పర్శచే మిక్కిలి యుష్ణమును వెలిగ్రక్కునదిగను నుండు సూర్యకాంతమణి శ్రేష్ఠమైనదిగా దెలియవలెను.

(2) విశేషసూచన.—"సర్వేషా ముపరత్నానాం శోధనం మారణం తథా। వజ్రవద్వైద్యరాట్ కుర్యా ద్యుక్తిపూర్వం ప్రయత్నతః॥" ర-భా.—ఇటుల జెప్పబడియుండుటచే నీ యుపరత్నముల కన్నింటికిని శోధన మారణ ప్రక్రియలను వజ్రమునకువలెనే చేయదగియుండునని దెలియుచున్నది. కావున అటుల చేసుకొనవలసియుండును. వజ్రమున కింకు శోధనమారణ ప్రక్రియా విధానములను ప్రత్యేకముగా దెలిపియుండుటచే వీనికి తిరిగి అవే ప్రక్రియలనిట నుదహరించుట చర్విత చర్వణమగును. అందుచే నయ్యవి విడువబడి, యిట కేవలము గుణములు మాత్రము వర్ణింపబడినవి.

సూర్యకాంతమణియొక్క భస్మ ముష్ణవీర్యమును గలిగియుండును. రసాయనము. బుద్ధిని వికసింపజేయును. వాత శ్లేష్మములను శమింప జేయును. ఈ మణిని పూజించుటవలన సూర్యభగవానుడు ప్రీతి జెందును.

---

# చంద్రకాంతము

## చంద్రకాంత నామములు *

శ్లో॥ ఇందు కాంతశ్చంద్రకాంతశ్చంద్రాశ్మా చంద్రజోపలః।
శీతాశ్మా చంద్రికాద్రావః శశికాంతశ్చ సప్తధా॥
ఆ-ప్ర.

ఇందు కాంతము, చంద్రకాంతము, చంద్రాశ్మ, చంద్రజోపలము, శీతాశ్మ, చంద్రికా ద్రావము, శశికాంతము అనునవి చంద్రకాంతమణి నామములు.

---

* యోగ్య చంద్రకాంతమణి లక్షణములు.—"స్నిగ్ధం శీతం పీతమత్రా సమంన్తర్ధత్తే చిత్తే స్వచ్ఛతాం యన్మునీనాం। యశ్చ స్రావంయాతి చంద్రాంశు సంగాజ్జాత్యం రత్నం చంద్రకాంతాఖ్య మేతత్॥" ఆ-ప్ర.—స్నిగ్ధము గను, శీతలముగను, పసుపుపచ్చగను, లోన పగుళ్లు లేనిది గను, దీనిని ధరించుటవల్ల మునీశ్వరుల చిత్తమునకు నిర్మలత్వమును గలిగించునదిగను, చంద్రుని కిరణముల స్పర్శచే ద్రవమును స్రవించునదిగను నుండు చంద్రకాంతమణి శ్రేష్ఠమైనదిగా తెలియనగును.

## చంద్రకాంత భస్మ గుణములు

శ్లో॥ చంద్రకాంతస్తు శిశిరః స్నిగ్ధః పిత్తాస్రతాపనుత్।
శివప్రీతికరః స్వచ్ఛో గ్రహా లక్ష్మీ వినాశనః॥ ఆ-ప్ర.

చంద్రకాంతమణిభస్మము స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. రక్తపిత్తమును, తాపమును బోగొట్టును. ఈ మణిని ధరించుటవలన గ్రహబాధలు, అలక్ష్మి మున్నగునవి తొలగిపోవును. మరియు నిది శివునకు ప్రీతి గలిగించునదిగ నుండును.

---

# రాజావర్తము

## రాజావర్త నామములు *

శ్లో॥ రాజావర్తో నృపావర్తో రాజన్యా వర్తక స్తథా।
ఆవర్తమణి రావర్తః స్యాదిత్యేవ శరాహ్వయః॥
ఆ-ప్ర.

---

* యోగ్య రాజావర్తమణి లక్షణములు.—"నిర్మలంచ గురుస్నిగ్ధం బహుచ్ఛాయంచ నీలభం। శిఖి కంఠ సమం సౌమ్యం రాజావర్తం తదుచ్యతే॥" ర-భా.—నిర్మలముగను, బరువుగను, స్నిగ్ధముగను, అధికమైన ఛాయ గలదిగను, నీలవర్ణముగలదిగను, నెమలి కంఠముతో సమమైన వర్ణముగలదిగను, సౌమ్యముగను నుండు రాజావర్త మణి శ్రేష్ఠమైనదిగా దెలియవలెను.

రాజావర్తము, నృపావర్తము, రాజన్యావర్తకము, ఆవర్తమణి, ఆవర్తము అనునవి రాజావర్తమణి నామములు.

## రాజావర్త భస్మ గుణములు

శ్లో॥ రాజావర్తః కటుః స్నిగ్ధః శిశిరః పిత్తనాశనః।
సౌభాగ్యం కురుతేనౄణాం భూషణేషు ప్రయోజితః॥
ఆ–ప్ర.

రాజావర్తమణిభస్మము కటురసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగియుండును. పిత్తమును శమింపజేయును. ఈ మణిని భూషణములందు ధరించుటచే సౌభాగ్యమును గలిగించును.

---

# ఫేరోజము

## ఫేరోజ నామములు

శ్లో॥ ఫేరోజం హరితాశ్మాచ భస్మాంగం హరితం ద్విధా॥
ఆ–ప్ర.

ఫేరోజము, హరితాశ్మ యనునవి ఫేరోజమణి నామములు. ఈ మణి భస్మాంగము (బూడిదవర్ణము), హరితము (ఆకుపచ్చని వర్ణము) అని వర్ణభేదముచే రెండువిధములుగా నుండును.

## ఫేరోజ భస్మ గుణములు

శ్లో॥ ఫేరోజం సుకషాయంస్యా న్మధురం దీపనం సరం।
స్థావరం జంగమంచైవ సంయోగాచ్చాపి యద్విషం॥
తత్సర్వం నాశయేచ్ఛీఘ్రం మూలభూతాది దోషజం॥
ఆ–ప్ర.

ఫిరోజమణిభస్మ కషాయరసమును, మధురానురసమును, సరగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. స్థావరజంగమ విషములను, కృత్రిమవిషమును. మూలికలవలనను, భూతాదులవలనను, దోషములవలనను గలుగు వికారములను బోగొట్టును.

## రత్న యోగములు

### (1) త్రైలోక్య చింతామణి రసము

శ్లో॥ సూతాభ్ర స్వర్ణతారారుణ భిమర శిలాతాప్య గంధ
ప్రవాలాయో ముక్తా శంఖ తాళం వరమిద మనల
క్ష్వాథ తస్స ప్తభావ్యం। నిర్గుండీ సూరణాంభః పవి
రవి పయసాత్రిః పృథగ్భావయిత్వా చాపూర్యైతై
ర్వరాటా నథమిహిర పయస్టంకణా లిప్తవక్త్రాన్॥
కృత్వాభాండే చరుధ్వా గజపుట జఠరే యుక్తి తస్త
త్తుపక్వో వ్ధృత్య తన్మర్దయిత్వా తదఖిల తులితం
సూతభస్మ ప్రదద్యాత్। వైక్రాంతం సూతతుర్యాం
శకమథ మిళితం సప్తశ శ్శిగ్రుమూల త్వాగ్భావ్యం తేన
తుల్యం విషమనలవరం టంకణం చోషణంచ। పథ్యా
జాతీఫలం చామరకుసుమకణా. నాగరం వత్సనాభా
త్తుర్యాంశం మేళయిత్వా పృథగఖదివసం మర్దయే
ల్లుంగతోయైః। ఏషత్రైలోక్య చింతామణి రఖిలగద
ధ్వాన్త విధ్వం సహంస, స్తత్తద్రోగానుపానై రుషసి
కబళితస్స్వార్థ వల్ల ప్రమాణః॥ వాతవ్యాధ్యామవాత
జ్వర జఠర కృమిశ్వాస శూలాస్రవాతా సృక్పిత్త
త్షైణ్య కాసక్షయః కఫజగ దోరక్షతా జీర్ణమేహా॥

క్షుపాతీసార పాండుగ్రహణీషు తమకేషు వ్రణార్శః
ప్రకృష్టే ఖాంజే ఖంజాఢ్యవాతే శృతిభగజగదే సర్వ
థైష ప్రశస్తః॥ వై-చిం.

శుద్ధిజేయబడిన పాదరసము, అభ్రకభస్మ, స్వర్ణభస్మ, రజతభస్మ, మాణిక్యభస్మ, వజ్రభస్మ, శుద్ధిజేయబడిన మణిశిల, స్వర్ణమాక్షికభస్మ, శుద్ధిజేయబడిన గంధకము, విద్రుమభస్మ, లోహభస్మ, మౌక్తికభస్మ, శంఖభస్మ, శుద్ధిజేయబడిన తాళకము ఇటుల వీనిని సమాంశములుగ గ్రహించి, అందు రసగంధకములను దొలుత ఖల్వమునందు కజ్జలిగా నూరి, అందు పై ద్రవ్యముల నన్నింటిని జేర్చి చిత్రమూల కషాయముతో నేడుదినములు జక్కగా మర్దించవలెను. పిమ్మట వావిలాకు రసముతోను, అడవికంద రసముతోను, నల్లేరు రసముతోను, జిల్లేడు పాలతోను ప్రత్యేకముగ మూడేసిరోజులు చొప్పున మర్దించి ముద్దజేయవలెను. పిమ్మట ప్రశస్తమైన పసుపుపచ్చని గవ్వలను గ్రహించి వానిని యథోక్తవిధానమున శోధించి యెండబెట్టి, వీటి లోభాగమున పై యౌషధపిష్టము నొక్కొక్క గవ్వలోను పట్టునంత భాగమును బూరించవలెను. (ఇట పై యౌషధపిష్ట పరిమితిని లోన పూరించుట కెన్ని గవ్వలు కావలెనో యన్నింటిని మాత్రమే గ్రహించి వాటియందు క్రమముగా బూరించవలెనని తెలియునగును.) తరువాత శోధితటంకణమును వేరొక ఖల్వమునందుంచి జిల్లేడుపాలతో బాగుగా జిగురువచ్చువరకు మర్దించి పిష్టము జేయవలెను. ఈ టంకణపిష్టముతో పై విధముగా పూరింపబడిన గవ్వలయొక్క ముఖభాగములను దళసరిగా బూసి యెండించవలెను. ఇటుల సిద్ధముజేయబడిన గవ్వలను ఒక భాండమునందుంచి దాని ముఖము నొక శరావముతో గప్పి దాని సంధికి దృఢముగా సంధిలేపముజేసి యెండించవలెను. పిమ్మట నీ భాండమును గజపుటమునందుంచి పాకముజేయవలెను. స్వాంగశీతలమున నా భాండము

నుండి యీ ద్రవ్యాలను గ్రహించి, ఖల్వమున మెత్తగా చూర్ణించవలెను. ఈ చూర్ణముయొక్క మొత్తమునకు సమముగా నందు రసభస్మను*, రసభస్మలో నాల్గవభాగము వైక్రాంతభస్మను జేర్చి మునగవేరుపై నుండు పట్టయొక్క స్వరసముతో నేడుదినములు మర్దించి, శుద్ధిజేయ బడిన వత్సనాభి, చిత్రమూలము, శుద్ధిజేయబడిన టంకణము, మిరియాలు వీనిని ప్రత్యేకముగ వైక్రాంతమునకు సమముగను, కరక్కాయ బెరడు, జాజికాయ, లవంగాలు, పిప్పళ్లు, శుంఠి వీనిని ప్రత్యేకముగా వత్సనాభిలో నాల్గవభాగముండునట్లును గ్రహించి, మెత్తగా చూర్ణించి పై యౌషధమున జేర్చి, మాదీఫలరసముచే నొకదినము మర్దించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది త్రైలోక్యచింతామణి రసమని వ్యవహరింపబడును. దీనిని ప్రతిదినము ఒకటిన్నర వల్లప్రమాణమున నాయా రోగానుపానభేదములతో సేవించుచుండిన సమస్త వ్యాధులను శమించును. అందు వాతవ్యాధులు, ఆమవాతము, జ్వరము, ఉదరము, కృమిరోగము, శ్వాస, శూల, వాతరక్తము, రక్తపిత్తము, కార్శ్యము, కాసము, రాజయక్ష్మ, కఫజవ్యాధులు, ఉరఃక్షతము, అజీర్ణము, ప్రమేహము, కుష్ఠము, అతీసారము, పాండు, గ్రహణి, తమకశ్వాస, వ్రణము, అర్శస్సు, ఖంజవాతము, ఊరుస్తంభము, కర్ణరోగము, యోనివ్యాపత్తులు ఇవియెల్ల నీ యౌషధసేవనవలన శమించును.

## (2) నవరత్న రాజమృగాంకరసము

శ్లో॥ సూతం గంధక హేమతార రసకం వైక్రాంత కాంతా
 యసం। వంగం నాగ పవిప్రవాళ విమలా మాణిక్య

---

* రసభస్మయనగా నిట రససిందూరమని తెలియవలెను. అటుల రసభస్మస్థానమున రససిందూరమును జేర్చుట వృద్ధవైద్యసాంప్రదాయము.

గారుత్మతం। తాప్యం మౌక్తిక పుష్పరాగ జలజం వైడూర్యకం శుల్బకం। శుక్తి స్తాలక మభ్ర హింగుల శిలా గోమేద నీలం సమం॥ గోక్షూరైః ఫణివల్లి సింహ వదనా ముండీకణాచిత్రకైః। ఇక్షు చ్ఛిన్నరుహాహార ప్రియ జయాద్రాఖ్యా వరీజద్రవైః। కంకోలై ర్మద నాగ కేసరజలై ర్భావ్యం పృథక్స స్తథా। భాండే సింధు భృతే మృగాంకవదయం పాచ్యః క్రమాగ్నా దినం॥ భూయః ప్రాక్ సముదాహృతై ర్ద్రవవరైః తంభావయే త్పూర్వవత్। పశ్చాత్తుల్య విభాగ శీతల రజః కస్తూరికాభావనా। గోప్యాద్గోప్యతరం రసాయనమిదం శ్రీశంకరేణోదితం। గుంజా సింధు యుతః కణా మధు యుతః శోఫేన పాండ్వామయే॥ వాతవ్యాధి ముపద్రవైశ్చ సహితం మేహాం స్తథావింశతిం। సంయోజ్యాస్తు హరీతకీ గుడయుతో వాతాస్రకేదుర్జయే। గంభీ రేచ గుడూచిసత్వ చపలాక్షౌద్రై స్తు సంయోజితః। చాధ్మా నారుచిశూలమాంద్యకసనా పస్మార వాతోదరాన్॥ శ్వాసాన్ సంగ్రహణీ హలీమక మథో సర్వజ్వరాన్ నాశయేత్। ధాతూన్ పోషయతి క్షయం క్షపయతి శ్యామాశతం యౌవనం। ప్రౌఢాటోపయుతం కరోతి సహసా తారుణ్య గర్వోద్ధతం। సిద్ధో రాజమృగాంక ఏవజయతి స్వస్వానుపానై ర్గదాన్॥    వై-చిం.

శుద్ధిజేయబడిన పాదరసము, శుద్ధిజేయబడిన గంధకము, స్వర్ణభస్మ, రజతభస్మ, శుద్ధిజేయబడిన కఫరి, వైక్రాంతభస్మ, కాంతభస్మ, లోహభస్మ, వంగభస్మ, నాగభస్మ, వజ్రభస్మ, విద్రుమభస్మ, తార

మాక్షికభస్మ, మాణిక్యభస్మ, గారుత్మత (గరుడపచ్చ) మణిభస్మ, స్వర్ణమాక్షికభస్మ, మౌక్తికభస్మ, పుష్యరాగభస్మ, శంఖభస్మ, వైడూర్యభస్మ, తామ్రభస్మ, శుక్తిభస్మ, శుద్ధిజేయబడిన తాళకము, అభ్రకభస్మ, శుద్ధిజేయబడిన హింగుళము, శుద్ధిజేయబడిన మణిశిల, గోమేదమణిభస్మ, ఇంద్రనీలభస్మ వీనినెల్ల సమాంశములుగ గ్రహించవలెను. తొలుత రసగంధకములను కజ్జలిగా నూరి యందు మిగిలినవానినెల్ల జేర్చి పల్లేరు కషాయముతోను, తమలపాకుల రసముతోను, అడ్డసరపాకు రసముతోను, బోడతరపు రసముతోను, పిప్పళ్ల కషాయముతోను, చిత్రమూలపు కషాయముతోను, చెఱకు రసముతోను, తిప్పతీగె రసముతోను, ఉమ్మెత్తాకు రసముతోను, సోమెంతాకు రసముతోను, ద్రాక్షపండ్ల కషాయముతోను, పిల్లిపీచర (పిల్లి తేగల) స్వరసముతోను, గలిజేరు స్వరసముతోను, సదాపాకు రసముతోను, అతిమధుర కషాయముతోను, బూరుగవేళ్ల కషాయముతోను, ఆరెపువ్వు కషాయముతోను, జాజికాయ కషాయముతోను, బలా కషాయముతోను, అతిబలా కషాయముతోను, నాగబలా కషాయముతోను, మహాబలా కషాయముతోను, కురువేరు వేరు కషాయముతోను, లవంగపట్ట కషాయముతోను, లవంగాల కషాయముతోను, తక్కోలములకషాయముతోను, కస్తూరీ జలముతోను, నాగకేసరముల కషాయముతోను ప్రత్యేకముగ నేడుదినములు చొప్పున మర్దించి, యొక గోళముజేసి యెండించవలెను. ఈ గోళము నొక గుడ్డయందు మూటగట్టి, దీనిని లవణ మధ్యమున నుండునట్లొక భాండమునం దమర్చి క్రమాగ్నులతో రాజమృగాంకమునువలె నొకదినము పాకము జేయవలెను. పిమ్మట స్వాంగశీతలమున నందుండి జాగ్రత్తగా నా యౌషధమును మాత్రము గ్రహించి, తిరిగి పూర్వోక్త కషాయములతో ప్రత్యేకముగా నేడేసి దినములు చొప్పున మర్దించి, కడపట అందు పచ్చకర్పూరమును, కస్తూరిని సమభాగములుగ జేర్చి చక్కగా గలియ నూరవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది నవరత్న రాజమృగాంకరస

మునబడును. ఈ యౌషధమును నాలుగు గురిగింజల యెత్తు గ్రహించి పిప్పలి చూర్ణముతోను తేనెతోను గలిపి సేవించిన శోఫతోగూడిన పాండువు శమించును. మరియు, సుపద్రవములతోగూడిన వాతవ్యాధులును, నిరువది ప్రమేహములును శమించును. కరక్కాయ చూర్ణము, బెల్లము ఈ యనుపానములతో సేవించిన వాతరక్తము శమించును. తిప్పసత్తు, పిప్పలిచూర్ణము తేనె వీనితో గలిపి సేవించిన గంభీరమగు వాతరక్తము శమించును. మరియు ననుపానవిశేషములతో సేవించిన ఆధ్మానము, అరుచి, శూల, అగ్నిమాంద్యము, కాస, అపస్మారము, వాతోదరము, శ్వాస, గ్రహణి, హలీమకము, సమస్త జ్వరములు, క్షయము వీని నెల్ల శమింపజేయును. ధాతువులను బోషించును. అధికమైన వీర్యశక్తిని గలిగించును.

## (3) రత్నగర్భ పోటలీ రసము

శ్లో॥ రసం వజ్రం హేమతారం నాగం లోహం తథాభ్రకం।
తుల్యాంశం మారితం యోజ్యం ముక్తా మాణిక్య
విద్రుమం॥ రాజావర్తం చ వైక్రాంతం గోమేదం పుష్ప
రాగకం। శంఖం చ తుల్య తుల్యాంశం సప్తాహం చిత్ర
కద్రవైః॥ మర్దయిత్వా విచూర్ణ్యాథ తేనాఽఽపూర్య
వరాటకాః। టంకణం రవిదుగ్ధేన పిష్ట్వా తన్ముద్రణం
చరేత్॥ మృద్భాండే తాః సుసంయంత్ర్య సమ్యక్
గజపుటే పచేత్। ఆదాయ చూర్ణయే త్సమ్యక్
నిర్గుండ్యాః సప్తభావనాః॥ ఆర్ద్రికస్య రసైః సప్త చిత్ర
కస్యైకవింశతిః। ద్రవైర్భావ్యం తతః శుష్కం
దేయం గుంజా చతుష్టయం। క్షయరోగం నిహంత్యాశు
సత్యం శివ ఇవాంధకం॥ యోజయే త్పిప్పలీ క్షౌద్రై

స్వఘృతై ర్మరిచైశ్చవా। పోటలీ రత్నగర్భేయం సర్వ
రోగహరామతా॥ యో-ర

రససిందూరము, వజ్రభస్మ, స్వర్ణభస్మ, రజతభస్మ, నాగభస్మ, లోహభస్మ, అభ్రకభస్మ, మౌక్తికభస్మ, స్వర్ణమాక్షికభస్మ, విద్రుమ భస్మ, రాజావర్తభస్మ, వైక్రాంతభస్మ, గోమేదభస్మ, పుష్యరాగభస్మ, శంఖభస్మ వీనిని సమాంశములుగ గ్రహించి ఖల్వమునందుంచి చిత్రమూల కషాయముతో నేడుదినములు చక్కగా మర్దించి, యెండించి మెత్తగా చూర్ణించవలెను. ఈ చూర్ణమును శుద్ధిజేయబడిన గవ్వల యందు పూరించి వాని ముఖములకు జిల్లేడు పాలతో నూరబడిన టంకణ పిష్టముచే బూసి యెండించవలెను. పిమ్మట నీ గవ్వల నొక చిన్న భాండమున నుంచి శరావముచే గప్పి దృఢముగా సంధిలేపనముజేసి యొక గజపుట మధ్యమున దాని నుంచి పాకముజేయవలెను. స్వాంగశీతలమున నా భాండమునుండి యా గవ్వలను గ్రహించి మెత్తగా చూర్ణించి, వావిలాకు రసముతో నేడుదినములును, అల్లపురసముతో నేడుదినములును, చిత్రమూల కషాయముతో నిరువదియొకదినములును మర్దించి యెండించవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది రత్నగర్భ పోటలీరసమనబడును. దీనిని నాలుగు గురిగింజల ప్రమాణమున పిప్పలి చూర్ణము తేనెయను అనుపానములతో జేర్చి గాని, మిరియాల చూర్ణము నెయ్యి అను అనుపానములతో జేర్చి గాని సేవించిన రాజయక్ష్మ శమించును. మరియు నిది సమస్త వ్యాధులను బోగొట్టును.

---

## 6–వ అధ్యాయము

# పరిశిష్టము *

## మహాపుటము

శ్లో॥ నిమ్నవిస్తరతః కుండే ద్విహస్తే చతురస్రకే।
వనోత్పల సహస్రేణ పూరితే పుటనౌషధం॥
క్రౌంచ్యాం రుద్ధం ప్రయత్నేన పిష్టికోపరినిక్షిపేత్।
వనోత్పల సహస్రార్ధం క్రౌంచికోపరివిన్యసేత్।
వహ్నిం ప్రజ్వాలయేత్తత్ర మహాపుట మిదం స్మృతం॥
ర–ర–స.

రెండుమూరల లోతును, రెండుమూరల వెడల్పును గలిగి చతురస్రముగ నుండు గోతిలో వేయి పిడకలను పరచి, వాటిపై నౌషధ సహితమైన శరావసంపుటమును (లేక) మూషాసంపుటము నుంచి, దీనిపై నైదువందల పిడకలను జేర్చి యగ్నిని జ్వలింపజేసిన యయ్యది మహాపుటమని వ్యవహరింపబడును.

---

* రసోపరసాదుల శోధన మారణాది విధానములకు అవసరములగు యంత్రపుటాదుల వివరణము లాయా ప్రసంగములందు జేయబడినవి. ఇంకను అవసరములని దోచిన మరికొన్ని పుటములయొక్కయు, యంత్రముల యొక్కయు, మాన పరిభాషయొక్కయు వివరణ మీపరిశిష్ట భాగమున జేయబడుచున్నది.

## వరాహపుటము

శ్లో॥ ఇత్థంచారత్నికే కుండే పుటం వారాహముచ్యతే॥
ర-ర-స.

ఒక జానెడు లోతును, వెడల్పును గలిగి చతురస్రముగ నుండు గోతిలో పిడకలను భూమి మట్టమువరకు పేర్చి, వాటిపై శరావసంపుటము నుంచి, దానిపై నడుగుభాగమున జేర్చినవానిలో సగము పిడకలను పేర్చి యగ్నిని జ్వలింపజేసిన యయ్యది వరాహపుటమని చెప్పబడును.

## కపోతపుటము

శ్లో॥ యత్పుటం దీయతే భూమావష్ట సంఖ్యైర్వనోత్పలైః।
బద్ధ్వా సూతక భస్మార్థం కపోతపుటముచ్యతే॥
ర-ర-స.

ఔషధసహితమైన శరావసంపుటమును భూమిమీదనే పేర్చబడిన యెనిమిది పిడకల మధ్య నుంచి యగ్నిని జ్వలింపజేసిన యయ్యది కపోతపుటమని వ్యవహరింపబడును.

## విద్యాధర యంత్రము

శ్లో॥ యంత్రం విద్యాధరం జ్ఞేయం స్థాలీ ద్వితయసంపుటాత్।
చుల్లీం చతుర్ముఖీం కృత్వా యంత్రభాండం నివేశ
యేత్॥ తత్రౌషధం వినిక్షిప్య నిరుంధ్యాద్భాండకా
ననం। యంత్రం విద్యాధరం నామతంత్రజ్ఞైః పరికీర్తితం॥
ర-ర-స.

సమానముగనుండు రెండు భాండములను గ్రహించి, యందొక భాండములో నౌషధద్రవ్యము నుంచి దానిపై రెండవ భాండమును బోర్లించి, వీని ముఖసంధికి దృఢముగా సీలమన్నుబూసి యెండించవలెను. నాలుగుమూలలు గల పొయ్యిమీద నౌషధద్రవ్యము గల

భాండము నుంచి యడుగుభాగమున నగ్నిని జ్వలింపజేయవలెను. ఇయ్యది విద్యాధరయంత్ర మనబడును. పాదరసమున కూర్ధ్వపాతనసంస్కారము చేయుట కీ యంత్ర ముపకరించును.

## రెండవ విద్యాధర యంత్రము

శ్లో॥ స్థాలికోపరివిన్యస్య స్థాలీం సమ్యక్ నిరుంధ్య చ।
ఊర్ధ్వస్థాల్యాం జలం క్షిప్త్వా వహ్నిం ప్రజ్వాలయేదధః॥
ఏతద్విద్యాధరం యంత్రం హింగులాకృష్టహేతవే॥
ర-ర-స.

సమానముగనుండు రెండు భాండములను గ్రహించి యందొక భాండములోపల హింగుళచూర్ణము నుంచి, యా భాండముయొక్క ముఖమును రెండవ భాండముయొక్క యధోభాగముచే గప్పవలెను. పిమ్మట వీటి సంధికి దృఢముగా సీలమన్ను బూసి, యెండించి యౌషధ ద్రవ్యముంచిన భాండమును పొయ్యిమీద నుంచి, యూర్ధ్వస్థ భాండములో శీతల జలమును బూరించి యధోభాగమున నగ్నిని జ్వలింపజేయవలెను. ఇయ్యది శుద్ధహింగుళమునుండి పాదరసమును ఆకర్షించుట కుపకరించు విద్యాధరయంత్రమని చెప్పబడును.

## మానపరిభాష

శ్లో॥ త్రుటిః స్యాదణుభిః షడ్భిః త్రైర్లిక్షా షడ్భిరీరితా।
తాభిః షడ్భిర్భవేద్యూకః షడ్యూకా స్తద్రజః స్మృతం॥
షడ్రజః సర్షపః ప్రోక్తస్తైః షడ్భిర్యవ ఈరితః।
ఏకాగుంజాయవైస్త్రైః షడ్భిర్నిష్పావ స్తు ద్విగుంజకం॥
స్యాద్గుంజాత్రితయంవల్లో ద్వావల్లౌమాష ఉచ్యతే।
ద్వామాషౌధరణంతే ద్వేశాణ నిష్కకలాః స్మృతాః॥
నిష్కద్వయంతు వటకః సచకోల ఇతీరితః।

స్యాత్కోలద్వితయం తోలః కర్షో నిష్క చతుష్టయం॥
ఉదుంబరం పాణితలం సువర్ణం కవలగ్రహః।
అక్షం బిడాలపదకం శుక్తిః పాణితలద్వయం॥
శుక్తిద్వయం పలం కేచిదన్యే శుక్తిత్రయం విదుః॥
(చతుస్తోలైః పలం భవేదితి కేచన) ర-ర-స.

6 అణువులు — 1 తృటి
6 తృటులు — 1 లిక్ష
6 లిక్షలు — 1 యూక
6 యూకలు — 1 రజస్సు
6 రజస్సులు — 1 సర్షపము
6 సర్షపములు — 1 యవ
6 యవలు — 1 గుంజ
2 గుంజలు — 1 నిష్పావము
3 గుంజలు — 1 వల్లము
2 వల్లములు — 1 మాషము = 6 గుంజలు
2 మాషములు — 1 ధరణము
2 ధరణములు — 1 శాణము, నిష్కము, కల, టంకము
2 నిష్కములు — 1 వటకము, కోలము
2 కోలములు (లేక) 4 నిష్కములు — 1 తులము (లేక) 1 కర్షము, ఉదుంబరము, పాణితలము, సువర్ణము, కవలగ్రహము, అక్షము, బిడాలపదకము, శుక్తి
4 తులములు — 1 పలము (కొందరి మతమున)
2 శుక్తులు — 1 పలము (మరికొందరి మతమున)
3 శుక్తులు — 1 పలము

## 7-వ అధ్యాయము

# విషవర్గము

## విష - ఉపవిషములు

విషములు సహజ - కృత్రిమభేదముచే రెండువిధము లుగా నుండును. అందు తీక్ష్ణ-ఉష్ణ-రూక్ష-విశద-వ్యవాయి-ఆశుకర-లఘు-వికాశి-సూక్ష్మ-అవ్యక్తరస-అపాకి యను లక్షణములను బుట్టుకతోనే గలిగియున్నట్టిది సహజవిష మనియు, గొన్ని విరుద్ధ ద్రవ్యముల సంయోగముచే నై లక్ష ణములను గలిగియుండునట్లు సిద్ధముజేయబడినట్టిది కృత్రిమ విషమనియు దెలియనగును. "ఏతైర్విమర్దితః సూతః ఛిన్న పక్షః ప్రజాయతే। ముఖం చ జాయతే తస్య ధాతూంశ్చ గ్రసతేతరాం॥" ఆ-ప్ర.—అని చెప్పబడుటచే నిట విష ములుగూడ పాదరసమునకు జారణ-బంధనాది సంస్కార ములకై యుపకరించునవి యగుటచే విశేషముగ నందలి సహజవిషములే వర్ణింపబడుచున్నవి. అందును, "విషం ప్రాణహరం ప్రోక్తం వ్యవాయి చ వికాశి చ। ఆగ్నేయం వాతకఫహృ ద్యోగవాహి మదావహం॥ తదేవ యుక్తి యుక్తంతు ప్రాణదాయి రసాయనం। పథ్యాశినాం త్రిదో షఘ్నం బృంహణం వీర్యవర్ధనం॥" ఆ-ప్ర.—అని చెప్ప బడుటచే విషము సహజముగా ప్రాణహారియైనను యుక్తి యుక్తముగా ప్రయోగింపబడినచో శరీరమున కుపకారము జేయునదియే యగునని దెలియుచుండుటచే వాని ప్రయోగ విధానములే యిట వర్ణింపబడును. మిగిలిన విషయముల

గురించి పాఠకమహాశయులు నగదతంత్రమునుజూడగోరెదము.

ఈ సహజవిషములు తిరిగి స్థావరములు, జంగమములు అని రెండువిధములుగా నుండును. అందు మూలము, పత్రము, ఫలము, పుష్పము, త్వక్కు, క్షీరము, సారము, నిర్యాసము, ధాతువులు (ఖనిజములు), కందము అను నీ పదింటిని యాశ్రయించి యుండునట్టిది స్థావరవిషమనబడును. దృష్టి, నిశ్వాసము, దంష్ట్రము, నఖము, మూత్రము, పురీషము, శుక్రము, లాల, ఆర్తవము, ముఖసందంశము, విశర్ధితము, తుండము, అస్థి, పిత్తము, శూకము, శవము అను నీ పదియారింటిని యాశ్రయించియుండునట్టిది జంగమవిషమని చెప్పబడును. ఈ రెండువిధములగు సహజవిషములలో స్థావరవిషములకు సంబంధించినట్టి "వత్సనాభి, అర్కము, స్నుహి, లాంగలి, గుంజ, కరవీరము, విషముష్టి, అహిఫేనము, ధత్తూరము, నేపాళము, భల్లాతకము, విజయ అనెడి ద్రవ్యములును, జంగమవిషమునకు సంబంధించినట్టి సర్పవిషము, పిత్తములు అనెడి ద్రవ్యములును ఈ ప్రకరణమున వివరింపబడుచున్నవి.

## స్థావరవిషములు

### వత్సనాభఃగి - వస(త్స)నాభి

N. Order—Ranunculaceae.

హిందీ — వసనాగ, మరాఠి — వసనాగ, గుజరాతీ — వఛనాగ, మలయాళం — వసనాభి, కర్ణాటకం — వసనాభి, ద్రావిడం — వసనాభి, లాటిన్ — Aconitum Ferox, ఇంగ్లీషు — Aconite.

శ్లో॥ సిందువార సదృక్పత్రో వత్సనాభ్యాకృతి స్తథా।
యత్పార్శ్వేనతరోర్వృద్ధిః వత్సనాభః సభాషితః॥
భా-ప్ర.

వత్సనాభిచెట్టుయొక్క ఆకులు వావిలాకులవలె నుండును. దూడ యొక్క బొడ్డువంటి యాకృతిగల కందముండును. ఈ వృక్షముయొక్క పార్శ్వములం దెట్టి వృక్షమును ఉత్పత్తిగా నేరదు.

## వత్సనాభిగుణములు

శ్లో॥ విషం రసాయనం బల్యం వాతశ్లేష్మ వికారనుత్।
కటుతిక్త కషాయంచ మదకారి సుఖప్రదం॥
వ్యవాయి శీతనుద్గ్రాహి కుష్ఠవాతాస్ర నాశనం।
అగ్నిమాంద్యం శ్వాసకాసం ప్లీహోదర భగందరాన్॥
గుల్మపాండు వ్రణార్శాంసి నాశయే ద్విధిసేవితం॥ ఆ-ప్ర.

వత్సనాభి కటురసమును, తిక్తకషాయానురసములను గలిగి యుండును. విధిపూర్వముగ సేవించినచో రసాయనమగును. బలమును గలిగించును. మత్తును గలిగించును. సుఖప్రదమగును. వ్యవాయిగుణము గలది. మలాదులను నిరోధించును. వాత కఫజ వికారములను బోగొట్టును. శైత్యమును తగ్గించును. కుష్ఠము, వాతరక్తము, అగ్నిమాంద్యము, శ్వాస, కాస, ప్లీహవృద్ధి, భగందరము, గుల్మము, పాండువు, వ్రణము, అర్శస్సు అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) భేదములు

వత్సనాభి మహావిషములలో నొకటిగా పఠింపబడి నది. "యః కందో గోస్తనాకారో నదీర్ఘః పంచమాంగు

లాత్। నస్థూలో౽గోస్తనాదూర్ధ్వం ద్వివిధో వత్సనాభకః॥
ఆశుకారీ లఘుస్త్యాగీ శుక్లః కృష్ణో౽న్యథాభవేత్॥''
ఆ-ప్ర.—అని చెప్పబడుటంబట్టి వత్సనాభి యను కంద
విషము శ్వేత-కృష్ణవర్ణ భేదముచే రెండువిధములుగా నుండు
నని దెలియుచున్నది. ఈ కందము గోస్తనముయొక్క
ఆకృతిగలిగి యైదంగుళములకు హెచ్చుగాని దైర్ఘ్యమును,
గోస్తనముయొక్క స్థూలత్వమునకు మించనట్టి స్థౌల్యమును
గలిగియుండును. వీనిలో శుక్లకందము ఆశుకారి యగుట
చేతను, లఘువుగ నుండునది యగుటచేతను పరిత్యజింపదగి
యుండుననియు, కృష్ణకందము పై దానికి విరుద్ధముగ నుండు
నది యగుటచే ''ప్రయోజ్యో౽గహరణే జారణాయాం
రసాయనే॥'' ఆ-ప్ర.—అని చెప్పటంబట్టి వ్యాధులందు
బ్రయోగించుటకును, రసాయన ప్రయోగమునకును, పాద
రస జారణ సంస్కారమునకును యోగ్యముగ నుండుననియు
డెలియుచున్నది. ఇట్టుల బ్రమాణము గానుపించుచున్నను
వైద్యక వ్యవహారమున కృష్ణవర్ణముగల కందమున కంతగా
ప్రయోగమున్నట్లు గానరాదు. ఇట్టి వ్యత్యాసమునకు
గారణ మూహింపదగియుండును. వత్సనాభి యథోక్తవిధాన
మున శుద్ధము గావించియే యౌషధయోగములందు జేర్చు
కొనదగియున్నది. ఇది యగ్నిమాంద్యాది వ్యాధిహారమైనను
విశేషముగ జ్వరహరౌషధములలో సంయోగమును గలిగి
యున్నది. కేవలము దీనికి శోధనమేగాకుండ మారణము
గూడ జెప్పబడియున్నది. సమటంకణ సంయోగముచే
విషము మారితమగునని ఆయుర్వేదప్రకాశమను గ్రంథమున

దెలుపబడినది. ఈ శోధనమారణములచే వత్సనాభి వ్యాధులందు నిరపాయముగ పనిచేయగలదని దెలియుచున్నది. వత్సనాభి చేరిన యౌషధములలో టంకణముగూడ చేర్చబడుచుండుట సర్వవిదితమేగదా! రసౌషధములలో వత్సనాభియొక్క ప్రయోగము విశేషముగా గలదు. "విషపానం దంశానాం విషపీతే దంశనం చాస్త్రే॥" చ-చి-అ-23-50.—అని చరకమున చెప్పబడియున్నది. దీనిని బట్టి స్థావరవిషమును, జంగమవిషమును అన్యోన్య విరుద్ధములని దెలియుచుండుటచే వత్సనాభి జంగమ విషహరమగునని జెప్పవచ్చును. ఇందుకు దగినట్లుగా వాగ్భటుడు వృశ్చిక విషమున నాభిప్రయోగమును దెలిపియున్నాడు. చరకవచనమునుబట్టి విషపానము యుక్తమని దెలియుచున్నను వాగ్భటుడు కేవలము బహిఃప్రయోగమును మాత్రమే యేల దెలిపియుండెనో దెలియకున్నది. అయినను వ్యవహారమున వృశ్చిక విషమున వత్సనాభిని కల్కముగా నూరి లేపనము జేయుట గానబడుచున్నది.

## (2) వత్సనాభి శోధనవిధానము.

శ్లో॥ విషభాగాన్ చణకవత్ స్థూలాన్ కృత్వాతుభాజనే।
తత్రగోమూత్రకం క్షిప్త్వాప్రత్యహం నిత్యనూతనం॥
శోషయే త్త్రిదినాదూర్ధ్వంధృత్వాతీవ్రాతపేతతః।
ప్రయోగేషు ప్రయుంజీత భాగమానేన తద్విషం॥

ఆ-ప్ర.

వత్సనాభికందమును చిన్న చిన్న ముక్కలుగా గోసి యొక పాత్రయందుంచి, అందు ఆ ముక్కలు మునుగునంత గోమూత్రమును బోసి యొక రాత్రి యూరబెట్టవలెను. మరునాడా ముక్కలను వేరొక పాత్రలోనికి గ్రహించి యెండబెట్టవలెను. పిమ్మట పూర్వరాత్రియందు వలెనే యా ముక్కలను క్రొత్తదగు గోమూత్రమునందుంచి యూరబెట్టవలెను. ఇటుల మూడురాత్రులు గోమూత్రమునం దూరబెట్టి నాల్గవ దినమునుండి తీక్ష్ణమగు నెండలో నుంచి బాగుగా నెండించవలెను. ఇటుల జేసినచో వత్సనాభి పరిశుద్ధమై యోగములందు ప్రయోగింప నర్హమగును.

## (3) వత్సనాభికి మారణవిధానము

శ్లో॥ సటంకణ సంపిష్టం తద్విషం మృతముచ్యతే।
యోజయేత్సర్వరోగేషు నవికారం కరోతిచ॥

ఆ-ప్ర.

శుద్ధిజేయబడిన వత్సనాభిని ఖల్వమునందుంచి, అందుకు సమముగా శుద్ధటంకణచూర్ణమును జేర్చి యా రెండింటిని కలిపి మూడుదినములు బక్కగా మర్దించినచో విషము మారితమై అనగా స్వల్పశక్తివంతమై యోగములందు జేర్చబడినను ఎట్టి వికారములను గలిగింపక రోగ నాశియగును.

## (4) వత్సనాభికి మాత్రానిరూపణము

శ్లో॥ యవాష్టకం భవేద్యావ దభ్యస్తం తిలమాత్రయా।
సర్వరోగహరం నృణాం జాయతే శోధితం విషం॥

ఆ-ప్ర.

శోధిత మారితమైన వత్సనాభిని విధిపూర్వకముగ నొక తిల ప్రమాణమున నారంభించి యెనిమిది యవల ప్రమాణమనువరకు సేవిం

చుట కభ్యసించినచో సమస్తవ్యాధులును శమించును. ఇట, "ఏవం యవాప్త పర్యంతం పరామాత్రాధికానహి" అని చెప్పబడుటచే హీన మాత్ర యొక తిలమనియు, అధికమాత్ర యెనిమిది యవలనియు తెలియ నగును.

## (5) వత్సనాభి సేవనయందు పథ్యము

శ్లో॥ ఘృతంక్షీరం సితాంక్షౌద్రం గోధూమాం స్తండులాన్ యవాన్। మరిచం సైంధవం ద్రాక్షాం మధురం పానకం హితం॥ బ్రహ్మచర్యం హితం దేశం హితం కాలం హితం జలం। విషస్య సేవకోమర్త్యో భజేదతి విచక్షణః॥ ఆ–ప్ర.

నెయ్యి, పాలు, చక్కెర, తేనె, గోధుమలు, శాలిధాన్యపు బియ్యము, యవలబియ్యము, మిరియములు, సైంధవలవణము, ద్రాక్ష పండ్లు, తియ్యగను శీతలముగను నుండు పానకములు, బ్రహ్మచర్యము, శీతలప్రదేశమున నుండుట, శీతలమైన కాలము, శీతలజలపానము ఇవి యన్నియు విషమును సేవించువానికి హితములని తెలియవలెను.

## (6) వత్సనాభిని అధికమాత్రగా సేవించుటవలన గలుగు వికారములు

శ్లో॥ మాత్రాధికం యదామర్త్యః ప్రమాదా ద్భక్షయే ద్విషం। అష్టౌ వేగా స్తదా తేన జాయన్తే తస్య దేహినః॥ ఉద్వేగః ప్రథమే వేగే ద్వితీయే వేపథుర్భవేత్। వేగే తృతీయే దాహఃస్యా చ్చతుర్థే పతనం భువి॥ ఫేనంపమే త్పంచమేతు షష్ఠే వైకల్యమేవ చ। జడతా సప్తమే

వేగే మరణం చాష్టమే భవేత్॥ విషవేగా నితిజ్ఞాత్వా
మంత్రద్రవ్యై ర్వినాశయేత్। యావన్నాష్టమవేగంతు
సంప్రాప్నోతి హిమానవః॥ ఆ-ప్ర.

వత్సనాభిని ప్రమాదవశమున నతిమాత్రగా భుజించినచో నట్టి మనుజున కెనిమిది వేగములు సంభవించును. అందు మొదటివేగమున ఉద్వేగమును, రెండవ వేగమున శరీరకంపమును, మూడవ వేగమున దాహమును, నాల్గవ వేగమున భూపతనమును, అయిదవ వేగమున ఫేనవమనము (నురుగు గక్కుట)ను, ఆరవ వేగమున నంగవైకల్యమును, ఏడవ వేగమున జడత్వమును, ఎనిమిదవ వేగమున మరణమును సంభవించును. ఇట్టి వేగాంతరములను దెలిసి యెనిమిదవ వేగము సంభవించుటకు ముందుగనే అట్టి వికారములను మంత్రౌషధములచే శమింపజేయుటకు బ్రయత్నింపవలెను.

## (7) విషవికారశమనోపాయములు

శ్లో॥ అతిమాత్రం యదాభుక్తం వమనం తస్యకారయేత్।
అజాదుగ్ధం దదేత్తావద్యావద్వాన్తి ర్నజాయతే॥ అజాదుగ్ధం యదాకోష్ఠే స్థిరీభవతి దేహినః। విషవేగం తదోత్తీర్ణం జానీయాత్కుశలోభిషక్॥ ఆ-ప్ర.

వత్సనాభి నతిమాత్రగా భుజించుటవలన గలుగు వికారములందు వెంటనే వమనము జేయించవలెను. మేకపాలను వాంతులు నిలిచిపోవు వరకు నిచ్చుచుండవలెను. ఎప్పుడు వాంతులు నిలిచిపోయి పానము జేసిన మేకపాలు కోష్ఠమునందు స్థిరీభూతమగునో అప్పుడు విషవేగము అడ్డిపోయినట్లుగా దెలియవలెను. అనగా విషవికారములు శమించినట్లు దెలియవలెనని భావము.

## (8) ప్రయోగములు

### 1. వృశ్చిక - ఉచ్చిటింగవిషమున వత్సనాభి ప్రయోగము :

"అస్తే వృశ్చిక దష్టానాం సముదీర్ణే భృశంవిషే।
విషే ణాలేపయేద్దంశం ఉచ్చిటింగేఽప్యయంవిధిః॥"
హా-ఉ. అ 37.

తీవ్రమైన తేలువిషమునందు చేయదగిన క్రియలనన్నిటిని చేసినను అయ్యది శమింపకపోయినచో వత్సనాభిని మెత్తగా నూరి దంశమునకు లేపనము జేసిన యయ్యది శమించును. ఇటులనే ఉచ్చిటింగ (పురికోస) విషమునందుగూడ లేపనము జేసిన యయ్యది శమించును.

### 2. తిమిరమునందు వత్సనాభి ప్రయోగము :

"విషంచైక మజాక్షీరే కల్పితం ఘృతధూపితం।
విషంసర్పిః సితాక్షౌద్రం తిమిరాపహమంజనం॥"
ర-భా.

వత్సనాభిని మేకపాలతో మెత్తగా నూరి, యా కల్కము నొక రాగిపళ్లెమునకు బూసి ఘృతముతో ధూపము వేసి అనగా గాలిలేని ప్రదేశమున మూడు ఇటికిరాళ్లను పొయ్యివలె పరచి వాటిపై నా రాగి పళ్లెమును విషకల్కము బూసినవైపు క్రిందుగా నుండునట్లుంచవలెను. పిమ్మట నా రాళ్లమధ్య నొక శరావమునుంచి అందు నెయ్యిబోసి, వత్తి వేసి వెలిగించవలెను. ఆ దీపమునుండి వచ్చు పొగయంతయు నా విష కల్కమున కంటుకొనును. అటుల బాగుగా ధూపితమైన పిదప నది యంతయు కాటుకవలె సిద్ధమగును. దానిని జాగ్రత్తగా గ్రహించి నేత్రముల కంజనము వేసిన తిమిరరోగము శమించును. మరియు, వత్స నాభిని మెత్తగానూరి, యందు ఘృతమును, చక్కెరను, తేనెను జేర్చి

బాగుగా కలియనూరి దీనితో కళ్ల కంజనము వేసినను తిమిరరోగము శమించును.

3. రసాయనమునకు వత్సనాభి కల్పము :

"ప్రథమే సర్షపీమాత్రా ద్వితీయే సర్షపద్వయం।
తృతీయేచ చతుర్థేచ పంచమే దివసే తథా॥
షష్ఠేచ సప్తమేచైవ క్రమవృద్ధ్యా వివర్ధయేత్।
సప్తసర్షపమాత్రేణ ప్రథమం సప్తకం నయేత్॥
క్రమహాన్యా తథా దేయం ద్వితీయే సప్తకేవిషం।
యవమాత్రం విషం దేయం తృతీయే సప్తకేక్రమాత్॥
వృద్ధ్యాహాన్యా ప్రదాతవ్యం చతుర్థే సప్తకేతథా।
ఏవంసాత్మ్యే సమాయాతేపరాంమాత్రాంభిషగ్వరః॥
స్థిరీకుర్యాద్యథేచ్ఛంతు తతస్త్యాగంతుకారయేత్।
సేవనా క్రమహాన్యాఽయం విషకల్ప ఇతీరితః॥
క్షీరాశిని ప్రయోక్తవ్యం రసాయనరతే నరే।
పథ్యైః స్వస్థమనాభూత్వా తదాసిద్ధిర్నసంశయః॥"

ఆ-ప్ర.

యథోక్తవిధానమున శుద్ధిజేసిన వత్సనాభిని మొదటిరోజున నొక సర్షప ప్రమాణమున నారంభించి రెండవదినమునుండి యేడవదినము వరకు నొక్కొక్క సర్షపము చొప్పున మాత్రను వృద్ధిపరచుచు సేవించవలెను. ఇటుల జేయుటవలన నేడవదినమున నేడు సర్షపముల ప్రమాణములో వత్సనాభిని సేవించినట్లగును. ఎనిమిదవదినమునగూడ నేడు సర్షపముల ప్రమాణముననే సేవించవలెను. తొమ్మిదవదినము నుండి యొక్కొక్క సర్షపము చొప్పున తగ్గించుకొనుచు పదునాలగవ దినమువరకు సేవించవలెను. ఇటుల జేయుటవలన పదునాలగవదినమున

తిరిగి యొక సర్షప ప్రమాణములోనే విషమును సేవించినట్లగును. పది యైదవదినమున నొక యవప్రమాణమున నారంభించి యిరువదియొకటవ దినమువరకు నొక్కొక్క యవ చొప్పుననే మాత్రను వృద్ధిపరచుచు విషమును సేవించవలెను. ఇటుల జేయుటవలన నిరువదియొకటవదినమున నేడు యవల పరిమితిలో విషమును సేవించినట్లగును. ఇరువదిరెండవ దినమునగూడ నేడు యవల పరిమితిలోనే విషమును సేవించవలెను. ఇరువదిమూడవదినమునుండి యిరువదియొనిమిదవదినమువరకు నొక్కొక్క యవ చొప్పున మాత్రను తగ్గించుకొనుచు విషమును సేవించవలెను. ఇటుల జేయుటవలన నిరువదియొనిమిదవదినమున తిరిగి యొక యవ ప్రమాణముననే విషమును సేవించినట్లగును. ఇటుల విషము శరీరమునకు సాత్మ్యమగునట్లు క్రమవృద్ధి - హానిప్రమాణములలో దానిని సేవించుటయే విషకల్పమనబడును. ఇటుల విషము శరీరమునకు సాత్మ్యమైన పిమ్మట "యవమాత్రం గ్రసేత్ స్వచ్ఛః" అని చెప్పబడినట్లు ఒక యవ ప్రమాణమును మాత్రమే గ్రహించి రసాయనార్థియగు మనుజుడు ప్రతి నిత్యము విషమును సేవింపుచు క్షీరమును పానముజేయుచుండవలెను. మరియు స్వచ్ఛమనస్కుడై బ్రహ్మచర్యాది నియమముల ననుసరించుచుండవలెను. ఇటుల జేసిన నిశ్చయముగ రసాయనసిద్ధి యేర్పడును.

## (9) యోగములు *

### 1. కాలకూటరసము

శ్లో॥ రుద్రసంఖ్యామృతంచైవ త్రిభాగం సూతమేవచ।
గంధకం పంచభాగంచ శిలాయా ఋతుభాగకం॥

---

* రసౌషధ సామాన్యమున వత్సనాభికి హెచ్చు ప్రయోగమేగలదు. ఆ యోగముల నన్నింటినిట నుదహరించుట గ్రంథబాహుళ్యమగునని విడచిపెట్టి, ఉదాహరణా

తామ్రభస్మ చతుర్భాగం ఋషిభాగంచ టంకణం।
హరితాళం రత్నసంఖ్యా వహ్నిమూలం తథైవచ॥
త్రికటు త్రిఫలంచైవ దశద్వాదశకం తథా।
హింగుభాగైక సంఖ్యాచ ఉగ్రగంధాతథైవచ॥
ఏవం ఖల్వేచ సంస్థాప్య ఆర్ద్రికం వహ్నిమూలకం।
జంబీరలశునం చైవ శార్ఙ్గిశి గ్వర్కమూలకం॥
లాంగలీ హంసపాదేన సింధు ర్నాగదళేనచ॥
అంకోల శిగ్రుమూలాని ప్రత్యేకం యామమాత్రకం।
పంచకోల కషాయేణ పంచమూలేన మర్దయేత్॥
గుంజామాత్ర ప్రమాణేన వటకాన్ కారయేత్తతః।
వటమేకం ప్రయుంజీత ఆర్ద్రికస్యాను పానతః॥
సర్వజ్వరహరంరోగాన్ సన్నిపాతకులాంతకం।
సప్తదోష వినాశంచ సన్నిపాతకులం హరేత్॥
స్నానంకుర్యా త్త్రయత్నేన శ్రీగంధం లేపమాచరేత్॥
కాలకూట రసోనామ ఈశ్వరేణైవ భాషితం॥

ర-యో-ర.

శుద్ధిజేయబడిన వత్సనాభి పదకొండుభాగములు, శుద్ధిజేయబడిన పాదరసము మూడుభాగములు, శుద్ధిజేయబడిన గంధకము అయిదుభాగములు, శుద్ధిజేయబడిన మణిశిల ఆఱుభాగములు, తామ్రభస్మ నాలుగు భాగములు, శుద్ధిజేయబడిన టంకణము ఏడుభాగములు, శుద్ధిజేయబడిన తాళకము తొమ్మిదిభాగములు. చిత్రమూలము తొమ్మిదిభాగములు,

---

ర్థము ముఖ్యమగు కొన్ని యోగములను మాత్రమే యిట దెలుపుచున్నాము.

త్రికటుకములు పదిభాగములు, త్రిఫలములు పంద్రెండుభాగములు, పొంగించిన ఇంగువ ఒకభాగము, వస ఒకభాగము ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను ఖల్వమునందు కజ్జలిజేయవలెను. పిమ్మట నందు మిగిలిన ద్రవ్యముల చూర్ణములను జేర్చి అల్లపురసము, చిత్రమూల రసము, జంబీరస్వరసము, వెల్లుల్లిరసము, గురివెంద వేరురసము, మునగ చెక్కరసము, జిల్లేడువేళ్లరసము, పాత్తిగుంపరసము, హంసపాది రసము, వావిలాకురసము, తమలపాకులరసము, ఊడుగువేళ్లరసము, మునగవేళ్లరసము, పంచకోల కషాయము, పంచమూల కషాయము (చిత్రమూలము, జిల్లేడువేరు, మునగవేరు, వగనోగువేరు, దుష్టుపువేరు అనునవి పంచమూలములు) వీనితో ప్రత్యేకముగ ఒక్కొక్క జాము చొప్పున మర్దించి గురిగింజ ప్రమాణమువ మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయువలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది కాలకూటరసమనబడును. దీనిని అల్లపురసముతో సేవించిన సన్నిపాతజ్వరము, సప్తవిధ దోష జ్వరములు, సమస్త సన్నిపాతములును శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు శీతలజలస్నానము, శ్రీగంధలేపనము, దధ్యన్నభోజనము, ఖర్జూరాది ఫలముల స్వరసపానము, తాంబూలభక్షణము అనునవి పథ్యములు.

## 2. సూచికాభరణరసము

శ్లో॥ విషం పలమితం సూతశ్శాణికశ్చూర్ణయేద్ద్వయం।
తచ్చూర్ణం సంపుటేక్షిప్త్వా కాచలిప్త శరావయోః
ముద్రాందత్వాచ సంశోష్య తతశ్చుల్యాం నివేశయేత్।
వహ్నింశనైః శనైః కుర్యాత్ ప్రహరద్వయసంఖ్యయా॥
తతఉద్ఘాట్య తన్ముద్రా ముపరిస్థ శరావకే।
సంలగ్నో యోభవేత్సూతః తత్ గృహ్ణీయాత్ శనైః

శనైః॥ వాయుస్స్పర్శోయథానస్యాత్ తథాకుప్యాం
నివేశయేత్ ॥ యావత్స్వాచ్ఛ్యాముఖేలగ్నం కుప్యా
నిర్యాతి భేషజం॥ తావన్మాత్రో రసో దేయః మూర్ఛితే
సన్నిపాతినే। క్షీరేణ ప్రక్షిపేన్మూర్ధ్ని తత్రాంగుళ్యాచ
ఘర్షయేత్॥ రక్తభేషజ సంపర్కా న్మూర్ఛితోఽపి
హిజీవతి। తథైవసర్పదష్టస్తు మృతావస్థోఽపి జీవతి॥
యదాతాపో భవేత్తస్య మధురం తత్రదీయతే॥

ర-యో-ర.

శుద్ధిజేయబడిన వత్సనాభి ఒకపలము, శుద్ధిజేయబడిన పాదరసము ¼ తులము ఇటుల గ్రహించి, ఖల్వమున నీ రెండింటిని జక్కగా కలియ నూరియుంచవలెను. పిమ్మట రెండు శరావములను గ్రహించి వాని లోభాగమున మెత్తగా జలముతో నూరిన గాజుపిష్టమును లేపనముజేసి యెండించవలెను. తరువాత నీ శరావసంపుట మధ్యమున పై పారద వత్సనాభుల పిష్టముసుంచి, తిరిగి పై గాజుపిష్టముతోనే సంధిలేపనము జేసి యెండించవలెను. ఇటుల సిద్ధముజేయబడిన శరావసంపుటమును పొయ్యిపై నుంచి మందాగ్నిచే రెండుజాములు పాకముజేయవలెను. స్వాంగశీతలమున సంధిలేపమును దొలగించి యూర్ధ్వ శరావముయొక్క లోపలిభాగమున చూర్ణరూపమున నంటియున్న రసమును గాలి తగలకుండునట్లు జాగ్రత్తగ గ్రహించి గాజు సీసాలో భద్రపరచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది సూచికాభరణరసమనబడును. సన్నిపాత జ్వరమున మూర్ఛనొందిన రోగికి నడినెత్తిపై కేశములను తొలగించి పై యౌషధమును సూది మొనతో గ్రహించి, యా ప్రదేశమున సూక్ష్మముగా గ్రుచ్చి రక్తములో గలియునట్లు లోన బ్రవేశపెట్టవలెను. పిమ్మట క్షీరబిందువు నచ్చట నుంచి బొటనవ్రేలితో నదిమి రుద్దవలెను. ఇటుల జేయుటచే రక్తము బయటకు రాకుండుటయు,. నౌషధము రక

ములో గలియుటయు నగును. ఇందువలన రోగికి వెంటనే తెలివి గలుగును. ఇటులనే సర్పదష్టునికిగూడ జేసిన విషవికారము శమించును. ఇట్టి ప్రయోగముచే దాపము గలిగినప్పుడు రోగికి మధురరస ఫలముల స్వరసమును బానముజేయించవలెను.

## స్వానుభవము

[ఆయుర్వేద శాస్త్రమునను సరించి శుద్ధిజేసిన వత్స నాభిగుణములు వేరుగా నుండును. శుద్ధిజేయని నాభిగుణములు వేరు. శుద్ధిజేయునిది విషము. శుద్ధిజేసినది అమృతము. శుద్ధిజేయని నాభి హృదయముయొక్క బలమును తగ్గించును. శుద్ధిజేసిన నాభి హృదయవేగమును తగ్గించి, హృదయమునకు ఎక్కువ శాన్తి నిచ్చును. ఈ విషయమును నవీన పరిశోధకులు విమర్శించి కనుగొనెదరుగాక !]



---

## అర్కః - జిల్లేడుచెట్టు

N. O. Asclepiadeae

హింది - ఆఖడా, మరాఠి - రుయీ, గుజరాతి - ఆంకడో, మలయాళం - ఎరుక్క, కర్ణాటకం - ఎక్కె, ద్రావిడం - ఎరుక్కు, లాటిన్ - Calotropis gigantea, Eng. C. Procera.

### శ్వేతార్కః - తెల్లజిల్లేడుచెట్టు (క)

శ్లో॥ శ్వేతార్కో గణరూపః స్యాన్మందారో వసుకోఽపిచ।
శ్వేతపుష్పః సదాపుష్పః సబాలార్కః ప్రతాపసః॥

శ్వేతార్కము, గణరూపము, మందారము, వసుకము, శ్వేతపుష్పము, సదాపుష్పము, బాలార్కము, ప్రతాపసము అనునవి శ్వేతార్క నామములు.

## రక్తార్కః - ఎఱ్ఱజిల్లేడుచెట్టు (ఖ)

శ్లో॥ రక్తాపరోఽర్క నామాస్యా దర్కపర్ణో వికీరణః।
రక్తపుష్పః శుక్లఫలః తథా స్ఫోటః ప్రకీర్తితః॥

రక్తార్కము, అర్కపర్ణము, వికీరణము, రక్తపుష్పము, శుక్లఫలము, ఆస్ఫోటము అనునవి రక్తార్క నామములు.

## అర్క ద్వయగుణములు

శ్లో॥ అర్కద్వయం సరంవాత కుష్ఠకండూవిషవ్రణాన్।
నిహన్తి ప్లీహగుల్మార్శః శ్లేష్మోదరశకృత్ క్రిమీన్॥

తెల్లజిల్లేడును, ఎఱ్ఱజిల్లేడును సరగుణమును గలిగియుండును. వాతశ్లేష్మములను శమింపజేయును. కుష్ఠము, కండు, విషము, వ్రణము, ప్లీహము, గుల్మము, అర్శస్సు, ఉదరము, పురీషజక్రిములు అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయ బోధకములు :

(శ్వేత) - శ్వేతార్కము. శ్వేతపుష్పము. సదాపుష్పము. (దీర్ఘపుష్పము. వృత్తమల్లిక. శుక్లఫల.) (రక్త) -

రక్తార్కము. అర్కపర్ణము. రక్తపుష్పము. శుక్లఫలము. (క్షీరదల. శుకఫల. తూలఫల. క్షీరకాండక. సదాపుష్ప.)

(ఖ) గుణబోధకములు :

(శ్వేత)-(వేధ.) (రక్త)- (కచ్ఛూఘ్న. శీతపుష్పక.)

## (2) శబ్దార్థములు

శ్వేతార్కము- తెల్లగ నుండునట్టిది. శ్వేతపుష్పము- తెల్లని పుష్పములు గలది. సదాపుష్పము - ఎల్లప్పుడును పుష్పములతో గూడియుండునది. దీర్ఘపుష్పము - పొడవుగ నుండు పుష్పములను గలది. వృత్తమల్లిక-గుండ్రముగనుండు మల్లిపుష్పములవంటి పుష్పములను గలది. శుక్లఫల- తెల్లని ఫలములను గలది. రక్తార్కము-ఎర్రగ నుండునట్టిది. అర్కపర్ణము-సూర్యునివలె నెర్రనగు పత్రములను గలది. రక్త పుష్పము - ఎర్రని పుష్పములను గలది. క్షీరదల-పాలతో గూడిన పత్రములను గలది. శుకఫల - చిలుకవలె నుండు ఫలములను గలది. తూలఫల-లోన దూదెతో గూడిన ఫలములను గలది. క్షీరకాండక - పాలతోగూడిన కొమ్మలను గలది. వేధ - వేధించునది (వ్రణముచేయునది) (లేక) రస వేధకై యుపయోగించునది. కచ్ఛూఘ్న - కచ్ఛువును బో గొట్టునది. శీతపుష్పక- శీతవీర్యముగల పుష్పములను (లేక) శీత స్పర్శగల పుష్పములను గలది.

## (3) భేదములు

ఇది తెలుపు - ఎరుపు భేదముచే రెండువిధములుగా నుండి కొంచెము ఎత్తుగా బెరుగు క్షుపజాతులలో నుత్పత్తి

గలిగి యుపవిషాంతర్గతమై కఫహార కచ్ఛ్వాహార జంగమ విషహారాది ద్రవ్యములలో గణింపబడుచున్నది. ఇవి ప్రతి చోట్లను బెరుగుచుండును. వీని పుష్పములను దేవతార్చనకై యుపయోగించుదురు. పత్రములుగూడ సూర్యప్రీతికరము లగుటచే సూర్యార్చనకై యుపయోగింపబడుచుండును. వీని యొక్క పండిన పత్రములు కర్ణశూలయందు ధారాళముగా ప్రయోగింప బడుచున్నవి. అర్కక్షీరము విషగుణము గల దగుటచే మిగుల తీక్ష్ణముగనుండును. ఇది విరేచనకర్మలకై గుల్మోదరాది మహావ్యాధులందు ప్రయోగింపబడుచున్నది. మరియు నీ క్షీరము గర్భపాతనకరమగుటచే నట్టి కర్మకు గొందరుపయోగించుదురని జెప్పుదురు. ఇంతియేగాక యీ పై కర్మకు దీని మూలమును గూడ నుపయోగించుదు రని తెలియ గలదు. మరియు నీక్షీరము కునఖాది క్షుద్రవ్యాధు లందు ప్రయోగింపబడుచున్నది. ప్రవాళాది ఖనిజద్రవ్య ముల భస్మీకరణమునకై రసవైద్యులచే నుపయోగింప బడు చున్నది. వేధ యను నామమునుబట్టి రసమున కర్కక్షీర ముతో వేధసంస్కారమును జేయువట్లుగా దెలియగలదు. పుష్పములు శ్వాస కాసలయందు ప్రయోగింపబడుచున్నవి. మూలముపైనుండు త్వక్కుగూడ విశేషముగా శ్వాస కాస జ్వరాదులందుపయోగింపబడుచున్నది. మరియు నిది వృశ్చిక సర్పాది జంగమ విషములందు గూడ ధారాళముగా ప్రయో గింపబడుచున్నది. మూలస్వరసమును పిచ్చికుక్క విషము నందు బ్రయోగించెదరు. ఇటుల వైద్యమునందును వ్యవ హారమునందును అనేకవిధములుగా నీ క్షుపములకు ప్రయో

గము గాన నగును. వీనిని సమూలముగా గ్రహించి యం
దుండి క్షారము దీయబడి యయ్యది పైవ్యాధులందే ప్రయో
గింపబడుచున్నది. మరియు వీని కాండములను గాల్చి బొగ్గు
లుగా జేసి తుపాకి మందులో నుపయోగించుదురు. అయితే
వీనిలో శ్వేతార్కము వైద్యమునందు మిగుల శ్రేష్ఠమై
నదిగా జెప్పుదురు.

## (4) విశేషగుణములు

### (క) శ్వేతార్కము :

కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును
గలిగియుండును. వాతమును శమింపజేయును. మేదోవృద్ధిని,
విషమును, కుష్ఠమును, వ్రణమును, శోఫను, కండువును,
విసర్పమును బోగొట్టును. ధ-ని., మలశోధనము జేయును.
మూత్ర కృచ్ఛ్రమును, రక్తదోషమును బోగొట్టును.
రా-ని., సరతీక్ష్ణ గుణములను గలిగియుండును. కఫమును
శమింపజేయును. క్రిమిని, అర్శస్సును బోగొట్టును. రా-వ.

### (ఖ) శ్వేతార్క పుష్పము :

లఘుగుణమును గలిగియుండును. వెంటనే శుక్ర
మును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమ
మును పాకముజేయును. అరుచిని, ప్రసేకమును, అర్శస్సును,
శ్వాసను, కాసమును బోగొట్టును. భా-ప్ర., క్రిములను,
శూలను, ఉదరమును బోగొట్టును. ధ-ని.

(గ) రక్తార్కము :

కటురసమును, సరగుణమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. శోఫను, వ్రణమును, కండువును, కుష్ఠమును, ప్లీహను, క్రిములను బోగొట్టును. ధ-ని.

(ఘ) రక్తార్క పుష్పము :

మధురరసమును, తిక్తానురసమును గలిగియుండును. మలాదులను నిరోధించును. కఫమును శమింపజేయును. కుష్ఠమును, క్రిములను, అర్శస్సును, రక్తపిత్తమును, గుల్మమును, శోఫను బోగొట్టును. భా-ప్ర., ఆఖువిషమును బోగొట్టును. శా-ని.

(చ) అర్కక్షీరము :

తిక్తరసమును, లవణానురసమును, స్నిగ్ధలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. విరేచనకర్మకు శ్రేష్ఠమైనదిగ నుండును. కుష్ఠమును, గుల్మమును, ఉదరమును బోగొట్టును. భా-ప్ర., క్రిములనుబోగొట్టును. రా-వ.

(ఛ) అర్కమూలము :

ఉష్ణవీర్యమును గలిగియుండును. స్వేదమును బుట్టించును. వమనమును గలిగించును. శ్వాసను, ఫిరంగరోగమును బోగొట్టును. ని-అ.

## (5) అర్కక్షీర శోధనము

శ్లో॥ అర్కసేహుండయోర్దుగ్ధం తత్స్వయం శుద్ధముచ్యతే॥
యో-ర.

జిల్లేడుపాలు స్వయముగనే పరిశుద్ధముగ నుండును గాన వీనికి శోధనము లేదు.

## (6) అర్కక్షీరాతియోగ వికారములు

శ్లో॥ అర్కక్షీరాతి యోగేన రేచనం వమనం భవేత్।
మూత్రప్రవృత్తి రధికా జిహ్వాతాపశ్చ సంభవేత్॥
అ-మం.

జిల్లేడుపాలను మాత్రాధికముగా సేవించినచో విశేషముగ వమనములును, విరేచనములును జనించును. అధికముగ మూత్రము ప్రవర్తించును. నాలుకయందు తాపము బుట్టును.

## (7) అర్కక్షీర వికారశాన్తి

శ్లో॥ శీతవారి సితాయుక్తం పానం వజ్రీ విషాపహం। వస్త్ర
వాయుస్తథాకార్య శ్శీతచ్ఛాయాం చ సేవయేత్॥
అ-మం.

శీతలజలమునందు శక్కెర గలిపి పానము జేయవలెను. వస్త్రముచే విసరవలెను. చల్లని నీడయందుండవలెను. ఇటుల జేసినచో నర్కక్షీరాతి యోగముచే గలిగిన వికారములు శమించును.

## (8) ప్రయోగములు

1. వమనవిరేచనముల కర్కప్రయోగము.

"క్షీరమర్కస్య విజ్ఞేయం వమనే సవిరేచనే॥"
అర్కక్షీరము వమనవిరేచనకర్మలకు శ్రేష్ఠమైనదిగ నుండును.
చ-సూ-అ 1.

2. అర్శోరోగమునం దర్కప్రయోగము.

"అర్కమూలం శమీపత్రం అర్శోభ్యో ధూపనం హితం॥"

జిల్లేడువేరు, జమ్మియాకులు వీనిని చూర్ణముజేసి ధూపమువేసిన అర్శస్సు శమించును. చ—చి—అ 9.

3. వ్రణములం దర్కప్రయోగము.

"వ్రణప్రచ్ఛాదనే విద్వాన్ పత్రాణ్యర్కస్యచా దిశేత్॥"

జిల్లేడాకులు వ్రణములందు కప్పుటకు హితములుగా నుండును.
చ—చి—అ 13.

4. ఊరుస్తంభమునం దర్కప్రయోగము.

"శాకైర లవణై రద్యాజ్జలతైలోపసాధితైః। సునిషణ్ణకనింబార్క పల్లవైః॥"

జిల్లేడు చిగుళ్లను లవణవర్జితములుగా జలతైలములతో శాకముగా జేసి సేవించిన ఊరుస్తంభము శమించును. చ—చి—అ 27.

"కుర్యాదుత్సాదనం భృశం।
మూలై రర్కస్య వాభిషక్॥"

జిల్లేడువేళ్ల చూర్ణముతో పలుమార్లు నలుగుపెట్టిన ఊరుస్తంభము శమించును. చ—చి—అ 27.

5. క్రిమికుష్ఠమునందు అర్కప్రయోగము.

"క్వాథం వార్కా లర్క సప్తచ్ఛదానాం జాతసత్వః పిబేత్॥"

జిల్లేడువేళ్ల కషాయమును సేవించిన క్రిమికుష్ఠము శమించును.
సు—చి—అ 9.

6. శ్వాసయందు అర్కప్రయోగము.

"పిబేత్సంచూర్ణ్యధానాశ్చాప్యథభక్షయేత్।
అర్కాంకురై ర్భావితానాం యవానాం సాధ్వనేకశః॥"

జిల్లేడు మొలకల రసమునందు యవల అటుకులను పలుమార్లు భావనజేసి చూర్ణించి తేనెతో సేవించిన శ్వాస శమించును.

సు-ఉ-అ 52.

7. అలర్క విషమునందు అర్క ప్రయోగము.

"పలలం తిలతైలంచ రూపికాయాః పయోగుడః।
నిహంతి విషమాలర్కం మేఘబృంద మివానిలః॥
అర్కక్షీరయుతం హ్యస్య దద్యాచ్చాపి విశోధనం॥"

జిల్లేడుపాలు, మాంసము, తిలతైలము, బెల్లము వీని నేకముగా గలిపి యిచ్చుచు, జిల్లేడుపాలను శోధనార్థమై యిచ్చిన పిచ్చికుక్క విషము శమించును. సు-క-అ 7.

8. క్రిమిదంతమునం దర్క ప్రయోగము.

"సప్తచ్ఛ దార్కక్షీరాభ్యాం పూరణం క్రిమిశూల జిత్॥"

ఏడాకులపొన్న, జిల్లేడు వీని క్షీరముతో పూరణముజేసిన క్రిమిదంతమునందు గలుగు శూల శమించును. వా-ఉ-అ 22.

9. ప్లీహవృద్ధియందు అర్క ప్రయోగము.

"అర్కపత్రంసలవణం అంతర్ధూమం విదాహయేత్।
మస్తునావా పిబేత్ క్షారం ప్లీహరోగం వ్యపోహతి॥"

జిల్లేడాకులను, సైంధవలవణమును అంతర్ధూమ విపాచితముజేసి

గ్రహించినట్టి క్షారమును పెరుగుమీది తేటతో సేవించిన ప్లీహావృద్ధి శమించును. బృంద.

10. మేఢ్రపాకమునం దర్క ప్రయోగము.

"జపాజాత్యశ్వ మారార్క శమ్యా కానాం దలైః పృథక్। కృతంప్రక్షాలనేక్వాథం మేఢ్రపాకే ప్రయోజయేత్॥"

జిల్లేడాకుల కషాయముతో క్షాళనము జేసిన మేఢ్రపాకము (ఉపదంశము) శమించును. బృంద.

11. కచ్ఛ్వాపామాదులం దర్కప్రయోగము.

"అర్కపత్ర రసేపక్వం రజనీ కల్కసంయుతం।
కటుతైలం నిహంత్యేతత్ కచ్ఛ్వాపామావిచర్చికాః"

జిల్లేడాకుల రసము, పసపు కల్కము, ఆవనూనె వీనిని తైలకము జేసి అభ్యంజనము జేసిన కచ్ఛు, పామ, విచర్చిక యివి శమించు. బృంద.

12. వృద్ధియం దర్కప్రయోగము.

"నిష్పిష్ట మారనాలేన రూపికా మూలవల్కలం
లేపోవృద్ధ్యామయంహన్తి బద్ధమూల మపిదృఢం॥"

జిల్లేడు వేరు పట్టను ఆరనాళముతో నూరి లేపనముజేసిన వృద్ధిరోగము శమించును. చ-ద.

13. శ్లీపదమునందు అర్కప్రయోగము.

"నిష్పిష్టమారనాలేన రూపికామూలవల్కలం।
ప్రలేపాత్ శ్లీపదంహంతి బద్ధమూలమపి దృఢం॥"

జిల్లేడువేళ్ల పట్టను ఆరనాళముతో నూరి లేపనము జేసిన శ్లీపదము శమించును. చ-ద.

### 14. వృశ్చికవిషమునందు అర్కప్రయోగము.

"అర్కక్షీరం దృఢంపుంసాం ప్రచ్ఛన్నాగతశోణితం।
న్యస్తందంశే క్షణాదేవ వృశ్చికస్య విషంహరేత్॥"

తేలుకుట్టినచోట కొద్దిగా రక్తము వచ్చునట్లు గీరి అందు జిల్లేడు పాలనుంచినచో వెంటనే వృశ్చికవిషము శమించును. గ-ని.

### 15. కామిలయం దర్కప్రయోగము.

"అథ వార్కజటాపిష్టా। స్వచ్ఛేన తండులజలేనను సంప్రయత్నాత్। స్యాత్కామలామయహారీ కృత నావనానాం ఆఘ్రాంతమాత్రమపి జాలనికా ఫలంవా॥"

జిల్లేడువేరును బియ్యపు కడుగుతో నూరి స్వరసమును గ్రహించి నస్యము జేసిన కామిల శమించును. గ-ని.

### 16. కర్ణరోగమునం దర్కప్రయోగము.

"తైలందుగ్ధం...సంశృతం శ్రవణేక్షిపేత్।
సపూయపూతీన్ జంత్వాదీన్ జయేద్వార్కమథాపివా॥"

తైలమునుగాని, క్షీరమునుగాని జిల్లేడురసముతో పాకముజేసి కర్ణపూరణము జేసిన పూతిపూయము, క్రిములు మొదలగునవి శమించును. వై-మ.

**17. కర్ణశూలయందు అర్కప్రయోగము.**

పండిన జిల్లేడాకుల స్వరసమును, శుంఠీరసమును గలిపి కొద్దిగ వెచ్చజేసి కర్ణపూరణము జేసిన వెంటనే కర్ణశూల శమించును.

(అనుభూతము)

## (9) యోగములు

### 1. అర్కక్షీరాది బిందుఘృతము

శ్లో॥ అర్కక్షీరపలే ద్వేచ స్నుహీ క్షీరపలానిషట్।
పథ్యా కంపిల్లకం శ్యామా శంపాకం గిరికర్ణికా॥
నీలినీ త్రివృతా దన్తీ శంఖినీ చిత్రకం తథా।
ఏతేషాం పలికై ర్భాగైః ఘృతప్రస్థం విపాచయేత్॥
అథాస్య మలినే కోష్ఠే బిందుమాత్రం ప్రదాపయేత్।
యావతోఽస్య పిబే ద్బిందూ౯ తావద్వారా౯ విరి
చ్యతే॥ కుష్ఠగుల్మ ముదావర్తం శ్వయథుం సభగందరం।
శమయ త్యుదరాణ్యష్టౌ వృక్షమింద్రాశని ర్యథా॥
ఏతద్బిందు ఘృతంనామ యేనాభ్యక్తో విరిచ్యతే।
జలం చతుర్గుణం దేయం పాకార్థం బిందుసర్పిషః॥

భై-ర.

జిల్లేడుపాలు రెండుపలములు, జెముడుపాలు ఆఱుపలములు, కరక్కాయలు ఒకపలము, కంపిల్లకము ఒకపలము, తెగడవేరు ఒకపలము, శేలగుజ్జు ఒకపలము, తెల్లవిష్ణుక్రాంత ఒకపలము, నీలివేళ్లు ఒకపలము, తెల్లతెగడవేరు ఒకపలము, నాగదన్తీమూలము ఒకపలము, శంఖినీ మూలము ఒకపలము, చిత్రమూలము ఒకపలము ఇటుల గ్రహించి, యిందలి కరక్కాయలు మున్నగు ద్రవ్యములను మెత్తగా చూర్ణించి,

దీనిని జిల్లేడుపాలతోను, జెముడుపాలతోను తడిపి మెత్తగా నూరి కల్కమును సిద్ధము జేయవలెను. పిమ్మట నొకపాత్రలో నీకల్కమును, ఒక ప్రస్థము ఘృతమును, నాలుగుప్రస్థములు జలమును జేర్చి మందాగ్నిచే ఘృతపాకము జేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది బిందు ఘృతమనబడును. దీనిని ఒక బిందు ప్రమాణమున యుక్తిగా సేవించవలెను. ఇందువలన విరేచనములగును. ఎన్నిబిందువుల ఘృతమును సేవించిన అన్ని విరేచనములగును. మరియు, కుష్ఠము, గుల్మము, ఉదావర్తము, శోఫ, భగందరము, ఉదరము ఇయ్యవి శమించును.

## 2. అర్కాది తైలము

శ్లో॥ అర్కక్షీర మజాక్షీరం నిర్గుండీ తింత్రిణీరసః।
తిలతైల సమాయుక్తం వాతా శీతినాశనం॥ బ-రా.

జిల్లేడుపాలు, మేకపాలు, వావిలాకు స్వరసము, చింతాకు రసము, తిలతైలము వీనిని సమాంశములుగ గ్రహించి, మందాగ్నిచే తైలపాకము జేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది యర్కాదితైలమనబడును. దీనిని అభ్యంగము జేసిన సమస్త వాతవ్యాధులును శమించును.

## 3. అర్కాది గణక్వాథము

అర్కాదిగణమున * జెప్పబడిన ద్రవ్యములను సమాంశములుగ గ్రహించి, మెత్తగా నలియగొట్టి కషాయవిధిననుసరించి కషాయమును పాకము జేయవలెను. దీనిని ఒకపలము మోతాదు చొప్పున సేవించిన కఫము, మేదస్సు, విషము, కృమి, కుష్ఠము ఇయ్యవి శమించును. వ్రణ శోధనమగును.

---

* అర్కాది గణము.—ఔషధవిజ్ఞానమునందలి 5-వ అధ్యాయమున వాగ్భటోక్త గణములను జూడనగును.

## 4. అర్కాదివటి

జిల్లేడుపువ్వులు, మిరియాలు, వెల్లుల్లిపాయలు వీనిని సమాంశములుగ గ్రహించి ఖల్వమునందుంచి మెత్తగా నూరి అయిదు యవల పరిమితిని మాత్రలు జేయవలెను. దీనిని ఒక్కొక్కమాత్ర చొప్పున సేవించిన కఫానుబంధముగల విషమజ్వరము శమించును.

(వారు మూలికలు)

(10) **Actions and uses:**—The powdered root bark and inspissated juice are used extensively for their diaphoretic, emetic, alterative and purgative properties which have been known to the Indian Practitioners for many centuries and regarded in some parts as 'vegetable mercury.'

Doses:--Alterative 3 to 10 gr: emetic 30 to 60 gr. The author has lately found that a fluid extract of the leaves given in the doses of 1 to 5 drops in intermittent fevers during intermission, generally cuts of the paroxysms more effectually than quinine. Poisonous in large doses. The fresh flowers are also used medicinally. In the dried bark of the root, we have an adequate substitute for specacuanah, and when combined with opium, a good representative of the official Dover's Powder is prepared. In dysentery in doses of 5 to 10 gr., it may be safely substituted for ipecac, though double the quantity is generally required.

— *Indigenous Drugs of India By K. Dey.*

Modern physiological research has shown that the juice applied to the skin acts as an irritant, the practice of applying it with salt to bruises and sprains to remove pain is therefore rational; also the application of the fresh bark in chronic rheumatism; given internally in small doses, the drug stimulates the capillaries and acts powerfully upon the skin. It is therefore likely to be useful in elephantiasis and leprosy.

*—Pharmocographia Indica II, p. 434.*

# స్వానుభవము

[జిల్లేడుపాలను వాతనొప్పులకు నొప్పిగల స్థలమున బూసి పైని పసపు చూర్ణము జల్లుదురు. గట్టిగా బిగబట్టుట వల్ల నొప్పులు తగ్గును. మరియు, జిల్లేడాకులను కట్టగా గట్టి, కట్టుకు క్రిందుభాగమున ఆకులను కోసి, కుంచెగా జేసి దీనిని కాగుచున్న నూనెలో ముంచి, నూనెను వాడనిచ్చి పిమ్మట నా కుంచెతో వెచ్చ వెచ్చగా నొప్పిగల భాగమున కాచినచో నొప్పులు తగ్గును. ఇందువల్ల గ్రంథులుగూడ శమించును. జిల్లేడుపాలను ఖల్వములో నూరి చిన్న చిన్న మాత్రలుగా జేసి ఒక్కొక్క మాత్రను తమలపాకు మధ్య నుంచి ప్రతి యర్ధగంటకు పామువిషములో నియ్యవలెను. ఇటుల వాంతివచ్చువరకు ఇచ్చుచుండవలెను. లేక, జిల్లేడుపాలను పై మోతాదు చొప్పున నీళ్లలో గలిపి త్రాగించవలెను. మరియు, రెండు మూడు జిల్లేడాకులను నమిలించవలెను. జిల్లేడువేరును నీళ్లతో అరుగదీసి, ఆ గంధమును పాము కాటుపై పూయవలెను.

నేను అర్కపిప్పలిని (పిప్పళ్లను జిల్లేడుపాలలో భావన జేసి అనగా 6 దినములు చక్కగా మర్దించి యెండబెట్టబడినది) తీవ్రమగు ఆస్త్మాలో ½ మొదలు 2 గ్రైనుల మోతాదు వరకు నుపయోగించియున్నాను. మరియు అర్కాదివటిని కఫజ విషమజ్వరములో ధారాళముగా నుపయోగించి యున్నాను. ఆ-ల.]

---

## స్నుహీ - జెముడుచెట్టు (క)

N. O. Euphorbiaceæ.

మలయాళం — కళ్లి, కర్ణాటకం — కళ్లి, ద్రావిడం — కళ్లి, లాటిన్ — Euphorbia nivulia.

శ్లో॥ సేహుండః సింహాతుండస్స్యాత్ వజ్రీవజ్రద్రుమోఽపిచ। సుధా సమంతదుగ్ధాచ స్నుక్స్త్రియాంస్యా త్స్నుహీ గుడా॥

సేహుండము, సింహతుండము, వజ్రి, వజ్రద్రుమము, సుధ, సమంతదుగ్ధ, స్నుక్కు, స్నుహి, గుడ యనునవి స్నుహీనామములు.

## స్నుహీ గుణములు

శ్లో॥ సేహుండో రేచన స్తీక్ష్ణో దీపనః కటుకో గురుః।
శూలమష్ఠీలికాధ్మాన కఫగుల్మో దరానిలాన్।
ఉన్మాద మేహకుష్ఠార్శః శోథ మేదోఽశ్మపాండుతాః।
వ్రణశోథ జ్వర ప్లీహ విషదూషీ విషంహరేత్॥

జెముడుచెట్టు కటురసమును, తీక్ష్ణగురుగుణములను గలిగియుండును. మల రేచనము జేయును. అగ్నిని వృద్ధిపొందించును. కఫవాతములను శమింపజేయును. శూల, అష్ఠీలిక, ఆధ్మానము, గుల్మము, ఉదరము, ఉన్మాదము, ప్రమేహము, కుష్ఠము, అర్శస్సు, శోఫ, మేదోవృద్ధి, అశ్మరి, పాండు, వ్రణశోఫ, జ్వరము, ప్లీహవృద్ధి, విషము, దూషీవిషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## సాతలా - సంబరేణు ? (స్నుహీభేదము) (ఖ)

శ్లో॥ సాతలా స్సప్తలా సారవిమలా విదలాచసా।
తథా నిగదితా భూరిఫేనా చర్మకషేత్యపి॥

సాతల, సప్తల, సారవిమల, విదల, భూరిఫేన, చర్మకష యను నవి సాతలా నామములు.

## సాతలా గుణములు

శ్లో॥ సాతలా కటుకాపాకే వాతలా శీతలాలఘుః।
తిక్తా శోథకఫా నాహ పిత్తోదావర్తరక్తజిత్॥

సంబరేణు వను స్నుహీభేదము తిక్తరసమును, లఘుగుణమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. వాతమును వృద్ధి బొందించును. కఫ పిత్తములను శమింపజేయును. శోఫ, ఆనాహము, ఉదావర్తము, రక్తదోషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు.

(సుహీ) - సింహాతుండము, స్నుహి, వజ్రి, సమంత దుగ్ధ (మహావృక్షము, వజ్రకంటకము, కాండశాఖ, కాండరోహకము, బహుశాఖ) (సాతలా) - భూరిఫేన, సారవిమల, విదల. (స్వర్ణపుష్పి. పత్రఘన.)

(ఖ) గుణబోధకములు.

(స్నుహీ) - వజ్రద్రుమము. గుడ. (నేత్రారి). (సాతలా) - సాతల. చర్మకష.

### (2) శబ్దార్థములు

సింహాతుండము - సింహముఖమునందలి దంతముల వంటి ముండ్లతోగూడియుండునది. స్నుహి - పాలను స్రవిం

చునది. వజ్రి - వజ్రకంటకము - వజ్రమువంటి (బలమైన) ముండ్లనుగలది. సమంతదుగ్ధ - అంతటను పాలతో నిండి యుండునది. మహావృక్షము - గుణములచే నెత్తుగా పెరుగు వృక్షజాతులలో గణింపబడునది. కాండశాఖ - బహుశాఖ-కాండములవంటి యనేక కొమ్మలతోగూడియుండునది. కాండరోహకము - కాండమును పాతినచో తిరిగి యనేక శాఖలతోగూడి వృద్ధిబొందునది. భూరిఫేన - హెచ్చుగ నురుగునుగలిగి యుండునది. సారవిమల - సారముచే మలినమును తొలగించునది. విదల - పత్రఘన - అనేక పత్రములతోగూడియుండునది. స్వర్ణపుష్పి - పసపుపచ్చని పుష్పములను గలది. వజ్రద్రుమము - వజ్రమువలె రోగములను బోగొట్టునది. గుడ - మహారోగములనుండి సౌఖ్యమును గలిగించునది. నేత్రారి - నేత్రములకు చెరుపు చేయునది. పాతల - వ్యాధులనుండి సుఖమును గలిగించునది. చర్మకష - చర్మమును హింసించునది.

## (3) భేదములు

ఇది కాండస్నుహి (కాడజెముడు), పత్రస్నుహి (ఆకుజెముడు), ధారాస్నుహి (మూడు లేక నాలుగు అంచులు గల జెముడు), నాగస్నుహి (నాగజెముడు లేక బొమ్మజెముడు), పాతల యను మొదలగు భేదములతోగూడి (యిందు గొన్ని పాలతో గూడినవై) ఉపవిషాంతర్గతమై తీక్ష్ణరేచనకరద్రవ్యములలోను, ప్లీహోదర గుల్మాది మహా వ్యాధులను బోగొట్టు ద్రవ్యములలోను శ్రేష్ఠమైనదిగా

గణింపబడుచున్నది. ఈ జాతులెల్ల ప్రతిచోటను బెరుగు స్వభావము గలిగియుండును. వీని యంగములను కత్తితో నరకి భూమిలో పాతినచో తిరిగి మొలకలెత్తు స్వభావమును గలిగియుండును. వీటిని వ్యవసాయదారులు తమ చేలకు లేక, తోటలకు చుట్టును కంచెలగా నాటుదురు. అందు నాగజెముడు పెద్ద పెద్ద తుప్పలవలె నెత్తుగా బెరిగి అందు సర్పములు మొదలగు విషజాతిక్రిములకు నిలయముగా నేర్ప డును. ఇది పుంతల కిరుపార్శ్వములందు బెరుగుచుండును. దీని పుష్పములు పసపు పచ్చగా నుండును. కాయలు కోల గను గుండ్రముగను నుండి పండినప్పుడు ఎరుపువర్ణము గలిగియుండును. లోన రసముగూడ నెఱ్ఱగా నుండును. ఈ రసమును ప్లీహ యకృద్వ్యాధులలో నుపయోగించు టయు గొంత ప్రచారములో నున్నది. దీని డిప్పలు (దళ ములు) అరచేతివలె విశాలముగ నుండి విశేషముగ దీర్ఘము గను తీక్ష్ణముగను నుండు ముండ్లచే వ్యాప్తమైయుండును. ఇవి మిక్కిలి పెళుసుదనము గలిగియుండుటచే పెద్ద గాలి తాకుడుచేగాని మరి యే యితర కఠినమైన తాకుడుచేగాని విరిగి క్రింద పడిపోవును. ఇటుల నివి దారులలో బడుటచే మార్గస్థులకు అందు విశేషముగా రాత్రి సంచరించువారికి, వ్యవసాయదారులకును తమ తీక్ష్ణ కంటకములచే నాకింత బాధ తరుచు కలిగించుచునే యుండును. ఈ బొమ్మజెముడు ముండ్లు శరీరమునం దేభాగమున గ్రుచ్చుకొని బయటకు రాక యటులనే విరిగి లోన బాధించుచుండునో యా ప్రదే శమునందు కొద్దిగా సున్నమును లేపనము జేసినచో గొన్ని

ఘంటల కవి శరీరముయొక్క పైభాగమునకు వచ్చును. అటుల వచ్చినవానిని జాగ్రత్తగా పట్టి వెడలించుకొందురు. ఇట్టి వైద్యము ప్రతి కర్షకునకును దెలిసిన విషయమే గాన వారంతగా వీటివల్ల గలుగు బాధను లెక్కజేయరు. మరియు, బొమ్మజెముడు డిప్పలు సర్పఫణములవలె ముందుకు వంగినచో దానినిబట్టి కర్షకులు వర్షములు గురియునను సూచనగా దెలిసికొని తమ పనిముట్లను సిద్ధము జేసుకొను చుందురు. కాడజెముడు అనునది యడుగు ప్రమాణుతో గూడి యెత్తుగా చిన్న చిన్న సన్నని కాండరూపమున నుండు పత్రములతోను శాఖలతోను వృక్షరూపముననే బెరుగు నదిగా నుండును. ఈ వృక్షమునందే భాగమున కత్తితో నాటుబెట్టినను ధారారూపమున డెల్లని పాలు స్రవించు చుండును. ఈ పాలనే యౌషధయోగములందు గ్రహించి జేర్చుచుందురు. ఈ పాలు విషతుల్యమగుటచే నుపవిషము లలో నివి యొకటిగా గణింపబడుచున్నవి. దీని కత్యంత తీక్ష్ణాదిగుణము లుండుటచే తీక్ష్ణ రేచనకరముగా గ్రహింప బడుచున్నది. దీని పాలు గుల్మోదర కుష్ఠాది కఠినవ్యాధు లలో రేచనముగా చరకాదులచే ప్రయోగింపబడినది. స్నుహీక్షీరమనగా నీ కాండ స్నుహీవృక్షమునుండి గ్రహిం పబడిన క్షీరమనియే వైద్యుల యభిమతము. ఈ వృక్ష ములు బెంచిన విశేషముగా బెరుగును గాని నాగజెముడు వలె తమంతటనవి బెరుగునవి గాక అచ్చటచ్చట బెరుగు నవిగా నుండును. మిగిలిన ధారాస్నుహీజాతులుగూడ పై దానివలె నచ్చటచ్చట బెరుగునవిగా నుండును. ఇవి

మూడు లేక నాలుగు పలకలను (అంచులను) గలిగిన దీర్ఘములైన కాండరూపమున బెరుగుచుండును. ఈ కాండములు గూడ బొమ్మజెముడు డిప్పలవలె మిక్కిలి పెళుసుగా నుండుటచే పెద్ద గాలి తాకుడువల్ల విరిగి పడిపోవుచుండును. వీని యంచులం దచ్చటచ్చట చిన్న చిన్న తీక్ష్ణములైన ముండ్లుండును. కాండస్నుహికివలె వీనిలో పాలుండవు. కత్తిచే నాటుబెట్టిన అందుండి సొనరూపమున స్రవించు ద్రవముండును. వీనికి వైద్యమునందంతగా ప్రయోగమున్నట్లు గానరాదు. పత్రస్నుహి యనునది కొంచెము ఎత్తుగా బెరుగు వృక్షమువలె నుండును. దీని యాకులు కోలగను కొంచెము విశాలముగను అగ్రభాగమున గుండ్రముగను నుండును. ఈ యాకులను తుంపినచో కాండస్నుహినుండివలె తెల్లని పాలు స్రవించును. అయితే ఈ పాలు స్నుహీక్షీరముగా గ్రహింపబడుటలేదు. కేవలము పత్రములు మాత్రమే వీని నుండి గ్రహింపబడి యౌషధములందు జేర్చబడుచున్నవి. ఈ యాకులను వెచ్చజేసి యందుండి రసమును గ్రహించి తగుమాత్రమున కేవలము లేక, ఏరండతైలములో గలిపి గాని పిల్లలకు వచ్చు శ్వాసకాసలం దుపయోగించిన నూర్ధ్వముగ వమనరూపమునను క్రిందుగ విరేచనరూపమునను దోషములు వెడలి వెంటనే సౌఖ్యమేర్పడును. ఈ వైద్యము గూడ గ్రామస్థులకు దెలిసిన విషయమే. ఈ వృక్షముల యొక్క శాఖలకు చిన్న చిన్న తీక్ష్ణములైన ముండ్లుండును. కాండస్నుహియొక్క మూలముగూడ గ్రహింపబడి యం దుండి క్షారమును దీసి యోగములందు జేర్చబడుచున్నది.

ఈ స్నుహీజాతులు అందు విశేషముగా కాండస్నుహి పారదసంస్కారముకై రసశాస్త్రమునందుగూడ గ్రహింపబడినవి. ఇటులనే వీని ప్రయోగములు విశేషముగా గానబడుచున్నవి, అయితే సాతల యను స్నుహీభేదము ఎటులుండునో పై పదములనుండి స్పష్టపడుట లేదు. దీని స్వరూపమును బోధించు నితర విషయములుగూడ నెచ్చటను గానబడకున్నవి. దీనికి తెనుగు పదము "సంబరేణు" అనునదిగూడ యంత సమంజసముగా నున్నట్లును దోపకున్నది. విమర్శపై దీనిని గురించిన విశేషములు దెలిసికొనవలసి యున్నవి.

## (4) విశేషగుణములు

(క) స్నుహీ—

తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దుష్టవ్రణమును బోగొట్టును. ధ-ని.

(ఖ) స్నుహీక్షీరము—

కటురసమును, స్నిగ్ధ లఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. గుల్మము, కుష్ఠము, ఉదరము, ఇతర దీర్ఘరోగములు వీనియందు రేచనార్థము హితమైనది. భా-ప్ర., గురుగుణమును గలిగియుండును. కఫవాతములను శమింపజేయును. విషమును, ఆధ్మానమును, గుల్మమును, ఉదరమును బోగొట్టును. ధ-ని.

(గ) స్నుహీపత్రము—

తీక్ష్ణగుణమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. మలరేచనము జేయును. ఆధ్మానమును, అష్ఠీలికను, గుల్మమును, శూలను, శోఫను, ఉదరమును బోగొట్టును. భా-ప్ర.

(ఘ) ధారాస్నుహీ—

కాండస్నుహీ గుణములతో గలిగియుండును. విశేషముగా రససంస్కారమునకు బనికివచ్చును. రా-ని.

(చ) పాతలా—

విసర్పమును, కుష్ఠమును, విస్ఫోటమును, వ్రణశోఫను బోగొట్టును. ధ-ని., మలరేచనము జేయును. రా-ని., సర గుణమును గలిగియుండును. ముఖపాకమును, ఉదరమును బోగొట్టును. శో-ని., తీక్ష్ణగుణమును గలిగియుండును. అర్శస్సును, గుల్మమును, హృద్రోగమును, క్రిములను, ఆమదోషమును, శ్విత్రమును బోగొట్టును. ని-ర.

## (5) స్నుహీక్షీర శోధనము

"అర్క సేహుండయోర్దుగ్ధం తత్స్వయం శుద్ధ ముచ్యతే॥" యో-ర.

జెముడుపాలు సహజముగా పరిశుద్ధములైనవి యగుటచే వీనిని శోధింప నవసరము లేదు.

## (6) స్నుహీ క్షీరాతియోగముచే గలుగు వికారములు

"స్నుహీ క్షీరాతి యోగేన కుక్షౌతాపో భవే
ద్భృశం। విరేక వమనేస్యాతాం తత్రదీప్తా శ్చవ
త్క్రియా॥" అ-మం.

జెముడుపాలను మాత్రాధికముగ సేవించినచో కుక్షియందు అధికమైన తాపమును, విశేషముగ విరేచనములు, వాంతులును గలుగును. ఇందు వెంటనే చికిత్సింపవలెను.

## (7) స్నుహీ క్షీర వికారశాన్తి

"ద్రాక్షారసం తు పానీయం స్నుహీ క్షీర విషే
భృశం। శీతవారి తథాగవ్యం క్షీరం శర్కరయా
యుతం॥" అ-మం.

జెముడుపాలయొక్క అతియోగముచే గలిగిన వికారములందు ద్రాక్షపండ్లరసమును, శీతలజలమును, ఆవుపాలను చక్కెరజేర్చి విశేషముగా పానముజేసిన నవ్యాధి శమించును.

## (8) ప్రయోగములు

1. గుల్మమునందు స్నుహీ ప్రయోగము.

"సుధాక్షీర ద్రవే చూర్ణం త్రివృతాయాః సుభా
వితం। కార్షికం మధు సర్పిర్భ్యాం లీఢ్వా సాధు
విరిచ్యతే॥"

జెముడుపాలలో తెగడచూర్ణమును భావనజేసి అందొక తులము ప్రమాణము మధుఘృతములతో గలిపి సేవించిన గుల్మరోగికి బాగుగా విరేచనములగును. చ-చి-అ 5.

2. ఉదరరోగమునందు స్నుహీ ప్రయోగము.

"స్నుక్పల్లవైః। శాకం గాఢ పురీషాయ ప్రాగ్భక్తం దాపయేద్భిషక్॥"

ఉదరరోగికి పురీషము కఠినముగా వెళ్లుచున్నప్పుడు జెముడు చిగుళ్లను శాకముగాజేసి భోజనములో తొలుత దినిపించినచో హితమగును. చ-చి-అ 18.

3. కర్ణశూలయందు స్నుహీ ప్రయోగము.

"వజ్రీకాండాత్త్వ చాహీనా దగ్నితాపనపీడనాత్।
యజ్జలం తద్ధృతే కర్ణే శూలంశామ్యతి దేహినాం॥"

జెముడుకర్రపై తోలును వెలిబరచి, యగ్నితప్తముజేసి పీడించగా వచ్చిన రసమును కర్ణపూరణముజేసిన కర్ణశూల శమించును. గ-ని.

4. మూఢగర్భమునందు స్నుహీ ప్రయోగము.

"న్యస్తేన మూర్ధని సుధాపయ సాల్పకేన స్త్రీణాముపైతి సహసైవహి గర్భశల్యం॥"

జెముడుపాలను కొద్దిగా గర్భిణి శిరస్సున నుంచినచో వెంటనే మూఢగర్భము బయటకు వచ్చును. గ-ని.

5. కృమిదన్తమునందు స్నుహీ ప్రయోగము.

"సీలీధాత్రీ స్నుహీ। ఆసామన్యత మూన్మూలం ధారణాత్ కృమిదన్తజిత్॥"

జెముడువేరును దన్తములతో నమిలిన కృమిదన్తము శమించును. గ-ని.

6. అర్శోరోగమునందు స్నుహీ ప్రయోగము.

"స్విన్నం నిష్పీడితం స్నుహ్యాః పత్రం పాయయా నిధా

పయేత్। దుర్నామా కృమి కండూతి శోఫరుక్
శాంతి కృత్పరం॥''

జెముడాకులను వెచ్చజేసి నలిపి గుదభాగమున నుంచినచో అర్శస్సు, కృమివలన గలిగిన దురద, శోఫ, శూల ఇవి శమించును.

వై-మ.

7. దూష్యోదరమునందు సాతలా ప్రయోగము.

''దూష్యోదరిణం తు ప్రత్యాఖ్యాయ సప్తలా శంఖినీ
స్వరస సిద్ధేన సర్పిషా విరేచయేత్॥''

సప్తల, శంఖిని వీని స్వరసముతో ఘృతమును గలిపి పాకముజేసి దీనితో విరేచనము జేయించిన దూష్యోదరమునందు హితమగును.

సు-చి-అ 14.

8. వాతరోగమునందు సాతలా ప్రయోగము.

''ఘృతం తిల్వకసిద్ధం వాసాతలాసిద్ధ మేవవా। పయ
స్యైరండతైలం వా పిబేద్దోష హరం శివం॥''

సప్తలారసముతో ఘృతపాకముజేసి పానముజేసిన వాతరోగమునందు దోష శోధనమగును.

చ-చి-అ 28.

## (9) యోగములు

### 1. సుధాకాండాది గుటిక.

శ్లో॥ చతుః పలం సుధాకాండాత్ త్రిపలం లవణత్రయాత్।
వార్తాక కుడవంచార్కా దష్టౌ ద్వే చిత్రకాత్పలే॥
దగ్ధ్వా రసేన వార్తాకా ద్గుటికా భోజనోత్తరాః।
భుక్త మన్నం పచంత్యాశు కాస శ్వాసార్శసాంహితాః॥
విషూచికా ప్రతిశ్యాయ హృద్రోగ శమనాశ్చతాః॥

వా-గ్రహణి.

జెముడుకొడలు నాలుగుపలములు, బిడాలవణము ఒకపలము, సైంధవలవణము ఒకపలము, సౌవర్చలవణము ఒకపలము, పెద్దములక కాయలు నాలుగుపలములు, జిల్లేడువేళ్లు ఎనిమిదిపలములు, చిత్రమూలము రెండుపలములు ఇటుల గ్రహించి అంతర్ధూమపాకము జేయవలెను. అటుల దగ్ధమైన యీ ద్రవ్యముల భస్మను గ్రహించి పెద్దములకకాయల రసముతో ఖల్వమున జక్కగా మర్దించి 5 యవల పరిమితిని గుటికలను జేయవలెను. ఒకొక్కక్క గుటికను భోజనమైన పిమ్మట సేవించుచుండిన భుజించిన ఆహారము వెంటనే జీర్ణమగును. కాసము, శ్వాస, అర్శస్సు, విషూచిక, ప్రతిశ్యాయము, హృద్రోగము ఇయ్యవి శమించును.

## 2. స్నుహీ క్షీర ఘృతము.

శ్లో॥ క్షీర ద్రోణం సుధా క్షీర ప్రస్థార్ధేన యుతం దధి।
జాతం మథిత్వా తత్సర్పిః త్రివృత్సిద్ధం చ తద్గుణం॥

ఆవుపాలు పదునారు ప్రస్థములు, జెముడుపాలు అర్ధ ప్రస్థము ఇటుల రెండింటిని ఏకముగా కలిపి దధిభావమును బొందించవలెను. పిమ్మట నీ దధిని బాగుగా చిలికి అందుండి ఘృతమును సిద్ధపరచి, దీని యందు సామాన్యపరిభాషానుసారముగ తెగడవేరు కల్కమును, జలమును జేర్చి మందాగ్నిచే ఘృతపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది స్నుహీక్షీరఘృతమనబడును. దీనిని ¼ తులము మోతాదు చొప్పున సేవించిన ఉదరము, గుల్మము శమించును.

# స్వానుభవము

[ఈ స్నుహీజాతులలో లతాస్నుహియను మరి యొక భేదము గలదు. దీని కొనను తుంచిన కొంచెము చిక్కని సొనరూపముగు నీరు కారును. దీనిని కీర్తిశేషు

లగు పండిత డి. గోపాలాచార్యులుగారు ఒకసారి తెప్పించి తోటలో పాతివేయించినారు. ఇదియే సోమలతయని వాడుదురనియు, ఇందుండి ఆసవమును తయారుచేయ వచ్చుననియు, సోమపాన మిదియే అయియుండవచ్చుననియు వారు జెప్పియున్నారు. దీని కణుపులలో చిన్న చిన్న ఆకులు గలవు. కాని పౌర్ణమినాటికి 15 ఆకులు పుట్టి తిరిగి అమా వాస్యనాటికి ఒక్కొక్కటిగా నూడిపోవుట నిజమైన సోమ లతకు లక్షణముగా వర్ణింపబడినది. ఆ లక్షణము ఈ తీగ జెముడునందు స్పష్టముగా జూపట్టుటలేదు. ముదురుకాడకు కొన్ని ఆకు లూడిపోవును. కాని పైని చెప్పినట్లు దినమునకు ఒక యాకు క్రమముగా వృద్ధియగుటయు, క్షీణించుటయు పరీ క్షించలేదు. ప్రస్తుతము యజ్ఞములలో పూతిక యనుమూలి కను ఉపయోగించుచున్నట్లు తెలియుచున్నది. ఈతీగజెము డును సోమలత యనుటనుగూర్చి పరిశోధింపవలసియున్నది.

జిల్లేడుపాలవలెనే జెముడుపాలను వెన్నెముక పొడు గునా బూసి దానిపైని పసపు చల్లి ఆరబెట్టినయెడల గట్టిగా అంటుకొనును. దీనిని వాతపు నొప్పులయందు హెచ్చుగా వాడుదురు. పసుపు చల్లకపోయినను ఆరిపోవును. ఇంగిలీక మునకు జెముడుపాలతో చురుకు ఇచ్చుట గలదు. అనగా జెముడుపాలను కొద్ది కొద్దిగా బోయుచు ఇంగిలీకము నొక శరావములో నుంచి దానిని పొయ్యిమీద బెట్టి జెముడు పాలతో సహా ఉడికించుట. ఈ యింగిలీకపు కట్టును తేనెతో అరగదీసి అనేకవ్యాధులలో సిద్ధవైద్యు లుపయోగించు చున్నారు. దీనినిగూర్చి పరిశోధింపవలసియున్నది.

నేను ఆకుజెముడు స్వరసమును కఫశోధనముగా బాగా ఉపయోగించియున్నాను. ఆ-ల.]

---

## లాంగలీ - పొత్తిదుంప

N. O. Lillioceae.

హిందీ – కలియారీ, కలిహారీ; మలయాళం – మేన్‌తోన్ని; కర్ణాటకం – లాంగలి; ద్రావిడం – కలప్పైకిళంగు; లాటిన్ – Gloriosa superba. Eng. The Glory lily.

శ్లో॥ కలిహారీతు హాలినీ లాంగలీ శక్రపుష్ప్యపి।
విశల్యాగ్నిశిఖానంతా వహ్నివక్త్రా చ గర్భనుత్॥

కలిహారి, హాలిని, లాంగలి, శక్రపుష్పి, విశల్య, అగ్నిశిఖ, అనంత, వహ్నివక్త్రి, గర్భనుతు అనునవి లాంగలీనామములు.

## లాంగలీ గుణములు

శ్లో॥ కలిహారీ సరాకుష్ఠ శోఫార్శో వ్రణ శూలజిత్।
సక్షారా శ్లేష్మ జిత్తిక్తా కటుకా తువరాపి చ॥
తీక్ష్ణోష్ణ కృమి హృల్లఘ్వీ పిత్తలా గర్భపాతినీ॥

పొత్తిదుంప తిక్తరసమును, కటుకషాయానురసములను, సరతీక్ష్ణలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. క్షారముతో గూడియుండును. గర్భపాతనము జేయును. పిత్తమును వృద్ధిబొందించును. శ్లేష్మమును శమింపజేయును. కుష్ఠము, శోఫ, అర్శస్సు, వ్రణము, శూల, కృమి అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

లాంగలి. అగ్నిశిఖ. పుష్పసౌరభ.

(ఖ) గుణబోధకములు :

విశల్య. గర్భనుతు. వ్రణహృతు.

### (2) శబ్దార్థములు

లాంగలి - నాగలియొక్క ఆకారమును బోలిన కందమును గలది. అగ్నిశిఖ - అగ్నిజ్వాలలవంటి రేకులతో గూడిన పుష్పములను గలది. పుష్పసౌరభ - పరిమళము గల పుష్పములను గలది (లేక) పుష్పములచే ప్రకాశించునది. విశల్య - శరీరమునందు గ్రుచ్చుకొనిన శల్యములను వెలిబరచునది (లేక) శల్యరూపముననుండు మూఢగర్భమును బయటకు వెలిబరచునది. గర్భనుతు - గర్భస్రావమును (లేక) గర్భపాతమును గలిగించునది. వ్రణహృతు - వ్రణమును బోగొట్టునది.

### (3) పరిచయబోధక లక్షణము

"లాంగలీతి లతా వన్యా రక్తపీతాయుతా శుభా।
ఆర్ద్రికాను దలాచ్చైవ విషకందినికా చసా॥"

లాంగలియొక్క ఆకులు అల్లపాకులతో సమానమైన యాకృతి గలిగియుండును. ఇది తీగరూపమున వృద్ధిబొందును. ఎర్రని వర్ణమును

పసపు పచ్చని వర్ణమును గల పువ్వులను గలిగియుండును. కందము విష గుణములను గలిగియుండును. ఇట్టిది అడవులం దుత్పన్నమగుచుండును.
శి-ద.

N. B.—ఇది కందముతో గూడిన లతాజాతులం దుత్పత్తి గలిగి ఉపవిషాంతర్గతమై కుష్ఠ దుష్ట వ్రణహారములలో నొకటిగా జెప్పబడుచున్నది. పై లక్షణమునుబట్టి దీని యాకులు అల్లపాకులవలె నుండునని దెలియుచున్నను కొంచెము విశాలముగా నుండునని గ్రహింపవలెను. ఇది గ్రామములకు బహిఃప్రదేశములందలి కంచెలలో నుత్పత్తియగుచుండును. వర్షాకాలమునందు విరివిగా లభ్యమగును. దీని పువ్వులు మిక్కిలి అందముగా నుండును. ఎరుపు పసపు వర్ణము గల రేకులను గలిగి మధ్యను సన్నని దీర్ఘములగు కేసరములతో నొప్పియుండును. అయితే దీని కందము విషగుణములు గలదగుటచే నుపవిషములలో జేర్చబడినది. కావున దీనిని యోగములందు చేర్చుకొనునప్పుడు ఇతర విషములకువలెనే శోధనము జేసి యుపయోగించవలెను, దీనికి శోధనము వత్సనాభికివలెనే జేయుదగినది. వైద్యమునందు దీని ప్రయోగములనుబట్టి చూడగా దీనికి బాహ్యోపయోగమే గాని ఆభ్యంతరోపయోగమున్నట్లు గానరాదు. అందు కుష్ఠాది వ్యాధులలో లేపనము రూపముగా నుపయోగింపబడినది. రసశాస్త్రములో పాదరసమునకు మూర్ఛీకరణముకై యిది యుపయోగింపబడినది.

## (4) విశేషగుణములు

గర్భశల్యమును (మూఢగర్భమును) వెలిపరచును.

ధ-ని., వాత కఫములను శమింపజేయును. రా-ని., దుష్ట వ్రణమును బోగొట్టును. సు-సూ-అ 26.

## (5) లాంగలీ శోధనవిధానము

"లాంగలీ శుద్ధిమాయాతి దినం గోమూత్రసంస్థితా॥"
ఆ-ప్ర.

పొత్తిదుంప నొకదినము గోమూత్రమునం దూరబెట్టి మరునాడు ఎండలో నెండించిన నయ్యది పరిశుద్ధమగును.

## (6) లాంగల్యతియోగమున గలుగు వికారములు, వానికి శాన్తి

"కలిహారీ విషే సర్వం వత్సనాభా వివస్మృతం॥"
అ-మం.

పొత్తిదుంపయొక్క మాత్రాధిక్యతచే గలుగు వికారములు వత్స నాభియందువలెనే జనించును. వీనికి శాన్తిగూడ వత్సనాభివిషమునందు వలెనే జేయవలెను.

## (7) ప్రయోగములు

1. అపరాపాతనమునకై లాంగలీ ప్రయోగము.

"లాంగలీ మూల కల్కేన వాఽస్యాః పాణిపాద తలమాలింపేత్॥"

పొత్తిదుంప కల్కమును ప్రసవించిన స్త్రీ పాణిపాదములకు లేపనము చేసిన అపరశీఘ్రముగా బయటకు వెడలును. సు-శా-అ 10.

2. ఉన్మంథ మను కర్ణరోగమున లాంగలీ ప్రయోగము.

"సరలా లాంగలీభ్యాం చ హితమున్మంథనాశనం॥"

దేవదారు, పొత్తిదుంప వీని రసములను కర్ణపూరణములు జేసిన యున్మంథ మను కర్ణరోగము శమించును. సు-చి-అ 25.

3. ఇంద్రలుప్తమునందు లాంగలీ ప్రయోగము.

"ప్రలేపయేత్। తథా లాంగలికామూలైః॥"

పొత్తిదుంప కల్కమును లేపనముజేసిన ఇంద్రలుప్తము (బట్టతల) శమించును. వా-ఉ-అ 24.

4. అపచియందు లాంగలీ ప్రయోగము.

"తైలం లాంగలికీ కంద కల్కపాదే చతుర్గుణే।
నిర్గుండీస్వరసే పక్వం నస్యాద్యైః అపచీప్రణుత్॥"

పొత్తిదుంప కల్కము నాల్గవభాగము, వావిలిరసము నాల్గుభాగములు, తైలమొకభాగము వీని నేకముగాజేసి తైలపాకముజేసి నస్యాది రూపమున నుపయోగించిన అపచి శమించును. వా-ఉ-అ 30.

5. శల్యమునందు లాంగలీ ప్రయోగము.

"శల్య నిర్గమనార్థం వ్రణముఖే లాంగలీ కందలేపః।
సద్యోనిర్యాతి తు తాచ్ఛల్యం చిరకాలనష్టమపి॥"

పొత్తిదుంప కల్కమును శల్యము గ్రుచ్చుకొని వ్రణమైన భాగమున లేపనము జేసినచో నది చిరకాలగతమైనను శీఘ్రముగా శల్యము బయటకు వచ్చును. రా-మా.

6. కృమికర్ణమునందు లాంగలీ ప్రయోగము.

"లాంగలీ మూలక రసం త్ర్యూషణే నావచూర్ణితే।
పూరయే కృమి కర్ణేతు జంతూనాం నాశనం పరం॥"

కృమికర్ణమునందు త్రికటుచూర్ణమును వేసి పొత్తిదుంపరసమును పూరణము చేసినచో కృములు బయటకువచ్చును. గ-ని.

## (8) యోగములు

### 1. లాంగల్యాది గుటిక.

శ్లో॥ లాంగలీ త్రిఫలా లోహ పల పంచాశతీకృతం। మార్కవ స్వరసే పిష్ట్వా గుటికానాం శతత్రయం॥ ఛాయావిశుష్కం గుటికార్ధ మద్యాత్పూర్వం సమస్తా మపితాం క్రమేణ। భజేద్విరిక్తః క్రమశశ్చ మండం పేయాం విలేపీం రసకౌదనం చ॥ సర్పిస్స్నిగ్ధం మాసమేకం యతాత్మా మాసాదూర్ధ్వం సర్వథా స్వైరవృత్తిః। వర్జ్యం యత్నాత్సర్వకాలం త్వజీర్ణం వర్షే ణైవం యోగమేవోపయుంజ్యాత్॥ భవతి విగతరోగో యోఽప్యసాధ్యామయార్తః ప్రబలపురుషకారః శోభతేయోఽపివృద్ధః। ఉపచిత పృథుగాత్ర శ్రోత్ర నేత్రాదియుక్త స్తరుణ ఇవ సమానాం పంచజీవేచ్ఛతాని॥

వా-ఉ-రసాయన.

శుద్ధిజేయబడిన పొత్తిదుంప పది పలములు, కరక్కాయలు పది పలములు, తానికాయలు పది పలములు, ఉసిరికకాయలు పది పలములు, లోహభస్మ పది పలములు ఇటుల గ్రహించి, మెత్తగ చూర్ణించి గుంటకలగరాకు రసముతో జక్కగా మర్దించి 360 మాత్రలను జేసి ఛాయాశుష్కము జేయవలెను. తొలుత స్నేహస్వేదపూర్వకముగ విరేచనకర్మ జేసుకుని, పిమ్మట మండపేయాదిక్రమము ననుసరించి, యొక మాసము యథేష్టాహారమును ఘృతమిశ్రితముగ భుజించవలెను. అటు పిమ్మట ఉదయమున అర్ధగుటికయు, సాయంకాలమున అర్ధగుటికయు

చొప్పున ఒకసంవత్సర కాలము ఈ గుటికల నన్నింటిని సేవించవలెను. వీనిని సేవించునప్పుడు అజీర్ణముజేయు ఆహారమును వర్జింపవలెను. ఇందు వలన అసాధ్యములగు సమస్త వ్యాధులును శమించి, పునర్యౌవనము గలిగి బలపుష్ట్యాదులతో నైదువందల సంవత్సరములు జీవింపగలుగును.

## 2. లాంగల్యాది లేపము.

శ్లో॥ లాంగలీ కృష్ణధుత్తూర విషముష్టిం చ లేపయేత్।
అపక్వే జీర్యతే గ్రంధీ రక్తమోక్షే కృతేఽపివా॥

బ-రా-భగందర.

పొత్తిదుంప, నల్లయుమ్మెత్తగింజలు, విషముష్టిగింజలు వీనిని సమాంశములుగ గ్రహించి జలముతో మెత్తగా నూరి ముద్దజేయవలెను. దీనిని భగందరపిటికకు తొలుత రక్తమోక్షణముజేసిగాని, చేయకగాని లేపనముజేసిన యవ్యాధి శమించును.

## 3. లాంగల్యాది చూర్ణము.

శ్లో॥ లాంగల్యాః కంద చూర్ణం త్రికటుక లవణో యోగ
రాజోఽభి మిశ్రం గవ్యేనాలిహ్యా చూర్ణం మధుఘృత
సహితం చాక్షమాత్రం హితాశీ। నానారుక్ పాదదోష
స్ఫుటన విమథనై ర్మర్మజం తత్ప్రకృష్టైః దుస్సాధ్యం
వాతరక్తం జయతి సనియతం కుష్ఠ మత్యుగ్రరూపం॥

వై-చిం-వాతరక్త.

శుద్ధిజేసిన పొత్తిదుంప చూర్ణమును, త్రికటుచూర్ణమును, సైంధవ లవణ చూర్ణమును సమాంశములుగ గ్రహించి వీటినన్నింటి నేకముగ గలిపియుంచవలెను. ఇయ్యది లాంగల్యాదిచూర్ణ మనబడును. దీనిని ½ తులము మొదలు ఒకతులము వరకు మోతాదు చొప్పున ఆవునేతితో

గాని, తేనెతో గాని సేవించినయెడల పాదదోషము, పాదస్ఫుటనము, మర్మలయందలి శూల, అసాధ్యమగు వాతరక్తము, శిష్ఠము ఇయ్యవి శమించును.

## స్వానుభవము

[ఆంధ్రదేశమునందు పొత్తిదుంపను హెచ్చుగా నుపయోగించు సాంప్రదాయము ఉండినట్లు ఆంధ్రవైద్యచింతామణి మొదలగు పద్యకావ్యములనుండి కనబడుచున్నది. నాభికి బదులు పొత్తిదుంప నుపయోగింపవచ్చునని వారి యభిప్రాయమైనట్లు తోచుచున్నది. మావిపడనప్పుడు మనుష్యులకు బొడ్డుచుట్టు పట్టువేయుదురు. పశువులకు లోపలి కిత్తురు. ఆ-ల.]

---

## గుంజా (శ్వేత) - తెల్లగురివెంద (క)

N. O. Leguminosæ.

హిందీ — గుంజా, ఘూంఘచీ, చిరమిటీ, చౌంటలీ, రత్తీ; మరాఠీ — గుంజా (జ); గుజరాతి — చణోఠీ; మలయాళం — కున్నై; కర్ణాటకం — గురుగింజ; ద్రావిడం — కుందుమణీ; లాటిన్ — Abrus precatorius; Eng. Bead Tree.

శ్లో॥ శ్వేతాగుంజోచ్చటా ప్రోక్తా కృష్ణలా చాపిసాస్మృతా॥

ఉచ్చట, కృష్ణల అనునవి శ్వేతగుంజా నామములు.

## రక్తగుంజా - ఎఱ్ఱగురివెంద (ఖ)

శ్లో॥ రక్తా సా కాకచించీస్యా త్కాకణంతీ చ రక్తికా।
కాకాదనీ కాకపీలుః సాస్మృతాంగార వల్లరీ॥

కాకచించి, కాకణంతి, రక్తిక, కాకాదని, కాకపీలు, అంగార వల్లరి అనునవి రక్తగుంజానామములు.

## గుంజాద్వయ గుణములు

శ్లో॥ గుంజాద్వయం తు కేశ్యంస్యాత్ వాత పిత్త జ్వరా
పహం। ముఖ శోష భ్రమ శ్వాస తృష్ణా మదవినాశినీ॥
నేత్రామయహరం వృష్యం బల్యం కండూ వ్రణా
పహం। కృమీంద్ర లుప్త కుష్ఠాని, రక్తవ ద్ధవలాపి చ
(రక్తా చ ధవలాపి చ)॥

తెల్లగురివెందయు, ఎఱ్ఱగురివెందయు కేశములను వృద్ధిబొందిం చును. వెంటనే శుక్రమును గలిగించును. బలమును గలుగజేయును. వాత పిత్తములను శమింపజేయును. జ్వరము, ముఖశోష, భ్రమ, శ్వాస, తృష్ణ, మదము, నేత్రరోగములు, కండు, వ్రణము, క్రిములు, ఇంద్ర లుప్తము, కుష్ఠము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధ నామములు

(క) పరిచయబోధకములు.

ఉచ్చట. కృష్ణల. కాకచించి. రక్తిక. కాకాదని. అంగారవల్లరి. (గుంజ. కాకతుండిక. చూడామణి. కృష్ణ చూడిక. భిల్లభూషణ. ధ్వాంతునఖ. కాకశింబి.)

(ఖ) ఉత్పత్తిబోధకములు.

(కాంబోజి (భో). వన్య.)

(౫) గుణబోధకములు.

(కాకతిక్త. చటకి. సౌమ్య.)

## (2) శబ్దార్థములు

ఉచ్చట - పైకి ఎత్తుగా ప్రాకునది. కృష్ణల - నల్లని మచ్చను గలిగియుండు బీజములను గలది. కాకచించి - కాకవర్ణముగల చింత (లేక) కాకులచే నివసింపబడు చింత వలె నుండునది (లేక) నల్లని వర్ణము గలిగి చింతాకులవంటి యాకులతో నొప్పునది. రక్తిక - రక్తిక యను తూకము (బరువు)ను గలిగియుండు బీజములను గలది. కాకాదని - కాకులచే దినబడు ఫలములను గలది. అంగారవల్లరి - అగ్ని కణములవంటి బీజములతో గూడిన పండ్లు గల తీగె. గుంజ-శబ్దమును జేయు గింజలతో గూడిన కాయలనుగలది. కాకతుండిక - కాకి నోరువలె నెర్రని బీజములను గలది. చూడామణి - శిఖయందు మణివలె ప్రకాశించు బీజములను గలది (లేక) శిరోరత్నమువలె శిరస్సునందు ధరింపబడు మణివంటి బీజములను గలది. కృష్ణచూడిక - వెనుకప్రక్క శిఖవలె నల్లని వర్ణముగల బీజములను గలది. భిల్లభూషణ - అడవియందు దిరుగువార్లు (చెంచులు) చే భూషణముగా ధరింపబడు బీజములను గలది. ధ్వాంక్షనఖ - కాకిగోళ్లవలె కొనలందు వంగియుండు కాయలతో నొప్పునది. కాకశింబి - కాకులచే దినబడు పై పొట్టుతో గూడిన బీజములను గలది. కాంబోజి - కాంబోజదేశమునం దుత్పత్తియగునది. వన్య - అడవులం దుత్పన్నమగునది. కాకతిక్త - కాకులచే దినబడు

తిక్త (చేదు) రసమును గలది. చటకి - భేదనము జేయు నది. సౌమ్య - సౌమ్యగుణము (స్పర్శ)ను గలది.

## (3) పరిచయబోధక లక్షణము

''గుంజావల్లీ తు మధురా చించాపత్రీ సశింబికా।
బీజం కృష్ణారుణం తస్యాః జాయతే సర్వభూమిషు॥''

గురివెందతీగె చింతాకులవంటి యాకులను గలిగి మధురముగా నుండును. పైని పొట్టుతో గూడిన బీజములను గలిగియుండును. ఈ బీజములు గుండ్రముగనుండి యొకవైపున మండలాకారముగ నల్లని మచ్చను గలిగి మిగిలిన భాగమున నెఱ్ఱని వర్ణమును గలిగియుండును. ఈ లత యెల్లచోటుల నుత్పత్తియగుచుండును. శి—ద. [దీని ఆకులను నమిలి ఉమ్మివేసిన పిదప వేపాకు నమిలిన చేదు తెలియదు. తియ్యగానే ఉండును. అ—ల.]

## (4) భేదములు

ఇది శ్వేత - రక్త భేదముచే రెండువిధములుగా నుండి లతాజాతులలో నుత్పత్తియై యుపవిషాంతర్గత బీజ విషద్రవ్యములలో నొకటిగా గణింపబడుచున్నది. అనగా వీని బీజ ముపవిషములలో నొకటి యని భావము. పై వర్ణనమునుబట్టి యివి లతారూపమున నుత్పత్తియగుననియు, నేదొక వృక్షమునైన నాశ్రయించి దాని చివరవరకు ప్రాకు స్వభావముగలవనియు దెలియగలదు. వీని కాయలు గుత్తులు గుత్తులుగ నుత్పత్తియై బఠాణీ కాయలవలె నుండి కాకిగోళ్లవలె కొనయందు వంపుదిరిగి చిన్నవిగ నుండును. ఇవి తిక్తరసమును గలిగియుండును. ఈ తీగెలపై కాకులు

వాలి వీని పండ్లను విశేషముగా దినుచుండును. ఇవి బాగుగా బండిన బిమ్మట దమంతట నవియే బగులుచుండును. ఇటుల బగిలినప్పుడు లోన బీజము లొక వరుస దేరి యెఱ్ఱగను, తెల్లగను గానుపించుచుండును. అందు ఎఱ్ఱనివి మణులవలె ప్రకాశించుచు జూచుట కందముగా నుండును. కాయలు పూర్తిగా నెండిపోయిన పిమ్మట నందుండి పట్టు వదలి బీజములు భూమిపై రాలిపోవుచుండును. ఇటుల రాలిన గింజలనే గ్రహించుచుందురు. ఇవి విశేషముగా నడవులలో నుత్పత్తియగుచుండుటచే నీ బీజములను కోయవాండ్రు (భిల్లులు) అలంకారవస్తువులుగా తయారుచేసి తలలందు ధరించుచుందురు. వీని యాకులు చింతాకులవలె నుండును. ఈ ద్వివిధ గుంజాలత లుత్పత్త్యాదులందు సమముగనే యుండును గాని బీజములలో నొకటి యెఱ్ఱగను, నొకటి తెల్లగను నుండును. ఇవి తూనిక ద్రవ్యములలో నొకటిగా వ్యవహరింపబడుచున్నవి. 1 గుంజ రమారమి 2 గ్రెయిను లుండును. ఇందుచేతనే వీనిని బంగారు పనివాండ్రు విశేషముగా సేకరించుచుందురు. ఇవి చూచుట కందముగా నున్నను వీని కొకవైపున నల్లని మచ్చ యుండుటచే నట్టి యంద మొకింత మరుగుపడుచుండును. ఇందుచేతనే లోకములో నొకనిపై లోపము నెన్నునపు డట్టివాని నీబీజములతో బోల్చుచుందురు. ఈ బీజములు తీవ్రమైన విషముగా నెంచబడుచున్నవి. దీని వేరు అతిమధురమును బోలి తియ్యగా నుండును.

ఇటుల గురివెంద రెండువిధములుగ నున్నట్లు దెలియు

చున్నను వీనిలో బెద్దజాతి మరియొక భేదమున్నట్లు లోక వ్యవహారమునుబట్టి దెలియగలదు. ఇది 'బండి గురివెంద' యని చెప్పబడుచున్నది. ఇది వృక్షజాతులలో నుత్పత్తి యగును. దీని కాయలు పైవానికంటె బెద్దవిగ నుండును. బీజములు గుండ్రముగను, విశాలముగను, బెద్దవిగను నుండును. ఇవి పై వర్ణములనే గలిగియుండును గాని యట్టి నల్లని మచ్చను లేక యుండును. ఇది పైవాని ప్రసంగములో నిఘంటుకారులచే నేల జెప్పబడలేదో దెలియకున్నది.

## (5) విశేష గుణములు

(క) గుంజాద్వయ - తిక్తరసమును, రూక్ష గుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. విషమును, క్రిమి రోగము మొదలగువానిని బోగొట్టును. ధ-ని., కషాయాను రసమును, తీక్ష్ణగుణమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగి యుండును. విషముతో గూడియుండును. చర్మమునకు హితమైనది. రుచిని బుట్టించును. మత్తును, మూర్ఛను గలిగించును. గ్రహదోషమును బోగొట్టును. కఫ పిత్తములను శమింపజేయును. ని-ర.

(ఖ) బీజ - వాంతిని గలుగజేయును. ధ-రా-ని.

(గ) మూల - శూలను బోగొట్టును. ధ-రా-ని.

(ఘ) పత్ర - విషమును బోగొట్టును. ధ-రా-ని.

(చ) శ్వేత - ఇది వశీకరణమునకు యోగ్యమైనది. మరియు పై గుణములను విశేషముగ గలిగియుండుటచే నిదియే వీనిలో శ్రేష్ఠమైనది. ధ-రా-ని.

## (6) గుంజా శోధనవిధానము

"గుంజా చ కాంజికే స్విన్నా ప్రహరం శుధ్యతి ధృవం॥" ఆ-ప్ర.

గురివెందగింజలను ఒకజాము కాంజికముతో డోలాయంత్రమున స్వేదనము జేసిన శుద్ధియగును.

## (7) గుంజాతి యోగముచే గలుగు వికారములు

"గుంజావిషేణ దౌర్బల్యం ఖేభ్యోరక్త స్సృతిర్భవేత్।
తంద్రా మోహశ్చ గాత్రేషు సంభవేయు ర్వ్రణా భృశం॥" అ-మం.

గుంజావిషాతి యోగమున శరీరదౌర్బల్యమును, స్రోతస్సులనుండి రక్తము బయటకు స్రవించుటయు, తంద్ర, మోహము, శరీరమునందంతటను వ్రణములును సంభవించును.

## (8) గుంజావిషమునకు శాన్తి

"మేఘనాదరసో గ్రాహ్యః శర్కరాయుక్తపానతః।
ఉచ్చటాయా వికారస్య శాంతిః స్యాత్॥"

చిర్రికూర రసమునందు చక్కెర గలిపి సేవించిన గుంజావిష సేవనవలన గలుగు వికారములు శమించును. ర-భా.

## (9) ప్రయోగములు

1. ఇంద్రలుప్తమునందు గుంజాప్రయోగము.

"ప్రచ్ఛయిత్వావగాఢం వా గుంజా కల్కైర్ముహు ర్ముహుః। లేపయే దుపశాన్త్యర్థం॥"

బట్టతల యున్నచోట శిరస్సుపై గాఢముగ లేఖనముజేసి గురివెంద కల్కముతో పలుమార్లు లేపనముజేసిన వ్యాధి శమించును. అనగా తిరిగి కేశము ఉత్పత్తియగునని భావము. సు–చి–అ 20.

## 2. కర్ణపాలీవర్ధనమునకై గుంజాప్రయోగము.

"గుంజాచూర్ణ యుతే జాతే స్నూహిషే క్షీరఉద్ధతం।
నవనీతం తదభ్యంగాత్ కర్ణపాలీ వివర్ధనం॥"

గురివెందచూర్ణమును గేదెపాలలోవేసి పాకముజేసి, యది దధిభావమును బొందినపిమ్మట నందుండి వెన్నను గ్రహించి దీనితో కర్ణపాళులను (చెవితమ్మెలను) అభ్యంగముజేసిన నవి శీఘ్రముగ వృద్ధి బొందును. చ–ద.

## 3. దారుణ మను శిరోరోగమున గుంజాప్రయోగము.

"గుంజా ఫలైః శృతం తైలం భృంగరాజ రసేన చ।
కండూ దారుణహృత్ కుష్ఠ కపాల వ్యాధినాశనం॥"

గుంటకలగరాకు రసము, గురివెందకాయల కల్కము, తిలతైలము వీనిని తైలపాకముజేసి దీనితో శిరస్సును అభ్యంగముజేసిన కండువుతో గూడిన దారుణ మను (క్షుద్రరోగాంతర్గత) వ్యాధియు, కపాల కుష్ఠమును శమించును. భా–ప్ర.

## 4. గండమాలయందు గుంజాప్రయోగము.

"గుంజా ఫలమూలైః తైలం తోయే ద్విగుణేప చేత్। నస్యా భ్యంగేన శమయేత్ గండమాలాం సుదారుణాం॥"

గురివెందఫల మూలముల కల్కమును, తిలతైలమును, దీనికి

రెండు రెట్లు జలమును ఒకటిగా గలిపి తైలపాకముజేసి దీనిని నస్యమును, అభ్యంగమును జేసిన దారుణమగు గండమాల శమించును.

వం—సే.

### 5. గృధ్రసీవాతమునందు గుంజాప్రయోగము.

"ద్విత్రిస్థానేషు గృధ్రస్యాం సిరాప్రచ్ఛన్న వేధితా।
గుంజా కల్కేన లిప్త్వాచ సద్య స్త్యజతి వేదనాం॥"

గృధ్రసీవాతరోగమునందు ఊరుగతసిరను రెండు మూడు చోట్ల వేధించి అందు గురివెంద కల్కముతో లేపనముజేసిన వేదన శీఘ్రముగ శమించును.

వం—సే.

### 6. పిత్తవిసర్పమునందు గుంజాప్రయోగము.

"పిత్తవిసర్పేవా గుంజాపత్త్రైస్తు లేపనం॥"

గురివెందాకుల కల్కముతో లేపనముజేసిన పిత్తజ విసర్పము శమించును.

హా—సం.

### 7. కుష్ఠమునందు గుంజాప్రయోగము,

"అపగత తుష గుంజాచూర్ణ హైయంగవీన ప్రముదిత ముపశాంతిం కుష్ఠినోయాతికుష్ఠం। యదితు భవతి లిప్తం సర్వతస్తామ్రపాత్రే గ్రథితమథిత కిట్టైస్తన్న భూయో భవేత్తు॥"

గురివెంద గింజలకు పైపొట్టు వలచి మెత్తగా చూర్ణించి అప్పుడే కాచిన యావునేతితో గలిపి కుష్ఠవ్రణములకు లేపనముజేసిన శమించును. మరియు పైవిధముగ తయారుజేసిన లేపమును రాగిపాత్రయందూరబెట్టి బాగుగా చేతితో రుద్ది రాగికిలముతోగూడ నీ లేపమును కుష్ఠ

వ్రణములకు పూసిన తిరిగి యెప్పటికిని కుష్ఠురోగము పుట్టకుండునట్లు శమించును.　　గ-ని.

8. తిమిరమునందు గుంజాప్రయోగము.

"గుంజామూలం బస్తమూత్రేణ పిష్టం। అంధ్యం సద్యస్తైమిరంహన్తి పుంసాం అత్యుద్గాఢం నేత్రయో రంజనేన॥"

గురువెంద వేరును మేకమూత్రముతో మెత్తగా నూరి నేత్రముల కంజనము వేసిన వెంటనే అంధ్యము (గ్రుడ్డితనము)ను, తిమిరమును శమించును.　　గ-ని.

9. శిరోరోగమునందు గుంజాప్రయోగము.

"సర్వస్మిన్ శిరో రోగే గుంజా మూలస్య నావనం॥"

గురివెంద వేరు రసమును నస్యముజేసిన శిరోరోగములెల్ల శమించును.　　గ-ని.

10. కృమిదన్తమునందు గుంజాప్రయోగము.

"గుంజా వరాహకర్ణ్యోః అన్యతరస్యాః సముద్ధృతం మూలం। దన్తైశ్చర్విత మాత్రం దశనఘుణోత్థాం నివారయతి॥"

గురివెంద మూలమును పళ్ల (దన్తముల)తో నమిలిన యెడల కృమిదన్తమునందు గలుగు శూల శమించును.　　గ-ని.

11. వాజీకరణమునకు గుంజాప్రయోగము.

"భుక్త్వా చ్చటాం క్షీరయుతాం విలాసీభుంక్తే శతం సుందరి సుందరీణాం॥"

గురివెంద కల్కమునుగాని, చూర్ణమునుగాని పాలతో సేవించిన స్త్రీశతముతో భోగింప శక్తిగలుగును. వై-జీ.

## (10) యోగములు

### 1. గుంజాభద్ర రసము.

శ్లో॥ నిష్కత్రయం శుద్ధసూతం నిష్కద్వాదశ గంధకం।
గుంజా బీజస్య షణ్ణిష్కం నిష్కం జైపాలబీజకం॥
జయా జంబీర ధత్తూర కాకమాచీద్రవైర్దినం। భావ
యిత్వా వటీం కుర్యాత్ ఘృతైర్గుంజా చతుష్టయీం॥
గుంజా భద్రో రసోనామ్నా హింగు సైంధవసంయుతః।
శమయత్యేవనోచిత్రం ఊరుస్తంభం సుదుర్జయం॥

భై-ర. ఊరుస్తంభ.

శుద్ధిజేయబడిన పాదరసము ¾ తులము, శుద్ధిజేయబడిన గంధకము మూడుతులములు, గురివింద గింజలు 1½ తులము, శుద్ధిజేయుబడిన నేపాళ గింజలు ¼ తులము ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిగా నూరి, అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి సోమెంతాకు రసముతో నొకదినమును, జంబీరస్వరసముతో నొకదినమును, ఉమ్మెత్తాకురసముతో నొకదినమును, కామంచియాకు రసముతో నొకదినమును మర్దించి, 4 గుంజల పరిమితిని ఘృతసహాయమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయుబడినట్టిది గుంజాభద్రరసమనబడును. దీనిని భర్జితహింగుచూర్ణ సైంధవలవణ చూర్ణములతో జేర్చి సేవించిన ఊరుస్తంభవాతము శమించును.

## 2. గుంజాది తైలము.

శ్లో॥ గుంజా హయారి శ్యామార్క సర్షపై ర్మూత్రసాధితం।
తైలంతు దశధాపశ్చాత్ కణాలవణపంచకైః॥
మరిచై శ్చూర్ణితైర్యుక్తం సర్వావస్థాగతాంజయేత్।
అభ్యంగా దపచీం నాడీం వల్మీకార్శోఽర్బుదవ్రణాన్॥
భై-ర. గలగండాది.

గురివెందవేరు, గన్నేరువేరు, తెగడవేరు, జిల్లేడువేరు, తెల్లావాలు వీనిని ప్రత్యేకముగ ఒకపలము చొప్పున గ్రహించి, మెత్తగా దంచి కల్కమును సిద్ధముజేయవలెను. పిమ్మట నీ కల్కమును, ఒక ప్రస్థము తిలతైలమును, నాలుగుప్రస్థములు గోమూత్రమును ఒక పాత్రలో జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడి నది గుంజాదితైల మనబడును. పిమ్మట నీ తైలమునుండి పదిభాగములు గ్రహించి అందు పిప్పలిచూర్ణము ఒకభాగమును, పంచలవణచూర్ణము ఐదుభాగములును, మిరియాలచూర్ణము ఒకభాగమును జేర్చి బాగుగా కలియ గలిపి పైన అభ్యంగము జేసిన అపచియు, నాడీవ్రణమును, వల్మీకమును, అర్శస్సును, అర్బుదమును శమించును.

**(11) Actions and uses** :—The seeds are harmless when eaten, but poisonous when a paste of them is applied to the open wound. Applied to the eyes they set up inflammation, oedima of the lids and ulceration of the cornea. The face and neck becomes swollen and the maxillary glands enlarged. Internally the seeds are demulcent, expectorant like liquorice ; used in cough and gonorrhoea. The fresh leaves are chewed with cubebs and sugar to relieve hoarseness of voice as in sore throat and phthoe in the mouth. In spermotorrhoea with bloody

discharges, the white Abrus leaves and herma leaves triturated with the powder of the root of holostemma rheedi with cumin seed and sugar are given internally. With chitrak-moola the paste of the leaves is applied in skin diseases such as leucoderma, and also recommended as a cure for baldness over the scalp. The infusion of the seed should be used fresh, as in a short time it decomposes and swarms with bacteria. Boric acid may be added to prevent decomposition. It is used as an application for the eyes for the cure of pannus and old granular lid. Its use should be followed by weak solution of alum or Borax. When applied to the inner surface it produces artificial purulant opthalmia, varying in intensity with the frequency of applications. It is also used for the cure of lupus and unhealthy ulcers. The paste of the seeds (1 in 4) is used as a rebefacient in sciatica, stiff shoulders and paralysis. The dried roots are made use of in the same manner as liquorice root. — *R. N. Khory II, p. 181.*

## స్వానుభవము

[గురుగింజ గంధము రక్తములో చేరినచో త్రాచు పాము విషమువలె పశువులను చంపుననియు, ఈ గంధమును ముల్లు కర్రల ముల్లుకు పట్టించి ఆ ముల్లుతో ఆవును గాని, ఎద్దునుగాని పొడిచినంతమాత్రమున ఆ విషము రక్త ప్రవాహములో చేరి రక్తమును గడ్డ కట్టించి త్రాచుపాము విషమువలె చంపునని చెప్పుదురు. ఈ విధముగా గ్రామములలో పశురాంతకులు రహస్యముగా చేయుదురని ఆంధ్రదేశమున వాడుక గలదు. పైని యింగ్లీషులో వ్రాసియున్నది గూడ చూడనగును.

గురుగింజ వేరు నిరపాయమైనది. అతిమధురమువలె వృష్యము. గురుగింజ మిక్కిలి హెచ్చుగ వృష్యమగు ననియు, 3–4 గింజలకంటె ఎక్కువగా తీసికొనినయెడల విషముగా పరిణమించి మృత్యుప్రాయమగుననియు తెలియుచున్నది. గింజల చూర్ణమును పాలతో నుడికించి చక్కెర జేర్చి తీసుకొనవలెను. ఈ మధ్య హెచ్చు మోతాదు తీసుకొని ఒకడు మరణించగా ఎగ్మూరు మేజస్ట్రేటు కోర్టులో కేసు జరిగినది. ఈ చికిత్సను సిఫార్సుచేసినది ఒక గోసాయి సాధువు. తాను చెప్పిన మోతాదుకంటె అత్యాశచేత హెచ్చు మోతాదును తీసుకొనుటచే మరణము కలిగె ననియు, తగు మోతాదులో తీసుకొనుటచేత అపాయము లేదనియు రుజువుజేసినపిమ్మట అతడు నిర్దోషి యని విడుదల చేయబడెను. కాబట్టి వృష్యముగను, విషముగను దీని గుణము లేయే పరిణమించుచున్నవో పరిశోధనలు జేయవలెను. ఆ–ల.]

---

## కరవీరః (శ్వేత) - తెల్లగన్నేరు (క)

N. O. Apocynaceæ.

హిందీ - కనేర; మరాఠీ - కణ్హేర; గుజరాతీ - కరేణ, కణేర; మలయాళం - అరలీ; కర్ణాటకం - కరవీర; ద్రావిడం - అరలీ; లాటిన్ - Nerium Odorum; Eng. Sweet scented Oleander.

శ్లో॥ కరవీరః శ్వేతపుష్పః శాతకుంభోఽశ్వమారకః॥

కరవీరము, శ్వేతపుష్పము, శాతకుంభము, అశ్వమారకము అనునవి శ్వేతకరవీర నామములు.

## రక్త కరవీరః - ఎర్ర గన్నేరు (ఖ)

శ్లో॥ ద్వితీయో రక్తపుష్పశ్చ చండాతః లగుడస్తథా॥

రక్తపుష్పము, చండాతము, లగుడము అనునవి రక్తకరవీర నామములు.

## కరవీరద్వయగుణములు

శ్లో॥ కరవీరద్వయం తిక్తం కషాయం కటుకం చ తత్।
వ్రణలాఘవకృన్నేత్ర కోపకుష్ఠ వ్రణాపహం॥
వీర్యోష్ణం కృమికండూఘ్నం భక్షితం విషవన్మతం॥

రెండువిధములగు గన్నేరులు తిక్తరసమును, కషాయకటుకౌను రసములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. వ్రణమునకు లఘుత్వమును గలిగించును. నేత్రకోపము, కుష్ఠవ్రణము, కృమి, కండు అను నీ వ్యాధులను బోగొట్టును. భక్షించినయెడల విషమువలె చంపును. అనగా నీ ద్రవ్యమును లేపనాది బాహ్యప్రయోగములం దుపయోగింపదగును అని భావము.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

(శ్వేత) - శ్వేతపుష్పము - అశ్వమారకము. (హరిప్రియము. గౌరీపుష్పము). (రక్త) - రక్తపుష్పము. (గణేశకుసుమము. రవిప్రియ).

(ఖ) గుణబోధకములు :

(రక్త) - (భూతద్రావి).

## (2) శబ్దార్థములు

శ్వేతపుష్పము - తెల్లని పుష్పములను గలది. అశ్వమారకము - గుఱ్ఱములను చంపునది. హరిప్రియ - విష్ణుమూర్తికి ఇష్టమైనది. గౌరీపుష్పము - పార్వతీదేవికి ప్రియమైనది. రక్తపుష్పము - ఎఱ్ఱని పుష్పములను గలది. గణేశకుసుమము - విఘ్నేశ్వరునకు ప్రియమైనది. రవిప్రియ - సూర్యునకు ఇష్టమైనది. భూతద్రావి - భూతములను బోగొట్టునది.

## (3) పరిచయబోధకలక్షణము

"కరవీరోఽంగులిపత్రః శ్వేతో రక్తశ్చ పీతకః।
తథాపాటలపుష్పశ్చ గుణైస్తుల్య శ్చతుర్విధః॥"

గన్నేరుచెట్టుయొక్క ఆకులు చేతివ్రేళ్లతో సమానముగ అనగా పొడవుగను సన్నముగను నుండును. పుష్పములు తెల్లగను, ఎఱ్ఱగను, పసుపుపచ్చగను, పాటలవర్ణముగను నుండును. ఈ వర్ణభేదముచే గన్నేరు నాలుగు విధములుగా నుండును. గుణములందన్నియును సమముగనే యుండును. శి-ద.

## (4) భేదములు

పైని వివరించిన శివదత్త నిరూపణమునుబట్టి గన్నేరు తెలుపు, ఎరుపు, పసుపు, పాటలము (కొద్దిగ నెరుపు) అను

వర్ణభేదముచే నాలుగువిధములుగా నుండునని దెలియగలదు. రాజనిఘంటుకారుడు శ్వేత, రక్త, పీత, కృష్ణవర్ణములచే నాలుగువిధములుగా నుండునని నిరూపించియున్నాడు. ఈ రెండు నిఘంటువులలో మొదటి మూడు వర్ణములు సమముగనే యున్నవి కాని శివదత్తనిరూపితమగు పాటల వర్ణకరవీరమునకు బదులుగా రాజనిఘంటువునందు కృష్ణవర్ణకరవీరము జెప్పబడినది. ఈ మతభేదమునకు దగినట్లుగనీ జాతులు వ్యవహారమునందు గానుపించుచున్నవో లేవో వివరింప వీలుగాకున్నది. మరియు భావమిశ్రునిచేతను, ధన్వంతరి నిఘంటుకారునిచేతను ఇందు శ్వేతరక్తభేదములు రెండే చేర్కొనబడినవి. అయితే పైని జెప్పినట్లుగ తెలుపు-ఎరుపు-పసపు భేదములు గన్నేరులో విశేషముగా గానుపించుచుండును. ఇంతియేగాకుండ వాడగన్నేరు, బిళ్లగన్నేరు మొదలగు నింకను గొన్ని జాతులు గన్నేరులో గానుపించుచున్నవి. ఇవి పైవానిలో జేరునో లేక ప్రత్యేకభేదములో నిరూపించుట కాధారములు గానుపించకున్నవి. మతభేదమెట్లున్నను గన్నేరు వర్ణభేదముచే ననేకవిధములుగానుండి వృక్షజాతులలో నుత్పత్తిగలిగి క్షీరముతోగూడి ఉపవిషాంతర్గతమై బాహ్యోపయోగముచే కుష్ఠాది వ్రణములను బోగొట్టు ద్రవ్యములలో చేర్కొనబడుచున్నది. ఈ వృక్షములు అంతఎత్తుగాపెరుగు వృక్షములవలెగాక సన్నముగను దీర్ఘముగను నుండు రెమ్మలతో కొద్దిపాటి ఎత్తుగ బెరుగునవిగనుండును. ఆకులు వ్రేళ్లవలె సన్నముగను పొడవుగను నుండును. కాయలు సన్నముగను పొడవుగను

నుండును. పుష్పములు గుండ్రముగనుండి దీర్ఘము గు వృత్త ముతోగూడి యుండును. వీనిలో గొన్ని ముద్దగన్నేరు, గొన్ని రేకగన్నేరు అని వ్యవహరింపబడుచున్నవి. అందు రేక గన్నేరుపువ్వులు మూడు రేకలతోగూడి పైనిచెప్పి నట్లు గుండ్రముగనుండి దీర్ఘవృత్తముతో గూడియుండును. ముద్దగన్నేరుపువ్వుల వృత్తము పొట్టిగా నుండును. ఇవి యనేక రేకలతో గూడి గుండ్రముగా నుండును. పసపు పచ్చగనుండు గన్నేరుపువ్వులును, కాయలును, పైవానికి భిన్నములుగా నుండును. వీని కాయలు గుండ్రముగా నుండును. పువ్వులు ఘంటాకృతిని గలిగియుండును. ఆకులు పైవానివలె సన్నముగను, పొడవుగను నుండును గాని పల చగ నుండును. పసిరికవర్ణమును గలిగియుండును. పైవాని యాకులు దళసరిగను పెళుసుగను నుండి యొక విధముగు నీలివర్ణమును గలిగియుండును. గన్నేరు బీజము మిగుల విషము వంటిది. ఇందుచేతనే "భక్షితం విషవన్మతం॥" అని నిఘంటుకారులచే నిరూపింపబడినది. అనగా భక్షించి నచో విషమువలె చంపును అని భావము. అయితే చరకు నిచే కుష్ఠచికిత్సయందు "స్నానే పానే చ మతాః తథాష్టమ శ్చాశ్వమారస్య॥" అని నిరూపింపబడుటవలన కుష్ఠమును బోలు మహావ్యాధులం దిది ఆభ్యంతరోపయోగమునకు గూడ యుక్తమైనట్లు దెలియుగలదు. విశేషముగ దీనిని బాహ్యోపయోగమునకే గ్రహించుట వ్యవహారమునందు గలదు. వీని పుష్పములు దేవపూజకై విశేషముగ నుప యోగింపబడుచున్నవి.

## (5) విశేషగుణములు

(క) శ్వేతకరవీర - కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. నేత్రములకు హితమైనది. లేపనముజేసిన జ్వరమును, కుష్ఠమును, కండువును బోగొట్టును. ధ-ని., తీక్ష్ణగుణమును గలిగియుండును. విషమును, విస్ఫోటమును బోగొట్టును. రా-ని., లఘుగుణమును గలిగియుండును. కఫమును శమింపజేయును. ప్రమేహమును బోగొట్టును. ని-ర.

(ఖ) రక్తకరవీర - కటురసమును, తీక్ష్ణగుణమును గలిగియుండును. దోషములను శోధించును. త్వగ్దోషమును, వ్రణమును, కండూతిని, కుష్ఠమును, విషమును బోగొట్టును. రా-ని., తిక్తరసమును, కటువిపాకమును గలిగియుండును. ని-ర.

(గ) పాటలకరవీర - శీర్షపీడను, కంపవాతమును బోగొట్టును. ని-ర.

(ఘ) పీత - కృష్ణ కరవీర - ఇవి పైవాని గుణములనే గలిగియుండును. రా-ని.

## (6) కరవీర బీజ శోధనవిధానము

"హయారిర్విషవచ్ఛోధ్యో గోదుగ్ధదోలకేనతు॥"

యో-ర.

గన్నేరు బీజములను డోలాయంత్రమున నావుపాలతో నొక జాము స్వేదనముజేసిన యవ్వవి పరిశుద్ధములగును.

## (7) కరవీర విషాతియోగమున గలుగు వికారములు

"కరవీర విషే తాపో కోష్ఠే భవతిదారుణః।
సశూలా వాంతిరేకౌచ భవేదాక్షేపకోగదః॥"

అ-మం.

గన్నేరుపప్పు నతిమాత్రగా భుజించినచో కోష్ఠమునందు దారుణమైన తాపమును, శూలతోగూడిన వమనవిరేచనములును, ఆక్షేపకవాతమును సంభవించును.

## (8) కరవీర విషశాన్తి

"సితాయుక్తం సదాదేయం దధివా మాహిషం పయః। తథాచార్క త్వచాపీతం కరవీర విషాపహం॥"

అ-మం.

గేదెపెరుగునందుగాని, పాలయందుగాని చక్కెర చేర్చి పలుమార్లు పానముజేసినను పైవానియందు జిల్లేడువేరుపట్ట చూర్ణమును జేర్చి పానముజేసినను గన్నేరు విషవికారములు శమించును.

## (9) ప్రయోగములు

1. కుష్ఠమునందు కరవీర ప్రయోగము.

"స్నానే పానే చ మతాః తథాష్టమశ్చాశ్వమారస్య॥"

గన్నేరు కషాయమును స్నానపానములకై ఉపయోగించిన కుష్ఠము శమించును.    చ-చి-అ 7.

2. పలితమునందు కరవీరప్రయోగము.

"క్షీరపిష్టా వా దుగ్ధికా కరవీరకా।
ఉత్పాట్య పలితం దేయా తావృభావపలితాపహా॥"

పాలకూర వేళ్లను, గన్నేరువేళ్లను పాలతో నూరి శిరస్సునకు లేపనముజేసిన పలితము శమించును. చ-చి-అ 26.

3. అశ్మరియందు కరవీరప్రయోగము.

"కరవీరస్య క్షారః పేయోఽవిమూత్రేణ శర్కరా
నాశనః పరః॥"

గన్నేరు క్షారమును గోమూత్రముతో గలిపి సేవించిన అశ్మరి శర్కర శమించును. సు-చి-అ 7.

4. ఉపదంశమునందు కరవీరప్రయోగము.

"కరవీరస్య పత్రాణి...ప్రక్షాలనే ప్రయోజ్యాని॥"

గన్నేరాకుల కషాయముతో ప్రక్షాళనముజేసిన ఉపదంశ వ్రణము శమించును. సు-చి-అ 15.

5. గర్భిణీ కిక్కిస కండ్వాదులందు కరవీరప్రయోగము.

"అశ్వఘ్న పత్రసిద్ధేన తైలేనాభ్యజ్యమర్దయేత్॥"

గన్నేరాకుల కల్క కషాయములతో సిద్ధముచేయబడిన తైలమును అభ్యంగముజేసి మర్దించినయెడల గర్భిణికి కలుగు కండు, కిక్కిసము మొదలగునవి శమించును. వా-శా-అ 1.

6. ఇంద్రలుప్తమునందు కరవీరప్రయోగము.

"ప్రలేపయేత్...కరవీరరసేన వా॥"

గన్నేరు రసముతో లేపనము జేసిన ఇంద్రలుప్తము శమించును.

వా-ఉ-అ 24.

7. వ్రణమునందు కరవీరప్రయోగము.

"చిత్రకోహాయమారకః...దారణం॥"

చిత్రమూలము, గన్నేరు వీని కల్కమును లేపనము జేసిన వ్రణ శోఫ పగులును.

చ-ద.

8. పామయందు కరవీరప్రయోగము.

"లేపాద్వినిహంతి పామాం తైలం కరవీరసిద్ధం వా॥"

గన్నేరువేళ్ల కల్క కషాయములతో సిద్ధముచేసిన తైలమును లేపనముజేసిన పామ (గజ్జి) శమించును.

చ-ద.

9. నేత్రకోపమునందు కరవీరప్రయోగము.

"కరవీర తరుణ కిసలయచ్ఛేదోద్భవో బహుల సలిల సంపూర్ణః। నయన యుగంభవతి దృఢం సహసైవ తత్ క్షణాత్ కుపితం॥"

మిగుల కలకబారి కుపితమైనట్టి నేత్రమునందు లేతగన్నేరాకుల రసమును పూరణముజేసినయెడల వెంటనే నేత్రకోపము శమించును.

చ-ద.

(10) యోగములు

1. కరవీరతైలము

శ్లో॥ శ్వేతకరవీరమూలం విషాంశకంసాధితం గోమూత్రే।
చర్మదళసిధ్మపామా విస్ఫోట క్రిమికిటిమజి త్తైలం॥

భై-ర. కుష్ఠ.

తెల్లగన్నేరు వేరు 1 పలము, వత్సనాభి 1 పలము ఇటుల గ్రహించి, మెత్తగాదంచి కల్కమును సిద్ధముజేసి, దీనితో 8 పలములు తైలమును, 32 పలములు గోమూత్రమునుజేర్చి మందాగ్నిచే తైలపాకము జేసి వడియగట్టవలెను. దీనిని అభ్యంగముజేసిన చర్మదళము, సిధ్మ, పామ, విస్ఫోటము, క్రిమి, కిటిభము అను కుష్ఠరోగములెల్ల శమించును.

## 2. కరవీరాదితైలము

శ్లో॥ కరవీర నిశాదన్తీ లాంగలీ లవణాగ్నిభిః।
మాతులుంగార్క వత్సాహ్వైః పచేత్తైలం భగందరే॥

భై - ర. భగందర.

గన్నేరువేరు, పసపు, దన్తీమూలము, పొత్తిదుంప, సైంధవలవణము, చిత్రమూలము, మాదీఫలము, జిల్లేడువేరు, కొడిశపాలపట్ట వీనిని ప్రత్యేకముగ ¼ పలము చొప్పున గ్రహించి మెత్తగాదంచి, కల్కమును సిద్ధముజేయవలెను. పిమ్మట నీ కల్కముతో 1 ప్రస్థము తైలమును, 4 ప్రస్థముల జలమును జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది కరవీరాది తైలమనబడును. దీనిని అభ్యంగముజేసిన భగందరవ్రణము శమించును.

## 3. హయమారాదితైలము

శ్లో॥ హయమారామృతావ్యోష సింధూత్థైః సరసాంజనైః।
త్రివృద్దన్తీ నిశాభిశ్చ పథ్యాకట్ఫలముస్తకైః॥
ఇంద్రవారుణికాపాఠా నాగకేసరచిత్రకైః।
సిద్ధంతైలం నిహన్త్యాశు యోనికండూం సుదారుణాం॥

భగాంకురస్య సంవృద్ధిం స్మరోన్మాదంచ యోషితాం।
యోనివ్రణంచ తత్క్లేదం తదర్శాంసిచ సర్వథా॥

భై-ర. స్త్రీరోగ.

గన్నేరువేరు, తిప్పతీగ, త్రికటుకములు, సైంధవలవణము, రసాంజనము, తెగడ, దన్తీమూలము, పసపు, కరక్కాయలు, కాయ ఫలచెక్క, తుంగముస్తలు, చేదుపుచ్చవేరు, చిరుబొద్ది, నాగకేసరాలు, చిత్రమూలము వీనిని ప్రత్యేకముగ 1 తులముచొప్పున గ్రహించి, మెత్తగాదంచి కల్కమును సిద్ధముజేసి, దీనితో 1 ప్రస్థము తైలమును, 4 ప్రస్థములు జలమునుజేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. దీనిని అభ్యంగము జేసిన యోనికండు, స్మరోన్మాదము, యోనివ్రణము, యోనిక్లేదము, యోన్యర్శస్సు ఇవి శమించును.

(11) Actions and uses :—Oleandriv (leaves contain an alkaloid oleandriv), if hypodermically injected, causes the heart beats to fall from 75 or 80 to 10 or 12; if continued for some time the heart ceases to beat and with it the respiration. Both the root and root-bark are powerful diuretic, and cardiac tonic like strophanthine and digitalin. An infusion is given in cardiac systole as well as in dropsy. The root is often used to procure abortion and for the purpose of self-destruction. Villagers use the powder of the dried leaves as a remedy for colic, and as an errlime. The paste is applied to chancres and ulcers on the genitals and on ring worm.

—*R. N. Khory, II, p. 389.*

Constituents of Thevetia Nerifolia (పీతకరవీర.) The bark contains 'Thevetin.'

**Actions and uses :**—Two grains of this bark is equal to 10 grains of cinchona bark. The bark is bitter, anti-

periodic; it is given with benefit in remittent and intermittent fevers. In large doses it acts as an emetic and purgative and in poisonous doses as ansacrid poison. The oil is emetic and purgative, like olive oil it is used externally.

—*R. N. Khory, II, p. 392.*

The antiperiodic properties of the bark have been conformed by Dr. G. Bidie and Dr. J. Shortt. Their trials with it in various forms of remittent fever proved highly satisfactory and leave little doubt that it is a remedy of considerable power. It is employed in the form of tincture (one ounce of the freshly dried bark macerated for 8 days in 5 oz. of rectified spirit) in doses of from 10 to 15 drops thrice daily.

—*Dymock II, p. 406-7.*

---

## కారస్కరః - విషముష్టి చెట్టు

N. O. Loganiaceae.

మలయాలం - కారస్కరం; కర్ణాటకం - కాసరకా; ద్రావిడం - ఎట్టి; లాటిన్ - Strychnos Nux vomica; Eng. Poison nut.

శ్లో॥ కారస్కరస్తు కింపాకః విషతిందు ర్విషద్రుమః।
కుపీలుః కాలకూటశ్చ గరద్రుమ ఇతిస్మృతః॥

కారస్కరము, కింపాకము, విషతిందువు, విషద్రుమము, కుపీలు, కాలకూటము, గరద్రుమము అనునవి కారస్కర నామములు.

## కారస్కర గుణములు

శ్లో॥ కారస్కరస్తు తిక్తః స్యాత్ కటూష్ణః కుష్ఠనాశనః।
వాతామయాస్ర కండూతి కఫా మార్శో వ్రణాపహః॥

విషముష్టి గింజలు తిక్తరసమును, కటుకానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. కఫమును శమింపజేయును. కుష్ఠము, వాతరోగము, రక్తదుష్టి, కండు, ఆమము, అర్శస్సు, వ్రణము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

పరిచయబోధకములు :

విషద్రుమము. (రమ్యఫలము. వర్తులము. చిపిటము).

### (2) శబ్దార్థములు

విషద్రుమము - విషబీజములు గల కాయలను గల చెట్టు. రమ్యఫలము - చూచుటకు అందముగానుండు ఫలములతో గూడియుండినది. వర్తులము - గుండ్రముగానుండు బీజములను గలది. చిపిటము - మధ్యభాగమున సొట్ట (లోతు (లేక) నొక్కుడు) గలిగిన బీజములను గలది.

### (3) పరిచయబోధక లక్షణము

"పాదపో విషతిందుఖ్యో నాగవల్లీదలః కటుః।
తద్బీజం చిపిటం తిక్తం శాణికం పాండురోమశం॥"

విషముష్టిచెట్టు తమలపాకులవంటి యాకులను గలిగి కటురసముతో గూడియుండును. దీని బీజము మధ్యభాగమున సొట్టతోగూడియుండి యంతటను తెల్లని నూగును గలిగి యొప్పుచుండును. ఇది శాణ

ప్రమాణ మెత్తును గలిగియుండును. మరియు నిది తిక్తరసమును గలిగి యుండును. శి-ద.

## (4) విశేషగుణములు

(క) హెచ్చుగ తిక్తరసమును గలిగియుండును. కఫ వాతములను శమింపజేయును. విషమును బోగొట్టును. శో-ని., కషాయరసమును, కటుతిక్తానురసములను, లఘు గుణమును గలిగియుండును. మత్తును గలిగించును. మలాదులను నిరోధించును. జ్వరమును బోగొట్టును. ని-ర.

---

N. B.—ఈ వృక్షము ఎత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి యుపవిషాంతర్గతమై వాతహర ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగ గణింపబడుచున్నది. ఈ వృక్షములు విశేషముగా కొండలమీదను, అడవులలోను వృద్ధిబొందును. వీని కాయలు పండినప్పుడు గుండ్రముగాను ఎర్రగాను నుండి చూచుటకు రమ్యముగా నుండును. లోపలి బీజములు తప్పటగను, గుండ్రముగను, మధ్యను పల్లముగను ఉండి పైని యొకవిధమగు తెల్లని పొరచే కప్పబడియుండును. ఇవి విషముతో గూడియుండును. వీనిని సాంప్రదాయానుసారముగ శోధించి యోగములందు జేర్చ దగియుండును. మరియు వీనిని శుద్ధిజేసిన పిమ్మట మెత్తగా చూర్ణించి ప్రత్యేకముగ రసాయనరూపమున ప్రయోగించుటయు వాడుకలో గలదు.

(ఖ) ఆమఫల - కషాయరసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధిబొందించును. ని-ర.

(గ) పక్వఫల - విశదగురుగుణములను, మధురవిపాకమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. ప్రమేహమును, రక్తవికారమును బోగొట్టును. ని-ర.

## (5) విషముష్టి శోధనవిధానము

(క) "త్రిదినం కాంజికే క్షిప్తం శుద్ధం స్యాద్విషతిందుకం॥"

విషముష్టిగింజలను మూడుదినములు కాంజికమునం దూరబెట్టి వేడినీళ్లతో గడిగిన శుద్ధియగును. వై-ని.

(ఖ) "కించిదాజ్యేన భృష్టోవై విషముష్టి ర్విశుధ్యతి॥"

నేతితో కొద్దిగ వేయించిన విషముష్టి గింజలు శుద్ధములగును.

బృ-యో-తరంగిణి,

---

N. B —విషముష్టి గింజలను ఆవుపాలతో డోలాయంత్రమున మూడుజాములు పాకముజేయవలెను. పిమ్మట వేడినీళ్లతో కడిగి పైనుండు తోలును తడిగనున్నప్పుడే కత్తితో తొలగించవలెను. పిమ్మట రాతిపై మెత్తగా కల్కమువలె నూరి యీ పిష్టమును ఇనుపబాణలియందుంచి అందు కొద్దిగ నేయి జేర్చి దోరవేపుగా వేయించవలెను. ఇటుల జేసినచో శుద్ధియగును. ఈ సాంప్రదాయము హెచ్చుగ వ్యవహారములో గలదు.

## (6) విషముష్టియొక్క అతియోగముచే గలుగు వికారములు

"భ్రమో హృదివ్యథా సర్వగాత్ర భంగోఽతిస్వేదతా।
ధనుర్వాత పరీతశ్చ విషతిందోర్వ్యాపే భవేత్॥"

అ-మం.

భ్రమ, హృదయమునందు పీడ, సర్వగాత్రభంగము, అతిస్వేదమును విషముష్టి బీజాతియోగమున గలుగును. మరియు ధనుర్వాతము గూడ సంభవించును.

## (7) విషముష్టి విషశాన్తి

"ఘృతం మధుసితాయుక్తం సదా పిబతియోనరః।
విషముష్టి వికారస్య శాన్తిస్తస్యప్రజాయతే॥"

అ-మం.

ఘృతమును, తేనెను, చక్కెరను ఏకముజేసి సేవించినచో విషముష్టి విషవికారములు శమించును.

## (8) యోగములు

### 1. విషతిందుక తైలము

శ్లో॥ విషతరుఫలమజ్జా ప్రస్థయుగ్మంచ శిగ్రుస్వరసలకుచ
వారి ప్రస్థమేకైకశంచ। కనకవరుణ చిత్రాపూగనిర్గుండికాస్నుక్ స్వరసతురగగంధా వైజయన్తీరసశ్చ॥
పృథగితి పరికల్ప్య ప్రస్థయుగ్మేన యుక్తం విషతరుఫల
మజ్జాతుల్యతైలం విపక్వం। లశున సరళయష్టీ కుష్ఠ
సింధూత్థయుగ్మం దహనతిమిర కృష్ణాకల్కయుక్తంసు

సిద్ధం॥ హరతి సకలవాతాన్ ఘోరరూపానసాధ్యాన్
ప్రతిదినమనులేపాత్ సుప్తవాతస్య జన్తోః॥ కుష్ఠ మష్టా
దశవిధం ద్వివిధంవాతశోణితం। వైవర్ణ్యం త్వగ్గతాన్
దోషాన్ నాశయత్యాశు మర్దనాత్॥

భై-ర. వాతరక్త.

విషముష్టి పండ్లరసము 1 ప్రస్థము, మునగచెక్కరసము 1 ప్రస్థము, జంబీర స్వరసము 1 ప్రస్థము, ఉమ్మెత్తాకుల స్వరసము 2 ప్రస్థములు, ఉలిమిరిచెక్క రసము 2 ప్రస్థములు, చిత్రమూల రసము 2 ప్రస్థములు, పోకకాయల రసము 2 ప్రస్థములు, వావిలాకురసము 2 ప్రస్థములు, జెముడుకోడల రసము 2 ప్రస్థములు, వెన్నెరుగడ్డల కషాయము 2 ప్రస్థములు, సోమెంతాకు రసము 2 ప్రస్థములు ఇటులనొక పాత్రలో బోసి అందు 1 ప్రస్థము తిలతైలమును, వెల్లుల్లి, సరళదారు, అతిమధురము, చంగల్వకోష్ఠు, సైంధవలవణము, బిడాలవణము, చిత్రమూలము, చీకటిమ్రాను, పిప్పళ్లు వీనిని ప్రత్యేకముగ 1 పలము చొప్పున గ్రహించి, మెత్తగాదంచి కల్కమును సిద్ధముజేసి, యీ కల్కమునుగూడ జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది విషతిందుకతైలమనబడును. దీనిని అభ్యంగముజేసిన సమస్త వాతవ్యాధులును, కుష్ఠమును, వాతరక్తమును, త్వగ్దోషమును శమించును.

(9) **Actions and uses**:—The seeds are nervine, stomachic, tonic and aphrodisiac. Externally the paste is antiseptic; the solution is highly irritant to the tissues. If injected subcutaneously it is poisonous. The action of nux vomica is that of strychnine. In small doses it stimulates the stomach and intestines, increases the gastric, the pancreatic, the intestinal and the biliary secretions; strychnine promotes digestion, sharpens appe-

tite, increases peristalysis and acts as a purgative. It stimulates the uterus and the genito-urinary organs, promotes menstruation and increases virile powers. It increases the flow of urine and is often found in the urine, saliva and sweats. It is a cumilative poison, it contracts renel arteries and thus hinders its own excretion by the kidneys. In large doses it produces tetanic spasms .....As a general stimulant it is given in acute or chronic fevers, anaemia, chlorosis, wasting and other exhausting diseases, also in hysteria, chorea, epilepsy, infra-orbital neuralgia of the viscera etc. In local paralytic affections it should be given only after the acute stage has passed away. In prolapsus ani, in incontinence of urine, due to atony of the bladder and sometimes in impotence and spermatorrhoea it may be given with benefit............

*R. N. Khory Vol. II, p. 407-8.*

---

## ఖసబీజాని - గసగసాలు (క)

హింది - ఖసఖస, ఖసఖసకా ఫల; మరాఠి - ఖసఖస, ఖస్ ఫల; గుజరాతి - ఖసఖస, అఫీణనాడోడవ; మలయాలం - కసకస, ఖస, ఖసబీజం; కన్నడం - గసగసె (తగతే); ద్రావిడం - గసగస.

శ్లో॥ ఉచ్యంతే ఖసబీజాని తే ఖాఖసతిలా అపి॥

ఖసబీజములు, ఖాఖసతిలలు అనునవి ఖసబీజనామములు.

## ఖసబీజగుణములు

శ్లో॥ ఖసబీజాని బల్యాని వృష్యాణి సుగురూణి చ।

జనయంతి కఫంతాని శమయంతి సమీరణం॥

గసగసాలు గురుగుణమును గలిగియుండును. బలమును గలుగ జేయును. శుక్రమును వృద్ధిబొందించును. కఫమును వృద్ధిజేయును. వాతమును శమింపజేయును.

## ఖసతిలః - గసగసాలకాయపైని బెరడు (ఖ)

శ్లో॥ తిలభేదః ఖసతిలః ఖాఖసశ్చాపి స స్మృతః॥

తిలభేదము, ఖసతిలము, ఖాఖసము అనునవి ఖసతిలనామములు,

### ఖసతిలగుణములు

శ్లో॥ స్యాత్ ఖాఖసఫలోద్భూతం వల్కలం శీతలం లఘు।
గ్రాహితిక్తం కషాయం చ వాతకృత్కఫకాసహృత్॥
ధాతూనాం శోషకం రూక్షం మదకృద్వాగ్వివర్ధనం।
ముహుర్మోహకరం రుచ్యం సేవనాత్ పుంస్త్వనాశనం॥

గసగసాలకాయపైని బెరడు తిక్తరసమును, కషాయానురసమును, లఘురూక్షగుణములను, శీతవీర్యమును గలిగియుండును. మలమును నిరోధించును. రుచిని బుట్టించును. ధాతువులను శోషింపజేయును. మత్తును గలిగించును. వాక్కును వృద్ధిబొందించును. తరచు మూర్ఛను గలిగించును. హెచ్చుగ సేవించిన పుంస్త్వమును బోగొట్టును. వాతమును వృద్ధిజేయును. కఫమును శమింపజేయును. కాసమును బోగొట్టును.

## అహిఫేనం - నల్లమందు (గ)

N. O. Papaveraceae.

హింది - అఫీమ్, పోస్తకోడోఢే; మరాఠి - అఫూ; గుజరాతి - అఫీణ, ఆఫీణనా, డోడవా; మలయాళం - కరుప్పు; కన్నడం - అఫీమ్; ద్రావిడం - అబిని; లాటిన్ - Papaver Somniferum; Eng. Opium,

శ్లో॥ ఉక్తం ఖసఫలక్షీరం ఆఫూకమహిఫేనకం॥

ఖసఫలక్షీరము, అఫూకము, అహిఫేనకము అనునవి యహిఫేన నామములు.

## అహిఫేనగుణములు

శ్లో॥ ఆఫూకం శోషణం గ్రాహి శ్లేష్మఘ్నం వాతపిత్తలం।
తథాఖసఫలోద్భూత వల్కలప్రాయ మిత్యపి॥

నల్లమందు ధాతువులను శోషింపజేయును. మలమును నిరోధించును. వాతపిత్తములను వృద్ధిజేయును. శ్లేష్మమును శమింపజేయును. మరియు గసగసాలకాయపైని బెరడునకు జెప్పిన గుణములనుగూడ గలిగి యుండును.

## విశేషాంశములు (౧)

### (1) ప్రసిద్ధనామములు

పరిచయబోధకములు: ఖసఫలక్షీరము, అహిఫేనకము.

### (2) శబ్దార్థములు

ఖసఫలక్షీరము - గసగసాల పండ్లనుండి పాలవలె స్రవించునది. అహిఫేనకము - పాముయొక్క నోటినుండి గ్రక్కబడు నురుగువంటి చొంగవలె నుండునది.

### (3) భేదములు

"జారణో మారణశ్చైవ ధారణ స్సారణస్తథా।
అహిఫేన శ్చతుర్ధోక్తో గుణాంస్తస్యబ్రవీమితే॥ శ్వేత

వర్ణో జారణః స్యాత్ భుక్తమన్నం చ జారయేత్। మృతిప్రదః కృష్ణవర్ణో మారణస్తు ప్రకీర్తితః॥ జరా నాశకరః పీతో ధారణః సంప్రకీర్తితః। చిత్రవర్ణః సారణః స్యాన్మలసారణకార్యతః॥''

నల్లమందు వ్యవాయి ద్రవ్యములందును, ఉపవిషము లందును పరిగణింపబడుచున్నది. ఇది ''జారణము, మారణము, ధారణము, సారణము'' అని నాలుగు విధములుగా నుండును. అందు జారణమనునది తెల్లగనుండును. ఇది భుజించిన యాహారమును జీర్ణింపజేయును. మారణమనునది నల్లగనుండును. ఇది మరణమును గలిగించును. ధారణమనునది పసుపుపచ్చగ నుండును. ఇది ముసలితనమును బోగొట్టును. సారణమనునది అనేకవర్ణములను గలిగియుండును. ఇది మలమును బయటకు వెడలింపజేయును. ని-ర.

## (4) విశేషగుణములు

వెంటనే శుక్రమును గలిగించును. సన్నిపాతమును బోగొట్టును. రా-ని., మధురానురసమును గలిగియుండును. సంతోషమును గలిగించును. నేత్రములకు మత్తును (దృష్టిమాంద్యమును) గలిగించును. శుక్రమును స్తంభింపజేయును. క్రిములు, పాండువు, ప్రమేహము, శ్వాసము, కాసము, ప్లీహాభివృద్ధి, ధాతుక్షయము వీనిని బోగొట్టును. ని-ర.

## (5) అహిఫేన శోధన విధానము

"అహిఫేనం శృంగబేర రసైర్భావ్యం త్రిస ప్తథా।
శుధ్యత్యుక్తేషు యోగేషు యోజయేత్తు విధానతః॥"

నల్లమందును శుంఠిరసముతో నిరువదియొక్క మార్లు భావనజేసిన శుద్ధియగును. ఈ విధముగ శుద్ధిజేసిన బిమ్మట నల్లమందును ఔషధ యోగములందు జేర్చుకొనవలెను. (విరుగుడు శుంఠి) అ-ప్ర.

## (6) అహిఫేనాతియోగముచే గలుగు వికారములు

"అహిఫేనే మూర్ధ గురుతా భ్రమ ఆధ్మానమేవ చ।
కృచ్ఛ్రశ్వాసో భవేదోష్ఠ ముఖనేత్రేషు కృష్ణతా॥
అతిస్వేదోఽంగశైథిల్యం శైత్యం స్యాద్ధస్త
పాదయోః॥" అ-మం.

నల్లమందు నతిగా సేవించినప్పుడు తల బరువెక్కుట, భ్రమ, కడుపుబ్బరింపు, కష్టమైన శ్వాస, ఓష్ఠములందు ముఖమునందు, నేత్రములందు నల్లని వర్ణమేర్పడుట, అధిక స్వేదము, అంగశైథిల్యము, హస్త పాదములు చల్లగానుండుట అను వికారములు సంభవించును.

## (7) అహిఫేన విషశాన్తి

"బృహత్ క్షుద్రా రసం దుగ్ధం పలమాత్రం నిషేవణాత్। నాగఫేన విషం యాతి సజీవతి చిరం పుమాన్॥" అ-మం.

పెద్దవాకుడుకాయల రసమొక పలముచొప్పున ఆవుపాలతో గలిపి ప్రతినిత్యము సేవించినచో నల్లమందు విషమువల్ల నేర్పడిన వికారములు శమించును.

## (8) ప్రయోగములు

### 1. రక్తపీనసమందు అహిఫేన ప్రయోగము.

"రక్తపీనసకును యుక్తంబు కర్పూరమును శుద్ధి
గావించి మోదమలర। పాత నల్లమందును నివి పరగ
నొకటి పటికె పొంగించి యది రెండుపాళ్లు నావు।
వెన్నతోడుత కంచాన వేసి నూరి కన్నులకు బెట్ట
రక్తంపు కాసమాను॥"

శుద్ధిజేసిన కర్పూరము ఒకభాగము, పాతనల్లమందు ఒకభాగము, పొంగించిన పటికారము రెండుభాగములు ఇటుల గ్రహించి, మెత్తగ చూర్ణించి, కంచు కంచమునందు బెట్టి యావు వెన్నతో మెత్తగా కలియువరకు చేతితో రుద్ది కన్నులకు అంజనము జేసిన రక్తపీనసము బోవును. అం-వై-చిం. పుట 97.

### 2. ప్రవాహిక - అతిసారములందు అహిఫేన ప్రయోగము.

చింతపండులోని మెత్తని గుజ్జు, రాతిసున్నము, నల్లమందు వీనిని తగుమాత్రము గ్రహించి చేతితో మెత్తగా నలిపి కుంకుడుగింజలంత మాత్రలుజేసి దినమునకు మూడుపూటల మూడుమాత్రలు చొప్పున ఇచ్చిన ప్రవాహిక, అతిసారమును శీఘ్రముగ శమించును.

(అనుభూతము).

### 3. అభిష్యందము (కండ్లకలక)నందు అహిఫేన ప్రయోగము.

నల్లమందును చనుబాలతో నరుగదీసి కనురెప్పలచుట్టును బట్టు వేసిన కండ్లకలకయందు కలుగు పోటు, స్రావము, కండ్లయందలి యెరుపు ఇవి శమించును. (అనుభూతము).

## (9) యోగములు

### 1. క్షీరవటిక.

శ్లో॥ గృహీత్వాదరదాత్కర్షం తదర్ధం దేవపుష్పకం। ఫణి
ఫేనం విషం జాతీ ఫలం ధుస్తూర బీజకం॥ సమ్మర్ద్య
విజయార్ద్రావైః ముద్గమాత్రాం వటీం చరేత్। అను
పానం ప్రదాతవ్యం శోథే క్షీరం భిషగ్వరైః॥ గ్రహ
ణ్యాం విజయాక్వాథః పథ్యం దుగ్ధాన్నమేవ చ। జలం చ
లవణం చాపి వర్జనీయం విశేషతః॥ ప్రబలాయాముద
న్యాయాం సలిలం నారికేళజం। పాతవ్యం వటికాచైషా
శోథం హన్తి న సంశయః॥ గ్రహణి మతిసారం చ
జ్వరం జీర్ణం నిహన్తి చ॥ భై-ర-శోథ.

శుద్ధిజేసిన హింగుళము 1 తులము, లవంగములు ½ తులము, నల్ల మందు ½ తులము, శుద్ధిజేసిన వత్సనాభి ½ తులము, జాజికాయలు ½ తులము, శుద్ధిజేసిన ఉమ్మెత్తగింజలు ½ తులము ఇటుల గ్రహించి, తొలుత హింగుళమును ఖల్వమునందు మెత్తగా నూరి అందు నల్లమందును, మిగిలిన ద్రవ్యముల చూర్ణములను జేర్చి గంజాయాకు కషాయముతో జక్కగా మూడుదినములు మర్దించి పెసరగింజ ప్రమాణమున మాత్రలు జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది క్షీరవటిక యనబడును. దీనిని ఒక్కొక్క మాత్రచొప్పున శోఫయందు క్షీరానుపానముతో సేవించవలెను. గ్రహణీరోగమున గంజాయాకు కషాయము యొక్క అనుపానముతో సేవించవలెను. పాలు అన్నమును పథ్యముగా దీసుకొనవలెను. జలపానమును, లవణసేవయు వర్జింపవలెను. తృష్ణ హెచ్చుగానున్నచో నారికేళోదకమును సేవించవలెను. ఇయ్యది గ్రహణీరోగమును, అతిసారమును, జీర్ణజ్వరమును బోగొట్టును.

## 2. శశిప్రభావటిక

శ్లో॥ భుజంగఫేనం మధుకంఘనంచ కోలాస్థి శస్యం సమ
భాగమేవ। ఆదాయతోయేన విమర్ద్యఖల్వే ద్విరక్తి
మానావటికా విరచ్యా తమాంసి నైశాని శశిప్రభైవ
హన్త్యాద్ధి కాసాదిక మామవాతం॥ భై-ర. కాస.

నల్లమందు, అతిమధురము, తుంగముస్తలు, రేగుగింజలలోని పప్పు వీనిని సమాంశములుగ గ్రహించి, తొలుత నల్లమందును జలముతో ఖల్వమున మెత్తగా నూరి, పిమ్మట మిగిలిన ద్రవ్యముల చూర్ణమును అందు జేర్చి చక్కగా మర్దించి రెండు రక్తికల పరిమితిని మాత్రలు జేయవలెను. ఇయ్యది శశిప్రభావటిక యనబడును. దీనిని ఒక్కొక్క మాత్ర చొప్పున సేవించిన కాసము, ఆమవాతము, శూల, గళ రోగ మును శమించును.

## 3. అహిఫేనాసవము.

శ్లో॥ తులాం మధూకమద్యస్య శుభేభాండే పరిక్షిపేత్।
ఫణిఫేనస్యకుడవం ముస్తకం ఫల సమ్మితం॥
జాతీఫలంచేంద్రయవం లక్షైలాంతత్రదాపయేత్।
రుద్ధ్వాభాండం మాసమాత్రంయత్నతః పరిరక్షయేత్॥
హన్త్యతీసార మత్యుగ్రం విషూచీ మపిదారుణాం॥
భై-ర. అతీసార.

ఇప్పకల్లు 100 పలములు గ్రహించి, యొక భాండమునందు జేర్చి అందు 4 పలములు నల్లమందును, 1 పలము తుంగముస్తల చూర్ణ మును, 1 పలము జాజికాయల చూర్ణమును, 1 పలము కొడిశపాల గింజల చూర్ణమును, 1 పలము ఏలకుల చూర్ణమును కలిపి ఆసవవిధాన

మున బంధించి యొకమాసము అటులనే యుంచవలెను. పిమ్మట వేరొకపాత్రలోనికి వడియగట్టి భద్రపరచవలెను. ఇటుల సిద్ధముజేయ బడినట్టిది అహిఫేనాసవ మనబడును. దీనిని 2 బిందువుల పరిమితిని సేవించిన అతీసారము, విషూచికయు శమించును.

(10) **Physiological action:**—Opium in medicinal doses at first stimulates the brain, heart and respiration; this effect is soon followed by general depression. Generally opium is analgesic, hypnotic, anti-spasmodic, diphoretic, narcotic and cerebral depressant. Its chief action is on the cerebro-spinal system and through the nerves; it acts upon all the organs of the body. It affects the ganglia at the base of the brain, giving rise to contracted pupils, vomitting and slow respiration; under its use the grey matter of the cord is first stimulated and there are increased reflexes. This is soon followed by depression as evidenced by the lowering of perception and sensation, the cutaneous vessels are dilated at first, as shown by a sense of heat felt on the external ear, itching and rose coloured eruptions. This is followed by pallor and coldness of the limbs and fingers. The generative organs are stimulated. In medicinal doses taken for sometime, it effects all the secretions except milk and sweat which are increased. It causes dryness of the mouth and throat, lessens the secretion of the stomach and thus in pairs appetite. The secretions of the stomach and thus impairs appetite. The secretion of the bile is also diminished and constipation results. The action of the heart is increased and there is increased arterial tension. The cerebral functions are at first exhilerated, the ideas flow rapidly and there is a sort of wild intoxication. This is soon followed by dreams and often followed by drowsiness and sound sleep; often disturbed by dreams and often followed on waking by

headache, constipation, indigestion and depression of spirits. If any pain is present it is relieved but a larger dose will be necessary on subsequent occasions. In full doses the cerebral symptoms are accentuated, but the stimulation is of short duration. The after-effects become more marked. The mouth becomes very dry, digestion is impaired, there is nausea, vomitting and profuse sweat. The oxidation is interfered with, and there is loss of body heat. The pupils are contracted, there is intense itching of the nose with retention of urine. The cerebral depression is soon followed by headache vertigo, slow and laborious respiration. In poisonous doses sterterous breathing and coma supervene; followed by feeble pulse, cold clammy perspiration, contracted pupils followed by dilation as the end approaches, cyanosis of the face and fingers followed by abolished reflexes, deep coma paralysis of the respiratory eentres and death.

Therapeutic uses:—Opium is given to relieve severe pain from any cause, except in cerebritis and to allay any irritation. As an antispasmodic it is extensively used. It allays irritation and produces sleep in insomnia, sciatica, neuralgia, lumbago, cancer, intestinal, renal or hepatic colic calculi etc; also in tetanus in morbid states of the abdominal viscera, as gastritis, gastrodynia, hernia and in diseases of the urino-genital system. To check excessive secretion it is largely used in diarrhoea, dysentery, nervous and sympathetic vomitting and in excessive expectoration; also in diabetis, ptyalism and leucorrhoea.

—*R. N. Khory II. p. 49.*

## ధత్తూరః - ఉమ్మెత్త

N. O. Sonalaceae.

హింది - ధతూరా; మరాఠీ - ధోత్రా; గుజరాతి - ధంతురా; మలయాళం - ఉమ్మత్తు; కర్ణాటకం - ఉమ్మత్త; ద్రావిడం - ఊమ్మత్త, లాటిన్ - Datura alba; Eng. Stramonium.

శ్లో॥ ధత్తూరోధూర్తధుస్తూరా ఉన్మత్తః కనకాహ్వయః।
దేవతా కితవస్తూరీ మహామోహీశివప్రియః॥
మాతులో మదనశ్చ............॥

ధత్తూరము, ధూర్తము, ధుస్తూరము, ఉన్మత్తము, కనకము, దేవత, కితవము, తూరి, మహామోహి, శివప్రియము అనునవి ధత్తూర నామములు.

## ధత్తూర గుణములు

శ్లో॥ ధత్తూరోమదవర్ణాగ్ని వాతకృజ్జ్వర కుష్ఠనుత్।
కషాయో మధుర స్తిక్తోయూకాలిక్షా వినాశనః॥
ఉష్ణోగురుర్వ్రణశ్లేష్మ కండూకృమి విషాపహః॥

ఉమ్మెత్త కషాయరసమును, మధురతిక్తానురసములను, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. మత్తును, వర్ణమును, అగ్నిదీపనమును గలిగించును. వాతమును వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును. జ్వరము, కుష్ఠము, యూకాలిక్షాదికృములు, వ్రణము, కండు, కృమిరోగము, విషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

శివప్రియము. (కంటఫల. ఘంటాపుష్ప.)

(ఖ) గుణబోధకములు :

ఉన్మత్తము. మహామోహము. (పురీమోహ. కర్ష్యాఘ్న. సవిష.)

### (2) శబ్దార్థములు

శివప్రియము - ఈశ్వరునికి ప్రియమగునది. కంటఫల - ముండ్లతోగూడిన ఫలములనుగలది. ఘంటాపుష్ప- గంటవంటి యాకృతిగల పుష్పములతో గూడియుండునది. ఉన్మత్త-మత్తును గలిగించునది. మహామోహము - విశేషముగా మూర్ఛను గలిగించునది. పురీమోహము-పురమును మోహింపజేయునది. కర్ష్యాఘ్న - కచ్చును బోగొట్టునది. సవిష - విషముతోగూడి యుండునది.

### (3) భేదములు

ఇది శ్వేతము, నీలము, కృష్ణము, లోహితము, పీతము. "సితనీల కృష్ణలోహితపీత ప్రసవాశ్చసంతిధత్తూరాః। సామాన్యగుణోపేతాః తేషుగుణాఢ్యస్తు కృష్ణకుసుమః స్యాత్॥" (శా-ని) యని పుష్పములయొక్క వర్ణభేదముచే

నైదువిధములుగానుండి కొంచెము ఎత్తుగా బెరుగు క్షుప జాతిలో నుత్పత్తిగలిగి యుపవిషాంతర్గతమై శ్వాసకాసహర-మాదకర ద్రవ్యములలో గణింపబడుచున్నది. ఈ పై నిరూపణమునుబట్టి వీనిలో కృష్ణపుష్పధత్తూరము శ్రేష్ఠమైనదిగా దెలియగలదు. మరియు వీనిలో తెల్లనిది విశేషముగా నెల్ల చోటులను, నల్లనిది యరుదుగా నచ్చటచ్చటను ఉత్పత్తి యగుచుండును. వీనిలో నీ రెండు భేదములే గానబడు చున్నవి గాని మిగిలినవానికి ఉత్పత్త్యాదులు దెలియకున్నవి. దీని పువ్వులు గంటవలె పొడవుగనుండును. కాయలు గుండ్రముగను చుట్టున ముండ్లతోగూడినవిగను నుండును. ఆకులు కొంచెము విశాలముగనుండును. పుష్పములను శివార్చనకై యుపయోగించుదురు. వైద్యమునందు దీని ప్రతియంగమును విశేషముగా శ్వాసకాసలయం దుపయోగింపబడుచున్నను, సామాన్యముగా జ్వరాది వ్యాధులందుగూడ నుపయోగింపబడుచున్నవి. ఇది సమూలముగ విషగుణము గలిగియున్నట్లు దెలియుచున్నను దీని బీజములు విశేషముగా నట్టి గుణమును గలిగియుండును. ఇందుచేతనే వీనిని ఔషధ యోగములందు జేర్చుకొనుటకుముందుగా శుద్ధిజేయుదురు. ఇవి విశేషముగా మత్తును గలిగించును. పుష్పములను, పత్రములను శ్వాసరోగమునందు ధూమపానముకై యుపయోగించుదురు. ఇందువలన తత్కాలోపశమనముగలుగును. ఇది స్వయముగా విషద్రవ్యమైనను అలర్కాది విషములలో విషహరౌషధముగా బ్రయోగింపబడుచున్నది. మరియు నీ ద్రవ్యము బాహ్యముగ శోఫ, యూకలిక్షాది

కృమి, శూల మొదలగువానియందు లేపరూపమున నుపయోగింపబడుచున్నది. ఇది గర్భస్రావమును గలిగించునని కొందరు జెప్పుదురు. దీని ప్రయోగముచే గలిగిన మదము నందు చక్కెరనుజేర్చిన పాలను సేవించిన మదశాంతి గలుగునని నిఘంటు ఆదర్శమునందు జెప్పబడినది.

## (4) విశేషగుణములు

(క) కటురసమును గలిగియుండును. లేపనముచే కుష్ఠమును, ప్రభావముచే జ్వరమును బోగొట్టును. ధ-ని., పిత్తమును వృద్ధిబొందించును. దుష్టరక్తమును బోగొట్టును. శో-ని., కామిలను, అర్శస్సును బోగొట్టును. గ-ని., జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ని-ర.

(ఖ) కృష్ణధుత్తూర - విశేషముగ కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. కాంతిని, భ్రమను గలిగించును. వ్రణమును, కుష్ఠమును, కచ్ఛువును, కండువును, జ్వరమును బోగొట్టును. రా-ని.

## (5) ధత్తూరబీజ శోధన విధానము

"ధత్తూరాదేశ్చయద్బీజం అన్యచ్చోపవిషం చ యత్। క్షీరేణ పాచయేత్ దోలాయంత్రేణ శుద్ధిమాప్నుయాత్॥"

ఉన్మత్త మొదలగు నుపవిషముల బీజములను దోలాయంత్రమున పాలతో వండిన శుద్ధియగును. సా-కౌ.

## (6) ధత్తూర విషాతియోగమున గలుగు వికారములు

"ధూర్తబీజేఽతి తృష్ణాస్యాద్భ్రమః స్వేదః ప్రలాపకః। మూర్ఛాతికృచ్ఛ్రశ్వాసశ్చ మోహ ఆక్షేపకస్తథా"॥ అ-మం.

అధికమైన దప్పి, భ్రమ, స్వేదము, ప్రలాపము, మూర్ఛ, కష్టమైన శ్వాస, మోహము, ఆక్షేపకము అనునవి ధత్తూరవిషాతియోగమున గలుగును.

## (7) ధత్తూర విషశాన్తి

"గోదుగ్ధం ప్రస్థమేకంతు శర్కరాయాః పలద్వయం। తస్యపానాద్విషంయాతి ధత్తూరస్యచ నిశ్చితం॥" అ-మం.

ఒకప్రస్థ పరిమితిగల ఆవుపాలయందు రెండుపలముల చక్కెరను గలిపి పానముజేయుచుండినచో ధత్తూర విషవికారములు శమించును.

## (8) ప్రయోగములు

1. అలర్క విషమునందు ధత్తూరప్రయోగము.

"శ్వేతాం పునర్నవాంచాస్య దద్యాద్ధత్తూరకాయుతాం॥"

తెల్లగలిజేరువేరును, ఉమ్మెత్తవేరును మెత్తగా నూరి కల్కము జేసి యిచ్చిన అలర్కవిషము శమించును. సు-క-అ 6.

2. ఇంద్రలుప్తమునందు ధత్తూర ప్రయోగము.

"రసేనవా...ధత్తూరకస్య పత్రాణాం॥"

ఉమ్మెత్తాకుల రసమును లేపనముజేసిన ఇంద్రలుప్తము శమించును. వా-ఉ.

3. వాతజనేత్ర రోగమునందు ధత్తూరప్రయోగము.

"మూలంధుస్తూరకస్యవా। అంజనంచ హితంతేషాం
వాతనేత్రా మయాపహం॥"

ఉమ్మెత్తవేరు కల్కముతో అంజనము వేసిన వాతజనేత్రరోగము శమించును. వా-సం.

4. స్తనపీడయందు ధత్తూరప్రయోగము.

"నిశా కనకకల్కాభ్యాం లేపఃప్రోక్తః స్తనార్తిహా॥"

పసపు, ఉమ్మెత్తయాకులు మెత్తగా నూరి లేపనముజేసిన స్తనపీడ శమించును. భా-ప్ర.

5. క్రిములయందు ధత్తూరప్రయోగము.

"ధత్తూర పత్రజంవాపి కృమినాశన ముత్తమం॥"

ఉమ్మెత్తాకుల రసమును లేపనముజేసిన వ్రణాదులందలి కృమి నశించును. భా-ప్ర.

6. కర్ణనాడియందు ధత్తూరప్రయోగము.

"నిశాగంధ పలేపక్వం కటుతైలం పలాష్టకం।
దుస్తూరజపత్రరసే కర్ణనాడీ ప్రశామ్యతి॥"

పసపు, గంధకము ఒక్కొక్క పలము చొప్పున గ్రహించి కల్కముజేసి యెనిమిదుపలముల కటుతైలమునందు జేర్చి అందు ఉమ్మెత్తాకుల రసమును బోసి తైలపాకముజేసి కర్ణపూరణము జేసిన కర్ణనాడి శమించును. చ-ద.

7. శ్లీపదమునందు ధత్తూరప్రయోగము.

"ధత్తూరకస్య బీజాని పిప్పలీ వర్ధమానవత్ ।
శీతోదకేన పీతాని శ్లీపదం శాంతిదారుణం॥"

ఉమ్మెత్త గింజలను వర్ధమానపిప్పలివలె శీతలోదకముతో సేవించిన దారుణమగు శ్లీపదముగూడ శమించును. వం-సే.

8. పిటికయందు ధత్తూర ప్రయోగము.

"ధుస్తూరకశిఫాత్సుణ్ణా బద్ధాచ సంప్రణాశయేత్॥"

ఉమ్మెత్తవేరును మెత్తగానూరి పైని వేసి కట్టుగట్టిన పిటిక శమించును. గ-ని.

## (9) యోగములు

### 1. కనకాసవము

శ్లో॥ సంక్షుద్య కనకం శాఖా మూలపత్రఫలైః సహా।
తతఃచతుఃపలంగ్రాహ్యం వృషమూలత్వచ స్తథా॥
మధుకంమాగధీ వ్యాఘ్రీ కేసరం విశ్వభేషజం।
భార్గీతాలీస పత్రంచ సంచూర్ణైషాం పలద్వయం॥
సంగృహ్యధాతకీప్రస్థం ద్రాక్షాయాః పలవింశతిం।
జలద్రోణ ద్వయందత్వా శర్కరాయాస్తులాంతథా॥
క్షౌద్రస్యార్ధ తులాంచాపి సర్వం సమ్మిశ్య్రయత్నతః।
భాండే నిక్షిప్యచావృత్య నిదధ్యా న్మాసమాత్రకం॥
నిహన్తి నిఖిలాన్ శ్వాసాన్ కాసం యక్ష్మాణమేవచ।
క్షతక్షీణం జ్వరంజీర్ణం రక్తపిత్త మురఃక్షతం ॥

భై-ర. హిక్కా-శ్వాస.

నల్లయుమ్మెత్త (సమూలపత్రశాఖాఫల) 4 పలములు, అడ్డసరపు వేరుపైనుండు త్వక్కు 4 పలములు, అతిమధురము 2 పలములు, పిప్పళ్లు 2 పలములు, వాకుడు (సమూలము) 2 పలములు, నాగకేసరాలు 2 పలములు, శుంఠి 2 పలములు, గంటుభారంగి 2 పలములు, తాలిసపత్రి 2 పలములు ఇటుల గ్రహించి, మెత్తగా చూర్ణించవలెను. ఒక భాండమునందు 32 ప్రస్థములు జలమును బోసి అందు 100 పలముల చక్కెరను కలిపి, పిమ్మట పై చూర్ణమును, 20 పలములు గింజలుదీసి శుభ్రపరచిన ద్రాక్షపండ్లను, 50 పలములు తేనెను, 1 ప్రస్థము ఆరె పువ్వును జేర్చి, వీనినన్నింటిని బాగుగా కలియగలిపి ఆసవ విధానమున బంధించి యొకమాస మటులనే యుంచవలెను. పిమ్మట వేరొక పాత్ర లోనికి వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది కనకాసవమన బడును. దీనిని 1 ఔన్సు మోతాదు చొప్పున సేవించిన శ్వాస, కాస, రాజయక్ష్మ, క్షతక్షైణ్యము, జీర్ణజ్వరము, రక్తపిత్తము, ఉరఃక్షతము ఇయ్యవి శమించును.

## 2. ధత్తూర తైలము

శ్లో॥ ధుస్తూరపత్రకల్కేన తద్రసేనచ సాధితం।
తైల మభ్యంగమాత్రేణ యూకాంనాశయతి ధ్రువం॥

ఉమ్మెత్తాకుల కల్కము ¼ భాగము, ఉమ్మెత్తాకుల రసము 4 భాగములు, తిలతైలము 1 భాగము ఇటుల నొకపాత్రలో జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. దీనిని శిరస్సున కభ్యంగముజేసిన పేను నశించును.

## 3. మహాకనక తైలము

శ్లో॥ కనకస్య రసప్రస్థం ప్రస్థంవర్షాభువ స్తథా।
నిర్గుండీ స్వరసప్రస్థం దశమూలరసస్యచ॥

పారిభద్ర రసప్రస్థం ప్రస్థం వరుణకస్యచ।
తైలప్రస్థంసమాదాయ భిషక్ యత్నాత్ విపాచయేత్ ।
కల్కై రర్ధపలై రేతైః శుంఠీమరిచసైంధవైః।
పునర్నవా కర్కటక శేలుత్వక్ పిప్పలీయుగైః॥
తత్సాధుసిద్ధం విజ్ఞాయ శుభేపాత్రే నిధాపయేత్ ।
వాతశ్లేష్మకృతంసర్వం ఆమవాతం భగందరం॥
సన్నిపాతభవం రోగం శోధమాశు వినాశయేత్ ।
యేకేచిద్వ్యాధయస్సన్తి శ్లైష్మికాః సాన్నిపాతికాః॥
తాన్ సర్వాన్నాశయత్యాశు సూర్యస్తమ ఇవోదితః॥
భై-ర. శిరోరోగ.

ఉమ్మెత్తాకులరసము 1 ప్రస్థము, గజ్జేరువేళ్ల రసము 1 ప్రస్థము, వావిలాకు రసము 1 ప్రస్థము, దశమూల కషాయము 1 ప్రస్థము, బాడిద చెక్క రసము 1 ప్రస్థము, ఉలిమిరిచెక్క రసము 1 ప్రస్థము, తిల తైలము 1 ప్రస్థము ఇటుల నొకపాత్రలో జేర్చి, అందు శుంఠి ½ పలము, మిరియాలు ½ పలము, సైంధవలవణము ½ పలము, గజ్జేరువేరు ½ పలము, కర్కాటకశృంగి ½ పలము, నక్కెరపట్ట ½ పలము, పిప్పళ్లు ½ పలము, గజపిప్పలి ½ పలము వీనిని మెత్తగా దంచి సిద్ధముజేసిన కల్కమును గూడ జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మహాకనక తైలమనబడును. దీనిని అభ్యంగముజేసిన ఆమవాతము, భగందరము, శోథ, శిరశ్శూల, కర్ణశూల మున్నగునవి శమించును.

**(10) Actions and uses** :—Narcotic and anodyne, other properties are similar to those of belladonna, but stronger. It affects sympathetic nervous system, but not the motor or sensory nerves. In full doses the heart's actions become irregular and there is a furious delirium.

Like atropin and by oscyamin and duboisive it acts as a mydriatic. As an antispasmodic, it is given in hepatic, colic, laryngeal cough, chorea stammering etc. In dysmenorrhoea, neuralgiatic douloureux and sciatica it is very useful. In nymphomania and in purpural mania with a tendency to suicide it is given with benefit. Pulvis stramonii compositus is burned on the plate and the fumes inhaled, cigarettes of dhatura tatula are used in nervous attacks of asthma. Externally a paste of the seeds is used in urticaria and other skin diseases due to the pressure of lice or other animal parasites. It is also applied in decayed teeth and to relieve tooth ache. Dhatura seeds are frequently used in India for criminal purposes... The natives apply a medicated oil to the head in headache, to enlarged testicles and boils, and to the skin in skin diseases as pediculi, lice and psoriasis. Datura juice with the root of boerhavia, diffusa (satodi) and opium is used as an application for the relief of rheumatic pains and swelling over the hand and feet. In haemorrhoides fissures and other painful diseases of the rectum, leading to tenusmus, its application as a local anodyne ointment gives relief.

—*R. N. Khory II, p. 442.*

---

## దన్తీ (లఘ్వీ) - నేపాళపుచెట్టు (చిన్నది) (క)

N. O. Euphorbiaceae.

హింది - తిరీఫల, దన్తీ; మరాఠి - లఘువంతీ; గుజరాతి- నేపాళా నామూళ; మలయాళం - నేర్వాళం; కర్ణాటకం - నేపాల; ద్రావిడం - వాళం; లాటిన్ - Croton Triglium.

శ్లో॥ లఘ్వీదన్తీ విశల్యాచ స్యాదుదుంబరపర్ణ్యపి ।
తథైరండఫలా శీఘ్రా శ్యేనఘంటాఘుణప్రియా॥

వారాహాంగీచ కథితా నికుంభశ్చ మకూలకః॥

విశల్య, ఉదుంబరపర్ణి, ఏరండఫల, శీఘ్ర, శ్యేనఘంట, ఘుణప్రియ, వారాహాంగి, నికుంభ, మకూలకము అనునవి లఘుదన్తీ నామములు.

## బృహద్దన్తీ - పెద్దనేపాళము (ఖ)

శ్లో॥ ద్రవన్తీ శంబరాచిత్రా ప్రత్యక్పర్ణ్యాఖుపర్ణ్యపి।
చిత్రోపచిత్రా న్యగ్రోధీ సుతశ్రేణీతథావృషా॥

ద్రవన్తి, శంబర, చిత్ర, ప్రత్యక్పర్ణి, ఆఖుపర్ణి, చిత్రోపచిత్ర, న్యగ్రోధి, సుతశ్రేణి, వృష యనునవి బృహద్దన్తీ నామములు.

## దన్తిద్వయ గుణములు

శ్లో॥ దన్తీద్వయం సరంపాకే రసేచ కటుదీపనం।
గుదాంకురాశ్మ శూలార్శః కండుకుష్ఠ విదాహనుత్॥
తీక్ష్ణోష్ణం హన్తిపిత్తాస్ర కఫశోథోదర క్రిమీన్॥

రెండువిధములగు నేపాళపు చెట్లును కటురసమును, సరతీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును. అర్శస్సు, అశ్మరి, శూల, కండు, కుష్ఠము, విదాహము, రక్తపిత్తము, ఉదరము, క్రిమి యను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయ బోధకములు :

(లఘు) ఉదుంబరపర్ణి. ఏరండఫల. వారాహాంగి. నికుంభ. (ప్రత్యక్పర్ణి.) (బృహత్) - ద్రవన్తి. ప్రత్యక్పర్ణి,

ఆఖుపర్ణి. చిత్రోపచిత్ర. సుతశ్రేణి. (గుచ్ఛఫల. దుగ్ధగర్భ.)

(ఖ) గుణబోధకములు :

(లఘు) - విశల్యా. (రూక్ష. రేచని. మధుపుష్ప.)
(బృహత్) - (రేచని. విషభద్ర.)

## (2) శబ్దార్థములు

ఉదుంబరపర్ణి - మేడి (అత్తి) యాకులవంటి యాకులనుగలది. ఏరండఫల - ఆముదపు కాయలవంటి కాయలనుగలది. వారాహాంగి - పందిరోమములవంటి రోమములతోఁగూడిన కాయలనుగలది. నికుంభ - కడవను పూరింపదగినంత పాలతోఁగూడియుండునది అనగా హెచ్చుగ పాలను గలది. ప్రత్యక్పర్ణి - క్రిందుగా వాలియుండునట్టి పత్రములను గలది. ద్రవన్తి - పాలను స్రవించునది. ఆఖుపర్ణి - ఎలుక చెవినిబోలిన ఆకులను గలది. చిత్రోపచిత్ర - అనేకవర్ణములతోఁగూడిన పత్రములను (లేక) పుష్పములనుగలది. సుతశ్రేణి - ఒక వరుసగనుండునట్టి బీజములతో గూడిన కాయలను గలది. గుచ్ఛఫల - గుత్తులు గుత్తులుగ నుండునట్టి కాయలతోఁగూడియుండునది. దుగ్ధగర్భ - లోపలిభాగమున పాలతో నిండియుండునది. విశల్యా - శల్యమువలె బాధించునట్టి దోషములను బయటకు శోధనరూపమున తొలగించునది. రూక్ష - రూక్షగుణముగలది. రేచని - మలరేచనము జేయునది. మధుపుష్ప - మధురరసముగల పుష్పములను గలది. విషభద్ర - బీజమునకు లోపలిభాగము విషముతో గూడి యుండునది.

## (3) భేదములు

ఇది హ్రస్వ - దీర్ఘభేదముచే రెండు విధములుగా నుండి కొంచెము ఎత్తుగ బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి యుప విషాన్తర్గతమై తీక్ష్ణవిరేచనకర ద్రవ్యములలో నొకటిగా గణింపబడుచున్నది. పై శబ్దములనుబట్టి చిన్న జాతి నేపాళపుచెట్టు మేడియాకులవంటి యాకులను గలిగి యుండుననియు, ఆ యాకులుగూడ క్రిందకు వ్రాలియుండు ననియు, దీనికాయలు ఆముదపు కాయలవలె నుండి పై భాగమున గరకుగానుండు రోమములను గలిగియుండు ననియు దెలియుచున్నది. మరియు నందు పెద్దజాతి నేపాళపుచెట్టు ఎలుకచెవి యాకారమును బోలిన యాకులను గలిగియుండుననియు ఆయాకులపై ననేకరంగులతో గూడిన మచ్చలుండుననియు, ఇవిగూడ చిన్నజాతి యాకులవలెనే క్రిందికి వ్రాలియుండుననియు, దీని కాయలు గుత్తులు గుత్తులుగా నుత్పత్తియై ఒక వరుసదేరిన బీజములను లోనగలిగి యుండుననియు దెలియుచున్నది. ఈ రెండు వృక్షములు పాలను స్రవించునవిగనే వర్ణింపబడినవి. అయితే వైద్యక శబ్దసింధువునందు చిన్నజాతిచెట్టు ఉదుంబరదలయనియు, పెద్దజాతిచెట్టు ఏరండదలయనియు జెప్పబడినవి. ఇటులనే యితర నిదర్శనములను బట్టి జూడ వీటికి నిజమైన స్వరూప మెట్లుండునదియు స్పష్టముగ దెలియకున్నది. మరియు నీ జాతి వృక్షములు గ్రామములందు బెరుగు నితర వృక్షముల వలెగాక కేవలము అరణ్యములందు బెరుగునవిగా దెలియ గలదు. ఇదియునుగాక వీని బీజములుమాత్రమే వైద్య

మునందు విశేష ప్రయోగమును గలిగియున్నవిగాని యిత
రాంగముల కంతగా ప్రయోగములు గానరాకుండుటను
బట్టిగూడ వీటి స్వరూపమును దెలుసుకొనుటకు వీలుగా
నున్నది. అయితే గ్రామపు పొలిమేరలలో మనకు సామా
న్యముగ గానిపించు చిన్న నేపాళము లేక, సీమ నేపాళము,
పెద్ద నేపాళము అను వృక్షములు ఈ పై జాతిలో చేర
నట్లుగా దెలియగలదు. అందు చిన్ననేపాళపు మొక్కలు
ఒకటి లేక ఒకటిన్నరగజమెత్తు గలిగి గుబురుగా బెరుగును.
దీని యాకులు కొంచెము పొడవుగనుండు నాళముతోగూడి
కొంచెము వెడల్పుగను గుండ్రముగను నుండును. ఆకు
లకు చుట్టును చిన్న చిన్న కోతలుండును. నాళమంతయు
నెర్రని నూగు గలిగియుండును. ఈ నాళమును విరచినచో
తెల్లనిపాలు కారును. ఈ పాలను గ్రామస్థులు కడుపునొప్పి
వచ్చినప్పుడు నాభికి చుట్టును లేపనముచేయుదురు. కాయలు
జిల్లేడుపూ మొగ్గల యాకృతిని గలిగియుండును. ఈ చెట్ల
యొక్క ప్రయోగ మింతకంటె హెచ్చుగ గానరాదు. పెద్ద
నేపాళము అనునది చిన్నదానికంటె హెచ్చుగ నెత్తుగనే
బెరుగును. దీని యాకులు గంగరావి యాకులను బోలి
యుండును. కాయలు గుండ్రముగా గచ్చకాయలకంటె
కొంచెము పెద్దవిగా నుండును. దీని ప్రయోగమెట్టిదో గాన
రాదు. కావున పై శబ్దములందలి వర్ణనమునుబట్టి చూచి
నచో అసలు నేపాళపు చెట్లకును, గ్రామములందు గాను
పించునట్టి సీమనేపాళము, పెద్దనేపాళము అను చెట్లకును
భేదమున్నట్లు దెలియగలదు. అందుచే నివి గ్రామములందు

గాక కేవలము అరణ్యములందు బెరుగు వృక్షములుగా దెలియగలదు. వీని బీజములు విషముతో సమానమైనవిగా "న విషం విషమిత్యాహుః జైపాలో విషముచ్యతే। శోధితశ్చ వికారేషు చమత్కృతికరః పరః॥" ని-ర.—ఇట్లు వర్ణింపబడినవి. కావున వీటిని మందులలో నుపయోగించుటకు ముందుగా శుద్ధిజేసినచో నివి మిగుల నుపయోగకరములుగా నుండును. ఈ రెండు వృక్షములే గాకుండ "నాగదన్తి" యను మరియొక వృక్షము ఈ జాతిలోనే జేరినట్లుగా నిఘంటువులనుబట్టి దెలియుచున్నది. ఇది మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతములందు మిగుల నెత్తుగానుండు వృక్షరూపమున బెరుగునదిగా వైద్యకశబ్దసింధువునందు వర్ణింపబడినది. మరియు నిదికూడ "విషౌషధి, విశోధిని" యను నామములనుబట్టి విషగుణములను గలిగియుండుననియు, దోషములను శోధించుననియు దెలియగలదు. దీని పుష్పములు తెల్లగ నుండుననియు, అందలి కేసరములు పాముదంతములవలె నుండుననియు ఇతర పర్యాయ నామములనుబట్టి దెలియుచున్నది. ఇంతకంటె పరిచయమును గలిగించునట్టి యంశములు వేరుగా గానుపింపవు. దీని మూలమే గ్రాహ్యాంశముగా నిరూపింపబడినట్లు ప్రయోగములనుబట్టి దెలియగలదు. ఇక, దన్తి - బృహద్దన్తి యను వానియొక్క ప్రయోగములు రెండువిధములుగా గానుపించును. ఇవి బీజరూపముగను, మూలరూపముగను గ్రహింపబడి ప్రయోగింపబడుచున్నవి. అందు దోషశోధనార్హములగు వ్యాధులందు బీజములును, తదితరవ్యాధులందు మూల

మును ప్రయోగింపబడుచున్నవి. బీజములను ప్రయోగించు నప్పుడు యథావతుగ శోధించియే వాడుకొనవలెను. లేనిచో నివి విషసదృశములగుటచే ప్రాణమున కపాయమును గలిగించును. వ్యవహారమునందు వీటి కెట్టి ప్రయోగము నున్నట్లు గానరాదు. వీనిలో భద్రదన్తి యను మరియొక భేదమున్నట్లుగా రాజనిఘంటుకారునిచే జెప్పబడినది. దీని పరిచయము గలిగించు విషయములు గానరాకుండుటచే నిది యెట్లుండునదియు వివరింప వీలుగాకున్నది. అయితే నిది బృహద్దన్తిలో నొకభేదమని వైద్యకశబ్దసింధువునందు జెప్పబడియున్నది.

## (4) విశేషగుణములు

(క) సామాన్య - ఆమదోషమును బోగొట్టును. రా-ని., కండువును, పామను బోగొట్టును. గ-ని.

(ఖ) నాగదన్తి - కటురసమును, తిక్తానురసమును, రూక్షగుణమును గలిగియుండును. మేధాశక్తిని వృద్ధి జేయును. ఆమమును పచింపజేయును. వాతకఫములను శమింపజేయును. విషమును, గుల్మమును, శూలను, ఉదరమును బోగొట్టును. రా-ని.

(గ) భద్రదన్తి - కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దోషములను శోధించును. క్రిములను, శూలను, కుష్ఠమును, ఆమమును ఉదరమును బోగొట్టును. ని-ర.

(ఘ) లఘుదన్తీబీజ - మధురరసమును, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. మలమూత్రములను శోధించును. కఫమును శమింపజేయును. గరవిషమును, శోఫను బోగొట్టును. భా-ప్ర.

(చ) జయపాల (బృహద్దన్తీబీజ) - గురుస్నిగ్ధగుణములను గలిగియుండును. దోషములను శోధించును. పిత్తకఫములను శమింపజేయును. భా-ప్ర., కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిజేయును. కఫవాతములను శమింపజేయును. క్రిములను, ఉదరమును బోగొట్టును. ధ-ని., తీక్ష్ణగుణమును గలిగియుండును. ఉత్క్లేశమును గలిగించును. రా-ని.

(ఛ) బీజతైల - ఇది మిగుల తీక్ష్ణమైన రేచన ద్రవ్యము. ఆనాహము, ఉదరము, సన్న్యాసము, శిరోవ్యాధి, హనుస్తంభము, జ్వరము, ఉన్మాదము, ఏకాంగవాతము, ఆమవాతము, శోఫ, కాస అను నీ వ్యాధులను బోగొట్టును. వై-శ-సిం.

## (5) జేపాల (దన్తీబీజ) శోధన విధానము

"జేపాలం రహితం త్వగంకుర రసజ్ఞాభిర్నలే మాహిషే నిక్షిప్తం త్ర్యహముష్ణతోయ విమలం ఖల్వే సవాసోఽర్దితం। లిప్తం నూతన ఖర్పరేషు విగతస్నేహం రజః సంనిభం నింబూకాంబు విభావితం చ బహుశః శుద్ధం గుణాఢ్యం భవేత్॥"

ఆ-ప్ర.

నేపాళపుగింజలపైనుండు తోలును, మధ్యనుండు విషదళములను తొలగించి, యా బీజములను గేదెపేడగలిపిన నీళ్లలో వేసి మూడు దినము లుంచవలెను. పిమ్మట వాటి నుష్ణోదకముతో కడిగి యొక గుడ్డ యందు మూటగట్టి ఖల్వమునందుంచి మెత్తగా చిదుకగొట్టవలెను. ఇటుల జేసిన అందలి తైలము కొంత వస్త్రమునందు లగ్నమగును. పిమ్మట నా పిష్టమును ఒక క్రొత్త కుండకు లోపలిభాగమున బూసి యొకగోజుంచినచో అందుండు తైలాంశమునంతను కుండ హరింప జేయును. తైలమును కుండ పీల్చుకొనగానే ఈ కల్కము పొడి పొడిగా రాలిపోవును. ఈ విధముగా జేసినపిమ్మట నా చూర్ణమును ఖల్వమునం దుంచి జంబీరస్వరసముతో పలుమార్లు మర్దించవలెను. ఇటుల జేసిన నేపాళపుగింజలు పరిశుద్ధములై యోగములందు జేర్చుకొన నర్హములగును.

## (6) దన్తి విషాతియోగముచే గలుగు వికారములు

"దన్తీ విషాతి యోగేతు వాన్తి ర్భ్రాన్తిశ్చ రేచనం॥
శూలాటోపౌ భృశం స్వేదః భవేద్దౌర్బల్య మేవ
చ॥" అ-మం.

అధికమైన వాన్తి, భ్రాన్తి, అధికవిరేచనములు, కడుపునొప్పి, ఉబ్బరింపు, అధికస్వేదము, దౌర్బల్యము అనునవి దన్తీ విషాతియోగ మున సంభవించును.

## (7) దన్తీ విషశాన్తి

"ధాన్యకం సితయాయుక్తం దధినాసహాయః పిబేత్।
దన్తీబీజ వికారస్య నివృత్తి స్తస్యజాయతే॥"
అ-మం.

ధనియాల కల్కమును చక్కెరను గలిపి పెరుగుతో జేర్చి పానము జేసిన దన్తీ విషజవికారములు శమించును.

## (8) ప్రయోగములు

### 1. అర్శోరోగమునందు దన్తీప్రయోగము.

"త్రివృద్దన్తీ పలాశానాం...। సుభృష్టం యమకేదద్యాత్ శాకం దధిసరాయుతం॥"

తెగడ, నేపాళము, మోదుగ వీని పత్రములను తైలఘృతములతో భర్జనజేసి పెరుగుమీది నీళ్లతో గలిపి సేవించిన అర్శోరోగము శమించును. చ-చి-అ. 9.

### 2. దూష్యోదరమునందు దన్తీప్రయోగము.

"దన్తీ ద్రవన్తీ ఫలజం తైలం దూష్యోదరేహితం॥"

నేపాళపు విత్తులు, ద్రవన్తి విత్తులు వీనినుండి గ్రహించిన తైలమును పానము జేయించిన దూష్యోదరము శమించును. చ-చి-అ. 18.

### 3. పాండురోగమునందు దన్తీప్రయోగము.

"దన్త్యాశ్చతుష్పల రసైః పిష్టైః దన్తీ శలాటుభిః।
తద్వత్ప్రస్థో ఘృతాత్సిద్ధః ప్లీహపాండ్వర్తిశోఫజిత్॥"

నాలుగు పలముల నేపాళపు కాయలను నేపాళపువేళ్ల రసముతో కల్కముగా నూరి, ఒకప్రస్థ పరిమితిగల ఘృతమునందు జేర్చి ఘృతపాకవిధిననుసరించి పాకముజేసి సేవించిన ప్లీహవృద్ధి, పాండు, శోఫ శమించును. చ-చి-అ 20.

### 4. కామిలయందు దన్తీప్రయోగము.

"దన్త్యర్ధ పలకల్కం ద్విగుడం శీతవారిణా।
కామిలీపిబేత్...॥"

నేపాళపువేరు కల్కము అర్ధపలము, బెల్లము రెండుపలములు కలిపి శీతలజలముతో సేవించిన కామిల శమించును. చ-చి-అ 20.

## 5. గుల్మోదరములందు దన్తీప్రయోగము.

"తయోః (దన్తీ ద్రవన్త్యోః) మూలాని సంగృహ్య స్థిరాణి బహులాని చ। హస్తిదన్త ప్రకారాణి శ్యావ తామ్రాణి బుద్ధిమాన్। పిప్పలీ మధులిప్తాని స్వేద యేత్ మృత్కుశాంతరే। శోషయేదాతపేఽగ్నౌ హ్యేషాం వికాశితాం। దధితక్ర సురా మండైః పిండమక్షసమం తయోః। పియాల కోల బదర పీలు శీధుభిరేవ చ। పిబే ద్గుల్మోదరీ దోషైః అభిఖిన్నశ్చయోనరః॥"

దన్తి, ద్రవన్తి యనువాని మూలములలో లావుగను, స్థిరముగను, ఏనుగుదంతపాకృతి గలవిగను, నల్లగను, తామ్రవర్ణముగను నుండువానిని గ్రహించి, పిప్పళ్లచూర్ణమును తేనెతో గలిపి యావేళ్లకు బూసి, పిమ్మట దర్భలతో చుట్టబెట్టి పైని దళసరిగ మన్నుబూసి పుటపాకవిధి ననుసరించి స్వేదముజేయవలెను. తరువాత వాటిని గ్రహించి నిప్పుదగ్గర గాని, ఎండలోగాని యార్చబెట్టవలెను. ఇటుల జేసినచో నీ ద్రవ్యముల కుండు వికాశి యను గుణము నశించిపోవును. పిమ్మట పెరుగు, తక్రము, సురామండము అనువానిని తగుమాత్రము జేర్చి యామూలములను కల్కమువలె మెత్తగా నూరవలెను. ఇందుండి ఒకతులము ప్రమాణము తీసికొని చారపప్పు, రేగుపండ్లు, పెద్దరేగుపండ్లు, వరగోగుపండ్లు వీనితో జేసిన మద్యముతో సేవించిన గుల్మోదరములు శమించును. చ-క-అ 12.

## 6. విరేచనార్థము దన్తీ ప్రయోగము.

"పాటయిత్వేక్షు కాండం వా కల్కేనా లిప్యచాం

తరా। స్వేదయిత్వా తతః ఖాదేత్ సుఖం తేన విరిచ్యతే॥"

చెరకుముక్కలు రెండుగా చీల్చి అందు లోపలిభాగమున దన్తీ కల్కమును బూసి తిరిగి చెరకుబద్దలను ఒకటిగా కలిపి దీనిని పుటపాకముజేసి పిమ్మట భుజించినచో సుఖముగా విరేచనమగును.

## (9) యోగములు

### 1. దన్త్యరిష్టము.

శ్లో॥ దన్తీ చిత్రకమూలానా ముభయోః పంచమూలయోః।
భాగాన్ పలాంశా నాపోథ్యజలద్రోణే విపాచయేత్॥
త్రిపలం త్రిఫలాయాశ్చ దళానాం తత్రదాపయేత్।
రసే చతుర్థశేషేతు పూతే శీతే సమావపేత్॥
తులాం గుడస్య తత్తిష్ఠే న్మాసార్ధం ఘృతభాజనే।
తన్మాత్రయా పిబేన్నిత్యం అర్శోభ్యో విప్రముచ్యతే॥
గ్రహణీ పాండురోగఘ్నం వాతవర్చోఽనులోమనం।
దీపనంచారుచిఘ్నం చ దన్త్యరిష్ట మిమం విదుః॥

చ-అర్శ.

దన్తీమూలము 1 పలము, చిత్రమూలము 1 పలము, దశమూలములు 1 పలము, త్రిఫలములు 3 పలములు ఇటుల గ్రహించి, మెత్తగా నలియగొట్టి 16 ప్రస్థముల జలమునందు వేసి 4 ప్రస్థములు మిగులువరకు గాచి యొక భాండములోనికి వడియగట్టవలెను. పిమ్మట నిందు 100 పలములు బెల్లమును గలిపి, అరిష్టవిధానమున బంధించి 15 దినము లటులనే యుంచవలెను. పిమ్మట వేరొకపాత్రలోనికి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది దన్త్యరిష్టమనబడును. దీనిని 1 ఔన్సు

మోతాదు చొప్పున ప్రతినిత్యము సేవించుచుండిన అర్శస్సు, గ్రహణి, పాండువు ఇయ్యవి శమించును. జాఠరాగ్ని వృద్ధిబొందును. అరుచి పోవును. వాతమునకు, మలమునకు అనులోమనము గలుగును.

## 2. దన్తీ హరీతకి.

శ్లో॥ ద్రోణేఽమ్భసః పచేద్దన్త్యాః పలానాం పంచవింశతిం।
చిత్రకస్యతథా పథ్యా స్తావతీ స్తత్రదసేస్రుతే॥
ద్విప్రస్థే సాధయేత్పూతే క్షిపేద్దన్తీ సమంగుడం।
తైలాత్పలాని చత్వారి త్రివృతాయాశ్చ చూర్ణతః॥
కణాకర్షౌ తథా శుంఠ్యాః సిద్ధే లేహేతు శీతలే।
మధుతైలసమందద్యాత్ చతుర్జాతాత్ చతుర్థికాం॥
అతో హరీతకీ మేకాం సావలేహ పలామదన్।
సుఖం విరిచ్యతే స్నిగ్ధో దోషప్రస్థ మనామయః॥
గుల్మ హృద్రోగ దుర్నామ శోఫా నాహ గరోదరాన్।
కుష్ఠో త్క్లేశారుచిప్లీహ గ్రహణీ విషమజ్వరాన్॥
ఘ్నంతిదన్తీ హరీతక్యః పాండుతాం చ సకామలాం॥
వా-గుల్మ.

దన్తీమూలము 25 పలములు, చిత్రమూలము 25 పలములు, ప్రశస్తమైన కరక్కాయలు 25 పలములు ఇటుల గ్రహించి ఇందలి కరక్కాయల నొక గుడ్డలో వదులుగా మూటగట్టి 16 ప్రస్థముల జలమునందు వేయవలెను. పిమ్మట మిగిలినవానిని మెత్తగా నలియగొట్టి ఆ జలమునందు జేర్చి 2 ప్రస్థములు మిగులువరకు గాచి వడియగట్ట వలెను. తరువాత నీ కషాయమున 25 పలములు బెల్లమును, ఉడికిన కరక్కాయలను, 4 పలములు తిలతైలమును, 4 పలములు తెగడచూర్ణ

మును, 2 తులములు పిప్పళ్ల చూర్ణమును, 2 తులములు శుంఠి చూర్ణ మును జేర్చి మందాగ్నిచే లేహ్యాపాకముజేసి దింపవలెను. చల్లబడిన పిమ్మట నందు 4 పలములు తేనెను, 1 పలము చాతుర్జాతక చూర్ణమును జేర్చి బాగుగా కలియగలిపి భద్రపరచవలెను. ఇటుల సిద్ధముజేయబడి నట్టిది దన్తీహరీతకి యనబడును. దీనినుండి 1 కరక్కాయను, 1 పలము లేహ్యమును కలిపి సేవించుచుండవలెను. ఇరిదువలన సుఖవిరేచనమగును. గుల్మము, హృద్రోగము, అర్శస్సు, శోఫ, ఆనాహము, గరోదరము, కుష్ఠము, అరుచి, ప్లీహావృద్ధి, గ్రహణి, విషమజ్వరము, పాండువు, కామిల ఇయ్యవి శమించును.

## 3. బృహద్దన్తీ ఘృతము.

శ్లో॥ జలద్రోణేపచే త్సమ్యక్ దన్త్యాః పలశతం భిషక్।
పాదశిష్టం గృహీత్వేమం క్వాథం సర్పిః పయస్తథా॥
దన్తీమూలం బలాం ద్రాక్షాం సహదేవం శతావరీం।
సరళం శారిబాం శ్యామాం ప్రత్యేకం కుడవోన్మితం॥
విదార్యాస్తాలమూల్యాశ్చ శాల్మల్యాః కుటజస్య చ।
రసాధకం పరిక్షిప్య సాధయే న్మృదునాగ్నినా॥
అన్త్రవృద్ధి మన్త్రరోధ మన్త్రదాహం సుదారుణం।
ముష్కవృద్ధిం తథాబ్రధ్నం వ్రణశోథం భగందరం॥
ఆమవాతం వాతరక్తం ముఖనాసా శిరోరుజః।
రేతశ్శోణిత దోషాంశ్చ హన్తి దన్తీ ఘృతం బృహత్॥

భై-ర-వృద్ధి.

దన్తీమూలము 100 పలములు గ్రహించి, మెత్తగా నలియగొట్టి 16 ప్రస్థముల జలమునందు వేసి 4 ప్రస్థములు మిగులువరకు గాచి వడియగట్టవలెను. పిమ్మట నీకషాయము నొకపాత్రలో బోసి, అందు

4 ప్రస్థములు ఘృతమును, 4 ప్రస్థములు పాలును, 4 ప్రస్థములు నేల గుమ్మడి స్వరసమును, 4 ప్రస్థములు నేలతాటిగడ్డల రసమును, 4 ప్రస్థములు ఉసిరికచెక్క రసమును. 4 ప్రస్థములు కొడిశపాలపట్ట రసమును, దన్తీమూలము, చిట్టాముట్టి, ద్రాక్ష, సహదేవి, పిల్లిపీచరగడ్డలు, సరల దారు, సుగంధిపాల, తెగడవేరు వీనిని ప్రత్యేకముగ 4 పలములు చొప్పున గ్రహించి, మెత్తగా చూర్ణించి, సిద్ధముజేసిన కల్కమును జేర్చి మందాగ్నిచే ఘృతపాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది బృహద్దన్తీఘృత మనబడును. దీనిని 1 తులము మోతాదు చొప్పున సేవించవలెను. ఇందువలన ఆన్త్రవృద్ధి, అండవృద్ధి, వ్రణ శోథ, భగందరము, ఆమవాతము, వాతరక్తము, ముఖరోగము, నాసా రోగము, శిరశ్శూల, శుక్రదోషము, ఆర్తవదోషము ఇయ్యవి శమించును.

**(10) Actions and uses:**—The seeds and fruits are purgative. "The Goanese and inhabitants of southern Concan administer the bark in chronic enlargements of the liver and in remittent fever. In the former disease, it is both taken internally and applied locally. As an application to sprains, bruises, rheumatic swellings etc., it is in great request." —*Dymock.*

"In the southern Concan, it has a reputation as a remedy in snake bites."

—(*Pharmacoepia, Ind. V. III, p. 287.*

The Santals use the bark and the root as a purgative and as an alterative in dysentery.

—(*Campbell*).

## భల్లాతకం - నల్లజీడిచెట్టు (క)

N. O. Anacardiaceae.

హింది - భిలావా(మా); మరాటి - బిబ్వా; గుజరాతి - భిలామా; మలయాలం - చేరక్కురు; కన్నడం - భల్లాతక; ద్రావిడం - చేరాం గొట్టెయ్; లాటిన్ - Semicarpus anacardium; Eng. Marking nut or Dhobis nut.

శ్లో॥ భల్లాతకం త్రిషు ప్రోక్త మరుష్కోఽరుష్కరోఽగ్నికః।
తథైవాగ్నిముఖీభల్లీ వీరవృక్షశ్చ శోఫకృత్॥

భల్లాతకము, అరుష్కము, అరుష్కరము, అగ్నికము, అగ్నిముఖీ, భల్లి, వీరవృక్షము, శోఫకృతు అనునవి భల్లాతక నామములు.

### భల్లాతకఫల గుణములు

శ్లో॥ భల్లాతకఫలం పక్వం స్వాదుపాకరసం లఘు।
కషాయం పాచనం స్నిగ్ధం తీక్ష్ణోష్ణం ఛేదిభేదనం॥
మేధ్యం వహ్నికరం హంతి కఫవాత వ్రణోదరం।
కుష్ఠార్శో గ్రహణీ గుల్మ శోథానాహజ్వర కృమీన్॥

నల్లజీడిపండు మధురరసమును, కషాయానురసమును, లఘుస్నిగ్ధ తీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. ఆమమును పాకముజేయును. ఛేదనము. భేదనము. మేధాశక్తిని గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. వ్రణము, ఉదరము, కుష్ఠము, అర్శస్సు, గ్రహణి, గుల్మము, శోఫ, ఆనాహము, జ్వరము, కృములు అను నీ వ్యాధులను బోగొట్టును.

### భల్లాతకమజ్జా గుణములు

శ్లో॥ తన్మజ్జా మధురో వృష్యో బృంహణో వాతపిత్తహా॥

నల్లజీడిగింజలోని పప్పు మధురరసమును గలిగియుండును. శుక్రమును వృద్ధిజేయును. బృంహణము. వాతపిత్తములను శమింపజేయును.

## భల్లాతకఫలవృంత గుణములు

శ్లో॥ వృంతమారుష్కరం స్వాదు పిత్తఘ్నం కేశ్యమగ్నికృత్॥

నల్లజీడిపండుయొక్క తొడిమి మధురరసమును గలిగియుండును. కేశములను వృద్ధిజేయును. జాఠరాగ్నిని ప్రజ్వలింపజేయును. పిత్తమును శమింపజేయును.

## భల్లాతకబీజ గుణములు

శ్లో॥ భల్లాతకః కషాయోష్ణః శుక్రలో మధురో లఘు॥
వాతశ్లేష్మోదరానాహ కుష్ఠార్శో గ్రహణీ గదాన్।
హంతి గుల్మ జ్వర శ్విత్ర వహ్నిమాంద్య కృమివ్రణాన్॥

నల్లజీడిగింజ కషాయరసమును, మధురానురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. శుక్రమును వృద్ధిజేయును. వాతశ్లేష్మములను శమింపజేయును. ఉదరము, ఆనాహము, కుష్ఠము, అర్శస్సు, గ్రహణి, గుల్మము, జ్వరము, శ్విత్రము, అగ్నిమాంద్యము, కృములు, వ్రణము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధ నామములు

(క) పరిచయబోధకములు :

అగ్నిముఖి, వీరవృక్షము.



(ఖ) గుణబోధకములు :

అరుష్కరము, అగ్నికము, శోఫకృతు.

## (2) శబ్దార్థములు

అగ్నిముఖి - అగ్నిముఖమునందు గలది. అనగా—అగ్నిస్పర్శ కలిగినమాత్రాన వెంటనే మండునని యర్థము.

వీరవృక్షము - వీరునివలె సమీపమునకుబోవ శక్యముగానిది. అరుష్కరము - వ్రణమును గలుగజేయునది. అగ్నికము - జాఠరాగ్నిని వృద్ధిబొందించునది. శోఫకృతు - వాపును గలిగించునది.

## (3) భేదములు

భల్లాతక ముపవిషాన్తర్గతమై కుష్ఠ దుష్టవ్రణహారములును రసాయనములు నగు ద్రవ్యములలో గణింపబడి వృక్షజాతిలో నుత్పత్తిగలిగియున్నది. ఈ జీడిచెట్టు "నల్లజీడి, మొక్కజీడి" యని రెండువిధములుగా నుండును. అందు మొక్కజీడి "వృత్తారుష్కర" మని వ్యవహరింపబడును. ఇది నల్లజీడి యంత తీక్ష్ణమైనది గాదు. మరియు దీని గింజలోని పప్పును విశేషముగా భక్ష్యములం దుపయోగించెదరు. దీని పరిచయబోధక లక్షణము లిట్లు వర్ణింపబడినవి:—

"కాజూతకో వృత్తపత్రో గుచ్ఛ పుష్పశ్చ పార్వతీ।
స్నిగ్ధపీత ఫలశ్చైవ పృథగ్బీజోహ్యారుష్కరః॥"

మొక్కజీడిచెట్టు పర్వత (పార్వతీ) ప్రదేశములందుత్పన్నమగును. దీని యాకులు గుండ్రముగా నుండును. పుష్పములు గుత్తులవలె నుండును. పండు జిడ్డుగను పసపు పచ్చగను నుండును. బీజము విడిగా బయట నంటుకొని యుండును. ఇది "కాజూతము, అరుష్కరము" అను నామాంతరములచే వ్యవహరింపబడును. శి-వ.

(4) విశేషగుణములు

(క) బీజము - కటురసమును, తిక్తమధురానురసములను గలిగియుండును. ధ-ని.

---

N. B.—ఇందు 'పార్వతీ' యను శబ్దముచే బర్వత ప్రదేశములందు మాత్ర ముత్పన్నమగునని తెలియుచున్నను అట విరివిగాను, ఇతరములగు నిసుకప్రదేశములందుగూడ సామాన్యముగను నుత్పత్తియగుచుండుననియు, 'అరుష్కర' శబ్దముచే నిదిగూడ వ్రణమును గలుగజేయుననియు దెలియుచున్నను ఇది భల్లాతకమంత తీక్ష్ణమైనది గాదని దెలియదగినది. మరియు బ్రయోగములలో నల్లజీడికివలె దీనికంత వ్యవహారము గానుపించదు.

మరియు నీ భల్లాతకములందు 'నదీభల్లాతక' మను మరియొక భేదము గలదు. ఇది నదుల యొడ్డున విశేషముగ నుత్పన్నమగునని దోచుచున్నది. "వృషాంకః స్యాద్గోజనకో నదీ భల్లాతకః స్మృతః॥" వృషాంకము, గోజనకము అనునవి నదీభల్లాతకనామములు. ని-ర., దీనికిగూఢ వ్యవహారమునం దంతగా బ్రయోగములు గానరావు.

(ఖ) నల్లజీడిపండు - కషాయరసమును, మధురానురసమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగియుండును. శ్వాస, శూల, ఆధ్మానము, శ్రమ వీనిని బోగొట్టును. రా-ని.

(గ) మజ్జ - శోష, దాహము, అరోచకము వీనిని బోగొట్టును. రా-ని.

(ఘ) వృన్తము - కషాయానురసమును, శీతవీర్యమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. మలబంధమును గలిగించును. వాతమును బ్రకోపింపజేయును. రక్తపిత్తములను దూషింపజేయును. రా-వ.

(చ) గింజ - తీక్ష్ణగుణమును గలిగి, యగ్నితో సమముగ బాకముజేయునదిగ నుండును. యథావిధిగ నుపయోగించిన యమృతముతో దుల్యముగ శరీరమున కుపకరించును. మరియు, మేధాశక్తిని, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. విబంధమును, కఫజవ్యాధులను బోగొట్టును.

చ-చి-అ 1.

(ఛ) భల్లాతకఫలత్వగ్గుణములు - నల్లజీడిపండుమీది త్వక్కు మధురరసమును, కషాయకటుకానురసములను, స్నిగ్ధలఘుతీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. ఆమమును బాకముజేయును. మలమును భేదించును. దుష్టములగు కఫాదులను ఛేదించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. మేధాశక్తిని గలిగించును. కఫవాతములను శమింపజేయును. కుష్ఠము, వ్రణము, ఉదరము, అర్శస్సు, గ్రహణి, గుల్మము, శోఫ, ఆనాహము, జ్వరము, కృములు అనునీ వ్యాధులను బోగొట్టును. ని-ర.

(జ) భల్లాతకతైల - నల్లజీడిగింజలనుండి తీసిన తైలము మధురకషాయరసములను, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దోషములను వమనవిరేచన రూపమున బయటకు శోధించును. వాతకఫములను శమింపజేయును. కుష్ఠమును, మేదోవృద్ధిని, ప్రమేహమును, క్రిములను బోగొట్టును. సు-సూ-అ 45.

(ఝ) వృత్తారుష్కర గుణములు - మొక్క జీడి కషాయరసమును, మధురానురసమును, లఘుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. ధాతువృద్ధిని గలిగించును. వాత కఫములను శమింపజేయును. గుల్మము, ఉదరము, జ్వరము, కృములు, వ్రణము, అగ్నిమాంద్యము, కుష్ఠము, శ్విత్రకుష్ఠము, గ్రహణి, అర్శస్సు, ఆనాహము అను నీ వ్యాధులను బోగొట్టును. ని-ర.

(ట) నదీభల్లాతక గుణములు - నదీభల్లాతకము తిక్తరసమును, కషాయమధురానురసములను, శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును. రక్తపిత్తమును, వ్రణమును బోగొట్టును. ని-ర.

## (5) భల్లాతకసేవనయందహితములు

"వాతాతపిక విధానేఽపి విశేషేణవివర్జయేత్ ।
కులుత్థదధిసూక్తాని తైలాభ్యంగాగ్ని సేవనం॥"

వాతాతపిక విధిననుసరించి భల్లాతకమును రసాయనముగ సేవించు

నప్పుడుగూడ ఊలవలు, పెరుగు, సూక్తమను నమ్లద్రవము, తైలాభ్యంగము వీనిని విశేషముగ వర్జింపవలెను. వా-ఉ-అ 29.

## (6) భల్లాతకపరీక్ష

"భల్లాతకాని పక్వాని సమాని ప్రక్షిపేజ్జలే ।
మజ్జంతియానితత్రైవ శుద్ధ్యర్థం తాని యోజయేత్ ॥"

బాగుగా పండిన జీడిపండ్లనుండి గింజలను గ్రహించి అందు సమానముగ నుండువానిని నీటిలో వేసిన యెడల అందు నీటమునిగినట్టి గింజలను మాత్రమే గ్రహించి వానిని శుద్ధ్యాది ప్రయోగముల కుపయోగించవలెను. ఆ-సం.

## (7) భల్లాతకశోధనవిధానము

"ఇష్టకా చూర్ణనిచయైః ఘర్షణాన్నిర్విషంభవేత్ ॥"
ఆ-సం.

జీడిగింజలను ఇటుకరాయి పొడిలో నుంచి బాగుగా రుద్ది నీళ్లతో కడిగిన నవ్యావి పరిశుద్ధములగును. ఇట్లు పై విధముగ రుద్దుటకు ముందుగా నా గింజల నొక గుడ్డలో మూటగట్టి తడిగల భూమిలో మూడుదినములు పాతియుంచుట కొందరి సాంప్రదాయముగా తెలియవగును.

## (8) భల్లాతకవిషవికారములు

"భల్లాతకవిషేతాపో కోష్ఠేభవతి సవ్రణః।
త్వచిస్ఫోటో భవేద్భినేద్స్రావః కుర్యాద్వ్రిణంపునః"
అ-సం.

భల్లాతకము నధికముగా భుజించినప్పుడు కోష్ఠమునందు వ్రణములోగూడి తాపము జనించును. దాని రసము చర్మముపై తగిలినచో

నచ్చట బొబ్బ పుట్టును. ఆ బొబ్బ పగిలి యందుండి స్రావమేర్పడి యది యెచ్చట తగిలిన నచ్చట తిరిగి వ్రణమేర్పడును.

## (9) భల్లాతకవిషశాన్తి

"సితయాసహ యామాచ్ఛ మేఘనాద రసస్యచ।
తస్మాద్భల్లం విషంహన్తి యథాలింగ ప్రసేవనాత్॥"

అ-షం.

చిర్రికూర రసములో చక్కెర జేర్చి పానము జేసిన ఒకజాములో భల్లాతక విషవికారము లెల్ల శమించును. చర్మముపైని బొబ్బలకు నారికేళ తైలమును బూసిన యయ్యవి శమించును.

## (10) ప్రయోగములు

1. రసాయనమునకు భల్లాతకప్రయోగము

"భల్లాతకాని అనుపహతాని అనామయాని ఆపూర్ణ రసప్రమాణవీర్యాణి పక్వజాంబవ ప్రకాశానిశుచౌ శుక్రేమాసే వా సంగృహ్యాయవపల్లే మాషపల్లేవా నిధాపయేత్। తాని చతుర్మాసస్థితాని సహసి సహస్యేవామాసి ప్రయోక్తుమారభేత। శీతస్నిగ్ధమధురోపస్నిగ్ధశరీరః పూర్వాందశభల్లాతకాన్యాపోథ్యఅష్టగుణేనాంభసా సాధుసాధయేత్। తేషాంరసమష్టభాగావశిష్టం పూతంసపయస్కంపిబే త్సర్పిషాన్తర్ముఖమభ్యజ్య॥"

నల్లగనుండునట్టియు, వ్యాధిగ్రస్తములు గాకుండునట్టియు, అనగా బొత్తలు తూంట్లు మున్నగునవి లేనట్టియు, పరిపూర్ణమగు రస

మును, ప్రమాణమును (Size), వీర్యమును గల్గినట్టియు, పండిన నేరేడు పండు వర్ణమును గలిగినట్టియు భల్లాతకములను జ్యేష్ఠమాసమునందుగాని, ఆషాఢమాసమునందుగాని గ్రహించి, ధాన్యరాశియందుగాని, మాష (మినుములు) రాశియందుగాని నాలుగుమాసములు కప్పియుంచవలెను. పిమ్మట వానిని దీసికొని మార్గశిరమాసమునందుగాని, పుష్యమాసమునందుగాని రసాయనముగ సేవించుట కారంభించవలెను. శీతవీర్యమును, స్నిగ్ధగుణమును, మధురరసమును గల ద్రవ్యములచే దొలుత సంస్కరింపబడిన శరీరముగలవాడై, పది భల్లాతకములను నలియగొట్టి యెనిమిది రెట్ల జలమునందు జేర్చి యెనిమిదవ భాగము మిగులువరకు గాచి వడియ కట్టిన కషాయమును బాలతో జేర్చి ముఖమునందు నేయి బూసుకొని పానము జేయవలెను. ఈ విధముగ ఉత్కర్షాపకర్షణ (హెచ్చించుట - తగ్గించుట) విధిననుసరించి వేయి (1000) భల్లాతకములను పాలు, అన్నము మొదలగు నియమిత పథ్యాహారముతో సేవించిన ఆయుర్వృద్ధియు, వలీపలితనాశమును గలుగును. మరియు, భల్లాతకక్షీరము, భల్లాతకసర్పి, భల్లాతకక్షౌద్రము, గుడభల్లాతకము, భల్లాతకయూషము, భల్లాతకతైలము, భల్లాతకపలలము, భల్లాతకసక్తువు, భల్లాతకలవణము, భల్లాతకతర్పణము అను నీ భల్లాతక విధానములను ఆచరించిన రసాయనమును, సర్వవ్యాధినాశనమును నగును. చ-చి-అ 1.

## 2. అర్శస్సునందు భల్లాతకప్రయోగము

"భల్లాతకాని పరిపక్వాని అనుపహతాని ఆహృత్య ఏకమాదాయ ద్విధా త్రిధా చతుర్ధా వా ఛేదయిత్వా కషాయకల్పేన విపాచ్య కషాయస్య శుక్తిమనుష్ణాం ఘృతాభ్యక్తతాలుజిహ్వోష్ఠః ప్రాతః ప్రాతః ఉపసేవేత। తతో అపరాహ్ణే క్షీరంసర్పిరోదన ఇత్యాహారః। ఏవమేకైకం వర్ధయేత్ యావత్పంచేతి...॥"

బాగుగ బండినవియు, నలగనివియు నగు భల్లాతకములను సంపాదించి యందొకదానిని రెండుగా గాని, మూడుగా గాని, నాలుగుగా గాని నరికి కషాయవిధి ననుసరించి పాకముజేసి వడియగట్టి, కొద్దిగ వెచ్చగ నుండునప్పుడు శుక్తి ప్రమాణమును తాలువు, జిహ్వా, ఓష్ఠము వీటికి నేయిబూసుకొని ప్రతిదినము ప్రాతఃకాలమున పానముజేయవలెను. పిమ్మట నిది జీర్ణమైనట్లు దెలిసికొని మధ్యాహ్నకాలమున పాలు, నేయి, అన్నము వీనిని ఆహారముగా సేవించవలెను. ఇటుల ప్రతిదినమున నొక్కొక్కటి చొప్పున అయిదింటివరకును హెచ్చించి, పిమ్మట ఉత్కర్షాపకర్షణ విధిననుసరింపుచు వేయి భల్లాతకములను సేవించిన అర్శోవ్యాధి నిశ్శేషముగ శమించును. సు-చి-అ 6.

3. సర్వకుష్ఠములందును భల్లాతక ప్రయోగము

"భల్లాతకాభయావిడంగ సిద్ధం వా సర్వేషాం।
భల్లాతక తైలం వేతి॥"

సర్వకుష్ఠవ్యాధులందును నల్లజీడిగింజలు, కరక్కాయలు, వాయువిడంగములు వీనితో సిద్ధముజేసిన తైలమునుగాని, కేవల భల్లాతక తైలమునుగాని సేవించిన హితము. సు-చి-అ 9.

4. అంజనము విషసంస్పృష్టమైనప్పుడు భల్లాతకప్రయోగము

"......పుష్పం భల్లాతకస్య వా॥"

కంటియందు వేసిన యంజనము విషసంస్పృష్టమైనయెడల భల్లాతక పుష్పములను నూరి కంటియందు అంజనము వేసిన విషదోషము శమించును. సు-క-అ 1.

5. జ్వరాగమనవాసరమున భల్లాతకప్రయోగము

"సగుడైః భల్లాతకమథాపి వా॥"

జ్వరము (విషమ) వచ్చురోజున ముందుగా భల్లాతకమును బెల్లముతో జేర్చి సేవించిన జ్వరము రాకుండగ నిలిచిపోవును.

వా-చి-అ 1.

## 6. శుష్కార్శస్సునందు భల్లాతకప్రయోగము

"శుష్కేషుభల్లాతక మగ్ర్యముక్తం॥"

శుష్కార్శస్సులందు భల్లాతక కల్పనా విశేషములు మిగుల శ్రేష్ఠములు. వా-చి-అ 8.

## 7. ఇంద్రలుప్తమునందు భల్లాతకప్రయోగము

"ఇంద్రలుప్తాపహోలేపో మధునా...భల్లాతకరసోద్భవా॥"

ఇంద్రలుప్తము (బట్టతల) నందు నల్లజీడిగింజల రసమును తేనెతో గలిపి లేపనముజేసిన హితము. గ-ని-శిరోరోగ.

## 8. క్రిమిరోగమునందు భల్లాతక ప్రయోగము

"భల్లాతకాస్థిస్వరసం విడంగార్ధేన సంయుతం।
సూర్యతప్తం లిహేద్వ్యక్త్వా సిద్ధం క్రిమివినాశనం॥"

నల్లజీడిగింజల రసము ఒకభాగము, వాయువిడంగముల రసము అర్ధభాగము ఇటుల గ్రహించి యేకముగజేసి కొద్దిగ యెండలో తపింపజేసి సేవించిన క్రిమిరోగము శమించును. గ-ని-క్రిమిరోగ.

## 9. ఊరుస్తంభవాతమునందు భల్లాతకప్రయోగము.

"భల్లాతకఫలంపిష్ట్వా పిప్పలీ మూలసంయుతం।
ఊరుస్తంభవినాశాయ పిబేన్మధుసమన్వితం॥"

నల్లజీడిపండ్ల రసమును పిప్పలకట్టె చూర్ణముతోను, తేనెతోను జేర్చి సేవించిన ఊరుస్తంభ వాతరోగము శమించును. గ-ని-వాతరోగ.

## 10. వాజీకరణార్థము భల్లాతకప్రయోగము

"భల్లాతకైశ్చతుర్భిశ్చ గోదుగ్ధశ్చాఢకంశ్రృతం।
పీతంకరోతి వృషతాం సుజీర్ణస్యాపి దేహినః॥"

నాలుగు నల్లజీడిగింజలను గ్రహించి ముక్కలుగా గోసి యొక ఆఢక ప్రమాణముగల నావుపాలలో వేసి క్షీరపాకవిధిననుసరించి పాకముజేసి వడియగట్టి సేవించిన వృద్ధునకుగూడ శుక్రవృద్ధి గలుగును. గ-ని-వాజీకరణ.

## 11. రసాయనమునకు భల్లాతకతైలప్రయోగము

"తైలంభల్లాతకానాంతు పిబేన్మాసం యథాబలం।
సర్వోపద్రవ నిర్ముక్తో జీవేద్వర్షశతంధ్రువం॥"

నల్లజీడిగింజల తైలమును ప్రయోగవిధానము ననుసరించి యొక మాసము సేవించిన వ్యాధివిముక్తుడై నూరువత్సరములు జీవించును.
బృం-మా-రసాయన.

## 12. కఫగుల్మమునందు భల్లాతకప్రయోగము

"భల్లాతకా త్కల్క కషాయపక్వం సర్పిఃపిబేత్
శర్కరయావిమిశ్రం। తద్రక్తపిత్తం వినిహంతిపీతం
బలాసగుల్మం మధునాసమేతం॥"

నల్లజీడిగింజల కల్కకషాయములతో పక్వముజేసిన ఘృతమును తేనెతోజేర్చి సేవించిన కఫజ గుల్మమును, చక్కెరతోజేర్చి సేవించిన రక్తపిత్తమును శమించును. చ-ద-గుల్మ.

### 13. ప్లీహోదరమునందు భల్లాతక ప్రయోగము

"భల్లాతకాభయాజాజీ గుడేన సహమోదకః।
సప్తరాత్రాన్నిహన్త్యాశు ప్లీహానమతిదారుణం॥"

నల్లజీడిగింజలు, కరక్కాయలు, ఓమము వీనిని మెత్తగా చూర్ణించి బెల్లముతోఁజేర్చి మాత్రలుగాజేసి సేవించిన నేడురోజులలో ప్లీహోదరము శమించును. వం-సే.

## (11) యోగములు

### 1. భల్లాతకఘృతము

శ్లో॥ భల్లాతకానాం ద్విపలం పంచమూలం పలోన్మితం।
అల్పంతోయాఢకే సాధ్యం పాదశేషేణ తేనచ॥
తుల్యంఘృతం తుల్యపయోవిపచేదక్షసమ్మితైః।
విడంగ హింగుసింధూత్థ యావశూక శటీబిడైః॥
సద్వీపిరాస్నాయష్ట్యాహ్వ షడ్గ్రంథాకణానాగరైః।
ఏతద్భల్లాతకఘృతం కఫగుల్మహరం పరం॥
ప్లీహపాండ్వామయశ్వాస గ్రహణీరోగకాసనుత్॥

వా-గుల్మ.

శుద్ధిజేసిన నల్లజీడిగింజలు 2 పలములు, లఘుపంచమూలములు 1 పలము ఇటుల గ్రహించి, జీడిగింజలను రెండు రెండు ముక్కలుగా నరికి, మిగిలినద్రవ్యములను మెత్తగా నలియగొట్టి వీనినన్నింటిని 4 ప్రస్థముల జలమునందు జేర్చి 1 ప్రస్థము మిగులువరకు గాచి వడియగట్టవలెను. పిమ్మట నీ కషాయము నొకపాత్రలోఁ బోసి, అందు 1 ప్రస్థము ఘృతమును, 1 ప్రస్థము పాలును, వాయువిడంగాలు 1 తులము, వేయిం

చిన ఇంగువ 1 తులము, సైంధవలవణము 1 తులము, యవక్షారము 1 తులము, కచూరాలు 1 తులము, బిడాలవణము 1 తులము, పిల్లిపీచర 1 తులము, సన్నరాష్ట్రము 1 తులము, అతిమధురము 1 తులము, క్రౌనుగవేరు 1 తులము, పిప్పళ్లు 1 తులము, శుంఠి 1 తులము వీనిని మెత్తగా చూర్ణించి సిద్ధముజేసిన కల్కమును జేర్చి మందాగ్నిచే ఘృత పాకముజేసి వడియగట్టవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది భల్లాతక ఘృతమనబడును. దీనిని ½ తులము మోతాదు చొప్పున సేవించిన కఫజ గుల్మము, ప్లీహోదరము, పాండువు, శ్వాస, గ్రహణి, కాస యివ్యావి శమించును.

## 2. అమృతభల్లాతకము

శ్లో॥ భల్లాతకానాం పవనోద్ధతానాం వృన్తచ్యుతానాంచ యదాఢకంస్యాత్। తచ్ఛేష్టకా చూర్ణకణై ర్విఘృష్య ప్రక్షాళయిత్వా విసృజేత్ప్రవాతే॥ శుష్కంపున స్తత్ విదలీకృతంచ తతఃపచే దప్సు చతుర్గుణాసు। తత్పాద శేషం పరిపూతశీతం క్షీరేణ తుల్యేన పునః పచేత్తు॥ తత్పాదశేషం పున రేవశీతం ఘృతేనతుల్యేన పునః పచేత్తు। తదర్ధయా శర్కరయావికీర్ణంతతః ఖజేనో న్మథితం విధాయ॥ తత్స ప్తరాత్రాదుపజాతవీర్యం సుధా రసాదప్యధికత్వమేతి। ప్రాతర్విబుద్ధః కృతదేవకార్యో మాత్రాంచఖాదే త్స్వశరీరయోగ్యాం॥ ......... త్వచోవివర్ణాః పున రేవదివ్యాః విశీర్ణకర్ణాంగుళినాసి కోఽపి। క్రిమ్యర్దితో భిన్నపలోఽపికుక్షిః సోఽపిక్రమా దంకురితాగ్రశాఖ స్తరుర్యథాభాతి నభోఽంబుసిక్తః॥

........................ రాజాహ్వాయం సర్వ
రసాయనానాం చకార యోగం భగవానగస్త్యః॥
భై-ర. కుష్ఠ.

ప్రశస్తమైన నల్లజీడిగింజలు 4 ప్రస్థములు గ్రహించి యిటుక రాయిపొడితో రుద్ది, జలముతో కడిగి ఆరబెట్టవలెను. పిమ్మట వీనిని రెండు రెండు ముక్కలు చొప్పున నరికి 16 ప్రస్థముల జలమునందు వేసి 4 ప్రస్థములు మిగులువరకు గాచి వడియగట్టవలెను. పిమ్మట నీ కషాయమును వేరొకపాత్రలో బోసి అందు 4 ప్రస్థములు పాలను జేర్చి 2 ప్రస్థములు మిగులువరకు గాచవలెను. అటుపిమ్మట నందు 2 ప్రస్థములు ఘృతమునుజేర్చి మందాగ్నిచే ఘృతపాకముజేసి వడియగట్ట వలెను. ఇది చల్లబడినపిమ్మట నందు 1 ప్రస్థము చక్కెర చూర్ణమును జేర్చి బాగుగా కలియునట్లు కవ్వముతో చిలికి భద్రపరచవలెను. ఇటుల నేడుదినములు మూసియుంచుటవలన నియ్యది అమృతముకంటెను హెచ్చైన వీర్యముగలది యగును. ఈ విధముగ సిద్ధముజేయబడినట్టిది యమృతభల్లాతకమనబడును. దీనిని $\frac{1}{2}$ తులము మోతాదు చొప్పున సేవించవలెను. సమస్త కుష్ఠములును శమించును. మిగుల రసాయనము.

(12) **Medicinal uses**:—The oil from the kernal is nutritious and emolient. Internally used as a demulcent in the form of emulsion. It may be used in pharmacy like olive oil. The acrid oil possesses rubefacient and vesicant properties. The active principle is Anacardiac acid. It has been used as a local stimulent in leprosy.

—(*Indiginous drugs of India.*)

# విజయా - గంజాయిచెట్టు

N. O. Urticaceae.

హిందీ - భంగ, భాంగ, గాంజా; మరాఠీ - లభంగ, భాంగ; గుజరాతీ - కలాయీ, భాంగ, గాంజా, చరస్; మలయాళం - కంజావు; కర్ణాటకం - భంగా; ద్రావిడం - గంజా; లాటిన్ - Cannabis Sativa.

శ్లో॥ భంగా గంజామాతులానీ మాదినీ విజయాజయా॥

భంగ, గంజ, మాతులాని, మాదిని, విజయ, జయ అనునవి విజయానామములు.

## విజయాగుణములు

శ్లో॥ భంగా కఫహరీతిక్తా గ్రాహిణీ పాచనీలఘుః।
తీక్ష్ణోష్ణా పిత్తలా మోహమదవాగ్వహ్నివర్ధనీ॥

గంజాయి తిక్తరసమును, లఘుతీక్ష్ణగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును, ఆమమును పాకముజేయును. మోహమును, మత్తును గలిగించును. పిత్తమును, వాక్కును, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

విజయ, జయ, (మత్కుణారి, యోగిని, వీరపత్ర).

(ఖ) గుణబోధకములు :

మాదిని, (ఆనంద, హర్షిణి, ఉన్మత్తిని).

## (2) శబ్దార్థములు

విజయ, జయ - కార్యములందు జయమును గలిగించునది. మత్స్యగారి - నల్లులనుజంపునది. యోగిని - యోగాభ్యాసమును జేయువార్లచే నుపయోగింపబడునది. వీరపత్ర - వీరులచే యుద్ధము జేయుటకు ముందుగా నుపయోగింపబడునది. మాదిని - మత్తునుగలిగించునది. ఆనంద—హర్షిణి - మనస్సునకు వికాసమును గలిగించునది. ఉన్మత్తిని - ఉన్మాదమును (పిచ్చిని) గలిగించునది.

## (3) విశేషగుణములు

(క) విజయ:— నిద్రనుగలిగించును. వాతమును శమింపజేయును. గ-ని. బుద్ధిభ్రంశమును గలుగజేయును. రా-ని.

(ఖ) పత్ర:—తీక్ష్ణగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. మోహమును గలిగించును. రసాయనము. బలమును, మేధాశక్తిని, జాఠరాగ్నిని వృద్ధిబొందించును. శ్లేష్మమును శమింపజేయును. కుష్ఠమునుబోగొట్టును. రా-ని. నిద్రనుగలిగించును. కామమును వృద్ధిజేయును. పిత్తమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. శా-ని.

---

N. B.—ఇది యుపవిషాన్తర్గతమై మత్తునుగలిగించునట్టియు, వాజీకరమగునట్టియు ద్రవ్యములలో నొకటిగాగణింపబడుచున్నది. దీనిని యోగములందు యథావతుగా శోధనముగావించియే జేర్చుకొనవలెను.

(గ) స్త్రీజాతి పుష్పముయొక్క తోడిమె గుణములు:—ఆమమును పాకము జేయును. తృష్ణను గలిగించును. బలమును, మన్మథోద్దీపనము (అధిక కామము)ను గలిగించును. చిత్తమును చలింపజేయును. నిద్రను, గర్భపాతమును గలిగించును. స్రోతస్సులను వికసింపజేయును. మత్తును గలిగించును. వేదనను, ఆక్షేపమును బోగొట్టును.
ఆ-సం.

## (4) విజయా శోధన విధానము

శ్లో॥ బబ్బూలత్వ క్కషాయేణ భంగాం సంస్వేద్య శోషయేత్। గోదుగ్ధ భావనాం దత్వా శుష్కాం సర్వత్ర యోజయేత్॥
ఆ-ప్ర.

గంజాయి యాకును గుడ్డలో మూటగట్టి డోలాయంత్రమున తుమ్మపట్టకషాయముతో నొకజాము స్వేదనము జేసి యెండబెట్టవలెను. పిమ్మట నావుపాలలో నా పత్రమును వేసి యెండలో పాలిగిరిపోవు వరకు నుంచి బాగుగా నెండించినచో నయ్యది పరిశుద్ధమగును.

## (5) విజయాతియోగమున గలుగు వికారములు

శ్లో॥ విజయాయాం తు తైమిర్యం మనోవిభ్రమ ఏవ చ।
అపస్మృతిః ప్రలాపశ్చ వాన్తిః కంఠేవిశుష్కతా॥
అ-మం.

కండ్లు చీకట్లు గమ్ముట, చిత్తవిభ్రమము, మరపు, ప్రలాపము, వాన్తి, కంఠ మెండిపోవుట అను వికారములు విజయావిషాతియోగమున గలుగును.

## (6) విజయా విషశాన్తి

శ్లో॥ శిరస్స్నానం తు కర్తవ్య మతిశీతలవారిణా।
పయః పానం చ సితయా విజయా విషశాన్తికృత్॥
అ-మం.

మిక్కిలి శీతలముగానుండు జలముతో శిరస్స్నానము నతిగా నాచరించి, పాలలో చక్కెర జేర్చి పానము జేసినచో విజయావిషవికారములు శమించును.

## (7) యోగము

### 1. విజయావలేహము.

శ్లో॥ త్రైలోక్య విజయా జాతీ ఫలే తుల్యే కలింగకం।
గృహీత్వా ద్విగుణం శ్రేష్ఠో లేహః సర్వాతిసారనుత్॥
భా-ప్ర-అతీసార.

శుద్ధిజేసిన గంజాయి యాకు 1 భాగము, జాజికాయలు 1 భాగము, కొడిశపాలవిత్తులు 2 భాగములు ఇటుల గ్రహించి, మెత్తగా చూర్ణించి, ఇందుకు తగినంత తేనెను జేర్చి అవలేహముగా సిద్ధముజేసి భద్రపరచవలెను. దీనిని ½ తులము మోతాదు చొప్పున సేవించిన సమస్త అతిసారములును శమించును.

(8) Actions and uses:—"They use Bhang in gonorrhoea and dyspepsia. Locally a decoction of the leaves is applied to erysipelas and neuralgic painful parts. Its application to the anus is used to relieve the pain of hoemorrhoides. A paste applied to the head relieves dandruff and vermin."

—*R. N. Khory II, p. 570.*

"The medicinal properties of cannabis have now been investigated by many European physicians in India. O'shanghnesy tried it with more or less success in various diseases, especially in tetanus, hydrophobia, rheumatism, the convulsions of children and cholera. Subsequent experience has confirmed the value of the drug as a remedy in tetanus and cholera. In the former disease we have obtained most satisfactory results; large doses are required and the patient must be kept under the influence of the drug for some days. In cholera its action may be compared with that of opium: it is most likely to be successful when resorted too early in the disease."

—*Dymock V, III, p, 325.*

---

# జంగమ విషములు

## సర్పవిషం - పామువిషము (గరళము).

శ్లో॥ విషేషు జంగమాఖ్యేషు గ్రాహ్యం నాగోద్భవం విషం।
శస్తం బలవతో యూనః కృష్ణసర్పాద్విషం నవం॥

ర-జ.

జంగమవిషములలో సర్పవిషము ఔషధార్థమై గ్రహింపదగినది. ఇది బలముగలిగి వయస్సులోనుండు సర్పమునుండి గ్రహింపబడినదిగా నుండవలెను.

## సర్ప విషశోధన విధానము

శ్లో॥ నాగోద్భవం యథాప్రాప్తం విషం గోమూత్ర సంయుతం।
ఆతపే త్రిదినం శుష్కం నిహితం వీర్యధృగ్భవేత్॥

ర-జ.

పాము విషమును యథాప్రాప్తముగ గోమూత్రమున గలిపి రెండలో మూడుదినము లెండించిన యది పరిశుద్ధమై గుణవంతమగును.

## శోధితసర్ప విషగుణములు

శ్లో॥ ఏతచ్చైవాగదశ్రేష్ఠం త్రిదోషక్షపణంక్రమాత్।
దీపనం కురుతే సద్యో బడబాగ్ని సమం హితత్॥
సన్నిపాత ప్రతీకార ప్రభావ ప్రభురుచ్యతే॥
యథావిధిప్రయుక్తం తద్విషమప్యమృతాయతే।
మృతసంజీవనం తద్ధి విషూచిషు జ్వరేషుచ॥ ర-జ.

సర్పవిషము సహజముగా మరణహేతుకమయ్యు నది శోధింపబడి యుక్తియుక్తముగ సేవింపబడినయెడల నమృతముతో తుల్యమై త్రిదోషములను శమింపజేయును. బడబాగ్నితో సమానముగ జాఠరాగ్నిని వృద్ధిబొందించును. సమస్త సన్నిపాతజ్వరములను బోగొట్టును. విషూచియందును, జ్వరసామాన్యమునందును మృతసంజీవనివలె మేలుజేయును.

## సర్పవిషప్రయోగమున పథ్యవిధానము

శ్లో॥ దధ్యోదనం తు దాతవ్యం పథ్యమత్ర విజానతా।
ఆరక్తాక్షం రక్తవక్త్రిం తీవ్రతాప సమన్వితం॥
విజ్ఞాయ రోగిణం వైద్యః స్నపయేచ్ఛీతలాంబునా।
శీతాంబు సిక్త వస్త్రేణ భూయో భూయః ప్రయత్నతః॥
ఆచ్ఛాదయేన్మస్తకంతు వ్యథా దాహ ప్రణుత్తయే॥
ర-త.

సర్పవిషమును రోగి కుపయోగించినప్పుడు శాలిధాన్యపు అన్నమును ఆవుపెరుగుతో జేర్చి యాహారముగా నియ్యవలెను. రోగియొక్క నేత్రములందును, ముఖమునందును ఏర్పడిన రక్తిమను దెలిసికొని యా విషజతాపమును శమింపజేయుటకు వెంటనే శీతలోదకముతో రోగిని స్నానము జేయించవలెను. మరియు, నట్టి తాపాదులను శమింపజేయుటకై రోగియొక్క శిరమును శీతలజలమునందు తడిపిన వస్త్రముతో పలుమార్లు కప్పుచుండవలెను.

## సర్పవిషప్రయోగానర్హులు

శ్లో॥ న బాలేషు న వృద్ధేషు న తథా రాజయక్ష్మిషు।
న సన్న్యాసే న మూర్ఛాయాం న జీర్ణజ్వర జర్జరే॥
న క్షీణేషు ప్రయుంజీత కృష్ణసర్ప విషం భిషక్॥

ర-త.

బాలురు, వృద్ధులు, రాజయక్ష్మరోగి, సన్న్యాసము, మూర్ఛ, జీర్ణజ్వరము వీనిచే పీడింపబడువారలు, బలక్షీణులు, వీరలకు సర్పవిషమును బ్రయోగింపగూడదు.

## విశేషాంశములు

### (1) పరిచయము

సర్పవిషము గరళమను నామముతో వ్యవహరింపబడుచున్నది. కాని గరళశబ్దము విషసామాన్యమునకు "విషం తు గరళం క్ష్వేడం" అని పర్యాయపదముగా జెప్పబడుటచే వ్యవహారములో నున్న గరళశబ్దమును విడచి స్పష్టముగా దెలియుటకై యిది సర్పవిషమను పేరుననే యిట వివరింపబడుచున్నది. సుస్రుతకల్పస్థానమున చెప్పబడిన

పదియారువిధములగు జంగమ విషాధిష్ఠానభేదములలో దంష్ట్రా ధిష్ఠితమై కృష్ణసర్పముయొక్క కోరలనుండి ఈ విషము గ్రహింపబడుచున్నది. ఇది యన్నివిధములగు జంగమ విష ములలో మిక్కిలి శీఘ్రకాలమున ప్రాణముల హరించు నదిగా నుండును. అయితే సన్నిపాత జ్వరములలో మిక్కిలి ప్రాణాపాయ సమయమున దీనిని మించిన ప్రాణరక్షకమగు నౌషధము వేరొకటి లేదు. శాస్త్రమున దీనిని శుద్ధిజేసియే యుపయోగించవలెనని జెప్పబడియున్నది. కాని, కొందరు దీనిని సర్పమునుండి గ్రహించినవెంటనే యేవిధమగు శుద్ధి నొనర్పకయే యట్టి రోగుల కుపయోగించుట వాడుకలో నున్నది. చరకాదుల ప్రయోగమునందుగూడ దీనియొక్క శుద్ధిప్రసంగము గానరాదు.

## (2) ప్రయోగములు

### 1. ఉదరరోగమున సర్పవిషప్రయోగము

శ్లో॥ క్రియాతివృత్తే జఠరే త్రిదోషే చాప్రశామ్యతి।
...పానభోజన సంయుక్తం విషమస్మై ప్రయోజయేత్।
యస్మిన్వా కుపితః సర్పో విసృజేద్ధిఫలే విషం॥
భోజయేత్తదుదరిణం ప్రవిచార్య భిషగ్వరః।
తేనాస్యదోష సంఘాతః స్థిరో లీనోవిమార్గగః॥
విషేణాశు ప్రమాథిత్వా దాశుభిన్నః ప్రవర్తతే।
విషేణ హృతదోషంతం శీతాంబు పరిషేచితం॥
పాయయేత భిషగ్దుగ్ధం యవాగూంవా యథాబలం॥

చ-చి.

సన్నిపాతజోదరము ఇతర చికిత్సావిధానమునకు శమించక యింకను అనుబంధించి యున్నచో సర్పము నే జాతిఫలమునందైన గోపముచే విషమును విడచునట్లు కరిపించి యా ఫలరూపమున సర్పవిషమును అట్టి రోగిచే భక్షింపజేయవలెను. ఇందువలన దోషము ధాతువులందు లీనమై స్థిరముగ నున్నట్టిది యా విషక్షోభమువలన భిన్నమై యనగా శైథిల్యమును బొంది బయటకు స్రవించును. ఇట్లు దోషశోధనమైన పిమ్మట రోగికి శీతలజలముచే సేచనము జేసి, యావుపాలనుగాని, యవాగునుగాని యాహారముగా నియ్యవలెను. ఇటుల జేసిన త్రిదోషజోదరము శమించును.

## (3) యోగములు (సర్పవిషమిశ్రితములు)

### 1. సింహప్రతిపాలనరసము

శ్లో॥ సూతం గంధక వత్సనాభ గరళం చైకైక భాగాన్వితం।
సర్వం మర్దిత హంసపాది స్వరసే గుంజేన మాత్రా
మితం। తైలాభ్యంగ జలోపచార కథితం పథ్యం చ
దధ్యోదనం। సర్వం హన్తి సమస్తదోషజగదం సింహ
ప్రతీపాలనం॥ బ-రా-జ్వర.

శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన వత్సనాభి, శుద్ధిజేసిన గరళము వీనిని సమభాగములుగ గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిగా నూరి, పిమ్మట నందు మిగిలిన ద్రవ్యములను జేర్చి హంసపాదియాకు రసముచే మూడుదినములు మర్దించి గురిగింజ ప్రమాణమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది సింహప్రతిపాలనరసమనబడును. దీనిని ఒక్కొక్క మాత్ర మోతాదుచొప్పున అనుపానభేదములతో సేవించిన సర్వదోష

ములచే జనించిన జ్వరములెల్ల శమించును. ఈ యౌషధమును సేవించునప్పుడు తైలాభ్యంగమును, శీతలజలోపచారమును, దధ్యన్నభోజనమును ఆచరింపవలెను.

## 2. తరుణార్కరసము

శ్లో॥ గంధకం టంకణం చాభ్రం నాభి ధుత్తూర బీజకం।
కృష్ణ సర్పస్య గరళం రక్త చందన వంగకం॥
ఏతాని సమభాగాని సర్వత్ర సమహింగుళం।
మాతులుంగ రసైర్మర్ద్యం త్రిదినం చ మహామృదు॥
వటికాః సర్షమాత్రేణ హ్యనుపాన విశేషతః।
తరుణార్కరసోఖ్యాతః సర్వజ్వర నివారణః॥

బ-రా-జ్వర.

శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన టంకణము, అభ్రకభస్మ, శుద్ధిజేసిన వత్సనాభి, శుద్ధిజేసిన ఉమ్మెత్తగింజలు, శుద్ధిజేసిన గరళము, రక్తచందనము, వంగభస్మ వీనిని సమభాగములుగను, శుద్ధిజేసిన హింగుళమును పై ద్రవ్యముల మొత్తమునకు సమముగను గ్రహించి, తొలుత గంధకమును హింగుళమును గలియనూరి, అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి మాదీఫలరసముతో మూడుదినములు చక్కగా నూరి సర్షప్రమాణమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది తరుణార్కరసమనబడును. దీనిని అనుపానవిశేషములతో సేవించిన సర్వజ్వరములును శమించును.

## 3. మహాతరుణార్కరసము

శ్లో॥ అభ్రకం గంధకం తామ్రం టంకణం నాగవంగకం।
మాక్షికం లోహభస్మం చ మౌక్తికం చ ఫణేర్విషం॥

జాంబూనదోన్మత్తబీజం ప్రవాళం రక్త చందనం। తవ
క్షీరీ చ కస్తూరీ సరోహితమనశ్శిలా ॥ ఏతత్సర్వం
సమాంశాని సర్వతుల్యం తు నాభకం। సర్వేతదర్ధ
మర్ధంస్యాత్తత్సర్వమాపస్య హింగుళం॥ సర్వం ఖల్వే
వినిక్షిప్య మాతులుంగ రసేన చ। మర్దయే త్త్రిదినం
ఖల్వే నవనీత సమం మృదు॥ మూలకస్య చ బీజేన
సమంమాత్రాద్వయం దదేత్। ఉద్ధతాన్ వినిహన్త్యాశు
సన్నిపాతాం స్త్రయోదశ॥ పుంసాం తు జనితాన్
దోషాన్ స్త్రీణాం దోషం చ నాశయేత్। సర్వరోగా
వినశ్యంతి హ్యనుపాన విశేషతః॥ మహాతరుణార్క
నామాయం బాలదోష ప్రశాన్తి కృత్॥

అభ్రకభస్మ, శుద్ధిజేసిన గంధకము, తామ్రభస్మ, శుద్ధిజేసిన టంక ణము, నాగభస్మ, వంగభస్మ, స్వర్ణమాక్షికభస్మ, లోహభస్మ, మౌక్తిక భస్మ, శుద్ధిజేసిన సర్పవిషము, స్వర్ణభస్మ, శుద్ధిజేసిన ఉమ్మెత్తగింజలు, ప్రవాళభస్మ, రక్తచందనము, వెదురుప్పు, కస్తూరి, శుద్ధిజేసిన యెర్ర మణిశిల వీనిని ప్రత్యేకముగ 1 తులము చొప్పున గ్రహించవలెను. మరియు, శుద్ధిజేసిన వత్సనాభి 17 తులములును, శుద్ధిజేసిన హింగుళము 17 తులములును గ్రహించవలెను. తొలుత గంధక హింగుళములను గలియనూరి, అందు కస్తూరిని విడచి మిగిలినద్రవ్యములను జేర్చి మాదీఫల రసముచే మూడుదినములు చక్కగా మర్దించి, కస్తూరిని జేర్చి కలియ నూరి ముల్లంగి విత్తులతో సమముగ మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మహాతరుణార్కరసమన బడును. దీనిని రెండుమాత్రలు చొప్పున అనుపాన విశేషములతో సేవిం చిన సమస్త సన్నిపాతజ్వరములును, సమస్తవ్యాధులును, బాలదోషమును శమించును.

## 4. సమగరళతరుణార్కరసము

శ్లో॥ గోదన్తం హింగుళం తుల్యం ద్వయోస్తుల్యం హాలాహలం। త్రయాణాం గరళం తుల్యం గరళం కృష్ణ సర్పజం॥ మాతులుంగ రసైర్మర్ద్యం దినమేకంతు కజ్జలిం। ముద్గప్రమాణవటికాః నారికేళోదకేన చ॥ దాతవ్యం సన్నిపాతార్తే తతశ్శైత్య ముపాచరేత్। తరుణార్క రసోనామ మృత్యుంజయతి నిశ్చయః॥ మృత్యువక్త్ర గతం వాపి రోగిణాం జీవయేద్ధ్రువం॥

బ-రా-జ్వర.

శుద్ధిజేసిన తాళకము 1 భాగము, శుద్ధిజేసిన హింగుళము 1 భాగము, శుద్ధిజేసిన వత్సనాభి 2 భాగములు, శుద్ధిజేసిన గరళము 4 భాగములు ఇటుల గ్రహించి వీనినన్నింటిని ఖల్వమునందుంచి, కజ్జలి జేసి మాదీఫలరసముతో చక్కగా నొకదినము మర్దించి పెసరగింజలంత మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది సమగరళతరుణార్కరసమనబడును. దీనిని ఒక్కొక్కమాత్ర చొప్పున నారికేళజలముతో సేవించిన సమస్త సన్నిపాతజ్వరములును నిశ్చితముగ శమించును. దీనిని సేవించునప్పుడు శీతలోపచారములు హితములు.

---

## పిత్తములు - చేదుకట్లు

శ్లో॥ మత్స్య మాయూర మహిష వరాహచ్ఛాగ పిత్తకం। పంచ పిత్త మితిఖ్యాతం సర్వేష్వేవహి కర్మసు॥

పా-సం.

చేప, నెమలి, దున్నపోతు, పంది, మేక యీ యైదు ప్రాణుల యొక్క పిత్తములు పంచపిత్తములని వ్యవహరింపబడును. ఇవి యన్ని విధములగు రసకర్మలకు నుపయోగింపబడును.

## పిత్తశోధన విధానము

శ్లో॥ మత్స్యాది పిత్తం సంశుష్కం నింబద్రావై ర్విభావితం।
దినాన్తే శుద్ధి మాయాతి సత్యం గురువచో యథా॥
వై-శ-సిం.

పిత్తములను వేపచెక్క కషాయమున భావనజేసి యొకదినము ఎండలో నెండించిన యవి పరిశుద్ధములగును.

## విశేషాంశములు

### (1) భేదములు

పిత్తములకు ప్రత్యేక నిరూపణముగాని, వీని గుణాదుల వర్ణనముగాని యెచ్చటను స్పష్టముగ గానుపించదు. చరకుడు ద్రవ్యవిభాగ నిరూపణమున "తత్పున స్త్రివిధం ప్రోక్తం జంగమౌద్భిద పార్థివం। మధూని గోరసాః పిత్తం వసా మజ్జా సృగామిషం। ...జంగమేభ్యః ప్రయుజ్యంతే॥" చ-సూ.—అని జంగమ ద్రవ్యవిభాగములో పిత్తమును పఠించియున్నాడు. కాని యే యే ప్రాణులనుండి యీ పిత్తమును గ్రహింపవలెనో, వాటికి గుణము లెట్టివియో జెప్పియుండలేదు. సుశ్రుతుడు "తత్ర, దృష్టి నిశ్వాస దంష్ట్ర నఖ మూత్ర పురీష శుక్ర లాలార్తవ ముఖసందంశ విశర్ధిత తుండాస్థిపిత్త శూకశవానీతి॥" సు-క.—అని పదియారు

విధములగు జంగమవిషాధిష్ఠానములలో పిత్తమునుగూడనొక యధిష్ఠానమని జెప్పియున్నాడు. అందు "శకులీ మత్స్య రక్త రాజీవరకీ మత్స్యాశ్చ పిత్త విషాః॥" సు-క.—అని మత్స్య పిత్తమొక్కటియే సుశ్రుత నిరూపణమునుబట్టి విషముగా దెలియుచున్నది. అష్టాంగ సంగ్రహమున "గవాది శకృద్రస మూత్ర పిత్తాన్యేవం విధాని చేంద్రియోపశయా న్యన్యాన్యపి తథాస్నేహాః క్షీరం రక్తం మాంస రసోధాన్య రసస్తోయ మితి శిరో విరేచనోపయోగీని॥" అష్ట-సం-సూ.—అని శిరో విరేచనద్రవ్యములలో పిత్తము పఠింపబడినది. కాని యితర గుణము లెట్టివియో యిందును జెప్పబడియుండలేదు. ఇక రసగ్రంథకర్తలు పలువురు పలువిధములుగ తమ తమ రసకర్మలకై వలయు ద్రవ్య సంగ్రహణమున నీ పిత్తములను గూడ గ్రహించియున్నారు. అందు, "మహిషాజ గవా శ్వానాం మండూకో లూకనక్రతః॥ ఖరోష్ట్రి జంబుకనర నఖినాం చ విశేషతః॥ శిశుఘ్న మత్స్య సంభూతా వసా గ్రాహ్యా చ సాధకైః। పిత్తాని తేషాం రక్తాని రక్తవర్గే నియోజయేత్॥ రక్తవర్గస్య భాగైకో నవభాగం జలం స్మృతం। అష్టావశేషకం కృత్వా క్వాథం వస్త్రేణ పీడయేత్। తస్య క్వాథస్య భాగైకం భాగం తైలస్య తత్సమం॥ పిత్తాని రక్తయుక్తాని తామ్రే మృద్వగ్నినాపచేత్।...రంజనేషు ప్రయోక్తవ్యం సారణేషు విశేషతః। బీజ పాకేషు సర్వేషు యోజనీయం ముహుర్ముహుః॥" ర-కా.—అని రసమునకు జేయు బీజ జారణ రంజన సారణ సంస్కారములకై దున్నపోతు, మేక, గోవు, గుఱ్ఱము, కప్ప, గుడ్లగూబ,

మొసలి, గాడిద, ఒంటె, నక్క, మనుష్యుడు, గోళ్లుగల జంతువులు, శిశుఘ్న మత్స్యము అను నీ ప్రాణులయొక్క పిత్తములు గ్రహింపబడి జారణాదిక్రియలకు వలయు తైల పాకమున జేర్పదగియున్నట్లు జెప్పబడినవి. మరియు, సన్ని పాతాది వ్యాధులం దుపయోగింపబడు రసౌషధములకు తీక్ష్ణ వీర్యమును గలిగించుటకై "వారాహచ్ఛాగ మాత్స్యశ్వ మాయూరం పిత్త పంచకం। అనేన భావిత శ్చాపి దేయశ్చైతన్య భైరవః॥" అని పిత్తములతో భావన జేయదగియుండునని రససంకేతకలిక యను గ్రంథమున జెప్ప బడియున్నది. ఇటులనే యా రసౌషధముల కల్పన గావింప బడినది. మరియు, నీ రసౌషధ నిర్మాణమున నాంధ్రరసా చార్యు లితోధికముగ నీ పిత్తములను గ్రహించియున్నట్లు దెలియగలదు. అందు, కోడి, పాము, కప్ప, పీత, పిల్లి, కాకి, కొంగ, కోవిల, చిలుక, గోరింక, ఎలుక, తేలు, తీతువపిట్ట, చెవులపిల్లి, ఎలుగబంటి, పెద్దపులి, ఎద్దు, గెద్ద, పాలపిట్ట, గొర్రె, గబ్బిలము, నీటికాకి యను నీ ప్రాణుల పిత్తములు వారిచే గ్రహింపబడినవానిలో నధికములుగా గానుపించుచున్నవి. ఇక ప్రయోగవిషయమును బరిశీలిం పగా నివి చరకాదులచేతను చికిత్సాభాగమున బాహ్యా భ్యంతరముగ పలువ్యాధులం దుపయోగింపబడినట్లు దెలియ గలదు. ఇటుల వీరిచే గ్రహింపబడి, ప్రయోగింపబడియు వీనికి ప్రత్యేకగుణములను జెప్పబడకుండుటకు గారణము దెలియకున్నది. అయితే యీ పిత్తములు పిత్తప్రసంగమును బట్టి తేజోగుణభూయిష్ఠములై తిక్తామ్లరసములను, తీక్ష్ణ

ఉష్ణద్రవసరవిస్రగుణములను, విషప్రసంగమును బట్టి వ్యవాయి వికాశ్యాది గుణములను గలిగి మిక్కిలి దీపనకారులుగను, వాత కఫహరములుగను నుండునని యూహింపవచ్చును.

ఆయా ప్రాణులయొక్క శరీరములనుండి పిత్తకోశములను అందలి ద్రవసహితములుగనే గ్రహించి, యెండలో గాని, ధూమము (పొగ)వచ్చు స్థలమునందుగాని వ్రేలాడగట్టి యారిపోవునట్లు జేసి జాగ్రత్తబెట్టుదురు. ఇటుల సేకరింపబడిన పిత్తములు రసౌషధ నిర్మాతలచే తత్తత్ప్రయోజనములకై యుపయోగింపబడుచుండును. వీటిని ప్రత్యేకముగ నాభ్యంతరప్రయోగమునకై యుపయోగింపవలసియున్నచో పైని జెప్పిన విధానము ననుసరించి శోధనముజేసి యుపయోగించుకొనుట హితము. కాని వైద్యకవ్యవహారమున శుద్ధిజేయకయే యివి విశేషముగా ప్రత్యేక ప్రయోగములను గలిగియున్నట్లు దెలియుగలదు. అందు ఒంటెపిత్తము, చేపపిత్తము అనునవియే యట్లు ప్రయోగమును గలిగియున్నవి. ఇవి వరుసగా "పావుదారు, రొయిపీత" యని వ్యవహరింపబడుచున్నవి. వీని ప్రయోగ మాంధ్రదేశమున ధారాళముగా నున్నది. ఇవి సన్నిపాతజ్వరములందును, సూతికావాతములందును అట్లు ప్రయోగింపబడుచున్నవి. శైత్యమును తగ్గించి దారుణమైన యుష్ణమును బుట్టించును. ఇవి యిట్లు ప్రత్యేకముగ ప్రయోగింపబడుటయే గాకుండ యితర పిత్తములవలె నౌషధయోగములందుగూడ జేర్పబడుచుండును. ఈ రెండువిధములగు పిత్తములే బజారున విశేషముగా

లభించుచున్నవి. మిగిలిన పిత్తము లిట్లు లభించుటలేదు.

ఇక చరక సుశ్రుత వాగ్భటులుగూడ నీ పిత్తసామాన్యమును తత్తద్వ్యాధులందు ప్రత్యేకముగ ప్రయోగించియు దీనికెట్టి శోధనమును నిరూపించియున్నట్లు గానరాదు.

## (2) ప్రయోగములు

### 1. శ్విత్రకుష్ఠమున మయూరపిత్త గోపిత్తముల ప్రయోగము.

శ్లో॥ కాకోదుంబరికావాసా వల్గుజ చిత్రకా గవాం మూత్రే। పిష్ట్వా మనశ్శిలావా సంయుక్తా బర్హిపిత్తేన॥ లేపః కిలాసహన్తా, బీజాన్యవల్గుజాని లాక్షా చ। గోపిత్త మంజనేద్వే పిప్పల్యః కాలలోహరజః। శుద్ధ్యా శోణిత మోక్షైః విరూక్షణైః భక్షణైశ్చ సక్తూనాం। శ్విత్రం కస్యచిదేవ ప్రణశ్యతి క్షీణపాపస్య॥ చ-చి.

(క) బ్రహ్మమేడి, అడ్డసరము, బావంచాలు, చిత్రమూలము, మణిశిల, నెమలిపిత్తము వీనిని గోమూత్రముతో నూరి లేపనజేసిన శ్విత్రకుష్ఠము శమించును.

(ఖ) బావంచాలు, లక్క, గోపిత్తము, రసాంజనము, సౌవీరాంజనము, పిప్పళ్లు, లోహచూర్ణము వీనిని గోమూత్రముతో నూరి లేపనము జేసిన శ్విత్రకుష్ఠము శమించును.

### 2. అపస్మారమున శ్వాపిత్త ప్రయోగము

శ్లో॥ పుష్యోద్ధృతం శునః పిత్తం అపస్మారఘ్న మంజనం॥ చ-చి.

పుష్యమి నక్షత్రమున కుక్క-పిత్తమును గ్రహించి దీనితో నప స్మారరోగికి అంజనము వేసిన హృదయప్రబోధకమై స్రోతస్సులు వికసించి సంజ్ఞాలాభ మేర్పడును.

### 3. ఉన్మాదమున శల్యకాదిపిత్త ప్రయోగము

శ్లో॥ శల్యకోలూక మార్జార జంబూక వృకబస్తజైః।
మూత్ర పిత్త శకృల్లోమ నఖైశ్చర్మభిరేవచ॥
సేకాంజనం ప్రధమనం నస్యం ధూమం చ కారయేత్॥
చ-చి.

ముళ్లపంది, గుడ్లగూబ, పిల్లి, నక్క, తోడేలు, మేక వీనియొక్క మూత్రములు, పిత్తములు, మలములు, రోమములు, గోళ్లు, చర్మములు వీటిని గ్రహించి, వీనితో పిత్తోన్మాదరోగికి 'సేక-అంజన-నస్య-ధూమ రూప ప్రయోగము జేసిన హితమగును.

### 4. స్థావర విషమున గోపిత్త మయూరపిత్త అశ్వపిత్తముల ప్రయోగము

శ్లో॥ అథ షష్ఠే సంజ్ఞాయాః స్థాపనం కార్యం। గోపిత్త యుతారజనీ। శిఖిపిత్తార్థయుతం స్యాత్పలాశబీజ మగదో మృతేషువరః। వార్తా కుఘాణితాగార ధూమగో పిత్త నింబంవా॥ గోపిత్త యుక్తైర్గుళికాః సురసోగ్రా ద్విరజనీ మధుక కుష్ఠైః॥ ఉద్బంధ జలమృతే లేపౌ పధినస్య పానాని॥ వ్యోషం శిరీష పుష్పం ద్విరజన్యా వంశలోచనం చ సమం। పిష్ట్వా అజస్య మూత్రేణ గోఽశ్వ పిత్తేన సప్తాహం। వ్యత్యాస భావితోఽయం నిహన్తి శిరసిస్థితం విషం క్షిప్రం॥
చ-చి.

(క) స్థావరవిషముయొక్క ఘోరవవేగమున సంజ్ఞాస్థాపనము జేయదగినది. అందుకు పసపుచూర్ణమున గోపిత్తమును గలిపి దీనితో నంజన నస్యములను జేసిన సంజ్ఞా స్థాపనమగును.

(ఖ) కంఠమున నురివేసుకునిగాని, విషపానముజేసిగాని, జలము నందు మునిగిపోయిగాని మృతుడైనవానితో సమానముగ చేష్టలుడిగిన వానికి మయూరపిత్తము నొకభాగమును, పలాశబీజచూర్ణము నర్ధభాగమును గలిపిగాని, పెద్దములకవేరు, సగముగాచిన చెరకురసము, కరిదూపము, గోపిత్తము, నింబబీజము వీనినన్నిటిని మెత్తగా నూరిగాని, తులసి, వస, పసపు, మ్రానుపసపు, యష్టిమధుకము, చంగల్వకోష్ఠు వీటి చూర్ణమును గోపిత్తముతోగలిపిగాని శరీరమునకంతటను లేపనము జేసినను, లేక, ఉపధి యనగా శిరస్సుపై కత్తివాట్లు పెట్టి, వాటిపై నుంచినను, లేక, నస్యము జేసినను, లేక, పానము జేయించినను తిరిగి చేష్టలు యథాపూర్వముగ నేర్పడును. మరియు, త్రికటుకములు, దిరిశనపువ్వు, పసపు, మ్రానుపసపు, వంశరోచన వీనిని మేకమూత్రముతో నూరి, యీ పిష్టము నొకరోజున గోపిత్తము చేతను, మరియొకరోజున అశ్వపిత్తముచేతను, మూడవరోజున తిరిగి గోపిత్తముచేతను ఇటుల వ్యత్యాసముగ నేడుదినములు భావనజేసి దీని నట్టి రోగియొక్క శిరమున కత్తివాట్లు బెట్టి వానిపై నుంచిన విషవేగము వెంటనే శమించును.

## 5. అలర్క (పిచ్చికుక్క) విషమున మత్స్య గోపిత్తముల ప్రయోగము

శ్లో॥ పిప్పలీమరిచకూర వచాసైంధవశిగ్రుకాః। పిష్ట్వారోహితపిత్తేన ఘ్నన్త్యక్షిగత మంజనాత్॥ విషేపక్వాశయగతే పిప్పలీం రజనీద్వయం। మంజిష్ఠాంచ సమంపిష్ట్వా గోపిత్తేననరఃపిబేత్॥ చ-చి.

(క) పిచ్చికుక్క కరచుటవల్ల విషము నేత్రగతమైనప్పుడు పిప్పళ్లు, మిరియాలు, యవక్షారము, వస, సైంధవలవణము, మునగవేరు పట్ట వీనిని మత్స్యపిత్తముతో మెత్తగా నూరి యంజనము వేసిన నేత్ర గతవిషవికారము శమించును.

(ఖ) విషము పక్వాశయమును బొందినప్పుడు పిప్పళ్లు, పసపు, మ్రానుపసపు, మంజిష్ఠ వీని చూర్ణమును గోపిత్తమునందు గలిపి పానము జేసిన యీ విషవేగము శమించును.

## 6. కీటవిషమున మత్స్య మయూరపిత్త ప్రయోగము

శ్లో॥ వచాంవంశత్వచం పాఠాంనతం సురసమంజరీం।
ద్వేబలే నాకులీంకుష్ఠం శిరీషం రజనీద్వయం॥
గుహా మతిగుహాం శ్వేతామజగంధాం శిలాజతు।
కత్తృణం కటభీంక్షారం గృహధూమం మనశ్శిలాం॥
రోహీతకస్య పిత్తేన పిష్ట్వాతు పరమోఽగదః।
నస్యాంజనాద్యలేపేషు హితోవిశ్వంభరాదిషు॥
ప్రధానో బర్హిపిత్తేవ తద్వాద్వాయస పీలుకః॥

చ—చి.

వస, వెదురుపైనుండు త్వక్కు, చిరుబొద్ది, గ్రంథితగరము, తులసిపువ్వు, బల, అతిబల, దుంపరాష్ట్రము, చంగల్వకోష్ఠు, దిరిశన పువ్వు, పసపు, మ్రానుపసపు, పృశ్నిపర్ణి, శాలిపర్ణి, త్రివృత్తు, వావింట, శిలాజతు, కామంచివేరు, కంటకశిరీషబీజము, యవక్షారము, కరి దూపము, మణిశిల వీనిని మత్స్యపిత్తముతో మెత్తగా నూరి విశ్వంభ రాదికీటవిషమున నస్యరూపమునను, అంజనరూపమునను, ఆలేపనరూప మునను ఉపయోగించిన అట్టి విషము శమించును. మరియు, సర్వకీట

విషములందును తెల్లగురివింద గింజలను నెమలిపిత్తముతో నూరి త్రైవిధముగనే యుపయోగించిన మిక్కిలి శ్రేష్ఠము.

## 7. యోనిరోగమున గోపిత్త మత్స్యపిత్త ప్రయోగము

శ్లో॥ గోపిత్తేమత్స్యపిత్తే వాక్షౌమంత్రి స్సప్తభావితం॥
మధునాకిణ్వచూర్ణం వాదద్యా దచరణాపహం॥
స్రోతసాం శోధనం కండూ క్లేదశోథహరం చతత్॥

చ-చి.

అచరణ యను యోనిరోగమున పట్టుగుడ్డను గోపిత్తమునందుగాని, మత్స్యపిత్తమునందుగాని యిరువదియొకమార్లు భావనజేసి యోనియందుంచినచో స్రోతశ్శోధనమగును. కండు, క్లేదము, శోథయు శమించును.

## 8. శ్విత్రమున మయూరపిత్త ప్రయోగము

శ్లో॥ లేపాత్ పిత్తంశైఖినంశ్విత్రహారి॥ సు-చి.

మయూరపిత్తమును లేపనము జేసినయెడల శ్విత్రకుష్ఠము శమించును.

## 9. విషసంసృష్టాంజనముచే గలిగిన నేత్రవిపత్తున గోపిత్త ప్రయోగము

శ్లో॥ అంజనే విషసంసృష్టే... ఫేనో గోపిత్తసంయుతః॥

సు-కల్ప.

విషసంసృష్టమైన యంజనమును ధరించుటవల్ల నేర్పడిన నేత్రవికారమునందు సముద్రఫేనచూర్ణమును గోపిత్తముతో నూరి నేత్రములకంజనము వేసిన యట్టి వికారము శమించును.

## 10. దృష్టిగతపిత్తజరోగమున కూర్మపిత్త - మత్స్య పిత్తముల ప్రయోగము

శ్లో॥ శీతం సౌవీరకం వాపి పిష్ట్వాథ రసభావితం।
కూర్మ పిత్తేన మతిమాన్ భావయే ద్రోహితేనవా॥
చూర్ణాంజనమిదం నిత్యం ప్రయోజ్యం పిత్తశాంతయే॥
సు-ఉత్తర.

పచ్చకర్పూరమును, సౌవీరాంజనమును, మాంసరసముతో నూరి, యీ పిష్టమును కూర్మపిత్తముతోగాని, మత్స్యపిత్తముతోగాని భావన జేసి యెండించి చూర్ణరూపమున అంజనము వేసినచో దృష్టిగతపిత్తజ వ్యాధి శమించును.

## 11. వస్తిజేసిన ద్రవ్యము తిరిగి బయటకు రానప్పుడు గోపిత్త ప్రయోగము

శ్లో॥ కుష్ఠం సుపిష్టం కుముదేనసార్థం గవ్యం చ పిత్తం ప్రపిబేజ్జలేన॥ కాశ్యప-సిద్ధి.

వస్తిజేసిన ద్రవ్యము తిరిగి బయటకు రానియెడల చంగల్వకోష్ఠును, పద్మబీజమును, గోపిత్తముతో నూరి యీ కల్కమును జలముతో పానము జేయించిన హితమగును.

## 12. రక్తపిత్తమున ఆజపిత్త ప్రయోగము

శ్లో॥ అతి నిస్సృత రక్తశ్చ క్షౌద్రేణ రుధిరం పిబేత్।
జాంగలం, భక్షయేద్వా ఆజమామం పిత్తయుతం యకృత్॥ అ-హృ-చి.

రక్తపిత్తరోగికి విశేషముగ రక్తము బయటకు స్రవించినప్పుడు

జాంగల జంతువుల రక్తమును పానముజేయించినను, లేక, మేకయొక్క యకృత్తును పిత్తసహితముగా భక్షింపజేసినను హితమగును.

13. సన్నిపాతజ్వరమున మత్స్యపిత్త ప్రయోగము.

శ్లో॥ వచారసోన కటుకం...భావయే న్మత్స్యపిత్తేన త్రివారం చూర్ణయేత్ ......దాపయేత్ ఘ్రాణఛిద్రాయాం సంజ్ఞాకరణ ముత్తమం॥ ర-మం.

సన్నిపాతజ్వర పీడితునకు సంజ్ఞామోహము కలిగినప్పుడు వస, వెల్లుల్లి, కటుకరోహిణి మున్నగు ద్రవ్యచూర్ణమును మత్స్యపిత్తముతో మూడుసార్లు భావనజేసి నస్యము జేసిన సంజ్ఞామోహము నశించును.

14, స్వర్ణజారణమునకు మయూరపిత్త ప్రయోగము

శ్లో॥ హాఠాత్తమపరిధ్మాతో రస స్తద్గర్భసంస్థితః।
మాయూర మాయునా లిప్తం కాంచనం గ్రసతిక్షణాత్॥
ఆ-ప్ర.

కచ్ఛపయంత్రస్థమైన మూషయొక్క లోభాగమున మయూర పిత్తమును బూసి యందు స్వర్ణసహితముగా పాదరసమునుంచి, బంధించి కోష్ఠీయంత్రమున బలముగ నూదినచో స్వర్ణము రసమునందు జారితమగును.

## (3) యోగములు

### 1. బ్రహ్మాస్త్రరసము *

(మయూర-మహిష-మత్స్య-వరాహ-ఛాగ-పన్నగ-శశ-జంబుక-శ్వానపిత్తములచే భావనజేయబడినది)

---

* పిత్తములు విషముతో సమానమై మిగుల తీక్ష్ణమైన వీర్యముగలవిగాన వీనిచే భావనజేయబడిన రసౌషధముల ప్రయోగమున దధ్యన్నభోజనము, శీతలోపచారములు హితములని తెలియవలెను.

శ్లో॥ ద్వితుత్థంచ త్రిపాషాణం గంధకంచ శిలావిషం।
నేపాళం దరదంచాభ్రం సైంధవం మరిచంబిడం॥
త్రిక్షారం టంకణంహింగు సర్వతుల్యంతు పారదం।
జ్యోతిష్మత్యాస్తు తైలేన మర్దయే ద్దినపంచకం॥
డోలాయంత్రే దినేపక్త్వా సీత్వాఖల్వే విమర్దయేత్।
మయూరమహిషీ మత్స్య వారాహచ్ఛాగపన్నగాః॥
శశకా జంబుకాశ్వాన ఏభిఃపిత్తైస్తు భావయేత్।
గుంజామాత్రం క్షురేభిత్వా బ్రహ్మద్వారే వినిక్షిపేత్॥
నశ్యతి తత్ క్షణేనైవ సన్నిపాతం సుదారుణం॥
మూకాపస్మారబధిర హిక్కా శ్వాస వినాశనం॥
బ్రహ్మాస్త్రోఽయం రసోఖ్యాతః సన్నిపాత కులాంతకః॥
బ-రా. సన్నిపాత.

శుద్ధిజేసిన మైలతుత్థము, శుద్ధిజేసిన పాలతుత్థము, శుద్ధిజేసిన ఉల్లి పాషాణము, శుద్ధిజేసిన గౌరీపాషాణము, శుద్ధిజేసిన దొడ్డిపాషాణము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన మణిశిల, శుద్ధిజేసిన వత్సనాభి, శుద్ధిజేసిన నేపాళబీజములు, శుద్ధిజేసిన ఇంగిలీకము, అభ్రకభస్మ, సైంధవ లవణము, మిరియాలచూర్ణము, బిడాలవణము, సర్జక్షారము, యవక్షారము, టంకణక్షారము, మడ్డివెలిగారము, పొంగించిన యింగువ వీనిని సమభాగములుగను, వీని మొత్తమునకు శుద్ధిజేసిన పాదరసమును సమముగను గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిజేసి అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి మాల్కంగునీ విత్తుల తైలముతో నైదు దినములు మర్దించవలెను. పిమ్మట నీ పిష్టమును వళసరిగనుండు వస్త్రఖండములో మూటగట్టి డోలాయంత్రమున కాంజికముతో నొకదినము పాకముజేసి పిమ్మట నా యౌషధపిష్టమును నెమలిపిత్తముతోను, ఎనుముపిత్తము

తోను, చేపపిత్తముతోను, పందిపిత్తముతోను, మేకపిత్తముతోను, పాము పిత్తముతోను, చెవులపిల్లి పిత్తముతోను, నక్కపిత్తముతోను, కుక్క పిత్తముతోను ప్రత్యేకముగ నొక్కొక్కదినము చొప్పున భావనజేసి భద్రపరచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది బ్రహ్మాస్త్రరస మన బడును. సన్నిపాతజ్వర పీడితుడు మూకాపస్మారబాధిర్యములతో గూడి మిగుల మూర్ఛితుడై యున్నప్పుడు నడినెత్తిపై రోమములు తొలగించి బ్రహ్మరంధ్రమున కత్తివాట్లుపెట్టి అందు ఒక గురిగింజ ప్రమాణమున నీ యౌషధము నుంచి చేతితో లోన ప్రవేశించునట్లు రుద్దవలెను. ఇందువలన అట్టి వికారములన్నియు వెంటనే తగ్గి సన్నిపాతజ్వరము శమించును. మరియు నందు గలుగు హిక్క, శ్వాసయుగూడ శమించును.

## 2. రసరాజేంద్రరసము

(మత్స్య-వరాహ-మయూర-ఛాగ-మహిష పిత్తములచే భావన జేయబడినది)

శ్లో॥ సూతస్య శుద్ధస్యపలం పలంతామ్రమయోరజః।
అభ్రంనాగం పలంవంగం పలం గంధకతాళకం॥
పలం శుద్ధవిషంచూర్ణం సర్వమేకత్రకారయేత్।
మర్దయేత్కాకమాచ్యాశ్చ పత్రసార రసేనచ॥
మత్స్య వారాహ మాయూర ఛాగమాహిషపిత్తకైః।
మర్దయేచ్ఛిన్నభిన్నంచ త్రికటోరంబుభిస్తథా॥
ఆర్ద్రికస్యరసైః పశ్చాత్ శతవారాన్ముహుర్ముహుః।
సిద్ధోఽయం రసరాజేంద్రో ధన్వన్తరి ప్రకాశితః॥
గుంజామాత్రం రసందద్యాత్ సురసారస సంయుతం।
మేఘధారా ప్రవాహేన ధారితం వారిమస్తకే॥

అనివార్యోయదా దాహ స్తదా దేయాచ శర్కరా।
భోజనం దధిసంయుక్తం వారమేకంతు దాపయేత్॥
ఈశ్వరేణ హతః కామః కేశవేనచ దానవః।
పావకేన హతంశీతం సన్నిపాతం రస స్తథా॥

బ-రా. సన్నిపాత.

శుద్ధిజేసిన పాదరసము 1 పలము, తామ్రభస్మ 1 పలము, లోహభస్మ 1 పలము, అభ్రకభస్మ 1 పలము, నాగభస్మ 1 పలము, వంగభస్మ 1 పలము, శుద్ధిజేసిన గంధకము 1 పలము, శుద్ధిజేసిన తాళకము 1 పలము, శుద్ధిజేసిన వత్సనాభి 1 పలము ఇటుల గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిజేసి, అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి కొమంచియాకు స్వరసముతో జక్కగా మూడుదినములు మర్దించవలెను. పిమ్మట చేప, పంది, నెమలి, మేక, ఎనుము వీని పిత్తములతో ప్రత్యేకముగ నొక్కొక్కదినము చొప్పున నూరి, త్రికటుక కషాయముచేతను, అల్లపు రసముచేతను పలుమార్లు భావనజేసి భద్రపరచవలెను. ఇటుల సిద్ధము జేయబడినట్టిది రసరాజేంద్రరసమనబడును. దీనిని ఒక గురిగింజ ప్రమాణమున తులసీ స్వరసముతో సేవించవలెను. ఇందువలన గలుగు తాపము శమింపజేయుటకు శిరస్సుపై వర్షధారపడునట్లు రోగిని కూర్చుండబెట్టి, చక్కెర గలిపిన జలమును పానము జేయించవలెను. మరియు దధ్యన్నమును ఆహారముగా నొసంగవలెను. ఇందువలన సన్నిపాత జ్వరము శమించును.

## 3. స్వచ్ఛంద భైరవరసము

(మత్స్య-కూర్మ-వరాహ పిత్తములచే భావనజేయబడినట్టిది)

శ్లో॥ శుద్ధసూతం విషంచాభ్రం హింగుళం బలితాళకం।
తుల్యంతుల్యం ఖల్వమధ్యే క్షిపేన్మర్ద్యం దినత్రయం॥

హంసపాది కషాయేణ కుక్కుటే పుటపాచితం।
చూర్ణంకృత్వా తతో దేయం మత్స్యకూర్మవరాహకే॥
పిత్తే దినత్రయంభావ్యం మాషమార్ద్రానుపానతః।
వస్తివాతం నిహన్త్యాశుచాత్యుగ్రం నాశయేద్ధ్రువం॥
బ-రా. వాతరోగ.

శుద్ధిజేసిన పాదరసము, శుద్ధిజేసిన వత్సనాభి, అభ్రకభస్మ, శుద్ధిజేసిన హింగుళము, శుద్ధిజేసిన గంధకము, శుద్ధిజేసిన తాళకము వీనిని సమాంశములుగ గ్రహించి, తొలుత రసగంధకములను కజ్జలిజేసి, అందు మిగిలిన ద్రవ్యములను జేర్చి హంసపాదియాకు స్వరసముచే మూడుదినములు మర్దించి, చిన్న చిన్న చక్రికలుజేసి, శరావసంపుటమున బంధించి కుక్కుటపుటముచే పాకము చేయవలెను. స్వాంగశీతలమున నా యౌషధమును గ్రహించి, మెత్తగా చూర్ణించి, చేప, తాబేలు, పంది వీని పిత్తములతో ప్రత్యేకముగా నొక్కొక్క దినము చొప్పున భావనజేసి మాష ప్రమాణమున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది స్వచ్ఛందభైరవరస మనబడును. దీని నొక్కొక్క మాత్ర చొప్పున అల్లపురసముతో సేవించిన అత్యుగ్రమైన వస్తివాతము శమించును.

8-వ అధ్యాయము

# జాన్తవ వర్గము

## జాన్తవ ద్రవ్యములు

శ్లో॥ మధూనిగోరసాః పిత్తం వసామజ్జాఽసృగామిషం।
విణ్మూత్ర చర్మ రేతోఽస్థి స్నాయు శృంగ నఖాః
ఖురాః॥ జంగమేభ్యః ప్రయుజ్యంతే కేశలోమాని
రోచనాః॥ చ-సూ-అ 1-69.

తేనె, క్షీరము, పిత్తము, వస, మజ్జ, రక్తము, మాంసము, మలము, మూత్రము, చర్మము, శుక్రము, అస్థి, స్నాయువులు, శృంగము, గోళ్లు, డెక్కలు, కేశములు, రోమములు, గోరోచనము అనునవి చరకునిచే ద్రవ్యవిభాగములో జాన్తవ ద్రవ్యములుగా బఠింపబడినవి. ఇందు విశేషముగా రసతంత్ర ప్రవర్తకులచే, "నారీమేషీఖరాష్ట్రిణాం మూత్రవర్గోగజస్యచ। మధ్వాజ్యటంకణం... స్యాన్మిత్రపంచకం॥ నరాశ్వ శిఖిగోమత్స్య పిత్తాని పిత్తవర్గకే। మత్స్యాహి నరమేషీణాం శిఖినాంచ వసామతా॥" (రస-రత్నాకర) అని మూత్రమధ్వాజ్య పిత్తవసాద్రవ్యములు తత్త్ర్ప్రాణులనుండి గ్రహింపదగినవిగా దెలుపబడినవి. మరియు, "ఊర్ణా టంకణగిరిజతు మహిషీకర్ణాక్షిమల శక్రగోప కర్కటకాః॥" ఆ-ప్ర. అని రోమములు, మహిషీ కర్ణాక్షీమలము, ఆరుద్రపురుగులు, పీతమాంసము మున్నగు జాన్తవ

ద్రవ్యములుగూడా గ్రహింపబడియున్నవి. ఇవి యెల్ల పాద రసమునకు జేయు భిన్న భిన్న సంస్కారములకై యుపయో గింపదగియుండునని తత్తత్ప్రకరణములందు వార్లచే దెలుప బడియున్నవి. అందుచే నీ జాన్తవద్రవ్యములను మేము గూడ రసౌషధ విజ్ఞానమునం దొకభాగముగా జేర్చి యున్నాము. అయితే నీద్రవ్యముల కన్నింటికిని గుణాది నిరూపణము గ్రంథబాహుళ్యమునకు హేతువగునుగాన వీనిలో ముఖ్యమైనట్టియు, నౌషధార్థ ముపయోగింపదగి యుండునట్టియు, మిగుల ప్రసిద్ధిలో నున్నట్టియు ద్రవ్యము లను మాత్రమే గ్రహించి యీ భాగమున జేర్చియున్నాము. వీనికి రసతంత్రమున నుపయోగాదులు ఖనిజవర్గభాగమున తత్తత్ప్రసంగమున దెలిపియున్నాముగాన యిట వైద్యక వ్యవహారమునకు వలయు గుణాదుల దెలుపదలచితిమి. పిత్త ములు తంత్రకర్తలచే విషములుగా వర్ణింపబడియుండుటచే వానిని విషవర్గములో జేర్చియున్నాము. మిగిలిన ద్రవ్య ములయొక్క యుపయోగాదులను, వాటియొక్క గుణాదు లను ఇతర గ్రంథములనుండి పాఠక మహాశయులు గ్రహిం చుదురుగాక!

## కస్తూరీ—కస్తూరి (క)

### పర్యాయపదములు

శ్లో॥ మృగనాభిర్మృగమదః కథితస్తు సహస్రభిత్ ।
కస్తూరికా చ కస్తూరీ వేధముఖ్యా చసాస్మృతా॥

మృగనాభి, మృగమదము, సహస్రభిత్తు, కస్తూరిక, కస్తూరి, వేధముఖ్య అనునవి కస్తూరీ నామములు.

## కస్తూరీగుణములు

శ్లో॥ కస్తూరికా కటుస్తిక్తా క్షారోష్ణా శుక్రలాగురుః।
కఫవాత విషచ్ఛర్ది శీతదౌర్గంధ్యశోషహృత్ ॥

కస్తూరి కటురసమును, తిక్తానురసమును, గురుగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. క్షారముగలది. శుక్రమును వృద్ధిజేయును. కఫవాతములను శమింపజేయును. విషము, ఛర్ది, శైత్యము, దౌర్గంధ్యము, శోష అను నీ వ్యాధులను బోగొట్టును.

## గంధమార్జారవీర్య గుణములు (ఖ)

శ్లో॥ గంధమార్జారవీర్యంతు వీర్యకృత్ కఫవాతహృత్ ।
కండూకుష్ఠహరంనేత్ర్యం సుగంధం స్వేదగంధనుత్ ॥

పునుగు (కస్తూరిభేదము) మంచివాసన గలిగియుండును. శుక్రమును వృద్ధిబొందించును. నేత్రములకు హితమైనది. కఫవాతములను శమింపజేయును. కండు, కుష్ఠము, చెమటవలన గలుగు దుర్వాసన వీనిని బోగొట్టును.

## లతాకస్తూరికాగుణములు (గ)

శ్లో॥ లతాకస్తూరికాతిక్తా స్వాద్వీవృష్యా హిమాలఘుః॥
చక్షుష్యా ఛేదనీశ్లేష్మ తృష్ణా వస్త్యాస్య రోగహృత్॥

లతాకస్తూరి తిక్తరసమును, మధురానురసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. నేత్ర

ములకు హితమైనది. ఛేదనము. కఫమును శమింపజేయును. తృష్ణ, వస్తిరోగము, ముఖరోగము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

మృగమదము.

(ఖ) గుణబోధకములు :

సహస్రభిత్తు, వేధముఖ్య.

(గ) ఉత్పత్తిబోధకములు :

మృగనాభి.

### (2) శబ్దార్థములు

మృగమదము— కస్తూరీమృగముయొక్క మదము (సారము).

వేధముఖ్య—వ్యాధులను బోగొట్టుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. సహస్రభిత్తు - అనేకవ్యాధులనుబోగొట్టునది.

మృగనాభి—కస్తూరీమృగముయొక్క నాభి (బొడ్డు) యందుత్పన్నమగునది.

### (3) భేదములు

ఇది జాంతవము, ఓషధీయము అని నిఘంటుకారుల నిరూపణమునుబట్టి రెండువిధములుగా నుండునని జెప్ప

వచ్చును. అందు జాంతవమనునది దుప్పివలెనుండు కస్తూరీ మృగముయొక్క నాభియందుత్పన్నమగును. అందుచేతనే యియ్యది మృగనాభియను పదముచే వ్యవహరింపబడు చున్నది. ఇయ్యది యుత్తేజక సేధ్యవృష్య సుగంధద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నది. ఈ కస్తూరిలో కృత్రిమ కస్తూరిగూడ బజారులందు లభ్యమగుట గలదు. కావున కస్తూరీ లక్షణమును దెలిసి నిజమగు కస్తూరిని గ్రహించుట యుక్తము. స్వచ్ఛమగు కస్తూరి దేశభేదముచే ననేకవిధములుగా నుండును. అందు, 'కామరూపోద్భవా శ్రేష్ఠా నేపాలీ మధ్యమాభవేత్। కాశ్మీర దేశ సంభూతా కస్తూరీ హ్యధమాభవేత్॥'' భా-ప్ర.—కామరూప దేశము నందును, నేపాల దేశమునందును, కాశ్మీర దేశమునందును లభించును. వీనిలో కామరూపోద్భవము శ్రేష్ఠమైనది. నేపాల దేశజము మధ్యమమైనది. కాశ్మీర దేశజము అధమమైనది యని దేశభేదముచే కస్తూరిని ఉత్తమ-మధ్యమ-అధమములుగా భావమిశ్రుడు విభజించియున్నాడు. మరియు, రాజనిఘంటు కారుడీ కామరూపాది దేశజములగు కస్తూరులకు వర్ణభేదము నిట్లు దెలిపియున్నాడు. ''కపిలా పింగలా కృష్ణా కస్తూరీ త్రివిధాక్రమాత్। నేపాలికే చ కాశ్మీరే కామరూపే చ జాయతే॥'' అనగా కామరూప దేశజ కస్తూరి కృష్ణవర్ణమును, నేపాల దేశజ కస్తూరి కపిలవర్ణమును, కాశ్మీర దేశజ కస్తూరి పింగలవర్ణమును గలిగియుండును. మరియు, దేశభేదము చేతను, వర్ణభేదముచేతను త్రివిధములుగనుండు కస్తూరి యొక్క స్వరూపభేదములను రాజనిఘంటుకారు డిట్లు

వర్ణించియున్నాడు. "సాప్యేకాఖరికాతతశ్చ తిలకా జ్ఞేయా కులుత్థాపరా। పిండాన్యాపిచ నాయికేతిచ పరాయా పంచ భేదాభిధా॥ చూర్ణాకృతిస్తు ఖరికా తిలకాతిలాభా కౌలుత్థ బీజ సదృశాచ కులుత్థికాచ। స్థూలాతతశ్చకియదధియంకిల పిండకాఖ్యాతస్యాశ్చ కించిదధికాయది నాయికాఖ్యా॥" రా-ని.—అనగా - ఖరిక, తిలక, కులుత్థ, పిండ, నాయిక యని కస్తూరియొక్క స్వరూప మైదు విధములుగనుండును. అందు చూర్ణరూపముననుండునది ఖరిక యనియు, నువ్వు గింజలవలె నుండునది తిలకయనియు, ఉలవల రూపమున నుండునది కులుత్థ యనియు, అంతకు కొంచెము పెద్ద స్వరూపముతో నుండునది పిండయనియు, అంతకు హెచ్చు స్వరూపముతో నుండునది నాయిక యనియు దెలియనగును. అయితే బజారులందు దొరకునట్టిది కృష్ణవర్ణముగలిగి తిలల కంటె తక్కువ స్వరూపమును గలిగి చూర్ణమువలెనుండును. మరియు నందు ఉలవలకంటె పెద్దవియగు నుండలవలెనుండునదిగూడ అప్పుడప్పుడు గలసియు లభ్యమగుచుండును. కాని పైని దెలిపిన ప్రత్యేక స్వరూపములతో కస్తూరిగానరాదు. ఇన్నివిధములుగ నుత్పన్నమగుచున్న కస్తూరి మిగుల వెల గలదియగుటచేతను, నతిస్వల్పముగ నుత్పత్తియగుచుండుట చేతను దీనిని విక్రయించువార లీరకముల నెల్ల మిశ్రముచేసి విక్రయించుదురేమో యూహింపవలసియున్నది. మరియు దీనితోబాటు కృత్రిమకస్తూరిగూడ బజారులందు లభ్యమగుచుండును. నిజకస్తూరిని కొద్దిగా దీసికొని దీనితో సమాన స్వరూపముగల నితర ద్రవ్యచూర్ణమును గలిపిగాని, యట్టి

ద్రవ్యమునందు కస్తూరీ ద్రావకమును జేర్చి గాని బజ
లందు అమ్ముచుందురు. ఇది చూచుటకు నిజమగు కస్తూ
వలెనే గానుపించును. కాని కస్తూరీ పరీక్షావిధానమున
క్షించినచో నందలి తత్వము బోధపడగలదు. కావున బ
రులందు నిజమగు కస్తూరికై ప్రయత్నింపవలెను.

మరియు, .జవాది యను సుగంధ ద్రవ్యము గ
రాజము, కృత్రిమము, మృగధర్మజము అను మొదల
నామములచే రాజనిఘంటువునందు వర్ణింపబడుటచే గొంద
దీనినే కృత్రిమ కస్తూరి యని చెప్పుదురు. అయితే
వాసనబట్టి యొకింత కస్తూరీ సామ్యతను గలిగియుండు
కాని స్వరూపాదులనుబట్టి నిజముగ నిది కస్తూరికి భిన్న
నదిగనే గ్రహింపదగినది. ఏలయనగా 'సమూహగంధః
సాంబ్రాణి కర్దమము, సుగంధతైల నిర్యాసము' అ
మున్నగు నామములచే నిది సాంబ్రాణి మొదలగు కొ
సుగంధ ద్రవ్యములనుండి రసక్రియరూపమున తయారుచే
బడినట్లు బోధపడుచున్నది. మరియు, 'జవాది నీలం సుసి
మీషత్పీతం సుగంధితం। ఆతపే బహుళామోదం త్వ
యోగ్యం న చాన్యథా॥'' రా-ని.—అని చెప్పబడుట
జవాది కొద్దిగ పసపువర్ణముతో గూడిన నీలవర్ణమును గ
స్నిగ్ధముగ నుండుననియు, మంచి పరిమళము గలిగియు
ననియు, నెండలోనుంచినప్పుడు హెచ్చుగ పరిమళించునని
దెలియుచున్నది. అందుచే జిక్కగనుండు తైలమువలెన
యాతప సంయోగమున హెచ్చుగ పరిమళించునట్టి ద్రవ్య

నని దెలియదగినది. మరియు, 'ఓతూద్భవా కస్తూరికా' యను నిఘంటు రత్నాకర వచనమునుబట్టి గంధమార్జార బీజము (పునుగు)ను కస్తూరీ భేదముగా గొందరు జెప్పుదురు. అయితే నిది వాస్తవముగా జాంతవమైనను ప్రత్యేక సుగంధద్రవ్యము గాని కస్తూరీభేదముగ గానరాదు. ఇది చూచుటకు ముద్దవలె నుండును. ఒకవిధమగు సుగంధమును గలిగియుండును. కాని కొందరకీ వాసన గిట్టదు. ఇది యొక విధమగు మార్జాలము (పిల్లి) యొక్క వీర్యము. ఇది తెల్లగ నుండును. విక్రయించువార లిందు వేరొక నిర్యాసమును సమ్మిశ్రము జేసి బజారులందు విక్రయించుదురు. ఇయ్యది నలుపు గలసిన యెరుపు వర్ణము గలిగియుండును. కావున అట్టి వర్ణ భేదమునుబట్టి నిజమగు ద్రవ్యమును గ్రహించుట యుక్తము. ఇది యిట్లుండ దీనిని నిఘంటు రత్నాకరకారు డేల కస్తూరీ భేదముగా వర్ణించియున్నాడో విమర్శింపదగి యున్నది. కస్తూరిలో నోషధీయ కస్తూరి యను మరియొక భేదము గలదని తొలుతనే దెలుపబడియున్నది. ఓషధీయ శబ్దముచేతనే యిది జాంతవముగాదని దెలియుచునేయున్నది. ఇది లతా కస్తూరి యని వ్యవహరింపబడుచున్నది. కస్తూరీ శబ్దమునుబట్టి యీ లత కస్తూరీ గంధమును గలిగియుండు ననియు, నందుచే నా ద్రవ్య మట్లు వ్యవహరింపబడుచున్న దనియు దెలియనగును. ఇది దక్షిణ భారతమున నుత్పన్న మగునని నిఘంటురత్నాకరమున దెలుపబడినది. ఇటుల కస్తూరియం దనేక రకములుండుటచే నిజమగు కస్తూరిని గురించి దెలుసుకొనుట యుక్తము. "స్వాదే తిక్తా పింజరా

కేతకీనాం గంధం ధత్తేలాఘువంతోలనేన। యాప్సున్యస్తా నైవ వైవర్ణ్య మియాత్ కస్తూరీ సా రాజయోగ్యా ప్రశస్తా॥'' ''మర్దితా చిక్కణాస్యాత్। దాహాం యానైతి వహ్నౌచిమ చిమకురుతే చర్మగంధాహులుతాశే। సాకస్తూరీ ప్రశస్తావరమృగతనుజారాజతేరాజభోగ్యా॥'' రా-ని. — అని రాజనిఘంటువున కస్తూరిని బరీక్షించు విధానము దెలుపబడినది. ఎటులనగా - నిజమగు కస్తూరి కొద్దిగా నోటియందుంచుకొనినప్పుడు చేదుగనుండును. వర్ణము పింజరవర్ణముగానుండును. ఆఘ్రాణించినప్పుడు మొగలిపువ్వుల వాసన జూపించును. తూచినప్పుడు మిక్కిలి తేలికగా నుండును. నీళ్లలోవేసినప్పుడు నిజవర్ణములో వికృతిలేక యుండును. మరియు, కొద్దిగా హస్తమునందుంచుకుని మర్దించినచో చిక్కదనమును బొందును. అగ్నియందుంచినచో మండిపోక చిమచిమయను శబ్దమును జేయును. చర్మమును గాల్చినప్పుడు గలుగు గంధమును గలిగియుండును. ఇటుల బైవిధముగ బరీక్షించి గ్రహింపబడినట్టిది మిక్కిలి శ్రేష్ఠమైనదిగా దెలియనగును. మరియు, 'బాలేజరతిచహారిణే క్షీణేరోగిణిచ మందగంధయుతా। కామాతురేచ తరుణే కస్తూరీ బహుళ పరిమిళాభవతి॥'' అని కస్తూరీ గంధభేదములు రాజనిఘంటువున జెప్పబడినవి. అందు మిగుల చిన్నదియు, ముదుసలియు, కృశించినట్టియు, వ్యాధిచే బీడింపబడినట్టియు నగు కస్తూరీ మృగమునుండి యుత్పన్నమైన కస్తూరి స్వల్పగంధమును మాత్రమే గలిగియుండును. కామముచే బీడింపబడినట్టియు, తరుణవయస్సునం దున్నట్టియు మృగమునుండి

యుత్పన్నమైన కస్తూరి హెచ్చు గంధమును గలిగియుం
డును. కావున కస్తూరిని గ్రహించునప్పు డీగంధ విభేదమును
గూడ గుర్తింపనగును. ఇక త్యాజ్య కస్తూరిని బరీక్షించు
విధానముగూడ రాజనిఘంటుకారునిచే నిట్లు దెలుపబడినది.
"యాస్నిగ్ధా ధూమగంధావహతి వినిహితా పీతతాంపావకేం
తర్నిశ్శేషం యానివిష్టాభవతి హుతవహే భస్మసాదేవ
సద్యః। యాచన్యస్తా తులాయాం కలయతిగురుతాంమర్దితా
రూక్షతాంచజ్ఞేయా కస్తూరికేయం ఖలకృతమతిభిః కృత్రి
మానైవసేవ్యా॥" రా-ని. అనగా - స్పృశించినప్పుడు జిడ్డు
గలిగి యుండును. అగ్నియందుంచినప్పుడు పసుపుపచ్చని
వర్ణముగల ధూమముతోగూడి కొంచెముకాలములో బూ
డిదవలెనగును. తూచినప్పుడు మిక్కిలి బరువుగానుండును.
హస్తమునందుంచుకుని వ్రేలితో మర్దించినప్పుడు గరగర
లాడును. ఈవిధముగా బరీక్షింపబడినట్టిది దుష్టకస్తూరియని
తెలిసికొని త్యజింపవలెను. ఇటుల నిర్దుష్ట దుష్టకస్తూరీ పరి
జ్ఞానముతో నిర్దుష్టకస్తూరిని గ్రహించి యోగములందు
జేర్చుకొనుట యుక్తమగును. ఇయ్యది మిక్కిలి యుత్తేజ
కర ద్రవ్యమగుటచే వాతకఫజ వ్యాధులలో విశేషముగ
ప్రయోగింపబడుచుండును. సన్నిపాతాదిజ్వరములలో సంజ్ఞా
మోహముగలిగినప్పుడు తమలపాకుల రసములో దీనిని జేర్చి
యుపయోగించుదురు. అటులనే అపతంత్రకాది వాత
వ్యాధులలోను, సూతికావాతమునందును క్షయకాసాది
కఫజ వ్యాధులలోను దీనిని విరివిగా ప్రయోగించుదురు.
కొన్ని ప్రాంతములందు ప్రసవించినట్టిస్త్రీకి వెంటనే కొద్ది

మోతాదులో కస్తూరిని తమలపాకులో చుట్టబెట్టి నమిలించి మ్రింగించుదురు. ఈ చెప్పబడిన వ్యాధులందేగాకుండ నితరవ్యాధులలో నసాధ్యలక్షణము లేర్పడినప్పుడుగాని, అరిష్టలక్షణములు గానుపించినప్పుడుగాని కస్తూరిని ముఖ్యౌషధముగా వాడుదురు. ఇటుల నీ ద్రవ్యము ప్రతి వ్యాధిలోను సర్వసాధారణముగా నెప్పుడో యొకప్పుడు ప్రయోగింపబడుచునే యుండును. గంధమార్జారబీజముగూడ ప్రయోగింపబడుచునే యుండును గాని కస్తూరియంత ప్రయోగము దీనికి గానరాదు. మహారాజాధిరాజు లీ కస్తూరిని ప్రతినిత్యము తాము శరీరమున కలంకరించుకొను సుగంధాదిలేపములలో దీనిని జేర్చుకొందురు. మరియు పునుగు జవ్వాది మున్నగువానినిగూడ పై యనులేపములలో జేర్చుకొనుచుందురు. అయితే యివి సామాన్యజనుల కందుబాటులో లేనివి యగుటచే వ్యవహారమునందు వీని ప్రయోగ మరుదుగనే యుండును. ఈ ద్రవ్యములతో ధూపవర్తులను జేసి విక్రయించుదురు. ఇవి మిక్కిలి వెలగలిగియుండును. వీటి ధూపము హెచ్చు పరిమళము గలిగియుండును. ఇటుల నీ ద్రవ్యములు వైద్యకమునందును, వ్యవహారమునందును ప్రతినిత్యము ప్రయోగింపబడుచునే యుండును.

### (4) విశేష గుణములు

(క) కస్తూరి - రసాయనము. కిలాసము, ముఖరోగము, తృష్ణ, కాసము వీనిని బోగొట్టును. ని-ర.— రక్తపిత్తమును బోగొట్టును. రా-ని.

(ఖ) గంధమార్జారవీర్యము – స్నిగ్ధగుణమును, ఉష్ణ
వీర్యమును గలిగియుండును. వాన్తిని గలుగజేయును.
వెంటనే శుక్రమును బుట్టించును. శరీరమునకు కాంతిని కలి
గించును. వాతమును శమింపజేయును. కుష్ఠము, విషము,
కంఠరోగము వీనిని బోగొట్టును.    ని-ర.

(గ) జవాజి – స్నిగ్ధగుణమును. ఉష్ణవీర్యమును గలిగి
యుండును. సుఖము గలిగించును. వాతమునకు హితమై
నది.    రా-ని.

(ఘ) లతాకస్తూరి – తీక్ష్ణగుణమును గలిగియుండును.
వస్తిని శోధించును. వెంటనే శుక్రమును గలిగించును. వాత
మును శమింపజేయును. లాలాస్రావము, ఛర్ది, దౌర్గం
ధ్యము, మదము వీనిని బోగొట్టును. ని-ర., హృదయము
నకు హితమైనది.    రా-వ.

## (5) యోగములు

### 1. కస్తూరీభైరవరసము

శ్లో॥ హింగుళం చ విషం టంకం జాతీకోశఫలం తథా।
మరిచం పిప్పలీ చైవ కస్తూరీ చ సమాంశికా॥
రక్తిద్వయం తతః ఖాదేత్ సన్నిపాతే సుదారుణే॥
భై-ర-జ్వర.

శుద్ధిజేసిన హింగుళము, శుద్ధిజేసిన వత్సనాభి, శుద్ధిజేసిన వెలిగా
రము, జాపత్రి, జాజికాయలు, మిరియాలు, పిప్పళ్లు, కస్తూరి వీనిని
సమాంశములుగ గ్రహించి, తొలుత ఖల్వమునందు హింగుళమును

మెత్తగా నూరి, పిదప మిగిలిన ద్రవ్యముల చూర్ణముల నందు జేర్చి తమల పాకుల రసముతో జక్కగా మూడుదినములు మర్దించవలెను. పిమ్మట రెండు రక్తికల పరిమితిని మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది కస్తూరీ భైరవరస మనబడును. దీనిని ఒక్కొక్కమాత్ర చొప్పున సేవించిన దారుణమైన సన్నిపాతజ్వరము శమించును.

## 2. మృగమదాసవము

శ్లో॥ మృతసంజీవనీ గ్రాహ్యా పంచాశత్పల సమ్మితా।
తదర్ధం మధుసంగ్రాహ్యం తోయం మధు సమం తథా॥
కస్తూరీ కుడవం తత్ర మరిచం దేవపుష్పకం।
జాతీఫలం పిప్పలీ త్వక్ భాగాన్ ద్విపలికాన్ క్షిపేత్॥
భాండే సంస్థాప్య రుధ్వాచ నిదధ్యాన్మాస మాత్రకం।
విషూచికాయాం హిక్కాయాం త్రిదోష ప్రబలేజ్వరే॥
వీక్ష్యకోష్ఠం బలం చైవ భిషక్ మాత్రాం ప్రయోజ
యేత్॥ భై-ర-జ్వర.

మృతసంజీవనీసుర * 50 పలములు, తేనె 25 పలములు, జలము 25 పలములు ఇటుల నొక భాండమునందు బోసి అందు కస్తూరి 4 పలములు, మిరియాలచూర్ణము 2 పలములు, లవంగాలచూర్ణము 2 పలములు, జాజికాయలచూర్ణము 2 పలములు, పిప్పళ్లచూర్ణము 2 పలములు, లవంగపట్టచూర్ణము 2 పలములు ఇటులజేర్చి, బాగుగా కలియగలిపి, ఆసవసంధానవిధానమున బంధించి యొకమాస మటులనే యుంచ

* మృతసంజీవనీసుర.—దీని నిర్మాణ విధానమును ఔషధయోగవిజ్ఞానమునుండి గ్రహింపనగును.

వలెను. పిమ్మట వేరొకపాత్రలోనికి వడియగట్టి భద్రపరచవలెను. ఇటుల సిద్ధముజేయబడినట్టిది మృగమదాసవమనబడును. దీనిని 10 మొ॥ 20 బిందువుల మోతాదు చొప్పున సేవించిన సన్నిపాతజ్వరము, విషూచిక, హిక్క యియ్యవి శమించును.

## 3. కస్తూరిమాత్ర

ఆం-ఆ-ఫా-ఔ-యో.

కస్తూరి ½ తులము, గోరోజనము ¼ తులము, జున్ను ¼ తులము, పావుదారు ¼ తులము, రేవల్చిన్నిపాలు 8 తులములు, శుద్ధిజేసిన వత్సనాభి 8 తులములు, మిరియాలు 8 తులములు, పిప్పళ్లు 16 తులములు, కటుకరోహిణి 16 తులములు, చంగల్వకోష్ఠు 16 తులములు, రససిందూరము 32 తులములు ఇటుల గ్రహించి, యిందలి నాభి మున్నగు ద్రవ్యములను మెత్తగా చూర్ణించవలెను. రససిందూరమును మెత్తగా నూరి, అందు మిగిలిన ద్రవ్యములను, పైచూర్ణమును జేర్చి ఉమ్మెత్తవేళ్ల రసములోను, కటుకరోహిణి కషాయములోను, తమలపాకుల రసములోను జక్కగా మూడుదినములు మర్దించి, 1 గ్రైను పరిమితిని మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇయ్యది కస్తూరిమాత్ర యనబడును. దీనిని ఒక్కొక్కమాత్రచొప్పనగాని, ½ మాత్రచొప్పనగాని చనుబాలతోను. లేక, తమలపాకుల రసముతోను, లేక, తేనెతోను ఉదయ సాయంత్రములందు చంటిపిల్లల కిచ్చినచో సుఖవిరేచనమగును. కఫము శమించును. శైత్యము, కడుపుబ్బరము, జ్వరము, బాలపాపచిహ్నములు, దగ్గు, ఉబ్బసము, కోరింతదగ్గు మున్నగు చంటిపిల్లల వ్యాధులు శమించును.

---

# గోరోచనా - గోరోజనము

## పర్యాయపదములు

శ్లో॥ గోరోచనా తు మాంగల్యా వంద్యా గౌరీ చ రోచనా॥

గోరోచన, మాంగల్య, వంద్య, గౌరి, రోచన యనునవి గోరోచనా నామములు.

## గోరోచనా గుణములు

శ్లో॥ గోరోచనా హిమా తిక్తా వశ్యా మంగల కాంతిదా।
విషాలక్ష్మీ గ్రహోన్మాద గర్భస్రావ క్షతాస్రజిత్॥

గోరోజనము తిక్తరసమును, శీతవీర్యమును గలిగియుండును. శుభమును, కాంతిని గలుగజేయును. వశీకరణయోగ్యము. విషము, అలక్ష్మి, గ్రహదోషము, ఉన్మాదము, గర్భస్రావము, క్షతము, రక్తదోషము (లేక) క్షతరక్తము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధ నామములు

(క) పరిచయబోధకములు :

మాంగల్య. వంద్య. గౌరి. రోచన. (కాంచని. పీత.)

(ఖ) ఉత్పత్తిబోధకములు :

గోరోచన, (గవ్య, గోపిత్త. గోపిత్త సంభవ.)

(గ) గుణబోధకములు :

(భూతవిద్రావిణి.)

## (2) శబ్దార్థములు

మాంగల్య - మంగల (శుభ) కరమగునది. వంద్య - గోసంబంధమైనదగుటచే నమస్కరింపదగినది. గౌరి - గౌర వర్ణముగలది. రోచన - పచ్చని వర్ణముచే ప్రకాశించునది. కాంచని - పీత - బంగారువలె పచ్చని వర్ణము గలిగి యుండునది. గోరోచన - గోవునుండి యుత్పత్తియై పచ్చని వర్ణముతో ప్రకాశించునది. గవ్య - గోపిత్త - గోపిత్త సంభవ - గోవుయొక్క పిత్తకోశమునుండి యుత్పన్నమగు నది. భూతద్రావిణి - భూతవికారములను బోగొట్టునది.

---

**N. B.**—ఇది గోవుయొక్క పిత్తకోశమునుండి గ్రహింపబడును. తొలుత ద్రవరూపముననుండి యెండబెట్టిన పిమ్మట గట్టిపడి పసపు పచ్చని వర్ణమును గలిగి యొకవిధమగు పరిమళముతో గూడియుండును. ఇందుచేతనే యియ్యది సుగంధ ద్రవ్యములలో గణింపబడుచున్నది. ఇది కొన్ని కొన్ని గోవులనుండి లభ్యముగాదని జెప్పుదురు. కొందరు గోమూత్రమును రసక్రియగా బాకముజేసి యట్టిదానిని గోరోచనముగా వ్యవహరింతురని జెప్పుదురు. కాని గోవుయొక్క పిత్తకోశమునుండి గ్రహింపబడిన పిత్తద్రవమే నిజమగు గోపిత్తమనియు, గోరోచనమనియు జెప్పుట యుక్తము. మరియు మధ్యవయస్సుగలిగి వ్యాధిలేక స్వయముగ మృతమైనట్టి గోవునుండి గ్రహింపబడినదే శ్రేష్ఠమైనదని జెప్పుదురు. ఈ

## (3) విశేషగుణములు

రుచిని బుట్టించును. ఆమమును బాకము జేయును. పథ్యకరము. క్రిములను, కుష్ఠమును బోగొట్టును. రా–ని., వెంటనే శుక్రమును గలిగించును. నేత్రరోగములను బోగొట్టును. ని–ర.

## (4) ప్రయోగములు

1. శ్విత్రకుష్ఠమునందు గోరోచనా ప్రయోగము.

"సుమనశ్శిలం విడంగం కాసీసం రోచనాం కనక

---

గోపిత్తము బజారులందు తులము 1 కి సుమారు 12 రూపాయలవరకు వెలగలిగియుండును. ఇది సర్వ సాధారణముగా చంటిపిల్లల కుపయోగింపబడుచుండును. మరియు గర్భస్రావమగునప్పుడు దీని నొకటి రెండు మోతాదు లుపయోగించుట వృద్ధవైద్య సాంప్రదాయమైయున్నది. ఈ ద్రవ్యము చరకాదులచే నితరద్రవ్యములవలె స్వతంత్రముగ నుపయోగింపబడినట్లు గానరాదు. ఇదియునుగాక వీర్లచే నితరద్రవ్యములతో జేర్చబడి కేవలము బాహ్యముగ లేపాదులకై యచ్చటచ్చట నుపయోగింపబడినట్లు దెలియగలదు. బజారులందు కృత్రిమ గోరోజనముగూడ లభించుచుండును. కావున గ్రహించునప్పుడు జాగ్రత్తగా బరీక్షించి నిజమగు గోరోజనమును గ్రహించుట యుక్తము.

పుష్పం। శ్విత్రాణాం ప్రశమార్థం ససైంధవం లేపనం
దద్యాత్॥''

మణిశిల, వాయువిడంగములు, అన్నభేది, గోరోజనము, స్వర్ణ పుష్పి (బలురక్కెస) వీనిని మెత్తగా నూరి లేపముజేసిన శ్విత్రకుష్ఠము శమించును. చ-చి-అ 7.

## 2. యోనివ్యాపత్తులయందు గోరోచనా ప్రయోగము.

''గోపిత్తే మత్స్యపిత్తే వా క్షౌమంత్రి స్సప్తభావితం।
...ధారయేదచరణాపహం॥''

గోపిత్తమునందుగాని, మత్స్యపిత్తమునందుగాని పట్టుగుడ్డను ఇరువదియొకసార్లు భావనజేసి యోనియందుంచిన అచరణ యను యోని రోగము శమించును. చ-చి-అ 30.

## 3. భూతోన్మాదమునందు గోరోచనా ప్రయోగము.

''కృష్ణా మరిచ సింధూత్థ మధు గోరోచనాకృతం।
అంజనం సర్వదేవాది కృతోన్మాద హరం పరం॥''

పిప్పళ్లు, మిరియములు, సైంధవలవణము, గోరోజనము వీనిని మెత్తగా చూర్ణించి తేనెతో చక్కగా నూరి యంజనము వేసిన భూతో న్మాదము మొదలగు నున్మాదములు శమించును. భా-ప్ర.

## (5) యోగములు

### 1. గోరోచనాది ఘృతము

శ్లో॥ గౌరాహరిద్రా మంజిష్ఠా మాంసీ మధుక మేవచ।
ప్రపౌండరీకం హ్రీబేరం నతం ముస్తం స చందనం॥
జాతీనింబ పటోలంచ కరంజం కటురోహిణీ।

మధూచ్ఛిష్టం మధూకం చ మహామేదా తథైవచ॥
పంచవల్కలతోయేన ఘృతప్రస్థం విపాచయేత్।
ఏతద్గోరాదికం సర్పిః సర్వ వ్రణవిశోధనం॥
ఆగంతుకాశ్చ సహజా స్సుచిరోత్థాశ్చయే వ్రణాః।
నాడీవ్రణశ్చ విషమో నశ్యన్త్యేవ నసంశయః॥

బ-రా-వ్రణ.

గోరోచనము, పసపు, మంజిష్ట, జటామాంసి, అతిమధురము, ప్రపౌండరీకము, కురువేరు, గ్రంథితగరము, తుంగముస్తలు, మంచి గంధము, జాజియాకులు, వేపాకులు, చేదుపొట్లాకులు, గానుగవిత్తులు, కటుకరోహిణి, మైనము, ఇప్పచెక్క, మహామేద వీనిని ప్రత్యేకముగ 1 తులము చొప్పన గ్రహించి, ఇందలి మధూచ్ఛిష్టమును విడచి మిగిలిన వానిని మెత్తగా దంచి, కల్కమును సిద్ధము జేయవలెను. ఒకపాత్రలో 4 ప్రస్థములు పంచవల్కల కషాయమును, 1 ప్రస్థము ఘృతమును, పైని సిద్ధముజేసిన కల్కమును జేర్చి మందాగ్నిచే ఘృతపాకముజేసి, వేరొక పాత్రలో మధూచ్ఛిష్టము నుంచి అందు వడియగట్టవలెను. ఇటుల సిద్ధము జేయుబడినట్టిది గోరోచనాదిఘృత మనబడును. దీనిని అభ్యంగము జేసిన సమస్త వ్రణములకు శోధనమగును. ఆగంతుక వ్రణములు, నాడీ వ్రణములు మున్నగునవి యెల్ల శమించును.

## 2. గోరోచనాది చూర్ణము

శ్లో॥ గోరోచనం చ మరిచం రాస్నా కుష్ఠం చ పిప్పలీ।
ఉష్ణోదకేన పీతం చ సర్వజ్వర వినాశనం॥

వై-చిం-జ్వర.

గోరోచనము, మిరియాలు, సన్నరాష్ట్రము, చంగల్వకోష్టు, పిప్పళ్లు వీనిని సమాంశములుగ గ్రహించి, మెత్తగా చూర్ణించి, వస్త్ర

ఖాళితముజేసి, 10 యవలు మొతాదు చొప్పున వేడినీళ్లతో సేవించిన సమస్త జ్వరములు శమించును.

## 3. గోరోచన మాత్ర

ఆం-ఆ-షా-ఔ-యో.

గోరోజనము 1 తులము, కటుకరోహిణి 4 తులములు, మిరియములు 2 తులములు, పిప్పళ్లు 2 తులములు, శుద్ధిజేసిన వత్సనాభి 2 తులములు, రససిందూరము 4 తులములు, బాలహరీతకి (కరక్కాయ పిందెలు) 1 తులము, కస్తూరి $\frac{1}{16}$ తులము ఇటుల గ్రహించి, రససిందూరమును తొలుత మెత్తగా నూరి అందు గోరోజనమును, కస్తూరిని, మిగిలిన ద్రవ్యముల చూర్ణమును జేర్చి తులసీ స్వరసముతోగాని, తమలపాకుల రసముతోగాని మూడుదినములు చక్కగా మర్దించి 1 గ్రైను చొప్పున మాత్రలుజేసి ఛాయాశుష్కము జేయవలెను. ఇటుల సిద్ధముజేయబడినది గోరోచనమాత్ర యనబడును. దీనిని ఒక్కొక్కమాత్ర చొప్పున చంటిపిల్లల కిచ్చిన జ్వరము, గుల్మము, అజీర్ణము, అతిసారము, మలబంధము మున్నగునవి యనుపానభేదములచే శమించును

---

# మధు - తేనె (క)

## పర్యాయపదములు

శ్లో॥ మధు మాక్షిక మాధ్వీక క్షౌద్రసారఘ్యమీరితం।
మక్షికావరటీ భృంగవాన్త పుష్పరసోద్భవం॥

మధు, మాక్షికము, మాధ్వీకము, క్షౌద్రము. సారఘ్యము, మక్షికావాన్తము, వరటీవాన్తము, భృంగవాన్తము, పుష్పరసోద్భవము అనునవి మధునామములు.

## మధు గుణములు

శ్లో॥ మధుశీతం లఘుస్వాదు రూక్షం గ్రాహి విలేఖనం।
చక్షుష్యం దీపనం స్వర్యం వ్రణశోధనరోపణం॥
సౌకుమార్యకరం సూక్ష్మం పరం స్రోతో విశోధనం।
కషాయానురసం హ్లాది ప్రసాద జనకం పరం॥
వర్ణ్యం మేధాకరం వృష్యం విశదం రోచనం హరేత్।
కుష్ఠార్శః కాసపిత్తాస్ర కఫ మేహ క్లమ కృమీన్॥
మేదస్తృష్ణా వమిశ్వాస హిక్కాతీసార విడ్గ్రహాన్।
దాహ క్షతక్షయాంస్తు యోగవా హ్యల్పవాతలం॥

తేనె మధురరసమును, కషాయానురసమును, లఘురూక్ష సూక్ష్మ విశదగుణములను, శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. లేఖనము జేయును. నేత్రములకు హితమైనది. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. మంచి స్వరమును గలిగించును. వ్రణమునకు శోధన-రోపణములను జేయును. చర్మమునకు మృదుత్వమును గలిగించును. స్రోతస్సులను శోధించును. హృదయమునకు హితమైనది. ఇంద్రియములను వికసింపజేయును. వర్ణమును గలిగించును. మేధాశక్తిని వృద్ధి జేయును. వెంటనే శుక్రమును గలిగించును. రుచిని బుట్టించును. యోగవాహియగును. కొద్దిగా వాతమును వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును. కుష్ఠము, అర్శస్సు, కాసము, రక్తపిత్తము, ప్రమేహము, క్లమ, క్రిమిరోగము, మేదోవృద్ధి, తృష్ణ, వాంతి, శ్వాస, హిక్క, అతిసారము, మలబంధము దాహము, క్షతక్షయము, రక్తదుష్టి అను నీ వ్యాధులను బోగొట్టును. *

---

* తేనెకు చెప్పబడిన సామాన్య గుణములలో 'గ్రాహి, విడ్గ్రహహరత్వము' అనునవి యొకదాని కొకటి

## మధూచ్ఛిష్టం - మైనము (ఖ)

శ్లో॥ మదనం తు మధూచ్ఛిష్టం మధుశేషం తు సిక్థకం।
మధ్వాధారో మదనకం మధూషిత మపిస్మృతం॥

మదనము, మధూచ్ఛిష్టము, మధుశేషము, సిక్థకము, మధ్వాధారము, మదనకము, మధూషితము అనునవి మధూచ్ఛిష్ట నామములు.

## మధూచ్ఛిష్ట గుణములు

శ్లో॥ మదనం మృదుసుస్నిగ్ధం భూతఘ్నం వ్రణరోపణం।
భగ్న సంధాన కృద్వాత కుష్ఠవీసర్ప రక్తజిత్॥

మైనము మృదుస్నిగ్ధగుణములను గలిగియుండును. వ్రణములను రోపణముజేయును. విరిగిన యెముకలను సంధానము జేయును. వాతమును శమింపజేయును. భూతవికారములను, కుష్ఠమును, విసర్పమును, రక్తదుష్టిని బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయ బోధకములు :

(మధు) మాధ్వీకము. (మధూచ్ఛిష్ట.) సిక్థకము. మధ్వాధారము.

---

విరుద్ధముగా దోచగలవు. కాని కషాయానురసముచే గ్రాహియు, యోగవాహిత్వముచే విడ్గ్రాహహరత్వమును ఏర్పడునని యిట తెలియనగును.

(ఖ) ఉత్పత్తిబోధకములు :

(మధు) సారఘ్యము, మక్షికావాంతము, వరటీవాంతము, భృంగవాంతము, పుష్పరసోద్భవము, (మధూచ్ఛిష్ట) మధూచ్ఛిష్టము.

(గ) గుణబోధకములు :

(మధు) మధు. (మధూచ్ఛిష్ట) మదనకము.

## (2) శబ్దార్థములు

మాధ్వీకము - ఇప్పపువ్వు సారమువలె నుండునది. సిక్థకము - అగ్నిసంయోగముచే ద్రవించునట్టిది. మధ్వాధారము - తేనెకు ఆధారభూతమైనట్టిది. సారఘ్యము - తేనెటీగలనుండి యుత్పన్నమగునది. మక్షికావాంతము - వరటీవాంతము - భృంగవాంతము - భిన్నభిన్నములగు ఈగలచే గ్రక్కబడినట్టిది (అనగా నాయా యీగలచే ననేక పుష్పములనుండి పీల్చబడిన సారమొకచో విడువగా నేర్పడినట్టిది.) పుష్పరసోద్భవము - పుష్పముల సారమునుండి యేర్పడునట్టిది. మధూచ్ఛిష్టము - తేనెను తీసికొనిన పిమ్మట నుచ్ఛిష్టరూపమున నేర్పడినట్టిది. మధు - తియ్యగా నుండునట్టిది. మదనకము - ఉత్క్లేశమును గలిగించునట్టిది.

## (3) భేదములు

ఇది కొన్ని యీగలవలన నుత్పన్నమై, మధురముగ నుండు ద్రవ ద్రవ్యములలో జేరి, మాక్షికము, భ్రామరము,

క్షౌద్రము, పౌత్తికము, ఛాత్రము, ఆర్ఘ్యము, ఔద్దాలకము, దాలము అని యెనిమిది భేదములతో లేఖన సంధాన వ్రణ శోధన రోపణ ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింపబడు చున్నది. మరియు, "శరీరజానాం దోషాణాం క్రమేణ పరమౌషధం। వస్తిర్విరేకోవమనం తథా తైలం ఘృతం మధు॥" అను సూత్రమునుబట్టి తేనె కఫజవ్యాధులకు ముఖ్యౌషధముగా నేర్పడుచున్నది. ఇది పలువిధములగు తేనటీగలచే సృష్టింపబడుచున్నది. అయ్యవి చెట్లకొమ్మలనుగాని, చెట్టు తొర్రలనుగాని, పుట్టలనుగాని ఆధారముగా జేసుకొని పలు రకముల పుష్పములనుండి సారమును గ్రహించి యచ్చట విడిచిపెట్టును. ఇటుల ననుక్షణమును పుష్పసారమునుదెచ్చి యొకచో విడుచుచుండుటచే క్రమముగా నట యంటియున్న సారము కొన్నిదినములకు పెద్ద మొత్తముగా నేర్పడుచుం డును. ఈ విధమగు నిర్మాణమునకే తేనెపట్టు అని వ్యవ హారముగలదు. ఈ తేనెపట్టునందు తేనె పూర్ణిమనాటికి సంపూర్ణముగా నిండియుండు ననియు, తిరిగి యమావాస్య నాటి కదియంతయు క్షీణించుననియు అనగా నా యీగలు తమచే నిర్మింపబడిన తేనెను తామే క్రమముగా పానము చేయుననియు, నందుచే పౌర్ణమికి దగ్గరగానుండు దినములలో తేనెను గ్రహింప బ్రయత్నించినచో గావలసినది లభ్య మగుననియు జెప్పుదురు. అటులనే సేద్యగాండ్రు ఆ చెప్ప బడిన దినములలో నట్లు తేనెను సంపాదించి గ్రామీణుల కొసంగుటగూడ వ్యవహారమునందు గలదు. ఈ విధమగు పరిణామమునకు గారణము శాస్త్రపరిశోధకులచే విమర్శింప

దగియున్నది. తేనెపట్టునుండి తేనెను గ్రహించగా మిగిలి యున్నట్టి భాగము మైనమను పేరుతో వ్యవహరింపబడు చున్నది. అటుల గ్రహింపబడినట్టి తేనె మొట్టమొదట చిక్కగా నుండును గాన గొందరు దానిని స్వల్పముగా వెచ్చజేసి వడియగట్టుకుని యుపయోగించెదరు. మరికొంద రట్టులనే యుపయోగించుకొనెదరు. కాని కొంతకాలము నిలువయుంచినచో అందలి ఘనాంశము తనంతట తానే పాత్ర కధోభాగమునకు చేరుకొనును. మిక్కిలి పలచగా నుండు భాగముపైకి తేరుకొనును. ఇదియునుగాక చరకాదు లటుల నుష్ణీకరణమును తేనెకు నిషేధించియున్నారు. "హన్యాత్ మధూష్ణ ముష్ణార్త మధవా సవిషాన్వయాత్॥" అని చరకునిచే జెప్పబడియున్నది. మరియు, "విషపుష్పా దపి రసం సవిషాభ్రమరాదయః। గృహీత్వా మధు కుర్వంతి తచ్ఛీతం గుణవన్మధు॥ విషాన్వయాత్త దుష్ణం తు ఉష్ణే చోష్ణేనవాసహ। ఉష్ణార్త స్యోష్ణకాలే చ స్మృతం విష సమం మధు॥" అని భావమిశ్రుడు దెలిపియున్నాడు. అనగా పలురకములగు పుష్పములనుండి పలురకములగు ఈగలచే తత్సారము గొనిరాబడి యొకచో జేర్చగా నట్టి సార సముదాయము తేనె యని వ్యవహరింపబడుచున్నది గదా! ఈ పుష్పములలో గొన్ని విషగుణములను గలిగియుండును. ఈయీగలలో గూడ గొన్ని విషగుణములను గలిగియుండును. అయితే పై విధముగ సమకూర్చబడిన పుష్పసార సముదాయమునకు అత్యంత శైత్యస్వభావమును, సౌకుమార్య కరత్వమును సహజముగా నేర్పడుచున్నవి. అట్టియెడ తేనె

ఉష్ణసంయోగము ఏర్పడినచో నా శైత్యస్వభావమును, సౌకుమార్యకరత్వమును నశించిపోవుచున్నవి. అటుల సహజ గుణ వినాశములో తేనెకు విరుద్ధత్వ మేర్పడును. అనగా విషస్వభావ మేర్పడును. అందుచేతనే ఉష్ణీకృత మైన తేనెను ప్రయోగములో చరకాదులు నిషేధించియున్నారని దెలియగలదు. ఇంతియేగాకుండ ఉష్ణార్తునకును, ఉష్ణద్రవ్య ముతో సంయోగపరచియు, ఉష్ణకాలమునందును తేనెకు ప్రయోగములు నిషేధింపబడినవి. కావున తేనెను వెచ్చజేసి గ్రహింపగూడదని యిట దెలియవలెను. అయితే, "ప్రచ్ఛర్దనే నిరూహేచ మధూష్ణం ననివార్యతే। అలబ్ధపాకమాశ్వేవ తయోర్యస్మాన్నివర్తతే॥" (అ-హృ-సూ-అ 5-54.) అని చెప్పబడుటచే నుష్ణీకృతమైన తేనెకు వమనకర్మలోను, నిరూహవస్తికర్మలోను అది జాఠరాగ్నితో సంయోగము బొందకయే వెంటనే బయటకు వచ్చివేయును గాన అందు మాత్రము నిషేధము లేదని గ్రహింపనగును. మరియు, తేనె నవ-పురాణభేదముచే తిరిగి రెండువిధములుగా నుండును. అందు తేనెపట్టునుండి యప్పుడే గ్రహింపబడి నట్టిది నవమధు అనియు, కొంచెము కాలము నిలువయుండి నట్టిది పురాణమధు అనియు జెప్పబడును. అందు, "నవం మధు భవేత్పుష్ట్యై నాతిశ్లేష్మహరం సరం। పురాణం గ్రాహకం రూక్షం మేదోఘ్న మతిలేఖనం॥" అని నవ పురాణ మధువుల గుణభేదములను భావమిశ్రు డిట్లు దెలిపి యున్నాడు. దీనినిబట్టి క్రొత్త తేనె శరీరమునకు బుష్టిని

గలిగించుననియు, ప్రాత తేనె శరీరమునందలి మేదస్సును లేఖనము జేసి హరించుననియును దెలియుచున్నది. వీనిలో క్రొత్తది బలకరమైనను, "విడంగం పిప్పలీ క్షౌద్రం సర్పిశ్చా ప్యనవం హితం। శేషమన్య త్వభినవం గృహ్ణీయా ద్దోషవర్జితం॥" అను సుశ్రుతవచనమునుబట్టి ప్రాత తేనెయే ప్రయోగార్హ మగునని దెలియగలదు.

తేనె గుడ శర్కరాది ద్రవ్యములవలె జన్మారంభము నుండియు ప్రతివానికిని యిష్టమగునట్టి ద్రవ్యమైయున్నది. ఇది యాహార ద్రవ్యములలో జేర్చుకొనబడుచుండును. దేవతాపూజాదికములందుగూడ ఇది యుపయోగింపబడుచుండును. అందుచే ప్రతి మానవునకు అనాయాసముగ దెలిసియున్నట్టియు, ప్రియమైనట్టియు ద్రవ్యమై యున్నది. ఇక వైద్యకమునందు దీని ప్రయోగ మసంఖ్యేయము. తేనెయొక్క సంయోగము లేకుండ శోధనకర్మగాని, శమనకర్మగాని జేయబడనేరదు. అనగా వ్యాధి సామాన్యమునసే క్రియావిధాన మవలంబించినను అందెల్ల తేనె యనుపాన రూపముననో, ప్రధానౌషధరూపముననో గ్రహింపబడుచునే యుండును. ఔషధనిర్మాణములో నాసవములు, అరిష్టములు, రసక్రియలు, ఫాణితములు, లేహ్యములు, గుడసర్పి, అంజనములు, లేపములు, గుళికలు, గుగ్గులులు మున్నగువాని నిర్మాణము తేనె లేకుండ గావింపబడనేరదు. ఇటుల తేనె సర్వసామాన్య ద్రవ్యమై యున్నది. అయితే దీనిని విశేషముగ భుజింపరాదని శాస్త్రకారులు దెలిపియున్నారు. "నాతః కష్ట తమం కించిత్ మధ్వామాత్

తద్ధిమానవం। ఉపక్రమ విరోధిత్వాత్ సద్యో హన్యాద్యథా విషం॥ ఆమే సోష్ణా క్రియా కార్యా సామధ్వామే విరుధ్యతే। మధ్వామం దారుణంతస్మాత్ సద్యో హన్యాద్యథా విషం॥" (చ-సూ-అ 27.) అనగా మధువును హెచ్చుగా పానము జేసినచో ఆమాజీర్ణ మేర్పడును. సాధారణముగా నుష్ణ చికిత్స ఆమహరముగా నుండును. కాని మధ్వామమున కట్టి యుష్ణచికిత్స జేసినచో మధువు విషాన్వయమగుటచే నా చికిత్సవలన విరుద్ధత్వ మేర్పడును. కావున నయ్యది అహిత మగును. అందుచే నామధ్వామము చికిత్సారహితమై క్రమముగ దారుణత్వమునుబొంది విషమువలె ప్రాణహారి యగును అని చరకమున జెప్పబడినది. కావున మధువును అధికముగా సేవింపగూడదని తెలియవలెను. మాక్షికాది మధుభేదముల లక్షణములను భావమిశ్రు డిట్లు దెలిపి యున్నాడు.

"మాక్షికా పింగవర్ణాస్తు మహత్యో మధుమక్షికాః। తాభిఃకృతంతైలవర్ణం మాక్షికం పరికీర్తితం॥ కించిత్ సూక్ష్మైః ప్రసిద్ధేభ్యః షట్పదేభ్యోఽలిభిశ్చితం। నిర్మలం స్ఫటికాభం యత్తన్మధుభ్రామరంస్మృతం॥ మాక్షికాః కపిలాః సూక్ష్మాఃక్షుద్రాఖ్యాః తత్కృతంమధు। మునిభిః క్షౌద్రమిత్యుక్తం తద్వర్ణాత్కపిలం భవేత్॥ కృష్ణాయామశకోపమాలఘుతరాఃప్రాయో మహాపీడికాః వృక్షాణాం పృథుకోటరాన్తరగతాః పుష్పాసవం కుర్వతే। తాస్తజ్జైరిహపూతికా నిగదితా

స్తాభిఃకృతం సర్పిషా తుల్యం యన్మధుతద్వనేచర జనైః సంకీర్తితం పౌత్తికం॥ వరటాః కపిలాఃపీతాః ప్రాయోహిమవతోవనే। కుర్వన్తి ఛత్రకాకారం తజ్జంఛాత్రం మధుస్మృతం॥ మధూకవృక్షనిర్యాసం జరత్కార్వాశ్రమోద్భవం। స్రవంత్యార్ఘ్యం తదాఖ్యాతం శ్వేతకం మాలవేపునః॥ తీక్ష్ణతుండాస్తు యాఃపీతాః మక్షికాః షట్పదోపమాః। అర్ఘ్యాస్తాః తత్కృతంయత్త దార్ఘ్యమిత్యపరేజగుః॥ ప్రాయో వల్మీకమధ్యస్థాః కపిలాః స్వల్పకీటకాః। కుర్వన్తి కపిలం స్వల్పం తత్స్యాదౌద్దాలకం మధు॥ సంసృత్యపతితంపుష్పాద్యత్తు పత్రోపరి స్థితం। మధురామ్ల కషాయంచ తద్దాలం మధుకీర్తితం॥"

అందు పింగలవర్ణముగలిగి పెద్దవియగు తేనెటీగలచే నిర్మించబడి తైలముతో సమానమైన వర్ణముగలిగి యున్నట్టిది మాక్షికమని జెప్పబడును. కొంచెము చిన్నవిగనుండి తుమ్మెదలను పేరతో ప్రసిద్ధమైన తేనెటీగలచే నిర్మింపబడి, స్ఫటికముతో సమానమైన వర్ణముగలిగి నిర్మలముగానుండునట్టిది భ్రామరమనబడును. కపిలవర్ణముగలిగి చిన్నవిగనుండు తేనెటీగలచే సమకూర్చబడి, కపిలవర్ణముగలిగి యుండునట్టిది క్షౌద్రమని చెప్పబడును. నల్లగను, దోమలతో సమానముగను, మిక్కిలి చిన్నవిగను, మిగుల బాధాకరము (కుట్టినచో) లుగనునుండు పూతికాఖ్యములగు తేనెటీగలచే వృక్షములయొక్క తొర్రలలో సమకూర్చబడి నేయితో సమానముగ నుండునట్టి తేనె పౌత్తికమని వ్యవహా

రింపబడును. కపిలవర్ణమును, పసపు పచ్చని వర్ణమును గలిగియున్నట్టి తేనెటీగలచే హిమవత్పర్వత ప్రాంతములందలి వనములలో ఛత్త్రాకారముగ తేనెపట్టు గట్టబడి యందు సమకూర్చబడినట్టి తేనె ఛాత్రమనబడును. ఇది కపిలవర్ణమునుగాని, పసపుపచ్చని వర్ణమునుగాని గలిగియుండును. జరత్కారులను మునియొక్క ఆశ్రమమునందలి యిప్పచెట్లు స్రవించునట్టి సారము ఆర్ఘ్యమనబడును. ఇదియే మాలవదేశమున శ్వేత్రకమని పిలువబడుచున్నది. అయితే యిట కొందరు తీక్ష్ణములైన ముట్టెలుగలిగి పసపుపచ్చగ నుండు తుమ్మెదలతో సమానమైన తేనెటీగలచే సమకూర్చబడినట్టి తేనె యార్ఘ్యమని చెప్పుచున్నారు. కపిలవర్ణముగలిగి మిక్కిలి స్వల్పములైన కీటకములవలెనుండు తేనెటీగలచే పుట్టలలో మిక్కిలి స్వల్పప్రమాణమున సిద్ధము జేయబడునట్టి కపిలవర్ణముగల తేనె యాద్దాలకమని జెప్పబడును. పుష్పములనుండి కారి పత్రములపై పడినట్టి పుష్పసారమగు తేనె దాలమని వ్యవహరింపబడును. ఇటుల తేనెయం దెనిమిది భేదములును, వానికి ప్రత్యేక లక్షణములును వర్ణింపబడినవి. అయితే వైద్యకప్రయోగములలో నెచ్చటజూచినను విశేషముగ మాక్షికమనియో, క్షౌద్రమనియో, మధువనియో గానుపించునుగాని యాభేదములను గుర్తింపదగునట్టి పద ప్రయోగములు గానరావు. కాని "మాక్షికం ప్రవరం తేషాం విశేషాత్" అని చరకుడును, "తస్మాల్లఘుతరం రూక్షం మాక్షికం ప్రవరంస్మృతం" అని సుశ్రుతుడును, "మాక్షికం మధుషుశ్రేష్ఠం" అని భావమిశ్రుడును జెప్పి

యున్నారు. ఈ ప్రమాణములనుబట్టి తేనె భేదములలో మాక్షికమను మధువే ప్రయోగార్హమైనట్లు శాస్త్రకారులచే గ్రహింపబడినట్లును, అటులనే తత్తత్ప్రసంగములందు వారలచే మాక్షికపదమే వాడబడినట్లును, మిగిలినపదములు దానికి పర్యాయపదములుగా నుపయోగించినట్లును, ఈ పదములు మధుభేద సామాన్యమును సూచింపనట్లును దెలియుచున్నది. అందుచే నీ మధుభేదములలో మాక్షిక భేదము తప్ప మిగిలిన భేదములను వైద్యకమునందు విడువవలసినట్లుగా దెలియగలదు.

మధూచ్ఛిష్టము—తేనెను గ్రహింపగా నాయా ప్రదేశములందు మిగిలియున్నట్టి భాగము మధూచ్ఛిష్ట నామముతో వ్యవహరింపబడుచున్నది. ఇది మిక్కిలి మృదు స్వభావమునుగలిగి వ్రణరోపణ భగ్న సంధానకర ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింపబడుచున్నది. ఇది యగ్ని సంయోగముచే కరగునట్టి స్వభావము గలిగియుండును. అందుచే దీనితో తైలములను, లేపములను సిద్ధముజేసి పై ప్రయోజనమున కుపయోగించుదురు. ఇది విశేషముగ బాహ్యోపయోగమునే వైద్యకమునను, వ్యవహారమునను గలిగియున్నది. అయితే యొకటిరెండు ఆభ్యంతర ప్రయోగములు దీనికి జెప్పబడినవి. కాని, అంతమాత్రమున నిది యితర ద్రవ్యములవలె ధారాళముగ నాభ్యంతరోపయోగార్హమైనట్లుగా దలంపగూడదు. ఇది పిచ్ఛిలగుణము గలిగి యుష్ణసంయోగముచే ద్రవించునదియు, శీతల సంయోగముచే ఘనీభవించునదియు నగుటచే నటుల విశేషముగా

బాహ్యముగనే ప్రయోగింపదగియున్నట్లు దెలియవలెను. వ్యవహారములో దీనిని కర్రపనివారలు, చిత్రపు పనివార లును అనేకవిధములుగా నుపయోగించుదురు. ఇటుల తేనెయు, మైనమును వైద్యకమునందును, వ్యవహారము నందును సర్వసాధారణ ద్రవ్యములై యొప్పుచున్నవి.

## (4) విశేషగుణములు

(క) మధుసామాన్య—గురుగుణమును గలిగియుం డును. భగ్నసంధానము జేయును. వాతమును వృద్ధిబొందిం చును. (చ.సూ.అ 27), త్రిదోషములను శమింపజేయును. (లఘుగుణముచే కఫమును, మధురరస కషాయానురస ములచేతను, పిచ్ఛిలగుణముచేతను వాతపిత్తములను శమింప జేయును.) విషమును బోగొట్టును. (సు-సూ-అ 45).

(ఖ) నవమధు—సర గుణమును గలిగియుండును. బృంహణమగును. కొద్దిగా కఫమును శమింపజేయును. (భా-ప్ర.)

(గ) పురాణమధు— రూక్షగుణమును గలిగియుం డును. మలాదులను నిరోధించును. అధికముగ లేఖన మగును. మేదోవృద్ధిని బోగొట్టును. (భా-ప్ర.)

(ఘ) మాక్షికమధు—లఘు గుణమును గలిగియుం డును. నేత్రరోగము, కామిల, అర్శస్సు, ఉరఃక్షతము, శ్వాసము, కాసము, క్షయ వీనిని బోగొట్టును. (భా-ప్ర.)

(చ) భ్రామరమధు—గురుగుణమును, అధిక పిచ్ఛిల గుణమును, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుం

డును. మూత్రవ్యాధులను గలిగించును. కఫమును వృద్ధి బొందించును. రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర.)

(ఛ) క్షౌద్రమధు—ఇది మాక్షికమధువుయొక్క గుణములనే గలిగియుండును. విశేషముగా ప్రమేహములను బోగొట్టును. (భా-ప్ర.)

(జ) పౌత్తికమధు— రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. దాహమును గలిగించును, రక్తమును దూషింపజేయును. విదాహకరమగును. వాతపిత్తములను వృద్ధిబొందించును. ప్రమేహమును, మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. గ్రంథి అపచి మున్నగువానిని క్షతమును శోషింపజేయును. (భా-ప్ర.)

(ఝ) ఛాత్రమధు—గురుపిచ్ఛిల గుణములను, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. తర్పణమగును. కృమి, శ్విత్రము, రక్తపిత్తము, ప్రమేహము, భ్రమ, తృష్ణ, మోహము, విషము వీనిని బోగొట్టును. (భా-ప్ర.)

(ట) ఆర్ఘ్యమధు—కషాయరసమును, తిక్తాను రసమును, కటు విపాకమును గలిగియుండును. మిక్కిలి నేత్రములకు హితమైనది. బలమును, పుష్టిని జేయును. కఫపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఠ) ఔద్దాలకమధు—కషాయరసమును, అమ్లాను రసమును, ఉష్ణవీర్యమును, కటు విపాకమును గలిగియుండును. రుచిని బుట్టించును. స్వరమును గలిగించును. పిత్త

మును వృద్ధిజేయును. కుష్ఠమును, విషమును బోగొట్టును. (భా-ప్ర.)

(ఢ) దాలమధు—మధురరసమును, కషాయాను రసమును, లఘు రూక్షస్నిగ్ధ గుణములను గలిగియుండును. తూచినప్పుడు మిగుల బరువుగానుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. రుచిని బుట్టించును. బృంహణము. కఫమును శమింపజేయును. వాంతిని, ప్రమేహమును బోగొట్టును. (భా-ప్ర.)

(థ) విశిష్టగుణములు— రాజయక్ష్మకు మాక్షికమధు, రక్తపిత్తమునకు భ్రామరమధు, ప్రమేహమునకు క్షౌద్రమధు, వ్రణమునకు పౌత్తికమధు, సర్వవ్యాధులకు ఛాత్రమధు, నేత్రరోగములకు ఆర్ఘ్యమధు, కుష్ఠమునకు ఔద్దాలకమధు, అరుచికి దాలమధు ఇట్టుల మాక్షికాది మధువు లాయావ్యాధులకు హితములగును, (యో-ర.)

(ణ) మధూచ్ఛిష్ట—మధురరసమును, పిచ్ఛిల మృదుగుణములను, కటు విపాకమును గలిగియుండును. వాతరక్తమును బోగొట్టును. (రా-ని.)

---

## లాక్షా—లక్క (క)

### పర్యాయపదములు

శ్లో॥ లాక్షా పలంకషా లక్తో యావో వృక్షామయో జతుః।

లాక్ష, పలంకష, అలక్త, యావ, వృక్షామయ, జతు అనునవి లాక్షా నామములు.

## లాక్షాగుణములు

శ్లో॥ లాక్షా వర్ణ్యా హిమాబల్యా స్నిగ్ధా చ తువరాలఘుః।
అనుష్ణా కఫ పిత్తాస్ర హిక్కా కాస జ్వర ప్రణుత్॥
వ్రణోరః క్షత వీసర్ప కృమి కుష్ఠ గదాపహాః॥

లక్క కషాయరసమును, స్నిగ్ధలఘుగుణములను, శీతవీర్యమును, కొద్దిగ నుష్ణవీర్యమును గలిగియుండును. వర్ణమును గలుగజేయును. కఫమును శమింపజేయును. రక్తపిత్తము, హిక్క, కాసము, జ్వరము, వ్రణము, ఉరఃక్షతము, విసర్పము, క్రిమి, కుష్ఠము అను నీ వ్యాధులను బోగొట్టును.

## అలక్తక గుణములు (ఖ)

శ్లో॥ అలక్తకో గుణై స్తద్వత్ విశేషాద్వ్యంగనాశనః॥

అలక్తకమను లక్కవిశేషము పైనిజెప్పిన లక్కలో నొకభేదము. ఇది మిగుల నెఱ్ఱగ నుండును. పైని వివరించిన లాక్షాగుణములను గలిగియుండును. మరియు విశేషముగ వ్యంగరోగమును బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

లాక్ష, యావ, జతు, అలక్త.

(ఖ) ఉత్పత్తిబోధకములు :

వృక్షామయ,

## (2) శబ్దార్థములు

లాక్ష—చూడబడునది (అనగా ప్రతిబింబము తన యందు గనబరచునది.) (లేక) గుర్తుపెట్టుటకు యోగ్యమైనది. యావ—వస్త్రాదులందు కలసిపోవునది. జతు—బంకవంటి రూపముగలది. అలక్త—పాదాదుల కలంకరణ యోగ్యమైనది. (లేక) వస్త్రాదుల బ్రకాశింపజేయునది. వృక్షామయ—వృక్షములనుండి నిర్యాసమువలె నుత్పత్తి గలది.

## (3) ఉత్పత్తి పరిచయబోధకలక్షణము

"లాక్షా బదరీ పలాశ పిప్పలా దీనాం నిర్యాసః॥"

లక్క యనునది రేగు, మోదుగ, రావి—మొదలగు వృక్షములనుండి యుత్పన్నమై బంకవలె నుండును. శి–ద.

## (4) భేదములు

ఇది వృక్షజము, కృమిజము అని రెండువిధములుగా నుండును. ఈ రెండును నిర్యాసరూపములుగనే యుండును. అందు ప్రశస్తమగు లాక్ష వృక్షములనుండి బుట్టినట్లును, రెండవది అలక్తకము (లత్తుక) అనునది కృములవలన బుట్టునట్లును గ్రంథాన్తరములనుబట్టి దెలియుచున్నది. అయితే మనకు బజారులందు దొరకువానిలో పైని వివరించినట్లు ఒకటి పుడకల కంటుకొనియున్నదిగను, మరియొకటి పుడకల సంబంధములేక కొద్దిగ లక్కయు మన్నును గలసినదిగను నుండును. దీనినిబట్టి చూచిన పై విభాగము కొంతవరకు

నిజమని దెలియగలదు. ఇంతియేగాక యిండ్లపైనుండు వాసములకు ఒకవిధమగు నెగురు పురుగులు లక్కగూడులను గట్టుకుని వాసము జేయుచుండుట చూచుచున్నాముగదా! అందు క్రిమిజమను లక్క యీ విధముగ నుత్పన్నమగునో (లేక) మరేవిధముగ నుత్పన్నమగునో యూహింపవలసి యున్నది. అయితే యీ విధముగ క్రిమివాసములగు లక్క గూడులనుదీసి చూచినచో నవి యొకింత యరుణవర్ణమును గలిగియుండును, దానిని పరీక్షించినప్పుడు అందు కొంచెముగ లక్కయు, హెచ్చుగ మన్నును జేరియున్నట్లు దోచును. నిప్పుమీద నుంచినప్పుడు ద్రవించునదివలె గానుపించును. కావున నిది క్రిమిజమగు లక్క యని జెప్పుట యొకింత సమంజసముగ నుండును. ఇటుల గూడులను గట్టు పురుగులు ఒకవిధమగు మన్నును దిని వాసములపై తిరిగి దానిని బయటకు విడచుచు నటుల గూళ్లు నేర్పరచుకొనుచుండునని గొందరు చెప్పుదురు. ఇక పుడకలపై నేర్పడు లక్క మిక్కిలి స్నిగ్ధముగను, అరుణవర్ణముగను నుండును, ఇట్టిది మిక్కిలి ప్రశస్తమైనది. లక్క పిచ్ఛిలగుణముగలిగి వర్ణకరద్రవ్యములలోను, రక్తస్తంభనకరద్రవ్యములలోను శ్రేష్ఠమైనదిగ నెంచబడుచున్నది. లక్క యగ్నితాపముచే కరగునట్టి స్వభావముగలిగియుండును. విశేషముగ దీని నుండి స్వరసమునుదీసి ప్రయోగించుదురు. సకృత్తుగా చూర్ణరూపమునగూడ దీని ప్రయోగము గలదు. వర్ణకరములగు తైలములలో దీని ప్రయోగము విశేషముగా నుండును. కేవలము ఔషధములలో జేర్చుటకేగాకుండ

వస్త్రములు మున్నగువానికి రంగువేయుటకై గూడ లక్క నుండి రసమును గ్రహించుచుందురు. అటుల రసమును దీసి వేయగా మిగిలినదానిని వ్యవహారములో ననేకవిధము లుగా నుపయోగించుచుందురు.

## (5) విశేషగుణములు

(క) లాక్ష—వాతరక్తము, విషము, రక్తదోషము, విషమజ్వరము వీనిని బోగొట్టును. (గ-ని.), తిక్తరసమును గలిగియుండును. విరిగిన యెముకలను సంధానము జేయును. నాసారోగమును, త్వగ్దోషమును, దాహమును బోగొట్టును. (ని-ర.)

(ఖ) అలక్తక—తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. రుచిని బుట్టించును. వాతశ్లేష్మజ రోగములను బోగొట్టును. (రా-ని.), రజోరోధమును గలిగించును. క్షయమును, ప్రదరమును, రక్తాతిసారమును బోగొట్టును. (ఆ-సం.)

## (6) లాక్షాగ్రహణమునందలి నియమము

"లాక్షా చ నూతనాగ్రాహ్యా మృత్తికాది వివర్జితా"॥
(భైషజ్య)

క్రొత్తదిగను, మన్ను మొదలగువానితో మిశ్రము గానిదిగను నుండు లక్కను ఔషధార్థమై గ్రహించవలెను.

## (7) లాక్షనుండి రసమును గ్రహించు విధానము

"షడ్గుణే నాంభసాలాక్షా డోలాయంత్రే హ్యుపస్థితా।
త్రిసప్తధా పరిస్రావ్యం లాక్షారస మిమంవిదుః॥"

లక్క నొక గుడ్డయందు మూటగట్టి దీనికి ఆరురెట్లు జలమును డోలాయంత్రమునబోసి యందు పై మూటను వ్రేలాడదీసి నియమితకాలమువరకు పాకము జేయవలెను. ఇటుల నిరువదియొక పర్యాయములు పాకముజేసి యిన్ని తడవుల సిద్ధమైన రసము నొకచోజేర్చుకుని యుపయోగించవలెను. (ప-ప్ర.)

## (8) ప్రయోగములు

### (1) రక్తప్రదరమునందు లాక్షా ప్రయోగము

"లాక్షాఘృతేన క్వథితా నిపీతానిహన్తి సద్యః ప్రదరం సదుగ్ధా॥"

లాక్షారసమును ఘృతముతోజేర్చి, ఘృతపాకము జేసి పాలతో జేర్చి సేవించిన ప్రదరము వెంటనే శమించును. రా-మా.

## (9) యోగములు

### 1. లాక్షాది ఘృతము

శ్లో॥ లాక్షానాగరవైదేహీ కటుకా దార్వివల్కలైః।
సర్పిః సేంద్రయవైఃసిద్ధం పేయామండావచారితం॥
అతిసారం జయేచ్ఛీఘ్రం త్రిదోషమపిదారుణం॥

వా-అతీసార.

లక్క, శుంఠి, పిప్పళ్లు, కటుకరోహిణి, మ్రానుపసపుపై త్వక్కు, కొడిశపాలగింజలు వీనిని ప్రత్యేకముగ 1 పలము చొప్పున గ్రహించి, మెత్తగా దంచి కల్కముజేసి, దీనితో 1 ప్రస్థము ఘృతమును, 4 ప్రస్థములు జలమును జేర్చి మందాగ్నిచే ఘృతపాకముజేసి వడియగట్టవలెను.

ఇయ్యది లాక్షాదిఘృతమనబడును. దీనిని 1 తులము మోతాదుచొప్పున పేయతోగాని, మండముతోగాని జేర్చి పానముజేసిన త్రిదోషజాతీ సారము వెంటనే శమించును.

## 2. లాక్షా గుగ్గులు

శ్లో॥ లాక్షాస్థి సంహృత్ కకుభాశ్వగంధా శ్చూర్ణీకృతానాగ
 బలాపురశ్చ। సంభగ్నముక్తా స్థిరుజం నిహన్యాదంగాని
 కుర్యాత్ కులిశోపమాని॥  భై-ర. భగ్న.

లక్క, నల్లేరు, మద్దిపట్ట, పెన్నేరు, నాగబల, శోధితగుగ్గులు వీనిని సమాంశములుగ గ్రహించి, మెత్తగా చూర్ణించి వస్త్రఖాళితము జేయవలెను. పిమ్మట నీ చూర్ణమును తేనెతో మర్దించి 5 యవల పరిమితిని మాత్రలుజేసి, యొక్కొక్క మాత్రను సేవించినచో సమస్తమైన అస్థిభగ్నములు శమించును.

## 3. లాక్షాద్య తైలము

శ్లో॥ తైలం లాక్షారసంక్షీరం పృథక్ ప్రస్థం సమంపచేత్।
 చతుర్గుణేఽరిమక్వాథే ద్రవ్యైశ్చ పలసమ్మితైః॥
 లోధ్రకట్ఫల మంజిష్ఠా పద్మకేసర పద్మకైః।
 చందనోత్పలయష్ట్యాహ్వైస్తైలం గండూషధారణం॥
 చాలనం దన్తచాలంచ దన్తమోక్షం కపాలికాం।
 శీతాదం పూతివక్త్రంచ అరుచిం విరసాస్యతాం॥
 హన్యాద్దాశుగదానేతాన్ కుర్యాద్దన్తానపిస్థిరాన్॥
 భై-ర. ముఖరోగ.

లక్కనుండి గ్రహించిన రసము 1 ప్రస్థము, పాలు 1 ప్రస్థము, తిలతైలము 1 ప్రస్థము, తుమ్మపట్ట కషాయము 4 ప్రస్థములు ఇటుల

నొకపాత్రలో బోసి, అందు లొద్దుగపట్ట 1 పలము, కాయఫలచెక్క 1 పలము, మంజిష్ఠ 1 పలము, పద్మకేసరము 1 పలము, పద్మకాష్ఠము 1 పలము, మంచిగంధము 1 పలము, నల్లకలువదుంపలు 1 పలము, అతిమధురము 1 పలము ఇటుల గ్రహించి, వీనిని మెత్తగా దంచి, సిద్ధము జేసిన కల్కమునుగూడ జేర్చి మందాగ్నిచే తైలపాకముజేసి వడియగట్టవలెను. దీనిని గండూషము జేసిన ముఖమునందు గలుగు దాలనము, దన్తచాలము, దన్తమోక్షము, కపాలిక, శీతాదము, పూతివక్త్రము, అరుచి, ఆస్యవైరస్యము ఇయ్యవి శమించును. దన్తములకు స్థిరత్వమేర్పడును.

---

# క్షీరం - పాలు

## పర్యాయపదములు

శ్లో॥ దుగ్ధం క్షీరం పయస్తన్యం బాలజీవనమిత్యపి॥

దుగ్ధము, క్షీరము, పయస్సు, స్తన్యము, బాల జీవనము అనునవి క్షీర నామములు.

## క్షీర గుణములు

శ్లో॥ దుగ్ధం సుమధురం స్నిగ్ధం వాతపిత్తహరం సరం।
సద్యశ్శుక్రకరం శీతం సాత్మ్యం సర్వశరీరిణాం॥
జీవనం బృంహణం బల్యం మేధ్యం వాజీకరంపరం।
వయస్థాపన మాయుష్యం సంధికారి రసాయనం॥

పాలు హెచ్చు మధురరసమును, స్నిగ్ధసరగుణములను, శీతవీర్యమును గలిగియుండును. సమస్తప్రాణులకు సాత్మ్యమైనట్టిది. వెంటనే

శుక్రమును గలిగించును. ప్రాణములను ధరించునట్టిది. బృంహణము, బలకరము, బుద్ధిశక్తిని వృద్ధిచేయునది. కామశక్తిని వృద్ధిజేయును. వయస్థాపకము. ఆయుర్వర్ధకము. సంధిబంధనము జేయునది. రసాయనము. వాత పిత్తములను శమింపజేయును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

దుగ్ధము, క్షీరము, పయస్సు.

(ఖ) ఉత్పత్తిబోధకము :

స్తన్యము.

(గ) గుణబోధకము :

బాలజీవనము.

### (2) శబ్దార్థములు

దుగ్ధము - పితుకబడునది. క్షీరము, పయస్సు - పానముచేయబడునది. స్తన్యము - స్తనాంగము (చనుకట్టు) నుండి యుత్పన్నమగునది. బాలజీవనము - బాలుర ప్రాణముల ధరించునది (బాలురను బోషించునది.)

### (3) భేదములు

పాలు మనుష్యజము, పశుజము అని రెండువిధములుగా నుండును. అందు పశుజము - గోమహిషఛాగమృగీ ఆవికబడబాజౌష్ట్రిహస్తినీ సంభూతమై యెనిమిది విధము

లుగా నుండును. ఇటుల నుత్పన్నమైన పాలలో స్తన్యశబ్ద ముచే మనుష్యసంబంధమైన పాలకును, క్షీరాదిపదములచే గోసంబంధమైన పాలకును మాత్రమే విశేషప్రయోగము శాస్త్రమునందు గానుపించుచున్నది. మిగిలిన క్షీరవిశేష ములు తత్తద్వ్యాధి ప్రసంగమున మాత్రము తత్తన్నామ ములతో వ్యవహరింపబడుచున్నవి. అనగా స్వస్థులకు రోగు లకును స్తన్య గవ్యక్షీరములును, కేవలము రోగులకు సకృత్తుగా నితరక్షీరములును గ్రహింపదగినవిగా నుండునని దెలియవలెను. మొత్తముమీద పాలు అనే ద్రవ్యము సర్వ ప్రాణులకు ఆజన్మసాత్మ్యమై, జీవనీయ బృంహణీయ బల్య మేధ్య వృష్య వాజీకరవయస్థాపనాయుష్య రసాయనద్రవ్య ములలో మిక్కిలి శ్రేష్ఠమైనదిగా నెంచబడుచున్నది. ఇది కేవలము స్వస్థహితమేగాకుండ సర్వవ్యాధిహితముగగూడ నగుచున్నది. అందుచేతనే, "విరేకవాన్తి వస్తీనాం సేవ్య మోజో వివర్ధనం। జీర్ణజ్వరే మనోరోగే శోష మూర్ఛా భ్రమేషు చ॥ గ్రహణ్యాం పాండురోగే చ దాహేతృ పిహృ దామయే। శూలో దావర్త గుల్మేషు వస్తిరోగే గుదాం కురే॥ రక్తపిత్తాతి సారే చ యోని రోగే శ్రమే క్లమే। గర్భస్రావే చ సతతం హితం మునివరై స్స్మృతం॥ బాల వృద్ధ క్షత క్షీణాః క్షుద్వ్యవాయ కృశాశ్చయే। తేభ్యస్స దాతి శయితం హితమేతదుదాహృతం॥" అని భావమిశ్రుడు జెప్పియున్నాడు. అనగా—పాలు విరేచనకర్మ, వమనకర్మ, వస్తికర్మ చేసికొనినప్పుడుగూడ సేవింప హితమైనది. ఓజో వర్ధకమగును. మరియు, జీర్ణజ్వరము, మానసికవ్యాధి,

శోష, మూర్ఛ, భ్రమ, గ్రహణి, పాండు, దాహము, తృష్ణ, హృద్రోగము, శూల, ఉదావర్తము, గుల్మము, వస్తి (మూత్రజ) రోగము, అర్శస్సు, రక్తపిత్తము, అతిసారము, యోనిరోగము, శ్రమ, క్లమ, గర్భస్రావము మున్నగు సమస్తవ్యాధులందును హితమైనది. బాలురు, వృద్ధులు, క్షతక్షీణులు, క్షుత్పీడితులు, వ్యవాయకృశులు వీరలకెల్ల ప్పుడును పాలు హితమగును. అయితే క్షీరము వ్యాధి సామాన్యమునకంతకును హితమగునని చెప్పబడినను అయ్యవి వానిలో ననుపానరూపముననో, ఔషధరూపము ననో, ఆహారరూపముననో ప్రయోగింపదగియుండునని యిట గ్రహించవలెను. మరియు జత్రూర్ధ్వగతవ్యాధులలో నస్య కర్మకును, అక్షితర్పణమునకును, శిరస్తర్పణమునకును, ధారాక్రియకును, పిచుక్రియకును, వ్రణములందు శోధనకర్మ కును, పక్వాశయగతవ్యాధులలో చేయు వస్తికర్మకును గూడ ప్రయోగింపబడుచుండును. ఇందుచేతనే క్షీరము వ్యాధి సామాన్యమున సర్వసాధారణద్రవ్యమై యొప్పు చున్నది. మరియు, నీ ద్రవ్యము వ్యాధులలో పై విధముగ నుపయోగించునప్పుడు కొన్నింటిలో యపక్వముగను, కొన్నింటిలో పక్వముగను, మరికొన్నింట సంస్కృతముగను ప్రయోగింపబడుచుండును. మరియు, గొన్నింటిలో రూక్ష ముగను (స్నేహరహితముగను), మరికొన్నింటిలో స్నేహ సహితముగనుగూడ నుపయోగింపబడుచుండును. మరియు, సన్నిపాతజ్వరమున పాల నమ్లసంయోగముచే విరచి యా తేట నుపయోగించుదురు. ఇటులనే వ్యవహారమునందు

గూడ దీని ప్రయోజన మనేకవిధములుగా నుండును. వ్యవహారమున గోమాహిషక్షీరములకు విశేషగ్రహణము గలదు. అక్కడక్కడ పల్లెలలో మేకపాలను, గొర్రెపాలనుగూడ గ్రహించుట గలదు. క్షీరముతో ననేక భక్ష్యవిశేషములు కల్పింపబడి ప్రతినిత్యము జనులచే భక్షింపబడుచుండును. క్షీరము గృహస్థులచే మంగళకరవస్తువుగా నెంచబడును. అందుచేతనే పాడిగలవాడైశ్వర్యవంతుడని వారి భావము. ఇది దేవతాపూజలకుగూడ నుపయోగింపబడుచుండును. అయితే ఇన్నివిధముల క్షీరములలో గోక్షీరమునకే హెచ్చు ప్రాముఖ్యత యొసంగబడుచున్నది. గోవు దేవతాస్వరూపమైనదగుటచే దాని పాల నటుల జనులు కొనియాడుట సహజమేగదా! క్షీరకల్పనావిశేషముల లక్షణము లిట్లు భావమిశ్రునిచే జెప్పబడినవి. "క్షీరం తత్కాల సూతాయా ఘనం పీయూష ముచ్యతే। నష్టదుగ్ధస్య పక్వస్య పిండః ప్రోక్తః కిలాటకః॥ అపక్వమేవ యన్నష్టం క్షీరశాకం హితత్పయః। దధ్నా తక్రేణవానష్టం దుగ్ధం బద్ధం సువాససా॥ ద్రవ భావేన సహితం తక్రపిండస్స ఉచ్యతే। నష్ట దుగ్ధం భవేన్నీరం మోరటం జఝ్ఝటోఽబ్రవీత్॥" (భా-ప్ర.), "పాయసం పరమాన్నంస్యాత్ క్షీరికాపితదుచ్యతే। శుద్ధేఽర్ధపక్వేదుగ్ధేతు ఘృతాక్తాన్ తండులాన్ పచేత్॥ తే సిద్ధా క్షీరికాఖ్యాతా ససితాజ్యయుతోత్తమా॥" (భా-ప్ర.) అనగా—అప్పుడే యీనిన పశువుయొక్క పాలు మిక్కిలి చిక్కగా నుండును. ఇట్టి పాలు పీయూషమని చెప్పబడును. ఈ పాలను చక్కెర జేర్చి ఆవిరిమీద గాచిన నవి గడ్డకట్టును.

ఇదియే జున్ను అని వ్యవహరింపబడుచుండును. పాలనుకాచి విరవగా పిండముగ నేర్పడినట్టిది కిలాటమనబడును. కాచకుండగనే విరవబడిన పాలలో నేర్పడిన పిండము క్షీరశాకమనబడును. పాలనుకాచి అందు తక్రమునుగాని, పెరుగునుగాని చేర్చి విరచినపిమ్మట నా పాల నొక గుడ్డలో మూటగట్టిన అందుండి ద్రవము క్రిందకు జారిపోవును. అప్పుడు గుడ్డమూటలో కొద్దిగ ద్రవముతో నిలిచియున్నట్టి పిండము తక్రపిండమనబడును. పై విధముగ విరిగిన పాలనుండి గుడ్డ మూటద్వారా క్రిందకు జారినట్టి ద్రవము మోరటమనబడుచున్నది. మరియు, పరిశుభ్రమైన పాలను సగమువరకు గాచి అందు నేతితో తడిపిన బియ్యమునుచేర్చి పక్వము జేయుచు నందు చక్కెరను, తిరిగి కొద్దిగ నేయిని జేర్చి సిద్ధము జేయబడినట్టిది పాయసమని వ్యవహరింపబడును. ఇదియే పరమాన్నము, క్షీరికయనిగూడ జెప్పబడుచుండును. ఇదేవిధముగ సగ్గుబియ్యముతోను, సేమ్యాతోనుగూడ పాయసములు సిద్ధము జేయబడుచుండును. ఇంతియేగాకుండ పాలతో కోవా, బర్ఫీ, బాసందు మున్నగు పెక్కు భక్ష్యవిశేషములు సిద్ధము జేయబడుచుండును. క్షీరముతో జేయబడిన యీ పీయూషము మున్నగు భక్ష్యవిశేషములన్నియు మిక్కిలి రుచికరములుగా నుండును. గురుగుణముగలిగి బృంహణములును, వృష్యములును అగుచున్నవి. ఇటుల క్షీరము వ్యవహారములోగూడ ననేకవిధములుగా గల్పింపబడి యుపయోగింపబడుచున్నది.

## (4) విశేష గుణములు

(క) క్షీరసామాన్య—మృదుశ్లక్ష్ణపిచ్ఛిలగురు మంద గుణములను గలిగియుండును. (చ-సూ. అ 27), కఫమును వృద్ధిబొందించును. (అ-హృ-సూ. అ 5.)

(ఖ) స్తన్య—లఘుగుణమును. శీతవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. నస్యకర్మకును, ఆశ్చ్యోతన కర్మకును శ్రేష్ఠమైనది. వాతపిత్తములను శమింప జేయును. నేత్రశూలను, నేత్రాభిఘాతమును బోగొట్టును. (భా-ప్ర) స్నేహనము, జీవనము, బృంహణమును అగును. జన్మప్రభృతి సాత్మ్యమైనది. (చ-సూ-అ 45.)

(గ) గోక్షీర—మధురరసమును, స్నిగ్ధగురు గుణములను, శీతవీర్యమును, మధుర విపాకమును గలిగియుండును. స్తన్యమును బుట్టించును. దోషములకు, ధాతువులకు, మలములకు, స్రోతస్సులకును కొద్దిగ క్లేదమును గలిగించును. వాతమును శమింపజేయును. రక్తపిత్తమును బోగొట్టును. నిత్యము సేవించినచో ముసలితనము మున్నగు సమస్తవ్యాధులను శమింపజేయును. (భా-ప్ర.), సరగుణమును గలిగియుండును. ప్రాణధారణము జేయును. రసాయనము. క్షతక్షీణులకు హితమైనది. బుద్ధి శక్తిని వృద్ధి జేయును. శ్రమ, భ్రమ, మదము, అలక్ష్మి, శ్వాస, కాస, అతితృష్ణ, క్షుత్తు, జీర్ణజ్వరము, మూత్రకృచ్ఛ్రము వీనిని బోగొట్టును. (అ-హృ-సూ-అ 5.)

(ఘ) కృష్ణగోక్షీర— హెచ్చుగుణములను గలిగి

యుండును. వాతమును శమింపజేయును. (భా-ప్ర.)

(చ) పీతగోక్షీర—వాతపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఛ) శుక్లగోక్షీర—గురుగుణమును గలిగియుండును. కఫమును వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(జ) చిత్రవర్ణగోక్షీర—వాతమును శమింపజేయును. (భా-ప్ర.)

(ఝ) బాలవత్స - వివత్సగోక్షీర—త్రిదోషములను ప్రకోపింపజేయును. (భా-ప్ర.)

(ట) చిరప్రసూత గోక్షీర—తృప్తిని గలిగించును. బలమును వృద్ధిజేయును. త్రిదోషములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఠ) మాహిషక్షీర— మధురరసమును, ఆవుపాల కంటె హెచ్చు స్నిగ్ధగురుగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. శుక్రధాతువును వృద్ధిపొందించును. నిద్రను బుట్టించును. కొద్దిగ కఫమును వృద్ధిజేయును. ఆకలిని బుట్టించును. (భా-ప్ర), అగ్నిమాంద్యమును గలిగించును. (చ-సూ-అ 27.)

(డ) ఛాగక్షీర—కషాయరసమును, మధురానురసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. రక్తపిత్తము, అతిసారము, క్షయము, కాసము, జ్వరము వీనిని బోగొట్టును. మరియు, మేక స్వల్పమైనకాయము గలిగి కటుతిక్తరస విశిష్టమైన

ద్రవ్యములను భక్షించుచు, స్వల్పముగ నంబుపానము జేయుచు విశేషమైన వ్యాయామము జేయునదియగుటచే దీనిపాలు లఘుగుణముగలిగి సమస్తమైన వ్యాధులను శమింప జేయునదిగానుండును. (భా-ప్ర.), ఆవుపాలతో సమానమైన గుణములను గలిగియుండును. విశేషముగా రాజయక్ష్మ రోగులకు హితమైనవి. జఠరాగ్నిని వృద్ధిబొందించును. (సు-సూ-అ 45.)

(ధ) మృగీక్షీర — జాంగలదేశమునందుండు లేడి మున్నగువాని పాలు మేకపాలతో సమానమైన గుణములను గలిగియుండును. (భా-ప్ర.)

(ణ) అవికక్షీర — లవణరసమును, మధురానురసమును, స్నిగ్ధగురుగుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. హృదయమునకు హితముగావు. తర్పణము, వృష్యము, శుక్రమును వృద్ధిజేయును. పిత్తకఫములను వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. అశ్మరిని, వాతజకాసను బోగొట్టును. (భా-ప్ర), హిక్కను, శ్వాసను గలిగించును. (చ-సూ-అ 27.)

(త) బడబాక్షీర — అమ్లరసమును, లవణమధురానురసములను. రూక్షలఘు గుణములను, ఉష్ణవీర్యమునుగలిగియుండును. బలమును గలిగించును. వాతమును శమింపజేయును. శోషను బోగొట్టును. గాడిద మున్నగు ఒంటిడెక్కగల జంతువులయొక్కపాలు పైనిజెప్పిన గుర్రపుపాల గుణములనే గలిగియుండును. (భా-ప్ర.), శాఖావాతమును బోగొట్టును. (చ-సూ-అ 27.)

(థ) ఔష్ట్రీక్షీర— మధురరసమును, లవణానురసమును, లఘుసరగుణములను గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫమును శమింపజేయును. కృమి, కుష్ఠము, ఆనాహము, శోఫ, ఉదరము వీనిని బోగొట్టును. (భా-ప్ర.), రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. అర్శోవ్యాధిని బోగొట్టును. (చ-సూ-అ 27), గుల్మమును, విషమును బోగొట్టును. (సు-సూ-అ 45.)

(ద) హాస్తినీక్షీర—మధురరసమును, కషాయానురసమును, గురుస్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగియుండును. బృంహణము, వృష్యము, బల్యము, నేత్రములకు హితమైనవి. ధాతుస్థైర్యమును గలిగించును. (భా-ప్ర.)

(ధ) ఆమక్షీర—పచ్చిపాలు గురుగుణమును గలిగియుండును. అభిష్యందకరము. ఆమమును, కఫమును వృద్ధిబొందించును. మరియు గవ్యమాహిష క్షీరములు తప్ప మిగిలిన జంతువులయొక్క క్షీరములన్నియు నామముగానున్నప్పుడు అపథ్యకరములగును. (భా-ప్ర.)

(న) ధారోష్ణక్షీర—పితుకుచున్నప్పుడు వేడిగనుండు ఆవుపాలు లఘుగుణమును, శీత వీర్యమును గలిగియుండును. అమృతముతో సమానముగనుండును. బలమును గలిగిం

---

N. B.—మానుషక్షీరము నెప్పుడును ఆమముగనే యుపయోగించవలెనుగాని కాచి యుపయోగింపకూడదు:

చును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. త్రిదోషములను శమింపజేయును. (భా-ప్ర.)

(ప) పక్వక్షీర—కాచి వేడిగానుండునట్టి సమస్త జంతువులయొక్క పాలు కఫవాతములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఫ) ఖండశర్కరాది మిశ్రితమైనట్టియు, కాలభేదము ననుసరించి పానము జేయబడునట్టియు క్షీరగుణములు—చక్కెర, పటికబెల్లములతో చేర్చినట్టి పాలు శుక్రమును వృద్ధిబొందించును. త్రిదోషములను శమింపజేయును. బెల్లముతో జేర్చినపాలు కఫపిత్తములను వృద్ధిపొందించును. మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. రాత్రికాలము చల్లగా నుండుటచేతను, వ్యాయామము లేకపోవుటచేతను ఉదయమున పితికినపాలు సాయంకాలమునందు పితికినపాలకంటె హెచ్చు గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. పగటివేళ సూర్యరశ్మి సోకుటచేతను, వ్యాయామము గలిగి యుండుటచేతను సాయంకాలము పితికిన పాలు లఘుగుణ

---

N. B.—పితికిన పిమ్మట చల్లబడిన ఆవుపాల నెప్పుడును పానము జేయగూడదు. అయితే పితికి చల్లబడిన గేదె పాలనుమాత్రము సేవింపవచ్చును. ఇటులనే కాచి వేడిగానుండు గొర్రెపాలను, కాచి చల్లగానుండు మేకపాలను సేవించిన హితమగును.

N.B.—కాచి చల్లారినట్టి సమస్త జంతువులయొక్క పాలు పిత్తమును శమింపజేయును.

మును గలిగి, వాత కఫములను శమింపజేయును. ప్రాతః కాలమున పాలు సేవించినచో వెంటనే శుక్రము గలుగును. బృంహణము. జాఠరాగ్ని వృద్ధిబొందును. మధ్యాహ్నకాలమున సేవించినచో బలముగలుగును. జాఠరాగ్ని వృద్ధిబొందును. కఫపిత్తములు శమించును. బాలురు త్రాగినచో వృద్ధియగుదురు. క్షయరోగులు సేవించినచో ధాతుక్షయము నశించును. వృద్ధులు సేవించినచో శుక్రము వృద్ధియగును. రాత్రులకాలము పాలు సేవించినచో సమస్తదోషములు శమించును. మరియు, రాత్రికాలమున కేవలము పాలను మాత్రము పానముజేయవలెను. కాని పాలతో జేర్చి యన్నము మున్నగువానిని భుజించరాదు. అటుల జేసినచో నజీర్ణము సంభవించును. నిద్రపట్టదు. పాలను పానము జేయునప్పుడు పాత్రలో నేమాత్రము పాలను మిగల్చగూడదు. విదాహకరమగు పదార్థమును పగటిపూట భుజించినట్టినరుడు రాత్రికాలమున తద్వికారశమనార్థమై పాలను సేవింపవలెను. మరియు, నగ్నిదీప్తికలిగి కృశించినట్టివానికిని, వాతముచే మలబంధము గలిగియున్నట్టివానికిని పాలు మిక్కిలి హితకరములు. పాలు శుక్రధాతువును బోషించునవిగా నుండును. (భా-ప్ర.)

(బ) మథితక్షీర—గోరువెచ్చగానుండు ఆవుపాలను గాని, మేకపాలనుగాని కవ్వముతో చిలికి పానము జేసిన యెడల నయ్యవి లఘుగుణమునుగలిగి, వృష్యములుగను, వాతాది త్రిదోషహరములుగను, జ్వరహరములుగను నుండును. (భా-ప్ర.)

(భ) క్షీర ఫేన—చిలికినప్పుడు పైకి తేలినట్టి ఆవుపాల మీది నురుగునుగాని, మేక పాలమీది నురుగునుగాని గోరు వెచ్చగా నున్నప్పుడు సేవించినచో నయ్యది లఘుగుణమును గలిగి రుచిని బుట్టించును. బలమును వృద్ధిజేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వెంటనే శుక్రమును గలిగించును. తృప్తినిగలిగించును. త్రిదోషములను శమింపజేయును. అతీసారము, అగ్నిమాంద్యము; జీర్ణజ్వరము వీటియందు హితమైనది. (భా-ప్ర.)

(మ) క్షీరసంతానిక—పాలమీది తొరక గురుస్నిగ్ధ గుణములను, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. తృప్తి గలిగించును. బృంహణము. బలమును, శుక్రమును వృద్ధిజేయును. కఫమును వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర.)

(య) క్షీరముయొక్క పాకభేదము ననుసరించు గుణభేదము—పాలమొత్తమునకు సగము జలము జేర్చి పాలు మిగులువరకుగాచి సేవించినచో నయ్యవి పచ్చిపాలకంటె మిక్కిలి లఘువుగా నుండును; జలము జేర్చకయే పాలను చిక్కగాగాచి సేవించినచో నయ్యవి మిక్కిలి గురుస్నిగ్ధ గుణములనుగలిగి, వృష్యములుగను, బలవర్ధకములుగను నుండును. (భా-ప్ర.)

---

# దధి — పెరుగు

## పర్యాయపదములు

శ్లో॥ క్షీరజం దధి మంగల్యం విరళం చ ఘనేతరం॥

క్షీరజము, దధి, మంగల్యము, విరళము, ఘనేతరము అనునవి దధిపర్యాయనామములు.

## దధిగుణములు

శ్లో॥ దధ్యుష్ణం దీపనం స్నిగ్ధం కషాయానురసం గురు।
పాకేఽమ్లం శ్వాస పిత్తాస్ర శోథ మేదః కఫప్రదం॥
మూత్రకృచ్ఛ్రే ప్రతిశ్యాయే శీతగే విషమజ్వరే।
అతీసారేఽరుచౌ కార్శ్యే శస్యతే బలశుక్రకృత్॥

పెరుగు కషాయానురసమును, స్నిగ్ధ గురుగుణములను, ఉష్ణవీర్యమును, అమ్లవిపాకమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. బలమును, శుక్రమును గలిగించును. కఫమును వృద్ధిబొందించును. శ్వాసను, రక్తపిత్తమును, శోథను, మేదోవృద్ధిని గలిగించును. మూత్రకృచ్ఛ్రము, ప్రతిశ్యాయము, శీతజ్వరము, విషమజ్వరము, అతిసారము, అరుచి, కార్శ్యము వీనిని బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

మంగల్యము, ఘనేతరము.

(ఖ) ఉత్పత్తిబోధకము :

క్షీరజము.

## (2) శబ్దార్థములు

మంగల్యము - మంగళకరమైనది. ఘనేతరము - మిక్కిలి గడ్డకట్టియుండునది. క్షీరజము - పాలనుండి పరిణమించినట్టిది.

## (3) భేదములు

ఇదియు క్షీరమువలె మనుష్యజము, పశుజము అని రెండువిధములుగా నుండును. అందు పశుజము—గవ్యము, ఆజము, మాహిషము, ఆవికము, బాడబము, నాగ్యము అని యాఱువిధములుగా నుండును. మరియు, గుణభేదముచే మందము, స్వాదు, స్వాద్వమ్లము, అమ్లము, అత్యమ్లము అని యైదువిధములుగా నుండును. ఇటుల దధి యనేకవిధములుగా నుండి, క్షీరమునుండి పరిణామమును జెంది, బల శుక్ర కఫ కర జాంతవ ద్రవ్యములలో గణింపబడుచున్నది. పాలను తోడుబెట్టగా ఘనీభవించినట్టి రూపము దధినామముతో వ్యవహరింపబడుచున్నది. ఇందు, "దధీన్యుక్తాని యానీహ గవ్యాదీని పృథక్ పృథక్। విజ్ఞేయమేవ సర్వేషు గవ్యమేవ గుణోత్తరం॥" (ద్ర-గు-సం.) అని చెప్పబడుటచే పైని చేర్కొనిన పెరుగులలో నావుపెరుగే శ్రేష్ఠమైనదిగా నెంచబడును. అయితే వ్యవహారములలో ఆవు, గేదె, మేక, గొఱ్ఱె అనువాని పెరుగులే విశేషప్రచారమును గలిగియున్నవి. అందును మేక గొఱ్ఱెల పెరుగులయొక్క వాడుక సామాన్యపు పల్లెలయందుమాత్ర ముండుననియు, ఆవు గేదెల పెరుగులయొక్క వాడుక సర్వసాధారణముగ సర్వత్ర

యుండుననియు జెప్పవచ్చును. మరియు నావు గేదెల పాడి గలవారలు ఆ రెండు పశువులయొక్క పాలను సమ్మిశ్రము జేసియే తోడుబెట్టుచుండుటగూడ వ్యవహారమునందు గలదు. ఇటులనే విక్రేతలుఃగూడ విక్రయించుటయు గాన నగును. పెరుగు పాలవలెనే సర్వపాత్ర్యమై సర్వసాధారణ ద్రవ్యముగా నేర్పడుచున్నది. ఆహారమునందు కొందరు దీనిని పగటిపూటయు, కొందరు రాత్రిపూటయు, మరికొంద రుభయకాలములందును నుపయోగించుదురు. "నైవాద్యా న్నిశినైవోష్ణం వసంతోష్ణ శరత్సున। నాముద్గసూపం నాక్షౌద్రం తన్నాఘృతసితోపలం॥ నచానామలకం నాపి నిత్యం నామంద మన్యథా। జ్వరా సృక్ పిత్త వీసర్ప కుష్ఠ పాండు భ్రమ ప్రదం॥" (అ-హృ-సూ. అ 5.) అను వాగ్భట వచనమునుబట్టి దధి సేవనలో ననేక నియమములు గాను పించుచున్నవి. అవి యెవ్వి యనగా—రాత్రులకాలము పెరుగు సేవింపగూడదు. ఉష్ణముగనుండు దధిని సేవింప గూడదు. అటులనే యుష్ణప్రధానమైన వసన్త గ్రీష్మ శర దృతువులందుగూడ సేవింపగూడదు. పెరుగును సేవించు నప్పుడు అందు పెసరపప్పునుగాని, తేనెనుగాని, ఘృతమును గాని, చక్కెరనుగాని, ఉసిరికపండ్లనుగాని చేర్చుకొనవలెను. అదియు నిత్యమును సేవింపగూడదు. అందును మందము (అవ్యక్తరసవద్దధి) గానట్టి దధిని సేవింపగూడదు. ఇందుకు విరుద్ధముగా సేవించినచో జ్వరము, రక్తపిత్తము, విసర్పము, కుష్ఠము. పాండు, భ్రమ అను వ్యాధులు సంభవించును. అయితే యీ చెప్పబడిన నియమములలో నేయొక దానిని

జనులు పాటించుచున్నట్లు గానరాదు. వారు యథేచ్ఛగా దధిని సేవించుచునే యున్నారు. అటుల యథేచ్ఛసేవ జ్వరాది వ్యాధులకు హేతువగుచున్నదేమోయని ప్రశ్నింప వచ్చును. ఇందుకు శాస్త్రవిమర్శకులే సమాధానము జెప్ప వలసియుండును. పాలవలెనే పెరుగునుగూడ గృహస్థులు మంగళకరద్రవ్యములలో నొకటిగా గణించుదురు. ఇదియు దేవతాపూజలకై వార్లచే నుపయోగింపబడుచుండును. జనులు దీనిని కేవలము నిజస్వరూపముననేగాకుండ దీని ననేకవిధములుగా సంస్కరించిగూడ ఆహారమునందుపయో గించుకొనుచుందురు. వైద్యకమునందు దీనికి పాలకున్నంత విశేష ప్రయోగము గానరాదు. కాని తృష్ణ, అశ్మరి, మూత్రకృచ్ఛ్రము మున్నగు వ్యాధులలో నల్పప్రయోగము గానుపించుచున్నది. ఈ దధియొక్క పరిణామభేదములలో గుణభేదమునుగలిగియుండు మందకాదుల లక్షణము లిట్లు భావమిశ్రునిచే వర్ణింపబడియున్నవి. "మందందుగ్ధం యద వ్యక్తరసంకించిద్ఘనంభవేత్। యత్సమ్యక్ ఘనతాంయాతం వ్యక్తస్వాదురసంభవేత్॥ అవ్యక్తామ్లరసంతత్తు స్వాదువిజ్ఞై రుదాహృతం। స్వాద్వమ్లంమధురంసాంద్రం కషాయానురసం భవేత్॥ యత్తిరోహితమాధుర్యం వ్యక్తామ్లత్వంతదమ్లకం। తదత్యమ్లం దన్తహర్షకంఠాది దాహకృత్॥" (భా-ప్ర.) అనగా-పాలనుతోడుబెట్టిన పిమ్మట కొద్దికాలములో జిక్కగ నుండునట్టిది మందమనబడును. దీని కేరసమును స్పష్టముగ గానరాదు. బాగుగా తోడుకుని గట్టిగానుండునట్టి దధి స్పష్ట

మైన మధురరసమును గలిగియుండును. ఇది స్వాదుదధి యని చెప్పబడును. దీనియందు అమ్లరసమవ్యక్తముగా నుండును. పై విధమగు పరిణామములోనే మధురామ్లరసములను గలిగి, కషాయానురసముతోగూడి చిక్కగా నుండు నట్టిది స్వాద్వమ్ల దధియని వ్యవహరింపబడును. మధురరసమును గప్పివేయునంత యమ్లరసముతోగూడినట్టిది యమ్లదధి యనబడును. దన్తహర్షమును, రోమహర్షమును, కంఠాదులందు దాహమును గలిగించునంత యమ్లరసముతోగూడి యుండునట్టిది యత్యమ్ల దధియని చెప్పబడును.

## (4) విశేషగుణములు

(క) దధి (సామాన్య)— మేదస్సును వృద్ధిబొందించును. (ద్ర-గు-సం.), సద్యశ్శుక్రమును గలిగించును. (చ-సూ-అ. 27).

(ఖ) గవ్యదధి—మధురరసమును, అమ్లానురసమును గలిగియుండును. పవిత్రము. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. హృదయమునకు హితమైనది. పుష్టిని జేయును. వాతమును శమింపజేయును. మరియు నావుపెరుగు అన్నిపెరుగులలోను మిక్కిలి శ్రేష్ఠమైన గుణములను గలిగియుండును. (భా-ప్ర.)

(గ) మాహిషదధి—స్నిగ్ధగురుగుణములను, మధురవిపాకమును గలిగియుండును. అభిష్యందకరము. సద్యశ్శుక్రకరము. కఫమును వృద్ధిబొందించును. రక్తమును దూషింపజేయును. వాతపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఘ) అజదధి—లఘుగుణమును గలిగియుండును. శ్రేష్ఠమైనదిగా నుండును. మలమును నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. త్రిదోషములను శమింపజేయును. శ్వాస, కాస, అర్శస్సు, క్షయము, కార్శ్యము వీనిలో మిగుల హితమైనది. (భా-ప్ర.)

(చ) ఆవికదధి—గొఱ్ఱె పెరుగు కఫవాతజములగు అర్శస్సులకు ప్రకోపమును గలిగించును. (ద్ర-గు-సం.)

(ఛ) బాడబదధి—గుఱ్ఱపు పెరుగు కషాయరసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. నేత్రములను చెరచును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాతమును వృద్ధిబొందించును. మూత్రమును శోషింపజేయును. కఫమును శమింపజేయును. (ద్ర-గు-సం.)

(జ) నాగీదధి—ఏనుగ పెరుగు కషాయానురసమును, ఉష్ణవీర్యమును, లఘువిపాకమును గలిగియుండును. మలబంధము జేయును. జాఠరాగ్నిని మందగింపజేయును. కఫమును శమింపజేయును. (ద్ర-గు-సం.)

(ఝ) నారీదధి (మానుష్యదధి)—స్నిగ్ధగురుగుణములను, మధురవిపాకమును గలిగియుండును. బలమును గలిగించును. తర్పణము జేయును. మిగుల నేత్రములకు హితమైనది. మరియు నుత్తమగుణములను గలిగి త్రిదోషములను శమింపజేయును. (ద్ర-గు-సం.)

(ట) శర్కరాదియుతదధి—పెరుగులో చక్కెర జేర్చినప్పు డయ్యది తృష్ణను, రక్తపిత్తమును, దాహమును

బోగొట్టును. గుడము జేర్చినప్పు డయ్యది గురుగుణమును
గలిగియుండును. సద్యశ్శుక్రమును గలిగించును. బృంహ
ణము. తర్పణము. వాతమును శమింపజేయును. (భా-ప్ర.)

(౫) గాలితదధి—వడియగట్టబడిన పెరుగు మధుర
రసమును, స్నిగ్ధగురుగుణములను గలిగియుండును. బలమును
పుష్టిని జేయును. రుచికరముగ నుండును కొద్దిగ పిత్తమును
వృద్ధిబొందించును. వాతమును శమింపజేయును. (భా-ప్ర.)

(౬) నిస్సారదధి—పాలనుండి వెన్నను దీసినపిమ్మట
కాచి తోడుబెట్టిన పెరుగు లఘుగుణమును, శీతవీర్యమును
గలిగియుండును. మలమును నిరోధించును. మలబంధము
జేయును. రుచిని బుట్టించును. వాతమును వృద్ధిజేయును.
గ్రహణీరోగమును బోగొట్టును (భా-ప్ర.)

(౭) దధిసర—పెరుగుమీది తోరక మధురరసమును.
గురుగుణమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును.
అగ్నిమాంద్యమును గలిగించును. వాతమును శమింప
జేయును. ఇదియు అస్థిరస[illegible]
ములను వృద్ధిబొందించును. [illegible]
(భా-ప్ర.)



(౮) దధిమస్తు—పెరుగుమీది నీళ్లు లఘుగుణమును
గలిగియుండును. బలమును గలిగించును. అన్నమునందు
రుచిని బుట్టించును. స్రోతస్సులను శోధించును. మనస్సును
వికసింపజేయును. కొద్దిగ సద్యశ్శుక్రమును జేయును. ధాతు
వులను బోషించును, మలభేదనము జేయును. కఫవాతములను
శమింపజేయును. బడలికను, తృష్ణను బోగొట్టును. (భా-ప్ర.)

## తక్రం - మజ్జిగ

### పర్యాయపదములు

శ్లో॥ దండాహతం కాలశేయ మరిష్ట మపి గోరసః॥

దండాహతము, కాలశేయము, అరిష్టము, గోరసము అనునవి తక్ర పర్యాయపదములు.

### తక్రగుణములు

శ్లో॥ తక్రం లఘు కషా యామ్లం దీపనం కఫవాతజిత్ ।
శోఫో దరార్శో గ్రహణీ దోషమూత్ర గ్రహోరుచీః॥
ప్లీహ గుల్మ ఘృతవ్యాప ద్గర పాండ్వా మయాన్ జయేత్ ॥
(అ-హృ.)

మజ్జిగ కషాయరసమును, అమ్లానురసమును, లఘుగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింప జేయును. శోఫ, ఉదరము, అర్శస్సు, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, అరుచి, ప్లీహవృద్ధి, గుల్మము, ఘృతమును పానముచేయుటచే గలిగిన వ్యాపత్తులు, గరవిషము, పాండు అను నీ వ్యాధులను బోగొట్టును.

### విశేషాంశములు

#### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు—దండాహతము, కాలశేయము, గోరసము.

(ఖ) గుణబోధకములు—అరిష్టము.

#### (2) శబ్దార్థములు

దండాహతము - కవ్వముచే జిలకబడునది. కాలశేయము - కలశమునందు బుట్టినది (లేక) కలశమునం

దుండునది. గోరసము - గోసంబంధమైన రసము. అరిష్టము - మానవులకెట్టి బాధను గలిగించనట్టిది అనగా సమస్త వ్యాధుల నశింపజేయుటద్వారా మానవులకు ప్రతినిత్యము హితమగునట్టిది.

(3) భేదములు

ఇది క్షీరమునుండి పరిణామమును బొంది, సంగ్రహణీయదీపనీయ ద్రవ్యములలో నుత్తమమైనదిగా గణింపబడుచు, క్షీరాదులవలె సర్వసాధారణ ద్రవ్యముగా గ్రహింపబడుచున్నది. తక్రము గవ్యము, మాహిషము, ఆజము, ఆవికము అని నాలుగువిధములుగా నుండును. ఇందు, "తక్రం త్వాజావిప్రభవం నసేవ్య మనిష్టగంధం త్రిషుచాప్యపథ్యం।" (స-గు-క.) అని చెప్పబడియుండుటనుబట్టి మేక మజ్జిగయు, గొఱ్ఱె మజ్జిగయు దోషప్రకోపకరములగుటచే నుపయోగార్హములుగావని దెలియగలదు. వ్యవహారము నందుగూడ విశేషముగా గవ్యమాహిషములకే గ్రహణము గానుపించుచున్నది గాని మిగిలినవాని కంతగా గానుపించుట లేదు. ఇవి కేవలము పల్లెలలోమాత్రము వాడుకయందున్నట్లు దెలియగలదు. మరియు, తక్రీకరణవిధానములలో గల భేదమునుబట్టి 'ఘోలము, మథితము, తక్రము, ఉదశ్విత్తు, చచ్ఛిక' యని యైదువిధములుగా నుండును. అందు పెరుగును దానిపైనుండు తోరకతోగూడ గలిపి చిలకగా సిద్ధమైనట్టిది ఘోలమని వ్యవహరింపబడును. పెరుగును దానిపైనుండు తోరకను, జలమును తొలగించి చిలుకగా సిద్ధమైనట్టిది మథితమని చెప్పబడును. పెరుగును అందు నాలవ

వంతు జలము జేర్చి మథించగా సిద్ధమైనట్టిది తక్రమన బడును. పెరుగును అందు సగభాగము జలము జేర్చి చిలకగా సిద్ధమైనట్టిది యుదశ్విత్తని చెప్పబడును. పెరుగును అందుండి సారమునంతను తీసివేసి, హెచ్చుజలముతో జేర్చి చిలకగా సిద్ధమైనట్టిది చచ్చిక యనబడును. ఇటుల తక్రమును సిద్ధము జేయుటలో ననేక భేదములు గానుపించుచున్నవి. ఈ భేదముల కన్నింటికిని వేరువేరు గుణములు భావమిశ్రుడు దెలిపి యున్నాడు. వైద్యకోమునందు దీనికి విశేష వ్యవహారము గలదు. అందు విశేషముగ అర్శస్సు, గ్రహణి మున్నగు వ్యాధులలో తక్రమునకు హెచ్చుగా ప్రయోగములు శాస్త్రమునందు వర్ణింపబడినవి. తక్రము ననేక ద్రవ్యములతో సంస్కరించి యుపయోగించుదురు. దీనితో నరిష్టము గూడ సిద్ధముజేయబడి యుపయోగింపబడుచున్నది. రస శాస్త్రమునందు ఖనిజద్రవ్య శోధనముకై యిది గ్రహింపబడినది. వ్యవహారములో దీని ప్రయోగముగూడా విశేషముగనే యున్నది. నిత్యముపయోగించు ఆహారద్రవ్యములలో నిదియొకటిగా గ్రహింపబడుచున్నది. ప్రతి మానవుని చేతను సాధారణముగా తక్రాంతముగనే ఆహారము భుజింపబడుచుండును. గృహస్థులు దీనిని సంస్కరించియు, పక్వము జేసియుగూడ నుపయోగించుచుందురు.

## (4) విశేషగుణములు

(క) తక్రసామాన్య—మధురానురసమును, రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. బలమును గలిగించును. ధాతువులను బోషించును. ఛర్ది, ప్రసేకము,

విషమజ్వరము, మేదోవృద్ధి, అతీసారము, శూల, క్రిమి రోగము, కుష్ఠము, తృష్ణ, అపచి యను నీ వ్యాధులను బోగొట్టును. (స-గు-క.)

(ఖ) గవ్యతక్ర—కషాయరసమును, అమ్లానురసమును గలిగియుండును. రుచిని బుట్టించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. కఫవాతములను శమింప జేయును. గ్రహణి, పాండు, శోఫ, ప్లీహవృద్ధి, గుల్మము వీనిని బోగొట్టును. (స-గు-క.)

(గ) మాహిషతక్ర—గేదెమజ్జిగ కామిలను, పాండు రోగమును బోగొట్టును. (స-గు-క.)

(ఘ) ఘోల (తక్రభేద)—ఇది చక్కెరతో జేర్చి యుపయోగించినచో రసాలయొక్క గుణములను గలిగి యుండును. (భా-ప్ర.)

(చ) మథితతక్ర—మనోవికాసమును గలిగించును. కఫపిత్తములను శమింపజేయును. (భా-ప్ర.)

(ఛ) తక్రభేదతక్ర—కషాయరసమును, అమ్ల మధురాను రసములను, లఘుగుణమును, ఉష్ణవీర్యమును, మధుర విపాకమును గలిగియుండును. మలమును నిరోధించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. సద్యశ్శుక్రమును జేయును. ధాతువులను బోషించును. వాతమును శమింపజేయును. గ్రహణ్యాది వ్యాధులను బోగొట్టును. (భా-ప్ర.)

(జ) ఉదశ్విత్తక్ర—బలమును గలిగించును. కఫమును వృద్ధిబొందించును. ఆమమును బోగొట్టును. (భా-ప్ర.)

(ఝ) చచ్చికాతక్ర—లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. వాతపిత్తములను శమింపజేయును. శ్రమను, తృష్ణను బోగొట్టును. ఇందు లవణముజేర్చి సేవించినచో జాఠరాగ్నిని వృద్ధిపొందించును. కఫమును వృద్ధి బొందించును. (భా-ప్ర.)

(ట) ఉద్ధృతసారాది తక్ర—వెన్న పూర్తిగా దీసి చిలికినట్టి తక్రము విశేషముగ లఘుగుణమును గలిగి పథ్యకరముగ నుండును. తగుమాత్రము వెన్నను దీసి చిలికినట్టి తక్రము గురుగుణమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును. కఫమును వృద్ధిబొందించును. వెన్నను తీయకయే చిలికినట్టి తక్రము సాంద్రగురుగుణములను గలిగియుండును. పుష్టిని జేయును. కఫమును వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(ఠ) అపక్వ-పక్వ తక్ర-అపక్వమైన తక్రము కోష్ఠమునందు కఫమును శమింపజేయును. కంఠమునందు కఫమును వృద్ధిబొందించును. పక్వమైన తక్రము పీనసము, శ్వాస కాస మున్నగు వ్యాధులందు హితముగానుండును. (భా-ప్ర.)

---

## నవనీతం - వెన్న

### పర్యాయపదములు

శ్లో॥ మ్రక్షణం సరజం హైయంగవీనం నవనీతకం॥

మ్రక్షణము, సరజము, హైయంగవీనము, నవనీతము అనునవి నవనీత నామములు.

## నవనీత గుణములు

శ్లో॥ నవనీతం లఘు గ్రాహి సద్యస్కంస్వాదు శీతలం।
మేధ్యమీషత్కషాయామ్లం వృష్యంపిత్తానిలాపహం॥
అవిదాహ్యగ్నికృన్నేత్ర్యం క్షయార్శో వ్రణకాసజిత్॥

వెన్న (అప్పుడే తీయబడినట్టిది) మధురరసమును, కొద్దిగ కషాయామ్లానురసములను, లఘుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. మలమును నిరోధించును. బుద్ధిని వికసింపజేయును. సద్యశ్శుక్రమును జేయును. కొద్దిగ విదాహమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. నేత్రములకు హితమైనది. వాతపిత్తములను శమింపజేయును. క్షయమును, అర్శస్సును, వ్రణమును, కాసను బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధ నామములు

(క) ఉత్పత్తిబోధకము :

దధిజము.

(ఖ) పరిచయబోధకములు :

నవనీతము, (మంథజము).

### (2) శబ్దార్థములు

దధిజము—పెరుగునుండి యుత్పన్నమైనట్టిది. నవనీతము—క్రొత్త పెరుగునుండి పైకి గ్రహించబడినట్టిది. మంథజము—పెరుగునుచిలుకు కవ్వమునకు అంటియుండునట్టిది.

### (3) భేదములు

ఇది క్షీరముయొక్క పరిణామభేదమగు దధినుండి యుత్పత్తిగలిగి గవ్యమాహిష భేదముచే రెండు విదములుగా

నుండి, బలవర్ణకరద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగా గణింప బడుచున్నది. అయితే నవనీతము క్షీరమునుండి కూడా గ్రహించబడుచున్నది. కాని పెరుగునుండి గ్రహించుట సర్వ సామాన్యముగా నున్నది. ఇదియు క్షీరాదులవలె ఆహారద్రవ్యములలో సర్వసాధారణ ద్రవ్యముగనే గణింప బడుచున్నది. పాడిగల యిండ్లలోని చిన్నపిల్లలు దీనిని యథే చ్ఛగా భుజించుచుందురు. మిగుల రుచ్యముగానుండును. అయితే దీని నంతగా భక్ష్యములలో చేర్చుట గాను పించదు. ఘృతముగా పరిణమింపజేసియే హెచ్చుగా నుప యోగింతురు. నవనీతమును శరీరమునకు బూసినచో చర్మమునకు మృదుత్వమేర్పడి నిగనిగలాడుచు మిక్కిలి కాంతివంతమగును. అందుచే గృహస్థులు తమ పిల్లలకు తరుచు దీనిని బూయుచుండుటగూడ వ్యవహారమునందు గలదు. వైద్యకమునందు బాహ్యాభ్యంతరములుగ దీనికి ప్రయోగములున్నవి. కాని ఘృతమునకున్నంత విశేష ప్రయోగములు దీనికి గానరావు. నవనీతములో మేక గొఱ్ఱె మున్నగు జంతువుల సంబంధమైన భేదములుగూడ జెప్పబడినవి. కాని యీగవ్య మాహిషములకే విశేష ప్రచారముండుటనుబట్టి యవియే యిట గ్రహింపబడినవి.

(4) విశేషగుణములు

(క) గవ్యనవనీత—సద్యశ్శుక్రమును జేయును. వర్ణ మును, బలమును గలిగించును. జాఠరాగ్నిని వృద్ధిపొందిం చును. మలమును నిరోధించును. వాతపిత్తములను శమింప జేయును. రక్తదోషము, అర్శస్సు, అర్దితము, కాసము

వీనిని బోగొట్టును. ఇది బాలురకును వృద్ధులకును హిత మైనది. అందు విశేషముగ బాలురకు అమృతమువలె నుపకరించును. (భా-ప్ర.)

(ఖ) మాహిషనవనీత—మధురరసమును, గుర్వతి స్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగియుండును. సద్య శ్శుక్రమును జేయును. బలమును గలిగించును. మలమును నిరోధించును. వాత కఫములను వృద్ధిబొందించును. (భా-ప్ర.)

(గ) క్షీరోద్ధృత నవనీత—మధురరసమును, అతి స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగియుండును, నేత్రము లకు హితమైనది. సద్యశ్శుక్రమును జేయును. బలమును గలిగించును. మలమును నిరోధించును. రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర.)

---

## ఘృతం - నెయ్యి

### పర్యాయపదములు

శ్లో॥ ఘృత మాజ్యం హవి స్సర్పిః కథ్యంతే తద్గుణా అథ॥

ఘృతము, ఆజ్యము, హవిస్సు, సర్పియనునవి ఘృతనామములు.

### ఘృతగుణములు

శ్లో॥ ఘృతం రసాయనం స్వాదు చక్షుష్యం వహ్నిదీపనం।
శీతవీర్యం విషాలక్ష్మీ పాపపిత్తా నిలాపహం॥
అల్పాభిష్య న్ది కాంత్యోజ స్తేజో లావణ్య బుద్ధికృత్।
స్వరస్మృతికరం మేధ్య మాయుష్యం బలకృద్గురు॥

ఉదావర్త జ్వరోన్మాద శూలానాహ వ్రణాన్ హరేత్ ।
స్నిగ్ధం కఫకరం రక్షో రక్తక్షయ విసర్పనుత్ ॥

నెయ్యి మధురరసమును, గురుస్నిగ్ధగుణములను, శీతవీర్యమును గలిగియుండును. రసాయనము, నేత్రములకు హితము. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. కొద్దిగ అభిష్యన్దకరము. కాంతిని, ఓజస్సును, శుక్రమును, లావణ్యమును, బుద్ధివికాసమును గలిగించును. స్వరమును గలిగించును. స్మరణశక్తిని వృద్ధిబొందించును. బుద్ధి శక్తిని వృద్ధి జేయును. ఆయువును వృద్ధిబొందించును. బలమును గలిగించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. విషమును, అలక్ష్మిని, పాపమును, ఉదావర్తమును, జ్వరమును, ఉన్మాదమును, శూలను, ఆనాహమును, వ్రణమును, రక్షోగ్రహాది వికారములను, రక్త దుష్టిని, క్షయమును, విసర్పమును బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

(క) పరిచయబోధకములు :

ఘృతము. ఆజ్యము, హవిస్సు, సర్పి, (వహ్నిభోజ్య, భోజనార్హ).

(ఖ) గుణబోధకములు :

(అమృత, జీవన).

### (2) శబ్దార్థములు

ఘృతము - అగ్నిసంయోగముచే కరగునట్టిది. ఆజ్యము - అన్నాదులను తడుపునట్టిది. హవిస్సు - హోమాదుల కుపయోగపడునట్టిది. సర్పి - వ్యాపించునట్టిది. వహ్ని

భోజ్య - అగ్నిదేవత కిష్టమైన భోజ్యవస్తువుగా బరగునట్టిది.
భోజనార్హ - జనసామాన్యముచే భుజించుట కర్హమైనట్టిది.
అమృత - మరణము లేకుండ దీర్ఘకాలము జీవింపజేయునట్టిది.
జీవన - ప్రాణములను ధరించియుండునట్టిది.

## (3) భేదములు

ఇది మనుష్యజము, పశుజము అని క్షీరమువలె రెండు విధములుగ గానుపించుచున్నది. అందు పశుజము, గవ్య-మాహిష-ఆజ-ఆవిక-ఔష్ట్ర-బాడబ మను నారు భేదములుగా వర్ణింపబడినది. అయితే వ్యవహారమున నీ యన్నింటిలోను గవ్య మాహిషములకే హెచ్చు ప్రయోగములున్నట్లు గానుపించును. నెయ్యి దీపనీయ చక్షుష్య మేధ్య ఆయుష్య బల్య రసాయన పిత్త విషహర ద్రవ్యములలో మిగుల శ్రేష్ఠమైనదై క్షీరమువలె సర్వసాధారణ ద్రవ్యముగా గణింపబడుచున్నది. ఇది ప్రతి గృహస్థునిచేతను మంగళప్రదమైనదిగా పూజింపబడుచుండును. సమస్తమైన పాపములను బోగొట్టి పవిత్రము జేయునట్టిది. అందుచేతనే యజ్ఞయాగాదులలో నగ్నియందు హోమము జేయుట కుపయోగింపబడును. మానవునిచే జేయబడు సమస్త కార్యములం దిది ప్రధాన ద్రవ్యముగా గ్రహింపబడుచున్నది. ఇది భోజ్యద్రవ్యముగా నెల్లరచే సేవింపబడుచుండును. భక్ష్యములెల్ల ఘృతముచేతనే పాకము జేయబడుచుండును. ఇటుల సిద్ధము జేయబడినట్టివి మిగుల ఆరోగ్యప్రదములుగా నుండును. కావుననే ఘృతము సాత్మ్య ద్రవ్యములలో నొకటిగా పరిగణింపబడుచున్నది. మరియు నిది దేవతాపూజాదికములకుగూడ గృహస్థులచే

నుపయోగింపబడుచుండును. వైద్యకమునందుగూడ దీని ప్రయోగము సర్వసాధారణముగా నుండును. క్షీరమువలెనే సమస్తవ్యాధులందును బాహ్యాభ్యంతరములుగ నుపయోగింపబడును. అందుకు ఘృతములుగను, లేపములుగను సిద్ధముజేయబడుచుండును. రసాయనార్థమై ప్రయోగింపబడు సమస్తావలేహ్యములందును ఘృతము చేర్చబడుచుండును. ఘృతములలో గవ్యఘృతము మిక్కిలి శ్రేష్ఠమైనదిగను, అందును పురాణఘృతమైనచో నింకను శ్రేష్ఠమైనదిగను శాస్త్రము బోధించుచున్నది.

(4) విశేషగుణములు

(క) గవ్యఘృత—. మధుర రసమును, గురుగుణమును, శీతవీర్యమును, మధుర విపాకమును గలిగియుండును. మాంగల్యము. పవిత్రము. సుగంధమును గలిగియుండును. విశేషముగ నేత్రములకు హితమైనది. సద్యశ్శుక్రమును జేయును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. బుద్ధిని వికసింపజేయును. శరీరమునకు లావణ్యమును, కాంతిని గలిగించును. ఓజస్సును, శుక్రమును వృద్ధిబొందించును. వయస్థాపనము జేయును. బలమును గలిగించును. ఆయువును వృద్ధిజేయును. రసాయనము. రుచిని బుట్టించును. వాతపిత్తకఫములను శమింపజేయును. అలక్ష్మిని, పాపమును, రక్షోవికారములను బోగొట్టును. (భా-ప్ర.)

(ఖ) మాహిషఘృత—మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును, మధురవిపాకమును గలిగియుండును. సద్యశ్శుక్రమును జేయును. కఫమును వృద్ధిబొందించును.

వాతపిత్తములను శమింపజేయును. రక్తదోషమును బోగొట్టును. (భా-ప్ర.)

(గ) క్షీరోద్ధృతఘృత—శీతవీర్యమును గలిగియుండును. మలమును నిరోధించును. వాతపిత్తములను శమింపజేయును. నేత్రరోగములను, దాహమును, రక్తదోషమును, మదమును, మూర్ఛను, భ్రమను బోగొట్టును. (భా-ప్ర.)

(ఘ) పురాణఘృత—ఒక సంవత్సరమునకు పైగా నిలువయుంచబడినట్టి నెయ్యి పురాణఘృతమని చెప్పబడును. ఇట్టిది త్రిదోషములను శమింపజేయును. మూర్ఛ, కుష్ఠము, విషము, ఉన్మాదము, అపస్మారము, తిమిరము ఈ వ్యాధులను బోగొట్టును. (భా-ప్ర.)

(చ) ఘృతమండ—పేరిన నేతిపై తేరిన తేట మిగుల పలచగా నుండును. మధురరసమును, రూక్షతీక్ష్ణగుణములను గలిగియుండును. యోనిరోగములను, కర్ణరోగములను, శిరోరోగములను, నేత్రరోగములను, శోఫను బోగొట్టును. (ద్ర-గు-సం.)

---

## మూత్రం - మూత్రము

### పర్యాయపదములు

శ్లో॥ మూత్రం ప్రస్రావః...॥

మూత్రము, ప్రస్రావము అనునవి మూత్రనామములు.

### మూత్రగుణములు

శ్లో॥ (మూత్రం) ఉష్ణం తీక్ష్ణ మథోఽగ్రూక్షం కటుకం లవణాన్వితం। దీపనీయం విషఘ్నం చ కృమిఘ్నం చోప

దిశ్యతే॥ పాండురోగోప సృష్టానాం ఉత్తమం శర్మ చోచ్యతే। శ్లేష్మాణం శమయేత్పీతం మారుతం చాను లోమయేత్॥ కర్షేత్పిత్త మధోభాగం ఇత్యస్మిన్ గుణ సంగ్రహః॥

మూత్రసామాన్యము కటురసమును, లవణానురసమును, తీక్ష్ణగుణమును, కొద్దిగ రూక్షగుణమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. వాత పిత్త కఫములను శమింపజేయును. విషఘ్నము. కృములను, శోషయును పాండురోగమును బోగొట్టును.

## విశేషాంశములు

### (1) ప్రసిద్ధనామములు

పరిచయబోధకము—ప్రస్రావము.

### (2) శబ్దార్థములు

ప్రస్రావము—మూత్రవహస్రోతో ముఖము నుండి ధారవలె బయటకు స్రవించునట్టిది.

### (3) భేదములు

ఇది మనుష్యజ—పశుజభేదముచే రెండువిధములుగా నుండును. అందు పశుజము గవ్యము, మాహిషజము, ఆజము, ఆవికము, హాస్తిజము, ఉష్ట్రజము, హయజము, ఖరజము అని యెనిమిది విధములుగా నుండును అని చరక నిరూపణమునుబట్టి తెలియగలదు. మరియు, ఉత్సాదనకర్మకును, ఆలేపనకర్మకును, ఆస్థాపనకర్మకును, విరేచనకర్మకును, స్వేదకర్మకును, పరిషేచనకర్మకును ఆనాహ-విష-

ఉదర-అర్శో-గుల్మ-కుష్ఠ-కిలాసవ్యాధులలో శ్రేష్ఠమైనదిగా చరకునిచే వర్ణింపబడినది. ఇదియు నితర జాంతవములవలె సర్వసాధారణ ద్రవ్యముగనే గణింపబడుచున్నది. ఈ మూత్రభేదములలో "గోఽజావిమహిషీణాం చ స్త్రీణాం మూత్రం ప్రశస్యతే। ఖరోష్ట్రేభ నరాశ్వానాం పుంసాం మూత్రం హితం మతం॥" (స-గు-క.) అని చెప్పబడుటచే గవ్య ఆజ మాహిష మూత్రములు స్త్రీ సంబంధమైనవిగను, మిగిలినవి పురుష సంబంధమైనవిగను గ్రహింప యోగ్యమైనవి యని తెలియగలదు. మరియు నీ చెప్పబడిన మూత్ర వర్గములో "గోమూత్రం తేషు సర్వేషు మూత్రయోగే ప్రశస్యతే॥" అని చెప్పబడుటచే గోమూత్ర మొక్కటియే యోగములందు జేర్చుటకు శ్రేష్ఠమైనదిగా దెలియనగును. ఇందుచేతనే "అతో విశేషాత్కథనే మూత్రం గోమూత్ర ముచ్యతే॥" యోగములం దెచ్చటెచ్చట మూత్ర పద ప్రయోగముండునో అచ్చటచ్చట గోమూత్రమునే గ్రహించుట యోగ్యమగును. మూత్రముతో నరిష్టములు, క్షార ములు, తైలములు, గుటికలు మున్నగునవి సిద్ధము జేయబడి తత్తద్వ్యాధులలో బ్రయోగింపబడుచుండును. అచ్ఛపేయముగగూడ మూత్రము ప్రయోగింపబడుచున్నది. వైద్యకమునందు దీనికీ విధముగ ప్రయోగములు హెచ్చుగా గానబడును. రసశాస్త్ర ప్రవర్తకులచే ఖనిజముల శోధనాది సంస్కారముల కియ్యది గ్రహింపబడినది. వ్యవహారములో గృహాదులను శుద్ధిజేయుటకు గ్రహింపబడుచున్నట్లు దెలియ గలదు.

## (4) విశేషగుణములు

(క) మూత్రసామాన్య—లఘుగుణమును గలిగియుండును. పిత్తమును వృద్ధిబొందించును. శోఫను. శూలను. గుల్మమును, అరుచిని బోగొట్టును. (అ-హృ.)

(ఖ) గోమూత్ర—కటురసమును. తిక్తకషాయాను రసములను, క్షారమును (లవణానురసమును), తీక్ష్ణలఘు గుణములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. బుద్ధిని వికసింపజేయును. పిత్తమును వృద్ధిజేయును. కఫవాతములను శమింపజేయును. శూల, గుల్మము, ఉదరము, ఆనాహము, కండు, ముఖరోగము. నేత్రరోగము. కిలాసము, ఆమము, వస్తిశూల. కుష్ఠము, కాసము, శ్వాస, శోఫ. కామిల, పాండు, మూత్రకృచ్ఛ్రము. వాతరోగము, క్రిమిరోగము, ప్లీహవృద్ధి, మలబంధము. కర్ణరోగము ఈ వ్యాధులను బోగొట్టును.

(భా-ప్ర.)

రసౌషధవిజ్ఞానము

(వర్గత్రయాత్మకము)

సమాప్తము.



# రసౌషధ విజ్ఞానము

## అకారాది పద సూచిక

### అ

ఘ



చ

ఛ



జ

ట

డ



త

## ధ

## య

ర

ష



స

## క్ష



రసౌషధవిజ్ఞానమున

అకారాదిపదసూచిక

సమాప్తము.

# సవరణ

ఈ గ్రంథమునందు 80-వ పుటలో ఫుట్‌నోటునందు గజపుట వివరణమున 10-వ పంక్తికి పిమ్మట నీ క్రింది విధముగా సవరించి చదువుకొనవలెను.

"అనగా - ఒక్కొక్కటి సుమారు 12 తులముల తూకముగల 200 పిడకలచే భూగర్తమును నింపి, వీనిపై శరావసంపుటమునుంచి, యా సంపుటముపై అటువంటి పిడకలనే 100 ని చేర్చి యగ్నిని ప్రజ్వాలింపజేసిన యయ్యది గజపుట మనబడును."